శ్రీశివాయ గురవే నమః.

# శ్రీరామకథాఽమృతము

## అయోధ్యాకాండము.



ఇది

బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడి




వారి పుత్త్రుఁడగు

రాఘవనారాయణశాస్త్రిగారిచే

ప్రకటింపఁబడియె.

నిడుప్రోలు:
తాతా ముద్రాక్షరశాల యందు
ముద్రితము.

సర్వస్వామ్యసంకలితము ]  1935  [ వెల రు 5-–0

# విజ్ఞప్తి.

---

కావ్యజ్ఞ సోదరులారా !

శ్రీరామకథాఽమృత మను నీ ప్రబంధరాజము నుత్తరకాండముతోఁ గూడ నిరువదినాల్గువేలు గద్యపద్యములుగ భక్తిరసావేశముతో విరచించి కొందఱుఁ జందాదారుల నేర్పఱచి "బాలకాండము" నచ్చొత్తించి రసికుల సమాదృతికిఁ బాత్రులైన బ్రహ్మశ్రీ వేదమూర్తులైన తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు నాకు మహాగురువులు అనఁగా నన్నుఁ గని పెంచి శ్రీవిద్యాసమన్వితు నొనర్చిరి. వారు పరికృత భావవత్సరాశ్వయుజ కృష్ణ తృతీయా గురువాసరమున శివైక్యముం బొందిరి. ఆ సమయమునకు ముద్రితమగుచున్న యయోధ్యాకాండమునఁ బదునెనిమిది ఫారములుం జూపి గ్రంథశేషము నెల్లఁ బ్రకటింపఁ బుత్రుఁడ నగు నాకు నంత్యశాసన మొనరించి చనిరి. నేనును గురునానతి శిరమున శేషీకరించి యింతవఱ కీ సంపుటము నార్యుల సహాయముచేఁ బూర్తిగా ముద్రింపింపఁగలిగితిని. తక్కుంగల గ్రంథ మంతయుఁ బ్రకటిత మగుటకు నాంధ్రు లెల్లరుఁ దోడ్పడెరుగాత మని ప్రార్థించుచు దాదాపు డెబ్బదిమంది జందాదారులఁ గుదిర్చి యవసరముం బట్టి పెట్టుబడి స్వయముగాఁ బెట్టి నన్నుఁ బ్రోత్సహించుచున్న గుంటూరుపురవాస్తవ్యులగు మహారాజశ్రీ గోవిందరాజుల సీతారామయ్య పంతులవారి కుటుంబము నితరసహాయులతోఁ గూడ దీర్ఘాయురారోగ్యైశ్వర్య జయోన్నత మొనరింపుమని దైవము సమర్థింపుచు గ్రాంథికవిషయముల గ్రంథాంతమునఁ బ్రకటింపఁదలఁచి తాత్కాలిక భావసంభావితములగు కొన్ని పద్దెములుమాత్ర మిచ్చటఁ బొందుపఱచుచు నింతటితో విరమించుచున్నాఁడను.

తే॥ విభవ సమమున నాశ్వీన♦విమలపక్ష, మందలి ద్వితీయ వైభవ♦మందె నొందు
నరువదియునారు విలసిల్లె♦హాయనములు, భావమా! చెడితివె దానిఁ♦బాడుసేసి.

శా॥ శ్రౌతస్మార్తములైన ధర్మముల ని ♦ ష్ఠంబూని బోధించి గో
తాత్రీర్థమ్మున జాతిసంకరులు త ♦ త్పత్కు ల్పరిభుత్వాప్తి ని
ష్టాతంకంబులఁ గూర్పనెంచిరని దే ♦ వాధీశు నాస్థానిఁదం
డ్రీ! తీర్పుల్పొనరింపఁబోయితివొ మం ♦ త్రింపంగఁ దన్మంత్రితోఁ.

శా॥ లీలం దద్గురు గౌరవంబుఁ గవి తె ♦ ల్వింగాంచ ధర్మక్రియా
లోలుం గోత్రరిపుంబొనర్ప దివి నే ♦ లోపంబులుం బాప నీ

భూలీలావతి యష్టకష్టముల సం ♦ బోధించి యింద్రానుజున్
బాలింపం బనుపంగ నేగితివి నీ ♦ భారంబు నాపైఁబడన్.

తే॥ అంబుధిమథింప నెంతప్ర♦యాసమయ్యె, నమృతఘటమబ్బె నొకఁ♦డమృతాశనులకు
వాగమృతమూరు నీనోరు♦వాపిఁగాంచి, యాహరింపరె; రామక♦థాఽమృతకవి.

సీ॥ వచనమ్మునకుఁ గ్రొత్త ♦ రచనల సమకూర్చి, సీసమ్ము బంగారు ♦ సిరికిఁ దార్చి
శార్దూలమత్తేభ ♦ సమరసత్వముఁ దెల్పి, చంపకోత్పలగతి ♦ కింపుఁ గొల్పి
కందమ్ము కలిమికి ♦ నందమ్ముఁ గల్పించి, యాటవెలఁది గీతి ♦ తేటలుంచి
యతికిఁ బ్రాసమ్ముని ♦ యతికి సంపదలిచ్చి, శయ్యాను గుణరీతి ♦ జాతిగ్రుచ్చి
యాత్మవిరచిత రామక ♦ థాఽమృతమ్ము, ధ్వనికి దిమ్మరవోవు బు♦ధప్రవరుల
చెవులఁ ద్రావించు నవసృష్టి♦జేసి! తండ్రి, విశ్వామిత్రుఁడవైతివే ♦ విస్మయంబు.

ఇట్లు,
గ్రంథకర్త పుత్రుఁడు-శిష్యుఁడు,
తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి.

---

# బాష్పాంజలి.

---

గీ॥ భౌతికశరీర మది కంటఁ♦బడక యున్నఁ, గీర్తికాయంబు సతము స♦త్కృతిముఖమున
శిష్యముఖమున వ్యాప్తంబు♦జేసెఁ బుణ్యశాలి మా వేంకటప్ప వి♦చక్షణుండు.

సీ॥ ఆత్రేయముఖ్య మ♦హర్షిసత్తముల మా, కనులపండువుగఁ గన్గొ♦నని కొఱఁత
యుత్తమబ్రాహ్మణుం♦డొకఁడైనఁ గలఁడెయి, జ్జగమునందను వారి♦సందియమ్ము
దేవభాషాజ్ఞాన ♦ తృష్ణమైఁ దిరుగు వి, ద్యార్థులువడెడు న ♦ ధ్వశ్రమంబు
రామాయణ పరంప ♦ రా రచనాసక్తి, నరికట్టు కవిపుట్ట ♦ నట్టిలోటు

గీ॥ తీర్చితిరి మీర లాంధ్రధా ♦ త్రీతలమున, నవతరించిన దివ్యర్షి ♦ యనఁగ భూసు
రాగ్రగణ్యుండు నాఁబండి♦తాగ్రణియనఁ, గవివరేణ్యుండు నాఁగీర్తి♦గలిగిమీరు.

సీ॥ ఘనులనైనను మూఁగ♦లనుజేయు మీవాణి, గంగాప్రవాహమో ♦ గర్జయగునో
యతిని గూఢార్థమ్ము♦లరచేత నిడునప్డు, కవివతంసములో వ్యా♦ఖ్యాతలో కో-
వైదికాచార జీ ♦ వనముసల్పెడుచోట, పూర్వర్షులో దేవ ♦ పుంగవులో కో
రామకథామృత ♦ రసపోషణము వేళ, నన్నయాదులో కో ♦ తన్నగారో

యింతయేటికిఁ గర్మఠు ♦ లీరగుదురో, భక్తులో జ్ఞానులో కాక ♦ పరమశివులో
యెఱుఁగనేరకయున్నార ♦ మిన్నినాళ్లు, నేఁడుగనుఁగొంటిమయ్యాయి ♦ న్నియునటంచు.

సీ॥ సాంస్కృతికసమాన ♦ సంఘటనముఁ జూచి, నన్నయ్యయే యీతఁ ♦ డన్నవారు
జిలిబిలిపలుకుల ♦ తెలుఁగు కూర్పులఁ గాంచి, యన్న; తిక్కన్నయే ♦ యన్నవారు
శ్రీరామభక్తి వి ♦ శేషమ్మునరసి పో, తన్న యీసుకృతియే ♦ యన్నవారు
సమతమైనొప్పు సీ ♦ సమ్ములఁ గన్గొని, యార శ్రీనాథుఁడో ♦ యన్నవారు
శబ్దసంస్కారమౌచితి ♦ సాధుభావ, మరసి సర్వజ్ఞుఁడేల కాఁ ♦ డన్నవారు
నున్నవారు మీకావ్యంబుఁ ♦ గన్నవారు, విన్నవారును దాసోఽహ ♦ మన్నవారు.

మ॥ అవధానత్రయ మాచరించె మునె తా ♦ నయ్యెంగదా శాబ్దికుం
డవలన్ సత్కృతులెన్నొ సల్పుచు సువి ♦ ద్యాదాన నిష్ణాతుఁడై
వివిధార్థజ్ఞుఁడనంగఁ బేర్వడసె దే ♦ వీభక్తుఁడైనట్టి రా
ఘువ నారాయణశాస్త్రి పెంపఁగలఁడిం ♦ కన్ మీయశోవల్లరిన్.

సీ॥ కర్మయోగమె మోక్ష ♦ కారణంబగునన్న, కర్మఠులం దగ్ర ♦ గణ్యుఁడేకద
యోగాభ్యసనమె సా ♦ యుజ్య హేతువటన్న, నష్టాంగసంపద ♦ యలవడెఁగద
భక్తియోగంబె కై ♦ వల్యప్రదంబన్న, భక్తావతంసుఁడై ♦ పరఁగెనుకద
జ్ఞానయోగమె ముక్తి ♦ తానకంబగునన్న, నద్వైతతత్వంబు ♦ నరసెనుగద
వేయునేల జీవన్ముక్తుఁడా ♦ యెనుగద, సచ్చిదానందమూర్తి కా ♦ జాలెనుగద
యట్టి శ్వశురుని యాత్మక ♦ త్యంతభక్తి, నర్పణమొనర్చుచుంటి బా ♦ ష్పాంజలినిదె.

ఇట్లు,
గ్రంథకర్త యల్లుఁడు,
అంబడిపూడి రామబ్రహ్మకవి,
తురిమెళ్ళ జిల్లాబోర్డాంగ్లపాఠశాల,
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

## గురుస్తుతి.

చ॥ కొమరుల మాదిరిన్ శిష్యులకుఁ గూడునుఁ గుడ్డయు నిచ్చి వారికిన్
తమిఁదగు బుద్ధులం గరపి నమ్మికతోడ మహామనూప దే
శమునిడి దక్షతన్ జదువు సందెలఁ జెప్పి సమాన గౌరవం
మరఁగఁజేయు మీకు సరియాదురె సూరివరుల్ గురూత్తమా.

సీ॥ సంతతంబును వచ్చు సచ్ఛాత్రులకునిచ్చు మహిత విద్యాదాన మహిమవలన
మదిఁ గీల్కొనినభక్తి మధ్యాహ్నమనురక్తిఁ బొనరించు శివలింగ పూజవలన
భవ్యపదముడాయుఁ బ్రతిపదంబునఁ జేయు పంచాక్షరీమంత్ర బలమువలన
నఘసంతతినిఁ బాపు రఘువీరు కథఁజూపు తరమైన సుకృతి రత్నంబువలన

గొనిన పరిశుభ్రకీర్తి దుకూలములను నలుదెసలకిచ్చి కట్టంగ నైజవితర
ణాధికత్వంబు వెలయించి యవని మమ్ముఁ గటకటా వీడిచనితె వేంకటకవీంద్ర॥

సీ॥ కన్నబిడ్డలకన్నఁ గారవంబు దలిర్ప మించి సత్కృపఁ గారవించురీతి
నొక్కలోటేని రాకుండ నెల్లప్పుడు మంచియన్నంబుఁ బెట్టించుభంగి
బాఠంబులనుఁ జెప్పు పాటవంబు నెరింగి యవధానులనుఁ జేయునట్టి తెఱఁగు
నెన్ని కార్యములందు నెదచరించుచునున్న నీశమంత్రముఁ జపియించువిధముఁ

దలచువారల పాపముల్ తరుఁగునన్న నస్మదాదుల శిష్యుల యధికభాగ్య
మెన్నఁ దరమౌనె యిట్టి మమ్మిచటవీడి చనితె గురు వేంకటాహ్వాయ శస్తకీర్తి.

సీ॥ ఉభయభాషాప్రౌఢి నుద్దండగతిబల్కి నన్నపార్యునికీర్తి గన్ననాడు
రసమున కుచితతరంబుగా వచియించి యజ్వకీర్తిభరంబు నందునాడు
సూక్తి వైచిత్రికి జొక్కి చెప్పి ప్రబంధ పరమేశు ఘనతచే బట్టునాడు
సింగారపు రసంపు సిరులొల్క వాక్రుచ్చి శ్రీనాథునియశంబుఁ జెందునాడు

గలుగు నీప్రజ్ఞఁ జాటెడి గద్యపద్య రత్నములు రామసద్గుణ రత్నగుణము
లనిశము సువర్ణఘటితంబులగుచు మమ్ము ధన్యులనుఁ జేయుగాత విద్వత్కవీంద్ర.

ఇట్లు శిష్యుఁడు,
చెఱువు యజ్ఞనారాయణ శాస్త్రి,
గొడుగుపేట, బందరు.

---

శ్లో॥ కలార్థిహృత్పద్మవికాస నక్షమో, విసారి దుర్వాదతమోనిబర్హణః
స్వతేజసాభాసయితుం దిశాన్తరం, గతోస్తమర్కప్రతిమో గురుర్మమ॥
శ్లో॥ త్రీణ్యేవ యస్య ధన్యస్య కవితాధ్యాపనం జపః
కాలయాపన సూత్రాణి గురవేఽస్మైకతోంజలిః॥
శ్లో॥ నమందరో నాపిచ మోహినీ శ్రమో నదివ్యదైత్యా అపినాపి శేషః
విషోద్గతిర్నాపిచ సర్వమేత ద్విలక్షణం రామకథాఽమృతేఽభవత్॥

ఏవం విధేయః
ముళ్ళపూడి నారాయణశాస్త్రి.

విద్వత్కవిశేఖరులైన

# తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారి నిర్యాణము.

—————:o:—————

విద్వత్కవిశేఖరులును, సంస్కృతపాఠశాలా సంస్థాపకులును, విద్యాప్రదాతలును, ధార్మికాగ్రణులును, తపస్సంపన్నులును, 'శ్రీరామకథాఽమృత' మహాగ్రంథ రచయితలునై, కులపతి యననొప్పు, గుంటూరుజిల్లా, చందవోలు వాస్తవ్యులు, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు 67 సంవత్సరములు జీవించి కీర్తిశేషులైనందున, అట్టి మహనీయుని యెడ బృందావనపుర విద్వద్బృందము తమ సానుభూతిని తెలుపుటకై 4-12-1934 తేది మంగళవారము సాయంకాలము బందరు ఖొజ్జిల్లిపేటలోని శ్రీ నాగేశ్వరాలయమున సభజరిపిరి. కింకవీంద్రఘటా పంచాననేత్యాది బిరుద విరాజితులగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారగ్రాసనాధిపత్యమువహించిరి.

ప్రథమమున రాళ్ళభండి వేంకటసీతారామశాస్త్రిగారు శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారి జీవితమునుగురించి ప్రశంసించిరి. తదుపరి శ్రీ చావలి సూర్యప్రకాశరావుగారు శ్రీశాస్త్రులుగారి గుణగణములు తమకు స్వయముగ దెలియుననియు, శ్రీ శతావధానులుగారి గురువుగారగు బ్రహ్మయ్యశాస్త్రిగారు ధవళేశ్వరములో నివ్విధంబుననే పాఠశాలను స్థాపించి అనేకమందికి విద్యాదానమును అన్నదానమును జేసినారనియు, శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి తరువాత అట్టి మహనీయులైన శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారిని మాత్రమే తాము చూచియున్నామనియు అట్టి ఉదారచరిత్రులు చాల అరుదనియు చెప్పిరి.

పిమ్మట చతుశ్శాస్త్రవేత్తలు కవులు నగు విద్వాన్ శిష్ట్లా నృసింహశాస్త్రిగారును హిందూ హైస్కూలులో నాంధ్ర పండితులును శేషాద్రిరమణకవులలో నొకరును అగు శ్రీమాన్ శేషాచార్యులుగారును శ్రీ శాస్త్రిగారి కవితా నైపుణ్యమును గూర్చి ప్రశంసించిరి. అంతట శ్రీ శాస్త్రిగారిని గూర్చి విద్వత్కవీశ్వరులగు వేమూరి సీతారామశాస్త్రిగారు రచించిన పద్యములను వారి శిష్యులగు కవీట్ సర్వా వేంకటశాస్త్రిగారు సభలో జదివిరి. శ్రీ శాస్త్రులవారి శిష్యుడును, ప్రస్తుతము బందరు సాంగవేదపాఠశాలలో విద్యార్థియు నగు చెరువు యజ్ఞనారాయణశాస్త్రి తాను రచించిన పద్యముల గూడ జదివెను. అంతట అగ్రాసనాధిపతి గారగు శ్రీ శతావధానులుగారు తాము శ్రీ శాస్త్రిగారిని స్వయముగ ఎఱుగుదుమనియు, శ్రీ శాస్త్రిగారు తిక్కనాదుల బోలిన కవీశ్వరులనియు, వారిశైలి ప్రౌఢమైన ప్రబంధ శైలియనియు చెప్పి, వారు రచించిన 'శ్రీరామకథామృత' మను గ్రంథ

ములో బాలకాండములోని భాగములను గొన్నింటిని జదివి, వారి కవిత్వము ద్రాక్షపాకము, కదళీపాకము, అచ్చటచ్చట నారికేళపాకముతో గూడ నొప్పుచు సర్వరసములతో నిండియున్నదనియు, కవి సర్వజ్ఞుడుగా నుండవలెనను న్యాయము శ్రీ శాస్త్రిగారియందు వర్తించినదనియు, వారి గ్రంథములో సర్వశాస్త్రములయొక్క సారము సుగమముగ విశదీకరింపఁబడినదనియు, ఎంత వెదకి చూచినను వారి గ్రంథములో నొక తప్పైనను కాన్పించలేదనియు చెప్పి, వారి గ్రంథములో నింక అచ్చుకాబడవలసిన మిగిలిన భాగములుకూడ అచ్చుగునటుల అందరును తోడ్పడవలెనని హెచ్చరించిరి.

జమ్మలమడక లక్ష్మీనరసింహం.

---

# శ్రీ దత్త శ్శరణం మమ.

---

మ॥ జపమాలం గుడిచేతఁ ద్రిప్పుచుఁ దపస్స్వాధ్యాయ నిష్ఠత్వ వా
గ్మిపుణత్వంబుల వ్యాసమూర్తివలె రాణింపంగ నిన్ జూచు భా
గ్యపు మద్దృష్టికి శంకరాఽకృతిగ సాక్షాత్కారమై వచ్చు తం
డ్రీ? పునర్దర్శనమీక యేమయితొ హా శ్రీ వేంకటప్పాభిధా?

క॥ ఒక్కపరి మిమ్ముఁదలఁచినఁ, జక్కగ గురుబోధ సేయఁజాలుదురు భువిన్
దిక్కరు సంసారంబున, దిక్కగ మీరుంట నెంత ధీవిరహితులున్॥

సీ॥ ధవళాక్షతల సుగంధద్రవ్య పుష్పజా, తుల శివు నర్చింప నలరుశ్రద్ధ
పలుకఁబల్కున సుధలొల్కు నానాపురాణేతిహాస శ్రుతి స్మృతుల బోధ
యతులితాఽద్వైత బ్రహ్మానంద వారాశి మునిగితేలెడు గురుమూర్తి భక్తి
నట్టి శ్రీరామకథాఽమృతంబున్ గ్రోలి వ్రాయుచోఁ గల్గు వైరాగ్యమహిమ
కాళిదాసాది కవుల వాగ్ధాటి ధాటి వరుస లీలలఁ జూపించి పరమ శివప
దాత్మ పట్టాభిషిక్తుఁడవైతె? విబుధప్రథితగుణసాంద్ర? వేంకటప్పయ కవీంద్ర?

సీ॥ అభిజనాచార ముఖ్యములెన్న నత్రి బ్రహ్మర్షి మూలంబయి యలరె మీకు
తత్పురాకృత పుణ్యధన సంపదాప్తిచే శుకుని బోలెడుఁ గన్న సుతులు మీకు
మహిత పతివ్రతామణిశీల మనసూయ కెనవచ్చు ననవచ్చు నింతి మీకు
శంకరాచార్య శిష్యశ్రేణివలె మహీమాన్యులంతే వాసిమణులు మీకు
సాటిలేనట్టిదగు నివాసంబు నైమిశంబు గేరు బురోపవనంబు మీకు
నమర గైవల్య సామ్రాజ్యమందినావె ప్రథితగుణసాంద్ర? వేంకటప్పయ కవీంద్ర॥

మ॥ అదుగో చంద్రపురీబుధుండనిన సింహాస్వప్నమై ముందు వె
న్కడుగుల్సాగక గట్టిపెట్టుదురు నానాశాస్త్ర తర్కంబుఁ జ
ప్పుడు విన్నన్ శుకవీంద్ర మత్తగజముల్ వోలెన్ బండితుల్ మెచ్చ ని
న్నోడరన్ గాంచఁ దరంబె శాశ్వతుఁడవైతో వేంకటప్పాభిధా?

మ॥ కదళీపాకముఁ బట్టివెట్టుఁడన ద్రాక్షాపాకమున్ గోరఁ జ
క్కదనంబందిన నారికేళ రసపాకంబన్న వెన్కాడ క
య్యాది శ్రీరామకథాఽమృతోక్తుల ననన్యస్తోత్ర తత్త్వార్థ సం
పదతో వ్రాసితిఁ జూచుకొమ్మనవె బాబా? వేంకటప్పాభిధా?

గీ॥ శాంతినిచ్చుత హరి భవత్స్వాంతమునకుఁ బుత్రపౌత్రాదులకు గురు పుంగవులకు
భక్తవరులకు నిజ పరివారమునకు ప్రథితగుణసాంద్ర వేంకటప్పయ కవీంద్ర॥

ఇట్లు శిష్యపరమాణువు,
ప్రతాప బసవకవి,
వల్లూరు పురవాసి.

# శ్రీశోఽవ్యాత్.

సీ॥ శ్రీవిరాజిత దివ్యసేవ్య కథా సుధాధామమ్ము రామకథాఽమృతమ్ము
రసవాహినీ మహోల్లాస వాసవ్యాస ధానమ్ము రామకథాఽమృతమ్ము
సర్వసుపర్వ సంచయ పర్వగర్వ సంధానమ్ము రామకథాఽమృతమ్ము
దుర్వాదమోద ప్రదోషాచరస్వాంత దారమ్ము రామకథాఽమృతమ్ము
నిత్యతృప్తుల మముఁజేయ నిలిపి యమర పురవరంబును జేరఁగాఁ బోయినావె
తాడేపల్ల్యన్వవాయ రత్నాకరౌషధీశ శ్రీ వేంకటప్ప కవీశ మౌళి॥

గీ॥ స్వీయ పరకీయ భేదంబుఁ జేయకెపుడు కన్నబిడ్డలరీతిగాఁ గరుణ విద్యఁ
గఱపినట్టి ఋణంబెట్లు గడపఁగలము ప్రణతు లొనరింతు మీ పాదపద్మములకు॥
గీ॥ జనన మొందినవానికిఁ జావునిజము బ్రదికినందాకఁ గోరిక ప్రబలియుండుఁ
గాని గ్రంథమ్ము సాంతమ్ము కానివేళ శ్రీశుఁ గలియంగబోయిన చింత యొకటి॥

ఇట్లు శిష్యుఁడు,
పరిమి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి,
చందవోలు.

శ్రీశివాయగురవేనమః.

# విషయసూచిక.

—————:o:—————

శ్రీశివాయగురవేనమః.

# విషయసూచిక.

———:o:———

శ్రీ శివాయ గురవే నమః.

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 8 | డగ | గడ |
| 13 | 13 | డీఁడు | డఁడు |
| 27 | 15 | వేస | వేళ |
| 28 | 10 | డను | డగు |
| 36 | 8 | వీవె | నీవె |
| 41 | 8 | యడ | యడి |
| 43 | 19 | డప | డవ |
| 45 | 7 | తరయే | తరయొ |
| 46 | 29 | గుచు | గుదు |
| 49 | 29 | త్వజ్ఞ | త్వ్యజ్ఞ |
| 55 | 27 | పటి | పట్టి |
| ,, | 28 | సండు | సనుండు |
| 56 | 3 | యత్రి | యంత్రి |
| 57 | 5 | లెడ | లెగ |
| 59 | 9 | నంద | నెంద |
| 60 | 20 | ష్టిగ | ష్టిఁగ |
| 66 | 9 | మిత | మిత్రి |
| ,, | 16 | నిక | నిన |
| 68 | 18 | పఁపుం | పపుం |
| ,, | 26 | ధంబు | థంబు |
| 69 | 7 | లారా | రాలా |
| 70 | 2 | ట్టఁపు | ట్టపు |
| ,, | 8 | ముస | మున |
| 72 | 4 | ద్వధా | ద్వదా |
| ,, | 16 | యుగు | యగు |
| 73 | 28 | దర్ప | దత్ప |
| 74 | 14 | యురల్ | యుతుల్ |
| ,, | 20 | బూలె | బూనె |
| 75 | 6 | నెట్లు | నెట్టు |
| ,, | 28 | దీర్ఘ | దేర్ఘ |
| 76 | 16 | దరు | దలు |
| 77 | 19 | నెఱి | నెటి |
| 79 | 6 | రింము | రింపుము |
| 82 | 22 | లకుఁ | లనుఁ |
| 97 | 8 | చ్యుచు | చ్యుతు |
| ,, | 18 | భాప | భావ |
| ,, | 26 | హిరీ | హరీ |
| ,, | 27 | యము | యమున |
| 98 | 4 | పేఁట | పీఁట |
| 100 | 21 | దును | దసు |
| ,, | 26 | సఁగఁ | సఁగఁగ |
| 101 | 10 | షరు | వరు |
| ,, | 24 | జడ | బడ |
| 102 | 17 | బూ | బూరి |
| 104 | 4 | యేఁబ్రొ | యేఁబ్రో |
| ,, | 7 | రొయందు | యందు |
| ,, | 16 | మింద | మింధ |
| 105 | 2 | ◆ క | క ◆ |
| 109 | 25 | త్స్మ్య | త్స్య |
| 114 | 21 | నంబులు | నులు |
| 117 | 26 | నేల | నేల |
| 119 | 10 | రులులా | రులా |
| ,, | 17 | డతు | డఁతు |
| 121 | 14 | లా | ఁగల |
| 129 | 22 | చర | చఱ |
| 132 | 15 | ర్చర్య | శ్చర్య |
| 135 | 20 | నెట్లు | నిట్లు |
| 146 | 11 | దంన | దనం |
| 150 | 24 | యమా | యమా |
| 174 | 5 | మబ్బి | మబ్బు |
| ,, | 10 | అఁగు | అంగు |
| ,, | 21 | తోడు | తోడ |
| ,, | 22 | చటి | చటు |
| 198 | 20 | హుఁందు | హుందు |
| 200 | 1 | భప | భవ |
| 207 | 14 | పెస | పెన |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 213 | 5 | పల్లి | తల్లి |
| 215 | 20 | బిన్న | బన్న |
| ,, | 21 | కన్మె | కన్నె |
| 220 | 9 | ల్చివ | ల్చిన |
| 235 | 25 | ఎమి | ఏమి |
| 241 | 12 | యొంటు | యొంటి |
| 249 | 27 | నుపు | నువు |
| 260 | 24 | సాప | వాప |
| 267 | 16 | పల | వల |
| 295 | 26 | ఘ్రితా | ఘృతా |
| 321 | 9 | గృధ | గ్రుధ |
| 351 | 24 | యము | యము |
| 368 | 7 | తిడె | విడె |
| 371 | 7 | తఁత | తఁడ |
| 376 | 28 | గడ | గడు |
| 389 | 2 | డట | పాడ |

---

# నమశ్శ్రీగురవే.

---

శా॥ శంభద్భక్తినిఁ గేలుదమ్మిని నమస్సోమాయ యంచుఁ మహా
రంభుఁ బార్థివమూర్తినుంచి మనసారఁ దీర్థమాడించి హే
శంభో ; స్వీకురుమత్సమర్పిత మహార్చాభోగమంచుండు ని
ర్దంభుం దత్పరు నిన్నుఁజూడవలెఁ దాతా వేంకటప్పాహ్వయా ?

మ॥ మునివంద్యుండు పరాశరాత్మజుఁడు దాముంజేయి నోరాడకే
వెనకయ్యంగొని తెచ్చె భారతముకై విద్వాంసు నారాయణుం
గొనె సాహాయ్యము నన్నయాభిదుఁడు నీకుంజాలుబో యీకలం
బని నిర్మించితి గ్రంథముఁ కవి మృగేంద్రా వేంకటప్పాహ్వయా॥

గీ॥ నీవె దిక్కని మ్రొక్కుచు నిక్కమాత్మ
గొలుచు సతి సుత హిత సోదరుల వీడి
బ్రహ్మ తాదాత్మ్య మొందంగ బరఁగినావ
టయ్య మాయయ్య వేంకటప్పయ్య శాస్త్రి.

ఇట్లు విధేయుఁడు,

ప్రతాప పూర్ణానంద శాస్త్రి.

——0——

శ్రీశివాయగురవేనమః.

# గురుస్తుతి.

---

శా॥ ధీమంతుర్ హనుమంతుఁబంచి మునువే ♦ తెప్పించి సంజీవనిన్
సౌమిత్రిన్ బ్రదికించు కొంటివిక దా ♦ సంగ్రామరంగస్థలిన్
రామా ! నీదు కథాఽమృతమ్ముఁజవులూ ♦ రంగ్రోల్చువిద్వత్కవి
స్వామిన్వేంకటదేశికేంద్రు బ్రదికిం ♦ పంజాలవై తేకటా.

ఉ॥ రామకథామృతమ్ము మధు ♦ రమ్ముధరంగల యెల్లవారికిన్
స్వామివలెం గృపామతిని ♦ బంచుటసైపక యాసుధాంధసుల్
భూమినిబాచిదోడుకొని ♦ పోయిరిమద్గురు వేంకటాఖ్యుఁగా
నీ మహనీయమూర్తియట ♦ నేనియుఁదద్రుచులే వచించెదన్.

మ॥ నినుదీక్షన్స్తవముల్ జపించుననియు ♦ న్నిండౌమనఃపీఠి నీ
వనిశంబున్నెలకొల్పు రామునిమహా ♦ ధ్యానమ్ము గావ్యాఽమృత
మ్మున భూమండలినిండఁ జేసెననియు ♦ న్నాదమ్ముతో నోలగ
మ్మునకుంజేర్చితె వేంకటాఖ్యగురు శం ♦ భూ ! సర్వలోకప్రభూ !

ఉ॥ మాతృకపుష్పమాల నిను ♦ మాపులు రేపులుఁ బూజసేయుచుం
బూతసహస్రనామములు ♦ పూన్కిఁబఠించుచు నీదుమంత్రముల్
జేతమునంజపించుచుఁ బ్ర ♦ సిద్ధినిగాంచిన మద్గురుల్ భవ
ద్ద్యోతములోనఁజేర్చితెయ ♦ నూనదయంగలిఁ బాచిశాంకరీ !

చ॥ మొగమున బ్రహ్మవర్చసమ ♦ మోఘము ఫాలతలస్థకుంకుమ
ద్విగుణితమైయొసంగగళ ♦ దేశమునందు శివాక్షమాలమే
ల్మిగనిగలీన శంకరుని ♦ లీలఁ జరించుచు దేశ ముద్ధరిం
చుగురువరా ! మముందమము ♦ సోకునవైచి చనంగఁబాడియే.

సీ॥ సింహమ్మురీతిగ ♦ ర్జిల్లుచుఖలదుర్మ, తేభాళిఁజీల్చువా ♦ రెవ్వరింక
భ్రమరకీటస్థితిఁ ♦ బఱపిశిష్యుఁదనంత, లేర్పఱించెడివార ♦ లెవ్వరింక
ఋషిచందమునశ్రుతి ♦ స్మృతిపురాణమ్ముల, నిదమిత్థమనువార ♦ లెవ్వరింకఁ
బ్రభువట్లుశాసించి ♦ పరులనాత్మీయుల, నేకతఁగనువార ♦ లెవ్వరింక

గీ॥ ఆద్యకవిరీతిరసకల్ప ♦ నౌచితీస
మగ్రభావాదికమ్ముగా ♦ వ్యస్వరూప

మెఱుఁగ బోధించువారెవ్వ ♦ రింకమీఱ
లరుగగురువర ! యన్నియుం ♦ గొఱఁతలయ్యె.

క॥ రంగదభంగురశృంగో, త్తుంగహిమవదగ్రిలగ్న ♦ తోయదపటలీ
సంగతివిలుఠద్గంగా, భంగివచోధాటిదివిని ♦ పఱుపంజనితే.

తే॥ ఉభయరామాయణమ్ముల ♦ నుభయభాష
నుభయకవిమిత్రునడకల ♦ నొనరఁగూర్చి
యవనివెలయించి రామక ♦ థామృతమన
గురువరా ! పిల్వనేగితే ♦ గురునికడకు.

క॥ ఏమాత్రంబెడలేక స, దామైత్రిన్సోదరుని వి ♦ ధమ్మునఁగనుచుం
స్వామివనిమెచ్చురామ, స్వామిగురుం గనఁజనితేయ ♦ పరశివమూర్తీ !

ఆ॥ కెలనిశిష్యులనెడి ♦ క్రేపులుఅవళింప, రామచంద్రవిభుక ♦ థామృతంబు
భూమిపూర్ణకలశిఁ ♦ బూరించిదివికేగె, వేంకటాఖ్యగురుగ ♦ వీసురగవి.

ఇంటూరు,
4—2—1935.

ఇట్లు,
చల్లా పిచ్చయ్యశాస్త్రి.

శ్రీశివాయగురవేనమః.

# గురుస్తుతి.

శ్లో॥ కథంద్విత్రైః పంచషైర్వాశ్లోకైస్తద్వర్ణనం భవేత్
అస్మదాచార్య వర్యస్యయస్యనాస్త్యుపమాభువి.

శ్లో॥ యేషాం సన్నిధి మాగతేన సుధియాభావ్యంజడేనాప్యలం
యేవాది ద్విరదేంద్రకుంభదళనే ప్రోచ్చండ పంచాననాః
శ్రీ సీతాపతిపాదతోయరుహా యోర్యద్వాగయోధ్యాపురీ
తేచాఽస్మాన్పరి హీయవేంకటబుధా హా ! హా ! గతాఃకుత్రవా.

శ్లో॥ కృతేరభూదాద్రిమకథాఽమృతస్య
పతిర్హిసాక్షాత్పరమేశ ఏవ
దత్వాస్వయంతత్రకృతీభవామి
త్యాలోచ్య కైలాసగతో గురుర్మే.

ఇత్థం శిష్యాణుః,
ప్రతాప హనుమచ్ఛాస్త్రీ.

శ్రీమేధా దక్షిణామూర్తయేనమః.

మ॥ అమితానందము నంద బందరున స ♦ భ్యానీకముం గూర్చి విం
టిమి మీ 'రామకథామృతం' బిపుడు తా ♦ డేపల్లివంశ్యాగ్రణీ !
సుమనస్తుత్యరసార్థగుంభితవచ ♦ శ్శుద్ధిం బ్రకాశించు క
బ్బములందియ్యది యగ్రగణ్యమగు న ♦ ప్పా ! వేంకటప్పాహ్వయా.

బందరు,
13—2—1934.

ఇట్లు,
సుధీవిధేయుడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.

---

చ॥ అనవధి సౌకుమార్యయుతమై మహితోజ్జ్వలతానిధానమై
యనుపమభావ సౌరభ సమంచితమౌచు సుశబ్దశాలియై
ఘనరసవర్గ సంఘటన కాంతమునై సుమనోమనోజ్ఞతం
దనరు భవత్ప్రబన్ధమమృతప్రథితాఖ్య వహించుటబ్రమే. ౧

చ॥ పరశివ భావనాఢ్య నిజవక్త్రవినిర్గతమై చెలంగుటం
హారముఖనిర్గతత్వము యథార్థము సేసితి విట్టి మైథిలీ
వరుని కథామృతంబున నవార్యమహోఘములం వెలార్చితో
సరసకవీన్ద్ర తాడెపలి సత్కులవారినిధీ కలానిధీ. ౨

మ॥ అలఘు రసప్రవాహనిలయంబగు రామకథాఽమృతంబు చేం
గలికలుషంబులం దులిచి కావ్యవిదత్యధికప్రమోద సం
కలన నిదానమౌ సుకృతిఁ గాంచితి వుజ్జ్వలకీర్తి నిట్టినీ
లలితతమంబులౌ గుణములం గణుతింపవశంబె సత్కవీ. 3

గీ॥ తాడెపలి శుద్ధవంశముక్తాయమాన, పాండితీసాన్ద్ర వెంకటప్పయకవీన్ద్ర
నిరవధి గుణాకరంబైన నీదుకృతికి, నాగలింగాహ్వయుఁడ మెచ్చినాఁడ మిగుల. ౪

మహోపాధ్యాయ,
ముదిగొండ నాగలింగశాస్త్రి,
తెనాలి.

---

శ్రీవాణ్యైనమః.
అస్మద్గురు చరణారవిందాభ్యాంనమః.

సీ॥ రామకథాఽమృత రత్నభాండముసూరి సురలకిచ్చినమేటి సుకృతరాశి
దరిఁజేర్చివిద్యార్థి తతులకన్నంబిడి సకలవిద్యలునేర్పు సద్గుణుండు
తనకుఁగష్టములెన్ని దవిలివెన్నంటినఁ దనదీక్షవీడని ఘనమనీషి
తపముపేరిటి బ్రహ్మతాదాత్మ్యమునుబొంది బొందినేమఱచెడి పుణ్యశీలుఁ
డరరె శ్రీతాడేపల్లి వంశాబ్ధిసోముఁ, డాత్మజ్యోతిర్మయాకార మవఘటించి
తనువువీడుట సంతాపతమముప్రబ్బె, వివిధబుధలోకమానస వీధులందు.

మ॥ శ్రుతులున్ శాస్త్రములున్ బురాణములు మీసొమ్ముల్ రసాశ్లిష్టవా
క్చతురత్వంబుపమింపరానిది పరేచ్ఛాతృప్తి మీకామితం
బతిలోకోత్తర మీశ్వరార్చనము నిత్యంబాత్మయోగంబు సం
సృతిదూరుండవు వేంకటప్పయ మనీషీ శిష్యకల్పద్రుమా.

క॥ శ్రుతిహితములు కర్జంబులు అతులవచఃప్రౌఢిమంబు లలరెడికవితల్
శ్రుతులున్నవారికోకృతి, శ్రుతిహితములె యగునయెందుఁ జూచినమిమ్మున్.

క॥ ఒక్కొకపద్యమునంగడు, చక్కని పాకంబు భావసరళతధ్వనియుం
దక్కటిశబ్దాలంకృతు, లిక్కవిరాడ్గ్రంథమునన యెసఁగుబళియనన్.

సీ॥ శ్రీపతికవినేతచిత్త మచ్చెరువొందె బ్రహ్మదండపుడంబు పద్యమందు
పరకవిమత్తేభ హరివేంకటకవీంద్రుఁ డలరెఁ బికధ్వనిపలుకునందు
అప్పరాయనృపాలు డహహా యంచునుమెచ్చెఁ బాలుగారెడుపద్య పఠనమందు
రామకృష్ణమనీషి కేమొ సంతసమాయె మే-న-కా. యను శ్లేషమూనుటందు

కవితమీయంద వెల్గుటగాఁదలంచి, రఖిలరసవేత్తలౌకవు లలఘుమతులు
పాకమునసొంపు ధ్వనియింపు బలుకుదింపు, రసములనుబెంపు మీపద్యరచనలంపు.

ఆ॥ కొదువమీమది కొండుండె గోమరులుండి
రదియుఁదీర్పంగ గ్రంథములచ్చుగూర్చి
సందియములేదు సంసృతినిందెవీడి
యద్వయానందమునుబొందుఁ డాత్మనీన.

కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,
ఆయుర్వేద వైద్యుఁడు.
పాతగుంటూరు.

[ గ్రంథకర్త జీవితకాలమున వ్రాసినవి ]

ఉ॥ పూర్వకవీశ్వరుల్ వొలుచు ప్రొద్దులఁబుట్టి తదుక్తులన్ శ్రవః
పర్వమొనర్చుకోమనెడు వంతరవంతయు లేదు ; నేఁడు మా
గుర్వవతంసు, వీరు, ధరఁగొల్వయితాదృశ భాగ్యమూన్చుటన్
బర్వమదింబ్రమోద ; మిదె వందనముల్ కవి రాజశేఖరా !

సీ॥ నన్నయ కవితాప్రసన్నత యొకచోటఁ దిక్కన్నకుదియింపు ఫక్కి యొకట
శంభుదాసుని కావ్యగుంభనంబొకచోట సోమనాథునిపల్కు గోమొకంట
శ్రీనాథువాచా విజృంభణంబొకచోటఁ బోతనార్యునిభక్తి రీతియొకట
బెద్దనకవిముద్దు టొద్దికలొకచోట సూరన్న శ్లేషంపుఁ దీరొకంట

తే॥ గీ॥ వెలయ నిర్వదినాలుగు వేలగ్రంథ,
మొక్కచేతిమీఁదుగ బుధుల్ మ్రొక్కవ్రాసి
తహహా ! పుణ్యాంబు రామకథాఽమృతంబు
నలవిమొ ? నుతింప వేంకటప్పార్యవర్య !

ఉ॥ భోజుఁడు, రాజరాడ్విభుఁడు మున్నుగసత్కవి, కావ్య, పోషణో
త్తేజితనిత్యకీర్తులు, సుధీనుతు, లాఢ్యు లుదారశీలురా
రాజులువోవుపైఁ జెరువటిన బయలంబడు భేకమాడ్కి నీ
యోజఁగవిత్వలక్ష్మి వగపొప్పఁజరించెడు నింటికింటికిన్.

తే॥ గీ॥ పండితులకిప్డు స్వకుటుంబభరణభరమ
దుర్భరంబాటఁ బ్రాజ్ఞతాధూర్వహామగు
నాఢ్యలోకమ్ము శిరమునందధివసించెఁ
దద్రచితసుకృతీంద్ర ముద్రిణాభరంబు.

ఉ॥ ఎంత ధనంబుపొట్టకు వ్యయింపము రిత్తకురిత్తపట్టులం
దెంతటి విత్తవృష్టికురియింపము పైని "సినీమ" మున్నుగా
వింతలకెంత రొక్కమును వెచ్చముసేయము! దానసీవ్యయం
బెంత ? పరంబిహంబొసఁగు నెంచియొనర్పుఁడు సాయమో బుధుల్ !

ఇట్లు,
విద్వద్విధేయుఁడు,
వేమూరి సీతారామశాస్త్రి.

[గ్రంథకర్త పరోక్షమున వ్రాసినవి]

క॥ పోతనస్మృతికింగొల్వెడు, పూతచరిత్రుండు భక్తిపూరితహృత్కుం
జాతుఁడు; విద్వత్కవి వి, ఖ్యాతౌదార్యుఁడు తపస్వి కటకట ! చనిరే.

మ॥ మిము నాంధ్రావని యంతగా నెఱుఁగ ; దీ మీరామగాథామృతం
బమలంబెల్లెడఁబాటి సర్వజగదాహ్లాదంబుగావించు కా
లము పైబ్రహ్మరథంబువట్టు శుభకాలం బేగుదెంచెన్ బుధో
త్తమ ! కన్గట్టెనొ యేమొయింతకె తటస్థంబయ్యె దుష్కాలమున్.

మ॥ ఒకనాఁడా ! యొకయేడ ! యిప్పటికినోహో ! నల్వదైదేండ్లు పా
యకవిద్యార్థులనింట నిల్పుకొని విద్యాబుద్ధులంజెప్పి సా
ర్థకమున్గణ్యమొనర్చుకొంటి భవమున్; ధన్యుండ వీక్షోణిరా
మకథాకావ్యము మీయశంబు స్థిరమై మాన్యంబుగేయుంబగున్.

చ॥ కవియుఁ, దపస్వి, పండితుఁడు, గణ్యచరిత్రుఁడు, ధార్మికుండు, నేఁ
డెవఁడన ధక్కఁగొట్టి వచియింపఁగవచ్చు మహాత్మ ! నిన్ను భా
గవతపుఁ గర్తపోతన యఖండతపోనిధి తిక్కయజ్వ లో
నవు మహనీయ పూర్వకవులట్లు యశస్తనువొంది వెల్గుమా.

ఇట్లు,

వేమూరు సీతారామశాస్త్రి,

---

మ॥ కవితాకన్యక కండ్లనీరిడుచు నీ ♦ కై చాలవాపోవ శి
ష్యవితానంబు గురూత్తమా యనుచు హా ♦ హాకారము ల్సల్ప భా
ర్య విశోకింపఁగ బాంధవాళి యడలన్ ♦ హాయెల్లర న్వీడి యీ
దివి కేగం దగవౌనె నీకు హితవా ♦ దీ వేంకటస్వాహ్వయా.

మ॥ యశము న్నించితి వెల్లలోకముల నా ♦ ర్యా విస్తరింపంగ మా
వశమే నీగుణభావవైభవకదం ♦ బం బీవు లేకున్న దు
ర్దశ విద్యాళికిఁ గల్గె నందుకొ యకా ♦ ర్తత్వం బయో మాతులా
శ్వశురా సద్గురువర్య వెంకటకవీ ♦ శా తాడెపల్ల్యన్వయా.

ఇట్లు శిష్యుఁడు, అల్లుఁడు.

మాచేపల్లి వీరరాఘవశాస్త్రి.

---

శ్రీరామగురవేనమః.

శ్రీదత్తశ్శరణంమమ.

శా॥ బంధుప్రీతికి నాకరంబవయి నై ♦ ష్ఠల్యక్రియాత్యాగని
ర్బంధప్రోద్యదుదారవృత్తివయి కా ♦ ర్యజ్ఞుండవై వైరిహృ
త్సంధిప్రోద్దళన ప్రతిజ్ఞగదురన్ ♦ సామ్యతముంగంటి ధా
టిం ధాత్రిన్ గనబోము నీకుసరి తా ♦ డేపల్లి వంశాగ్రణీ.

మ॥ సిరియెంతో గలదంచుఁ గర్వమున దు ♦ శ్శీలుండవుంగాక యు
క్కఱకున్ మాలినయట్టి దుర్వ్యయములన్ ♦ గావింపవెప్డేని పె
న్నిఱుపేదల్ సముపాశ్రయింపఁ గలుముల్ ♦ నిస్తుల్యతన్ గూర్తు గూ
డిరిగాదా? సురలిట్టివాఁడవని తా ♦ డేపల్లి వంశాగ్రణీ.

మ॥ కలలోనైత మెఱుంగవొక్కపుడు దు ♦ ష్కాపట్యతంత్రంబు లొం
డుల ద్రవ్యంబులఁ గాసువీసమయినన్ ♦ మూచూడవెల్లప్డు లో
కుల కెంతేఁ దలలోనినాలుకగఁ గొం ♦ కుంపీడివర్తింతు వ
ట్టె లసత్సద్గుణి? స్వర్గివైతివొకొ తా ♦ డేపల్లివంశాగ్రణీ.

శా॥ నన్నుంజేరఁగఁ దీయునప్డుగల గ ♦ ణ్యంబైనభావంబె న
న్నౌన్నత్యంబును బొందఁజేయుటకు నా ♦ సాంతంబుఁ బెంపొందె నీ
హృన్నీరేజమునందు సత్యవచనం ♦ బే మేల్మిబంగారు సా
టిన్నిల్పంబడు నట్టిస్వర్గివహా తాడే ♦ పల్లివంశాగ్రణీ.

నిడుబ్రోలు,
31—3—35.

ఇట్లు అంతేవాసి.
తాడేపల్లి సత్యనారాయణశాస్త్రి.



# ప్రకటన.

శ్రీరామ కథాఽమృతమను నీ గ్రంథరాజమును ప్రశస్తములైన గ్లేజు కాగితములపైని ముద్రింపించి ౨౪ వేల పద్యములను నైదు వాల్యములుగ కాలికో బైండులు చేయించుచున్నారము. విక్రయించుట కిష్టములేక చందాదార్ల సహాయముచే యిక్కార్యమును నెరవేర్చుచున్నారము.

యీ గ్రంథముయొక్క వాల్యము లైదును మఱికొన్ని గ్రంథములు షుమారు పదియును రు. ౨౦-౦-౦ లిచ్చు చందాదారునకుఁ బంపెదము. చందాను ముందుగా పంపవలయును. ఎప్పుడు తయారైన పుస్తకముల నప్పుడు వీ. పి. ద్వారా చందాదార్లకు పంపెదము. వీ. పి. ఖర్చులు మాత్రము చందా దార్లే భరింపవలెను.

వలయువారలు :—

తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు,

చందవోలు.

బాపట్ల తాలూకా, గుంటూరు డిస్ట్రిక్టు.

లేక

తాడేపల్లి సత్యనారాయణశాస్త్రిగారు,

నిడుబ్రోలు,

బాపట్ల తాలూకా గుంటూరు డిస్ట్రిక్టు.

అనిగాని వ్రాయవలెను.

శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

———:o:———

### ప్రథమాశ్వాసము.

——o——



రాజీవాయత తే
జోరూఢయశః ప్రకాశ ♦ సురుచిరచిద్యో
గారంభకనిజమాయా
పారగుణకలాతిరేక ♦ భవ్యశ్లోకా. ౧

తే॥ అవధరింపుము రాము క ♦ ల్యాణమహము
రస మరసి హర్షభూతయై ♦ రమణుఁ బ్రీతిఁ
దేర్చి తనివోక యవ్వాలి ♦ తెఱఁగు దెలుపు
మనిన గిరిజకు గిరిశుఁ డి ♦ ట్లనియె నపుడు. ౨

తే॥ మంగళాయతనము నిత్య ♦ మంగళాధి, దేవతాస్పద మమితయో ♦ గావహంబు
రామసీతావివాహాబ్ధి ♦ రామసంస, దుల్లసితసౌఖ్యపూరమ్ము ♦ వెల్లివొడువ. ౩

క॥ జగదేకానందరసం, బగణితసంపత్సమేత ♦ మై శుభపదమై
నెగడెనన వారివిభవము, సుగుణోల్లాసిని; నుతించు ♦ చొప్పు సుగమమే. ౪

తే॥ అంతిపురిఁ దమతమభవ ♦ నాంతరములు
ధనదు మందిరముల నెఱఁ ♦ దద్ద నెగడ

ముదితులై యుదితాదిత్య ♦ మూర్తు లనఁగఁ
బ్రిభలఁబోని సతులఁ గూడి ♦ పరఁగు సుతుల. ౫

చ॥ కనుఁగొని సంతసిల్లె మహీ ♦ కాంతుఁడు కాంతలుఁ దాను నల్వురుం
దనయులు సత్పరిగ్రహు లు ♦ దారులు వీరులు సంభృతాస్త్రులై
క్యనిరతు లాత్తసజ్జనులు ♦ నై తనుఁ గొల్వఁగఁ గొల్వు మెట్టువా
రనుపమ మిట్టిభాగ్య మని ♦ హర్షితులై యనిశంబుఁ బేర్కొనన్. ౬

ఆ॥ నీతివిదులు నిత్య ♦ నిర్మలహృదు లభి, రామరాములు గుణ ♦ రత్ననిధులు
సుతులు నిచ్చ లెనసి ♦ శుశ్రూష లొనరింప, దశరథుఁడు కృతార్థ ♦ తం దనర్చె. ౭

క॥ ఇమ్ముల కిమ్మై సొమ్ముల, సొమ్మై సుతభాగ్య మమర ♦ సూనృతుఁడు గురుం
డమ్మైథిలేంద్రకృతయో, గమ్మైథిత మింద్రయోగ ♦ మని మది నెంచెన్. ౮

ఆ॥ అంద ఱాత్మసతుల ♦ యంద మానందంబు, మెచ్చి మెలఁగుచుండ్రు ♦ మేలనముల
నందు రాముసీత ♦ యందలి ప్రేముడి, ముడి నుతింపలేవు ♦ ముజ్జగములు. ౯

తే॥ సీత రాముమదికి సుసం ♦ ప్రీత యయ్యెఁ
బితృకృతిప్రతిభానభా ♦ విత యటంచు
సద్గుణము రూపగుణ మాభి ♦ జాత్య మొక్కొ
కం డెలమిఁ బెంచు నవియన్నై ♦ కవియఁ బాఱ. ౧౦

ఆ॥ అంత కెక్కుడగుచు ♦ నలరు రాముఁడు రామ
యుల్లమున మెలంచు ♦ నోలిమికను
హృదయ మెపుడు హృదయ ♦ మే ఖ్యాపన మొనర్చ
జనకజాత సిరి సు ♦ జాత యగుట. ౧౧

తే॥ దేవతామూర్తి సీతతో ♦ దివ్యసిభుఁడు,విభుఁడు వర్తిల్లె రాముండు♦విశ్వవిహితుఁ
డెన్నియేనియు ఋతువు ల ♦ క్లేర్పడంగ, నంగజాతజనకుఁ డీతఁ ♦ డౌ వనంగ.

తే॥ మాతృపితృపూజనము ప్రజా ♦ మర్షణంబు
భూతసంతృప్తిభావన ♦ పుణ్యకలన
రాచకార్యంబులందీర్చు ♦ రాణయుఁ గని
యాస్వయంభువె యిటు ♦ గూర్చె ననిరి జనులు. ౧౩

క॥ అన్నెటి మనుజానందం, బన్నడి శ్రుతివిదితమైన ♦ యది తన యదె యం
చెన్నగుచు బ్రహ్మానం, దోన్నతి గుటి నుండెఁ బుడమి ♦ యొడయండంతన్. ౧౪

తే॥ పెండిలికి వచ్చి మిగుల సం ♦ ప్రీతి గూర్చి
యల్లు నొకపరి మాయింటి ♦ కనుపు మనిన
వాఁడు కడఁగి యుధాజిదా ♦ హ్వయుఁడు మేన
మామ పొడసూపె భరతుపై ♦ మమత నెఱయ. ౧౭

క॥ ఆకేకయరాజాత్మజు, రాకకు సంతోషపడి ధ ♦ రాపతి యదనీ
యాకాంక్ష వెలయ భరతు గు, ణాకరు మేలోర్చి కూర్చి ♦ యనె జనులౌనన్.

ఆ॥ అన్న కేకయాధి ♦ పాత్మజాతు సుజాతు, మేలి మేల్మి నెంచి ♦ మెలఁగు టొప్పు
గురుననుజ్ఞ నిన్నుఁ ♦ గొంపోవఁగా వచ్చి, నాడు నాఁడె తెలిపె ♦ ననుచుకూర్మి.

క॥ ఋషిమధ్యమున నడిగెఁ గ, ల్మషరహితుఁడు నీదుమేన ♦ మామ పతి యకి
ల్బిష యాన నెఱపు తలఁపున, నిషక్తుఁడై నాడు నేఁడు ♦ నిష్ఠితవృత్తిన్. ౧౮

—♦ భరతశత్రుఘ్నులు కేకయనగరి కరుగుట ♦—

ఆ॥ కాన నితనిముద్దు ♦ గారవంబునుఁ జెల్లఁ, జూడు మనుడు దండ్రి ♦ సూక్తి యాద
లం గదించి యర్చ ♦ లుం గూర్చి యక్లిష్ట, కర్ము రాము వినతి ♦ కలనఁ దేర్చి.

క॥ తల్లులకు మ్రొక్కి గుణస, మ్పల్లలితుఁడు భరతుఁ డొఱపు ♦ మై లక్ష్మణు యో
గోల్లసితుఁ గౌఁగిలించియు, నెల్లరు నాపృచ్ఛనమున ♦ కెలయుఁగఁ దరలెన్. ౨౦

శా॥ ఆరాజన్యునితో నతం డరుగుచో ♦ హర్షంబు మర్షంబుఁ బెం
పారం దమ్ముని లక్ష్మణావరజు సౌ ♦ హార్దంబు చెన్నొంద స
త్ప్రారంభుం డయి తోడురమ్మనుచుఁ గో ♦ ర న్వాఁడు మేలంచురాన్
శ్రీరంజిల్లఁగఁ జేరి రయ్యెడ కవి ♦ క్షిప్తానురాగాఢ్యులై. ౨౧

తే॥ దొరయుశత్రుఘ్ను నిత్యశ ♦ త్రుఘ్నుఁ గొంచు
భరతుఁ డటులేగ రాముఁ డ ♦ ప్రాకృతుండు
లక్ష్మణునితోడ గురుసేవ ♦ ల న్మెలంగు
చుండె నిండుమనంబున ♦ నుత్పలాక్షి. ౨౨

క॥ శత్రుఘ్నుఁడు భరతునితో, మైత్రిన్ ద్వంద్వ మగుచుండు ♦ మఱి రాముని స
త్పాత్రుఁడు లక్ష్మణుఁ డెనయు వి, చిత్రం బిది పాయసాన్న ♦ శీలము బాలా.

ఆ॥ అందఱకును ఁ బొరపు ♦ లనరా వటంచు నే, మున్నె తెలిపినాఁడ ♦ మొనసివార
లట్టులరుగ నృపతి ♦ యాత్మసౌక్యమునకల్మి, నెంచుచుండె దినము ♦ లేణనయన.

క॥ ఇంద్రవరుణోపములు ని, స్తంద్రులు గుణసాంద్రు లట్లు ♦ తనయు లిరువు రా
చంద్రయశు లొందుదెస కరు, గం ద్రాసముఁ గొనఁడె వార్ధ ♦ కస్థితుఁ డెడఁదన్.

క॥ వారును విందులు బహుశ, త్కారము లొనఁగూర్పనైనఁ ♦ దండ్రిచెసనె చి
త్తారూఢి వెలయ నిలిచిరి, తీరుగ నొకకొన్నినాళ్లు ♦ దివిజస్తుత్యా. ౨౮

తే॥ అందఱును బ్రాణములు తేని♦కైన రాముఁ,డందరానిఫలం బని♦యాస మిగులఁ
గలదుగాని యెందును నది♦ గానఁబడదు, విభుల తలఁపులు దిరిసెన ♦ విరుల కావె.

క॥ నాలుగుభుజములతో నృపుఁ, డాలలి వర్తిల్లు పురుషుఁ ♦ డయ్యెనపో యే
లీల నెరవెంచనగు నో, లీలావతి; యెదియు నిందరి ♦ లీకం బగునే. ౨౯

ఆ॥ ఎద్దు మొద్దుఁ గాఁగ ♦ నెంచరే యవ్వానిఁ, గనులఁ గట్టినట్లు ♦ గానుపించు
రాముతేజు గొనము ♦ రాణ సత్త్వము సిరి;గాంచి హరి యటంచుఁ ♦గానఁడేని.

చ॥ పుడమియు వేల్పులు న్మొనసి ♦ పొక్కుచు మ్రొక్కిననాఁడు నల్వయుఁ
జడ నెడఁబాపు దయ్యమవు ♦ చయ్యనఁ బ్రోవు మటంచుఁ జేరి పా
ల్కడలినిఁ బండువాని ధృతిఁ ♦ గాంచి నుతించిన సోఁకుమూఁకలఁ
గెడపఁగ నేగుదెంచె నది ♦ కీర్తితమే కద ముజ్జగంబులఁ. ౩౦

తే॥ కడమవార లతని పరి ♦ కరము లంశ
భాక్త్వ మద్దానఁ దిరమయి ♦ పరఁగు నింత
ఱను మహీపాలు భాగ్యంబె ♦ ననుచుభాగ్య
మంగనరొ; యిట్టిసౌభాగ్య ♦ మరయఁ గలదె. ౩౧

ఆ॥ కన్నతల్లులెందుఁ ♦ గలుగరే కౌసల్య, యదితి యనఁగ నేమి ♦ యంతరమ్ము
కాంచెనా పెయింద్రుఁ♦గ నసీయమయు పేంద్రు, మొదలిమాటలరయ♦మొనయు నేల.

—♦ శ్రీ రామ గుణాభివర్ణనము ♦—

సీ॥ ఆరూపు గనుభాగ్య ♦ మబ్బుచోఁ గనులకు, తెప్పలతో వైర ♦ ముప్పతిల్లు
నాబీరమున కల్మి ♦ నరయుచోఁ బగఱకు, శస్త్రగ్రహణవాంఛ ♦ సడలిపోవు
నాయకటికపుఁబెం ♦ పందుచో సంద్రంబు, లేదు నొక్కండుగా♦ నెయిదఁజూచు
నాయోర్పుతీ ర్పెంచు♦టలవడుచోఁ గ్రూర,సత్త్వమ్ములకుఁ జిత్త♦ శాంతివొడము
నతనికుపమాన మున్న దే♦యతని కతఁడె,సాటి యనవచ్చుఁగాక ము♦జ్జగములందు
దశరథుండఁట తానెయీ♦దశరథునకుఁ, దనయుఁడై పుట్టెనఁట సుకృ♦తంబకాదె.

॥ తనుఁ బరుసము లాడునతం, డని యవని నొకండయేని ♦ నగపడఁ డున్నఁ
మనమున నిడఁ డవ్వాని, న్మొనయఁడు ప్రత్యుత్తరముల ♦ మొగకొని మెలఁపఁ.

తే॥ ఎట్లొనర్చిన నయ్యది♦యించుకైన,నొక్కయుపకారమునఁ దృప్తి ♦నొందుమఱవఁ
డెన్నియుపకారములు సేసి♦ రేనియునుఁద,లంపడయ్యాత్మవంతుఁబో♦ల్ప నొకఁడగునె.

తే॥ జ్ఞానశీలవయోవృద్ధ ◆ జనుల తోడ, శస్త్రవిద్యాధియోగ కు ◆ శలుల తోడ
సజ్జనులతోడఁ గాక ప్ర◆సంగ మెపుడు, జేయఁ బూనండతని మేల్మి◆చెప్పఁదరమె.

ఆ॥ అతఁడె బుద్ధిమంతుఁ◆డతఁడపో మధురస, మ్మాభషి పూర్వభాషి ◆ మహితవీర్యుఁ
డనఁగ నెగడుఁ గాని ◆ యాశ్చర్యపడఁ డెప్డుఁ, దనకుఁ గల సమర్థ ◆ తం దలంచి.

తే॥ పలుకనేర్చియుఁ బ్రియములే◆పలుకుఁగాని, యనృత మెప్పాట నేనాఁట◆నంటనీఁడు
సత్యమని యప్రియంబగు◆జాడఁబోఁడు, తనపయిని వచ్చెనేనియుఁ◆ దనుక డతఁడు.

క॥ వృద్ధులఁ బూజించు నసం, బద్ధముగా ననఁడు నగెడు ◆ పట్టుల నైనం
గ్రుద్ధుఁడయి పరుషవాక్కుల, నద్ధార్మికుఁ డెంచఁ డరుల ◆ నైన నలంపన్. ౩౯

తే॥ ఉత్తరోత్తరయుక్తి ప్ర◆యుక్తులరసి, సురగురుఁడు వానినుడి కెప్డుఁ◆ జొక్కుచుండు
నేవిరుద్ధకథల జోలి◆ యింతయుఁ గొన, డతఁడు మెచ్చువడయఁ డెట్టు◆లంబుజాక్షి.

తే॥ మెచ్చు స్వకులోచితం బగు ◆ మేలిధర్మ్ము, వచ్చమగు పరధర్మ్మ మ ◆ ట్లాదరించు
జన్నము లొనర్చువారల ◆ సన్నుతించు, రక్తిఁ గను నెప్డును బ్రజానుఁ◆ రంజనమున.

క॥ ఉత్తమకీర్తిని స్వర్గం, బెత్తఱినేనియు ఘటిల్లు ◆ నెంచుచు నుండున్
దత్తఱపడఁ డెద్దానం, దత్తత్త్వంబరయఁ గలఁడె ◆ దైవతపతియున్. ౪౧

క॥ దీనానుకంప నెఱపు న, దీనత వర్తిల్లు నెపుడు ◆ దేవుడపో వాఁ
డేనాఁడును బ్రాహ్మణపూ, జానుగ్రహములను మఱవఁ ◆ డద్రీంద్రసుతా. ౪౩

తే॥ అమ్మహామహు దెసఁ గ్రోధ◆మనఁగరాదు, వచ్చెనేనియు వ్యర్థమై◆ వలనుచెఱుప
దర్థ మర్థమ్ముతోఁ జేర్చి◆యతఁడుగూర్చు, గామమును నూలుపోఁగు చేఁ◆గట్టివైచు.

క॥ అశ్రేయస్కరమగు పని, సశ్రీకుఁడు మెచ్చఁ డెపుడు ◆ సంయముల యెడం
బ్రశ్రయము వీడి మెలఁగఁడు, నిశ్శ్రేయసపదవి నరయ ◆ నేర్చె న్నెఱపున్. ౪౫

ఆ॥ లేదు రుజ యటంచు ◆ లేఁ బ్రాయమే ప్రాయ, మతఁడు వాగ్మి చూడ◆నైనమేటి
యెఱుఁగు నేలఁ బ్రొద్దు◆నెదిరిసార మెఱుంగు, నెన్ని యున్న సాధు ◆ వెంతగలఁడొ.

క॥ ఇమ్మెయి నొండొంటిం గొని, యమ్మేటిం గొలుచుగొనము ◆ లారయుచుఁ బ్రజల్
సమ్మతిఁ బొదలుచె కా కా, యిమ్మె బహిఃప్రాణ మనుచు ◆ నెంచిరి మదిలోన్.

చ॥ చదువనివిద్దె లంచుఁ గొన ◆ సాగని ధర్మ్మపటంచు నర్థ మ
య్యది యిది యంచుఁ గోరికల ◆ య డ్డెడ సేయమి యంచు నయ్యెడన్
సుదతిరొ; పట్టిచూడ నొక ◆ చోద్యముఁ గన్పడ దెట్టిపుట్టువో
యెది యధియోగమో తలఁప ◆ నింతయు విస్మయ మెంతవారికిన్. ౪౮

ఆ॥ చదివె వేదములను ♦ సాంగంబులుగ వ్రత, స్నాతుఁడయ్యె ధనువు ♦ సంగడమున
నొండు లేఁడనంగ ♦ నొప్పారె సాధ్వితో, ధర్మసంగ్రహమునఁ ♦ దద్ద నెగడె.

క॥ దశరథుని మించె వశియై, నిశితాస్త్రకలావిలాస ♦ నిష్ణుండనయై
కుశలవరాభిజనుండై, విశదాత్ముండై యతండు ♦ విద్యావతిరో. ౫౦

ఉ॥ పెద్దలనెల్లఁ గూర్చికొని ♦ పెంపెనయింపఁగఁ జాలు ధర్మముల్
ముద్దులు మూటగట్ట నగు ♦ ముచ్చటల న్వెలయించుచుండు నే
ప్రొద్దునుఁ గానివారి దెసఁ ♦ బోవఁడు పోలనికర్జము గొనం
డద్దిర; వానిమే ల్వొడగ ♦ నౌనె ఫణీంద్రునకైనఁ జానరో. ౫౧

క॥ పురుషార్థము లన్నియు న, ప్పురుషోత్తము సొమ్ము లతనిఁ ♦ బోల్పంగలఁడే
పురుషుఁ డొకఁడేని జగముల, సరసవచస్సరణి వాని ♦ సరిజన మున్నే. ౫౨

క॥ ఆస్మృతి యాప్రతిభానం, బాస్మయరాహిత్య మెలమి ♦ యాసమయాచా
రస్మారకతయుఁ గని యహా, మస్మి యనం గలఁడె యెంత ♦ యధికుండైనన్.

సీ॥ కల్పము ల్వెలయింపఁ ♦ గాఁజాలు స్వాకార,మంత్రమనోగుప్తి ♦ మహిమ లెంచుఁ
గ్రోధహర్షముల ప్ర ♦ కోపము ల్గననోపు, సాయంబుగోరుట ♦ చేయు టరయు
త్యాగసంయమముల ♦ తఱి నెఱు ల్పరికించుఁ, బ్రజ్ఞాప్రసక్తుల ♦ భంగు లెఱుఁగుఁ
దనత ప్పెదిరితప్పు ♦ తారతమ్యముఁ గాంచు, నిగ్రహానుగ్రహ ♦ నియతిఁ బెనుచు

ననదు గొనఁడు ప్రతిభ ♦ యధిక భక్తివిశిష్ట, పలుకుమృదువు తంద్ర ♦ పాటు మొనయఁ
డెందు నేప్రమాద ♦ మెనయఁడు వాఁడహో, యీశుఁ డనఁగ జగతి ♦ నెల్లరకును.

ఆ॥ సంధివిగ్రహాది ♦ సంగ్రహాప్రగ్రహ, నిగ్రహంబు లరయు ♦ నియతి మించు
నాయమును వ్యయంబు ♦ పాయంబు నను నివి, న్యాయయుక్తిఁ బొనరు ♦ నతనికడను.

ఆ॥ ఎదిరిచిత్త మెఱుఁగు ♦ నెఱుఁగు శాస్త్రము కృతం
బెఱుఁగు ధర్మ మెఱుఁగు ♦ నెఱుఁగు న్యాయ
మెఱుఁగు స్థాన మెఱుఁగు ♦ నెల్లకలార్థవి
భాగభాగయోగ ♦ పథము లతఁడు. ౫౬

క॥ ఆశ్రమధర్మంబుల వ్యా, మిశ్రకముల తెఱఁగు లెఱుఁగు ♦ మేలుం గీడున్
సశ్రీకుఁ డరసి యొంట న, పశ్రముఁడై ప్రతివిధాన ♦ పద్ధతి నెఱపున్. ౫౭

ఉ॥ వారణవాజిముఖ్యముల ♦ వారణ మెమ్మెయిఁ బ్రేరణంబుఁ దా
నేరిమి నేర్చి కూర్చు నధి ♦ నేత రథిప్రవరుం డతండు దు

ర్వారుఁడపో దురంబున సు ♦ ర ల్సురవైరులు నెత్తివచ్చినన్
జేర నెదుర్పఁ బోకడవఁ ♦ జేకొనిప్రోవ సమర్థుఁ డంగనా. ౫౮

క॥ అతఁ డనసూయుఁ డదృప్తుఁడు, జితకాశి యజితుఁడు శూర ♦ జేత జితక్రో
ధతకు జితేంద్రియతకుఁ దగు, నతివరో ; యవ్వానిఁ బొగడ ♦ నజునకుఁ దరమే.

ఆ॥ అతఁడె చంద్రుఁ డయ్యె ♦ నాహ్లాదనము కాంతి, నెఱయుచల్లఁదనము ♦ నెగడుచుండ
వాఁడె సూర్యుఁ డయ్యె ♦ వరవిక్రమద్యోత, మఖిలదిశల జగతి ♦ నలముచుండ.

క॥ మచ్చరమున భూతములం, బెచ్చుపెరిఁగి యవమతింపఁ ♦ బెరయంబోఁడే
యొచ్చెము గాలముపై నిడఁ, డచ్చపలత నొడ్డి ధర్మ ♦ వడఁపఁ డొకపుడున్.

క॥ సమ్మతుఁడు త్రిలోకికి మహి, సమ్మోదితఁ జేయు నోర్పు ♦ సంగతమున వాఁ
డిమ్మగుమతిని బృహస్పతిఁ, గ్రమ్మెడుబీరమున నింద్రుఁ ♦ గవియు న్నవలా. ౬౨

ఆ॥ కలుగుప్రజలకెల్లఁ ♦ గమనీయతరములు, జనకుమదికిఁ బ్రీతి ♦ సంజననము
లైనగుణగణములను ♦ నతఁ డొప్పె దీప్తుఁడై, తనరుదీధితులనుఁ ♦ దపనునట్లు.

ఆ॥ తెలివి వృత్తి యప్ర ♦ ధృష్యపరాక్రమం, బెన్నరానిబలిమి ♦ యెలమికలిమి
వన్నెచిన్నె లెంచి ♦ వరియింపఁగాఁ బొంచి, యుండె రాజలక్ష్మి ♦ యుత్పలాక్షి.

క॥ సము నజితు లోకపాలో, పము సద్వృత్తాఢ్యు సుప్ర ♦ భావమహితు నె
య్యమున గణింపదె మేదిని, సుముఖుఁ డితఁ డధిపుఁడైన ♦ సొగియుదు ననుచున్.

— ♦ దశరథుండు రామాభిషేకముం గూర్చి యాలోచించుట ♦ —

తే॥ ఈదృశమ్ములు పెక్కు ల ♦ నీదృశములు
గానము లాతనియం దట్లు ♦ గొమరుమిగుల
మించి యూహించి దశరథ ♦ మేదినీంద్రుఁ
డపుడు డోలాయమానాత్ముఁ ♦ డై తనర్చె. ౬౬

ఆ॥ తనియ మనినవాఁడు ♦ తవిలి ప్రోచినవాఁడు, జరకుఁ జేతులొగ్గి ♦ చాఁపహాస
మిందునిభము రసము ♦ లెలయించు రాముమో, మట్లు గాంచి తనహృ ♦ దంతరమున.

ఆ॥ ఇంకఁ దనదుప్రాణ ♦ మేణాంకముఖము రా, మాఖ్య మేనుగాంచి ♦ యలరుచుండ
నెల్లప్రజల నెలమి ♦ నేలు టేర్పడనైన, భాగ్య ముత్తమంబు ♦ పరఁగునొక్కొ.

క॥ ఈతని యభిషేకమహము, చేత మ్మొప్పంగఁ గాంచి ♦ చెలఁగుదునే న
న్ప్రీతిఁ గనుఁగొందురే ప్రజ, లేతాదృశమే సమయమె ♦ యిఁక జడ నగునే.

క॥ చిరజీవినైతి వృద్ధత, జరకుం బాల్పడితి నిట్టి ♦ సంకటమున రే
దొర రాముమోము సిరి గని, దొరయుదునే ప్రీతి నేల ♦ దొరయితఁడనుచోన్.

ఉ॥ లోకము వృద్ధి గోరుకొను ♦ లోలుఁడు గాఁ డెడవెట్ట కేలఁగా
శ్రీకరి దృష్టి యొక్కటియె ♦ సిద్ధ మను న్మనఁబోవువారు న
న్నే కొనియాడునన్నెటికి ♦ నెక్కుడుగాఁగ గుణాఢ్యుఁడంచు మఱ్ఱి
జేకొనుచుంద్రు ముచ్చటలఁ ♦ జెల్లదె యీతని తేనిఁ జేయగన్. ౨౧

తే॥ ఇతఁడె పర్జన్యుఁ డోయంచు ♦ నించుచూడ్కి
గురియుచుండును శుభము లా ♦ గుఱికి మిగుల
నింద్రు నెలయించు గురు మించు ♦ వినతనూజు
నెంచు ధృతిమతిదాంతుల ♦ నెనయుసిరుల. ౨౨

ఉ॥ అన్యనృపాలదుర్లభము ♦ లైన గొనమ్ములు రాముఁ జేరి య
నన్యములై సమృద్ధిఁ గను ♦ టారసి యిమ్మెయి మిన్నకున్న సా
మాన్యుఁడ నౌదుఁ గాక మహి ♦ మాన్యుఁడ నౌదునె నాదుమేలిసౌ
జన్యము ముద్దులానిసిరిఁ ♦ జక్కఁగఁ గాంచనిదారి దక్కనే. ౨౩

తే॥ ప్రియతరుం డటె ప్రజలకుఁ ♦ బ్రీతిఁబెనుచు
నటె తనకు గుణవత్తరుం ♦ డటె వదాన్యుఁ
డటె జగం బేలుచుండ నా ♦ యట్టిఁ డించు
కనులఁ గనుఁగొంచు సుఖియింపఁ ♦ గాంచవలదె. ౨౪

తే॥ ఆత్మపత్నీరతుఁడు సుజ ♦ నాభిరతుఁడు, ధర్మనిరతుఁడు నిత్యస ♦ త్యవ్రతుండు
నైన నాముద్దులయ్య నే ♦ ననఁగరాదు, గాని నాకన్న నన్నిట ♦ ఘనుఁడతండు.

క॥ లోకములం గలవే యి, ట్లీకలికిగొనమ్ము లనుచు ♦ నిందఱుఁ బొగడన్
నాకుచితమైన పద్ధతి, గైకొనుటే మేలు తడయఁ ♦ గా దిటమీఁదన్. ౨౫

తే॥ అనుచు లోకోత్తరగుణో త్త♦రునకు రామ, భద్రునకు భద్రపీఠాధి♦పత్య మొసఁగఁ
బ్రాప్తకాలం బుచిత మంచు♦భవ్యమైన, తలఁపునం దలపోసి య♦ర్థం బెఱింగి. ౨౬

క॥ దివ్యాంబరభౌమములగు, భావ్యర్థోత్పాతజములు ♦ భయము లరసిమే
నవ్యయముగాని తెలుఁగు జ, రావ్యాప్తియు నెంచి సఖుల ♦ రావించి వెసన్. ౨౭

తే॥ తనయభిప్రాయ మెఱిఁగించి♦తగినయుక్తు, లెల్ల వినిపించి యవ్వారి♦యెలమిఁగాంచి
రాముఁ గల్యాణధాముని ♦ రాజుఁ జేయ, నంతరంగవినిశ్చయం ♦ బాచరించి.

క॥ యువరాజు రాముఁ డిఁక నం, చవనీతి తొలంగ నాడి ♦ యందఱు మేల్మే
లవు నంచు సచివు లొక్కటఁ, జవులేర్పడఁ బలుకు పలుకు♦సంగతిఁ గొనుచున్.

దశరథుండు మండలంబునం గల పౌరజానపదముఖ్యులఁ బిలిపించి యవ్వారితో ముచ్చటించుట.

క॥ నానాపురవాస్తవ్యుల, జానపదుల నట్లు రాజ ♦ సామంతుల న
ప్డానృపతి పిలువనంపెను, శ్రీనెగడెకు తనదుముద్దు ♦ చెల్లింపంగన్. ౮౧

క॥ జనకునిఁ గేకయరాజును, జననాథుఁడు పిలువనంప ♦ సంభ్రమపడఁ డే
మనియో మనీషితము వా, రనంతరము సంతసింతు ♦ రౌఁ గా కనుచున్. ౮౨

ఆ॥ తగినవిడుదు లొసఁగి♦తద్దయుఁ బూజించి, వారిఁ గాంచి విభుఁడు♦వఱలె మిగులఁ
దసదుదృష్టిలోనఁ ♦ దవిలినప్రజలఁ బ్ర, జాధినాథుఁ డరసి ♦ యలరినట్లు. ౮౩

క॥ పౌరులు జనపదవాసులుఁ, బేరోలగమున్నతనదు ♦ పెంపు వొగడ న
వ్వారల నెల్లఁ గనుంగొని, సారవిచారుండు పలికె ♦ జడ నెడసిచనన్. ౮౪

తే॥ దుందుభిస్వనకల్పమై ♦ తోరమగుచు, నతని గంభీరమగు స్వర ♦ మపుడు వొల్చె
జీవనంబిడి లోకంబు ♦ చే పెడల్చు, నాఘనాఘను నాదంబు ♦ ననుకరించి. ౮౫

చ॥ తొలఁగదు రాజలక్షణము ♦ త్రోవ నొకింతయు వానియమ్మహో
జ్జ్వలవచనంబు మేలిచొర ♦ వం దిరమై వరమైత్రి నెల్లవా
రల హృదయంబులన్ దొరసి ♦ ప్రాఁకిడఁ జాలుచు భవ్యవర్తనం
బుల నెలయింపుచున్ రసము ♦ పొం పెనయింపఁ దొడంగు హంగునన్. ౮౬

క॥ తపమునిరిఁ గాక తనకా, సుపరమవైభవము చొప్ప ♦ చొప్పడునే యా
నృపతి రమాపతి రాముని, విపులేంద్రు నొనర్పఁ దలఁచు ♦ విధి విస్మితమే. ౮౭

క॥ ఓయన్నలార ; నాదెస, మీయభిమానంబుకలిమి ♦ మేలిమి యెపుడుం
బాయనిదై యెసలారుట, నీయనువునఁ బొసఁగుకర్జ ♦ మేర్పఱుపనగున్. ౮౮

తే॥ మీ యెఱుంగనియది లేదు ♦ మేలుగాంచు
పొంటె నందఱు మదిఁ దోఁచి ♦ పొనరుతలఁపు
నాతలం పగుచుండు నే ♦ నాఁడునైన
నరయు టొప్పువు ననుచు ని ♦ ట్లడుగువాఁడ. ౮౯

సీ॥ పాలించి రిలయెల్లఁ ♦ బ్రథితులు మావారు, బిడ్డలట్టులు ప్రజ ♦ ల్పెనుపుగాంచ
నాథును ల్డొక్కిన ♦ యదియె మార్గము గాఁగ, నేమెలంగితిఁ గద ♦ నేఁటివఱకు
నందను ల్నలువురు ♦ నాకుదయించి ర, య్యాశునిసత్కృప ♦ నింతవట్టు
దారసంగ్రహణంబుఁ ♦ దద్దయుఁ బొనరంగఁ, జేసి విద్దెల దరిఁ జేర్పఁ గంటి

వెల్లగొడుగునీడ ♦ వేవుర మేలెఁచి, యిడినయీశరీర ♦ మిట్లు జరకుఁ
జిక్కె నివ్వడైన ♦ నక్కటికం బూన, వలదె విడిచిపుచ్చ ♦ వలను సూపి. ౯౦

క॥ ఇమ్మె నిఁక విశ్రాంతిం, గొమ్మని విడకున్న మనదు ♦ గొనకొని చిరకా
లమ్ము మనెఁ గాన నాతలఁ, పిమ్మనవిని మేలుకీడు ♦ లెంచుఁడు మీరల్. ౯౧

తే॥ రాజతేజోవిశేషాను ♦ రక్త యవశి, దుర్వహా నికామగుర్వి యా ♦ దోర్బలమునఁ
దాల్మి వహియింప నోపితి ♦ ధర్మధురను, నేఁ డతిశ్రాంతి నొందితి ♦ నెఱి తలంగ.

తే॥ మీయభిప్రాయ మరయున ♦ మ్మేలు గాంచి, పుత్రునొక్కని నిద్దానఁ ♦ బొనరఁగూర్చి
యే గతక్లేశతం గొన ♦ నిచ్చఁ బూని, యున్నవాఁడ మహోన్నతు ♦ లెన్నఁగనుఁడు.

ఆ॥ నన్నుఁ బోలి పొడమె ♦ నాయన్న గొనముల, జ్యేష్ఠుఁ డందఱకు న ♦ చింత్యుఁ డెందు
నింద్రుఁబోలు బీర ♦ మింతనియనరాదు, పరపురంజయుండు ♦ ప్రథితయశుఁడు. ౯౪

క॥ అనురూపుఁ డతఁడు లక్ష్మికి, సనాథుఁడై తనర మేలి ♦ సౌజన్యమునన్
జనముల జననాథుల మె, చ్చెనయంగలవాఁ డటంచు ♦ నెంచినమతితోన్. ౯౫

ఉ॥ చందురుఁ డల్లపుష్యభము ♦ చాయకునా సుదినంబునందు నా
సుందరమూర్తి నయ్యనఘు ♦ సూనృతవాగ్గురు యావరాజ్య ల
క్ష్మిం దనివొందఁ గూర్చునెఱి ♦ కిం దగవెంచి తలంచితిం దరం
బెందును గాఁగ మీమతుల ♦ నిందఱుఁ గాంచి వచింప వేఁడెదన్. ౯౬

ఆ॥ ఎల్లొనర్చువాఁడ ♦ నేది పథ్యము ప్రియం, బేనె యంటిననుచు ♦ నెంచ కెఱిఁగి
యెఱుక సేయుఁ డెందు ♦ నేనాఁడు మధ్యస్థు, లెల్ల యరసిపలుకు ♦ హితమె హితము.

ఆ॥ అనుచు నొడువునృపతి ♦ యామిన్కులకు నృవు, లలరి మేలు మేల ♦ టంచునాడఁ
దొడరి రెలయుధ్వనులఁ ♦ దోయదం బిడువానఁ, దేఱు నెమ్మిగముల ♦ తీరు నెఱయ.

ఉ॥ అందఱయందు రూపుగని ♦ యాదట మీఱిన యానినాద మ
ష్డందము చందముం గలది ♦ యై నలిరేఁగి విమానమెక్కి సం
స్పందము గూర్చునన్నెఱికి ♦ జాలి దివం బవలోకనంబు సే
యం దెలివొందె నట్టిరస ♦ మారసియే రసికుండు గాఁదగున్. ౯౯

క॥ ధర్మార్థము లెఱిఁగిన యా, నిర్మలభావానుభావు ♦ నెఱి నారసి స
త్కర్ములు ద్విజు లన్యులునవు, డర్మిలి రామానువృత్త ♦ మగు చిత్తముతోన్.

—♦ దశరథునకుఁ బ్రజలెల్లరుఁ దమయభిప్రాయం బెఱింగించుట ♦—

ఆ॥ ఇట్లు నొడివి రెనసి ♦ యెల్ల రాలోచించి, సమతఁ గూర్చు బుద్ధి ♦ సఖ్య మెడల
నీక యెఱుక యింత ♦ యేనియుఁ దలఁగక, సురుచిరాధ్యపదముఁ ♦ జూచుచుండ.

ఉ॥ వృద్ధుఁడవైతి కాకసద ♦ వే బహువర్షసహస్రముల్ప్రజా
బద్ధము చిత్త మొప్ప నెఱిఁ ♦ బాలనసేసితి వింకఁ జాలు సం
బద్ధ నొనర్పు మాసిరికిఁ ♦ బట్టుగ రామవిభుద్ధరాసతీ
పద్ధతియుం గృతార్థత వి ♦ భావనకుం జనవిచ్చుచుండఁగన్. ౧౦౨

తే॥ అలక లల్లాడఁ బొనరారు ♦ నమ్మొగమునఁ, బట్టరేఖికచొప్పు వి ♦ భాసురముగ
మంగళస్ఫూర్తినభిషేక ♦ మహమొనర్పు, మిందఱము, గోరుచున్నది ♦ యిదియసుమ్ము.

ఆ॥ ఇచ్చ నెగడఁ గొంతు ♦ మెప్పుడెప్పుడు మహో, భుజబలుండు రాముఁ ♦ డజితుడెలమి
భద్రగజము నెక్కి ♦ పార్థివుం డగుకళ్మి, వెల్లగొడుగునీడ ♦ వెలయుటరసి. ౧౦౪

ఆ॥ అనెడువారినుడుల ♦ కాతఁ డానందించి, యెల్ల వెల్లడించు ♦ టిచ్చగించి
పలికెఁ దనగభీర ♦ భాషణంబుల చెల్వ, మపుడు క్రొత్తవయసు ♦ ననువుపఱుప.

ఉ॥ ఎందులనేని నేఁకొఱఁత ♦ లెడ్డెపెటుఁ బాటిలకుండ నెల్లర
న్నందనుల న్ఘనంగనెడు ♦ నాయము దోఁపఁగఁ బ్రోచినాడ మీ
రందఱు నేకలక్ష్యమతి ♦ యాధృతి నన్గనుచుండువార లా
చందము వీడి యిట్లనఁగఁ ♦ జాల నెఱుంగ భవన్మనోగతుల్. ౧౦౬

ఆ॥ ఏను నొడువునంత ♦ నింద ఱొక్కఁడు గాఁగఁ, దొడరి పలుకునుడుల ♦ తోడి జాడఁ
దెలియవచ్చె మున్న ♦ తీర్పొనరించి యి, ట్లనఁ దలంచి యునిచి ♦ నట్టి తెఱఁగు.

క॥ కావున మీ రెంచినయది, యే వెరవుననో యెఱుంగ ♦ నే వేఁడెదఁ ద
ద్భావానుక్రమమున నెఱి, భావించి మెలంగువాఁడ ♦ భావ్యర్థమునన్. ౧౦౮

క॥ అని వింతవిధము దోఁపఁగ, ననియెడు రాజేంద్రుఁ గాంచి ♦ యందఱు కొకఁడై
ఘనరా రెడు నౌత్సుక్యం, బనువున నొండెనయనీయ ♦ నన నని రగజా. ౧౦౯

—♦ దశరథునకుఁ బ్రజలు రామునుగుణంబులెల్లఁ దెలుపుట ♦—

సీ॥ కలుగువృత్తులతోడి ♦ కలనకు లోబడ, దెదిరిపల్కులనన్న ♦ కెదురువడదు
కల్యాణవృష్టు లే ♦ కాలంబు గురియించు, నభయదానమున కే ♦ నని కడంగు
సజ్జను లీప్సయులౌ ♦ సంగతి వివరించుఁ, దొడరురాకాసుల ♦ దుడుకడంచు
నాపాలిటిదె జగ ♦ న్నాట్య మంచు నటించు, నిచ్చలు సంతోష ♦ నిరతిఁ దవులు
నేమనందగు నయ్య; మ ♦ హీమహేంద్ర;, రాముచరితం బసామాన్య ♦ రసభరితము
వేలుపులకెల్ల నోరూరు ♦ విధము సూప, నొడ్లమాట కొకట నొక్క ♦ యూహగలదె.

మ॥ వినుమయ్యా; రఘునందనా; జగతి నీ ♦ విశ్వాత్ముని౦ బోల్పఁగా
ననువౌనాతఁ డొకండ యేనిఁ గలఁడే ♦ యాదిత్యవంశోద్భవుల్

జననాథుల్ ఘను లెందఱెంద ఱిలపై ♦ జానొందు శ్రీ నెక్కొనన్
గన రిమ్మేటిప్రభావ మెల్లెడల న ♦ గ్గంబౌ నెఱిం గాంచెడిన్. ౧౧౧

క॥ నాసత్యసముఁడు రూపున, వాసవసముఁ డెల్లదివ్య ♦ వరగుణముల ధీ
వ్యాసక్తి బృహస్పతినిభుఁ, డేసందియ మందవలవ ♦ దినకులతిలకా. ౧౧౨

తే॥ ఓర్పుమతి నీక్షమాసతి♦యొకటఁ జాల, దితఁడు బీరమునను విష్ణుఁ♦డెంచి చూడఁ
జందనంబునఁ దా దీటు ♦ చందురునకు, నెట్లు ధర్మంబునను ధర్ముఁ ♦ డింత నిజము.

తే॥ ఉట్టిపడినది సిరిఁ జెల్మి♦ నొరసికొనుచు, సత్య మెడయని ధర్మ వా♦ సరసు నెడను
సాంత్వయిత గాఁడె యితనికి♦సకలజనులు, వశ్య లెమ్మెయిఁ గాకుండు♦వారలనఘ.

వ॥ ధర్మమర్మజ్ఞుం డన నతండ కాక యొండొకండుం గలండె సత్యసంధుండగు నవ్వాఁడు సత్యవాది గాకుండునే, యమ్మహానుభావునిం గూర్చి శీలవంతుండన నితండపో యననివార లెవ్వరు, క్షాంతుండు దాంతుండు శాంతుండు కృతజ్ఞుండు విజితేంద్రియుండు శ్లక్ష్ణుండు మృదుఫు స్థిరచిత్తుండు ప్రియంవదుండు ననసూయకుండు భూతదయాపరుండు నన రఘురాముఁడే సుమీ యను మాయందఱ చిత్తంబులు నిరంతరంబును నొండువృత్తుల జోలి మఱచి వర్తిల్లుచున్నయవి బహుశ్రుతుల వృద్ధుల బ్రాహ్మణుల నుపాసించుటెఱుం గన్నియతాత్ముని వలననే యెఱుంగం దగి యుండు, దానన కాదే యాదేవసన్నిభుని యశస్తేజోబలంబులు నిరంతరాభివృద్ధి నందుచున్నయవి, దేవమానవగంధర్వాద్యస్త్రవిదుండై కోదండపాండిత్యవిచక్షణుం డగుటం జేసి కోదండరాముఁ డని శూరులెల్లం బేర్కొనియెదరు, సాంగవేదవేత్తయై వ్రతస్నాతుం డయ్యె, గాంధర్వకలావైశారద్యంబున నయ్యనిరుద్ధు నిద్ధరలో నెవ్వారు పోలువారు, భరతాగ్రజుండు శ్రేష్ఠులు ధర్మార్థకోవిదులును నగు ద్విజోత్తములచే నభివినీతుండై మహామతి యయ్యె, నాకల్యాణాభిజనుండు సాధువయ్యు నదీనాత్ముం డగుట మెచ్చవలవదే, నాగరజానపదాభ్యుదయంబు గోరి సౌమిత్రిసహితుండై యరిగి దూరంబునం దిరంబై జయలక్ష్మి వలచిరాఁ గొనిరానితఱి యని యొక్కండునుం గలదే, పోరికలని వలని గెలుపుగొని యేతెంచి యెల్లరం గనుంగొని తేఁడు స్వజనంబులఁ దండ్రి యౌరసాపత్యంబుల నట్లు దారపుత్రాగ్నిప్రేష్య శిష్యగణంబులం గూర్చి పేరుపేరువరుస నుగ్గడించి యందఱ కుశలంబులు నమందానందరసంబు పెనుపొందం బ్రశ్నించు నాప్రశ్రయంబు సాధారణంబె, నిచ్చలుం బనిగొని విప్రోత్తములం గని భవదీయ శిష్యవర్గంబు లనర్గళంబుగా శుశ్రూష లొనరించుచున్నవారలే; యని పదంపడి కడమమేలివార్తలు విచారించుచుండు. ప్రజలవ్యసనంబుల కత్యంతదుఃఖితుం

డగు నుత్సవంబులం బరికించి పరితుష్టిం గాంచు, నుత్తరోత్తరశ్రేయోవిశేషం
బులం గూర్పం బ్రయత్నించు విరుద్ధకథ లాతనికి రుచింపవు. సూనృతభాష
ణంబులు భూషణంబులు యుక్తిప్రయుక్తు లాతనియెడ సానురక్తులు రాజేంద్రా;
యాసత్యవాది యావృద్ధసేవి యమ్మహేష్వాసుం డాశౌర్యవీర్యపరాక్రమ
సంపన్నుం డావిజితేంద్రియుం డాధర్మాశ్రయుం డాస్మితపూర్వాభిభాషి యాసు
భ్రూవిలసితుం డయ్యాయతతామ్రాక్షుం డాలోకాభిరాముండు రాముండు దీప్త
తేజోమయుండై సూర్యునట్టులు ప్రీతిసంజననుండగుచుఁ జంద్రునట్టులు శాంత
ములు సర్వప్రజాకాంతములు నగు గొనంబుల సాక్షాద్విష్ణువట్టులు నేకొఱంతలుం
బెరయనీక మమ్మరయవలవదే, ముజ్జగంబులుం బోషింప నేర్చుమేటి కొక్క
మహీ లెక్కయే చక్కనై చిత్తం బొండొక్కదెసం బాఱనీక నిత్యప్రపన్నులమైన
మాపిన్నపంబవధరింపుము. ౧౧౪

సీ॥ ప్రజలఁ బాలించుత♦త్త్వమున మేకొనుఁ గాని, రాగోపహతిఁ దీవ♦రంబు గనఁడు
క్రోధప్రసాదము♦ల్గాని మెలంగునుఁ గాని, వెడ నొంటి గైకొని ♦ వెలితిపడఁడు
వధ్యుల దండించు♦వలను గాంచునుఁ గాని, యెందు నవధ్యుల ♦ యెడకుఁ బోఁడు
గుణతుష్టిమై మేళ్ళ♦గురియించునే కాని, యెందువ్యాజం బిడు♦ నూహఁ బెరయఁ
డతని మేలుము లెన్నియో♦యభినుతింపఁ, దరమె సురలకు నాగుణ♦ధాము రాము
లోకనాధు నాధునిఁ గాఁగ ♦ లోలయగుచుఁ, గోరుచున్నది మేదిని ♦ కువలయేశ.

ఆ॥ ఇట్టిబిడ్డఁ బొడవె ♦ నేమిపున్నెమొ కాని, నీకుఁ గాశ్యపునకు ♦ నేర మేము
పొగడ నెట్టులైన♦భూమీంద్ర మాపల్కు, లాదరింపు మిదియె ♦ యభిహితంబు.

ఉ॥ నిచ్చలు వేఁడుకొందు రెద ♦ నెక్కొనువేడుక నూళ్ళఁ బల్లెలన్
సచ్చరితు ల్లామ ల్మగలు ♦ సాగిలి మ్రొక్కుచు సంజ వేఁకువన్
బొచ్చె మెడల్చి మ మ్మెపుడుఁ ♦ బ్రోచునుఁ గావుత రాముఁ డిందఱన్
మెచ్చునుఁగాత మంచు మతి ♦ మీఱు ప్రపన్నత నెల్లవేల్పులన్. ౧౧౬

తే॥ మనుజు లని మాత్రమే కాదు ♦ మహిత భూత
వితతి యెల్లెడ నుత్కట ♦ వెలయుచున్న
యదియ లో వెలి యన కొక్కఁ ♦ డౌతలఁపున
రాము శుభమే శుభం బని ♦ రాజచంద్ర. ౧౧౭

క॥ ఇందఱు మేళ్ళం దలఁచి స్ఫు, రిందీవరవర్ణునకు మ ♦ హీరాజ్యశ్రీ
కిం దిరమగు పొం దొనగూ, ర్పం దలకొను మతిసమృద్ధిఁ ♦ బడసెద మధిపా.

తే॥ ఇంక జాగేటికయ్య ! మ ♦ హీంద్ర ! దేవ
దేవుని నిఖిలైకవిహితు వి ♦ దేహరాజ
జామనోహరు నభిషిక్తుఁ ♦ జక్కఁగాంచు
మాకనుల యింపు వెలయింప ♦ మలయుమయ్య. ౧౨౧

క॥ అని దోసిలొగ్గి వేఁడెడు, ననఘుల దోయిళుల నాతఁ ♦ డందికొనుచు ని
ట్లనెఁ బ్రియములు హితములునై, పొనరారెడు పలుకుబడులు ♦ పొలుపారంగన్.

—♦ దశరథుండు నిజాభిప్రాయంబు వెల్లడించుట ♦—

ఆ॥ నాయభీప్సితంబె ♦ నాయన్నలార; మీ, రెలమిఁ గోరినదియు ♦ నెంచిచూడ
నసదృశప్రభావ ♦ మందితి నేఁటికి, జన్మసఫలతాప్ర ♦ సక్తితోడ. ౧౨౩
క॥ నా జ్యేష్ఠపుత్రుఁ బ్రియతము, రాజ్యశ్రీ తోడఁ గూర్ప ♦ రాదే యను మీ
పూజ్యోక్తి కలన నే సా, మ్రాజ్యము పై మెట్టు మెట్టు ♦ రహిఁ గనఁ గంటిన్.

ఆ॥ నేఁడె మోవఁగలఁడె ♦ నినువు వాఁ డింతలో, భార మనుచు నాదు ♦ ప్రజ్ఞ సూపు
వలన కాంచినాడ ♦ వారక మీప్రబో, ధమున మేలిధృతిని ♦ దనరినాడ. ౧౨౫

*క॥ వహియింపఁజేయువాఁడను, రహి నింకిట రాము రాజ్య ♦ రమణాత్మున ని
మ్మహిభార మెల్ల నోజన్, సుహితం బగు మీమనంబు ♦ సూపుపథమునన్.

—♦ దశరథుండు రామాభిషేకంబుం గూర్చి వశిష్ఠాదులం బ్రేరేపించుట ♦—

తే॥ అనుచు వారల లాలించి ♦ యరుస మెసఁగ, నందఱును వినుచుండ మ ♦ హాత్ములౌపు
రోహితులఁగాంచి చిత్తని ♦ రూఢి తనర, నిట్టులనెఁ బూలవెలయించు ♦ నెలమిమించి.

క॥ ఇమ్మహితచైత్రమే సిరి, కిమ్మగుమాసమ్ము కాన ♦ నేందిర చెలువం
బెమ్మెలుఁ దనరెడు నాచి, త్తమ్మలరెడు మేలుగనెడు ♦ తాత్పర్యమునన్.

ఉ॥ శ్రీరమణుండు రాము నభి ♦ షేకమహోత్సవ మాచరింప సం
భారములెల్లఁ గూర్చి తగు ♦ పద్ధతిమై మలయింప నేర్చువా
రీరల కారె నాతలఁపు ♦ లెప్పుడు మీకృతులన్ ఫలించు వి
ద్యారమణీయమూర్తు లిది ♦ యంతయు సిద్ధ మొనర్పుఁ డమ్మెయిన్. ౧౨౯

ఆ॥ అనెడు రాజు నుడుల ♦ కానందసందోహ, వీచికాసహస్ర ♦ విదిత మగుచు
నాసభాసముద్ర ♦ మప్పుడే యుప్పొంగి, వెల్లివిరిసి దెసల ♦ వెలయుచుండె. ౧౩౦
క॥ శాంతి పొనరు టారసి మహి, కాంతుఁడు నిజగురు వసిష్ఠు ♦ గాంచి మహాత్మా;
చింతింపుము రాముని మహ, మంతయు నీయదియ తగిన ♦ యాజ్ఞలు గూర్పన్.

—♦ వశిష్ఠుం డధికృతుల కాజ్ఞ సేయుట ♦—

ఆ॥ అనినఁ జిత్తగించి ♦ యధికృతులం గాంచి, వామదేవుఁ దోడి ♦ వానిఁ గాని
రూఢిఁ గూర్చికొని య ♦ రుంధతీజాని యిట్లనుచుఁ బలికె నెల్ల ♦ యును వెఱింగి.

సీ॥ బంగరు లోనుగాఁ ♦ బరఁగు లోహంబులు, సకలరత్నంబు లో ♦ షధులు బలులు
స్వచ్ఛమాల్యములు లా ♦ జలు పృథగ్భూతమ,ధ్వాజ్యంబు లహతంబు ♦ లంబరములు
స్యందనాయుధములు ♦ చతురంగసైన్యముల్, భద్రగజంబు సం ♦ పన్మహితము
శ్వేతాతపత్రంబు ♦ వింజామరలు ధ్వజం, బాశాతకుంభకుం ♦ భీశతంబు
హైమశృంగము వృషము స ♦ మగ్రము పులి
చర్మమును మున్నుగా వస్తు ♦ సమితి నేర్చి
కూర్చికొని వేఁగుఁబోఁక కొఁ ♦ గోసలేంద్రు
నగ్న్యగారంబు ప్రాంతంబు ♦ నందు నిలుప. ౧౩౩

ఉ॥ అంతిపురంబు ద్వారముల ♦ నన్నిటి వింతలు సేసి బాహిరా
భ్యంతరసీమలం దళుకు ♦ లందములుం బరఁగించి వీధివ
ప్రాంతరగోపురప్రకృత ♦ యా నెలవెల్లఁ బటీరచంద్రవ
ల్ల్యంతహిమాంబుసంతతుల ♦ నౌ శుభసత్కలన ల్ఘటింపఁగన్. ౧౩౪

క॥ కస్తూరీమలయజముల, శిస్తుగ నలుకులును మేలి ♦ చిఱుముత్తెములన్
నిస్తులములు ముగ్గులునుఁ బ్ర, శస్తములుగ వీట నగుఁ బ్ర ♦ సక్తిం గూర్పన్.

తే॥ చాందినీ ల్గూర్చి ధూపప్ర ♦ శస్తిఁ బెనిచి, మేలితోరణ లొదవించి ♦ మేటిధ్వజము
లెత్తిపురికన్నె తనకుఁ దా ♦ నెలమిమీఱె, రాము నెఱిగోర నౌప్రచా ♦ రణ నెఱపుఁడు.

తే॥ గణన కెక్కిన గణికలు ♦ గణికలట్లు, వికసనము విలసనముల ♦ వెలయుచుండు
నాద్వితీయ యనందగు ♦ నట్టి కక్ష్య, నాటపాటల నెలకొల్ప ♦ నానయిడుఁడు.

ఉ॥ శస్తము సద్గుణంబు శుచి ♦ సంభృత మన్నము పాయసాన్నముల్
స్వస్తిదులౌ ద్విజోత్తములు ♦ సంతస మంద ఘటించి తన్మహా
పాస్తి యెలర్పఁ బెట్ట విన ♦ యం బెనయ న్బహుభూరిదక్షిణల్
ప్రస్తుతు లొప్పఁ బంచియిడఁ ♦ బ్రస్తుతము న్బొనరింపుఁడా మదిన్. ౧౩౮

తే॥ ఘృతపయోదధివార్ధులు ♦ కేవలముగ, నెఱయనగు నొంట నెట్టన ♦ నియతిదనర
నర్థులు సమృద్ధు లౌ తెఱం ♦ గాచరింపుఁ, డెల్లిమొదలిడి యాశంస ♦ లెనయఁగనుఁడు.

క॥ దేవాయతనంబులఁ జై, త్యావసథంబులను నగరు ♦ లందును ప్రగ్భూ
షావస్త్రచందనాదుల, గావింపుఁడు సత్కృతుల ని ♦ కామసమృద్ధిన్. ౧౪౦

ఆ॥ ప్రపలు సంతరించి ♦ ప్రాప్తకాలం బెంచి, నిర్మలోదకములు ♦ నిమ్మపండ్ల
రసము లూరఁగాయ ♦ లెసఁగులాజలు సక్తువులును నొసఁగుచుండ ♦ వలయుఁబ్రీతి.

తే॥ సూర్యుఁ డుదయించునంతలో ♦ సురుచిరముగ
స్వస్తివాచనసూక్తి ప్ర ♦ శస్తి వలయు
నమితమర్యాద లొప్ప బ్రా ♦ హ్మణుల మున్ను
గ నగు నామంత్రణ మొనర్ప ♦ గని భజింప. ౧౮౨

క॥ సన్నద్ధులై సుయోధులు, మున్నే యిన్నాథునగరి ♦ ముంగిట వీథిన్
బన్ని నిలువనగు నన్నిటి, కి న్నలువగు వేసములఁ బ్ర ♦ కీర్తితు లగుచున్. ౧౮౩

ఆ॥ అనుచు నధికృతులకు ♦ నాజ్ఞాపన మొనర్చి, యాగురూత్తములు మ ♦ హాత్ములెలమి
నరసి యెల్లఁ గూర్చి ♦ యధిపునితో సిద్ధ, మయ్యె నని రతండు ♦ హర్ష మొంద.

క॥ ఆదట సుమంత్రుఁ గనుఁగొని, మోదముతో నృపుఁడు రాము ♦ మోహనమూర్తిన్
వే దోడి తెమ్ము నాదగు, నాదైవము సఫల మయ్యె ♦ నని నొడువుటయున్.

— ♦ శ్రీరాముండుఁ దండ్రియొద్దకు వచ్చుట ♦ —

వ॥ మహాప్రసాదం బని యాతండు పనివిని శ్రీరామచంద్రుని సందర్శించి తండ్రి యానతి నెఱింగించి మహనీయంబగు స్యందనరాజంబుపై నారాజసింహ కిశోరంబు నునిచికొని రాజమార్గంబున నమ్మహారాజ సభాంగణమ్ము సేరంజేర నరుదెంచు నయ్యవసరంబున దశరథుండు ప్రాచ్యులు నుదీచ్యులుఁ బ్రతీచ్యులు దాక్షిణాత్యులు వనశైలాంతవాసులు నగు భూమిపాలురుం గొలువఁ బ్రాసాదస్థుండై నిఖిలదిక్పాలోపాస్యమానుండయి సుధర్మాస్థానంబు నధిష్ఠించి యున్న వాసవు ననుకరించి నిండుకొలువుండి కుమారమణిరత్నంబు సమాగమంబు వేచు నిజదృష్టు లౌత్సుక్యంబు పెనుపార నవ్వలనునకై నిగుడం బరికించి పరితోషపరీవాహంబు సముత్సాహంబు తోడం గూడ బరాబరులుసేయ నెక్కొనుచుండ నగు నాసుధాసాగరప్రవాహంబునం దేలియాడుచుండు నయ్యఖండోత్సవాభిముఖ్యంబున. ౧౮౬

సీ॥ వ్యోమయానంబున ♦ యోజకా తేరిపై, గంధర్వవిభుకళ్మి ♦ గవియువాని
చందురుబింబంబు ♦ సన్నాహమునఁ దొంటి, ప్రియదర్శనోత్కటతఁ ♦ బెనుచువాని
నాహార్యకౌదార్య ♦ కాకృతిగుణముల, మగల చూడ్కులనేనిఁ ♦ దిగియువాని
విశ్వపాలనధురా ♦ విధి నెంచు సత్త్వమ్ముఁ, బురుషకారముతోడఁ ♦ బూన్చువానిఁ
జేరి ఘర్మాభితప్తుల ♦ సేదఁదేర్ప, వచ్చు పర్జన్య వలనున ♦ వఱలువాని
రాణఁ దనరారు నారఘు ♦ రాము నాత్తకాముఁ గనుఁగొనెఁ గన్నుల ♦ కఱవుదీఱ.

క॥ తనివో కమ్మయి దశరథ, జనాధిపుఁడుఁ దోడివారుఁ ♦ జక్కఁగనుచో
వినయ మలర నరదము డిగి, చనె రాముఁడు గురునిఁ జేర ♦ సరసిజనయనా.

క॥ సూతుఁడు సాంజలియై తోఁ, నేతేరఁగ రజతశిఖరి ♦ నెనయు విమానం
బొతటి సీతారమణీ, చేతోహరుఁ డెక్కె మేలి ♦ సిరి గిరిజాతా. ౧౪౯

ఆ॥ నామ ముచ్చరించి ♦ నమ్రభావం బొప్ప, తండ్రిచరణముల క ♦ తండు మ్రొక్కి
కెలన నిలిచె నాదిఁగి♦కేల్దోయి మోడ్చి య,య్యనువు ముద్దుసేసె♦ నధిగుణాఢ్య.

క॥ అయ్యంజలితో రాముని, నయ్యధిపుఁడు పట్టి తివిచి ♦ యాసుకృతం బె
ట్లయ్యెనొ తనకౌఁగిటిలోఁ, జయ్యనఁ గదియించెఁ బరవ ♦ సంబునఁ దరుణీ.

తే॥ కడఁగి యభ్యుదితము నూత్న ♦ కనకరత్న
భాసుర మతం డొసఁగె నుత్త ♦ మాసనంబు
రాముఁ డద్దానిపై నుండి ♦ ప్రభలు నిగుడ
మేరుగిరిమీఁదఁ దోఁచిన ♦ మిహిరుఁ డయ్యె. ౧౫౨

ఆ॥ వింతయనఁగ నయ్యె ♦ వెలఁదిరో; శారద, చంద్రుఁ డతఁడ కాఁగ ♦ సభ్యు లెల్ల
గ్రహము లుడులుఁ గాఁగఁ♦గల్యాణధామం బ, నంగ నదియ కాఁగ♦నాఁటి కపుడె.

—♦ దశరథుండు శ్రీరామునకు రాజనీతిపరిపాటిం దెలుపుట ♦—

ఉ॥ ప్రాణముప్రాణ మట్లు తన ♦ పట్టిఁ గనుంగొని యప్డు ఱేఁడు వి
న్నాణము నూత్నమా వయసు ♦ నాఁ డెలరారిన తన్నుఁ దాన యీ
పోణిమిఁ గంటి నంచుఁ దల ♦ పోయుచు స్మేరదృశాప్రసక్తిమై
వాణి వొసంగఁ గాశ్యపుఁడు ♦ వాసవుతో ననురీతి నిట్లనెన్. ౧౫౪

తే॥ పుత్రవంతులలో నెల్లఁ ♦ బొగడు గంటి, జ్యేష్ఠపత్ని యశస్విని ♦ సిరి వెలయఁగ
సదృశి సదృశుని నినుఁగన్న♦జాడ [illegible]డ, నన్వయము పావనంబైన♦ యన్వయమున

క॥ గొనముల ప్రో విటఁ డనఁ దగి, యనురంజితులం బొనర్చి ♦ తందఱ నీవి
య్యనువునఁ బుష్యభయోగం, బున యువరాజత్వ మెనసి ♦ పోఁడిమి గనుమీ.

క॥ ప్రకృతివినీతుఁడ వీ వతి, సుకృతివి గుణవంతుఁడవు వి ♦ శుద్ధుఁడ వైనన్
వికృతిగొననీని నీతి న, నుకృతికినై తెలుపుదు న్మ ♦ నోగతమైత్రిన్. ౧౫౭

సీ॥ పరిపాటిమై నింకఁ ♦ బ్రబలింపు వినయమ్ము, నయమునబాట నే ♦ నాఁట విడకు
మాజితేంద్రియత ని ♦ త్యమ్ము నేమఱకుము, కామంబుఁ గ్రోధంబుఁ ♦ గట్టిపెట్టు
మెడనెడ వ్యసనంబు ♦ లెగువ లోఁబడకుము, ప్రకృతిరంజనముకై ♦ పాటుపడుము
ప్రజల లోవెలివృత్తి♦ పట్టుల మేల్కాను, మెదిరి ప్రారంభంబు♦ లెఱుఁగఁ గనుము

కోశదండసమృద్ధి నె ♦ క్కొఁనఁ బొనర్పు
మెప్పుడును సహాయసంపత్తి ♦ నెనసి మనుము
రామ ; యిబ్భంగిఁ బాలించు ♦ రాజు నమరు
లమృత మట్లు జనులు గాంచి ♦ యలరుచుంద్రు. ౧౫౮

క॥ కావున నీదగుచిత్తం, బేవేళఁ దలంగనీక ♦ యెనయుము సిరి నీ
వీవల నరసి మనినఁ దల, పూవాడక యుండ నెందుఁ ♦ బోలును దనయా.

తే॥ అన్న యీనుడి మఱవకు♦మన్న; నాదు, కీర్తి వెలయింపు మన్న నా♦కీర్తికాముఁ
డలరి యంజలిపూని తా ♦ నవధరించె, శిరమునఁ దదాజ్ఞ శేష వి ♦ శేషవిదుషి.

క॥ అయ్యెడ రామప్రియజన, మయ్యనువున నుడులఁ గోస ♦ లాత్మజ మ్రోలన్
జయ్యన వివరించినచోఁ, దొయ్యలి తద్రసభరమునఁ ♦ దోఁగెడుమదితోన్.

తే॥ పారితోషిక మ్మ ♦ పారమ్ముగా నిడి, వేలుపులనుఁ బుడమి ♦ వేలుపులను
బూజసేసెఁ బొగడెఁ ♦ బూబోఁడి ధవునిమా, నసము వృత్తి పావ ♦ నత్వ మబల.

క॥ గోవులు హిరణ్యములు ర, త్నావళు లంబరములును సు ♦ తాదృత కొల్ల
ల్గావించెఁ గోసలుని సుత, శ్రీవిలసిత యగుచుఁ దనదు ♦ చిత్కళ లొలయన్.

క॥ అచ్చోట రామచంద్రుం, డచ్చపుఁజిఱునగవు చంద్రి ♦ కాన్వయమునఁ దా
నిచ్చమెయి మెలఁగఁ దలఁగని, మెచ్చున మేకొనెడుతగవు♦ మెలఁకువదొలఁకన్.

క॥ వందన మొనరించి దశ, స్యందనుని యనుజ్ఞవడసి ♦ స్యందనిదై సం
క్రందనునట్లు జనులు సుర, వందుల గతిఁ బొగడ మేల్మి ♦ వఱలఁగఁ దరలెన్.

—♦ నగరికరిగిన రామవిభుని దశరథుండు మఱలఁ బిలిపించుట ♦—

తే॥ వైజయంతమునకు సాటి♦వచ్చు మేలి, కళల పుట్టిల్లు తనదున ♦ గరు వెరయఁగ
నరిగె నాతండు పౌరులు ♦ నంతలోన, చనిరి జేజేలఁ బూజింపఁ ♦ జంద్రవదన.

ఉ॥ ఇంటికి రామదేవుఁ డటు ♦ లేగిన మంత్రులు దాను నెంచి య
ప్పంటవలంతి యేలిక శు ♦ భం బెదఁగోరి సుమంత్రుఁ జూచి యీ
వెంటనె తోడితెమ్ము రఘు ♦ వీరుని బొమ్మన వాఁడు వోయి యా
యొంటునఁ దుంటవిల్తుఁ డన ♦ నొప్పెడునాతనిఁ జేరి చెచ్చెరన్. ౧౬౭

తే॥ అన్న; తోడ్తెమ్మనియె నాథుఁ ♦ డన్న నింత
లోఁ బిలువనంప నెట్టిమే ♦ లో; యటంచు
రాముఁ డన గుణధామ; మొం ♦ డేమివలయు
భువనమోహను నినుఁగాంచు ♦ బుద్ధి దక్క. ౧౬౮

క॥ ఆనరనాథుని యానతి, నే నరుదెంచి తెలిపితి మ ♦ నీషివరేణ్యా
యేనేరిమిమెయి నెరపెదొ, నీనెఱియె ప్రమాణ మనుఁడు ♦ నియతి దలిర్పన్.

ఆ॥ తొంటియట్లె వెడలి ♦ ద్వారమందిరము సేర, నరిగి రాక సేర్చి ♦ యానవడసి
యతని పాదయుగళి♦నల్లంతఁ గని దోసి,లొగ్గి కదిసి మ్రొక్కి♦యొదుఁగుటయును.

ఉ॥ నందనుఁ జేరఁగాఁ దివిచి ♦ నాథుఁడు మున్నెటు లట్లు కౌఁగిటన్
బొందుగఁ గూర్చి భూషిత సు ♦ పూజితమై తగు రత్నపీఠికన్
సుందరమూర్తిఁ దార్చి పరి ♦ శుద్ధము భావికలానుబద్ధమౌ
చందము నందఁగాంచునుడిఁ ♦ జాల్కొనఁ జేసెఁ దలోదరీమణీ. ౧౭౧

ఉ॥ వృద్ధుఁడ నైతి రామ; పలు ♦ వేలును నేడులు సెల్లె రాజ్య మ
త్యృద్ధముగాఁ జెలంగెఁ దగ ♦ నిష్టము దత్త మధీతమున్ రసా
విద్ధములై మహాక్రతుని ♦ వేశనము ల్సమకూరె నెం దసం
బద్ధముగాని సౌఖ్య మను ♦ భావముతోడఁ దనర్చె నింతకున్. ౧౭౨

క॥ దేవర్షిపితృద్విజసం, భావనలం బొనరె నన్నృణ ♦ భావము లే దిం
కేవిధనయేనిఁ గొఱఁత, మ, హావిస్తృత ; త్వదభిషేక♦ మొక్కటఁ దక్కన్.

క॥ నిను మెచ్చెద రెల్లరు నా, మనము త్వదాయత్తమై సు ♦ మాళముమై వి
న్నను వరయుచున్నయది నా, యనునుడి విని యట్లొనర్ప ♦ నగు నీకనఘా.

సీ॥ కాలదోషంబునఁ ♦ గాన్పించుచున్నవి, కలలోనఁ గొన్ని దు ♦ ష్కారణములు
పిడుగుచప్పుడు నొంటఁ♦బెనఁగొంచుఁ బెడిదంపు, టుల్క రాలంగంటి♦నుప్పరమున
స్తంభించినది నాదు ♦ జన్మనక్షత్రంబు, దుష్టగ్రహావలి ♦ తొడరి నేఁడు
సమకూరుచున్నవి ♦ సాత్త్వికాంగికములు, చిహ్నంబు లమ్మెయిఁ ♦ జేటు దెలుప
గాన నిన్ను సకలరాజ్య ♦ కలితుఁ గాఁగఁ, జేసి యభిషేక మొనరింపఁ♦జిత్తమందుఁ
దలఁచి మేకొన్న కృతి కింకఁ♦దామసింప, వలవ దాయత్తపడు మిదె♦వలను వత్స.

క॥ ఆపద లొరయక మును పే, నీపా లొనరింతుఁ గలిమి ♦ నీవధిపుఁడవౌ
దేపట్టున నెట్లు నన, న్నాపద్దెలయంగ వలదె ♦ నయమార్గవిదా. ౧౭౬

మ॥ ఎపుడో యేమొ యనంగఁ బ్రాణులమతు ♦ ల్మైతుస్థితు ల్చంచల
ల్నిపుణంబౌ నెఱి నేమము న్నెఱుపులే ♦ నిద్దంపుఁగృత్యంబు నేఁ
డె పునర్వస్వధియుక్తుఁడయ్యె శశి యో ♦ యీ ; పుష్యభం బెల్లి యే
విపరీతంబులుఁ దోఁపకుండఁగనె భా ♦ వింతు న్సమర్థత్వమున్. ౧౭౭

శా॥ దర్భప్రస్తరశాయితం గొనుఁడు వ ♦ త్సారత్నము నీవు సం
దర్భం బియ్యదె సుమ్ము నీకెఱుకసేఁ ♦ తం గోరి రమ్మంటి నే
దుర్భావు ల్మనుఁ జేరకుండ సుహృదు ♦ ల్దోట్పాటు పాటించుచున్.
నిర్భేదత్వముతోడ నిల్వ నగు నా ♦ నిర్ణీతి రూపింపుమా. ౧౬౮

ఆ॥ పరఁగు నిట్టిమేళ్లు ♦ బహువిఘ్నములు నాఁగ, నేది యెట్టులైన నింతవట్టు
భరతుఁ డిల్లుదొఱఁ ♦ బాటింపఁ డొండెడ, నుండె నిదియు నుచిత ♦ మొకటఁ జూడ.

క॥ సత్పురుషుఁడు త్వత్సేవా, తత్పరుఁడు జితేంద్రియుండు ♦ దయగలవాఁ డే
యుత్పాతములకుఁ జొరఁ డటు, చిత్పథయోగప్రథావి ♦ శిష్టుఁడ యతఁడున్.

ఆ॥ ఎట్టులైనఁ జిత్త ♦ మేకరీతిన నిచ్చ, లుండఁబోదు నరుల ♦ కొదవుకాల
మరసి ధర్మనిత్యు ♦ లాచరింతురు కర్జ, మట్లుగాన నిదియె ♦ యభిహితంబు. ౧౭౧

క॥ కావున నీవంగనతో, భావుక మభిషేక మెల్లి ♦ పరఁగుట కనువౌ
నావలనున నిలఁబడు మొం, డేవెర వెంచకుము మహము ♦ లెనయుము రామా.

—♦ శ్రీరాముఁడు మాతృసన్నిధి కరుగుట ♦—

చ॥ అని యిటు లానరాధిపతి ♦ యానతిసేయఁగఁ జిత్త మంచు మే
కొని రఘుసింహ మాతృగృహ ♦ కుంజము సొచ్చియు నంతలోనె యం
బనుఁ గన నెంచి యమ్మనికి ♦ పట్టునకుం జనె స్వీయ ముత్సవం
బనుపద మెచ్చరించుధృతి ♦ నాయమఁ దేర్చుతలంపు పెంపునన్. ౧౭౩

సీ॥ సౌమిత్రియు సుమిత్ర ♦ జనకజాతయుఁ దన్నుఁ, జేరి కొల్వఁగ సిరిఁ ♦ జెలువుమీఱి
క్షౌమవాసినియై ప్ర ♦ శాంతి దేవాగార, మున వాగ్యతత్వంబు ♦ మొనయఁగాంచి
యానిమీలితనేత్ర ♦ యగుచు నమ్మెలెంచి, పురుషోత్తముని విశ్వ ♦ మూర్తిఁ దలఁచి
ధ్యానక్రమం బేక ♦ తానత్వమున నొప్ప, నంతరం బెడయింప ♦ నర్థి వేఁడు
కొనెడు సచ్చరిత్రఁ ♦ గోసలాత్మజఁ దన, తల్లిఁ దఱిసి మ్రొక్కి ♦ దాశరథి వి
నీతి తనరఁ బలికె ♦ నెఱితోడి దగుచు వా, గ్విలసనంబు వింత ♦ వెరవుసూప.

ఉ॥ అంబ; నియుక్తుఁ జేసె జగ ♦ మాదృతిఁ బ్రోవఁగ నన్నుఁ దండ్రి భ
వ్యం బభిషేక మెల్లి యుప ♦ వాసము నీస్నుషయుం బొనర్చి నే
మంబుమెయి న్మెలంగ నగు ♦ మానితులౌ గురు లయ్యలుం బ్రబో
ధం బెలరారఁ బల్కి రటు ♦ తత్పరత ప్ఘటియింపు మవ్విధిన్. ౧౭౫

ఆ॥ మఱియు నెఱపఁ దగిన ♦ మంగళాచారముల్, నాకు జనకజకు స ♦ నాథవగుచు
నడుపు మెపుడు మదిని ♦ ననుచుకోరిక లిట్లు, ఫలముగాంచె ననుచు ♦ భవ్యచరిత.

క॥ అనునుడి యమృతరసపుజడి, నునువిన్ననువున తెఱంగు ♦ నూల్కొలుపఁగ న
య్యనఘు ప్రహర్షరుఁడిం దే, లి నితాంతవికాసమై ల ♦ లిం బలికెఁ జెలీ. ౧౭౮

సీ॥ మనుమన్న; చిరకాల♦మును నీదు పరిపంథు, లుడిఁగిపోదురుగాత ♦ మడరు దొడర
సిరిగాంచి యెల్లసంశ్రితుల బంధులఁ బ్రోవు, మెపుడు సుమిత్ర మే♦లెడఁద నిడుము
మంచినక్షత్రమ్ము ♦ మలయువేళన తోఁచి, తెలసె నీగొనముల ♦ కినకులీనుఁ
డెక్కుతిఁ బరకాష్ఠ ♦ కెల్లవారలు మెచ్చ, నానోము లెంతలో ♦ నాయమునకుఁ
బుష్కరేక్షణుఁ డమ్మహా ♦ పురుషు నీకు,నిచ్చగొలుచుచునుంట కీ ♦ నెఱిని భాను
వంశ్యరాజ్యమహాలక్ష్మి శ్ర♦వారక నినుఁ, జేరునిమ్మెలు గనఁగాంచు ♦ సిద్ధివొడమె.
క॥ కల్యాణధామ; రామా, కల్యము వెలసె వెలయింపు ♦ కాఁగలగుణసా
కల్యమును భాగ్యవతి కౌ, సల్యయ యని యెల్లప్రజలు ♦ సంతస మెనయన్.

మ॥ అని దీవించుచుఁ బల్కు తల్లినుడు ల ♦ ట్లాలించి మేలెంచి య
య్యనుజు న్నమ్మునిఁ గాంచి నీయదియ యి ♦ య్యర్థంబు నాజీవితం
బన నీవే సకలేప్సితంబులు గొనన్ ♦ హర్షంబు మర్షంబునన్
బెనుపం జూడుము పున్నము ల్వైరయునా ♦ పేర్మి న్ప్రశంసింపుమా. ౧౮౦

క॥ అనయము జగతీభృతి నీ, పని యనుకొని మెలఁగు మనుచు ♦ బలికి జననులం
గని మ్రొక్కి జనకజాతకు, ననుజ్ఞయిడి స్వకగృహమున ♦ కరిగె గిరిసుతా. ౧౮౧

తే॥ అందుఁ గాంచనరత్నసిం ♦ హాసనమున
నుండె జానకి కొలువ సు ♦ ఖోచితుండు
లలితనీలోత్పలశ్యామ ♦ లతనుఁ డతను
సుందరుఁడు భూషితుఁడు స్మేర ♦ సుముఖుఁ డతఁడు. ౧౮౨

—♦ శ్రీరాముని యొద్దకు నారదుండు వచ్చుట ♦—

క॥ ఆరాము నపుడు గనుఁగొన, గారామున వచ్చె మేని ♦ కాంతి దెసలకుం
దీరగు వెండిమెఱుంగిడఁ, బోరోగిరఁపుందపస్వి ♦ పున్నెము వెలయన్. ౧౮౩

సీ॥ ఉదయించుశరదిందు ♦ నుజ్జ్వలశోభమై, నిర్మలత్వంబున ♦ నెగడువాని
నంతిపురి న్మట్ట ♦ నాకసంబున నుండి, పటికంపుమెట్లులు ♦ వన్నువానిఁ
బిలిచిన నో యను ♦ బిరుదంపునెఱజాణ, వీణ మాధురి చొక్కు ♦ వెనుచువాని
భాగీరథీపయో ♦ భరితమౌ కరక మొం, డొకకేల నెక్కొన ♦ నొప్పువానిఁ
గాంచె నమ్మౌనిఁ గమలజుఁ♦గన్నతండ్రి, సీతయునుఁ దానుఁ జెచ్చెరఁ♦ జెలువుమీఱ
నెదురుకొనె భక్తిఁ బూజించె♦నిమ్ము సూపెఁ, గేలు మోడ్చె నుతించె సం♦కీర్త్యచరిత.

క॥ పరమ యగు ప్రీతి నెక్కొ-నఁ, బరమర్షిం జూచి రామ ♦ భద్రుఁడు పలికెన్
దరమే ; యిమ్మె లొందం, దరమే ; యింకిట నొకంటఁ ♦ దద్దయు నాకున్. ౧౯౫

ఉ॥ మానివరేణ్య ; నాసుకృత ♦ మండల మెల్ల ఫలించె సంస్కృతిన్
మానక సక్తచిత్తతఁ బ్ర ♦ మాప్రతిభాసితవృత్తి నుండు మా
కీనెఱి నీదుదర్శన మ ♦ నీదృశలభ్యము లబ్ధమై శుభా
ధానవిదానమై పరఁగి ♦ తత్పరత న్విలయంగఁ జేయఁగన్. ౧౯౬

క॥ దీనఁ గృతార్థతఁ గాంచితి, నైనను మీరాక పేర్మి ♦ నందిన యర్థం
బేను వరించి తరించెద, నానతి సేయవె మహాత్మ ; ♦ యనుపద మనినన్. ౧౯౭

—♦ నారదకృత శ్రీరామ స్తవరాజము ♦—

క॥ ఆభక్తవత్సలునిఁ గని, యాభద్రాత్మకుఁడు తపసి ♦ యనెఁ జనునే యి
ట్లోభువనాధీశ్వర ; సం, క్షోభం బొనగూర్చు భావ ♦ సూచనఁ బెనుపన్. ౧౯౮

తే॥ మోహసాగరమున మున్న♦మునిఁగియున్న, వారి ముంపంగ వలెనె సం♦సారినసుచు
నెట్లు లోకైకసంసారి♦వీవ యగుటఁ, గానరే; త్వత్కృపాయు క్తిఁ♦గాంచుఘనులు.

చ॥ జగములకెల్ల నాదియు న ♦ జన్మయు నై నెగడొందుమాయ ని
న్నగనిఁగఁ గొన్న యన్నెఱిని ♦ మానితమై పరమేష్ఠిముఖ్యులం
ద్రిగుణమయాత్ములం గనెఁ ద ♦ దీయమ యీభువనత్రయంబు మ
న్కిగ గృహమేధివై తదియుఁ♦ గీర్తితమై తనరారుచుండెడిన్. ౨౦౦

తే॥ ఆపె లోహితశుక్లకృ ♦ ష్ణాత్మభూత, మా ప్రభావంబు సామగ్రి ♦ యై పొసంగ
నీదు తేజం బొలసి చేసె ♦ నిఖిలమా చ, రాచరంబు జగంబు మ ♦ హాద్భుతముగ.

సీ॥ నీవు విష్ణుఁడవు నీ ♦ దేవి జానకి లక్ష్మి, శివుఁడవీ వాయమ ♦ శివ తలంప
బ్రహ్మవీ వాసాధ్వి ♦ భారతి శుద్ధాత్మ, సూర్యుండ వీవ యా ♦ సుప్రభ ప్రభ
వాయు వీవు గతిప్ర ♦ వాహిణి యమ్మాత, శ్రీదుండ వీవు నీ ♦ చెలువ కలిమి
రుద్రుండ వీ వామె ♦ రుద్రాణి శశికాంతు, లగ్నియు స్వాహాయు ♦ ననఁగ నిట్టు
లగుదు పున్నామవాచకం ♦ బరయ నీవు
నెందు స్త్రీవాచక మన న ♦ య్యిందుముఖియుఁ
గాన నన్యప్రసక్తి జ ♦ గత్త్రియంబు
నిర్మితిఁ బొనర్పఁ బాలింప ♦ నేర్తు రామ. ౨౦౧

వ॥ త్వదీయాభాసంబగు నజ్ఞానం బవ్యాకృతం బనం దనరారు నయ్యదె జగజ్జాలంబు
నకు మూలంబు, దానివలన మహదాఖ్యతత్త్వంబు నద్దాన సూత్రాత్మయు

దానంజేసి సర్వాత్మకంబగు లింగశరీరంబునుం దోఁచు నయ్యాది యహంకార బుద్ధిప్రాణేంద్రియాత్మకంబై జన్మమృత్యుసుఖాదిసంభావనాభావితంబై జీవసంజ్ఞా సముపచితంబై భాసిల్లు నద్దాన భూతభౌతికసంఘాతసంజ్ఞాతంబగు స్థూలంబు వొడముఁ దొల్లింటిదగు నవాచ్యానాద్యవిద్య కారణంబుగా నీ సూక్ష్మంబు స్థూలంబునుం గూడి చిదాత్మున కుపాధిత్రితయంబగు నాచిదేకరూపుఁడగు పరమాత్ముం డేతద్విశిష్టుండై జీవుండును వియుక్తుండై పరమేశ్వరుండు ననం బరంగుచుండు. ౨౦౩

తే॥ సొరిది జాగ్రత్త స్వప్నము ♦ సుప్తియు నను, మూడవస్థలు నెద్దాని ♦ మూర్తు లట్టి
సంసృతికి నెప్పుడును విల♦క్షణుఁడ వీవు, చిన్మయాత్మత సాక్షివై ♦ చెలఁగుకతన.

క॥ నీయంద పొడము జగములు, నీయం దభివృద్ధిఁగాంచు ♦ నీయం దడఁగుఁ
నీయఖిలకారణత్వ మ, మేయం బద్దాన నెపుడు ♦ మెయికొనునభవా. ౨౦౪

ఆ॥ భాసిలంగఁ జేయు ♦ పద్ధతి నీయది, యెల్లదేహబుద్ధు ♦ లింద్రియములు
సిరి దలిర్ప దానఁ ♦ జిన్మాత్రమగు జ్యోతి, వాత్మ వీవ యైతి ♦ వన్నిటికిని. ౨౦౫

క॥ రజ్జువు నెడ నహిబలె నీ, పజ్జఁ దనుప్రభృతిఁ గాంచి ♦ భ్రమఁగొను నజ్ఞుం
డజ్ఞాల మెడలి నినుఁ గను, సజ్జనుఁడు సుఖాత్ముఁడై ప్ర ♦ శస్తి వహించుఁ.

ఆ॥ కాన నజ్ఞభావ ♦ కలనఁ జూపట్టిన, యాజగమ్ము జ్ఞాన ♦ మచ్చుపడినఁ
గాని తలఁగఁబోదు ♦ కలుగ దాజ్ఞానంబు, నీపదాబ్జనిరతి ♦ నెఱయకున్న. ౨౦౭

క॥ ఆభానుఁడు రాఁ దమమటు, లాభాసం బెడలు జ్ఞాన ♦ మలవడినం దో
డ్తో భూమానందమయుం, డౌ భక్తుఁడు త్వత్ప్రసక్తి ♦ ననవద్యగుణా. ౨౦౮

తే॥ నేను నిచ్చలు నిను భక్తి♦నిరతిఁ గొల్చు,ఘనుల సేవించువారి కిం♦కరుఁడఁ గానఁ
గానఁబడకుండఁ జేయుము♦కామమోహ,కలికలుషకర్మములు సత్య ♦ కామరామ.

శా॥ నీనాభీసరసీజమందుఁ ద్రిజగ ♦ న్నిర్మాత యాధాత తా
నై నల్వొందెఁగదే తదాత్మజుఁడ నీ ♦ కద్దానఁ బౌత్రుండ ని
న్నే నాఁడుఁ భజియించువాఁడ జగతీ ♦ హేతుప్రకాశాకృతీ
నానోము ల్ఫలియింపఁ జేయు మఖిలా ♦ నందానుసంధాయివై. ౨౧౧

ఆ॥ అనుచు నతు లొనర్చి ♦ యానందబాష్పప, రిప్లుతుండు సుఖప ♦ రీతమాన
సుండు పులకకులకి ♦ తుండునై యిట్లని, పలికె మునివరుండు ♦ కులుకులాఁడి.

మ॥ కలదే యొండొకఁ డీవెఱుంగనిది నా ♦ కన్నయ్యఁగన్నయ్య య
న్నలుమోముల్గలవేలు పంప నిటకు ♦ న్నారాక నీరాక య

త్తులువ స్రావణుఁ ద్రుంపఁగాఁడె యెటులొకొ ♦ ద్రోవంగఁ ద్రోవం గలో
తృలికా; చూడ్కి నిగిడ్చి యాప్రతిన సం ♦ ధానింప ధ్యానింపవే. ౨౧౩

క॥ కన్నదెక న్నగునని నినుఁ, గన్నయెడయుఁ డిపుడె యోగ ♦ కలితుఁ బొనర్పం
దిన్ననివిన్ననువున మే, ల్పన్నగడం బన్నె నదియు ♦ భాగ్యమ కాదే. ౨౧౪

తే॥ సత్యసంధుండ వీవు రా♦జ్యమ్ముభార,మెనసి భూభార మెడయించు♦టెడ మొనర్తొ
యనుచు క్షోభిల్లుచున్నవా ♦ రమరులెల్ల,నీదయాదృష్టి నెదఁగోరి ♦ నియతిమీఱి.

క॥ అన్నియు నీకర్జములే, యన్నా; యెటు సేయ నెడఁద ♦ నాలోచనముం
బన్నినవాఁడవొ యదియే, కన్నాకగు నొడ్లకేల ♦ కలవరపడఁగన్. ౨౧౫

క॥ అని ముని నొడివిన మోమున, ననీదృశంబగు స్మితం బ ♦ హమ్మని సిరి మే
కొన నిట్లనె రాముఁడు తన, మనోగతం బయినభావ ♦ మంజిమ తనరన్. ౨౧౬

ఉ॥ నారద; నాయెఱుంగనిది ♦ నా నొకఁ డెందును లేదు తొల్లి యే
తీరున నానసేసితినొ ♦ తీర్చెద నన్నియు నట్లె యింక భూ
భార మనంగ నేల తముఁ ♦ బట్టినకర్మముఁ బాయు నన్నిటన్
నేరిమి సూపువాఁడఁ గని ♦ నిర్ణయమున్ గనఁగాంతు రాదటన్. ౨౧౭

తే॥ ఎల్లి యిడినముహూర్తమే ♦ నెంచికూర్తు, దండకారణ్యగమనవి ♦ ధానమునకు
నిలుతు మునివేషధారినై ♦ నెటిఁ జతుర్ద,శాబ్దములుఁ గానికర్జ మెం♦డవలఁ గలదె.

క॥ ఈయబల చాలదే యెది, యేయనువునఁ బొనరఁజేయ ♦ నేనియు నని చి
చ్ఛాయ దులకింపఁగా రఘు, నాయకుఁ డెటిఁగింపఁ దపసి ♦ ననిచెడు వేడ్కన్.

ఆ॥ మూఁడుబరులు దిరిగి ♦ మొనసి సాష్టాంగప్ర, ణామ మొనరఁ జేసి ♦ రామ ; నాకు
నానయిడితె పోవ ♦ నాఁగదె యింకిట, ననుచుఁ జనె యమీంద్రుఁ ♦ డబ్జవదన.

క॥ ఈసంవాదము విన్న మ, హాసామ్రాజ్యమ్ము నెనయ ♦ నొదురు జనులా
భాసము తలఁగ సుఖాత్మత, కౌసంస్మృతివిరతి దోఁప ♦ నగు యోగమునన్. ౨౨౨

క॥ అంతట రాముఁడు సంతస, మెంతయుఁ దొనఁకంగ సీత ♦ హేలాగతివా
క్యాంతరము లంతరాత్మకు, వింతదనం బొలయఁజేయ ♦ వెలయుచునుండన్. ౨౨౩

—♦ రాము నగరునకు రాజప్రేరితుండై వశిష్ఠుం డరుగుదెంచుట ♦—

సీ॥ అచ్చట నరనాథుఁ ♦ డాచార్యవర్యు వ, శిష్ఠు రావించి వి ♦ శిష్టుఁ డగుచుఁ
బూజించి మహనీయ♦పుణ్యాహ యోగాప్తి, కై యుపవాస యో♦గ్యాత్ము రాము
గ్రమమొప్పఁ బొనరింపఁ♦గావలయున కాదె, యనవు డట్టుల చేయ♦నగు నటంచు
బ్రాహ్మ మర్హం బయి♦పరఁగెడురథ మెక్కి, మంత్రిసుమంత్రుండు♦మలసి నడుప

మూడుకక్ష్యాంతరమ్ములు ♦ మొనసి కడచి, పాండురాభ్రనిభంబు త ♦ ద్భవన మొలయు
నంతలో నరుదెంచి రా ♦ మావనీంద్రుఁ, డమ్మునీంద్రుని గొని లో ని ♦ కరిగె నగజ.

క॥ బంగరుసింగపుగద్దియ, నంగజనిభుఁ డాత్మగురుని ♦ ననువారఁగఁ జే
ర్పం గాంచనకలశోదక, మంగన వోయంగఁ గడిగె ♦ నతనియడుగులన్. ౨౨౫

తే॥ సీతతోఁ గూడి చెలువమ్మ ♦ చెలువముగనుఁ, దజ్జలంబు శిరంబునఁ ♦ దార్చి నేర్చి
పలికె నంజలిసేసి య ♦ ప్పలుకు వెలఁది, మగనిమదిపుట్టుదబిసి వి ♦ స్మయము మొనయ

క॥ ఏ నెంతధన్యుఁడనొ యి, ట్లీనీశిష్యుండ నగుట ♦ కేనోములు ము
న్నేనెటి నోమితినో కదె, మౌనిపతీ ; యింతకన్న ♦ మాన్యత కలదే. ౨౨౭

తే॥ నీయడుగులాని కడిగిన ♦ నీర మిదియ
ద్వార మగుఁ గాదె ముక్తికిఁ దత్త్వ మరయ
వేల్పులెల్లరుఁ గాంక్షించు ♦ విధముఁ దెలియ
మనుజు లొకలెక్క యీ దయా ♦ మయ ; సహృదయ. ౨౨౮

క॥ మున్నె పావన మయ్యెఁ బ్రబ, పన్నం బీవంశమెల్ల ♦ భవదర్చాసం
పన్న మగుట నేఁటికి నే, నున్నెఱిఁగనఁగంటిఁ దొంటి ♦ నుతకృతి కతనన్. ౨౨౯

— ♦ వశిష్ఠుఁడు రాముని గొనియాడుట ♦ —

ఆ॥ అనెడు మాయలాని ♦ యానుడు లారసి, యనె నరుంధతీప్రి ♦ యాంతరంగుఁ
డిట్టులాడఁ జను నె ♦ యే నన్యుఁడనె పూర్వ, గాథ యెఱిఁగి యొందు ♦ గఱపవలెనె.

మ॥ భవదీయాంఘ్రిజలంబు తీర్థమని సం ♦ భావించి తాల్పంగ న
బ్భవుశీర్షంబున నిల్చి యమ్మెయిధృతిం ♦ బ్రఖ్యాతిఁ గాంచె న్నదీ
ప్రవరాభిఖ్యఁ బవిత్రులై రటులె యా ♦ బ్రహ్మాదులు న్నేఁటిసం
భవ మెంతే యఖిలోపదేష్టవు కలా ♦ ప్రావీణ్య మెంతేఁ దగన్. ౨౩౧

తే॥ నీవు పరమాత్ముఁడ వటంచు ♦ నే నెఱుంగు, వాఁడ సిరితోడ నిట్లుచూ ♦ పట్టినాఁడ
వమరకార్యార్థ మవనిభా ♦ రాపనోద, నంబు నీపని గాదె న ♦ వాంబుజాక్ష.

తే॥ చల్లకని వచ్చి ముంత యి ♦ చ్చకము దోఁపఁ, దాఁపఁగా నేల రావణు ♦ నేపడంపఁ
గాదె యీపన్నుగడ నీదు ♦ కథలు వింత, లేవిధానంబు లరయమే ♦ యింతవట్టు.

ఉ॥ ఏనును దేవకార్యమని ♦ యిట్టిరహస్యము దాఁచితి న్మది
న్నీనడతోడివాఁడ నయి ♦ నిన్నొకశిష్యునిఁ జేసి యంతయున్
గానఁగనయ్యెడిం బిదపఁ ♦ గాదననేల యటంచుఁ దత్కృతిన్
మానయము ల్ఫలించు నిఁక ♦ మానవు మారమణీమనోహరా. ౨౩౪

క॥ గురువులకు గురుఁడ వీవే, సురలకు సురవరుఁడ వీవె ♦ సురుచిరసుగుణా
కర పితృగణముల కీవే, పరముఁడవు పితామహుఁడవు ♦ పరికింపంగన్. ౨౩౫

తే॥ తగ జగద్యంత్రవాహక ♦ త్వంబు నీ క, నంతరుఁడ వంతరాంతర ♦ త్వాప్తిఁ గాంతు
నీయగోచరభావంబు ♦ నిర్ణయింప, నేరరు పితామహాదు లు ♦ న్నిద్రవిభవ. ౨౩౬

ఆ॥ శుద్ధసత్త్వమయము ♦ సుభగము స్వాయత్త, భవము నైన మేనుఁ ♦ బడసి స్వీయ
యోగమాయతోడ ♦ నోరంత ప్రొద్దును, జగము రక్షలీల ♦ జరుపు దభవ. ౨౩౭

క॥ నీమాయామానుషకథ, లేమనుజుఁడయేని నిచ్చ ♦ లెదఁ దలపోయుం
గామకలిదోషవర్జితుఁ, డై మహనీయయగుపదవి ♦ నందుఁ బరేశా. ౨౩౮

శా॥ పౌరోహిత్యము దూష్యజీవన మన ♦ త్రాప్యంబు గర్హ్యంబు నా
కీరాగోద్ధత మేల యంచు మది ము ♦ న్నెంచియుం బాయఁగా
నేరం బుట్టెద వీకొలంబున జగ ♦ న్నిర్మాత వంచున్ ధృతిన్
స్నిగాక న్నశిరాక నట్లునిచితి ♦ స్నీగాకరంబు న్బలెన్. ౨౩౯

ఆ॥ అయ్య నలువ దెలిపె ♦ నయ్య నీసత్కృప, నేనుఁ గొంతకొంత ♦ నెఱిఁగి మొలఁగు
వాఁడ దీనిఁ గొంటి ♦ వఱలుత్వదాచార్య, పదవిఁ గోరు మేలి ♦ భావమునను.

క॥ ఫలియించె నామనోరథ, మలఘుతరంబుగ మనోర ♦ మాకృతి నిను ని
శ్చలమలయించితి నికట, మెలఁగెద నీశిక్ష నెలమి ♦ మేకొన రామా. ౨౪౧

తే॥ ఈవు గురుదక్షిణార్థివ ♦ యేని నింక, నఖిలమోహిని త్వదధీన ♦ యైనమాయ
నన్ను జుట్టక దేర్పఁ ద ♦ నర్చ్యవరము, నిమ్ముగ మనమ్మునందిడి ♦ యిందుమధీశ.

— ♦ వశిష్ఠుఁడు సీతారాముల వ్రతదీక్షితులఁ జేయుట ♦ —

క॥ ఎందున్నుఁ దెలుపంజన దిది, యిందుముఖా నీదుమర్మ ♦ మిట్టిద యే నా
నందమయత వివరించితి, సందియపడ నేల యగుప్ర ♦ సంగంబునకున్. ౨౪౩

చ॥ మనుజవిభుండు నీవలని ♦ మాలిమి మై నభిషిక్తుఁ జేయ నెం
చెనుఁ దగుయత్నము న్నెఱపె ♦ శ్రీపతి వెడ్డను నీవ యైన నా
తనియనువృత్తికిం దగుప ♦ థంబునఁ దెల్పెద సీతతోడ నీ
వును నుపవాసకృత్యమునఁ ♦ బున్నెపుఁబ్రొద్దొనరింపు మీనిశన్. ౨౪౪

ఆ॥ ఆయయాతి నహుషుఁ ♦ డట్లు నరాధిపుఁ, డెల్లి యావరాజ్య ♦ మేర్పడంగఁ
గూర్చి నిన్ను మేలు ♦ కొలుపఁగా నున్నవాఁ, డదియు విధియుతముగ ♦ నవధరింపు.

తే॥ ఏను రాజసమక్షంబు ♦ నెనయువాఁడ, నిపుడె యీ వట్లు సంభావ్య ♦ మెంతుగాత
మనవు డాతని స్మేరాస్యుఁ ♦ డగుచుఁ గాంచి, యిట్టులనె రాముఁ డెఱిఁగియు ♦ ధీద్యచరిత.

క॥ ఎమ్మెయి మెలఁగిన మేలౌ, నమ్మెయిన చరించువాఁడ ♦ నది భవదాయ
త్తమ్మగు నుపదేష్టృతఁ దగు, సమ్మతి నెఱపవె యనం బ్ర ♦ సన్నత వెలయన్.

ఆ॥ వారిఁ గూర్చి మంత్ర ♦ వత్కల్పమునను సం, కల్ప మొనరఁ జేయఁ ♦ గా విధించి
నియతు లెల్లఁ దెలిపి ♦ నెఱి గడల్కొనఁ దత్క్రి, యార్చనలఁ దనర్చి ♦ యుసుస మొసఁగ.

ఆ॥ తరలె రాజగురుఁడు ♦ తాత్పర్య మొప్పార, రామమహితమంది ♦ రమున నుండి
యభ్యనుజ్ఞ గూర్చి ♦ యాపృచ్ఛన మొనర్చి, యరద మెక్కి ధరణి ♦ వరునిఁ బెరయ.

క॥ అయవిదుఁడు రాముఁ డావలఁ, బ్రియంవదుల సుహృదులం బ్ర ♦ వీణత వెలయన్
సయమున వీడ్కొని నెట్టన, దయమానుఁడు లోనికరిగెఁ ♦ దత్కాలమునన్.

ఆ॥ రామునగరు సదభి ♦ రామమై తనరారె, హ్యాప్తిమజ్జనాభి ♦ జుష్ట మగుచు
మహితఫుల్లనళిము ♦ మత్తద్విజగణంబు, నగు సరోవరంబు ♦ ననుకరించి. ౨౫౧

క॥ ఘను డమ్మునివరుఁ డరుగుచుఁ, గనె రాజపథాంతరంబు ♦ కమనీయము ప్రా
జననందనభావితహృ, జ్జనసంవృత మిది యె స్వర్గ ♦ సదనం బనుచున్. ౨౫౨

ఆ॥ రామమందిరంబు ♦ రాణివాసంబు పు, రంబుడంబు భాసు ♦ రంబు గాఁగఁ
గాంచె మౌని, చంద్ర ♦ కాంత మభ్రిము ఫుల్ల, నళినతలము మధువ ♦ నంబు నట్లు.

క॥ అప్పుడె రాజభవనమై, యొప్పెను రామునినివేశ ♦ మొప్పఁదె యిఁక నా
యొప్పులకుప్పచరిత మని, యప్పావనుఁడౌ తపస్వి ♦ యనుకొనెఁ దనలోన్.

శా॥ త్రోవం గాంచెను బృందబృందములుగాఁ ♦ దోఁతెంచువారి న్నిజ
ప్రావీణ్యం బెలయించువారి మహిత ♦ ప్రావారభూషాంచిత
శ్రీవిభ్రాజితులైనవారి భువన ♦ క్షేమోద్భవున్ రాఘవున్
దేవు న్గొల్చెద మంచుఁ గౌతుకసమృ ♦ ద్ధి న్మించువారిం బొరిన్. ౨౫౩

క॥ జనసంఘహర్షవీచీ, ఘనసంఘర్షణనినాద ♦ కలసలఁ బుటభే
దనవారిధి రామసుధాం, శుని యభ్యుదయమునఁ బొదలు ♦ చొప్పతఁ డరసెన్.

శా॥ పస్నీ రెల్లెడఁ జల్ల రథ్యల ధ్వజ ♦ ప్రాలంబము ల్తోరణల్
చిన్నెల్మాసపువితానము ల్సుమలతా ♦ శ్రీవృక్షశాఖావలీ
సన్నాహంబులు వైజయంతికల సం ♦ సక్తు ల్ఘటింపంగనౌ
విన్నాణంబులఁ దృప్తిలేని ప్రజల స్వీ ♦ క్షించి మేలెంచుచున్. ౨౫౪

క॥ ఇంకం బ్రొద్దేమిటికో, క్రుంక దెపుడౌ యుదయ మనుచుఁ ♦ గొందలపడుచున్
లెంకలయి చిత్తములు విభు, వంక కెయిద నిలుచువారి ♦ వైఖరిఁ గనుచున్.

క॥ అందమొనరించువా రా, నందమునం బొదలువారు ♦ ననిచెను భాగ్యం
బిందఱ కనువారునునై, సందింతయు లేమి కెడఁద ♦ సంతసపడుచున్. ౨౫౯

—♦ వశిష్ఠుండు రాముని దీక్షితు నొనర్చితినని రాజున కెఱిఁగించుట ♦—

తే॥ మఱియుఁ బఱతెంచువారల ♦ మమత లెంచి
యుత్సుకత మించువారల ♦ యొలపు గాంచి
యుత్తొరవునాళ పథమెట్లొ ♦ యొదిఁగి కడచి
రాజకుల మాత్రఁ జెనసె సా ♦ మ్రాజ్యమహిత. ౨౬౦

క॥ తెల్లనికాంతుల దిక్కులఁ, జల్లెడుసౌధమున నింద్ర ♦ సదృశుఁ గధిసెఁ దా
నల్లబృహస్పతివడువున, సల్లలితుఁడు వశివరుండు ♦ సౌనసనేత్రా. ౨౬౧

తే॥ తనదుగద్దియ తాపసో ♦ త్తమున కొసఁగి, చేరి నిలబడె రాజు స ♦ శ్రీకుఁడనుచు
నానభాసదులును నతి ♦ సేసి నిలిచి, రచటి కర్జము దెలిపె సం ♦ యమివరుండు.

క॥ గురునానతిగొని వీడ్కొని, సిరివెలయఁగ నెల్లరకును ♦ సెలవిడి యభ్యం
తరమందిరకందరఁ గే, సరినైఖరిఁ జొచ్చె నృపతి ♦ చందనగంధీ. ౨౬౩

క॥ తారాగణసంకుల మగు, తారాపథ మట్టు లెనసి ♦ తా రాజిలెన
స్తారాజచంద్రుఁ డచ్చట, శ్రీరాజిలఁ జేయుతనదు ♦ చెలువ సొలర్పన్. ౨౬౪

ఉ॥ అచ్చట రామచంద్రుఁడు ద ♦ యామయుఁ డెల్లజగంబు మన్ననా
యిచ్చ దలిర్ప స్నాతుఁడయి ♦ యేకమనస్కతఁ బత్నితోడ నే
కచ్చొలయంగనీని నెఱిఁ ♦ గావు మటంచుఁ దదాత్మకుఁడై హరిన్
మెచ్చొనగూడ వేఁడె నది ♦ మేకొని యన్యనివేశమై తగన్. ౨౬౫

క॥ అనలునిఁ బ్రజ్వలితునిఁ జే, సి నమోదయుఁ డాజ్యపూర ♦ సిక్తము హవ్యం
బు నియతి వేల్చె మహాపురు, షుని నారాయణునిఁ గూర్చి ♦ స్తుతిసూక్తములన్.

ఆ॥ అవల హవ్యశేష ♦ మబల తానునుఁ బ్రాశ, నం బొనర్చి దేవ ♦ లంబు పొంత
విష్ణుతత్త్వధృతిని ♦ విష్టచిత్తత శయ, నించెఁ గుశశయాన ♦ నిష్ఠ తనర. ౨౬౭

క॥ పై దేహితోడ వాగ్యతుఁ, డై దేహాదులకు సాక్షి ♦ యగు నిజసత్త్వం
బా దేవహితుఁడు దాల్చెను, మోదాదులపైని దైన ♦ ముద మెలరారన్. ౨౬౮

తే॥ సూతమాగధవందులు ♦ శుద్ధవృత్తిఁ, జేరి పొగడంగ యామావ ♦ శిష్టమైన
రాత్రి మేల్గాంచి సదనమ్ము ♦ రాణ నెఱయ, మంగళాచారసంస్కృతు ♦ ల్మలయఁ జేసి.

క॥ పూర్వ యగు సంధ్యఁ గొలిచి యు, పూర్వప్రజ్ఞుఁడు నుతించెఁ ♦ బురుషోత్తముఁ దా
నర్వాచీనతఁ గొననియు, ఖర్వంబగు మహిమతోడి ♦ కరిమ మేర్పడఁగన్. ౨౭౦

క॥ అప్పుడు పొడసూపినద్విజు, లప్పురుషునితోడివార ♦ లై శ్రుతివిధులం
దెప్పున వెలయించిరి తో, నొప్పెం బుణ్యాహవాచ ♦ నోజ్జ్వలకలనల్. ౨౬౧

తే॥ ప్రవిమలములగు క్షౌమాంబ♦రములుగట్టి, రాణితో నొప్పెడుకుమార♦రాజుఁగాంచి
మాతలెల్లరు సంతోష ♦ మగ్నచిత్తు, లైరి వారల కదె కాదె ♦ యభ్యుదయము.

క॥ రాముఁడె కమలాకాముఁడు, రాముఁడె జగదేకాభి ♦ రాముఁడుఁ దమ కీ
రాముఁడె స్వర్గము మోక్షం, బోమెడువాఁ డితఁడ యనుచు♦ నోరిమి మెఱయన్.

క॥ శ్రీమహితుని గుణసంపద, లాముకొనం జిత్తవృత్తు ♦ లలరారంగన్
నేమములం దనరారుచు, నేమర్మము లేక నిచ్చ ♦ లెంతురు వారల్. ౨౬౪

తే॥ కడఁగి కోసలుకన్నె ని ♦ క్కముం బెఱింగి, సంతసించె నెడంద ని ♦ స్సంశయ మని
కైక దెసఁ గాంతుకూరిమి♦కలన లెంచి, యించుక చలించె నెట్లగు♦నేమొ యనియు.

క॥ అర్గళ మెడపఁగ నాయము, దుర్గం బూజించి కొలిచెఁ ♦ దోడగు మనుచున్
సర్గస్థితిగతు లరయక, భార్గవి వేఁడెఁ దనపట్టి ♦ పట్టున నిలువన్. ౨౬౬

మ॥ శరచాపంబులు దాల్చి లక్ష్మణుఁడు సం ♦ స్థానంబుచెంత న్గుణా
కరు రాము న్బరికించుదృష్టులకు వే ♦ డ్కల్ పూపుచుండె న్బరా
వరభావం బొకయింతలే కతనికై ♦ ప్రస్తోత్కృతం బన్ననై
కర ముప్పారె జనాలి వాఙ్మనస ♦ క్షస్ఫూర్తిఁ బద్మేక్షణా. ౨౬౭

క॥ రజని ప్రభాతప్రాయగ, సుజనసుకృతలక్ష్మి యగుచుఁ ♦ జొప్పడుటయు న
వ్యాజపౌత్రుమందిరముదెస, విజయశ్రుతిసూక్తిలహరి ♦ వెల్లిగొనుటయున్. ౨౬౮

క॥ తూర్యనినాదస్వనసం, ధార్యములై పూర్యమాణ ♦ తాధుర్యములై
వర్యశ్రుతితతిపారం, పర్యములై ద్విజులనుడులు ♦ పఱతెంచుటయున్. ౨౬౯

—♦ పౌరజానపదులెల్లరు సంతసించుట ♦—

శా॥ ఆపుణ్యాహరవంబు వీనులకు నె ♦ య్యంబైన తియ్యంబుతోఁ
బ్రాపై యింపెనయింపఁ దూర్యనినద ♦ ప్రావీణ్య మేపార ము
న్నేపాపంబునవంకఁబోనిమతు లా ♦ హేతుప్రచారంబునన్
దీపింపన్ రఘురామరామ యనుచున్ ♦ దీక్షానివిష్టాత్ములై. ౨౭౦

క॥ పౌరులు జనపదవాసులు, నారులు బాలురును ♦ నాకనంద్యచరిత్రుపై
పేరాశముగా గీతము, లారూఢిం బాడఁదొడఁగి ♦ రంగన వింటే. ౨౭౧

మ॥ ఉపహాసం బొనరించె రామశశి యో ♦ హో హో విదేహప్రజా
ధిపకన్యామణితోడ దీక్షకయి యా ♦ దేవుండె యీదేవుఁ డీ

ట్లుపయోగింపఁ దలంపు సేసె సుకృత ♦ వ్యూహంబు లాస్మాకముల్
విపరీతం బొకఁ డున్నె సర్వజనని ♦ శ్రేశంబులం దింకిటన్. ౨౮౩

క॥ రామాభిషేకమహ మజె, రామేంద్రుఁడు పాలనమున ♦ రహిఁ భద్రములన్
నేమమున గురియునటె యిం, కేమనవలె మహజగన్మ ♦ హితపుణ్యమ్ముల్.

ఉ॥ ఎంతమహాత్ముఁడో నృపతి ♦ యెట్టితపంబు లొనర్చెనొక్కొ శ్రీ
మంతులఁ గాంచె నందనుల ♦ మానవవంశము పావనంబుగా
నెంతయు వేడ్క నిందఱి య ♦ భీష్టము లెంచి విశిష్టు రాము శ్రీ
మంతుని రాజుఁ జేయుగరి ♦ మం గని మించె నుతింపఁ జెల్లదే. ౨౮౪

క॥ తను వృద్ధుఁగాఁ దలంచి య, తనుసుందరమూర్తి రాముఁ ♦ దద్దయు మముఁ గా
వను నను వెంచి ఘటించెను, జననాథుని యోజ యొగడఁ ♦ జనదే యెందున్.

ఆ॥ ఎపుడు నోమినార ♦ మేమొకో యిందఱ
మనుగృహీతభావ ♦ మందినార
మింకఁ గొఱఁత లున్నె ♦ యినుకొలంబున రామ
విభుఁడు ప్రోవను జగతి ♦ వెలయ మనుప. ౨౮౬

తే॥ దృష్టలోకపరావరుం ♦ డిష్టదుం డ
నిష్టపరిహర్త ధర్మస ♦ మృద్ధికరుఁ డ
నుద్ధతమనస్కుఁ డధియోగి ♦ యనూర్జితుండు
రాముఁ బోల్పం గలఁడె జగ ♦ త్ప్రియమునందు. ౨౮౭

క॥ తమ్ములఁ గనుఁగొనునా నె, య్యమ్మున నాభాశ్రితవత్స ♦ లాత్ముఁడు మనలన్
నెమ్మన మలరం గను నే, మమ్మునఁ బరికించి ప్రోవ ♦ మనవియు వలెనే. ౨౮౮

తే॥ కీర్తికాముఁ డగుంగాత ♦ మూర్తిగెడపె, నీనృపతి లోకములకెల్ల ♦ నీకసమున
రామునభిషేకనార్తఁగ♦ర్ణములఁ గనులఁ,దనివిని చాలదే సుకృ♦తంబుఁ బెనుప.

క॥ ఈయన్న శాసనంబున, నేయర్థము లెట్టులెనసి ♦ యెలయంగలమో
శ్రీయుతునికరుణ నెక్కొన, శ్రేయము కోకొల్లసేయు ♦ సిరి గనఁగలమో.

క॥ తనియమనె మనిచె నెల్లరఁ, దను మించినరామదేవుఁ ♦ దద్దమహీపా
లనమున కొనగూర్చెను వృ, ద్ధనరాధిపుఁ డంతకనుబ్ర ♦ ధానుఁడు తలఁపన్.

ఆ॥ అనుచు మురియువార ♦ లానందసాంద్రులై, పొదలువార లిరుగు ♦ పొరుగువారిఁ
బిలుచువారు బంధు ♦ వుల కెదురేగువా, రైరి పౌరు లప్పు ♦ డగణమారి. ౨౯౧

వ॥ మఱియు నన్నగరజనంబు లన్నాలీకసంభవువలన సృష్టికలా వైశారద్యంబువలని మెప్పువడయంగోరెడుచొప్పు చొప్పడ సితాభ్రనిభంబులగుసౌధరాజంబుల దేవతాయతనంబులఁ జతుష్పథంబుల రథ్యలఁ జైత్యంబుల నట్టాలకంబుల నానాపణ్యద్రవ్యసమృద్ధంబులగునాపణంబులఁ గుటుంబవంతులగృహంబుల శ్రీమంతుల భవనంబుల సర్వసభాస్థానంబుల సమాలక్షితంబులగువృక్షంబులఁ జిత్రధ్వజపతాకావితానతోరణ సుమాస్తరణరత్నమాలికానుసంధానదీపద్రుమనిధానప్రధానంబులగువిధానంబులం దనివోక మైమఱపునం బ్రవర్తిల్లుచుండి రయ్యవసరంబున. ౧౯౩

క॥ నటనర్తకగాయకులు, ద్భటలీలామనుజుకథలు ♦ పాడుట వివరిం
చుట రూపించుటయును న, ప్పాటభేదనమునకు వింత ♦ పొలుపిడెఁ బోలఁతీ. ౧౯౪

తే॥ అచటియావాహనార్ఘ్యపా ♦ ద్యాదివిధులు
చతురలంకారకృతులు సూ ♦ నృతసుమార్ప
ణములు ధూపదీపోపహా ♦ రములు వినతు
లన్నియును నయ్యె రామదే ♦ వార్చనములు. ౧౯౫

ఆ॥ ఆడుకొనెడుబాలు ♦ రం దాలకాపరు, లందు దెసలనుండి ♦ యరుగుదెంచు
వారలందు నున్న ♦ వారలయందును, రాముచరిత మేక ♦ రసత నొందె. ౧౯౬

శా॥ ఆవర్ణద్వయి లేనిగ్రాపదము వా ♦ క్యంబుం బదార్థంబు న
ట్లావేద్యంబు నివేద్యము న్సరసభా ♦ వాలాపసల్లాపల
క్ష్మీస్త్రవిద్యాధిగమంబులుం బొరిఁ బరీ ♦ క్షింపంగ నైనం బురిన్
లే వాచార్యక మవ్విభూత్సవమె బా ♦ లింగైకొనెన్ బాలికా. ౧౯౭

సీ॥ ఆహంస డాయని ♦ దా తమ్మివిరికొలం, కాకోయిలకుఁ గాని ♦ యామఁగొమ్మ
యాచిల్క మేల్పలుక ♦ లబ్బనియుద్యాన, మాభృంగ మెలయని ♦ యలరుఁదీవె
యాకేకి యాడని ♦ దననైనవనశాఖి, యామృగం బెనయని ♦ యట్టిక్షేత్ర
మామత్తగజము వి ♦ హారమందనికోన, యాహరి పెరయని ♦ దైనగుహయు

నందొకనిచిత్త మేనియు♦నౌ ననంగఁ, బోల దెబ్బంగి సామగ్రిఁ♦బొసగఁ గూర్చి
సృష్టి పొనరించెనో కదే♦స్రష్ట పురము, జనము రామోత్సవైకభా♦జనము గాఁగ.

క॥ వచ్చెడివా రప్పురమునఁ, జొచ్చెడివా రవలదాని ♦ సొబగులు గొనముల్
మెచ్చెడివా రెడఁదల సం, దిచ్చెడివా రైరి జగతి ♦ నెనసినవారల్. ౧౯౯

ఉ॥ వారును వీరునుం బెరయ ♦ వారిధి ద్రచ్చెడునాఁడునట్టులే
యారవ మొప్పెఁ దొల్దొలుత ♦ నావలఁ గేవలరత్నజాతులే

తీరునఁ గాంచనమ్యేడినో ♦ తీర్థము సార్థముఁ గూడఁగా వలెఁ
శ్రీరమణీయమూర్తి; యిఁకఁ ♦ జెప్పెదఁ దత్పరమార్థ మంతయున్. 300

క॥ అని పరమేశ్వరుఁ డెటిఁగిం, చిన విని యామోదమెనసి ♦ చిఱునవ్వున నా
థునిచిత్త మెలయఁ జేయుచు, వనితామణి గిరిజ యవలి ♦ వల నడుగుటయున్

మ॥ నిజసామ్రాజ్యవిశేషవైభవకలా ♦ నిర్నిద్రలోకాధిభూ
వ్రజహృద్వీక్షణముద్రణోచితనవ ♦ ప్రారంభ నారంభకృ
త్సుజనాధ్యాత్మదృగేకలక్ష్య శ్రుతిసం ♦ సూక్తప్రభావా మహా
విజయోత్సాహపరీతమాయికగుణా ♦ విర్భావముఖ్యాశ్రయా. 302

క॥ అన్నమయాదివిలక్షణ, సన్నద్ధవికారపంచ ♦ జనసాచివ్యో
త్పన్నప్రాభవ వియదా, ద్యన్నేయకృతిప్రమాభి ♦ యోగప్రచురా. 303

స్రగ్విణి॥ దేవదేవా; మహా ♦ దేవభావాంచితా, పావనాకారసం ♦ భావనోపక్రమా
శ్రీవిభుత్వప్రథా ♦ సిద్ధసంపద్విధా, సావధానాఖిల ♦ వ్యాపకాభ్యుచ్ఛ్రయా.

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం బ్రథమాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

## ద్వితీయాశ్వాసము.


కమనీయనిజపర
త్వాకలనారహితసన్మ ♦ హాపథవర్తి
ప్రాకామ్యప్రతిభూవి
శ్వాకారవికారవిదృ ♦ శా పరమేశా. ౧

తే॥ అవధరింపుము దేవి మె♦ప్పవధరించి, నెఱి నెఱయఁ బల్కఁదొడఁగె న♦న్నీలకంఠుఁ
డవల రామకథాసుధా ♦ ర్ణవతరంగి, తత్ప్రసంగంబు గాఁగఁ జి ♦ త్రంబు దనర.

—♦ కైక దాసియగు మంథర ప్రాసాదం బెక్కి పురవైభవంబు వీక్షించుట ♦—

ఆ॥ వినుము శైలతనయ; ♦ తనయంత నల్లన, శైలనిభవిమాన ♦ చంద్రశాల
నెక్కి వక్ర కుబ్జ ♦ యొక్కర్తు దాసి యు, దాసకలన కైక ♦ ద్వాఃస్థ మలిన. ౩

క॥ అది మంథర యనా మంథర, మదియందునుఁ గదియఁజనుగ ♦ మన మందునుఁ ద
న్నెదిరిం గని యగుఁ గాదని, మదిమది మాటాడునేర్పు ♦ మలయ దొకంటన్. ౪

తే॥ కాదు మానిసి యననైన♦గతికి నగరు,నందునికి తక్క నొండొక్కఁ♦డనువు లేదు
దాని కబ్బెను సారస్వ♦తంబులిబ్బి,ని ప్పనఁగరాక వెలిఁగె న ♦ న్నెలఁతుకయును.

క॥ వేలుపులు భీరువులు గా, రా లాఁతులఁ గెడప వేఁడ ♦ రా విధి నతఁడుం
గాల మరసి పన్నకముం, బోలం బొనరింపఁడా వి ♦ భుతఁ గొనకొనఁడా. ౬

ఆ॥ అట్లు మగనియాన ♦ నద్దేవి తనస్వాంత, మలము టట్టునాంచి ♦ యాపినాచి
చూచె నగరివంక ♦ సురుచిరకల్యాణ, ధామ మదియు కాంగఁ ♦ దనరుచుండ. ౯

తే॥ నీటఁ బన్నీటఁ దడిపి పై ♦ నిగ్గుసూపి, పూలపఱపులు నెఱపి మే ♦ ల్కట్టుతోడి
కట్టడమ్ముల మేల్కట్లఁ ♦ గలువడముల, గట్టిసేసినరాజమా ♦ ర్గ మొక గనియెంట

క॥ మంగళములు పాడెడుచో, ట్లంగనలు విభూషితాంగు ♦ లగుచుండేటులు సం
పెంగ నెఱతావిజత హృద, యంగమధూమములు నెఱపు ♦ నచ్చోటులుఁ గనెఁ.

ఆ॥ తూర్యనిస్వనముల ♦ తోడ విప్రాశీఃప్ర, ణాలికాగుణాలి ♦ బాటితోడ
స్వస్తివాచకోక్తి ♦ సంసక్తితోడ జా, నొప్పు నప్పురమున ♦ నొప్పుటెంగ. ౧౦

క॥ అంకెలిడెడు గోవృషముల, పొంకము హస్త్యశ్వవితతి ♦ పొంగపున నధ్వ
ధాంకితమగు రాజద్వా, రాంకణమున ప్రేంఖణంబు ♦ నది పొడగాంచెఁ. ౧౧

తే॥ ఇసుము వైచిన రాలఁగా ♦ నెడము లేక
సంప్రహృష్టజనౌఘంబు ♦ సంశ్రయమున
నెన్నఁడును నిట్టి డిది యంచు ♦ నెన్నరాని
వైభవమున నయోధ్య తా ♦ వఱలు టరసె. ౧౨

క॥ మోదకహస్తులు తాంబూ, లోదకలశకరులు చను ♦ నోద్ధరసుమనా
మోదమిలదళులు భూసురు, లాదృతులై నడుచునడక ♦ లది గనుఁగొనె నెఁ. ౧౩

ఆ॥ పడగ లొప్పుచుంట ♦ భద్రగజమ్మునం, భారిహారశోభ ♦ నఱలుచుంట
ద్విజను లొడయ లెల్ల ♦ దేశప్రజలుఁ బురిఁ, బిక్కటిల్లుటయును ♦ నిక్కఁగాంచె.

క॥ ఆయంతిపురినిసిరు లా, చాయం బనితనము లొక్క ♦ చాయను నెఱికిం
బాయనివేడ్కలు సుగుణో, చ్చ్రాయాశంసలు శుభప్ర ♦ శంసలు సొలసెఁ.

ఉ॥ కోసలుకన్నె యంతిపురి ♦ క్షోణియపత్యము రాణివాసముల్
భాసిలురత్నరాసులకుఁ ♦ బట్లుగ మంగళదేవతాముఖా
చ్ఛ్వాసములై సురార్చనద్వి ♦ జవ్రజదానకలాభిశంసన
శ్రీసముపాత్తశోభనవి ♦ శిష్టగరిష్ఠము లౌటయుం గనెఁ. ౧౬

—♦ మంథర శంకాకులితయై రామధాత్రిం గాంచి యడుగుట ♦—

తే॥ చూచి తలయూఁచి కేల్సాఁచి ♦ చోద్యమంది
యింతలో నింతమే లెద్ది ♦ యిరవుకొనియె
ననుచుఁ దలపోసి కొనుచుఁదో ♦ నచటువాసి
వాసిగనుధాత్రి డాసి తీ ♦ వ్రిత గరాసి. ౧౭

శా॥ ఆకాశీసుత పల్కె నుల్కిపడి యే ♦ మమ్మా పురం బిమ్మెయిన్
శ్రీదంబై నలువొందెదేల్ మహితల ♦ క్ష్మీలాలితాహ్లాదమై
లే దేనాఁడునుఁ బున్నె మిట్టిఁ డెదియున్ ♦ లేఁ బ్రియావుంజిన్నెలుం
బ్రాదుర్భూతము లయ్యె నాకలిమికిన్ ♦ బ్రస్తూయమానంబులై. ౧౮

ఉ॥ పట్టునె మన్కిపట్టనక ♦ బాసటతోఁ బఱతెంచుచున్నవా
రిట్టులమైనసంపద న ♦ నేకు లనీకము లొప్పెడుం బొరిన్
బుట్టినయట్టి వయ్యెను వి ♦ భూషణము ల్తగ దీని కిట్టిమే
ల్పట్టునఁ బౌరరాజపద ♦ భావవిభావన లౌన వెమ్మెయిన్. ౧౯

క॥ ఇంటింట నెఱులు సిగులును, జంటం బాయవు స్వకీయ ♦ సంభావన యే
వెంటం దనరెడు వేడ్కలఁ, గొంట న్మానసము లమ్మ ♦ కొని రెల్లజనుల్. ౨౦

క॥ రాముజనని శ్రీజననియ. కా మహనీయ యయి కల్ప ♦ కలతిక గతిఁ దే
జోమయమణిరత్నంబులు, ప్రాముఖ్యం బెంచి యిడెడు ♦ బ్రాహ్మణతతికిన్. ౨౧

ఆ॥ పట్టరానివేడ్కఁ ♦ బఱతెంచుచున్నావు, కట్టి తీవు దెలుపు ♦ పెట్టరాని
పోఁడుములు ధరించి♦పొలుపారెద వొకింత, కారణంబు దెలియఁ♦గాఁ బలుకుము.

ఆ॥ అనిన మేను వెరుఁగ ♦ నాలోన నిముడని, యరుస మెల్లకడలు ♦ నాక్రమింప
నిట్టులనియె నదియు ♦ హేరాళముగఁ దన,మది దనర్చు మేలి ♦ మమత నెఱయ.

తే॥ నహుషుఁడు యయాతి నెట్టు ల ♦ న్నయము దోఁప
దశరథేంద్రుండు తద్దయుఁ ♦ దవులు కూర్మి
శ్రీమహితు రాముఁ బట్టాభి ♦ షిక్తు నేఁడు
జేయఁబూనినవాఁడు వి ♦ శేషవిదుఁడు. ౨౪

తే॥ ఇదియె నోములపంట యి♦య్యదె రసప్రవాహ మిదియే యధిశ్రీ♦వివాహవేది
మోక్షలక్ష్మీపదం బిదె♦మొనసె స్వాశ్రితాలి మనుపంగ రామరా♦జ్యముమహమ్ము.

—♦ మంధర లోనికరిగి కైకం దూలనాడుట ♦—

క॥ అనునంతలో నమర్షం, బనితరసామాన్య మగుచు ♦ నలముటయునుఁ జ
య్యనఁ జనియెనుఁ బాపపుఁబని, గొని కేకయరాజపుత్రి ♦ కూటమ్మునకున్. ౨౬

తే॥ అం దెదియుఁ బాప మెఱుఁగక ♦ య్యధిపుకూర్మి
నెదనుఁ జేవైచి సుఖనిద్ర ♦ నెనసియున్న
దాసి నద్దేవిఁ గని జ్వాలి ♦ తప్రచండ
వహ్నిశిఖఁ బోలి యాదుష్ట ♦ వాక్య పలికె. ౨౭

క॥ ఓమూఢురాల; సిగ్గు, నీమెయి వైచితివ కాని ♦ నేరవ యెదియున్
నేమమునఁ దాఁకుఁ దప్పు న, యో; మేల్కొనఁ దలఁపవలదె ♦ యువిదలకెందున్.

క॥ నాకొంప ఘోవుతజే నా, కేకత శయనించి యొడలి ♦ యిమ్మరయక నీ
వేకరణి నిదురఁ బెరసెద, వే కాలము కర్మ మొంట ♦ నే తలకొనెనే. ౨౯

ఆ॥ లె మ్మఘమ్ము నిన్ను ♦ రెమ్మఁ బోయెడు భయ
మరయ వొసఁగెఁ జనవు ♦ దొర యటంచు
గలిమిఁ గన్ను మిన్నుఁ ♦ గానకే యున్నావు
నిన్ను నీవెఱుంగు ♦ నేర్మి గొనవు. ౩౦

క॥ సౌభాగ్యమదంబున నీ, వాభాగ్యము నమ్మి యూర ♦ కదరిపడెద విం
కేభావిగతిఁ దలంపవు, ఘో భావుక మూసపడవో ♦ బుద్ధివిహీనా. ౩౧

ఆ॥ ఎల్లకాల మున్నె ♦ యెలప్రాయము నదీర, యమ్ము తిగ్మభానుఁ ♦ డడఁపఁ జెడదె
యట్టిదైనసమయు ♦ మరుదేర నెట్టన, గదలఁబోదొ నీదు ♦ కలికితనము. ౩౨

క॥ నీసుభగాకారం బొక, కాసునకుం గాదు మీఁదు ♦ గాఁగ ననిష్టం
బౌసంజితం బొనర్పఁగ దాసివ కా నొదుఁగుబ్రదుకు ♦ దార్కొననయ్యెన్. ౩౩

—♦ కైక మంథరతో దానివ్యగ్రత్వముం గూర్చి ముచ్చటించుట ♦—

మ॥ అనుపల్కు ల్విని సోఁక నుల్కిపడి యా ♦ హా; యంచు నమ్మించుఁబోఁ
డి నితాంతవ్యథ వేపమానయయి బో ♦ టిం గాంచుచున్ లేచి యే
మనునో యెద్దిఘటిల్లెనొక్కొ యని భా ♦ వ్యర్థమ్ము నూహించుచున్
దనచిత్తమ్మున దార్ఢ్య మేదుగతితోఁ ♦ దా నిట్లనెన్ దానితోన్. ౩౪

క॥ ఆదుష్ట కుబ్జ యట్టు ల, నాదిష్టనిదానముగ మ ♦ హాదుఃఖం బా
పాదిల్లు కేర్పఱప ధృతిఁ, బాదుకొలుపువలని కబల ♦ పాటిలఁ గలదే. ౩౫

క॥ ఏమే యాలీ; యెల్లర, కేమెయి మేలే కదే మ ♦ తేమిట నెందే
యామయ మొదవుట చొప్పడె, నీమది యట్టిట్టుగాఁగ ♦ నెతీఁ జెఱుపంగన్, ౩౬

ఆ॥ వెరవుమాలి యింత ♦ వేగిరపడియెద, వకట; శోకమూర్తి ♦ వైతి విట్టు
లేయపాయ మొదవె ♦ నే తెల్పవే రిత్త, నన్నుఁ దిట్ట నేల ♦ నవయ నేల. ౩౭

క॥ ఏమాదిరి దుర్వ్యసనం, బామునొనె న్నిన్ను మంథ ♦ రా; తెలుపుము నే
నామార్గమరసి కాకే, నేమమ్మునఁ జిత్తవృత్తి ♦ నిలిపెడుదానన్. ౩౮

—♦ మంథర రామాభిషేక వృత్తాంతంబు కైకకెఱింగించుట ♦—

తే॥ అనుచు నమ్మధురాలాప ♦ యార్త యగుచు
నడుగ మునుపటికన్న న ♦ య్యాలుక యినుమ

డింప వగతోడిపగ ముట్ట ♦ డింప నిట్టు
లనియె నాధూర్త యాపెతో ♦ నలరుఁబోఁడి. ౩౯

సీ॥ ప్రాప్తమయ్యెను నీకుఁ ♦ బడఁతీ ; వినాశనం, బారాటపడెద నే ♦ నది దలంచి
యించుకంతయు నింత ♦ కెక్కనినీమది, కెది యెట్టు లెంచఁగింప ♦ నెఱుకవోడము
సమదుఃఖసుఖనయి ♦ జరిపితి నిన్నాళ్లు, నీయొద్ద దాస్యంబు ♦ నెఱపొనంగ
నీవు బాగుపడంగ ♦ నెలకొను నాబాగు, నీడంబు సెడఁ బక్షి ♦ నిలుచు టెట్లు
పొడవురాచకొలంబునఁ♦బొడమి పుడమిఁ, బట్టి పాలార్చు దొరచెట్టఁ♦బట్టి యాడి
రాజధర్మంబు మర్మంబు ♦రాపుఁగాన, వేమని యనంగఁ గల దింక ♦ నిరవు తెఱవు.

క॥ ఉగ్రములు తేనిమెలపులు, వ్యగ్రత్వముగాన వింత ♦ లరయమి శఠతా
విగ్రహుఁ డనక సుశీల, త్వాగ్రహమున వంచనమ్ము ♦ పాలై తకటా. ౪౦

తే॥ ఇన్నిదినములు నీయందె ♦ యిచ్చ నెఱపి, దేవి కౌసల్య కెట్టెటో ♦ తెఱఁగుసూపి
నేఁటికిఁ దదీయ మర్మంబు ♦ నెఱికిఁ గూర్చి, నిన్ననర్థంబుపాల్సేయఁ♦బన్నె నతఁడు.

క॥ ధర్మపథవాదు లగుచు న, ధర్ములు తమయర్థలాభ ♦ తాత్పర్యమునన్
మర్మము లోనిడి మెలఁగుదు, రర్మిలి వారిదెసఁ బెనిచి ♦ యడఁగుదు రన్యుల్. ౪౩

తే॥ పలుకు మెత్తన యనకుము ♦ పరుసఁదన మ
దన మతం డెవ్వఁడేనియు ♦ ధర్మపరుఁడు
గాఁడు సాంత్వమ్ము మృష నిన్ను ♦ గలఁచెఁ దేనె
పూఁతఁ బూసినకత్తి యు ♦ ప్పురుషు వృత్తి. ౪౪

క॥ నీశుద్ధభావమున ధర, ణీశు విశుద్ధాత్ముఁ డనుచు ♦ నెంచితి వింకం
బాశనిబద్ధవు గాఁగ హా, తాశ వగుచు నెట్టితలఁపు ♦ నలవార్తొ కదే. ౪౫

ఆ॥ మగఁ డటన్నమాట ♦ మాత్రమే కాని స, పత్నుఁ డతఁడు బాల ♦ భావముననుఁ
బాము నెట్టు లట్లు ♦ పడఁతిలాలించితి, వంకమున నలంచు ♦ టరయవైతి. ౪౬

క॥ పరిపంథిఁ బాము నమ్మిన, నరు లెట్టులు చెడుదు రట్లు ♦ నారీమణి; నీ
వరసుతుఁడు నీవు భూమికి, భర మననై పోవుచెట్ట ♦ పాల్పడియెఁ జుమీ. ౪౭

క॥ నిత్యసుఖోచిత వబలవు, ప్రత్యయవతి వతిలలితవు ♦ బాలవు నీ వి
యత్యయమున నేమయ్యెదొ, గత్యంతర మపుడు వెదకఁ ♦ గా నొదవెడునే. ౪౮

తే॥ డాఁపఁగా నేల తెలిపెదఁ ♦ బాప మనక
భరతు నీపుట్టినింటికిఁ ♦ బనిచి యెల్ల

రాజ్య మిదె తటి యని రాజు ♦ రాముసకు స
మర్పణ మొనర్చుచున్నవాఁ ♦ డరుస మెసఁగ. ౪౯

క॥ జనకుఁ బిలువరమె సీతం, బడి నపేక్షింపరమె యొండు ♦ రీతిఁ దలఁచి కా
కనుజాతు లొకట నిల ని, ప్పని దెప్పునఁ బూన నేవి ♦ పాకం బొదవెన్. ౫౦

ఆ॥ కంటకం బెడల్చి ♦ కాక యీశత సాగ, దంచు నెంచి యయ్యు ♦ దంచితుండు
పోరి పంచినాడు ♦ పుణ్యు నీపుత్రు న, య్యదియు నిదియుఁ దలఁప ♦ వలస వీవు.

క॥ నీయనుబంధిజనముతోఁ, బాయనిదుఃఖముల కెల్లఁ ♦ బాల్పడెదవ యిం
కేయనువున నాబోటికి డాయఁగఁ గొలువంగ గతి గ ♦ డల్గాననుఁ జెపుమా.

క॥ కావునఁ గడవకమునుపే, యేవెరవుననేనియును న ♦ నిష్టము తలఁగం
దీవరపడువల నరయుము, దేవీ; నాపలుకు మేల్మి ♦ దెలియుము మదిలోన్. ౫౩

—♦ కైక రామరాజ్యప్రాప్తికి సంతసించుట ♦—

ఆ॥ అనుడు నుల్లసిల్లి ♦ యానందవార్ధిలో, మునిఁగి తేలి యోసి; ♦ మూఢ; యింత
కింతపడితి వేల ♦ యెఱుక లేకుంటయే, కారణంబు నీకు ♦ కర్మమునకు. ౫౪

తే॥ అనుచు శారదచంద్రరే ♦ ఖాభమూర్తి, తరుణి సెజ్జ దలంగి చి♦త్తమ్ము పొదలఁ
జంద్రహాసివికాసమహా ♦ చంద్రహార, మింతి కొసఁగి గుణాఢ్య తా ♦ నిట్టులనియె.

క॥ రామునివలనున భరతున, క్షేమని భేదప్రచార ♦ మెంచితివే నీ
కేమెయి నెక్కొననే యీ, బూమెలపన్నుగడ యింత ♦ పొడ వెదఁగితివే. ౫౬

చ॥ భరతుఁడు రాముఁ డంచను వి ♦ భాగము నామది లేదొకప్పు న
ప్పరమగుణాఢ్యు మే లెఱుక ♦ పాటొనరించితి కాన నింక నొం
డరయుము గోరు మిష్టవర ♦ మాదృతిమై నిడుదాన దీనితో
సరియగు సంతసంబుతటి ♦ చానరొ ; కానఁగరాదు చూడఁగన్. ౫౭

క॥ వరగుణుఁ డని జ్యేష్ఠుం డని, పరమార్థం బెఱిఁగి రాముఁ ♦ బ్రభు నొనరింపన్
బెరసె విభుఁ డసదె యప్పని, పరికింపక యిట్టులాడఁ ♦ బాడియె నీకున్. ౫౮

ఆ॥ భద్రముఖుఁడు రామ ♦ భద్రు రాజేంద్రుండు, పట్టభద్రుఁ జేయఁ♦ బరఁగె ననుచు
భద్రవృత్త మెఱుక ♦ పఱచితి వెల్లేనిఁ, గోరు మిత్తు నొండు ♦ గొప్పవరము.

—♦ మంథర కైకకు దుర్బోధన లొనరించుట ♦—

క॥ అని మేలొర్చి పలుకు న, వ్వనితామణిపలుకు లరసి ♦ వామన యలుకం
గొని హారమెత్తి చులుక న, వని వైచి నిరాస ముట్టి ♦ పడ నిట్లనియెన్. ౬౦

ఆ॥ ఏమి సంబరంబొ ♦ యెఱుఁగంగఁ బోలదు, మగనిపెండ్లి కేగియు ♦ మాలెఁ దల్లు
సొంగి దీవు నీదు ♦ పొంగు డింపఁడె సప, త్నీసుతుండు ప్రబలి ♦ నెనరుమాలి. ౬౧

క॥ అక్కట ; దుఃఖిత నగునా, కొక్కట నినుఁగాంచి నవ్వ ♦ నోదవెడు మది నీ
వికృరణి దొసఁగు చొప్పడఁ, బొక్కక హృష్టాత్మ వగుచుఁ ♦ బొడవుపడంగన్.

ఆ॥ శోకవనధిఁ గూలి ♦ శోకింపవేల యే, నయము గంటి నిన్ను ♦ నవ్వువారి
తెఱఁగు లింతలోనె ♦ తెలియవు నీమర్మ, తిత్వ మరసి యేన ♦ తెరలుదాన. ౬౩

క॥ వ్యసన మొదవె నని ఖంద వ, రుసమునఁ బొదలెద విదేటి ♦ రూఢి యెడఁదయుం
గసిగంద దాట హెచ్చెదు, నిసిరో యున్మత్తవైతొ ♦ యిచ్చ దలఁగితో. ౬౪

చ॥ అతనిసమృద్ధి తొంటిదగు ♦ నాటయుఁ బాటయుఁ గాదు మిత్త్రియే
మతిఁ బరికింపు నీతనయు ♦ మానము ప్రాణము దక్క దింక నీ
పతి తలఁగున్ సపత్ని నెరి ♦ పాటవముం గను రాజ్యయుక్తి నే
మతకరితంత్రము న్జొనిపి ♦ మాయఁగఁ జేయునొ నీదుశ్రేయమున్. ౬౫

క॥ భరతుఁడు రామునకె యసం, తరుఁ డాతం డితని నోచి ♦ తలఁకును రాజ్యం
బరయ నుభయసాధారణఁ, మరిభీతుఁడు భయమొనర్చ ♦ నాయత్తపడున్. ౬౬

క॥ తక్కినవారికి దూరం, బిక్కువలయ రాజ్యయోగ ♦ మీనెరికై నేఁ
బొక్కెద నిక్క చెడినచో, దిక్కెయ్యది యనుచు నెపుడు ♦ దీనాత్మికనై. ౬౭

తే॥ లాఁతి యనఁ బోలదన్నిట ♦ లక్ష్మణుండు, రాముఁ బెరసెను వీడఁడు ♦ రహిం బొసంగ
గూడిమాడి మెలంగు నీ ♦ కొడు కొకంటఁ, బిన్నవానిచెలిమి గోరి ♦ తన్నరయఁడు.

క॥ ఆప్రత్యాసత్తిస్థితి, విప్రతిపత్తిం బొనర్చు ♦ వీఁడిఁ జేయున్
దీపశుభుఁడైనరాము మ, హాప్రాభవ మెగువ నీన ♦ యము సెడ మగునా. ౬౯

క॥ అంతకుఁ జాలినవాఁ డిసు, మంతయుఁ గొఱఁతపడఁ డెందు ♦ నక్కతమున నే
నింత యుదిలపా టొందుట, యింతిరొ ; రామునిప్రతాప ♦ మెఱుఁగమె యెపుడున్.

తే॥ సుభగురాలు కౌసల్యయ ♦ చువ్వె యెల్లి
పుష్యమున యౌవరాజ్యమ్ము ♦ పొలుపు గాంచుఁ
దనదు తనయుఁ డభ్యుచ్ఛ్రిత ♦ దశయు కాడె
యాయమ మహోన్నతప్రీతి ♦ కడ్డు గలదె. ౭౧

క॥ చేతులుకట్ట కొడుకు నీ వేతఱి నెదియేని నర్థి ♦ నెఱిఁగింపఁగన్
బాతరలాడిన నెమ్మెయిఁ, జూతురొకో యదియు వలయుఁ ♦ జూచుకొనంగన్.

ఆ॥ కొలుతు రీవు కొడుకు♦కోడండ్రుఁ గౌసల్య,కొడుకుఁ గోడలిం బ్ర ♦ కుంఠితులయి
యాసపత్ని పగయె ♦ యావల నినుఁగాల్చు, నెప్పుడేనిఁ దప్ప ♦ దింతవట్టు. ౨౩

క॥ మానము వో వరవుడముం, బూని యొనర్పంగ నైన ♦ పున్నెంబున మి
మ్మానయమున మనిచెదరో, కాని మల్లక లెంచి మీఁదఁ ♦ గడతేర్చెదరో. ౨౪

తే॥ హృష్ట లౌదురు రాముప ♦ శ్రేష్టదార, లప్రహృష్టలు నీస్నుష ♦ లౌదు రింకఁ
గష్ట మింతటికన్ననుఁ ♦ గలదె సర్వ, నష్టములకునుఁ బాలౌదు ♦ నాతి; నీవు. ౨౫

క॥ కావున నానుడి విని సుతుఁ, గావఁగఁ ద్వరపడు మనంగఁ ♦ గలఁగియుఁ దెలివిం
ద్రోవక రాముని గొనములు, భావముఁ దలపోసికొనుచు ♦ భావిని పలికెన్. ౨౬

—♦ కైక శ్రీరాముని సద్గుణంబు లభివర్ణించుట ♦—

తే॥ ఆడితప్పఁడు ధర్మజ్ఞుఁ ♦ డనవరతము, గురులశిక్షుం బెరిఁగె నయ్యెఁ ♦ గోవిదుండు
కృత మెఱుఁగుఁ గూర్మిఁ బాయఁడు♦కేవలుఁ డటె,రాముఁ డాతనిపైనివిరక్తితగునె.

క॥ శుచి సత్యరతుఁడు శాంతుం, డచలితశీలుండు బాంధ ♦ వాదృతుఁ డఖిలే
డ్యచరితుఁ డాతనిగొనముల, విచేయ మని యొక్కఁడైన ♦ వేర్పడఁ గలదే. ౨౮

తే॥ పెద్దకొడు కన్నిటం బెద్ద♦పృథివి యేల,నర్హుఁ డాతండ కాఁడె యే ♦ మనఁగ నింక
నీతొడనుమాట లరయంగ ♦ నేరరాజు, తప్పు లే దిప్పగిది నొప్పు♦ ధర్మవునను.

క॥ సోదరులను భృత్యుల నీ, తాదయితుఁడ ♦ యెల్లగతులఁ ♦ దా రక్షించున్
మోదమునఁ దండ్రివలె భయ, మేఁదగ దీర్ఘాయు వగుచు ♦ నిందఱుఁ బొగడన్.

క॥ కుబ్జా; యేమని రాముని, నబ్జాక్షుప్రతిభు నిచ్చ ♦ లరసి యరసి నీ
న్యుబ్జత్వదోష మెదిఁగి క, కుబ్జాతం బలమ నిట్లు ♦ కుందెదొ చెపుమా. ౩౧

తే॥ ఆటపాటల జతలైన ♦ యంతమాత్ర
భరతుఁ డాయన్న కెరవటే ♦ పాపురాల
యతఁడు దోబుట్టువుల దెస ♦ నంతరం బొ
కింతయునుఁ దలఁపడు మేల్మి ♦ కెలయ వలదె. ౩౨

క॥ రామునకు భరతుతోఁ గల, యామంతన మతఁడు భ్రాంత ♦ యాన శిరమునం
బ్రాముకొను టరసి నాతొలి, నో మనుకొని యిపుడు తిట్ట ♦ నో రెట్లాడున్.

ఆ॥ పితృపితామహార్త ♦ పృథివి రాఘవుఁ డంది, తనయునంతరునకుఁ ♦ దద్ద యావ
రాజ్య మొసఁగకుండు♦రకమువాఁడటె మేలె,యా నిజమ్ము సంది♦ యమ్ము లేదు.

క॥ ఇచ్చిన నాతఁడె యీవలె, హెచ్చిననెటి సిరియు ననక ♦ యేవపుఁదలఁపుల్
పెచ్చువెఱఁగఁ దలపడి యే, మెచ్చువడయువార మింత ♦ మెలి మనకగునే. ౩౫

తే॥ అతఁడె యేలెడుఁగాత మి♦య్యవనియెల్ల, మనెడుఁ గావుత చిరకాల♦మినకులమ్ము
కీర్తిఁ బెనుచునుఁ గాత సం ♦ కీర్తనీయుఁ, డభ్యుదయ మొందు వేల ని ♦ ట్లడల నేల.

క॥ ఆతఁటి మిథిలం దేజం, బా తేజోమయుఁడు గూర్చి ♦ యనుజన్ములకుం
జేతి కొసఁగఁడే శుభగతిఁ, జేత మలర నిచ్చు నాకు ♦ జేజే లిడఁడే. ౮౭

క॥ తనతల్లి నట్లె కాంచును, నను రాముఁడు సోదరులను ♦ నాయమ్మున కా
న్మనిరూఢి నెఱయఁ గన్గొను నినయం బిది యెల్ల బుద్ధి ♦ నరయనియదియే! ౮౮

ఆ॥ నాకు భరతుఁ డెట్లు ♦ నాయన్న రాఘవ, రాముఁ డట్లు రాము ♦ రాజ్యమెల్ల
భరతునిదె యటంచుఁ ♦ బాటింతు నేనింత, కలుగఁదొడర రిత్త ♦ యడచిపడకు.

క॥ శాంతతమైన నాతనిమే, లంతయుఁ గనఁగని తదీయ ♦ మహాదార్యం బో
కిం(?)తయుఁ ద్రిక్కక యుండక్, మంతనమున నెంచి యవల ♦ మాటాడఁజనుక్.

—♦ మంధర రామాభిషేకవిఘ్నం బాచరింపఁ గైకఁ బురికొల్పుట ♦—

ఆ॥ అనినఁ గనలి కనలి ♦ యారాటపడిపడి, నేలవ్రట్టి చేత ♦ నెఱపినెఱపి
పలికె నావిరుద్ధ ♦ భాషిణి చలపట్టి, యిట్టులనుచుఁ దుది మ ♦ దేభగమన. ౯౧

సీ॥ మురియకే రాముని♦మునుపటి తెఱఁ గెంచి, సవతిఁగా నెఱుఁగు కో ♦ సలునికన్నె
నాపెతోడ సుమిత్ర♦కా మైత్రిఁ దలఁపుము, లక్ష్మణు పూనికో ♦ ల్లాగు గనుము
రాజుబూనుగ(?)మాని ♦ రహిఁ గానపడకుము, చుట్టాలు గల రని ♦ చూడఁ జనకు
మెడపడ్డ సౌభాగ్య ♦ మే తీరం బనఁబోకు, మిక్కాలకర్మంబు ♦ లెన్నికొనుము
భరతుని శుభంబు పాటించి ♦ భంగపాటు
దలఁగ నగుయోగ మూహించి ♦ దాశరథిని
వనమునకుఁ బంచి సుఖియించు ♦ వలను గాంచి
యావల గృతార్థతావాప్తి ♦ నందు మనుము. ౯౨

క॥ నిను నీ వెఱుఁగవు దుఃఖం, బను వనధిం బడితి కర్జ ♦ మరయవు తెలుపక్
గొనకొనవు త్రోవ నెక్కొన, ననద వగుదు వింక నేమి ♦ యనఁ గల దబలా.

తే॥ ముగుద వని కాక యెపుడో రా ♦ ముఁడె యనంత
రునిఁగ భరతుని దొరఁ బూని ♦ ద్రుంటఁ దలంతె
యతని కొకసూనుఁ డొదవిన ♦ నవల నేమి
యనెదొ నామొఱ్ఱ లిపుడె త ♦ థ్యము గణింపు. ౯౪

క॥ నలువురిలో నొక్కనికే, యలవడు రాజ్య మది యెట్లు ♦ కగు దూరం బ
వ్వలను పలువురకుఁ బాల్పడ, బలవంతులు గెల్తు రలఁతి ♦ పడ నొడు రొరుల్.

ఆ॥ కానఁ బెద్దవాని ♦ నే నేత నొనరింతు, రవనినాథు లాతఁ ♦ డంతలంత
లైన నోకసమర్థు ♦ నాదరింతు రనంత, రుండు నట్టిఁ డగుచు ♦ నుండె నేని. ౯౬

క॥ ఈయిరువురును సమర్థుల, హో, యెటులేనియును రాము ♦ పౌరు వెడఁబాసెన్
వేయుననసేల నీసుతుఁ, డేయనువున నైనఁ జెనుట ♦ యే యేర్పడియెన్. ౯౭

క॥ అనఘుఁడు సుఖోచితుఁడు నీ, తనయుఁడు వత్సలవు నీవు ♦ తజ్జీవితజీ
వనపరవు నీదుమేలున, కనుమాట దలంప వరిశు ♦ భార్థార్థినివై. ౯౮

క॥ ఇంతటి తెలివిన కాకే, సంతసమునఁ దొడవు లిడఁగ ♦ సంభ్రమపడె దో
యింతి ; నినుఁ బోల నిలఁ దన, యంతమునకు మందు గొనెడు ♦ నట్టిది గలదే.

తే॥ రాజ్యము తిరంబుగా రామ ; ♦ రాముఁ డపుడె
నీసుతుఁ దెరల్చుఁ బొలియించు ♦ నెరిఁదలంచు
నింతియ యనంగ నగుఁ గాని ♦ యెన్నఁడేని
సవతికొడుకుల కెలమి యి ♦ చ్చుకముఁ గలదె. ౧౦౦

క॥ ఎంతటిద్రోహములకు భూ, కాంతులు చొరఁబాఱ రింత ♦ గాన వొకఁ డిదే
వింతయె యేకార్థవశో, ద్భ్రాంతులు మునుఁ బడ్డపాట్లు ♦ పాటింపవొకో. ౧౦౧

ఆ॥ ఇపుడె తమ్ము ననిచి ♦ యెమ్మెయి రాజ్యమ్ము
దండ్రి యొసఁగఁ బూనఁ ♦ దలఁచె రాముఁ
డిది యెఱుంగరాదె ♦ యేమంటి తొలి గలి
వోసి యవలఁ బెరుఁగు ♦ వోయువారె. ౧౦౨

క॥ దేవాసురులకు వైరము, లీవలనునఁ గాదె యెపుడు ♦ నెడలవ యవ్వా
రీవారిని సోదరు లని, శ్రీవెలయం జేర్చుకొనెడు ♦ రీతిఁ దలఁతురే. ౧౦౩

ఆ॥ అడవి సింగ మెదిరి ♦ యటమటించెడు గజ, యూథపతియ నాఁగ ♦ నొప్పు భరతుఁ
డడరి రామువలని ♦ యభియోగ మర్థించి, చెడియె మున్న యింకిఁ ♦ జెప్పనేల.

క॥ కూడిమను కొదవ వలపులు, పోఁడుములుం గాక కడచు ♦ ప్రొద్దునఁ గలవే
వాఁడిమగఁ డయ్యె రాముని, వీడక లక్ష్మణుఁడు వెరయు ♦ విధ మరయుటచేన్.

తే॥ సన్నిధానంబు రక్షింపఁ ♦ జాలి యుండుఁ, గదిసియుండెడుచెట్లకుఁ ♦ గాదు హాని
యెడముపడి యున్నఁ గెడపుదు ♦ రడవిమనికి, వా రనఁగ నెప్డు వినలేదె ♦ వారిజాక్షి.

క॥ అన్యోన్యాశ్రయమున వా, రన్యోన్యసహాయు లనఁగ ♦ నై రాశ్వను ల
ట్లన్యుఁడు నీకొడు కెట్లును, మాన్యుం డవ్వారిఁ జేర ♦ మలయనికతనన్. ౧౦౭

ఆ॥ దారసంగ్రహంబు ♦ తద్దయు నట్టిద, వారి కొక్కజతయు ♦ వీరికొక్క
జతయుఁ గాఁగ నయ్యె ♦ సవతులంతోడి దా, కూర్మియేని నీకుఁ ♦ గూడఁబడదు.

క॥ అది ప్రియవాల్లభ్యజమౌ, మదమునఁ గౌసల్య గిట్టి ♦ మాత్సర్యమునన్
గుదియించితి కావున నీ, కొదవదు తుది దానఁగీడు ♦ నొందెద వబలా. ౧౦౯

ఆ॥ రాముఁ డఖిలరాజ్య ♦ రమతోడి సర్వస్వ, మంది యాకసంబు ♦ నంటముట్టు
నపుడు పౌరల నేమి ♦ యగు నీవు మొఱవెట్ట, నాలకించువార ♦ లవనిఁ గలరె.

క॥ కలకాల మొరిమ నుడిగము, గలవే పొనరింప భూమి ♦ కాంతుఁడు గాకీ
వలనున నీసుతుఁ డెడసినఁ, దలఁపు మతండున్న నీదు ♦ దశఁ బాల్కొనఁడే. ౧౧౧

ఆ॥ కాన నేలచెడెదు ♦ కావరంబుననుఁ బ్రాఁ, బలుకు నాదుపలుకు ♦ పాటిసేసి
సూనుకాచికోలు ♦ చూడుము తనబ్రదు, కెంచి పరుల సేమ ♦ మెన్నవలయు.

—♦ కైక మంథరచేయు దుర్బోధితంబంగీకరించి దాని బహూకరించుట ♦—

మ॥ అనినం జిత్తమునందు మెత్తఁదన మొ ♦ య్యందోఁప ముమ్మున్న నె
ట్టన దన్జుట్టిన దైవమాయ యవగా ♦ థత్వంబుకై కోలునం
దనర న్నంతతివంక వత్సలత త ♦ త్కాలంబు దార్కొనగాఁ
బొనరం దత్కృతియోజనావికృతికిం ♦ బూఁబోఁడి యుద్యుక్తయై. ౧౧౩

తే॥ ఉరగి యట్టులు రోజుచు ♦ నుగ్రమూర్తి, భావమును భ్రూకుటీనటి ♦ పల్లవింపఁ
జేయ ననెఁ గైక దానితో ♦ నీయభీష్ట, మొనరఁ గూర్చెద నింకిట ♦ నుడుకవలదు.

క॥ అడవికి రాముని బంపఁగఁ, బుడమికి భరతాభిషేక ♦ పుంగథ నడుపన్
దొడరెద నింకిటఁ గాలము, గడపక యుండంగ నెల్ల ♦ గావలె నొకటన్. ౧౧౫

క॥ ఏయనువున నీజతనము, పాయక ఫలసిద్ధిఁ గాంచి ♦ ప్రబలునో మదిలో
వే యోజింపుము గట్టియు, పాయం బది దెలిసి తెలియఁ ♦ బలుకుము నాతోన్.

తే॥ అనిన మొగమున వికసనం ♦ బనువుపడఁగ
నాత్రివక్ర యపక్రమం ♦ బగు పథమునఁ
గాలిడుచుఁ బల్కె నీమెఱుం ♦ గనిది కాదు
దేవి ; నీ వేల మఱచితో ♦ తెలియఁబడదు. ౧౧౭

క॥ నెఱిఁ గప్పిపుచ్చెదో నీ, వెఱిఁగియు నెఱుఁగనిద పోలె ♦ హేళనమునకై
మఱువుపడునదియె యెటు లే, మఱితో యయ్యర్థ మెఱుక ♦ మయిమయినుండన్.

చ॥ వినిచెద నీకు నవ్వరవు ♦ విత్తము విత్తమ మైన నిప్పు డీ
వునుఁ బరికింపు మింపునకుఁ ♦ బోలునపో యని నిశ్చయింపు మొ

య్యానఁ బొనరించి భద్రముల ♦ నాదటఁ గాంచు మొకించుకంతయున్
మనమున సంశయింపకుము ♦ మానముఁ బ్రాణముఁ గావు మిమ్మెయిన్. ౧౧౯

ఆ॥ అనఁగ సెజ్జనుండి ♦ యత్తలోదరి లేచి, యాదరమున దాని ♦ ననుమతింపఁ
జేసి యింక నీదు ♦ తెరువున మెలఁగెద, నిదె ప్రమాణ మనుచు ♦ నెంచు మెదను.

క॥ ఏసడినేనియు భరతున, కే సిరి దక్కొలుగాఁగ ♦ నెడసి రఘువరుం
డాస సెడ నడవిఁ దిరుగ సె, బాసనఁ దగునాసమాఖ్యఁ ♦ బన్నుము పొసఁగన్.

ఆ॥ అనుచు సమయ మొప్ప ♦ నద్దేవి నొడివిన, రాము నభ్యుదయము ♦ రాణసెఱుపఁ
గూర్చి యిట్టులనియెఁ ♦ గుబ్జ మంధర దుష్ట, వర్తనంబు వెనుచు ♦ వలనికగుచు.

క॥ పాపమువంకకుఁ బోవఁగ, నాపట్టునఁ దమక రెంత ♦ యనువరులైనన్
బాపురె; దైవము తమదెస, కేపున దొసఁ గొలయఁజేయ ♦ నెంచెన యేనిన్.

—♦ మంథర కైకకుఁ బూర్వదత్తవరంబుల స్మృతికిఁ దెచ్చుట ♦—

సీ॥ వైజయంతపురంబు ♦ పాలించు దక్షిణ, దిశ శంబరుండునా ♦ దితిజుఁడొకఁడు
శతమాయుఁ డెందు దు♦స్సాధుండు వేల్పుల,కతఁడు తిమిధ్వజుం ♦ డనఁ దనర్చుఁ
గోణపులం గొంచె ♦ కోణంగులఁ గూడి, పవలు యుద్ధముసేసి ♦ బడలినట్టి
వారి సుప్తుల రేలు ♦ వధియించుచుండు ని, ట్లవ్వాని కోల్తల ♦ కదరి చెదరి

వేల్పు లెల్లరు మొఱవెట్ట ♦ విభుఁడు నీదు
భర్తఁ బిలువంగఁ బనిచినఁ ♦ బయనమగుచు
నిన్ను రమ్మన్న నరిగితి ♦ నెలఁత నీవు
సాహ్య మొనరింతు నని సడి ♦ సన్న వెలయ. ౧౨౪

క॥ కొందఱు రాజర్షులు తన, కుం దోడ్పడ దశరథుండు ♦ కుహనాసురులన్
క్రమ్మందింపఁ దొడరె నపుడీ, వుం దిరమై సాయమునకుఁ ♦ బూనితి వొంటన్.

ఆ॥ వైరివరులు బెదర ♦ సారథ్య మొనరించి, తలఁతఁ బాపి తూడ్చి ♦ తలుఁగులెల్ల
తేరి చీల వ్రాల ♦ నేరిమి నెఱపి త, క్కాల మాపదలనుఁ ♦ గడపి తబల. ౧౨౬

క॥ జయమెనసి తోనె నీదగు, నయముం బరికించి మెచ్చి ♦ నాథుఁడు నీపై
దయ వెలయ రెండువరములఁ, బయోజముఖి; వేఁడు మనిన ♦ బమ్మెరపడుచున్.

ఆ॥ నాకు వరము లేల ♦ నాయక; నీయను, గ్రహము గలుగ నది యొ ♦ కండ చాల
దా; యనంగ నతఁడు ♦ తఱిమి కోరుమన నీ,యొద్ద నునిచి తఱిన ♦ యొసఁగుమంటి.

క॥ పదఁపడి నాకునుఁ జెప్పితి, వదనగు నెడ వేఁడుకొందు ♦ నంటి మఱచి తే
మది నిలిపితి నావరయుగ, మొదవించునుఁ గర్జ మేలఁ ♦ యులికిపడంగన్.

ఆ॥ వల్కలములు గట్టి ♦ వనవాసఖేదంబు, రాముఁ డొంద నోకవ ♦ రంబు గోరు
మొకట భరతుఁ డెల్ల ♦యుర్వరఁ బదునాలు, గేండ్లు నేలుకొంట♦ నెన్నికొనుము.

ఆ॥ ఎల్లకాల మనిన ♦ నిచ్చకంబులు పౌరు, షములు మున్నుగాఁగ ♦ సంభవించు
నలఁతిమైఁ జతుర్ద ♦ శాబ్దంబు లని వేఁడ, నాఁటి కొండొకండు ♦ నయము లేదె.

క॥ ప్రవ్రాజితుఁడై రఘువరు, డవ్రణుఁడై యేగుదేఱ ♦ నరయంజను నా
సువ్రతున కొండుదెసఁ ద, త్త్రివ్రాటవ్యటనమున వి ♦ ధింపఁడె విధియున్. ౧౩౨

క॥ ఇన్నిటఁ దఱి గడచిన మా, కిన్నేఁతయే చాలునందు ♦ రెల్లజనులు దా
న న్నెలవు రామునకుఁ జెడి, బన్నము పాల్పడఁగ నీకు ♦ భద్రము లొదవున్. ౧౩౩

తే॥ నీదు పంతంబు చెల్లించు ♦ నీమగండు, సత్యసంధుండు నీపయిఁ ♦ జాలఁ గూర్మి
గలఁడు జాగేల, కడచినఁ♦గాదు కర్జ, మింక నీబాగుపడులాగు♦ నెనయఁ గనుము.

క॥ ఒండెన్నఁ జనకు మియ్యది, దుండఱికం బనకు మేను ♦ ధూర్వహానై పై
నుండెద నీమేలెంచుచుఁ, బండిన నగుఁ జేనిపంటఁ ♦ బరిపాటిఁ గొనన్. ౧౩౪

ఆ॥ క్రోధమందిరమున ♦ కుం జని మేల్నగ, లూడ్చి వైచి యేచి ♦ యుత్తనేల
మేను వ్రాల్చి దృఢత ♦ మేకొని యున్న ని, న్నాదరింప వచ్చు ♦ నధిపుఁ డపుడు.

క॥ అశ్వపతితనుజ ; నిన్నతఁ, డాశ్వాసింపంగ జేరు ♦ టారసి యత్యం
తశ్వాపదరూక్షతమై, నిశ్వసితము లొదవఁ జేసి ♦ నేటుకొన నగున్. ౧౩౫

చ॥ అతని నిరీక్షసేయవల ♦ దాతఁడు పిల్చినఁ బల్కరాదు స
న్నుతు డయినం దెలర్పఁ జను ♦ న్యాయము దెల్పఁగ వచ్చిన న్గ్రుధా
కృతిఁ గొను మెట్లువేఁడినను ♦ గీడ్పడఁ జేడ్పడి యేద్వ మొంట స
మ్మతిఁ బొనరింప నెంచినను ♦ మానిని ; మానుము తత్ప్రిసక్తులన్. ౧౩౬

క॥ వనితా ; కుపితం జేయఁడు, నిను క్షుభితవుగా నుదీక్ష ♦ నేరఁ డొనర్పన్
తన ప్రాణము లీవని మం, తనమునఁ దలపోయుచుండుఁ ♦ దరమె తెరల్పన్.

ఆ॥ అవల నుసుఱులైన ♦ నందిచ్చు నగ్నిలో, నైనఁ జొచ్చు విషమ ♦ యేని నమృత
మనుచుఁ గ్రోలు వరము♦లర్థింపకయ మున్నొ,సంగి యిపుడు ద్రోవ♦శక్తుఁ డగునె.

క॥ గడి దాఁటఁడు నీపలుకున, కడరొందును మందభావ ♦ వరయవు స్వైకమై
యడరారెడు సౌభాగ్యము, దొడిఁబడుదో యనుచు నిట్లుఁ ♦ దోడ్పడ వలసెన్.

క॥ దైవాసురయుద్ధవరము, లావలనున మఱతువే మొ ♦ యనఘాత్మిక వా
శ్రీవెలయుమణిసువర్ణ ♦ ప్రావారము లూళ్ళొసంగఁ ♦ బరితోషమునన్. ౧౪౨

చ॥ నడిచెడుకర్జము ల్నడువ ♦ నాయకుఁ డాదట మెత్తఁబాఱనై
నడులకు బందికో లగుచు ♦ నూల్కొనఁ గాంచెదుజాడ లెంచి య
ప్పుడె వరయుగ్మము న్నొడివి ♦ పూన్కికి మేకొనఁ బుత్రురాజ్య మ
ట్లడవికి రాముఁ బంపుటయు ♦ నాడి తథా స్తనిపింపు మంగనా. ౧౪౩

ఆ॥ ఎట్టులైన భర్త ♦ నెడపడనీక నీ, వీకథాంశ మిట్టు ♦ లెల్ల నడుపఁ
జూచితేని భరతు ♦ చుట్టమ్ములే యాదు, రెల్లవారుఁ దెఱవ ♦ యింత నిజము.

క॥ రాముఁ డరాముఁడ యగు న, ట్లామయమునఁ బడి చతుర్ద ♦ శాబ్దము లడవిన్
నేమముసెల్లఁ జరింపఁగ, నేమెయి రాఁగాంచు వచ్చి ♦ యే మొనరించున్. ౧౪౫

క॥ కృతమూలుఁ డితఁడు గాఁ ద,త్కృతములు నిష్ఫలము లగుచుఁ ♦ గెడయు హతామి
త్రత చొప్పడు నీసుతునకు, సతముగ సామ్రాజ్యపదము ♦ సమవహిత మగున్.

ఆ॥ మంచికాల మొదవె ♦ మానిని; నీకింక, నడుఁక వలవ దవని ♦ నాధువలని
కీడు దలఁచి వలపు ♦ గీర్తింపు మేవార, లేమి సేయువార ♦ లీవరముల. ౧౪౭

తే॥ ఎల్లసంభారములు నిప్పు ♦ డీవలనున
భరతు రాజు నొనర్ప నే ♦ ర్పఱచుకొనుము
తొలుతనే రాముఁ గానకుఁ ♦ దోలు మనుము
మాన కిమ్మాడ్కిఁ దనయుని ♦ మనిచి మనుము. ౧౪౮

క॥ అని యిట్లనర్థ మర్థం, బొనరింపుచు మదికి నాన ♦ నొగి బోధింపన్
దన నెఱి సెడఁగఁ గిశోరిక, యనువున నుత్పథముఁ గేక ♦ యాత్మజ మొనసెన్.

—♦ కైక మంధర తెలిపిన కర్జంబున కియ్యకొని తత్ప్రకారంబున కుద్యమించుట ♦—

క॥ దానిం గని తా నిట్లన, నీనెఱి యట్లుండ నెపుడు ♦ నేర్చితివే యి
ప్పానికమైఁ గఱపుట వి, ద్యానీతిపరిశ్రమంబు ♦ లంతలు గలవే. ౧౫౦

ఆ॥ లేరె దాసు లెందు ♦ లేరె కుబ్జలు నీదు, తెలివితేట లొలపుఁ ♦ దీయఁదనము
నించుపలుకుబడులు ♦ నేర నొండెడఁ గాన, నింతదానవగుట ♦ యెన్నఁ డెఱుఁగ.

క॥ రా జొనరించిన కుటిల పు, యోజన నీవరయఁ గాంచి ♦ తున్మత్తత నే
యోజింపనైతి నెమ్మది, నీజాణతనంబ నాదు ♦ నేరమిఁ బాపెన్. ౧౫౨

తే॥ పొట్టివారికి బుద్ధులు ♦ పుట్టెడుండుఁ, బొట్టలో నను నవ్వార్త ♦ పొసఁగె నేఁడు
శంబరునిమాయ లటునీతి ♦ చర్చ లెదిరి, సన్న లింగితములు నీవ ♦ శంబులగుట.

క॥ వాతముచేఁ బద్మమువలె, నాతిరో ; సన్నతవు గాఁగ ♦ నలువొందితి వీ
వీతెఱవునఁ బ్రియదర్శన, లాతెఱవలు గలరె యుపహి ♦ తార్థ లగుచు రే.

తే॥ స్కంధములఁ దన్ని యురమునఁ ♦ జాల నిగిడి
యుదరము నడంచి యీస్థగు ♦ వున్నజాడఁ
జూడ నెన్నియు దీననే ♦ చూనిపి చేసె
నిన్ను విధి యన్న యన్నయం ♦ బెన్నఁబడియె. ౧౫౫

క॥ ఉర మభినివిష్ట నుబ్బుర, మర రే ; యీస్థగువు జఘన ♦ మదనమ్ము పయో
ధరము లురువు లీనడుమను, దరము సునాభము కృశించెఁ ♦ ద్రవ నొంది చెలీ.

ఆ॥ నిర్మలేందునిభము♦నీమోము స్థగు వొప్పఁ, గూట మనఁగ రథము♦ఘోణ మనఁగ
దీన దానఁ గళలు ♦ దెఱఁగొందు క్షత్రియ, మతిమతార్థనయువి ♦ మర్శనములు.

క॥ ఎడ దీనిఁ గప్పుదానం, దొడవుల హారములఁ గొఱఁత ♦ దొడరునె నీ కే
నడ రెడలి మనఁగ భరతుఁడు, పడఁతీ ; యీకృతినిఁ బట్ట ♦ భద్రుఁడ కాగన్.

ఆ॥ నీదు పొడవుకాళ్లు ♦ నిడుపులా ♦ జంఘలుఁ, గనకవసనమున నె ♦ కప్పిపుత్తు
రాజహంసభంగి ♦ రాణమై నాతోడ, నడుతు మోము చంద్రు ♦ నడుఁకఁ జేయ.

క॥ జఘనము రశనాదామా, తిఘుష్టమై నెగడ మధ్వ ♦ తీర్ణక్షామం
బఘ మెడలఁ దాల్చి నాతో, సుఘుస్రమునఁ బొల్తు వెదిరి ♦ చొక్క వయస్యా.

క॥ నీవెడఁదయురము మోమును, శ్రీవిలసచ్చందనమునఁ ♦ జిత్రకమున మే
నావరవసనమ్మునఁ దగ, దేవతవై యుందు సాటి ♦ తెఱవలు గొలువన్. ౧౬౧

ఉ॥ జాత్యసువర్ణచందనపుఁ ♦ జర్చయు బంగరుబొట్టు దామకం
బత్యుపమానభోగ్యములు ♦ నంది ధృతిం జదలంచి పొల్చుని
న్నిత్యము గొల్చి మందు రీక ♦ నేనని నీవని మెన్న కన్యలేఁ
బ్రత్యయముం బొనర్తు నిటు ♦ ప్రాణముపై ననుమాన మేటికిన్. ౧౬౨

క॥ సరిపడనివారి నవ్వుచు, సరిరా రొకరంచు మేటి ♦ సంభ్రమ మొప్పం
జరియింతు వింక నాదగు, వరిష్ఠ మివ్వరము ఫలము ♦ వర్తిలె నేనిన్. ౧౬౩

ఆ॥ అనుచు శయనవేది ♦ నగ్నిశిఖాకృతి, నున్న యన్నెలంత ♦ యుత్సహానము
పలుకుబడులు నెన్ని ♦ పాపచారిణి యది, యిట్టులనియెఁ దఱుము♦ బెఱుకపడఁగ.

చ॥ గతజలసేతుబంధనము ♦ కర్జమె యార్జనసల్పు మిప్పుడే
మతికరిరీతికిం దొడరి ♦ మానిని ; యార్జవ ముజ్జగించి యా
జతనము పెంపున న్మగని ♦ సన్న మఱల్చి తటాలున న్థ
సుతెపతి రాజుఁ జేయ కెడఁ ♦ జొన్పఁగఁ జాలుత్వచే ప్సితార్థమున్. ౧౬౪

—♦ కైక క్రోధాలయమునం బ్రవేశించుట ♦—

ఆ॥ అనిన దానిఁ గూడి ♦ యప్పుడే తరలి క్రో, ధాలయమ్మున మెట్టి ♦ హారవితతు
లెల్లయాభరణము ♦ లెడఁబెట్టి జడ గాఁగ, గచభరమ్ము గట్టి ♦ కప్పుఁజుట్టి.

క॥ శయనించె నేల సుదురా, శయమై తనచెలువు దూలఁగఁ ♦ జాన చెలువుఁడే
నయమున వచ్చునొ యెటులో, మయమునఁబడనగునో యనుచు♦మల్లడిగొనుచున్.

—♦ కైక తన ప్రతిజ్ఞను మంధరకుఁ దెల్పుట ♦—

ఆ॥ మఱతువేమొ పూన్కి ♦మానిని; మగని నె, య్యమునకలిమి నింత♦నంత నొదిఁగి
యుండుదాన ననుచు ♦ నొత్తి యాకుబ్జ వ, చింప దానితోడఁ ♦ జేడె పలికె.

క॥ హేమోపమ కుబ్జా! వా, గ్దామంబునఁ గట్టుపడి వి ♦ ధానము సెడ వి
ద్యామానితానితం బగు, క్రోధం దిటవుపడి నిలిచె ♦ దూసఁ గదె కాదే. ౧౬౯

చ॥ మొదలిడి పూనఁగాఁ దగదు ♦ మూర్ఖత మోవఁగ రానికర్జముల్
బదనున వీడఁగాఁ జనదు ♦ పద్ధతి నెక్కినువారి కంచు ని
య్యది మది నెంచి మేకొనఁగ ♦ నైతినపో యిఁకఁ ద్రోతు నెట్టులా
స్పదమునఁ జేరికాక తెతి ♦ భావనసేయుదు నామనోగతిన్. ౧౭౦

క॥ మృత నైతి ననియొ భరతు నృ, పతిఁ జేసితి ననియొ కడఁగి ♦ పంపెదవు హితా
హితవార్తలలో నొక్కఁ, డతివరో; మత్కృతినిఁ గేక ♦ యాధీశునకున్. ౧౭౧

తే॥ ఏను బ్రదికినఁ దెరలిన ♦ నెఱిఁగె దీవు, రాముఁవనగతి నాసుతు ♦ రాజ్యలబ్ధి
నట్టు లొనరింతుఁ గాక కా ♦ టండెఁ బాము,వట్టినోటిది యనునట్లు♦వావిడుతు నె.

క॥ ఏ నిట భోగ్యము లెల్ల, న్మానెద భోజనము జీవ ♦ నంబును వీడం
బూనెద సీయాన సుమీ!, చానరో; నిజ మింతవట్టు ♦ జడియకు మింకన్. ౧౭౩

క॥ అనవుడు మఱవకు మట్టులె, యొనరింపుము మానవలదు ♦ యోజన యిది నె
ట్టన బహుదోషము లెడఁ దోఁ, చిన నేచినకినుక ననివ ♦ చించె నది పోరిన్.

క॥ రామాభిషేక మధిపుడు, నేమమునఁ బొనర్చునేని ♦ నే నుసుఱులతో
హేమమణిరత్నభూషా, స్తోమంబుల నెల్ల విడుతు ♦ సిద్ధము సఖిరో. ౧౭౫

ఆ॥ అనుచుఁ బలికి దాని ♦ ననిచి యుదీర్ణసం, రంభతమము సత్వ ♦ రంబె మొగము
గ్రమ్మ సొమ్ములెడలి ♦ గ్రహతారకాదూర, మైన సారసరణి ♦ యనఁగనుండె.

క॥ పాతిత యనఁదగు కిన్నర, భాతిఁ దలోదరి ప్రశస్తిఁ ♦ బాసి కనుఁగొనన్
బాతికము పాలుపడనై, యాతతిఁ జూపట్టె వికసి ♦ తాంబుజవదనా. ౧౭౭

ఆ॥ ఊడ్చినట్టినగల ♦ నుడురాజముఖి చల్ల, నంబరంబునట్టు ♦ లవని మెఱసె
నూర్పుగాడ్పు లొదవె♦నొండొండఁ దలఁపు ల,య్యెనునిరాకవీఁక♦ కెగయుచుండె.

క॥ ఆపాపచే విదర్శిత, మై పోఁడుములెల్ల వీడి ♦ యధికృత్యము చూ
పోపక వికృత మొనర్పఁగ, నాపద పాల్గాఁగఁ దరుణి ♦ యవనిం బొరలెన్. ౧౭౯

తే॥ నాగనాసోరు ; వింటివా ♦ నాగకన్య, నాఁగ రోజుచు నయ్యెల ♦ నాగ మగని
నాగమునవంకఁ ద్రోయనౌ ♦నాగడమున, నాఁగ సమకట్టి మేల్మివి♦ నాగ నడరె.

చ॥ బొమముడి దక్క మోమునను ♦ బొట్టొకయింతయుఁ దోఁపఁ బోదు లో
కము మసిపూఁతగాక నెఱి ♦ గట్టిన చెల్వములేదు స్త్రీవికా
సము వెలయింపఁ బోలు సడి ♦ సన్నలు పోఁడుము లిట్టివంచు నే
మమున వచింపరాదు తగ ♦ మానినికోపభరం బపారమై. ౧౮౧

ఆ॥ చాన యోజమై వి ♦ చారించి యవిచార్య, మా ననర్థమునకు ♦ నాసనేసి
యర్థితార్థ మిదియ ♦ యాత్మసుఖావహం, బనుచు ననుచు జతన ♦ నడరుచుండె.

క॥ ఏణాక్షి చెద్దు దుష్కృతి, పాణింధమ మగుచు నిగిడి ♦ భావిదశాసం
ప్రాణనము నాయదే యని, పాణసి తెఱఁగెఱుక సేయు ♦ భంగిఁ దనర్చెన్. ౧౮౩

క॥ శూన్యాగారం బట్టు ల, మాన్యంబై యంతిపురి ర ♦ మాదూరంబై
యన్యాయగతికి నెలవగు, విన్యాస ముపన్య సించు ♦ విధమున కమ్యెన్. ౧౮౪

క॥ అంతయుఁ గనుఁగొనుచు న్ని, శ్చింత యగుచు సిద్ధివలని ♦ సిరి మంథర తా
నెంతయుఁ గడుకొనియెను సి, ద్ధాంతిత మీయర్థ మని క ♦ దర్థ్వార్థితమై. ౧౮౫

క॥ ఎడనెడ వచ్చుచుఁ బోవుచు, బుడిబుడినుడు లొడ్లకడనుఁ ♦ బొనరింపుచు న
ప్పడఁతుక తెఱఁ గరయుచుఁ దో, డ్పడి తోడ్పడ కుండెఁ గుబ్జ♦ పాపపునడతోన్.

—♦ దశరథుండు కైక యవరోధంబున కరుగుట ♦—

క॥ అట్టియెడఁ బట్టభద్రుఁడు, కట్టాయితమైనమేలి ♦ కలిమి కలిమికిన్
నెట్టన గుదురగు తనమది, పట్టునఁ బట్టిక ముదం బ ♦ పారమొనర్పన్. ౧౮౭

తే॥ సిరు లొలయ రాముపట్టాభి ♦ షేక నిభృత
మా మహోత్సవమును సభి ♦ రామ మగు వి
ధమున సమకూర్చి తనకూర్చు ♦ దయిత కెఱుక
పఱచి నెఱిగాంతు ననుచు సం ♦ భ్రాంతిఁ బేర్చి. ౧౮౮

క॥ ఆజ్ఞాపించి సమజ్ఞా,నుజ్ఞాపనమున జనముల ♦ నూల్కొలిపి వశి
త్వజ్ఞత్వనిరతుఁ డుదితా, భిజ్ఞానము పొదలఁ జనె ని ♦ వేశనమునకున్. ౧౮౯

సీ॥ చిలుక పల్కు లొకంటఁ ♦ జిలుక మెత్తనిచిత్త, ముల్కి పాటునభంగి ♦ నోటుపడఁగ
నెమ్మి యాడఁ దొడంగు ♦ నెమ్మి చొప్పడ మోహ, మాననంబున వ్రేలు ♦ నట్లు గాఁగఁ
బ్రోదిరాయంచ మె ♦ ప్పున కెదుర్పడి చూపు, నడ చూడ్కులకు వింత ♦ నయము నేర్ప
శారికాసంతతి ♦ చదువు విద్దెల మేలి, ప్రస్తారములు చొక్కు ♦ పాటు గూర్పఁ

బూవుపొదరింటి పొరువునఁ ♦ బొదలు కొదమ
తేఁటి సయ్యాట బిట్టురి ♦ యాట పొల్ప
డంగఁ జేయంగ నగునప్ప ♦ డంతి యంతి
పురిఁ బుడమిసామి మొనసె నా ♦ ప్రొద్దునందు. ౧౯౦

తే॥ ఎడపడక పూవులుం బండ్లు ♦ నిడెడుతీవి
యలు తరువు లొంటఁ బెనఁగి నె ♦ య్యంపుటిరవు
లొనరుపఁబడ నొ మేల్మిమై ♦ నొలయునెలవు
లల్ల గనుఁగొంచు నొయ్యన ♦ నరిగియరిగి. ౧౯౧

ఆ॥ పాండురాభ్ర మగుచుఁ ♦ బరఁగు నభ్రము రాహు,చరముఁ బర్వమునను ♦ జంద్రునట్లు
సొచ్చెఁ దేఁడు కైక ♦ సురుచిరమగు సద, నంబు డంబుమీఱ ♦ నంబుజాక్షి.

క॥ వాదిత్రగీతరవసం, వాదిశుకపికాలిహంస ♦ వల్గద్వ్యాజసం
నాదిత మామోదిత మా, రాదిత మవుదాని నొరసె ♦ రా జనురక్తిన్. ౧౯౩

క॥ శోకాపహచాంపేయా, శోకలతాగృహవిచిత్ర ♦ సుందరనిత్యా
స్తోకసుమఫలసులక్ష్మ్యా, నోకహసంపత్కలావి ♦ నోదిత మగుచున్. ౧౯౪

తే॥ దాంతరాజతసౌవర్ణ ♦ తతవిచిత్ర, వేదికాసాదితాసనా ♦ నూదితాభి
లక్ష్యభక్ష్యాన్నపానీయ ♦ లాలనోప, లాలితత్రిదివము కలా ♦ లలితమగుచు.

ఆ॥ ఒప్పు నచటు వెరసి ♦ యుర్వీతలేంద్రుండు, మెప్పు గదుర కెడఁద ♦ మెలఁతతోడి
సంగడమ్ము వంక ♦ జాల్కానం గనకాంగి, యెదురు రాక తడయు ♦ టెంచుకొనుచు.

ఉ॥ బంగరు వేదులం బొసఁగు ♦ పాటున రాజిలురత్నపీఠికల్
సింగపుగద్దియల్ రుచుల ♦ చెల్వము సూపుచు హంసతూలికా
సంగతిఁ బొల్చుసెజ్జలు వి ♦ శాలరసాలసలీలఁ దేల్చునా
రంగున మించు చిత్రములు ♦ రాణఁ దనర్చు తదంతరంబునన్. ౧౯౭

— ♦ దశరథుండు కైక గానరామికిఁ జింతిల్లుట ♦ —

ఆ॥ కోటిసేయువింత ♦ గొనములఁ దనరారు, తనదుశయన మరసి ♦ తరుణి గాన
రామి కలికి కలికి ♦ రాముమేలున నేమి, విధము పథముఁ బెరయు ♦ వెరవు గొనెనొ.

క॥ శూన్యము గా దెన్నఁడు నిది, యన్యాదృశ మనఁగరాని ♦ దత్యర్థకలా
విన్యాసము లెడపడఁగా, సన్యస్తస్థితికి నేల ♦ సంగత మయ్యెన్. ౧౯౯

ఆ॥ వరవుడ మ్మొనర్చు ♦ వామనికలు కుబ్జ, లోరయు నెచ్చెలులు న♦ యోక్త లెలయ
హెచ్చరికలు సేయ ♦ హేరాళమగు సుమా, శమున రాక యీాడ ♦ లమున కగునె.

క॥ ము న్నెన్నఁడు లే వివ్మొయి, సన్నలు ప్రాణమ్ములైన ♦ సఖి నాకొసఁగన్
గన్నెడ సేయదు రామునిఁ, గన్నకొడుకుకన్నఁ గాంచు ♦ గారా మెసఁగన్.

క॥ శ్రీమించు మెయిని సద్గుణ, ధామం బనఁ బరఁగుఁ గాని ♦ దారిఁ దలఁగి యు
ద్దామత సెడఁ జూచు నె వి, ద్యామహితకు మొక్కలమ్ము ♦ తర మై యున్నే.

తే॥ ఇష్టమృష్టాన్నములఁ దృప్తి ♦ నెనసి గీతి, మాధురికి జొక్కి సత్కథా ♦ మంజిమమున
కుబ్బియాడు సఖీజన ♦ మొకఁడుఁ గాను, పింప దీవేళఁ బ్రియ యెంత ♦ పేర్మి సెడెనొ.

క॥ రా రతిభులు చుట్టములును, లే రలస్తుతిపాఠకులును ♦ లేమల మెలు పే
తీరునఁ దీర్పన కెక్కడు, పోరిత మింకెద్ది యెట్లు ♦ పొరయం గలదో. ౨౦౪

తే॥ ఇంతవట్టు నే నెపు డిట్టు ♦ లెనసి యెఱుఁగ, వైజయంతంబునకు సాటి ♦ వచ్చు దీని
నాపులోమజ కెనయన ♦ నైన నాదు, ప్రాణ మీాచాన గానఁగా ♦ రామి కులికి.

— ♦ దశరథుండు కైకజాడఁ బ్రతీహారినడుగుట ♦ —

క॥ అని చింతిల్లుచు నెట్టన, దనశేయనస్థలము దలఁగి ♦ తత్పరత న్మే
దినినాథుఁ డవలఁ జని యడి, గెనుఁ దాఁ బ్రతిహారిఁ గాంచి ♦ కృపణత దోఁపన్.

క॥ అర్థపరత దుండగమున, కర్థి న్మెకొంట దుష్ట ♦ మావర్తన మ
త్యర్థ మలవడుట పాండి, త్యార్థము సెడఁ జూడకున్నె ♦ యని యెంచు నెడన్.

ఆ॥ అదియుఁ బలికె నలికి ♦ యయ్య; యేమయ్యెనో
యెఱుఁగఁ దామసించి ♦ యేణనయన
క్రోధమందిరమునఁ ♦ గొనకొని యల్లాడు
చున్నయది తదిచ్ఛ ♦ నొరసి కనుము. ౨౦౮

క॥ అనఁ దనగుండియ ఝల్లన, జనవిభుఁ డల్లనఁ దదుక్తి ♦ సంగతి నచ్చో
టున కరిగి కాంచె నక్కాం, చనాంగి యాయున్న తెఱఁగు ♦ సంజ్వరపడుచున్.

తే॥ పెద్దకాలంబు మనిన యా ♦ పెద్ద వయసు, దానిఁ బ్రేయసిఁ బ్రాణప ♦ దంబుకన్న
మిన్న యనుకొన్న యన్నల ♦ మిన్నఁ గనె న, పాపుఁ డప్పాపసంకల్ప ♦ రూపరయక.

చ॥ తెగువడి నేలపైఁ బడిన ♦ తీవియ చాయఁ గృశంబు వోవఁ బె
న్వగఁ గొని నాకలోకగతి ♦ వాసిన దేవతరీతి ఘూతమై

నొగిలెడు కిన్నరిం దొడరి ♦ నొవ్వునఁ బ్రచ్యుతమైన యచ్చరన్
మొగియఁగఁ జాలి జాలికగు ♦ ముగ్ధఁ గనుంగొని యార్తమూర్తియై. ౨౧౧

తే॥ శంబరాంతకుఁ డలరుప్ర♦సంగమునఁ బొసంగఁజేసిన మఱుమాయ ♦ జాడ నెఱయ
భ్రష్టయగు కష్ట మత్తఱిఁ♦బాదుకొనిన, నాతఁ డుమ్మలికం బందె ♦ నలరుఁబోఁడి.

క॥ వలఁ బడిన హరిణి చాడ్పున, నలమటపడుచున్న తనప్రి ♦ యాంగనఁ గని య
ట్లలవడియె దానిదశ క, య్యిలాధిపుఁడు మేలు దలఁగ ♦ నిందునిభాస్యా. ౨౧౩

క॥ పొరిపొరి లులితవ్యాకుల, తరసత్వరితాత్ముఁ డౌచుఁ ♦ దరలాక్షి తెఱం
గరసి తెరువొరసి కాకీ, నెరి దీర్పం దరమె యనుచు ♦ నెరయఁగ నగుచున్.

ఆ॥ మృగయువిద్ధ యగుచు ♦ మిడుకు కరేణుక, నాకరేణునాథు ♦ నట్లు పొదివి
పాణి పొడవు సాఁచి ♦ పరిమర్శన మొనర్చెఁ, ద్రస్తచిత్తుఁ డగుచుఁ ♦ దరలనయన.

—♦ దశరథుండు కైక నూఱడించుట ♦—

క॥ ఆవనితలోడఁ గాముకుఁ, డై వసుధాధిపుఁడు పలికె ♦ నంగన; క్రొత్తల్
నీవలననఁ గన్పడెము, న్నీవిధమగు నలుక గలదె ♦ యెఱుఁగనె నిన్నున్. ౨౧౬

సీ॥ దేవి; ని న్నెవ్వారు ♦ తిట్టిరో తెలుపు వి, మానిత వైతివే ♦ మానితాంగి
భూశయానత కేమి ♦ పొసఁగెనే సుకుమారి, కల్యాణి కల్యాణ ♦ కాంక్ష వలదె
ధూళిబ్రుంగుడువడ ♦ దోఁచెనే తొయ్యలి, భూతోపహతవైతె ♦ పొలఁతి; నేఁడు
పాల్పడెనే సాధ్వి ♦ పైత్యవికారంబు, కలఁగఁ బాఱితె యొండు ♦ కారణమున
నిచ్చ లన్నియుఁ దీర్పంగ♦నీతఁ డుండె, వైద్యు లున్నారు మాంత్రికు♦ల్వాసిగాంతు
రెఱిఁగి నీ విట్లుగా ఫల♦మేమి గలదు, పలుకు మొక్కింత నాదగు♦ప్రతిభ గనుము.

క॥ చిత్తప్రమాథినివ కా, నిత్తఱి నీవొదిఁగియుండ ♦ నే నవమతినై
నొత్తిల్లఁగ నగుదున కా, కిత్తైవు లెడలింప నోదు ♦ రెవ్వరు చెపుమా. ౨౧౮

ఉ॥ ఎవ్వని కేప్రియం బిడఁగ ♦ నెంచితి వమ్మయి మేలెఱింగి నీ
కెవ్వఁడు విప్రియంబు దన ♦ యిక్కటు లెన్నక చేసె నన్నియు
న్నొవ్వక తెల్పు తావకమ ♦ నోరథము ల్పనిగొమ్ము లెమ్ము నీ
నవ్వుమొగమ్ము సూపు మెద ♦ నాసొదఁ బాయఁగఁజేయు మింకిటన్. ౨౧౯

తే॥ ఉల్లమున మెత్తనకు నిది ♦ యుచితమగునె, కలికి కన్నులపై నేల♦కార్మతంబు
పొలఁతి; లేఁదీవె యిమ్మేను ♦ పొలియదటవె, యిట్టిచలపాదితనమున ♦ కీవెతలకు.

క॥ నాదుఃఖముఁ జెనుపఁగ నిటు, మేదినిపైఁ బొరలె దేమి ♦ మే లిది నీకీ
రోదనము వలనె పాపమ, కాదే యాత్మోపఘాత ♦ కర్మగ బనఘా. ౨౨౧

తే॥ దండ్యుఁ జేయంగఁ జూతు న◆దండ్యు నేని, దండ్యు నేని ఘటింతు న◆ దండ్యుఁ గాగ
నిభ్యుఁ గావింతు నిర్వేద ◆ నేని ధనికు, నిస్స్వుఁ బొనర్తు నీయాన ◆ నెఱయనైన.

క॥ ఈయెడ నీయెడఁ ద యభి, ప్రాయం బెడసేయఁ జూడ ◆ భద్రాత్మిక; యా
త్మీయంబగు జీవిత మెపు, డేయనువున నేని నీయ ◆ దే యనుకొనుమా. ౨౨౩

తే॥ తనబలఁగ మెల్ల నీదగు◆పనుపు సేయఁ, బనుచువాఁడ నే నమ్మెయిఁ ◆బరఁగువాఁడ
సంశయింపంగ నేల నా ◆ చంద మరయఁ, జాలవైతివొ నేఁటి కో◆ చంద్రవదన.

క॥ ప్రాచీనులు పాశ్చాత్త్యు ల, వాచీనులు నాఁగఁ బరఁగు ◆ వార లుదీచ్యుల్
నాచాతురి మేల్గాంచుచు, వాచావశత న్మెలంగు ◆ వారల కారే. ౨౨౪

క॥ వంగమగధకోసలమ, త్స్యాంగాంధ్రకళింగకాశి ◆ కావంతీశుల్
పొంగుచు నర్పించు ధనము, లంగనరో ; కోరు మొసఁగి ◆ యార్తి దెరల్తున్.

క॥ ఏ నోనగూర్చెద నీదగు, పూనికికిం దగుఫలంబుఁ ◆ బున్నెముపై నెం
చేనియు శపథ మొనర్చెద, మానినిరో ; యాచలమ్ము ◆ మాని నెగడుమా.

చ॥ కువలయ మెల్ల నేలుదు న ◆ కుంఠితలీల విపక్షులంచు లే
రవనిజను ల్జనాధిపులు ◆ నానతి వేచి చరించువార లి
ట్లువునది తెల్లమే శదె త్వ ◆ దాంతరవృత్తి గుదించుకోర్కి నో
య్యా వివృతిసేయు మయ్యది క ◆ రామృతమయ్యెడు నంచు నెంచుమీ. ౨౨౭

తే॥ ఈయరాని దటంచు లే ◆ దెందుఁ గలుగు, నేని నెట్టిదయేనియు ◆ నెంచి వేఁడు.
మెల్ల దేశంబులం దాని◆యిరవు లొరసి, తెచ్చి యిచ్చెద నిఁకిటఁ◆దెలివి గనుము.

క॥ ఆయాస మేల యీతఁ డ, నాయాసమ కాఁగ వశ్యుఁ ◆ డై యుండ శుభో
చ్ఛ్రాయగుణ ; శపథ మొనరం, జేయఁగ మెత్తువొ వచింపు◆శీఘ్రమె తెలియన్.

ఆ॥ లెమ్ము లెమ్ము నీభ◆యమ్ము నాకెఱిఁగింపు, మిమ్ముగనుము పలుకు◆నమ్ము మెలమిఁ
జకితురాల ; యేల ◆ జాల మే స్సైరింపఁ, జాల నంకపాలి ◆ లీల కగుము. ౨౩౦

క॥ నీహార్ద మలుఁగు వుచ్చెద, నీహారం బంశుమాలి ◆ నెఱి నొ ల్లెదలో
నూహాపోహము లుంచకు, మోహారిసాహరిగఁ బెనఁగు ◆ ముల్లాసముతోన్.

క॥ అని యూరడిల్లఁ బలికిన, వనజేక్షణ యుల్లసిల్లి ◆ వల్లభుఁ డెట్లుం
దనవలపువలనఁ జిక్కెన, యని రోసము దీఱఁ దేఱి ◆ నైనవగ తగన్. ౨౩౩

ఆ॥ విఱ్ఱవీఁగి ముసువు ◆ వెడలించి కుబుసంబు, వుచ్చి వెడలు పాఁప ◆ పొలుపు దోఁప
నాథుపైనిఁ జూడ్కి◆నాటె విసముత్తోడి, కోఱి యదియ కాఁగఁ◆ గువలయాక్షి.

—♦ కైక తనయభీష్టముం గూర్చి భర్తతోఁ బ్రసంగించుట ♦—

క॥ విభుఁడు తనయురినిఁ గంఠం, బభయత నిడెఁగామశరభ ♦ యాకంపితుఁడై
శుభ మిదెపో యని యిట్లనె, విభీతహరిణాక్షి పాప ♦ వినిభృతయగుచున్.

ఉ॥ నాయక ; నాదుసంగడము ♦ నాఁటికి నేఁటికి నీవెఱుంగవే
త్రోయఁగరానికోర్కి మదిఁ ♦ దోఁచి కుదింపఁగ నోంపు గానలే
కీయగడొందఁ బొల్పడితి ♦ నింతియ కా కెపుడెవ్వరేనియుం
జేయఁగ నోపువారె తమ ♦ చేటున కొగ్గి క్రుధావమాననల్. ౨౩౬

క॥ నాయెడకు వ్రేలుసూపఁగ, నోయధిపా; కలఁడె యొండు ♦ యోజింపకు మీ
నీయెడ నెక్కటి చక్కటిఁ బాయునె తనయిడినచనవు ♦ ప్రాభవ మెపుడున్.

ఆ॥ ప్రతిన ప్రతిన గాఁగఁ ♦ బాలింపు పాటించి, యెఱుకపఱతు నాయ ♦ భీప్సితంబు
నెగడు మెల్లగతుల ♦ నియతిమై నైహికా, ముష్మికార్థవితతి ♦ మొనయఁ గాంచి.

క॥ చేయఁ దలఁతేని శపథము, సేయుము తొలుదొలుత నాదు ♦ చింతిత మెఱుఁగం
జేయఁ గల నవల నీవల, శ్రీయుత సత్యప్రశంస ♦ చెలువారంగన్. ౨౩౯

క॥ అనినఁ దనపాలి మిత్తియ యని కనఁ డాఱేఁడు కర్మ ♦ మట్టిద కద య
వ్వనితఁ గాని జనితమదనో, న్మనస్కతం బులకలెగయ ♦ మలయఁగ నవ్వెన్.

క॥ కొంచె పునగ వటు పనుపడె, నంచితముగ నిరువురకును ♦ నతివకుఁ దనలో
నెంచినయంతయు నగునని, యించుక పసదన మొసంగు ♦ టే యని పతికిన్.

ఆ॥ కాముకుండు కైశికము హస్తసంగతం, బుగఁ బొనర్చి నగవు ♦ పొలుపు మీఱ
దయితుఁ డాశుచిస్మి ♦ తం గని యవలిప్త, వైతె యెఱుక లేదె ♦ యనినయించి.

క॥ పలికె నిటు లేను నీదగు, పలుకుబడి న్మెలఁగు పెల్లఁ ♦ బాటింపవు పం
కిలశంకాకులవైతి వ, బల; యాత్మబలము గణించు ♦ వల నలఁతిపడన్. ౨౪౩

—♦ దశరథుండు కైకం దేర్ప నాపెకోర్కి దీర్తునని ప్రతిన సెఱపుట ♦—

తే॥ లేదు నీకన్నఁ బ్రియతమ ♦ లేమ యొందు
మాన్యుఁ డటు రాముఁ డెల్ల కు ♦ మారులందు
సందియంబేల నీయభీ ♦ ష్టంబు దీర్చు
పొంటె నవ్వానిపై నాన ♦ బొసఁగఁ గూర్తు. ౨౪౪

క॥ మనుజవ్యాఘ్రుం డుత్తమ, మనుజులలో నుత్తముండు ♦ మర్మము లేదా
తనిఁ గాన కొకముహూర్త, మ్మును మనఁగా నోప నిక్క ♦ ముగ వచియింతున్.

చ॥ మహితుఁ డజయ్యుఁ డర్థమును ♦ మానముఁ బ్రాణము వాఁడె నాకుఁ ద
న్మహిమ మిపు డట్టిరాఘవుపయి ♦ మానవతీ; శపథం బొనర్తుఁ ద్వ.
ద్విహితము సూపి నన్నలఁచు ♦ విహ్వలభావముఁ బాపి నెమ్మిమై
నహరహముం బను ల్గొను మ ♦ నాదృతి మోపకు మాత్మసూక్తులన్. ౨౮౬

క॥ తనుఁదనవారిం దననం, దనులన్ జీవితమునేనిఁ ♦ దద్దయుఁ బుత్త్రున్
నిను రాముని విడనేరను, మనమున నూహింపు మీ మ ♦ మత భద్రముఖీ. ౨౮౭

క॥ న న్నుద్ధరింపు మింతయు, నన్నులమిన్నరొ; తలంచి ♦ యనుమానము మా
న న్నెలకొను మిన్నెఱి మే, లెన్నుము మద్వచనకారి ♦ యితఁ డని యెడఁదన్.

క॥ అని స్వకమాయామృగయా, వనీమృగం బగుచు సాగియు ♦ వానిం గని మం
తన మని ధృతిగొని వార్త్రు, చ్చెను దుర్వచ మనక కైక ♦ సిద్ధి కలరుచున్.

తే॥ ఆయభిప్రాయ మపుడె య ♦ భ్యాగతంబు
మృత్యువగుఁ బతికనుచు న ♦ మ్మెలఁత యలఁత
పడఁదు పడఁద్రోచె నాతని ♦ పైని విధియు
నెట్టులొనరింపఁగా మది ♦ నెంచినాఁడొ. ౨౯౦

క॥ అర్థార్థిని కద్దాని క, నర్థాగమశంక యొక్కఁ ♦ డా తనతలఁ పే
యర్థము రూపించెనొ యది, వ్యర్థము గాకుండ నెఱపు ♦ నయ్యది దక్కన్.

—♦ కైక పూర్వదత్తవరంబుల నుగ్గడించి మగని నిర్బంధించుట ♦—

క॥ నీవచనస్థితి లబ్ధం, బౌవర మీశపథమును మ ♦ హాత్ములు వేల్పుల్
శ్రోవక విని వహియింతురు, శ్రీవిలసితమానసముల ♦ సిద్ధం బనఘా. ౨౯౨

ఉ॥ ముప్పదిమూడుకోటులు ప్ర ♦ ముఖ్యు లమర్త్యులు కర్మసాక్షులుం
జొప్పడు పంచభూతములు ♦ సూనృత నిష్ఠుఁడు నాప్రియుండు దా
నిప్పగిది న్మదీప్సితము ♦ లీయఁ దలంచి ప్రతిజ్ఞ సల్పుటం
దప్ప కెఱింగి యుంచుఁ డెద ♦ ధర్మముఁ బాలనసేయఁ డెమ్మెయిన్. ౨౯౩

ఆ॥ అనుచుఁ గట్టుగట్టి ♦ యాగట్టివా యంత, వట్టు గట్టిసేసి ♦ వరదుఁ డితఁడు
సత్యసంగరుండు ♦ సర్వజ్ఞుఁ డధితేజు, డని సకాము దయితు ♦ నభినుతించి. ౨౯౪

తే॥ కంఠపాశంబు బిగియింపఁ♦గాని యెగయు, దిమ్మెకంబు వినాశ మ ♦ ట్లేనిఁ గాంచు
నంచు మెలిపెట్టి చలపటి♦యామెలంత,పలికె నవ్వలఁ గడు దుష్ట ♦ భావమునను.

మ॥ స్మరియింతే; బలశాస ండు పిలువన్ ♦ జన్నమ్ము నిన్నట్లు శం
బరముఖ్యుల్ త్రిదశారు లొంటఁ బొదువం ♦ బ్రావీణ్య మొప్పార నీ

పురుశక్తిం బెనఁగం దదీయ యగున ♦ య్యుద్వృత్తికి నోర్సలి తే
నరయం జాలితి మేలితెల్వి గనన్నై ♦ యానందముం బొందఁగన్. ౨౫౬

ఆ॥ చాటుసేసి మేని ♦ శరములెల్లఁ బెకల్చి, యంతృభావమున ని ♦ యత్రి నగుచు
నీకు గెలుపు గూర్చు ♦ నేర్మి కీవిడినవ, రద్వయంబు త్వాత్ప ♦ రంబుసేసి. ౨౫౭

తే॥ కోరి కొనుదాన నక్కఱ ♦ గొనకొనంగ, నంటి నదియెల్ల నీమది ♦ నంటి యుండఁ
గాదె తత్ఫల మిప్పుడేఁ ♦ గాంచవలయు, క్షితిని నీసత్యశీలత ♦ చెల్లవలయు.

క॥ అని పదఁపడి యిట్లనె నా, తని గుండియ యవియ నవయు ♦ దశ తారసిలన్
గనులమెఱుఁగులు వినిర్ఘా, తనిర్విశేషములు నుడులుఁ ♦ దలకొనుచుండన్.

క॥ చనవుమెయి నాఁడొసంగితి, జనపతి ; వరయుగము జన్మ ♦ సాఫల్యముగాఁ
బొనరించితి ప్రతినయు నేఁ, డనుపమ మది దానిఁ గడతు ♦ ననఁబోకు మిఁకన్.

ఆ॥ ఒకట భరతుఁ జేయు ♦ ముర్వీసనాధు సా, మఱిగి సార్థ యగుచు ♦ మలయ నిపుడె
పనుపు మొంట రాముఁ ♦ బదునాలుగేండ్లు వ, నాంతమునఁ దపస్వి ♦ యగుచుఁ దిరుగ

క॥ నారలచీరలు గట్టఁగఁ, గూరలు భుజియింప నతఁడు ♦ గొనకొన్నుచుండన్
గా రూఢి న్నిష్కంటక, మా రాజ్యము భరతుఁ డేల ♦ నోఁగాత మిఁకన్. ౨౬౧

క॥ ఆదైవాసురయుద్ధా, మోదం బీయుక్తిఁ దన్ను ♦ మొనయం జను నేఁ
డీదారిం జను రామునిఁ, గాదన కేఁ గన్నులారఁ ♦ గనుఁగొనునంతన్. ౨౬౩

క॥ భరతుఁడు రాజ్యముసేయుచు, నిరతము నినుఁ గొలుచుచుండ ♦ నే నీకోర్కుల్
సరభసవృత్తిం గూర్పఁగ, వరముననగు మేల్మి పడయ ♦ వచ్చుం జుమ్మీ. ౨౬౪

క॥ కులశీలజన్మరక్షణ, మెలయింపుము సంగరమున ♦ హీనస్థితిఁ బం
కిలుఁడవు గాకుము సత్య మ, ఖిలసారము ముక్తిఁ గూర్చుఁ ♦ గేవలము నృపా.

క॥ ఈవిధి కీవు తలంగిన, జీవిత మే విడుచుదాన ♦ సిద్ధము సుమ్మీ
యేవల నిట్టివిమానన, చావునకుం గొఱఁతపడునె ♦ సతఁ మొకఁ డున్నే. ౨౬౬

ఆ॥ అనుడుఁ బిడుగుఁబోని ♦ యమ్మాట చెవినాట
బాటఁ దొఱఁగి విభుఁడు ♦ పడియె నెడఁద
బీఁటవాఱ నఱకఁ ♦ బెంపేదఁ గూలెడు
పాదపం బనంగఁ ♦ బద్మనయన. ౨౬౭

క॥ ఉరిఁదవిలిన జంతువునో, జ రహిం సెడెన్ ధరణివిభుఁడు ♦ చరమదశావి
ష్కరణమున కగమా సాఁ, చరణ మెడ సరించు వెలివి ♦ సను సు గాఁకన్

ఆ॥ ఉస్సురనుచు నేల♦కొరగి యాయుశ్శ్వేమ, మునను( దెలివి గనియు♦మోముసూప
కెద( దలంచె నిట్టు♦లే నెవ్వ(డ నిదేమి, తెరు వొకండ యేని( ♦ దెలి(గుపడదు.

క॥ ఇది స్వప్నమొ మోహమొ నె, మ్మది సెడెనో భూతవికృతి♦భ్రమాన్పడితినొ యెం
డెదియుం దో(పదు తాపం, బదన మగుచు( గూర్చె విస్తృ♦తాయాసంబుగ.

తే॥ అనుచు నిట్టూర్పు లెడయు మ ♦ హార్తి( బొరలి
విక్లబుండయి నెట్టన ♦ వెల(ది( గాంచి
వ్యాఘ్రి( గను(గొన్న మృగ మట్లు ♦ వ్యథితు( డగుచు
ధిక్కనుచు నేలపై( బడు( దెరలు మరల. ౨౭౧

క॥ పన్నగము మంత్రరుద్ధము, తన్నెఱు(గక వ్రాలుభంగి ♦ తారసిలం గా
నన్నేత ధారుణిం బడి, కన్నని మిన్ననియు నెఱుక( ♦ గన( డద్రిసుతా. ౨౭౨

తే॥ ఎట్టకేలకు( దలయెత్తి♦యింతి( జూచి, చూపునన దాని దహియించు♦చొప్పుసూపి
రోమకూపంబులం దెల్ల ♦ రోస మెగిచి, ముట్టికొన నిట్టులనియె న ♦ మ్మోఘతోడ.

—♦ దశరథుండు కైకతలం(పు విని దాని దూషించుట ♦—

సీ॥ ఓసి; ఘాతుకురాల; ♦యెం డెద్దియును( దో(ప, కిది పాల్పడెనె కుల♦మెల్ల( గూల్ప
మది సున్న యిది మేటి♦మాధుర్యమే రాము, మాధుర్య నెడయించి♦మాటపడెదె
నీపుట్టువున నైన ♦ నీతిబాహిరవృత్తి, యింతలింతలు సేయ ♦ నెంచె నటవె
కన్నతల్లిని నిన్ను( ♦ గని కాన( డెరవంచు, నాతండు( గీడె నీ ♦ కంధురాల
తమ్ములం గాంచి తనదునే ♦ త్రమ్ము లనెడు, వాని తప్పేమి నేనైన ♦ వరుస దప్పి
నాడనే తీక్ష్ణవిష వ్యాళి ♦ కూడ దనక, నీప్రసంగంబు గోరిన ♦ నెరియ తక్క. ౨౭౪

ఆ॥ ఇంట( దెచ్చి యిడితి ♦ నింతదాన వటంచు(, గాన కగ్రసుతుని( ♦ గాన కనుప
మున్ను దో(ప దిట్టి ♦ మోసంబు నీదెస, నమ్మి చెడితి నింక ♦ నయము గలదె.

ఉ॥ ఏయెడ జీవలోకము మ ♦ హేచ్ఛు(డు రాము( డటంచు( దద్గుణో
చ్చారియము మాటిమాటికి వ ♦ శంవదమై వినుతింప నిప్పు డే
నేయపరాధముం జొనుపు ♦ దిట్టటుసేయు(గ నెంతు( బాపినై
నీయసదైన సంగతము ♦ నిత్య మటం చెదమోపి పాపినీ. ౨౭౬

ఆ॥ ఇంద ఱెందు యువతు ♦ లెందఱో యుపజీవు, లుందు రైన రాము ♦ నొక్కరేని
నిందితుం డనంగ ♦ నేరమ్ము మోపంగ(, దల(ప రెట్లు వాని( ♦ దల(గువాడ.

ఆ॥ కష్టురాల ; యిష్టు( ♦ గల్యాణగుణధాము, రాము విడువ విడుతు ♦ రాజలక్ష్మి
నెల్లరాణివాస ♦ మీనిన్ను మున్నుగా, జీవితమ్ము మీ(ద ♦ శ్రేష్ఠ వగుము.

ఆ॥ ప్రొద్దు వీడి యెట్లొ ♦ భువనంబు సలిలంబుఁ, బాసి యెట్లొ పైరు ♦ బ్రదుకుఁగాని
యేను మనఁగ నోప ♦ నీపితృవత్సలు, నెడసి యొక్కగడెయు ♦ నింత నిజము.

క॥ నాచావు గోరితివి ని ♦ న్నేచానలు దిట్ట రెట్టు ♦ లీచాయనుఁ బా
పాచారముఁ గలుపఁగ నే, నీచాత్మకుఁ దోఁచె నదియు ♦ నీనడి గనెనే. ౨౮౦

తే॥ మున్నుఁ బలికినపలుకు లే ♦ మూలఁ బడియెఁ
బెద్దబిడ్డ సధర్ముండు ♦ శ్రేష్ఠుఁ డనుచు
నిచ్చకంబు దలంచితో ♦ యిచ్చమెయిన
యెపుడు గొలిపించుకొననైన ♦ హిత మరసితొ. ౨౮౧

క॥ అదె నిశ్చిత మగునేనియు, నిది పొసఁగదు పాపరూప ♦ మెడఁద్రోయుము నీ
మది దీనిఁ గుదురుపఱుపకు, మదనున నే మ్రొక్కెవేఁడ ♦ నయ్యెద సుదతీ. ౨౮౨

చ॥ భరతునిపై హితాహితవి ♦ భావన లెంతలొ చూతునంచు న
న్నరయఁ దలంచితేమొ యన ♦ నంతటి కింతటిదారుణంబె పె
ల్లరుసము వేళ నేడ్చుటయు ♦ నల్లరిసేఁతయు గొంది సొచ్చి ము
ష్కరవయి దుష్కరంబులనఁ ♦ గాంచుటయుక్ స్థితిఁ బాపుకొంటయుక్. ౨౮౩

క॥ చాలుం జాలు నఘంబుల, జాలుకొలుపఁ జాలునిట్టి ♦ నడి వీడుము ని
న్నేలలనలుఁ దిట్టకము, న్నే లాలితగౌరవము దు ♦ యింపకమున్నే. ౨౮౪

తే॥ నిజముగా రాముదెస నీకు ♦ నెనరు దక్కె, నేని భరతున కిట్టిచే ♦ టెనయ నగును
భ్రాతృవత్సలుఁ డతఁడు నీ ♦ పాప మోపఁ, గలఁడె చెఱుపవె వాని న ♦ క్కారణమున.

క॥ మతివైపరీత్య మొదపిన, గతి సెడు నెవ్వరికి నని జ ♦ గతివారలు న
మ్మతి నెఱపుదు రది నీదెస, శ్రుతి యననై బలువిపత్తిఁ ♦ జూపెడుఁ జులుకక్.

తే॥ పరమపావన మిక్ష్వాకు ♦ వరకులంబు, దీన ననయంబు పుట్టెడు ♦ దీనివలన
నిన్నుఁ దెచ్చినకర్మంబు ♦ నేఁటి కిట్లు, పండినది నాదుపాపంబు ♦ గండుకొనఁగ.

ఉ॥ రామున కిట్టిపాట్లకె ప ♦ రాక్రమవంతుఁడ వైన మేలిగా
రాముని వృద్ధిఁ బొందె సతి ♦ రాణమెయి న్గొలువంగ సౌఖ్యపుం
గోమునఁ దేలునాఁడె వని ♦ గ్రుమ్మరు మంటివి నిన్ను నీతెఱం
గోము నటంచు నెంచితివె ♦ యోర్తువె రానగు యామ్యయాతనల్. ౨౮౫

క॥ నిను భరతుఁడు రాముని క, న్నను మిన్నగఁ గొలిచి మనిచె ♦ నా; యియ్యను వే
మని చేర్చితి మదిఁ దనుఁ బూ, నినపెనుభూతంబు త్రిప్పు ♦ నెరి యనఁ జనునా.

క॥ ప్రియదర్శనవై యిట్లు, ప్రియభాషిణి వైతి వేమి ♦ పెంపుగ నెద వి
మ్మొయి రాముఁ బనుప నెంచితి, వయము నయముఁ గలవె నీ క♦నాత్మవ కావే.

క॥ ముచ్చటకు భరతుమే లొకఁ, డచ్చుపడఁగ నడుగవచ్చు ♦ నౌఁ గా దననౌ
మెచ్చున కది రామునిపైఁ, బొచ్చెముఁ దలపెట్టి తేమి ♦ పొలుపని చెనఁటీ. ౨౯౧

ఆ॥ ఇంటనేని రచ్చ ♦ నేని రాష్ట్రంబున, నేని ముజ్జగముల ♦ నేని రాము
లోకరాముఁ దప్పు ♦ రేకకుఁ గూర్తురే, నీక తోఁచె నిటు వి ♦ వేకహీన. ౨౯౨

ఉ॥ చెట్టవు నీవుఁ దల్లివని ♦ చేరి భజించుట గౌరవంబు నీ
పట్టినదే ప్రమాణ మని ♦ పాడుట వాక్కరణంబు నిన్నియున్
బట్టి నరణ్యమం దిడఁగఁ ♦ బాల్పడె నందఱ నెట్లొనర్పఁగాఁ
బుట్టితొ పొట్టకింత వెత ♦ పోలునె కేకయవంశపాంసనీ. ౨౯౩

క॥ ఈయప్రియ మెమ్మెయి నే, నాయుత్తమచరితుతోడ ♦ నాడుదు మున్నే
చాయన యేనియు వానిమ, నోయుక్తికి వెలిగ నోడువ ♦ నూల్కొన నెపుడున్.

ఉ॥ సత్యము దానముం దపము ♦ సక్తత మిత్రత శౌచ మార్జవం
బత్యయమోచనంబు ధృతి ♦ యాదర మూర్జిత మార్యసేవ సం
ప్రత్యయసాధువాదములు ♦ క్షాంతి దమంబు శమంబు నిన్నియున్
నిత్యముఁ జేరి కొల్చు రఘు ♦ నేత నతండు మనుష్యమాత్రుఁడే. ౨౯౫

క॥ లాలించు భూతముల మొఱ, లాలించు న్మనుచుఁ బెనుచు ♦ నఖిలజనములన్
మేలెంచి సనుచుధర్మము, కీలెంచి రఘూద్వహుం డ ♦ కీర్తితుఁడటవే. ౨౯౬

తే॥ సత్యమున లోకముల దీన ♦ జనుల వితర
ణమున గురువుల శుశ్రూష ♦ ణమున రిపుల
దమమునను సర్వభూతసం ♦ తతుల సాంత్వ
నమున లోఁగొను నన్నిట ♦ సుమహుఁ డతఁడు. ౨౯౭

ఆ॥ దేవదేవనిభుఁడు ♦ తేజస్వి యఖిలాభి, రాముఁ డట్టిరాము ♦ దీమసమునఁ
జెఱుతె జెఱుతు నన్నుఁ ♦ జెడుదువు తాఁ జెడ్డ, క్రోఁతి వనము సెఱిచి♦కూలినట్లు.

క॥ మునినుతుఁడు ఋషివరాభుం, డనయము ధర్మైకలాల ♦ సాత్మ్ముఁడు జగతిన్
ఘనుఁ డెటొ పుట్టక పుట్టెనుఁ, గనుకని దుర్భవకు నీకుఁ ♦ గష్టుం డయ్యెన్. ౨౯౯

క॥ ఆతనిగుణసంపత్తికిఁ, జేతోగతిఁ బొదలుప్రజలు ♦ క్షితినాధులు నేఁ
డేతద్విప్రియ మొదవఁగ, నీతలపై నేమిమోప ♦ నెలకొనువారో. 300

క॥ నాకేదియును గతి లేదిఁక, నీకతనన్ రాముఁ బాయు ♦ నెరి చొప్పడినన్
లోకముల వార్త రిత్తవ, రాకవరాటికకు సాటి ♦ రాక నశింతున్. ౩౦౧

తే॥ ఆయహింసాధ్యు నాథు ద ♦ యాసనాథు, నాకృతజ్ఞుని విడనాడ ♦ నధమగతియ
కాని వేఱొండు లేదు నీ♦కర్జ మసదు, వెడమతి మరల్చుకొనుము ప్ర♦వీణ వగుము.

ఆ॥ పెద్దవాఁడ నైతిఁ ♦ బ్రీతిమై నేలితి, నాతురత్వ మింక ♦ నందుతఱియు
నయ్యె నేఁటి కేల ♦ యస దనిపించెదు, నాదువిన్నపంబు ♦ నాతి వినుము. ౩౦౩

క॥ మేలుకొను మనద నీతని, నేలుకొనఁ బ్రసన్న వగు మ ♦ హీనశుభకృతిం
బాలుకొనుము కెంగేలం, గీలుకొనం జేయు మధిసు ♦ కృతగతి సుధృతిన్. ౩౦౪

ఆ॥ సాగరాంతమైన ♦ జగతి నేయవి నీకు, మెచ్చు వచ్చునవియొ ♦ మెలఁత యిపుడ
తెచ్చియిచ్చువాఁడ ♦ మచ్చికమై నవి, యన్నియును నెఱింగి ♦ యెన్నికొనుము.

క॥ నే దోసిలొగ్గితిని నీ, పాదము లర్చించువాఁడఁ ♦ బరిభవ మింకం
గా దగ్రతనయునకు నీ, వే దైవమ వగుచు నభయ ♦ మిడు మిమ్మొలయన్.

క॥ శరణమవై రాముఁడు త్వ, చ్చరణము లర్చింప భరతు ♦ సౌభ్రాత్రమునన్
వరసంపద్వహుఁ జేయఁగ, సురలొనన మనుము ప్రథిత ♦ సూనృత వగుచున్.

ఆ॥ ఇందుముఖిరో యెన్ను ♦ మిం దధర్మము నన్నుఁ, జెందకుండ మేలి ♦ సిరి దొలంక
వంక లేక బ్రదుకు ♦ వాఁడ నీవాఁడ నీ, వంక నుభయకీర్తి ♦ వఱలఁ గలదు.

చ॥ అని వ్యసనాభితప్తుఁ డయి ♦ యాడెడువానిఁ జలించువానిఁ జే
తన వెడఁబ్రాఁకు నట్లుగు వి ♦ తాకునఁ గుందెడువాని ఘూర్ణమా
ననయనుఁడై నయం బెడలి ♦ నాల్గుదెస ల్గనువాని నమ్మహా
జనపతి క్షుద్రదృష్టి గనెఁ ♦ జారువిలోచన రౌద్రమూర్తియై. ౩౦౫

క॥ పారిపారి శోకార్ణవ పుం, దరిఁ జేర్ప మటంచు వేఁడు ♦ తరమున వానిన్
దరుణి యలఁతి లోఁగొని స,త్వరముగఁ బరుసములు వలుకఁ♦దలపడెఁగడఁకన్.

—♦ కైక మగనిఁ దూలనాడుట ♦—

ఆ॥ వరము లొసఁగి యిట్లు ♦ వావిడిచి తపించి, యేడ్వ నీకుఁ దగునె ♦ యినకులీన;
యేను ధర్మపరుఁడ ♦ నిందఱలో నని, యెట్లు నిలిచి శీర్ష ♦ మెత్తఁగలవు. ౩౧౧

చ॥ పలువురు పెద్ద లేర్పడి స ♦ భ న్నినుఁ గూర్చి ధర్మపారగుం
డలఘుఁ డితండపో యనెదు ♦ నయ్యెడ నాడుము కైక కే వర
మ్ముల నిడినాడ నన్మనిచె ♦ ముగ్ధ పదంపడి దానియక్కఱల్
దలఁగ దలంచినాడ నని ♦ త్రారపు డెద్ది వచింప నెంతురో. ౩౧౨

తే॥ రాచకొలమున కిటు కావి ♦ రంగు రాయఁ,దలఁచినాఁడవపో దీన ♦ ధన్యతముఁడ
వౌదువీనాఁడ మెరమెచ్చు♦లాఁడ జొచ్చి,తిప్పుడ తొలంగఁజూచితిం♦కేమిగలదు.

ఉ॥ శ్యేనకపోతశైబ్యకథ ♦ చెప్ప నొకప్పుడు విన్నవాఁడవో
మానితొ మాన్యుఁ డాతఁడు స్వ ♦ మాంసముఁ బక్షికిఁ గోసి పెట్టె నొం
డైన యలర్కనాముఁడు ని ♦ జాక్షుల విప్రున కిచ్చి ముక్తికిం
బోనయినాఁడు సత్యమునఁ ♦ బోలఁడు నిన్నొకఁడేని వారిలోన్. ౩౧౭

ఆ॥ సాగరంబు కడచి ♦ చన దొకప్డును వేల, మనకొలంబువారి ♦ మనుపు గొన్న
యదియ కాదె యదియు♦ననవలె నినుఁబోటి,యంద పాడమియిట్టు♦లగుటలరసి.

తే॥ సత్యమును ధర్మమును నెట్లు♦చనిన నేమి,రాము రాజ్యమునం దిడు ♦ రహినిఁబెద్ద
రాణి కోసలుకన్నెతో♦రాణనెఱయఁ,గూడిమనవచ్చు♦నొండొంటఁ♦గొఱఁతలేదు.

క॥ నిచ్చలగు కోసలాత్మజ, యిచ్ఛకు మొకఁ డిచ్చఁ గూర్చి ♦ తేమి వలపొ యే
మెచ్చులు నూపెనొ యిటులనఁ, బొచ్చెము లే దేల పలికి ♦ బొంకెదవు నృపా.

తే॥ అది యసత్యమొ సత్యమో ♦ యరయ ధర్మ
మో యధర్మమొ తెలియంగ ♦ నోపఁ గాని
నీప్రతిజ్ఞాత మర్థంబు ♦ నీటఁ గలిపి
నెఱిఁ గని సుఖింపఁ దలఁచుట ♦ నీతిగాదు. ౩౧౮

క॥ ఇఁక నీదుసంశ్రుతంబున, కొకట వ్యతిక్రమ మొనర్ప ♦ నొప్ప దదియ వా
రక ఘటియింపుము కాదన, వికల్ప మని లేదు దీన ♦ వేయునొసఁగినన్. ౩౧౯

ఉ॥ అంజక నీవు కోసలసు ♦ తాత్మజు రాజు నొనర్ప నర్థిమై
నంజలులం గ్రహించుచు వ ♦ రాభయహస్తము లొపె సాఁపఁ జే
రం జని కొల్వకే బ్రదుక ♦ రా దని యే నరుగంగ వైచుకూ
డుం జవియానె యంచని యె ♦ టుల్ భృతి మానుటె నిశ్చయించితిన్. ౩౨౦

ఉ॥ కావున సీతలం పరయఁ ♦ గా వల నొననరాదు నాకు నేఁ
డేవగనైన రాముని వ ♦ నేందిరఁ గూర్పఁగఁ జాలెదేని మే
లావిధ మొల్లకున్నఁ దన ♦ యాత్మజుపై దనపైని నొట్టు సు
మ్మావల నేమి యన్నఁ గల ♦ దా; తలఁ దార్కొనుదారి కొగ్గఁగన్. ౩౨౧

క॥ దాఁపఱికి మిఁకేటికి నీ, వీపగిది స్నీదుహితులు ♦ నీక్షింప విసం
బేపారఁ గ్రోలి యసుఱులఁ, బాపెదఁ జూ బ్రదుకఁ గలవె ♦ పడయుసుఖమ్ములోన్.

ఆ॥ రాజు రాముఁ డైన♦రామమాతం గొల్చి, యొక్కనాఁడ యేని♦నూర్పుఁబుచ్చఁ
జాలఁ గాన నతనిఁ ♦ జయ్యనఁ బనిచెదొ, నాదుచరమదశఁ గ ♦ నంగ నగుదొ.

చ॥ అని వెలిపుచ్చి వానిబ్రదు ♦ కాఱడిపెట్టఁ దలంచి యూరకుం
డెనుఁ బ్రియభావ మెక్కడిది ♦ డెందమున న్నెన రే హుళక్కి గా
ననయము నంగనాజనమె ♦ యట్టిద యానన మున్న కాపిశా
యనమదమత్తమా కపి నిఁ ♦ కంతలు సేయదె భూతవృత్తియున్. ౩-౨౪

క॥ అలుగులపడు పతిఁ గని తా, నలుఁగుడుపడ దింతయేని ♦ నాల్కకుఁదే దే
పలుకుబడియుఁ బాపమునకు, నులుకుపడియుఁ దోఁపఁ బోవ ♦ దువిదవలనునన్.

క॥ ప్రియ యప్రియవాదినియై, దయలే కటు దన్నుఁ గూల్చు ♦ దారిఁ దలఁగ కా
మయ మనఁ దార్కొన నరపతి, నయ మేదం బలుకురాక ♦ నవయం జొచ్చెన్.

ఉ॥ ఆయశుభానువాదముల ♦ నాతఁడు విన్నపుడే ప్రతిష్ఠ పో
నాయె నిఁ కేటిజీవన మ ♦ యారె; వనంబునఁ బెద్దబిడ్డ య
న్యాయవిధిం జరించుగతి ♦ యా; యని పాయని వెఱ్ఱిమోహ పుం
జాయనె లోయఁ గూలె నటు ♦ జాయఁ గనుంగొనె విహ్వలాత్ముఁడై. ౩-౨౫

క॥ భరతన సిరియుఁ దిరిలోకీ, భరతప్పరు రాము నడవి ♦ పాల్సేఁతయుఁ ద
న్వీరసు నొనరింపఁ బతి య, వ్వరుసం బరుసదనమునను ♦ వగసెడకున్నె. ౩-౨౬

మ॥ పిడుగుం బోలినదైన యానతి యెద న్భేదింపఁ జెన్నేదఁ జే
డ్పడెఁ జెట్టట్టుపడె న్వికారపడె నా ♦ పై శక్తి సారంబుఁ గో
ల్పడె దానిం గనుచూడ్కి నిల్వ నెదియో ♦ పాపంబు చూపట్టెనన్
సడికిం జొప్పడె వాఁడు వాని విధి యే ♦ సన్న న్నిరీక్షించెనో. ౩-౨౭

క॥ రామా; యను సద్గుణగణ, ధామా; యనుఁ దద్గతాస్థ ♦ తవులున నిది నా
నోమా యను సరజీవిత;, నోమాయనుఁ గాని ఱేఁడు ♦ నూల్కొనఁ డబలా.

తే॥ ఘోరమా దాని వ్యవసాయ♦సార మరసి, తీఱఁగారాని తనదుప్ర ♦ తిజ్ఞ నొరసి
కోరలూడ్చినయురగమై ♦ క్షోణిజాని, యారభటి మాని యల్లన ♦ ననియె నిట్లు.

—♦ దశరథుండు కైకతలంపు గూడనిదని భయనయప్రసాదంబుల బోధించుట ♦—

సీ॥ ఇయ్యనర్థం బర్థ ♦ మే యని బోధించె, నేనీచురాలు ని ♦ న్నెఱిఁగి యెఱిఁగి
భూతోపహతచిత్త ♦ పోల్కి సిగ్గెడలితి, వాడుపుట్టువుసన్న ♦ నాడ వెదియు
బాలవకా నాఁడు ♦ పరఁగినశీలంబు, నేఁడు ప్రోడవు గాఁగ ♦ నెఱిఁ దలంగె
నింతలో రామునం ♦ దేమి తప్పరసితి, మున్నేమి మేలెంచి ♦ మూఁగవైతి

మగనిమనుపంగ లోకస♦మ్మతము వడయు, భరతు నిజధర్మనిరతు న♦పాపరతునిఁ
జేయఁ జూచెదవేని నీ♦చెడ్డతలఁపు, మాని యింకనైన సద్వృత్తి♦మహిత వగుము.

క॥ నావలనన రామునిదెస, నేవిధ మగు కష్ట మసద ♦ యేనియుఁ దోఁచెన్
దీవరపడెదు నృశంసక, భావా; క్షుద్రస్వభావ; ♦ పాపోద్రావా. ౩౩౩

తే॥ తొంటినోములకొఱఁత నా♦దుష్టబుద్ధిఁ, బాప మన కిట్లు దయమాలి ♦ పట్టుపట్టి
తింతయే తమ్ముఁ డన్నతో♦నెడసి యేలఁ, డెల్లయిల నన్ను ముంచె దీ♦వెట్టులైన.

క॥ నీతప్పేర్పడుఁ గాక వి, నీతుఁడు భరతుండు నీదు ♦ నిర్దయకృతినా
ఘోతరమునఁ బోనొల్లఁడు, పాతకరహితుండు వాని ♦ భావిత మసదే. ౩౩౪

క॥ ధర్మమున రాముకన్నను, నిర్మలుఁ డన నెగడు నతఁడు నీదుష్కృత పుం
గర్మము విని కని రోయఁడె, మర్మములే దింతవట్టు ♦ మహితమ చుమ్మా. ౩౩౫

క॥ పినతల్లి వరమునకునై, వనమున కీ వరుగు మనుచు ♦ వరసుతుముఖచం
ద్రుని రాహుగ్రస్తునిఁ గా, బొనరింతునొ నీదుపాప ♦ పున్నడ కతనన్. ౩౩౬

మ॥ మనె నెట్లో చిరకాల మేలె మహి సా ♦ మ్రాజ్యమ్ము మేలెంచి రా
ముని జేనిం బొనరింతు నిక్కమని యి ♦ మ్ముల్గూర్చె నిద్దేల ఘో
మ్మనుటన్న న్ననుఁ బిల్చి తెల్పు మనిన ♦ న్హా; వారి కేమందుఁ గై
కను మెప్పింపఁగ నిట్లుసేసితి నన్ ♦ గాదంచు నోనాడరే. ౩౩౭

క॥ తతసామంతహితపురో, హితముఖ్యులు నగరజనప ♦ దేభ్యులు నను స
మ్మతి వేఁడ నిడినవరమున, కతిక్రమం బేవిధమున ♦ నరసెదు వాఁడన్. ౩౩౮

తే॥ వృద్ధులు బహుశ్రుతులు నైన ♦ పృథ్వీపతులు
బాలిశుఁడు వీఁడనఁగ నాన ♦ పరహిత యగు
సేనగా నింతవట్టు నా ♦ చేసినదియుఁ
బొల్లువోవదె యింకిటఁ ♦ బున్నె మున్నె. ౩౪౦

క॥ నీసంకల్పం బరసియు, నాసంగరమే వరంబు ♦ న్యాయ్యమె జగ మ
ట్లాసపడ వల్లె యని యి, ట్లాసత్యము వీడ నిహప ♦ రార్థముఁ గలదే. ౩౪౧

క॥ బిడ్డలులేనియెడం దన, కిడ్డచనవు మూటగట్టి ♦ యీనాఁ డిమ్మో
లడ్డుపఱప నెంచితి వీ, గడ్డుతనము జగతి నెందుఁ ♦ గన వినఁ గలదే. ౩౪౨

ఆ॥ సత్యమేని నిది య ♦ సత్యమే కాఁగల, దెల్లవారిఁ బిలిచి ♦ యిమ్ము లోనఁగి
రాముఁ దోలి తమ ని♦రాకరించి తెరల్ప, బ్రదుకు నీవు నేనుఁ బడయఁ గలమె.

తే॥ ఏమనునుఁ గోసలాత్మజ ♦ యింత సేసి
యేమనుచుఁ గాంచువాఁడ నా ♦ యింతి మోము
హా ప్రియంవద, ప్రియపుత్త్రి, ♦ యార్య, ప్రీతి
కామ నామన మరయుఁ ద్రి ♦ కాలములును. ౩౪౪

ఉ॥ పట్టపుదేవి నంచు నొక ♦ పట్టున గర్వము లేదు మైత్రి నే
మట్టున వీడ దేననిన ♦ మాట శిరమ్మునఁ దాల్చుఁ బున్నె పుం
గొట్టునఁ దోడ్పడుం దనదు ♦ కోర్కుల కిమ్మగు మేల్మి సూపుఁ దా
నెట్టన దేర్పనేర్చు సతి ♦ నెమ్మది నిర్మల మొందు పాటియే. ౩౪౫

తే॥ తానె సఖి యన దాసినా ♦ ధర్మపత్ని, నాగఁ దోడనఁ దల్లియు ♦ నాఁగ నెగడు
నర్హురా లది నీదు నె♦య్యంబు కతన, దాని సత్కారమునఁ గూర్పఁ♦దలఁప నైతి.

క॥ నీవలని పక్షపాతము, నా వెతలకు మూల మయ్యె ♦ నవసి యపథ్యం
బేవాఁడు సేయు దాననె, చావెనయున కాదె యట్టి ♦ జడమతి యొందున్. ౩౪౭

క॥ రాముని కేనొనరించిన, యీ మెయివిప్రకృతి నెంచి ♦ యేమందురు త
త్క్షేమ మరయు తన్మాతలు, బూమె లితనినడత లనుచు ♦ బ్రుయ్యఁ బలుక రే.

తే॥ ఇంక నను నమ్మునె సుమిత్ర♦యిందఱకును, నెరవుపడు వ్రాత వ్రాసె నా♦కీవిధికృతి
యింత యెఱిఁగినజన మెల్ల ♦ నీసడింప, బ్రదుక నేమగుఁ జననేమి ♦ బాగు గలదు.

క॥ ఆతురతం బెంపేదం, గాతరమై యింక నేమి ♦ గల దిది యిటుగా
నా తెరు వేగతి కానని, ప్రీతి సెడఁగ నాపె బిట్టు ♦ పెలుకుఱకున్నే. ౩౫౦

తే॥ ఆ; జనకపుత్త్రి విను నప్రి♦యద్వయంబు, దేవిగా నర్హ సుగుణ భ♦ర్తృప్రియాత్మ
యేను జనుట వనికి రాముఁ♦డేగుటయును, గలదె లోకమునందు నీ♦కష్ట మెందు.

క॥ శోకించుచుఁ బ్రాణముల న, శోకార్హ క్షపింపఁజేయుఁ ♦ జువ్వె యకట; య
ప్రాకృతమూర్తి గుణాఢ్య శు, భాకరుఁడగు రాము ప్రాణ ♦ మయ్యదె కాచే.

ఆ॥ ఇట్టినాదుబన్న ♦ మెంచి యావత్స యా, వత్సముద్రముననుఁ ♦ బడదె చిక్కి
కీర్తనీయ రాముఁ ♦ గిన్నరి కిన్నరు, నట్లుబాసి యొంటి ♦ నడలి యడలి. ౩౫౩

క॥ తన తోడిచెలియలని మే, లెనయింపఁగ నైన యదియ ♦ యెడరున నెడయం
జనుకీడు గోరితివి నీ కనయము నయ మనుచుఁ గలదె ♦ యాఱడి తక్కన్. ౩౫౪

క॥ జనకుని బాంధవమున స, న్ననె జనకజ చెల్లెలనుచు ♦ ననుచు పెరిమ వి
న్ననువున నీస్నుషఁ గొని నిను, ఘనతకు దెచ్చునది యదియుఁ ♦ గానవు కుమతీ.

తే॥ ఏను జీవింతు ననుకొంటి ♦ వేమొ రాముఁ, డడవి కేగంగ సీత పె ♦ ట్టిడలుచుండ
విధవనై యాత్మసంభూతు♦నధముఁ జేసి, యేకతం బేకరాజ్య మ ♦ ట్లేలఁ గలవు.

క॥ ఎంతటి దుఃఖం బిది నా, కింతటనె తటస్థ మయ్యె ♦ నేమందును సా
మంతుడనయ్యుఁ ద్వదీయదు, రంతోక్తుల వినుచు నోర్చు ♦ టలవడె ననఁగన్.

ఆ॥ అసతి వీవు సతివ ♦ యనుకొంటి రూపిణి, వగుటఁ జేసి లోని ♦ దైనవిషముఁ
గనక మదిరఁ ద్రావి ♦ కడగండ్లుపడునరు, నట్టులైతి నింక ♦ ననినఁ గలదె. ౩౫౯

క॥ అనృతంబగు సాంత్వనమున, ననుమోదితుఁ జేసి చంప ♦ నైతివి గీతి
ధ్వనివశమున మృగమును లోఁ, గొని శబరాంగనయుఁ గోలఁ♦గొట్టున కాదే.

క॥ నను ధిక్కరింత్రు సురఁ గ్రో, లిన బ్రాహ్మణునట్లు జనులు ♦ లేదిఁక నెట్లున్
ఘనత వగలాఁడి వలపునఁ, జనువానికిఁ గలదె లోక ♦ సంగ్రహ మెందున్. ౩౬౦

సీ॥ ఆర్యు లనార్యు న ♦ న్నంద్రు రచ్చ నపత్య, విక్రాయిఁడం డయ్యె ♦ వీ డటంచు
నాపాపకర్మ మి ♦ ట్లేపారెఁ దనపేని, నట్టిగ్రాఁడే మెడ ♦ కైన గతిని
బాలుండు కాలాహిఁ ♦ బట్టి యాడెడురీతి, నినుఁ గొని యాడుచో ♦ నేఁననైతి
మిత్తివైతివి నేఁడు ♦ మెయివెంచి తింకేమి, గలదు పాల్పడితి హా ♦ కష్టదశకు
బ్రహ్మచర్యవ్రతంబుల ♦ బహువిధగురు, కలితసేవోపవాసోప ♦ కర్శనములఁ
బనిచి పఱచితి ఫలసిద్ధి♦ప్రాప్త యగుడుఁ, బుత్రు నీకృతి విడనాడు ♦ పొలితికైతి.

క॥ బాలిశుఁ డీదశరథుఁ డొక, యాలికినై కామమోహి ♦ తాత్ముండగుచున్
బోలుప్రియపుత్రు నడవిం, గీలరయక ద్రోచె నను వి ♦ గీతి మడియుదున్. ౩౬౨

తే॥ ఎట్లుపలికిన నొండు ప ♦ ల్కనిఁ బలుకఁ
డేమి సేయుదు నాపుత్రు ♦ హితచరిత్రు
సిద్ధ మని తాల్చుఁ బూదండ ♦ చెలువ మొప్ప
నాతఁడు మదాజ్ఞ నెపుడు నె ♦ య్యంబుగలఁడు. ౩౬౩

తే॥ ఏను బొమ్మన్న వనమున ♦ కేగుఁ గాని, శుద్ధభావుండు దీననా ♦ చొప్పరయఁడు
తాను వ్యతిరిక్తముగ నాడె♦ నేని నెవ్వ, రేమిసేయుదు రది పేర్చు♦ హితమ కూర్చు

తే॥ సంతతికి నెన్నివ్రతములో ♦ సంతరించి, యెత్తి పెంచినకష్టంబు ♦ లెడల దాన
ననుచు సౌఖ్యంబు గొననీక♦నన్ను సుతుల, నిట్టు లెడఁబాపి తీవైన♦నెలమి మనుము.

క॥ ఈమెయిఁ గోసలుకన్నెయు, రాముఁడు నేనుఁ దనసుతులు ♦ రహిసెడఁ జన నిం
కేమి సుమిత్రయుఁ బెల్లగు, నామయమునఁబడి నశించు ♦ ననదయ కాఁగన్.

క॥ మృదుమానస జానకి స, మ్మదమెడలియు భర్తఁ గొలువ ♦ మసల కరుగ నీ
మదమెచ్చఁ గడమకోడం, డ్రెదమెత్తురె నిన్నుఁ దారు ♦ నెడపడి చనరే. ౩౬౭

వ॥ నాజీవించియున్న యీతరంబున నె మత్పుత్రకుం డజీవత్పితృకుండనయ్యె నీదురాత్మన కమ్మహాత్మునితోడి సంగడంబు సంగతంబగునే యాతం డరణ్యంబునకేఁగ నేను యమసదనంబునకుం బోవ నీవలన మదీయేష్టపరిజనంబున కేమేమి కీడు మూఁడంగలదో యెఱుంగంజాల, నంతయెల్ల నింతలుగాఁగ రామునకుం దోడై లక్ష్మణుండడవికేఁజన భరతునితోఁ బనివినినవాఁడు శత్రుఘ్నుండును సమయోల్లంఘనంబుసేసి మసలినఁ జెంపగునాపత్పరంపర సహింపనోపక శ్లక్ష్ణమానస, యజాతామిత్ర నాఁదగుసుమిత్రయు నిరాశ్రయనై యవసానంబు నొందంగల యదియ యిట్లందఱుం గడతేఱ నక్షోభ్యం బగు నిక్ష్వాకుకులం బాకులంబుగావించి శాశ్వతివై పరశ్శతవత్సరంబులు నీవ నేలనేలుకొనుము, నాయపకీర్తియెట్టులున్నను రాజపుత్రివై యీయిలుసొచ్చి యింతింతలొనర్చినందులకే యిందునందును మెచ్చువడయంగలదానవు. రథగజాశ్వారూఢుండై విహరించు హారిమృదుపద నలినయుగలుండు రాముండు శిలాకంటకావృతంబైన కాననంబునం గాళ్ళనడక నెట్లుసంచరింపంగలవాఁడు, కుండలంబులు పెట్టి కంకణంబులుగట్టి గట్టివార లనిపించుకొనిక సూపకారు లుపకారంబెంచి విమృష్టంబులగు మృష్టాన్నపానీయంబుల నొడికంబుగ వడ్డింపం బరితుష్టుండగు నాతండు కషాయతిక్తకటుకంబులగు వన్యాహారంబు లెట్టులాహరించువాఁడు మహార్హవసనసంవీతుండై సుఖోషితుండగు నొడయండు వల్కలాజినంబుల నేమని పరిధానించువాఁడు. అనర్ఘమణిరత్నపర్యంకంబున హంసతూలికాతల్పోపధానంబుపై సుఖనిద్రసేసి వైతాళికులు మేలుకొల్ప మేల్కానంగ మేకొనుసుకుమారుఁడు కఱకుఱాలు ముండ్లు గండశిలలుంగల కర్కశప్రదేశంబుల శయనించి గూఁబలు నక్కలుం గూయ నదరిపడి లేచి యుదిలపడుం గాఁబోలు నిట్టికష్టంబు దుష్టాత్మికవగునీకతక్కనెవ్వారల కిష్టంబగు జగద్ధితుండగు రాముని వ్యసననిమగ్నునిఁగా నెఱింగి యెల్లజనంబులు నాతనివెంట నిరంతరానురక్తులగుట నిన్నుఁ దిట్టి యిల్లాండ్ర బిడ్డలనేనియు దిగనాడి యాత్రోవన యనుగమింప జూచెదరు పర్జన్యుండు వర్షింపకున్నను సూర్యుండు గానిపింపకున్నను మనుంగాని రాము నెడయంగని జీవలోకం బొక్కగడియలోనన తల్లడిల్లు నేనును దేవకుమారరూపుఁడు చంద్రకాంతాననుఁడు మత్తమాతంగగామియు నగు నాతనిరాకడ సంభావించి యానందించువాఁడ వానింగని తరుణుండ నయ్యెద నిట్టినా్రమోల వినాశకామవై నీవాడిన నుడులకు నీపండ్లు వేయుముక్కలై డుల్లిపడవేలొకో యనియాశంకించుచున్నాఁడ,

చిరకాలమంకంబుననిడి లాలించితిఁ గాని మహావ్యాళివని యెఱుంగనైతిఁ బొంచి యుండియుండి యిప్పట్టునం గాటందితివి హా హా హతుండననగుచున్నవాఁడ హా స్త్రీ లెంతలెంతలైనఁ జేయం జాలుదురుగదా యందఱునననేల భరతమాత యొక్కరితయే ముజ్జగంబుల ముంప నుంకింపనోపు ఓనృశంసవృత్తి ఓవ్యసనప్రవా రిణి నన్ను గొడుకులను బాంధవులనుఁ బురము రాష్ట్రంబునుఁ బోకార్చి యహి తాభిహార్గిణివై తర్షంబుదీర నామమాత్రమునకు భరతుని గద్దెపైనిడి యేమేమో యుత్కర్షముం గాంచ నూహించితివి. ఇప్పటి కిట్టులైన నప్పటి కేనేరంబువన్ని వానినేమిసేయుదో నీవేమయ్యెదో యారయఁగా నేర, ఓసీ పాపాత్మురాలా, నీవు పరితపించినను మండిపోయిననుఁ జచ్చిప్రాలినను ప్రక్కలై నేలపయింబడినను మెయిమెయినుండఁగా నేనీదుష్కార్యం బాచరింపం జుమీ, కేకయోత్తరకోసలదేశరాజుల వంశంబుల నిర్మూలింప మూలంబవై పొడమి తెంపరివై యడరిన మహాకృత్యవగు నీకీయకృత్యం బొకలెక్కలోనిదనంబోలదు. నీసుతుండగు భరతుండు భవదీయ సంకల్పంబున కియ్యకొని రాముని వనవాసం బామోదించెనేని నాచనినపిమ్మటఁ బిమ్మటిపడ వలవదనియు నాకై యౌర్ధ్వ దైహికకృత్యంబులం బ్రవర్తింపంగూడదనియు బోధించి యవ్వాని వారింపు మట్లేని నిన్నునిలింపులు భూమినిలింపులు మెచ్చెదరు నాదగునారాటం బాకించుక శాంతించు. లెమ్ము పొమ్ము నీమోము గనుంగొనినవారి కవారితమ్మగు వమ్ము గుంజు మ్మని కినిసియాడి యాడుతనంబున మనోరమవై యిన్నినాళ్ళట్లు కాన్పిం చితివేకాని క్షురోపమ వసత్ప్రియంవదవు ప్రదుష్టభావవు స్వకులోపఘాతినివననై నాహృదయప్రబంధనంబు దెరల్చి యిట్లుకాల్చుదువని మున్నెన్నఁడు విచారింప నైతింగదే యని నిట్టూర్పులువుచ్చుచు నాకింక జీవితమేలేదు. సుఖమెక్కడిది యాత్మజుని విడనాడిన యనాత్మున కరతియకాక రతియనునది కూడఁగలదే యనుచు దెప్పరంబైన ముప్పునంబడి సంతాపంబు రూపంబుగైకొన్నచొప్పు చొప్పడ నప్పుడంతుకం గనుంగొని తప్పరసి యొరసి చెప్పందగినమాటలెల్లం జెప్పితి నింకం దన్నుముంచుటయుఁ దేల్చుటయుం ద్వదధీనంబులై యున్నయవియ యట్లుంగాన నెల్లవిధంబుల నెల్లలోకంబులకును విహితంబగు హితంబు గోరితివేని నిష్పాటనైన నిష్పాపప్రసంగ ప్రకోపంబుఁ పశ్చాత్తాపంబున నపనయించి యెం డెద్దియేనియు నర్థంబర్థించి సమర్థించి కొననెంచి సముంచితవగు మీవిన్ననువున నిన్నునునయించు నాదువిన్నపం బాలింపుము సత్యముం బాలింపుము కులప్రతిష్ఠం బాటింపుము సచ్చరితలతాంకురంబు నాటింపుము తిన్నదనంబుదనరం గ్రన్నన మన్నన వడయుము.

కలా

క॥ అని యంస్రులంబడి నాథుం, డనాథుగతి వేఁడుకొనిన ♦ నంగన మది య
య్యనువునఁ గరఁగదయ్యెను, బనుపడుభవితవ్యతాప్ర ♦ భావ మలుపమే. ౩౧౯

తే॥ అమ్మహారాజు కనఁబోలఁ ♦ డట్టిగోడవ, లడలఁ డెన్నఁడు నేలపై ♦ నట్లుపొరలి
పున్నెమంతయుఁ బొలివోవఁ♦బుడమిప్రాలి, సన్నసెడినయయాతి కా♦సన్నుఁ డయ్యె.

—♦ కైక దశరథుని పలుకులు మెచ్చక యతని నిర్బంధించుట ♦—

క॥ ఆతనిఁ గనుఁగొని యాదట, నాతన్వి వరావలేప ♦ మచ్చుపడఁగఁ దా
నాతతమతి నిట్లను ని, ర్భీత యగుచు వానిభీతి ♦ పెంపు వహింపన్. ౩౨౧

క॥ అర్థిని సిద్ధార్థ నని య, నర్థం బర్థ మనియును మ ♦ హామోదమునన్
స్వార్థసమర్థన మెంచె న, పార్థోన్ముఖు లెందు విధిని ♦ యంత్రితులు జనుల్.

తే॥ సత్యవాది యనంగఁ బ్ర ♦ శస్తి మించి,
యన్నివ్రతనిష్ఠలనుఁ బెను ♦ పందఁ గాంచి
నావరార్థంబున ప్రతిజ్ఞ ♦ నయము సెఱుపఁ
జూచె దేమందుఁ గన నిట్టి ♦ చోద్య మెందు. ౩౨౩

ఆ॥ ఏలతలఁగఁద్రోచె ♦ దిప్పరమార్థంబు, సత్యమునఁ బ్రతిష్ఠ ♦ చక్కఁబడునుఁ
బ్రాణగొడ్డమునకుఁ ♦ బాపఁడే ప్రహ్లాదుఁ, డాత్మజుని స్వసూక్తి ♦ యనువు వెలయ.

మ॥ అనినం దిమ్మఱపోయి యేమనఁగ లే ♦ కయ్యాత్మనీనుండు చ
య్యన నయ్యంగనఁ గాంచి నీవలపునన్ ♦ హా ప్రాప్తమైనట్టి చె
ట్టనుఁ బున్నెంబని యెన్న నీక చను నాఁ ♦ టంగొన్నయాపాపఁ పుం
జనవా; నేఁటికి సత్యమై పెరసె నీ ♦ చందాన మేలున్నదే. ౩౨౫

తే॥ నీవు సుఖియింతు వెళ్లిన ♦ నేన పోయి, దేవతలుతిట్టి రాముని ♦ తెఱవు నడుగ
నీకతన నిట్లొనర్చిన ♦ నీతి నొడువు, నప్పటికిఁగాని నాసత్య ♦ మరయరాదు.

క॥ పడరానికష్టములుపడి, పడసితి రాము నభిరాముఁ ♦ బరము సుపుత్రున్
గడునియతి నపుత్రత వో, నడవికిఁద్రోతునటె వాని ♦ నయనయవిదితున్. ౩౨౭

క॥ శూరు జితక్రోధసమా, చారుం గృతవిద్యు క్షాంతి ♦ సంభృతు రామున్
ధీరుఁ గమలాక్షుఁ బొమ్మని, యేరీతిం గడచువాఁడ ♦ నీశోకాబ్ధిన్. ౩౨౮

తే॥ ఎట్టు లిందీవరశ్యాము ♦ నెగువ నగుదు, దండకాటవి కీకాప ♦ థంబు నొడివి
దీర్ఘబాహు మహాబలు ♦ ధీమదగ్ర, గణ్యు నభిరాము రాము నీ ♦ కారణమున.

క॥ ఉచితసుఖుఁ డకట దుఃఖా, నుచితుఁడు తద్దుఃఖగతికి ♦ నోర్వఁగలనె నీ
వచలితవయ్యెద వీదు, ర్విచారమున నెట్టికష్ట ♦ విధి పైకొనెనో. ౩౩౦

మ॥ పడఁతీ ; యమ్మహనీయు రాము నడద్రె ♦ వ్వాం గానలోఁ ద్రోయునా
గాఁడవ ల్గానకమున్నె మేనెడలిన౯ ♦ గోల్పోక గాకుండు నా
కడరెల్లం బడఁగాని యయ్యదియుఁ దా ♦ నై పాల్పడంబోదు పో
కడయుం గల్గునె యెందుఁ గిల్బిషమున౯ ♦ గన్పట్టనొచెట్టకు౯. ౩౯౧

ఆ॥ ఇదియు వేడబంబ ♦ యే నెన్నిమార్లన్న, నెనరు నీవు పూన ♦ నేరకున్న
రాముఁ గూర్చి యింత ♦ రట్టేమె ; వాఁడేమి, చేసెనో తలంచి ♦ చెప్పరాదె.

క॥ ఘాతుకులారా ; నీవే, పాతకమన జంకుదింకఁ ♦ బనిలే దన నా
వ్రాతఫలం బిట్టి దప, ఖ్యాతి పరాభవము మృతియుఁ ♦ గలుగును దీన౯. ౩౯౩

మ॥ అకటా ; కామిను లెన్నికష్టములపా ♦ లైనం బొనర్పంగఁ గొం
కక వర్తింతురు స్వప్రయోజనమువం ♦ కంగాని పోదెప్డు భా
వకలానైపుణి దానఁ జొప్పడెడు దు ♦ ర్వారంబు పాపంబుమా
టకు నేమాగతి భావ్యనర్థమునె చూ ♦ డంబోరు తా రన్నచో౯. ౩౯౪

క॥ పలుచానలసంగడ మీ, పలుచన కనికాక మేలి ♦ ఫలమున కగునే
పలుగాకుల పొం దందుం, బలుగాములబం దనంగఁ ♦ బడదే యెందు౯. ౩౯౫

శా॥ మీఁద౯ శీర్షము క్రిందఁ గాలిడి సుఖో ♦ ర్మిం దోఁగు బాల్యాప్తి నా
మీఁద న్మొందల గ్రిందుగా నొదుఁగు నె ♦ మ్మి౯ స్త్రీలచేఁ జిక్కి సం
మోదం బీడ్పులపాలుగాఁగఁ దుది నె ♦ మ్ము ల్వీడఁ బ్రాయంపుఁ బెం
పేదం జీఁపురుఁగట్టవోలె నరుఁ డెం ♦ తేని౯ జడుండై చెడు౯. ౩౯౬

తే॥ అందఱును నొక్కతీరువా ♦ రనఁగ నౌనె, కొందఱుండరె సాధ్వులుఁ ♦ గోవిదలును
ముందుగా నినునిల్పి యే ♦ ముగుదనైన, నందుఁ జేర్పం దగునుఁ దద ♦ నంతరంబ.

చ॥ పరిభవమే ధ్రువంబగు న ♦ పాయము పాయ దుపాయమంచు లే
దరివయి నీవు నన్గెడప ♦ నాఁచికొనం గమకించి పొంచి పె
ల్లరుసమున న్గడల్కొనెద ♦ వాఁడిమాటకుఁ గొంక వింక నీ
శ్వరుతలఁ బెట్టులౌనో యవ ♦ శంబునఁ బొందెడు నాదుచిత్తము౯. ౩౯౭

—♦ దశరథుండు కైకవాగ్బంధంబున నవశుండై యుండ సూర్యుం డస్తమించుట ♦—

చ॥ అని నృపుఁ డార్తిమై నొగుల ♦ నస్తగిరి న్వెడనాడె భానుఁ డ
ట్లనుపద మవ్విభావరియు ♦ నైందవబింబముతోడఁ దోఁచె నే
మనిమొ ప్రకాశహీన యన ♦ నయ్యది యమ్మెను స్త్రీజనంబుపైఁ
దొనఁకెడునప్రతిష్ఠ తన ♦ తొంటిప్రదోషము తీరటుండఁగ౯. ౩౯౮

క॥ నిట్టూర్పులువుచ్చుచు నా, కట్టాకిక కైకఁ గాంచు ♦ గోరంబునకా
పట్టున నెనసిన శర్వరి, పట్టఁపురాజు దెస మెచ్చ ♦ పడయనిదయ్యెన్. ౩౯౦

మ॥ గగనాసక్త విలోకనుం డగుచు నా ♦ కంజారిదేవేరి న
త్త్రొగహాసం బెనయించుదానిఁ గని యా ♦ ర్తుం డానృపాలుం డనున్
వగలాఁడీ; సిరిమించు మయ్యుడులతో ♦ వర్ధిష్ణుతం గాంచు మా
పగ లెక్కించు పగల్చలం బెసఁగ నా ♦ పై వీఁక రాకుండఁగన్. ౩౯౧

క॥ నక్షత్రభూష నిశ నీ, వక్షతపై యుండు మిదె మ ♦ దంజలి కరుణన్
వీక్షింపుము భద్రాత్మిక, వీక్షణపుసఁ గడవఁ గాంతు ♦ నేమో క్షణముల్. ౩౯౨

తే॥ నీకలిమి గల్గ నెట్టెటో ♦ నిలుచువాఁడ, రాముపట్టాభిషేకంబు ♦ రహి సెడంగఁ
జూచు నయ్యది రాకున్న ♦ సాగయఁజేయు, దీవు నైన నద్దశ భరి ♦ యించు టరిది.

తే॥ ఒక తెఱంగున నీపోక ♦ యొప్పునేమొ, యని తలంచెద నటులేని ♦ నెనరులేని
దీనిఁ గనుఁగొనుపాపంబు ♦ తీఱుఁగడకు, వచ్చు నాపయి నేయది ♦ వచ్చిపడిన.

క॥ ఈనిర్ఘృణఁ గనుచున్ క్షణ, మేనియు మనఁజాల నరుగు ♦ మీవిఁక వేవే
నానయమునఁ గానగునది, గానంబడ నైన దానిఁ ♦ గడవం జూతున్. ౩౯౫

చ॥ అని మఱి కైకఁ గన్గొని కృ ♦ తాంజలియై చలియించుచున్ బ్రసా
దనమునకుం గడల్కొనె ము ♦ దంబిడవే దయమానమూర్తి వీ
యనువు సెడంగనీక పర ♦ మార్థ మెఱింగి చరింపఁ జూడు మీ
వనరు దలంగనౌ నసమ ♦ వారణ వారణరాజగామినీ. ౩౯౬

ఉ॥ మంచి యెఱుంగు దెప్డు నను ♦ మాన్యునిఁగాఁ దలపోయు దెన్న న
భ్యంచితురాల విట్లని త్వ ♦ దంఘ్రుల నేశరణంబు వేఁడెదన్
గొం చెపుమాటగాదిదియుఁ ♦ గోవిదు లెల్లరుఁ గోరుకొన్నఁ గా
వించితి సత్ప్రతిజ్ఞ నను ♦ వీరిఁజేయకు మీప్రసక్తిచేన్. ౩౯౭

ఆ॥ సాధువర్తనమున ♦ జరిపితి నిన్నాళ్ళు, దీనుఁడనుఁగ భవద ♦ ధీనుఁడనుఁగ
పొలసితిని గతాయు ♦ షుని నన్ను రాజుఁ బ్రసాదదృష్టిఁ గని ప్ర ♦ మోద మిడుము.

క॥ శూన్యుఁడనై యిమ్మెయి ని, న్నన్యాదృశ నేతదర్థ ♦ మర్థించెద న
న్మాన్యు నొనర్పుము సహృదయ, వన్యాయమువలనఁ బాచి ♦ యనుశయపరవై.

తే॥ రామ; నీయొసఁగినయదె ♦ రాజ్య మగ్రసుతున కని నాతలంపునఁ ♦ జొనుపువాఁడ
భరతునకు లోకమున కెల్ల ♦ గురువులకు న, భీష్టమైనప్రయోజన ♦ మిదియ సుమ్ము.

క॥ కీర్తితవై రాముని మే, ల్కీర్తింపుము నన్ను దీనఁ ♦ గృతకృత్యునిఁగా
వర్తిలఁ జేయుము శుభకృతి, వర్తిల్లుము జగము వొగడ ♦ వారిజనేత్రా. ౪౦౧

క॥ అని పలుమరు వేఁడెదున, య్యినకులమణి సూక్తివంక ♦ కెనయుదు దైవం
బనవలెఁ గా కటమున్నది, వినీత గాకుండెనే వి ♦ వేకిని గాదే. ౪౦౨

క॥ అరుదయ్యె శుద్ధభావను, నరుణేక్షణు నశ్రుకలు క్షు ♦ మాధిపతిఁ బతిన్
గరుణముగ వగచువరఁకున, నరసియు మే లరయకునికి ♦ యగరాట్తనయా.

ఉ॥ ఆదట నేలపైఁ బొరలె ♦ హాయని వాఁడెదఁ జొక్కె సోలె సం
మోదమువీడె నేఁడె తన ♦ మోసము వాటిలు నంచు నెంచె న
వ్వాదునకుం దలంకునిశ ♦ వారనియూర్పులతోన పుచ్చె మే
లే, దయితా ; యటంచు నుతి ♦ యించెమువందుల నాఁగె నర్తతిన్. ౪౦౪

ఆ॥ ధూళి ధూసరితు న♦ధూర్తుఁ బ్రాణేశు మ, హీంద్రు సుతువియోగ♦మెంచి పొక్కు
వాసిఁ గాంచి యిట్లు ♦ వచియించె నమ్మాధ, తనదుచలము డింపఁ♦దలఁప కపుడు.

క॥ సన్నసెడి క్షితితలంబునఁ, బన్నుండినఫల మదేమి ♦ ప్రభవుఁడవై నీ
వన్నియు నెఱిఁగి స్వదత్తం, బున్నితం బెడపఁ జూచె ♦ దుచితమె నీకున్. ౪౦౬

సీ॥ నాప్రతిశ్రుత మిట్లు ♦ నష్టంబు గావించి, పాపంబు పాల్కొనఁ ♦ బరఁగె దెట్లు
మున్నె తెల్పితి శైబ్య ♦ ముఖ్యులు సత్యంబె, పాటించి కీర్తిసం ♦ పన్నులైరి
సత్యంబుననె రవి ♦ చంద్రులు చరియింత్రు, సత్యంబు మీఱదు ♦ సాగరంబు
సత్య మేకపదం బె ♦ సంగు బ్రహ్మంబన, సత్య మాదవు ధర్మ ♦ సంగ్రహంబు
నీవు సుకృతపరుండవై ♦ నెగడెదేని, సత్యమే వేద మని రాము ♦ సత్ర మెనయఁ
బనుపు మట స్వస్థచిత్తతం♦దనరి భరతు, రాజుఁ జేయు మొకొండన♦రాదువినుము.

క॥ ముమ్మాటికిఁ దెలుపుము నీ, వమ్మెయిఁ బొనరింప వలఁతి ♦ వౌదో కావో
సమ్మతినెఱపక వ్యర్థపు, టుమ్మలికమువీఁకఁ బీడ ♦ నొందకు మింకన్. ౪౦౮

క॥ నీవటుసేయక తక్కిన, నీవేళనె నీదుకనుల ♦ యెదురనె ప్రాణం
బేవిడెద నాపై నెటు, పోవలతో యెంతవట్టు ♦ పున్నెము గనెదో. ౪౦౯

ఆ॥ అనుచు శంకలేక ♦ యాపె చుట్టెడుధర్మ, పాశముననుఁ గట్టు ♦ పడియె నృపుఁడు
మున్నుపేంద్రువృత్తి ♦ మొనయఁగఁ జేసిన, బంధనమునఁ బడిన ♦ బలి విధమున.

క॥ యుగచక్రాంతసృతి పా, యఁగ రానిద కాఁగ భ్రాంత ♦ మై లేటమొగం
బగపడ నడుకొనుధర్మ్యం, బుగతిం గైకొనియె నృపుఁడు ♦ భూధరపుత్రీ. ౪౧౧

ఉ॥ కన్నులు విహ్వాలంబులుగఁ ♦ గార్కొనునశ్రువు లాఁగ నంధుఁడ
యొ్య న్నెఱధైర్య మొప్ప వ్యస ♦ నోద్ధతి నెక్కొనసీక కైక ; నాఁ
డన్నెఱి మంత్రపూతముగ ♦ నగ్నికడం గయికొన్న పాణితో
నిన్నుఁ ద్వధాత్మజు న్విడిచి ♦ నేను వినిష్కృతిఁ గాంతు నిత్తఱిన్ ౭౧౨

క॥ విడనాడితి నెమ్మని తెగు, వడనాడి నిరాశుఁ డగుచుఁ ♦ బార్థివవరుఁ డే
ర్పడ గానిచిత్తవృత్తిం, బడరానియవస్థఁ బడుచుఁ ♦ బలికె న్మఱియున్. ౭౧౩

ఆ॥ రేయిఁ గడచె నిపుడె ♦ చాయమగండు రా, గురుజనంబు నన్ను ♦ గూడముట్టి
త్వరపడంగఁ జేయఁ ♦ దలపడుదురు వారి, కేమి దెలుపువాఁడ ♦ నిట్టియఘము.

తే॥ అమితహర్షాబ్ధిఁ దేలెడు ♦ నట్టిజనము, నపుడు గాంచిని రానంద ♦ మై యవాఙ్ము
ఖంబునై కనుపట్ట నేఁ ♦ గాంతు నెట్టు, లిపుడు దానిన నీదగు ♦ నిక్కటమున.

క॥ రాము నభిషేకమునకగు, నామెయిసంభారములన ♦ యగుఁ బొనరింపన్
నేమేను దొఱఁగ సంస్క్రియ; లామాన్యుఁడ మీఁగు రా న ♦ నవ్వా లచటికిన్.

క॥ నిను ముంపకపో దెట్లునఁ, గొనకొనుసీదగునవజ్ఞ ♦ కూళవు నీతో
ననరా దెద్దియు నీమో, మనదా; కనరాదు పొలియు ♦ మావల నోకటన్. ౭౧౮

ఆ॥ అని మహాత్ముఁ డాతఁ♦డనుచుండ శుభచంద్ర, తారకాఢ్య నిశ వి♦చారయుక్త
యుగుచుఁ జనెఁ బ్రభాత♦మయ్యెఁ బ్రభాతంబుఁ, దూర్యనిస్వనములుఁ♦దోఁచెనచట.

క॥ పాపసమాచార యగుచు, నాపడఁతుక యపుడు వలికె ♦ నధిపునితో నీ
వేపలు కనినను విషసం, తాపం బొడలి కొడఁగూర్చెఁ ♦ దక్కొన వేలా. ౭౧౯

ఆ॥ తలఁగఁజూడ నెట్లు ♦ తప్పుఁ గృతార్థుండ, వయ్యెదేని రాము ♦ నడవి కనిచి
భరతుఁడేనిఁ జేసి♦పడయుము స్వర్గంబు, ప్రతిన విడిచి నిరయ ♦ పదము గనుము.

—♦ కైక రాముని రప్పింపఁ గోరుట ♦—

క॥ నీతెఱఁగు చక్కపఱచునె, నీతిజ్ఞుని రాముఁ బిలువు ♦ నేర్చినయతఁడే
నీతాపం బెడలించును, నాతప్పొప్పును గణించు ♦ నడుఁకవల దిఁకన్. ౭౨౧

ఆ॥ అనుచు రాపు సేయ ♦ నత్యుత్తమాశ్వంబు, తోదనున్న మగుచుఁ ♦ దుర్లిపడెడు
భంగి దోఁప నతఁడు ♦ పరిభావితుండయి, చలితుఁడగుచు నిట్లు ♦ పలికె నపుడు.

ఉ॥ ఆతతధర్మపాశమున ♦ నట్టిటుఁబోవఁగనీక కట్టనై
కాతరత న్వహించితి వి ♦ కావికలై చెడెఁ జిత్తవృత్తి నా
చేతన నిల్వనేర దెటు ♦ శీఘ్రము రాము గుణాభిరాము మ
త్ప్రాతకము ల్దలంగఁ గని ♦ ప్రాకృతపుంగతిఁ ద్రోచి వైచెదన్. ౭౨౩

క॥ అను రాముఁ దలఁచునదె తలఁపను రామునిఁ జూచుచూపె ♦ యగుఁజూపనుమా
యను రామపదమె పదమను, నను రామముగాఁగ జిత్త ♦ మనువుపడంగన్. ౨౨౪

—♦ వశిష్ఠుండు దశరథుం గానవచ్చుట ♦—

ఉ॥ అంతఁ బ్రభాతభూతయగు ♦ నారజని న్వెనుద్రొక్కి భానుఁ డ
త్యంతసమృద్ధి నెక్కొనఁగ ♦ నొనెడఁ బుణ్యముహూర్తతారకా
భ్యంతరయోగ మెంచి సుగు ♦ ణాంచితుఁడైన వశిష్ఠమౌని సీ
మాంతసదాపగాస్పదప ♦ యఃపరివర్తితనిత్యకృత్యుఁడై. ౨౨౫

క॥ ఛాత్రులు సంభారోచిత, పాత్రులరై తోడుసూపఁ బావితజనచా
రిత్రుఁడు పురప్రవేశం, బాత్రములఁ దొలంచుమేటి ♦ మై పొసరించెన్. ౨౨౬

సీ॥ సిక్తసమ్మార్జిత ♦ చిత్రితసుమమాల్య, సంవిధానవిధాను ♦ షంజితంబు
రమణీయతరగోపు ♦ ♦ రద్వారతోరణ, వ్యాకీర్ణమణిమాలి ♦ కాంచితంబు
సవిధపతాకాగ్ర ♦ చారణగ్రహణాఢ్య, సువితానమౌక్తిక ♦ శోభితంబు
చందనాగరుసార ♦ చర్చాసమర్చిత, ప్రతిధూపితాలయ ♦ ప్రాంగణంబు

హృష్టపుష్టజనశ్రీస ♦ మేత మతిస, మృద్ధవిపణాపణాకీర్ణ ♦ మీడితోత్స
వప్రధానకథాన్యోన్య ♦ వర్ధితోత్క, భావ మప్పుర మరసెఁ ద ♦ పస్వివరుఁడు.

క॥ పుర మియ్యది పౌరందర, పురోపమం బయ్యెఁ దనరెఁ ♦ బూజితలక్ష్మీ
స్ఫురణ ననుపమం బనన్తై, తరమె నుతింపంగ ననుచుఁ ♦ దపసి దలంచెన్. ౨౨౮

ఉ॥ అచ్చటువాసి యంతిపురి ♦ నావశివర్యుఁడు సొచ్చి కాంచె సం
విచ్చతురు ల్సదస్యులు ప్ర ♦ వీణులు యజ్ఞవిదు ల్ద్విజు ల్మునుల్
సచ్చరితు ల్పురీజనులు ♦ జానపదు ల్నెఱయ న్విశిష్టసం
పచ్చయమైన యప్పదము ♦ భావిఫలోదయభావితంబుగన్. ౨౨౯

—♦ వశిష్ఠుండు సుమంత్రునితో సంభాషించుట ♦—

క॥ ఆవలనుఁ గడచి కనుఁగొనెఁ, ద్రోవనె మనుజేంద్రుఁ బెరయఁ ♦ దోఁతెంచుసుసం
భావితమంత్రు సుమంత్రుని, భావుకపరతంత్రు శమిత ♦ పరదుస్తంత్రున్. ౨౩౦

క॥ ఆరాజసింహుసచివు, సారథిఁ బ్రియదర్శను న్వి ♦ శారదు సముదా
చారరతు నరయఁగని తే, జోరాశి వశిష్ఠమౌని ♦ చొప్పడు వేడ్కన్. ౨౩౧

ఆ॥ అతనితోడ నిట్టు ♦ లనె సంయమివరేణ్యుఁ, డింకఁ జాగొనర్ప ♦ నేల యెల్ల
సిద్ధ మయ్యె రాము ♦ శ్రీసంవిధానంబు, తఱియుఁ దఱియవచ్చెఁ ♦ దర్పరముగ.

సీ॥ భద్రపీఠము తోడి ♦ బంగారుపాత్రికల్, తీర్థసారాధ్యము ♦ తెలియఁగుగాంచె
బూవులు గంధము ♦ ల్పుణ్యబీజౌషధి రత్నము, ల్మణు లుదా ♦ రతఁ దనర్చె
దధిపయోఘృతలాజ ♦ మధుశర్కరాదు ల, పారపూరములుగాఁ ♦ బరఁగుచుండె
మాన్యకన్యాతతి ♦ మత్తవారణరాజ, మంచితశ్రీహయ ♦ మరదముఁదగె
ధనువు నిస్త్రింశ మండలం♦బనుసృతములు
ఛత్రచామరముఖ్యముల్ ♦ శశివిభములు
హేమదామపినద్ధమా ♦ ఋషభవరము
హరి చతుర్దంష్ట్రమునుఁ దావు ♦ లంది మెఱసె. ౪౩౩

తే॥ వ్యాఘ్రతనుభాసితంబు సిం ♦ హాసనంబు
మెఱయుచున్నది శుభపక్షి ♦ మృగము లొప్పె
సంప్రదక్షిణజ్వాలప్ర ♦ సన్నుఁ డగుచు
నలరుచున్నాడు ప్రీతి హు ♦ తాశనుండు. ౪౩౪

క॥ వాదిత్రయుతులు వేశ్యలు, మోదాఢ్యలు స్త్రీలు ద్విజు ల ♦ మోఘవచస్కుల్
సాదరులు పౌరజానప, దాదులు దేశికవరు ల్మ ♦ హానందయురుల్. ౪౩౫

క॥ వచ్చి రభిప్రాయము లం, దిచ్చిరి పార్థివులు నట్టు ♦ లెదఁ దమకమునన్
హెచ్చిరి రఘురామునిసిరిఁ, జెచ్చెరఁ గనఁగోర్కు లెదిఁగి ♦ చిడిముడి పఱపన్.

క॥ ఏ నరు దెంచితి ననుచు మ, హీనాథున కింత దెలుపు ♦ మెల్లప్రజలు ల
క్ష్మీశ్రీనాయకుఁడగు రఘువరుఁ, బూని కనుంగొనెడు వేడ్కఁ ♦ బొంచెద రనియున్.

ఆ॥ శుభముహూర్తమున నె♦సూనృతవాక్పతి, రాజు రాజ్యలక్ష్మి ♦ రమణు రాముఁ
జేయఁబూవెఁ గాదె ♦ శీఘ్రంబ విచ్చేయ, వలయుననుచుఁ దెలుప ♦ మలయు మనిన.

ఉ॥ అమ్మహనీయుఁడై నముని ♦ యానతి నాదలఁదాల్చి తేనికిన్
సమ్మతుఁడాట లోనగరు ♦ చయ్యనఁ జొచ్చి తదంగణంబునం
దిమ్ముగ నిల్చి వానిదశ ♦ యింతయుఁ గాననివాఁడుగాన స్తో
త్రమ్మొనరించె స్వీయము వి ♦ ధానము నెంచి సుధానుగమ్ముగన్. ౪౩౯

—♦ సుమంత్రుండు దశరథుం బ్రబోధించుట ♦—

తే॥ సాగరుఁడు భాస్కరుండగు♦చంద్రుదీప్తి, నెనసి ప్రీతమనస్కుఁడై ♦ యెట్లు పొంగు
నట్టులానందమూర్తివీ♦వరుస మొందు, మయ్య రామునియభ్యుద♦యమున మొనసి.

క॥ సాగరుఁడ వీవు గద న, ర్వాగములఁ దొలంచురాముఁ ♦ డాఁగద చంద్రుం
డీగురుధర్మం బొప్పదె, శ్రీగురుధర్మమున మీరు ♦ చెలఁగుచు నుండన్. ౪౪౧

తే॥ ఇట్టివేళనె యిమ్మెయి♦నింద్రు డింద్ర,సారథి నుతించె గెలిచె రా ♦ క్షసుల నమ్మ
హోమహుం డట్టు లేను ని♦న్నాదరమున,కలిమి బోధించుచున్నాడ♦ఘనత వెలయ.

క॥ ఇంద్రారిహారుఁడవై నీ, వింద్రసఖుం డనఁగ నెగడి ♦ తేదీ; భేదం
బింద్రునకు నీకు రాముఁ డు, పేంద్రుండనఁ జెల్లుఁగాదె ♦ యెల్లవిధములన్. ౧౧౩

తే॥ అధిప; యాదిత్యుఁడునుఁ జంద్రుఁ ♦ డనుగతుఁడుగ
నిచ్చలునుఁ బృథ్వి నెట్టులో ♦ నిగమతతి స
హాంగముగ విధి నెట్టులో ♦ యటులె నిన్ను
నేను బోధించుచున్నాడ ♦ నియతి నెఱయ. ౧౧౪

క॥ అజునాత్మభువు న్విభు ని, న్నజయ్యు బ్రహ్మాణ్యు బ్రహ్మ♦యనఁ జెల్లదె యా
యజరులు పొగడరె యిట్లని, యజితుల యీయిరువు రనిన ♦ నాక్షేపం బే. ౧౧౫

ఆ॥ క్ష్మాతలేంద్ర; లెమ్ము ♦ కౌతుకమంగళ, సంవిధానమునఁ బ్ర ♦ సాద మిమ్ము
మేరుశిఖరినున్న ♦ మిహిరు నట్టులు చదు, ర నెడుదివికి దీప్తు ♦ లడర రమ్ము.

ఉ॥ చంద్రుఁడు ద్వాదశాత్ముఁడును ♦ శంకరుఁడున్ ధనదుండు పావకుం
డింద్రుఁడు పాశపాణియు న ♦ హీనజయోన్నతి నీకు నెప్డు ని
స్తంద్రతతోడఁ దోడ్పడుచుఁ ♦ దార్తురు గావుత మెల్లకాలమున్
సాంద్రయశోవిశాలరుచి ♦ శారదచంద్రిక గాయుఁ గావుతన్. ౧౧౭

తే॥ కడచె భగవతి రాత్రివేఁ♦డ్కలు దలిర్పఁ,బవలు పఱతెంచె మేల్కాను♦పట్టునందు
నిదురలగునయ్య; భారంబు♦నేఁడు దీఱు,రామునభిషేకవిభవంబు♦రాణ నెఱయ.

క॥ ప్రతిబోధ మొందు మింకం, గృతకృత్యుఁడ వౌదు వేముఁ ♦ గృతకృత్యులమై
ధృతిసమ్మతికై వేచెద, మతులితవిభవా; యనుజ్ఞ ♦ నందీయఁ గదే. ౧౧౯

ఆ॥ పౌరజానపదులు ♦ పార్థివు ల్నమ్రులై, దోసిలొగ్గ ద్విజులుఁ ♦ దోడుసూప
నరుగుదెంచి నిలిచె ♦ నదె మనయాచార్యుఁ, డావశిష్ఠమౌని ♦ యాదరమున.

క॥ రావే, యాజ్ఞాపింపవె, వేవే రామేంద్రుమహము ♦ విశ్వజనీనం
బై వెలయఁజేయ నీవై, భావుకములు గూర్పఁ దానె ♦ పట్టగుఁ బిదపన్. ౧౨౧

ఆ॥ పాలకుండులేని ♦ పశుతతియట్లు సే, నానిరాక వేచు ♦ సేన యట్లు
చంద్రుఁగోరురాత్రి ♦ చందాననున్నది, నిను నిరీక్షసేయు ♦ నీదుసభయు. ౧౨౨

క॥ గోవృషము దెసనె కన్నిడు, గోవులవలె నీదుప్రజలు ♦ కోర్కులు వెలయం
గా వెరవరయుచు నున్నా, రీవె ప్రమాణంబు వారి ♦ నెల్లరఁ దీర్పన్. ౧౨౩

ఆ॥ అనుచు నర్థవంత ♦ మును సాంత్వపూర్వంబు, నైనభంగి నాతఁ ♦ డాడుచుండఁ
బౌరపార లెమ్మన్న ♦ పౌడమి లోఁ నాఁగంగ, నున్నశోక మబ్ధి ♦ యోజ నపుడు.

క॥ తనసంతస మంతయు మం, తనము న్విడఁగాంచి చనఁగఁ ♦ దనయునిమురిపం
బనువునఁ గనఁ గనుభాగ్యం, బనదలకుం గలదె యనుచు ♦ నలమటపడుచున్.

క॥ కనులెఱ్ఱనివై తనదగు, ఘనవ్యసనయుక్తిఁ దెలుపఁ ♦ గా శ్రీమంతుం
డనఘుఁడు ధార్మికుఁ డతఁ డి, ట్లనె సూతజుతోడ వికసి ♦ తాంబుజవదనా.

ఆ॥ మర్మకృంతనములు ♦ మాను మీస్తోత్రము, ల్పొమ్ము నీదుపనుల ♦ పొరువు సేర
నోసుమంత్ర; యనిన♦నీసిలుం గేలొకో, యనుచుఁ దలఁగఁ బాఱె♦నతఁడు వడఁతి.

క॥ తంత్రమునఁ జిక్కువడి పర, తంత్రతమై నొడువ విభుఁడు ♦ తలఁకుచు నొగులన్
మంత్రజ్ఞుమైన కైక సు, మంత్రునితో నిట్టులనియె ♦ మానుగ మగువా. ౮౫౮

ఉ॥ ఓయి సుమంత్ర ; రాముదెస ♦ నుల్లసితంబగుకౌతుకంబునన్
నాయకుఁ డెల్లరే నిదుర ♦ నల్లవొ ; యుల్లనికారణంబ యీ
చాయను మబ్బు సైకొలుపఁ ♦ జాలెను జాలము సేయ కిమ్మొయిన్
బోయి యశస్వి నన్విహితుఁ ♦ బుత్రునిఁ దోడ్కొనిరమ్ము నావుడున్. ౮౫౯

మ॥ అనువైయున్నది పల్కుతీరు శుభమే ♦ యాఁగాత మెట్లైన ని
య్యనుఁ దోడ్కొందు తెఱంగునం గొదరుచో ♦ ప్పే చొన్పడం బల్కె నం
గనయానం గొని పోక పోకునికియుం ♦ గాదంచు వాఁడెంచుచున్
జనె నియోజన రామదర్శన మవ ♦ శ్యంభావి భావించుచున్. ౮౬౦

తే॥ రాజమందిరమువనుండి ♦ రామదర్శ, నోత్సుకుండయి వెడలి ద్వా ♦ రోపకంఠ
మునఁ గనుంగొనె ద్విజరాజ♦ముఖ్యపౌర,జానపదసంఘముల సభా♦సదులనతఁడు.

క॥ వారలు సూతునిఁ గాంచి మ, హారాజిటులేల తడసె ♦ నధిగతమన్యోన్
సారతరము రామోత్సవ, మారాదుపహితము లయ్యె ♦ నర్థములెల్లన్. ౮౬౧

ఆ॥ పుణ్యతీర్థసలిల ♦ పూర్ణకాంచనకుంభ, ములు సముద్రవారి ♦ ముద్రితమణి
కలశములును లోను ♦గాఁ గలయవి సమ, కూర్పఁబడిన వెందుఁ ♦ గొఱతలేదు.

క॥ ఆహృతములయ్యెఁ దిర్య, గ్వాహప్రాగ్వాహగగన ♦ వాహరసంబుల్
మోహనమూర్తి విశేషా, భ్యాహితమభిషేకమహామ ♦ హోత్సవ మొలయన్.

తే॥ విమలుఁడై తోఁచె రవి రఘు♦వీరుజన్మ,లగ్నమునుఁ బుష్యయుక్తమై♦లలిఁదనర్చె
ననుచుఁ ద్వరపడి గురువర్యు♦లానసేయు, చున్నవా రింకనేలొకో ♦ యారకునికి.

క॥ మంగళవస్తుసమృద్ధి మ, హాంగణ మటులున్నయది శు ♦ భాయతనము శ్రీ
సంగతమై రామునిహృద, యంగము మేలెంచి యతని ♦ యట్టిద యగుచున్.

తే॥ భద్రసింహాసనము రామ ♦ భద్రమూర్తి
యెపు డొాలఁపుగూర్చుఁ దనకని ♦ యెదురుచూచు
చున్నయది భద్రదంతిహ ♦ యోత్తమసుర
థములతోడ జనాళి చి ♦ త్తములతోడ. ౪౬౭

క॥ మ మ్మినున కెఱుక సేయఁగ, న మ్మెయి పుణ్యాత్ము లెవ్వ ♦ రా యని యాత్మ
న్యమ్మదలనిండి పైకొన, గ్రుమ్మరుచున్నార మిావ ♦ కూడితి నీకై. ౪౬౮

ఆ॥ అనెడువారి నెల్ల ♦ సాదరుండయి కాంచి, యిట్టులనె సుమంత్రుఁ ♦ డెలమి మించి
యన్నలార; రాము ♦ నధిపతి పిలువుమో, యనఁ దజాస్పదమున ♦ కరుగువాఁడ.

క॥ ఐన స్మీరందఱు ని, ట్లానందమునం దనర్చు ♦ టారసి యెమ్మెఁ
బోనేర్తు నాతఁ డింతకు, రానిసమాచార మెఱిఁగి ♦ రా నగువాఁడన్. ౪౭౦

క॥ రాజునకు రామునకు మిా, రోజమెయిం గూర్చువార ♦ లుర్వీశునకున్
మిాజాడ నొడివి యచ్చటి, నైజముఁ గనఁ గాంచి వత్తు ♦ నాదగు నెమ్మిన్.

మ॥ అనుచుం గ్రమ్మఱ నోజ నంతిపురిడా ♦ యంబోయి మాహాత్మ్యమం
డన ; తేజోనిధి ; విశ్వమండలపతీ ; ♦ ఘాంకారసంమోహాభృ
ద్దనుజానీక ; సురేంద్రపూజ్య ; శుభసం ♦ ధా ; నిత్యసత్యోదయా ;
యినవంశాంచితమూర్తికా ; దశరథా ♦ ధీశా ; ప్రశాసింపవే. ౪౭౨

ఆ॥ నీదుదర్శనంబు ♦ నెఱవేచియున్నారు, తలఁపు దలకుఁ గడవ ♦ ధరణినాథు
లెవుడు మేలుకొందు ♦ వీనాఁటి మేలున, నిదురవోవఁ జను నె ♦ నీ కధీంద్ర!. ౪౭౩

క॥ భగవతి రాత్రి తలఁగె మే, ల్పగ లిదె నీరాకఁ గోరి ♦ పరఁగెడునది తే
ర్పఁగ రాదె పీరె బ్రాహ్మణు, లగభేదననిపుణుగురుని ♦ యంతటివారల్. ౪౭౪

తే॥ ఎల్లవేల్పులు శుభము లం ♦ దిచ్చువారు, కొదవవారలు నీ మేలు ♦ గోరువారు
జాల మేలపొసర్చెదు ♦ జగము మెచ్చ, రాము నభిషిక్తుఁ జేయ బి ♦ రాన రమ్మ.

క॥ అని మేలుకొలుపుచును వాఁ, డనితరముగఁ బొగడ తేఁ డ ♦ నర్థాప్తినిఁ బై
కొనునలజడిపెల్లున ని, ట్లనె నాతనితోడ గిరివ ♦ రాన్వయభూపా. ౪౭౬

ఆ॥ నాకునిద్రపట్టు ♦ నా, సమయాంతరం, బునను రాముఁ దెమ్ము ♦ పొమ్మటంచు
నాతి దెలిపె నదియు ♦ నాయాన గాకుండు, నెట్టు లీవు దాని ♦ నొంచవలదె.

క॥ ఒండొకఁడు దలఁప కింకిట, నిండుమనంబునను నీతి ♦ నెక్కొన రామేం
ద్రుండున్న నెలవుగని కుల, మండనుఁ డొడ్డెమ్ము నాదు ♦ మాటవశమునన్.

చ॥ అని విభుఁ డానతిచ్చినమ ♦ హాత్మ ; ప్రసాద మటంచు వీడుకో
ల్గొని చనె వాఁడు గాము నెదఁ ♦ గూర్చినకూర్పున నైనసంతసం
బనితరమై కడల్కొనఁగ ♦ హాయి దలిర్పఁగ భాగధేయ మిా
యనువున కబ్బె నేమనఁగ ♦ నౌనని తా నఖిలైకపావనీ. ౪౭౯

క॥ రామోత్సవదీక్షాహిత, మామానస మపుడు తత్స ♦ మాహ్వానతదీ
క్షామహితయోగనిహితం, బై మురియఁ గృతార్థుఁ డయ్యె ♦ నతఁ డద్రిసుఁతా.

క॥ అని విశ్వేశుఁడు వినిచిన, విని విశ్వాత్మిక భవాని ♦ వేడుకపడి యీా
తనివల నవ్వల నేమ, య్యెనొ తెలుపవె యనుచు వేఁడ ♦ నెలనగ వెలయన్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఆశ్వాసాంతపద్యములు.

చ॥ అనుపమయోగభోగవిష ♦ యావధిభూత శుభోవనేతృతా
వన వనవాసి చిత్తనల ♦ పావనవృత్తిమయా, మయామయా
ర్దనచణనై జసంస్మరణ ♦ తత్పరధర్మ సధర్మసంతతి
స్వనుభవలక్ష్యదృక్సుఖస ♦ దవ్యయభావిభవాది లక్షణా. ౪౮౨

క॥ అఖిలాండనాయకా; స, త్సఖిత్వమహితాత్మజనవి ♦ సంగిత్వమహా
సుఖసంధానగుణాంత, ర్ముఖనిష్ప్రత్యూహకరణ ♦ మానితచరణా. ౪౮౩

రథోద్ధత॥ భావనాంచిత వి ♦ పాకనిర్మల, శ్రీవిశిష్టనిజ ♦ సేవకాదృతా
భావుకేతర ని ♦ బద్ధదుర్జనా, భావసంక్రమభ ♦ వక్రియోద్యతా. ౪౮౪

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మమాంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం ద్వితీయాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

———:o:———

## తృతీయాశ్వాసము.

———o———



నిత్యసేవనాంచద
నూనవిలాసోదయా ; మ ♦ హోహాద్యమకలనా
వ్యానద్ధనదయహృదయా
స్వానందానుభవచిన్మ ♦ యా ; జితమాయా. ౧

—♦ సుమంత్రుండు రామ నగరి కరుగుట ♦—

తే॥ అవధరింము ప్రియ కిట్టు ♦ లనియె శంభుఁ, డట్లువాఁ డరుగుచుఁ గాంచె ♦ నప్రధృష్య
నిరుపమానసుఖోన్నిద్ర ♦ నిష్ఠితంబు, పురమునజనంబు పుణ్యాసం ♦ బోధితంబు. ౨

సీ॥ ఆటపాటలజోలి ♦ నగు మాలిమికి మాలి, ప్రభునోలిమిఁ గోరు ♦ బాలతతుల
నాలఁ జేనులగట్ల ♦ కరికాఁపులుంచి భూ, పాలు మే లరయు గో ♦ పాలజనుల
మాపాలిసంపద ♦ మానింప నోఁగాదె, యని యీశుఁ గీర్తించు ♦ నబ్జముఖులఁ
బూలఁ బూజించు శే ♦ వున్నె మీహరి నంచు, సరివారి కెఱిఁగించు ♦ పురుషవరులఁ
గనుల కఱవు దీఱఁ ♦ గాంచుచు రామునిఁ, జూచువేడ్కఁ సంచు ♦ చొక్కి వెనుపఁ
బోవుచుండె సూత ♦ పుత్రుండు తోలిభవం, బునవిభూతి తఱిని ♦ ననిచి నడువ. 3

ఉ॥ ఎప్పుడు తెల్లవాఱెడునొ ♦ యెప్పుడు గాంతుమొ యొప్పులానిమే
లెప్పటికప్డె వింతలవు ♦ నే యని శ్రీ పరికించు మోముపైఁ

దప్పక చూడ్కి నెక్కొనఁగఁ ♦ దామరసేక్షణ ముద్దరాలు మా
యొప్పులకుప్ప సీతజత ♦ నోజ నిలం గని పొంగు టెప్పుడో.

మ॥ శరచాపంబులు దాల్చి లక్ష్మణుఁడు క ♦ న్నన్నం బ్రవర్తింప నె
ల్లరు రాజన్యులుఁ జేతులెత్తి హారిలీ ♦ లామూర్తి యానాఁగ భూ
సురవర్యుల్ శ్రుతిచోదితక్రియలు సం ♦ శుద్ధాత్ములై కూర్ప భా
సురుఁడౌ రాముని గాంచుకన్గవలకుం ♦ జోహార్లు గావింపమే.

తే॥ సత్యసంకల్పుఁ డీశుండు ♦ సర్వసద్గు
ణాకరుఁడు రాముఁ డధినేత ♦ యనుగు ఛత్ర
చామరాదులు మెఱయఁ బ్ర ♦ శస్తి నెఱయ
మునులదీవెన లందుచో ♦ మురియ వలదె.

చ॥ శ్రుతిచయపారగు ల్ద్విజులు ♦ సూనృతవాగ్విదులౌ సభాసదుల్
స్మృతిగణసంప్రణేతలు య ♦ మిప్రభు లూర్జితులైన భూపతుల్
చతురులు వందిమాగధులు ♦ చారణులుం బొగడంగ జానకీ
పతియెలమోముచందురుఁడు ♦ భద్రపుఁబట్టము దాల్చి ♦ పొల్చెడున్.

తే॥ సతులు నీరాజనలొసంగఁ ♦ జారువాసి
నులు వెలవెలందు లాడ వి ♦ నూత్నకళల
వాద్యము లెసంగఁ జతురంగ ♦ బలము గొలువ
మలయు లేటేనిఁ గని జన్మ ♦ ఫలము గనమొ.

ఉ॥ పచ్చనిపట్టుసేల్వ సిరి ♦ భాసిల హారకిరీటకోటిసం
పచ్చయ ముట్టిపడ్డటులె ♦ వన్నడ దర్పకకోటిసుందరం
బిచ్చటుగాదె యంచొలసి ♦ యెల్లరు నెంచఁ గృతాభిషేకుఁడై
ముచ్చట చెల్ల హస్తిపయి ♦ ముంగిటరాఁ గని మిన్నుముట్టమే.

తే॥ ఇంద్రనీలదలప్రభ ♦ నించుమొగిలు
చెంగటి మెఱుంగుఁదీవియ ♦ సీతతోడఁ
బ్రజలు తనచక్కఁటి శుభంబు ♦ పడయఁ జూడఁ
గోర్కు లీరఘురాముండు ♦ గురియకున్నె.

క॥ భాగ్యము ఫలించె సంప, ద్యోగ్యుల మైతిమి రమాధి ♦ యోగశ్రీసౌ
భాగ్యమున వెలయురాముని, భోగ్యవిలాసంబు లరయు ♦ పున్నెం బబ్బెన్. ౧౧

తే॥ అనుచు నెల్లెడ నుల్లాస ♦ మాటపట్టు
గా సుపాత్రలు వార్తలు ♦ కాంక్ష లొలయ
శ్రుతిసుఖం బొడఁగూర్పంగ ♦ శుద్ధమాన
సుఁడు సుమంత్రుఁడు చనె రాజ ♦ సుతువసతికి. ౧౨

శా॥ కైలాసంబొ సుమేరుసంశ్రయమొ య ♦ క్షస్వామిధామంబొ శ్రీ
లీలామందిరమో సురేంద్రుపదమో ♦ లేఁదళ్కులం జిల్కు చం
ద్రాలంబంబు గృహంబొ నాఁదనరి ని ♦ త్యప్రత్యయావాప్తి కా
వాలంబై యవియెల్ల దానె యననౌ ♦ వ్యాఖ్యాసమాఖ్యల్తగన్. ౧౩

ఉ॥ బంగరుకీలుబొమ్మలు సె ♦ బాసన మాటల నాటపాటలన్
హంగులుసూప నూడిగపు ♦ టాండ్రు గడల్కొని కన్నుసన్నలన్
బొంగుచు మన్నన ల్నెఱపఁ బూవులు దీవెలు పచ్చతోరణాల్
రంగులు రత్నదీపికలు ♦ రాణఁదనర్చు హజారపున్మొగిన్. ౧౪

తే॥ మూడు కక్ష్యలు గడచి య ♦ మూల్యరత్న
జంతుసంతతులకు నను ♦ చరము లగుచుఁ
బలుకుశుకపికశారికా ♦ పఙ్క్తు లరసి
యంచనడల నొయ్యారంబు ♦ లాదరించి. ౧౫

ఉ॥ కాన్కలు గొంచుఁ దేర్లునిచి ♦ కాల్నడలం బఱతెంచి చొచ్చి యే
కిన్కలు లేక జన్మఫల ♦ కృత్య మటంచుఁ దలంచి పొంచి యా
వెన్కఁ గనంగనీని పలు ♦ వేడ్కల చూడ్కుల సంగడంబునన్
మున్కొనుసంతసంబు తల ♦ మున్కలు గాఁ గనుతేండ్లఁ గాంచుచున్. ౧౬

ఉ॥ ధూపపువాసన ల్నెఱసి ♦ తోరపుఁగప్పుఁబ్రోవుతీర్పులన్
బ్రోపునమించి చందనముఁ ♦ బున్గు నుశీరముఁ గమ్మకస్తురిన్
దాపునఁ గాంచి తన్మయతఁ ♦ దార్కొని గంధవహుండు మేలివీ
చోపు లిడంగఁ బూపొదలు ♦ చొచ్చుచు వచ్చువహిన్ గ్రహించుచున్. ౧౭

తే॥ ఇంద్రునైరావణంబున ♦ కెన యనంగ
నెల్లసౌభాగ్యములకుఁ దా ♦ నెల్ల యగుచుఁ
దొంటినోముల పున్నెమ్ము ♦ దోఁప వెలయు
భద్రగజమునుఁ గాంచె నా ♦ ప్రభుసచివుఁడు. ౧౮

క॥ ఆశత్రుంజయహస్తి శు, భాశంస లొనర్చి రఘువ ♦ రామేయగుణ
శ్రీశంసితములు వినుచు ద్వి, జాశీర్వచనప్రశంస ♦ లరయం గనుచున్. ౧౯

చ॥ సొబగుల మించి వేసముల ♦ సొప్పు మతింతగ వింతసూప వే
డబమని లేక వేడ్క బ్రక ♦ టంబుగ నర్థ మువన్యసింపఁ దౌ
ర్యబహువిశేషము ల్పొసఁగ ♦ నచ్చెర లట్టులు రామసత్కథల్
విబుధులు మెచ్చఁ దెల్పెడు బ్ర ♦ వీణల వేశ్యల లీల లెంచుచున్. ౨౦

ఉ॥ వేడుకతోడ బీరమును ♦ వేసము లల్లన వెల్లడింపఁ జే
ర్వాడినమేటిపోటరులు ♦ వాఁడియలుంగులు దాల్చి సూరెలన్
వీడక రామునుత్సవము ♦ వెంబడివార్తలు ముచ్చటించుచున్
బోఁడుము లొప్ప మేకొనున ♦ పూర్వనయోన్నతి కుల్లసిల్లుచున్. ౨౧

సీ॥ ముప్పురంబునగర్వ♦మును గెల్చి కొనినచం, దములాంఛనములై ప♦తాక లొప్ప
బాలముస్నీటిద ♦ ర్పము లెక్కసేయని, వృత్తు లట్టులు కాంతి ♦ వీచులెనయ
బంగరుకొండకుఁ ♦ బైమెట్టనుచు మేలి, కట్టుఁ దెల్పెడు మేలు ♦ కట్టు లొనర
బహుసంపదలచుట్టు ♦ బలిద్రిప్పినది యల, సౌభాగ్య మనితీర్పు ♦ కలన లనఁగ
సర్వమంగళప్ర ♦ శస్తికిఁ దానకం, బగుచు నగుచు మంగ ♦ ళాలయావి
లాసలాసకముల ♦ లలితభాసనముల,నమరు రామమంది ♦ రమునుఁ దఱిసి. ౨౨

క॥ సేవించువారి భవ్యము, భావించి సుఖించువారి ♦ భద్రాయిత మం
చావిష్కరించువారి న, నావిలవృత్తులగువారి ♦ నటఁజని కనుచున్. ౨౩

ఆ॥ ఆయుధములు దాల్చి ♦ యవిరతశుశ్రూష, నెగడ నంతరముల ♦ నెఱయనీక
కాచియున్నభటులఁ ♦ గంచుకిజనముల, గాంచి పరిచయమున ♦ కడఁక మించి.

క॥ అరదంబులతో విజయ, ద్విరదంబులతో శుభోప ♦ వేశాదృతమై
శరదంబుజాకరభమా, కరదం బుపరాజమంత్రి ♦ గణ మతఁ డారసెన్. ౨౪

ఆ॥ దోసిలొగ్గి నడకుఁ♦దొడరి యుపాయన, మ్ముల నమర్చి యాన ♦ ములఁ దొఱంగి
పరఁగుపౌరజాన ♦ పదకోటికోటిప, రార్థములకుఁ గాంచి ♦ యనువు నెంచి. ౨౬

క॥ అంతిపురిఁ జెరసినంతనె, పొంతనె తనరథము నిలిపి ♦ పుణ్యుఁడు ద్వారో
పాంతమున సంతసంబున, దంతురితుం డగుచుఁ దత్ప ♦ దస్థులఁ గనుచున్. ౨౭

క॥ హేమగిరిశిఖరముననొఱ, సామెయి హరివైజయంత ♦ మందము చందం
బామెతలు గొనెడు హర్మ్యాలను, సామెత లొలయించు రామ ♦సదనంబెనసెన్.

క॥ కాషాయధారులు వృద్ధులు, భూషాఢ్యులు వేత్రివిద్వి ♦ భులు త్ర్యధ్యక్షుల్
యోషాగ్యణవేషా ప్తివి, శేషాంచితులైన ద్వాఃప్ర ♦ సిద్ధులఁ గాంచెన్. ౨౯

క॥ అచ్చటివా రధిపతిహితు, మెచ్చి యతని మెచ్చు వడయ ♦ మేకొని తోడ్తో
నుచ్చలితులై మెలంగం, జొచ్చిరి తమయాసనముల ♦ నూరెల విడనై. 30

క॥ రామప్రీతిచికీర్షువు, లామెయివా రెల్ల రాద ♦ రాంచితు లగుచుఁ
శ్రీమంతుఁ జేర వచ్చిన, ధీమంతు సుమంత్రుఁ గనిరి ♦ తేఁకువ వెలయన్. 3౧

తే॥ అధిపునానతి శ్రీరాము ♦ నచటికిఁ గొని
చనఁగ నేతెంచినాడ నా ♦ చంద మెఱుక
సేయుఁ డని పరిజనులతోఁ ♦ జెప్పిపుచ్చి
నియతిమెయి ద్వారసీమఁ దా ♦ నిలుచుటయును. 3౨

క॥ ఆవార్త వినినయంతన, యావార్తదుఁ డఖిలమయుఁడు ♦ నౌరాముఁడు సీ
తావనితాసేవితుఁడై, శ్రీవిలసితుఁ డగుచు నుండి ♦ చిత్కళ లెసఁగన్. 33

క॥ గురుసచివుఁ డనెడు గౌరవ, భర ముల్లసిలంగ విభుఁడు ♦ భద్రప్రదుఁ డా
దర మొప్పఁగ నచ్చోటున కరుదేరఁగ నానసేయ ♦ నటఁజని వేడ్కన్. 3౪

—♦ సుమంత్రుఁడు శ్రీరాము సందర్శించి సంభాషించుట ♦—

సీ॥ ఘనరత్నపర్యంక ♦ మున నుపవిష్టుఁడై, శ్రీదుసంపద గ్రేణి ♦ సేయువాని
సారభాంచితరక్త ♦ చందనోచితవీర, శృంగారమున నింద్రుఁ ♦ జెనయువాని
నతిదుస్సహం బగు ♦ నట్టి తేజము పరం, తపముగాఁ దపనార్తిఁ ♦ దనరువాని
నగుమోముజిగివెన్నె ♦ లగోనాల మేలున, జంద్రప్రసాదం బొ ♦ సంగువాని
పచ్చపట్టుకట్టు ♦ భాసిల్ల హారకే, యూరముకుటకటక ♦ సారమణిమ
యూఖవిలసితుఁడు స ♦ ముజ్జ్వలకుండల, గండమండలప్ర ♦ కాండుఁ డునయి. 3౫

క॥ స్మితరుచు లాకర్ణాంతా, యతలోచనదీప్త లోలసి ♦ యంచితవీక్షా
కృతు లయి తనపయి నెఱయఁగఁ, దతాదరతఁగాంచు నతనిఁ♦దద్దయుఁ గనుచోన్.

క॥ ఆచిత్ర జానకీసతి, యై చైత్రాభ్యుదయమున మ ♦ హామోదముతో
సాచివ్యమున మొనయ శశి, యై చక్షుఃప్రీతి రాముఁ ♦ డతనికిఁ గూర్చెన్. 3౭

క॥ ఆహాఁ జేరి వినీతిన్, జోహా రొనరించి నెఱికిఁ ♦ జొక్కుచుఁ దనపు
ణ్యాహోసాదితఫల మని, మోహం బెడఁ ద్రోచి వాఁడు ♦ మురియుచుఁ బలికెన్.

ఆ॥ సుఖమె నీకు నిత్య ♦ శోభనమూర్తి; శ, య్యాసనాహరణవి ♦ హారములను
జయము కోసలాత్మ ♦ జాసుప్రజారామ; నిచ్చ నీవశమున ♦ నెగడుఁ గాత. 3౯

తే॥ రావె ముద్దులమురహరీ; ♦ రావె తండ్రి;, రావె నీరాకఁ గోరి నీ ♦ రధిగభీరుఁ
డోజ నీక్షించుచున్నాడు♦ రాజమౌళి, కేకయాధిపుతనయ వా ♦ క్కేలి వెలయ.

క॥ సకలగుణాఢ్యుఁడ వని నీ, సుకృతముఁ దలపోసి మేల్మి ♦ సూచింపఁగ న
య్యకలంకయు వేఁడిన వే, డ్కకుఁ గానగు నింత యుత్సు ♦ కత జీవమణీ. ౮౧

ఆ॥ అనిన నుల్లసిల్లి ♦ యాతని మన్నించి, యుత్కటత్వ మొప్ప ♦ నూహ సేసి
యవనితనయవదన ♦ మాలోకన మొనర్చి, పలికె మేలిపలుకు ♦ బదులు దనర.

ఉ॥ భాగ్యమకాఢ వత్సలత ♦ వట్టుగ నెట్టన మధ్యమాంబ సౌ
భాగ్యవతీలలామ మనఁ ♦ బార్థివుఁడుం దనయిచ్చ మెచ్చఁగా
యోగ్యు సుమంత్రునిం బనిచె ♦ యోజనకుం దగియుండఁ బ్రాంచితా
మృగ్యమహాహ్లాదయం బయిన ♦ మే లొనగూర్చుతలంపు పెంపున౯. ౮౩

తే॥ ఆయశస్విని నాదు శ్రేయంబ కోరుఁ,దండ్రి యట్టిఁడ యని వేఱె ♦ తలఁప నేల
ప్రాణపద మిట్టు లీతనిఁ ♦ బనిచి రెంత, వట్టు భావించిరో తటి ♦ వల నెఱింగి.

ఉ॥ ఇంతిరో; మత్ప్రయోజనము ♦ నెంచి ముదంబున మించి తల్లి దా
మంతనమం దొకొండయిన ♦ మార్గమున౯ ధృతిఁ బెంచి వేఁడఁగా
నింతకు నన్నుఁ బిల్వ మనె ♦ నీశుఁ డితం డరుదెంచెఁ గాన నే
నెంతయు వేడ్కమై నరిగి ♦ యెల్లవిధంబు లెఱుంగఁ గాంచెద౯. ౮౫

క॥ సందియము లేదు నెమ్మన, మం దొాదవినయర్థ మదియు ♦ నభిషేకశుభా
స్పందిత మాస్మాకమయ్యె,పొందిక మెయి జయముఁ గూర్పఁ♦బొసఁగుచునుండు౯.

క॥ ఎత్తెఱఁగున నచ్చోఁబరి, ష త్తమరెనొ తగినదూత ♦ సంగతుఁ డయ్యె౯
ము త్తఱుల నెఱి యెఱుఁగు గుణ, వ త్తరుఁ డివ్వానిఁ బోలు ♦ వారలుఁ గలరే.

క॥ ఈవెరవున నను రాజుం, గావింతురు పట్టమునఁ బ్ర ♦ కాశ మెలయనా
నావలనున దేవీపద, మీావు న్వహియింతు వెనక ♦ మెసఁగంగ బళే. ౮౭

తే॥ నీవు నీపరివారంబు♦నెలఁతుకలును,నిందు సుఖముండుఁ డేఁబోయి♦యిపుడ వత్తు
నమ్మహారాజు రాణియు♦ననువుమీఱఁ,గూర్చునుపలాలనముఁ౹ంది♦కొనిముదమున.

తే॥ [illegible]

ఆ॥ భద్రముఖ; ద్విజన్మ ♦ భాషితధర్మంబు, తొలుత నెఱపి మించి ♦ తోడుతోడ
రాజ్య మెనయఁ గాంచి♦రాజసూయప్రము, ఖాధ్వరములు సేయ ♦ నగుదుగాత.

క॥ నిను లోకకర్త వాసవు, ననుపున రాజ్యాభిషిక్తు ♦ నధిపుఁ డొనర్పన్
దనరారునాసమెయి మే, కొనుఁ గావుత తనదుమేలి ♦ గొనములు గొఱలన్.

ఆ॥ నీదుఫాలతలము ♦ నెఱయు పట్టమురేఖ, యఖిలపట్టభద్రుఁ ♦ డనుపొగడ్త
కాస్పదంబు గాఁగ ♦నగుఁగాత మిల మహో, త్సవములంది తృప్తి♦దనరుగాత.

క॥ నిను దీక్షితు వ్రతసంప, న్నునిఁ గృష్ణాజినధరు న్మ ♦ నోవాఞ్ఛితుర్
ఘను ధృతకురంగశృంగుం, గని యుబ్బున మేల్మిఁ గొల్వఁ ♦ గానొదానర్. ౫౫

ఆ॥ వజ్రధరుఁడు నిన్నుఁ ♦ బ్రాగ్దిశ రక్షించు, దక్షిణమున దండ ♦ ధరుడు ప్రోచు
నాప్రతీచి వరుణుఁ ♦ డాదృతిమైఁ గాచు, నుత్తరమున ధనదుఁ ♦ డోము నెపుడు.

—♦ శ్రీరాముఁడు తండ్రిసన్నిధికి వచ్చుట ♦—

క॥ అనుశుభవాదిని కాయమ, కనుజ్ఞ యిడి తరలె గిరిగు ♦ హాశయసింహం
బనుగతసుమంత్రుఁడై కర, మనురక్తిన్ ద్వాస్థుఁ డనుజు ♦ నంజలిఁ గొనుచున్.

తే॥ అతఁడు మధ్యమకక్ష్యయం ♦ దమరియున్న
యర్థుల సుహృజ్జనులఁ గాంచి ♦ యాదరించి
దీప్తపావకనిభ మయి ♦ తేజరిల్లు
కాంచనస్యందనం బెక్కెఁ ♦ గమలనయన. ౫౮

క॥ మణిహేమవిభూషితమై, యణిమాదులకెల్లఁ దాన ♦ యగుఁబో యనసై
గుణితస్ఫురణల నదియు న, రుణమండల మనఁగ రామ ♦ రూఢిఁ దనర్చెన్. ౫౯

తే॥ పిన్న యేనుంగుగున్నలై ♦ పెనుపు పొనర
నున్న హారు లైంద్రరథమున ♦ యుగ్యములుగ
నొప్ప నొప్పారె నది స్వని ♦ తోచితముగ
నతనిఁ బర్జన్యుఁ డనిపింప ♦ నై పురంధ్రి. ౬౦

క॥ ఇంద్రరథ మెక్కి. యింద్రుఁ డ, తంద్రుం డన శ్రీవిశిష్ట ♦ తం దనరుచు మా
హేంద్రనిభము స్వనికేతముఁ, జంద్రుం డన వెడలి రామ ♦ చంద్రుం డొప్పెన్.

తే॥ తోడుతోడన చెలరేఁగెఁ ♦ దూర్యగతులు, వందిమాగధస్తోత్రర♦ వంబు లెసఁగె
వేనవేలుగ నడిచిరి ♦ వివిధసైన్య, యోధులును నట్టిఁడగు రాజ ♦ యోగమునను.

క॥ శత్రుంతపుఁడు సుమిత్రా, పుత్రుఁడు శరచాపయుక్తుఁ ♦ బొలుపారుచు సౌ
భ్రాత్రమునఁ దాత్రియై స్వ, భ్రాత్రనుగతుఁడగుచు నేగె♦ రథమెక్కి వెసన్. ౬౩

ఆ॥ ఆమహేంద్రచంద్రుఁ, డాగర్భసశ్రీకుఁ, డట్లువెడలఁ గని ధ ♦ రాధినాథు
లెందఱెందఱో మ♦హేచ్ఛులై తోఁకొని, యరిగి రోదవె హాలహా♦లాఽరవంబు.

క॥ శూరులు రుచిరాకారులు, సారాగరుచందనప్రి ♦ చారు లసిధను
ర్ధారులు ఘనసింహరవో, దారులు బలసి చని రెలయు ♦ తాత్పర్యమునన్. ౧౫

క॥ జనతావల్లభుఁ డాశ్రిత, జనతాపహరుండు రామ ♦ చంద్రుం డితఁడౌ
వినతాసుతవాహనుఁ డని, వినతాదృతవర్గ మనఁగ ♦ వినుచుం జనియెన్. ౧౬

—♦ పౌరజనంబులు రాముని గని ప్రీతివాక్యంబులు పలుకుట ♦—

తే॥ పూలు లాజలుఁ జల్లి ర♦ప్పురపురంధ్రు, లటులె పూజింపరే తొంటి♦వగు భవంబు
లందుఁ గాకున్న వారల ♦ కబ్బునెట్టు, లమ్మహావిభవం బన ♦ న్యాదృశంబు. ౧౭

క॥ వాక్కులనల వందనములు, దృక్కుల నభినందనములుఁ ♦ దేటపడఁగఁ దా
రెక్కిరి పరయగుకాష్ఠకుఁ, జక్కటి రామేంద్రుఁ గాంచు ♦ సందర్భమునన్. ౧౮

ఆ॥ సౌరసతులఁ బోలు ♦ సర్వానవద్యాంగు, లపుడు హర్మ్యతలము ♦ లందు నిలిచి
రాముఁ గాంచి యతని♦రాణిఁ దలంచి యి, ట్లనుచుఁ బలుకఁ దొడరి♦ రఖిలవంద్య.

ఆ॥ అన్న; నిన్నుఁ గన్న ♦ యమ్మ కోసలుకన్నె, యన్నుమిన్న కీమ ♦ హావిభవము
గన్నులారఁ గాంచు ♦ పున్నెంబు సమకూరె, నెన్నినోము లదియొ ♦ యిట్టిఫలము.

క॥ సీతల్లిసంతసము గుహు, మాతకునేనిఁ గలదన్న ♦ మాట యనఁగనౌ
నా; తరమగునా; పొగడఁగ, మాతృసమభినందనా; స ♦ మస్తసమమనా. ౨౦

॥ సీమంతినీమహితగుణ, సీమ మహీతనయ మహిని ♦ సీతకు మహి నే
సీమంతిని సరియగు నిను, శ్రీమంతునిఁ బెరసి మేలి ♦ సిరి కిరవగుటన్. ౨౧

తే॥ సితకిరణుఁ గొన్న రోహిణిఁ ♦ జెప్పఁ దరమె
పద్మహరిఁ గూడి కాదె యా ♦ ప్రతిభఁ గాంచె
ననుచు వర్ణించువర్ణన ♦ లలఁతులయ్యె
సీత నినుఁ జెందినది మొద ♦ ల్సేసి రామ. ౨౩

॥ సుచరిత బలుధృతి తప మతి, సుచరిత మిది యనఁ బొనర్చెఁ ♦ జూ ప్రాగ్భవమం
దచలసుత హరుని నెట్లటు, లచలాసుత నిన్నుఁ గోరి ♦ యనవద్యకలా. ౨౪

॥ అని ప్రాసాదాగ్రంబుల, ననితరగుణ లరసి యాడు ♦ నవి యాశీర్వా
దనవోపహారములె యని, తనమదిఁ దలపోసె నతఁడు ♦ తాత్పర్యజ్ఞా. ౨౫

తే॥ రాజమార్గంబుఁ జొరబాటి♦రాఁ గడంగఁ, బురజనంబుల పలుకు ల♦ప్పొలుపునన త
నర్చె నట్లర్చితుం డౌచు ♦ నంద్యచరితుఁ, డరుగుచుండె సమస్తాగ ♦ మాలవాల.

క॥ శ్రీమంతునిఁ గనఁగంటిమి, నేమం బొప్పార నిందు ♦ నింబలె నిండే
మేమిసుకృతములు హేతువు, లై మేలిమిసూపెనో స ♦ హాయత్వమునన్. ౭౭

ఆ॥ విపుల రాజలక్ష్మి ♦విభు నిమ్మహామహు, నెపుడు వెరసె నపుడె ♦యిందఱము స
మృద్ధకాముల మ౯ స♦మేధితైశ్వర్యుల, మనఁగ వలసె నింక ♦ నఖిలుఁ గలవె.

మ॥ ఒకనాఁడేనియు నప్రియం బలుక డు ♦ ర్యోగంబు దుఃఖం బలీ
కశలావ్యాప్తియుఁ గాన మీతనియెడన్ ♦ గల్యాణసంపన్నుఁ డీ
ప్రకటప్రాభవుఁ జేరి కొల్చి సుకృత ♦ ప్రారంభసన్నాహ మే
వికలుండేనియుఁ గాంచకుండునె మహా ♦ విఖ్యాతి రాకుండునే. ౭౯

ఆ॥ ఇంతకన్నఁ బ్రియము ♦ లెవ్వి జగంబుల, నెట్టివారికేని ♦ నెన్నఁడేనిఁ
దరమువిూఱ సుఖము♦తఱిఁగని కనుఁగొను, చున్నవార మిమ్మ♦హోదయంబు.

క॥ ఉన్నవె భోగము లింతకు, మిన్నగఁ బరమార్థములును ♦ మేలుగ నిటుసం
పన్నుని రామునిఁ గనుఁగొను, కన్నుల సౌభాగ్య మెన్నఁ ♦ గాఁ దరమౌనే. ౮౧

తే॥ అనుచు నున్ముఖులగువారి ♦ యాత్మపూజ
నులఁ గథల నెల్ల వినుచుఁ బె ♦ ద్దల నమస్య
లల్ల నెరపుచుఁ దత్తన్మ ♦ హాసమృద్ధ
లాశిషోక్తులుఁ గొనె నాతఁ ♦ డధికవిదుషి. ౮౨

ఆ॥ తండ్రి; తండ్రితాత ♦ తరములనుండి యే, పగిది నెఱిఁ బ్రజాను ♦ పాలనంబు
నడిచె నట్టినడత ♦ నడుపుము రాజ్యాభి, షేక మంది మించు ♦ సిరులఁ దనరి.

క॥ అన విని నెలకొని పృథుపథ, మునఁ బోవుచు నెల్లవారి ♦ పూజల నీరా
జనలఁ గొని యుల్లసిల్లెను, జనవిభుఁడౌ రాముఁ డెలమి ♦ సంభృతి వెలయన్.

ఉ॥ ఆతనిఁ గాంచువారి మన ♦ మక్షులునేనియుఁ గ్రిమ్మఱింపఁగా
నాతఱిఁ గానివయ్యె విభుఁ ♦ డచ్చటువాసి చనంగనైన వి
ఖ్యాత మనంగ నయ్యె జగ ♦ మంతట రాముఁ గనంగఁబోనివాఁ
డౌ; తదపాంగసృష్టిఁ బడ ♦ డౌ; యనువా దటు పాదుకొంచు చొంగిన్. ౮౫

ఆ॥ అతనిఁ గానమైతి ♦ మని తారె తమునింద, సేసికొందు రొండు ♦ సెప్పనేల
వాఁ డెఱింగి కూర్చు ♦ వర్ణాశ్రమాచార, పద్ధతులకుఁ జొక్కి ♦ పాటు మొనయ.

తే॥ రసతరంగిణి; వింటె యీ ♦ రసము పొంటె
నొకనిచిత్తంబుఁ బోవ ద ♦ య్యుత్సవమున

సామరస్యంబు పెనుపొందె ♦ సర్వగతులఁ
గైకకర్మ మొకండె సం ♦ కలితమయ్యె. ౮౭

ఉ॥ శ్రీధిషణుండు రాముఁ డటు ♦ తేఁకువమైఁ జనుచుండి యమ్మహో
వీధిని స్వీయ ముత్సవము ♦ వెంబడి యుత్సుకయా జనాలి సం
బాధము పావనాత్మపద ♦ భావనలక్షితలక్ష్యవృత్తిని
ర్బాధసుఖోదయంబు పది ♦ పాటియు నెంచెనుఁ బాటలీప్రియా. ౮౮

ఉ॥ అంబరచుంబకాంబరవ ♦ హంబులు మేల్పడగ ల్విలంబిచీ
నాంబరవార్తికావలిన ♦ యంబుల డంబులు మేలుకట్టు ల
ద్దంబుపదంబులం దనవి ♦ ధంబుల యిం బొడికంబుసూప నా
సంబరపుంబను ల్గనియెఁ ♦ జానరొ ; జాణ యతం డతంద్రుఁడై. ౮౯

ఉ॥ చందనముఖ్యగంధములు ♦ చాల్పులు సోల్పులునై తలిర్ప ని
ర్మందసుఖావహాంచితస ♦ మగ్రిహవిర్ధిలాజసద్గుణ
స్యందిపయోయుగప్రసవ ♦ సారససారసులక్ష్యభక్ష్యభ
క్తిం దనరారుచోట్లు పది ♦ కించె నకించనపోషితోషితా. ౯౦

తే॥ అప్పురి విలాసవతియపో ♦ యతనిఁ గవియఁ
గ్రొత్తవయసునకన్నియై ♦ కొమరుసూపెఁ
బూలపఱపుల నెన్ననౌ ♦ పోఁడుములను
రాక వేచుచుఁ దటి నను ♦ రక్త యగుచు ౯౧

శా॥ పన్నీటం జలకంబులాడి పృథుధూ ♦ పవ్యాప్తి నీరార్చి స
మ్పన్నత్వంబునకు న్సరాసరిగ క్షౌ ♦ మంబు న్నిచోళంబు ము
వ్వన్నె ల్బూసెడు కొన్నిగ ల్విరులు తే ♦ వన్దాల్చి మేల్చర్చలన్
గన్నాకా పురి శోభనంపుసిరిపైఁ ♦ గన్నుంచె తేఁ డన్నెటన్. ౯౨

క॥ ఆయెడఁ జతుష్పథము చై, త్యాయతనము దేవపథము ♦ నందఁగ నైనన్
బోయెఁ బ్రదక్షిణముగఁ దన, యాయరదముఁ ద్రిప్పఁ బనిచి ♦ యతఁ డగతనయా.

ఉ॥ రాజకులంబు సేరఁ జనె ♦ రాజతకాంచనకూటకోటివి
భ్రాజితనూత్నరత్నఘృణి ♦ రాజితృణీకృతదేవశైల మ
వ్యాజకలావిలాస విర ♦ హప్రతిపన్నవిధాత్రపూజ్యతా
త్యాజనశీల మవ్యయక ♦ థాగుణజాలవిశాల మత్తటిన్. ౯౪

ఆ॥ అలమహేంద్రభవన ♦ మట్టులు శోభమా, నం బనంగ నైన ♦ నగరులోని
మూడుకక్ష్య లెలమి ♦ మునుకొనఁ గడచి ర, థావతరణ మప్పు ♦ డతఁ డొనర్చె.

—♦ శ్రీరాముఁ డంతిపురికిం జని నిజజనకునిం గాంచుట ♦—

క॥ తనుఁ దోడ్కొని వచ్చిన యా, ఘనపరిజన మచట నిలువఁ ♦ గాఁ బనిచి విభుం
డనుజానుగుఁడై పదగతిఁ, జనె నంతఃపురము సేర ♦ సహజోల్లాసా. ౯౬

తే॥ అచట నిలిచె జనౌఘ మఱ్ఱ్యాది తదీయ, నిర్గమం బెప్పుడా ; యను♦నిరతిఁ దవిలి
చందురుని రాక వేచెడు♦సంద్ర పుంద్ర, వాహ మట్టిద యగుచుని ♦ ర్వాణసుఖద.

ఆ॥ కాంచె రాముఁ డరిగి ♦ కాంచనాసనమున, నున్నవాని మోము ♦ చిన్నవోవ
దీనభావ మొదవ ♦ దివులు పైకొన నేలఁ జూచువాని బిట్టు ♦ సొగయువాని. ౯౮

క॥ ఉత్సవము సమయ మనక ని, రుత్సాహము దోఁపఁ దొంటి♦యోజన చన నా
పత్సాగరమున మునిఁగి వి, ధిత్సామూఢత్వమున గ ♦ తిం గనువానిన్. ౯౯

క॥ ధీరత సారము సెడఁగ న, ధీరతమై బాష్పజలము ♦ తెరలఁగ నుచ్ఛ్వా
నార క్తములై నేత్రము, లార క్తిం జెఱుపఁ దలఁప ♦ నొదశవానిన్. ౧౦౦

క॥ ఈవిధ మేనాఁడేనియు, భావింపం బట్టె యితఁడు ♦ పౌరందరమై
త్రివిదితుఁ డఖండశ్రీ, సేవితుఁ డనిపించు వెడఁగు ♦ చెయిదము వానిన్. ౧౦౧

క॥ తన కన్నతండ్రి దశరథ, జననాధుం గేకయాత్మ ♦ జాసహితునిఁ గ
న్గొని చరణంబుల కెఱఁగి స, మనంతరం బాసవిత్రి ♦ కాద్భృతి ప్రమొక్కెన్.

క॥ రామ ; యన నుడివిరామం, బామెయి గద్గదిక పొడమి ♦ యాపాదింపన్
నేమమునఁ దన్నుఁ గన నొం, డేమియు నొడువంగ నేర ♦ కిక్కట్టుపడన్. ౧౦౩

ఆ॥ అయపూర్వ మనఁగ ♦ నైన చందము రాఘ
వేందు నందుఁ గాంచి ♦ యినకులోద్వ
హుండు పాము ద్రొక్కి ♦ యుల్కిపా టెనయు మ
ర్త్యుని విధంబు తన్ను ♦ నొకటఁ బెరయ. ౧౦౪

మ॥ అకటా , రాఘవసింహ మెట్టు హాతరం ♦ హం బయ్యె నీశేషుఁ డే
లొకొ ఘూర్ణిల్లుచు రోఁజెడుం గలఁగ నే ♦ మో కారణం బిమ్మహా
బ్ధికి నీభాస్కరుఁ డి ట్లువప్లుతుఁడు గా ♦ దిష్టాంతమా కాలమే
ప్రకటం బయ్యెనె యీబుధీందు నుడికిన్ భంగంబు వాటిల్లెనే. ౧౦౫

ఆ॥ మున్ను గుపితుఁడయ్యు♦ముదితుఁడౌ ననుఁ గాంచి, యప్రసన్నభావ♦మనఁగఁ బోల
ది ట్లహృష్టవినిహ ♦ తేంద్రియుండై సన్న, సెడఁగ నేమి తెలియఁగు ♦ చెట్ట పడెనొ.

క॥ అవిచింత్యకల్ప మిక్కో, కవిధము కవివరుఁ డితండు ♦ గాయని మొగి లిం
త వెరయ ద్యుతి సెడు నెలనా, నవు మోమున క్షోభ మెనయు ♦ నబ్ధి తెఱవునన్.

ఆ॥ తల్లడిలుచుఁ గైక ♦ దండ నయ్యండజ, వాహనుండు నిలిచి ♦ వందనప్రి
సక్తి నెఱయఁ బలికె ♦ శారదరాకాభ, విష్ణుశశినిరాక ♦ రిష్ణువదన. ౧౦౮

—♦ శ్రీరాముఁడు తండ్రియున్నచందముం గూర్చి కైకతో ముచ్చటించుట ♦—

సీ॥ తల్లి నాపైన నొండు ♦ తారసిల్లెనె నేర, మొదవెనే మది మేన ♦ నొచ్చె మొకఁడు
భరతుపై నేమైనఁ ♦ బాటిల్లెనే వార్త, శత్రుఘ్నుఁ డెందును ♦ జంకఁడు గద
జనులయెడ నేవి ♦ చారంబు లేదుగా, యే బాంధవంబున ♦ నెసఁగెఁ గీడు
నీకు మే లభిమాన ♦ నిరతి నేయది పల్కు, తాన మీఱఁగ నొంటి ♦ కలవియగునె

తెలుపవమ్మ వృత్తం బెల్లఁ ♦ దేటపడఁగ, నీయపూర్వవికార మే ♦ నెన్నఁ డెఱుఁగ
నప్రసన్నుఁడై వత్సలుం ♦ డధిపుఁడు నను, గాంచి భాషింపమికి నేది ♦ కారణంబొ.

తే॥ అతని సంతోషపెట్ట క♦య్యనఘునాన; నడుప కలుక ఘటించి యి♦ప్పుడమిలోన
నొక్కఁగడ్డైన నిలువంగ♦నోపఁ దనదు, పురుషకారం బిదియచువ్వొ♦పుణ్యచరిత.

ఆ॥ ధర్మసాధనంబు ♦ తనువు దానికిఁ దండ్రి, మూల మతఁడె కనుల ♦ ప్రోల వేల్పు
గురుఁడు తద్ధితంబు ♦ గొనకొని వారించి, బ్రదుకువాఁడు నేల ♦ బరువ కాఁడె.

క॥ సందియము దీర్పు కేకయ, నందిని గురునాజ్ఞ వలను ♦ ననె నామన మిం
పొందు నను రాముఁ గని ని, ర్మందాక్షత మందమతివి ♦ మానిత పలికెన్. ౧౧౨

—♦ కైక రామునకు రాజాతెఱం గెఱింగించుట ♦—

ఆ॥ ఔనె స్వార్థపరత ♦ యది ధార్ష్ట్య మిడదె యొం
డనఁగ వలెనె మగని ♦ యాచికోలు
చూచి కోలుపోయె ♦ సుందరి సౌభాగ్య
మదము తన్నుముంచు ♦ మాట మఱచి. ౧౧౩

ఆ॥ రామ; కుపితుఁ డనఁగ ♦ రాదు రాజిత్తఱి, నొండు గీడుఁ దోఁప ♦ దొకటనేని
నొక్కధర్మమున ని ♦ యుక్తుఁడై ప్రియు నిన్ను, గడవలేక యిట్లు ♦ గలఁగువాఁడు.
తే॥ నాలుకకు రాదు నీతోడి ♦ నయముపీడి
పలుక నప్రియ మనినచో ♦ భయము కాదె
యేరికేనియు నది నీవ ♦ యెఱిఁగి కూర్చి
తనదు యొఱకట మిప్పాటఁ ♦ దలఁగ వలయు. ౧౧౪

క॥ తెలిపెద వరమని మును నా, కలఘుతరుం డొసఁగె నిప్పు ♦ డారాటపడన్
వలెనే గతజలమునకుం, గలుకట్ట యొనర్ప నేమి ♦ గలదు కుమారా. ౧౧౫

ఉ॥ ధర్మముపొందికన్ జగము ♦ ధాత్రి నిలంగల దన్నమాట కా
ధర్మువు సత్యమే కద వి ♦ తాయభిమానములేల యట్టిదా
కర్మమున న్బడల్పడఁగఁ ♦ గాదన నానెటు దానినిక్కమా
మర్మము చక్కనారసి య ♦ మగ్నునొనర్పుము తేని నీనెఱిన్. ౧౧౭

చ॥ కుపితుఁడు గాఁగ నిట్టియెడఁ ♦ గోవిదుఁ డయ్యును మీఁదెఱుంగకే
విపథము ద్రొక్క నీవలని ♦ వేడుక గూర్చునె స్వర్గలోక మ
య్యపగణానంబులేల కల ♦ వన్నియుఁ దీర్పఁగ నీవ యిచ్చమై
నిపుడ వచింతు నద్ది ఘటి ♦ యించెద నంచుఁ ద్వదుక్తి వెల్వడన్. ౧౧౮

ఆ॥ అదియు శుభమయేని ♦ నశుభంబయేనియు, నెడకుఁ బెడకు లాగు♦నిచ్చఁ గొనక
తగవు దలఁతుననినఁ ♦ దథ్య మే నెఱిఁగింతు, నిన్నుఁ జూచిపలుక ♦ నేరఁ డతఁడు.

ఆ॥ సత్యపాశబద్ధు ♦ సంత్రాణన మొనర్చి, నెఱిఁ దలంపుమయ్య ♦ నిన్నుఁ గన్న
ఫలము గాంచు నిట్టి♦వలనున కగుఁ గాదె, పుత్రుఁ డనఁగ నెందుఁ ♦ బుణ్యమూర్తి.

— ♦ రాముఁడు తండ్రియానతిచొప్పున మెలంగువాఁడ నని వక్కాణించుట ♦ —

చ॥ అనువెడపల్కుల న్వినిన ♦ యంతనె రాముఁడు కుత్ససేసి యే
మనియెదవమ్మ నాదు తెఱఁ ♦ గారయ వింతకుఁ దండ్రియాన కే
ననలము సొచ్చెద న్విసము ♦ నైన భుజించెద నంబురాశిలో
ననువఱఁ గూలెదన్ సొలయ ♦ కాడు మభీష్టము మాట పూటమే. ౧౧౯

ఆ॥ సీతఁ బరిహరింతు ♦ సిరి విడనాడుదుఁ, దల్లిపూజ నైనఁ ♦ దలఁప కుందు
నధిపుఁ డధిగురుండె ♦ యాటఁ దదీప్సితం, బెద్ది యట్లె నడుతు ♦ నింత నిజము.

క॥ చెప్పకమును గురు నిష్టం, బొప్పగ నొనరించువాఁడె ♦ యుత్తముఁ డొకటన్
జెప్పఁగఁ జేయును మధ్యముఁ, డప్పని విని తలఁగుమూర్ఖుఁ♦డధముఁడ యెందున్.

క॥ కాన గురునాన మానక, పూనికమై నాచరింతుఁ ♦ బొలియనిశపథం
బే నొనరింతు ద్విరుక్తికిఁ, బోనేర్చునె రాముఁ డెందుఁ ♦ బుట్టువు సెడఁగన్.

— ♦ కైక తనదు వరప్రసంగంబు రామునితో వివరించుట ♦ —

క॥ అని యార్జవసక్తుండై, యనార్యయన కట్లు తథ్య ♦ మాడు కుమారుం
గని యశనికల్ప మగునుడి, వినిచె న్వెఱపెనయనీని ♦ వేడుక తనరన్. ౧౨౦

మ॥ మును దేవాసురయుద్ధమందు దనుజు ♦ ల్మొంపంగఁ దేల్పంగ నీ
జనకుం డమ్మెయినొల్లఁబో నొడలున ♦ న్శల్యంబుల్గం బాచి కా

చినమే ల్మూచినయద్దె రెండు వరము ♦ ల్చిత్తంబు పొంగార నా
కనుమానింప కొసంగె నాతనిక యే ♦ నప్పించు నర్పించితిన్. ౧౨౬

తే॥ ఆవరంబులు వేఁడితి♦ ననఘ; యిప్పు, డొకట నీ వడవికిఁ జన ♦ నొంట భరతుఁ
డెల్లరాజ్యంబు పాలింప♦నిది చతుర్ద, శాబ్దముల కాలమున మిత ♦ మగుచు నుండ.

ఆ॥ నిన్ను విడువలేక ♦ మున్నన్ననుడి దప్పు, కొనఁగ రాక కుప్ప ♦ గూలి యున్న
వాఁడు నీదుతండ్రి ♦ వలనెంచి యెబ్బంగి, సమయుఁ జూతొ ధర్మ ♦ సంకటంబు.

క॥ గురు సత్యసంధుఁ గాఁగఁ బొ, నరింపఁ దలఁతేనిఁ గాన ♦ నంబునఁ జొఱఁగా
గర మనురక్తుఁడ వగు మఱు, భరతుని నియమింపు జగతిఁ ♦ బాలింపంగన్.

క॥ ఇది దైవిక మిట్లని నె, మ్మదిఁ దలఁపుము జనకునలఁత ♦ మాయింపుము నీ
కొదవెడుఁ బున్నెము లెన్నె, కొదవలుఁ దలపోయువలను ♦ గూడదు రామా.

ఉ॥ చీరలుగట్టి కూరలు భు ♦ జించి జడల్మెలివెట్టి కోనలో
వారలు దోడుగాఁగ ముని ♦ వర్తనము ల్నెగడొంద మేలిసం
చార మొనర్పు మిచ్చటికిఁ ♦ జాలును నీయనుజుండు వత్సృసం
తారకుఁ డీతఁడంచు నిజ ♦ దారకధర్మము లోకు లెన్నఁగన్. ౧౩౧

తే॥ ఆభిషేచనికార్థంబు ♦ లన్ని యిపుడె, భరతుపట్టంబుగట్టనొ ♦ పనికిఁ గాఁగ
సార్థకము లవుఁ గావుత ♦ మర్థి నీవు, వన్యకార్యానుషక్తిమై ♦ వఱలు మింక.

క॥ చతురంగసైన్యములు నర. పతిచిహ్నము లెల్లవస్తు ♦ భారమ్ములు భూ
పతినివహార్చలు నరయుఁగఁ, జతురుఁడపొ భరతుఁ డిచటఁ ♦ జాలమి గలదే.

క॥ అని త్వరపెట్టెడు పినత, ల్లి నయము విదితుఁడగురాము ♦ లీలకుఁ దో డ
య్యెనుఁ గాని యొండొకం డగు, కనలునఁ బడఁ జూడఁ బోదు ♦ కంజదలాక్షీ.

ఆ॥ ఎంతగలక్షొ తలఁకఁ ♦ డేణాక్షి యంతలు, అంతుసేసి చూపు ♦ వింతలకునుఁ
బంతగింపఁ డొండు ♦ పాటింపఁ డర్పించె, సంచకరము నిర్వి ♦ చారమునకు.

—♦ శ్రీరాముఁడు కైక వరప్రసంగం బంగీకరించుట ♦—

ఉ॥ ఏ నిదె పోవువాఁడ జన ♦ యిత్రి; త్వదాజ్ఞఁ బ్రతిజ్ఞఁ దీర్ప స
న్మానితుఁ డేలుఁగాత కుల ♦ మండనుఁ డౌభరతుండు రాజ్యముల్
బూనికమై వచింతు నని ♦ షోలదు కోపము నీకు తేఁడు ని
ల్లౌనయ మెప్పుఁ బల్కఁ జన ♦ దా; తన దాక్ష్యము మేర మీఱదా. ౧౩౬

తే॥ తానె బోధింపఁ డేల నా♦తండ్రి తెరలి
యుమ్మలిక మంద నేమి కీ♦డొదవె నింత

కిరువురును మీఱ లిమ్మెయి ♦ హితము నొడువ
సంతసంబునఁ బొనరింపఁ ♦ జాలనొక్కొ. ౧౩౭

క॥ అనుజున కిది యొక్కఁడనఁ, బనియేమి యొసంగువాఁడఁ ♦ బ్రాణముఁ బ్రాణం
బున కెక్కుడైన సీతన, యిన నినవంశమున మేల్మి ♦ యిట్టిద సుమ్మీ. ౧౩౮

ఆ॥ గురుఁడు హితుఁడు వప్త ♦ వరదుండు నొభర్త
యానఁ జేయరాని ♦ దని యొకండు
గలుగునే త్రిశుద్ధిఁ ♦ గావించువాఁడఁ ద
థ్య మ్మటంచు నెడఁదఁ ♦ దలఁపుమమ్మ ౧౩౯

ఆ॥ ఏల నేలఁ జూడ ♦ నింతచింతపడంగ, నెగిచి యశ్రుధార ♦ లిట్లుజాఱ
నరయఁడే మదీయ ♦ మగు మానసముతీరు, దండ్రిఁ గష్టపెట్టు ♦ తరమె నేను.

క॥ మాతులకులగతు నిపుడే, మాతులు భరతుఁ బిలిపింపు ♦ మా ; పతియాజ్ఞన్
జేతఃప్రీతి న్వనికిఁ బ్ర, యాతుఁడ నగువాఁడఁ దలఁప ♦ నటు పెడజాడన్. ౧౪౧

క॥ అను రాచచిలుక పలుకుల, కనుపద మానంద మంది ♦ యటు లొనరింపన్
జనుఁ జను మీవవ్వలికథ, ననువర్తించెదను నేను ♦ నది గొనకొనదే. ౧౪౨

తే॥ ఉత్సుకుఁడ వయి యిచ్చోట ♦ నొదుఁగరాదు
సిగ్గుపడి తండ్రి తెలుపమి ♦ చేటుగాదు
స్నానమును భోజనంబును ♦ జరుపఁ బోవఁ
డిందు నీవుండ నీతఁడో ♦ యినకులీన. ౧౪౩

క॥ అను నెడఁ జీచీ యని య, మ్మనుజేంద్రుఁ డసహ్యపడుచు ♦ మానిని వలన
య్యనువునఁ గననొల్లక తన, తనయుని నగుమోము గాంచి ♦ తహతహపడుచోన్.

ఆ॥ అతని నూఱడించి ♦ యాయమఁ గాంచి క, శాహతిం గులీన ♦ మైనవాజి
యటులె త్వరితుఁ డగుచు ♦ ననె నిట్లు వనికేగ, వలను సూపుచిత్త ♦ వర్తనమున.

సీ॥ అంబ ; యర్థార్థి వీ ♦ డని తలపోయకు, మిం దుండువాఁడఁగా ♦ నింత గనుము
మునులతోడి దగునా ♦ ముచ్చట భావింపు, మెపుడు ధర్మమువంక ♦ కెయిదు టుఱుఁగు
మే నీజనుఁడ నన్న ♦ నేలుట గమనింపు, మడిగిన నుసు జిత్తు ♦ నని యరయుము
గురునానకన్న నె ♦ క్కుడు లేమి గొను మెన్ను, మల్లె తల్లులఁ గొల్చు ♦ టాదరింపు
మేమటంచు నాదు ♦ నేమ మూహించితో, కాక యడవికేగఁ ♦ గలుగుపనికి
రాజుతోడఁ దెలిపి ♦ రాపొనర్పంగ నీ, కగునె సర్వథాని ♦ యాంత్రి వయ్యు.

తే॥ జనని చిత్తమునకు వచ్చు♦సరణిఁ దెలిపి,సీత ననునయమునఁ దాల్మిఁ♦జెనయఁజేసి
యవల నీనాఁడె దండకా♦ఖ్యాటవినిఁ జ, రింప నేగెద ననుచుఁ ద ♦ లంపు మింక.

క॥ గురుశుశ్రూషల మెలఁగఁగ, వరరాజ్యక్రమము వంక ♦ వాసి నెఱపఁ గా
భరతునకు బోధసేయుము, పరమార్థం బిదియ చూవె ♦ భవ్యవిచారా. ౧౭౮

—♦ దశరథుండు రామునియాజ్ఞవం బెంచి దుఃఖించుట ♦—

ఆ॥ అని ప్రయాణ మెంచి♦యామంత్రణ మొనర్చు,రాముమార్దవమ్ము♦రాణఁ గాంచి
పొంగి పొరలుదుఃఖ♦పూరమ్ము పైకొన,నడలె నొడయఁ డపు డ♦హార్య తనయ.

ఆ॥ ఇట్టులనియె మఱియు♦నేణాంకముఖ; రామ;;నన్నుఁ ద్రోచి చనుట♦ నాయమగు నె
పుత్ర నిన్ను బాసి ♦ పోలియనే యెఱిఁగి యి, ట్లేల సాహసింప ♦ నెంచితయ్య.

ఉ॥ పున్నమనాఁటి చందురునిఁ ♦ బోలిన నీనగుమోముఁ గన్గొనన్
దిన్ననినీనుడు ల్వినఁగఁ ♦ దేఁకువ నెక్కొన నీదు మేలిసం
పన్నతఁ గాంచి పొంగెనయఁ ♦ బాళిమెయి న్నినుఁ జేరికొల్చుమా
యన్నులమిన్న సీతకెఱఁ ♦ గారయ నేరని పాపి నైతినే. ౧౮౧

తే॥ ప్రాణవల్లభుఁడవు నీవె ♦ ప్రభుఁడ వీవె, జగములన్నియు నేలనా ♦ జాణ వీవె
సూర్యకులమును వెలయించు♦చుట్టవీవె,యిట్టినినుఁ బాయుననుబోఁటి కేమిగలదు.

తే॥ స్త్రీజితుని భ్రాంతహృదయుని♦సిగ్గుమాలి,ధర్మ వెడలంగ నగువృత్తి♦ దవులువాని
నను నిరోధించి తంత్రంబు♦నడుపఁ జనదె,యనఘ;దాన నసత్యమె ♦ ట్లాటునయ్య.

—♦ రాముఁడు తండ్రి నూఱడించుట ♦—

క॥ అని పర్యంకమునం బడి, యను వరయఁగనీని సొదకు ♦ నై తెరలఁగనై
తనుఁ బెరయుసుతునిఁ గౌఁగిట, నెనయించుచు శోకవార్ధి ♦ నిట్టటుపడఁగన్.

ఆ॥ తన ఘనాంకపాళిఁ♦దార్చి కన్నులనీరు, దుడిచి చిబుక మెలమి ♦ దొడరఁ బుణికి
పుడుకుదొడుకు రామ♦పూర్ణచంద్రుఁడు రస, మొలుక నిట్లుపలికె ♦ లలితమూర్తి.

తే॥ సోలి తిట్టటుప్రాలితి ♦ జాలిపడితి, తూలి తటులేల నాతండ్రి ♦ తాలిమిమెయి
నేలి తిన్నాళ్లు మేలిమి ♦ గ్రాలితి తుది, గాలివార్తకుఁ దనకిన ♦ శైలి చెడదె.

ఆ॥ తమ్ముఁ డేలు టరయఁ ♦ దప్పె నారాజ్యంబు, నేను నడవిఁ దీర్పు ♦ నెఱపు వేడ్క
నిస్తరింపరాదె ♦ నీప్రతిజ్ఞం గూడి, వచ్చు పదియునాల్గు ♦ వత్సరములు. ౧౮౭

క॥ అయ్యా; శోకింపఁగ నే, మయ్యెం గారణము దీన ♦ నాలోచింపన్
డయ్యాఁబలుకంగ నిది యొక, కయ్యామె ధృతిఁ జెఱుపఁజూడఁ ♦ గా వలనగునే.

ఆ॥ ఆమె సంతసించు ♦ నంతటితోఁ బను, ల్వారున నందికొనఁగ ♦ వచ్చు నాఁడు
వనము నందు సుఖము♦వసతికన్నను వేయు, మడుఁగు లెక్కుడగుచు మలయుచుండు.

తే॥ ఎల్లసంభారములతోడ ♦ నిచ్చమెయిన, తల్లి తలఁపొప్ప భరతుని ♦ ధరణినాథు
నీవు పొనరింపఁ జూడుము♦నేఁడె పిలువ, ననిచి యద్దాన మే లెన♦యుఁగ నగును.

—♦ శ్రీరాముఁడు దశరథువీడ్కొని మాతృసన్నిధి కరుగుట ♦—

క॥ అని యివ్విధంబునం దన, మనమున నెయ్యంబు వలను ♦ మల్లడిగొనఁగా
నునిచి యనువొప్పఁ బెనిచిన, యనుపమ వాక్సరణి వింత ♦ యై తనరారన్.

చ॥ మఱు లెఱిఁగించి యిర్వురకు ♦ మంతన మొప్పఁ బ్రదక్షిణక్రియా
న్వితనతు లాచరించి తగ ♦ వీడ్కొని లక్ష్మణుఁ డార్తిఁ గూడిరాఁ
గృతమతి ద్వాస్థసమా జనము ♦ కీర్తన మల్లనఁ గొంచు సర్వస
మ్మతుఁ డతఁ డోజమై వెడలె ♦ మాతృగృహమ్మునకై హితైషిణీ. ౧౬౩

తే॥ అభిషేచనికం బగు♦నట్టి భాండ, మొలసి ముమ్మాఱుఁ దిరిగి యం♦జలి ఘటించి
రాజచిహ్నము లెల్ల ని ♦ రాకరించి, పోవుచుండెనుఁ గాకుత్స్థ ♦ పుంగవుండు.

ఉ॥ కాంతుఁ ద్రిలోకకాంతు శశిఁ ♦ గైకొనఁ గాంచినరాత్రి యట్లు శ్రీ
మంతుని వీడఁ జూడదు సు ♦ మాళమున న్నెలకొన్నలక్ష్మి యొ
క్కింతయు రాజ్యనాశమున ♦ హీనత చొప్పడఁబోవ దింతకున్
మంతనమందు విక్రియకు ♦ మార్గము దోఁపదు మానినీమణీ ౧౬౪

తే॥ సహితలక్ష్మీకుఁ డగురామ ♦ చంద్రునకుఁ బ్ర
సంగ మయ్యాది శారద ♦ సమయ మయ్యె
దానఁ బ్రహ్లాదనక్రియా ♦ తత్పరత్వ
మాత్మజం బది వీడఁ బో ♦ దాత్మవిదుషి. ౧౬౫

తే॥ తన జితేంద్రియతకు దుఃఖ ♦ ధారణకును, నిర్మలత్వంబునకు సిరి ♦ నియమమునకు
నబ్బురం బందె నప్పుడ ♦ య్యభిజనౌఘ, మే విలక్షత గనుపట్ట ♦ దేమి యనుచు.

—♦ రామమాత లెల్లరు వ్యసనాభిభూత లగుట ♦—

ఆ॥ రాముఁ డట్లు వెడల ♦ రాణివాసంబున, సతులు రామమాత ♦ లతులమతులు
దలఁచికొనుచుఁ దలఁకు♦ దలకొనఁదమలోన, నంగలార్పఁదొడఁరి ♦ రాత్రమునను.

సీ॥ తండ్రియానకుమున్న♦తలఁచి యెన్నికగన్న, సత్కారముల మేలి ♦ జాడ లరయుఁ
దనుఁగన్నతల్లి నిం ♦ దఱ నొక్కరూపున, బరికించి వెలయించు ♦ బాంధవంబు

పరులు నేరమి నొందు♦పలికిన నోర్పునై,క్షమియించుఁగాని య♦క్షమకుఁజొరఁడు
తారకుం డితఁడె భూ♦తముల కన్నిటికన్న,బుద్ధి నెకొ్కనఁజేయుఁ ♦ బౌరువులకును
నట్టిరాముఁడు ముఖచంద్రుఁ♦డడవిపుడమి,వెన్నెలల నింప నిచ్చోటు♦విడిచి నేఁడు
పోవుచున్నాఁడు మనపాలి ♦ పున్నెములకు, నింత కను విధి విధియించె♦ నే విధాత.

తే॥ బుద్ధిగలవాఁడు మనతేఁడు ♦ పొడవుపడఁగ, నున్నవాఁడని యెంచితి♦ మిన్నినాళ్ళు
సర్వజగతికి గతి నాక♦చానధృతికిఁ,దనయు హితనయు విడనాడఁ♦దలఁచె నిపుడు.

క॥ అని యంతిపురినెలంతుక, లనంతరస్థితుల నెంచి ♦ యాక్రోశములం
బొనుపడఁ దొడరిరి వత్సం, బునుఁ బాసిన తొడుకులట్లు ♦ పూర్ణేందుముఖీ. ౧౭౦

తే॥ పుత్రశోకాభితప్తుఁడై ♦ పొరలు నాథుఁ, డట్టియార్తనినాద మ ♦ స్థాలకించి
యొడలెఱుఁగనీని మమతమై♦నోలమాస,గొనియెఁబర్యంకమునవ్రాలి♦కోమలాంగి.

క॥ ఆసడి నొఢయుఁడు లీనుం, డై సంగడ మెడలఁ గేక ♦ యాత్మజ సిద్ధి
వ్యాసక్తమనోరథయై, శ్రీసముచిత యగుచు నెడఁదఁ ♦ జెలఁగుచు నుండన్.

—♦ రాముఁడు తల్లిసన్నిధి కరుగుట ♦—

తే॥ నిట్టవొడుచుచుఁ జెలరేఁగి ♦ నింగిముట్ట, నిశ్వసన మొనరించు దా ♦ నిప్రధాన
మట్టు లాయత్తుఁడై తల్లి♦యంతిపురికి, నవ్వశివతంప మరిగెఁ బ ♦ ద్మాయతాక్షి.

ఆ॥ మొదలికక్ష్యఁ బెరసి♦ముఖ్యుఁ గంచుకి వృద్ధు, దొట్టి యచటిజనము♦తోడుతోడ
హెచ్చరికలు వెలయ♦నెలమిమైఁ బొగడంగ,జొచ్చి యొండొకొండు♦చోటుదటిసి.

క॥ ఆగవిణియందు వృద్ధుల, నాగమవేత్తల సమంచి ♦ తాత్ముల ద్విజులన్
వేగని యాశీర్వాదము, లాగళ్ళమనములు గొనియె ♦ నతఁడు సురాజ్ఞ్ణి. ౧౭౫

క॥ మూడవద్వారమునం గల, చేడియ లారాముఁరాకఁ ♦ జెప్పం జని ర
వ్వేడబ మరయమిఁ బెల్లగు, వేడుక లుప్పొంగి వెలయ ♦ విశ్వవిధాత్రి. ౧౭౬

మ॥ సుతుమేలెంచి జయిష్ణు విష్ణుఁ బరిత ♦ శ్శుద్ధాత్మ కౌసల్య రే
నతిభక్తి న్మహితార్చల న్దనిపి హెూ ♦ మాదు ల్సమర్ధించి స
మ్మతిఁ బ్రాతర్యజనోచితక్రమము సం ♦ భావించి చిత్తైకతా
నత వర్తిల్లుచునుండె భావికలనా ♦ నందానుసంధాత్రియై. ౧౭౭

మ॥ సమిదాజ్యాక్షతలాజసూనముఖము ♦ ల్సంభారము ల్పాయసా
న్న మపూపంబులుఁ గొంచు దేవధృతి కా ♦ నందంబున న్బాడబుల్
కరిమ మొప్పారఁగ వేల్చునవ్వలనున ♦ న్గల్యాణధామంబు నా
నమరాస్యంబున తెల్విఁ బొల్పెసఁగునా ♦ య్యారంబు గన్పట్టఁగన్. ౧౭౮

శా॥ అంతస్థ్సాద్వయచిత్ప్రకాశుఁడు నిర ♦ స్తాశేషమాయుండు శ్రీ
మంతుం డేకరసుండు సర్వనిగమా ♦ మ్నాతుండు సత్తాత్ముఁ డా
ద్యంతాతీతుఁ డనంతుఁ డీశ్వరుఁ డమే ♦ యప్రాభవుండౌ హరిన్
స్వాంతోపాంతము సేర్చి తన్మయత వి ♦ శ్వంబెల్ల భావింపుచున్. ౧౨౯

ఉ॥ తెల్లనిపట్టు గట్టి ధృతి ♦ తేఁకువ మీఱఁగ దేవతృప్తి కా
యల్ల కృతోపవాసకృశ ♦ యానెఱి నెట్టన దేవవర్ణ్యయై
సల్లలితాత్మయోగవిల ♦ సద్వ్యవసాయమునం దనర్చుచున్
దెల్లముగాఁగ సన్నిధి న ♦ ధిశ్రితు నచ్యుతుఁ గాన కున్నతిన్. ౧౩౦

తే॥ ఉన్నతఱి నాతఁ డన్నెఱి ♦ నూహఁగనియుఁ
జేరఁ జనునంత నె సుమిత్ర ♦ శ్రీనివాసుఁ
డరుగుదెంచెను రాముఁ డో ♦ యమ్మ; యనుచు
నంచితప్రీతిఁ దన కెఱిం ♦ గించుటయును. ౧౩౧

ఆ॥ కనులు దెఱచి కాంచెఁ ♦ గాంచనాంగి కృపాక,టాక్షు నంబురుహ స ♦ మంచితాక్షు
స్మేరవదను స్వాత్మ ♦ సిద్ధభావానుసం, ధాత తాతఁ గన్న ♦ తాత నచట. ౧౩౨

సీ॥ శతమఖోపలరాజ ♦ సచ్ఛాయ మగుమేన, దీప్రపీతాంబర ♦ స్థితి తలిర్ప
నుదయాద్రిరవిశృంగ ♦ ముత్తమాంగవిశేష, మలకోచితక్రమ ♦ మాక్రమింప
జగదండకోటి సం ♦ శ్రయత రూపించువ, క్షమున హారప్రచా ♦ రము రహింప
దిక్కూలముద్రుజ ♦ దివ్యకుండలకాంతి, నిఖిలభాసకభావ ♦ నిష్ఠ నొడువ
సకలభూతహితుఁడు ♦ శాంతుఁ డాశాంతపా,లకుఁడు నిరవధికక ♦ లామయుఁడు ని
రామయుం డనంతుఁ ♦ డక్షరుం డానంద, ఘనుఁడు హరియ చేరఁ ♦ గనుటఁగనియు.

క॥ తనయుఁ డను నెఱిన కోసలు, తనయారత్నంబు రాముఁ ♦ దఱియ నతఁడు వం
దన మొనరించిన మేలిమి, గొనకొనఁ గౌఁగిటఁ గదించు ♦ కొనె సుకృతమయీ.

ఆ॥ అంకమునను జేర్చి ♦ యలరి మూర్ధాఘ్రాణ, మొనరఁ జేసి చెక్కు ♦ లను స్పృశించి
మేను నివురుచును ని ♦ మేషవర్జితదృష్టిఁ, గనుచు నిట్టులనియె ♦ స్కందజనని.

ఆ॥ నన్నుఁ గన్నవాఁడ ♦ నాపున్నె ఫుంబ్రోవ, చిన్నికూన మేలి ♦ సిరులసీమ
యన్న మిడుదు నయ్య; ♦ యాకొంటె ముద్దుల, మురహిరీ; వరాల ♦ మూట నేఁడు.

తే॥ ధర్మశీలురు వృద్ధులు ♦ తత్త్వవేత్త, లైన రాజర్షివరులు నీ ♦ యన్వయము
నెట్టియాయువు సిరి యసం ♦ బెట్టిశ్రేయ, మందఁగాంచిరో నీ వట్టు ♦ లందుమయ్య.

క॥ నేఁడె పోనరించువాఁ డటె, పాడిమెయి న్నిన్నుఁబట్ట ♦ భద్రునిఁగా నె
ప్పాడి తలఁగఁబోఁడని ప్రజ, లాడఁగ నీతండ్రి వున్నె ♦ మాఁగా రామా. ౧౮౭

చ॥ అని యిటువత్సలత్వమున ♦ యమ్మరయమ్మునఁ దేలియాడుచుక్
బొనరగుపేటఁ బెట్టి సుతు ♦ భోజనపున్నెతీ ముచ్చటించుచుక్
దన యనఘత్వముం దెలుపు ♦ తల్లికిఁ బ్రాంజలియై చలింప క
ల్లన వినయంబు నాన సక ♦ లజ్ఞతయుం దగ రాముఁ డిట్లనుక్. ౧౮౯

—♦ శ్రీరాముఁడు తల్లికిఁ దన వనవాసప్రసంగం బెఱింగించుట ♦—

ఉ॥ అమ్మరో; భోజనాదికృతు ♦ లందటు లాదర మంచు లేదు న
న్నొబ్బమ్మనెఁ గాననమ్మున ప్ర ♦ భుత్వ మొనర్పఁగఁ దండ్రియానతిక్
గ్రమ్మఱిపింపనౌనె మును ♦ గైక కొనంగినయావరమ్మునక్
దమ్ముఁ డయోధ్య యేలవలెఁ ♦ దప్పదుచూ పదునాలుగేడులుక్. ౧౯౦

చ॥ ఎఱుఁగవు తల్లి ; వల్కల మటు ♦ లేణ పుఁజర్మముఁ దాల్తుఁ బెంజడల్
నెఱయఁగ వన్యభోజి నయి ♦ నిచ్చఁ జరింతు గురూక్తి సత్యపుం
నెఱి సెడనీని తద్వ్రతము ♦ నిష్ఠకునై మునిమండలంబు వ
క్కఱ లరయంగఁ జాలుదుఁ బ్ర ♦ కాశిలఁ జేయు తదీయవాగ్భృతిక్. ౧౯౧

తే॥ నీకు సౌమిత్రికి వసుంధ ♦ రాకుమారి, కగునుఁ జింత యలంత పె ♦ ల్లనుచు నెంతు
నైన వేగమ యరుదెంతు ♦ నాచతుర్ద, శాబ్దములు నన్ని గడెలుగా ♦ ననువుపఱిచి.

—♦ కౌసల్య మూర్ఛిల్లుట ♦—

క॥ తలఁకవల దనెడు రాముని, పలుకులు విని వ్రాలె నఱుకఁ ♦ బడు శాఖ క్రియక్
బలుగాలి కెడలు ననఁటియు, బలె స్వర్గచ్యుతయుఁ బోలె ♦ వానిజననియుక్.

క॥ అనూత్నదుఃఖమున న, మ్మానిని గతసంజ్ఞ యగుచు ♦ మల్లడిఁగొనఁ జే
నూని నిలిపె నాతఁడు స, న్మానిత నాయమ స్వకీయ ♦ నయ మొప్పారక్.

ఆ॥ నేలఁ బొరలి బడబ ♦ నెఱిద్రోఁప నొక్కింత, దెలిసి శోకవేగ ♦ దీర్ణహృదయ
యగుచు మిగులనొగులు ♦ నద్దేవిఁ గనుఁగొని, సరభసుఁడుగ రామ ♦ చంద్రుఁ డెడరె.

క॥ కడునీతిపరుఁడు వాఁ డటు లడలు జననిఁగని ప్రపన్న ♦ తానతుఁడై చొ
ప్పడు టబ్రమె బడలఁడె యొక, వెడమానిసియైనఁ దొంటి ♦ వెరవెల్లఁ జెడక్.

ఆ॥ ధూళిదుడిచి నిమిరి ♦ మేలిపల్కులు వల్కి, యమ్మ; యింతకిట్టు ♦ లగునె తెరల
ననెడు పుత్రరత్న ♦ మాతనిఁ గని లక్ష్మ, ణుఁడు వినంగఁ దల్లి ♦ నొడివెఁగడఁగి.

—♦ కౌసల్య రామునకుఁ దనదుద్దేశం దెలిపి విలపించుట ♦—

సీ॥ నీవు పుట్టకయున్న ♦ నేనింతశోకంబు, పాల్గాక యెట్లైటో ♦ బ్రదుకుదాన
లే దిట్టిసొద వంజ ♦ లేమకునేనియు, బిడ్డలు లేరన్న ♦ బెఱుకు దక్క
ఘును భర్తృపౌరుష♦మ్మున శుభంబుసుఖంబుఁ,బడయఁగంటినె నేఁడు♦పాసిచనెనె
నీమేల్మి యూహించి ♦ నెలకొంటి నడియాస, పడిబత్తె మనియెడు ♦ పాడి దొడర
నదియు నిటులయ్యె నిప్పటి♦కవల నేమి, గలదు సవతుల యొరపిడిఁ♦గలఁకపాటె
యున్న నాకిది వింతయే♦యొండు దలఁప, నేల యిది దుఃఖభాజన ♦ మే యనంగ.

తే॥ నీ వెదుటనుండ నింతలా ♦ నెటికి నడవి, కీవరుగ నయ్యెడున దెట్టు ♦ లే వచింతు
గైకయానతి భరతుండు ♦ కాలరాయ, దిక్కులేకున్న నెద్దియో ♦ దేవుఁడరయు.

ఆ॥ ఇంక నోర్వఁజాల ♦ నీపదియేడేండ్లు, నాసఁ గొంటి మాసె ♦ నఘు మటంచు
మఱల దొరలఁ గంటి♦మహీధరంబున నుండి, యంతులేని లోయ♦యందుఁ బడఁగ.

మ॥ ఉపవాసంబులు యోగము ల్నెఱపి త ♦ ద్వ్యక్తి న్నినుం గాంచి లే
దుపమానంబున కీపె కోర్తనఁగనై ♦ యున్నంత నాపాలిదా
విపరీతం బగు భాగ్యమే కదిసె ని ♦ వ్వేళ న్యథాపూర్వ మీ
కృపణత్వంబున ముంప దుర్గతులు ల ♦ క్ష్మీప్రాప్తికి న్యోగ్యులే. ౨౦౧

క॥ నా చేసినపున్నెంబులు, పీఁచమడఁగి మడఁగె మేలి ♦ బీజంబులు కీ
డౌ చౌటిపడియ నట్టులు, పాచితముం గెడప నొందు ♦ పాల్పడఁ గలదే. ౨౦౨

తే॥ నది యొరయు వానకారున ♦ నవసి కూలు
కూల మట్టులు తెరల దీ ♦ కుజనిహృదయ
మేలొకో వజ్రమునఁ జేసె ♦ నేమొ దీని
దీన వినిపాత మవ్విధి ♦ తెలిసి తెలిసి. ౨౦౩

తే॥ లేవుకాఁబోలు నిమ్మోయి♦లేమలకు న, కాలమరణంబు లరయఁడో♦కాలుఁ డడలు
లేడిఁ గొనిచను సింగంబు ♦ లీల నన్నుఁ, బట్టి కొంపోవరాదె యీ♦పట్టైటెంగి.

క॥ అట్టిదెస నిట్టిచెట్టలఁ, బెట్టం దల మింతలేదా ♦ పేర్మిసెడినవా
రుట్టిపడి పెనుపుగాంచినఁ, జట్టము మార్పడెనొ; జముఁడు♦సడిఁజేడ్పడెనో. ౨౧౪

క॥ ఇచ్చమెయి నిప్పు డెటులో, చచ్చియు నినుఁజూడ మంచి ♦ జాడయుఁ గనఁబో
నొచ్చెమున వత్స మెడలిన, యచ్చున గవయినయి యఱతు♦యమసదనమునన్.

ఉ॥ చందురుబోఁని నెమ్మొగము ♦ సారససఖ్యముఁ గొన్నదృష్టి నీ
యందము చందము న్గనక ♦ యాదట వందురనేరఁ దండ్రి ; నీ

ముందటిదాననై నడుతు ♦ మోసములే దడవిం జొరంగ నిం
కెందునుఁ బోదు వృత్తి బడు ♦ వీనికయా వెటు దూడ వీడెడిన్. ౨౦౭

—♦ లక్ష్మణుండు కౌసల్య నూగార్చుచుఁ పరపక్షము నిరసించుట ♦—

చ॥ అని విలపించుకోసలవ ♦ రాత్మజ రాముసవిత్రి లక్ష్మణుం
డనితరవృత్తిఁ గాంచి యనె ♦ నంబరో ; యేనును సమ్మతింప ని
య్యనువునఁబోనిపోక తెలి ♦ వాడుది యాడినమాట లెక్కసే
సి నయ మయంబు నాయతియుఁ ♦ జేడ్పడ రాజ్యము వీడనెంతురే. ౨౦౮

తే॥ కొండికకు రాజ్య మొసఁగుటొ ♦ కండు దోస
మంతకును మోస మగ్రజు ♦ నడవి కరుగు
మనుట ఘోరపాప మెంచిరే ♦ యన్యులేని
స్వజనులేనియు సీతనిఁ ♦ గుజనుఁ డనిరె. ౨౦౯

తే॥ వేలుపనికొల్వవచ్చుని ♦ వేకి దాంతుఁ, డొవ్వనిజనంబునేనియు ♦ నోముఁ దలఁచు
వత్సలుం డాశ్రితులపట్ల ♦ వరదుఁ డట్టి, రాముపై నేరమెంచు గ ♦ రాసు గలఁడె.

తే॥ తనతనయుఁ డేల నేలయి ♦ మ్మనుచు వేఁడ
నాపె కగుఁగాక చనవరి ♦ యగుట నొంటఁ
బలుక నెటులయ్యె నన్నఁ గా ♦ నలకుఁ బనువు
మనుచుఁ గాముకవృత్తుల ♦ కడ్డు గలదె. ౨౧౧

క॥ వృద్ధుఁడు విపరీతుఁడునై, సద్ధర్మం బరయ కాడు ♦ జన మూడు నసం
బద్ధవచనముల కలవడు, బుద్ధివిహీనుఁ డెదియేనిఁ ♦ బొరయఁడె పలుకన్. ౨౧౨

క॥ లౌల్యంబున నితఁడు పున, ర్బాల్యం బెనసి మరుబారిఁ ♦ బడెఁ గాదన సా
ఫల్యోదయ ధర్మాఢ్యు న, తుల్యు సుపుత్రుం ద్యజించు ♦ తొడుసున కగునే.

క॥ ఇట్టి ప్రసంగంబున నృపుఁ, డిట్టలమగు ధర్మ మెడల ♦ నేమనె సుతుఁ డీ
గుట్టరయ కెట్లుదొరకొనెఁ, గట్టా ; పెరవారు వీరి ♦ గతిఁ గని నగరే. ౨౧౪

క॥ అని రామునిచక్కటిఁ గనుఁ, గొని యిట్లనె వాఁడు నీవు ♦ కోవిదుఁడవ యే
మని చొరఁబాఱితి విట్ట, ట్టన కిక్కొఱగానిమార్గ ♦ మార్యులు దెగడన్. ౨౧౫

సీ॥ ఏటిబలం బేమి ♦ హేతువు తేనికి, నినుఁ గాన కొడ్ల క ♦ వని నొసఁగఁ
బుట్టకమున్నె యి ♦ ప్పోఁడుము లెంచిరే, వరమంచుఁ గొలమున ♦ వాసిఁ జెలువ
నాగచ్చునుడి యెట్టు ♦ లయ్యె సూనృతముగ, నేఁటిసత్యం బేల ♦ నేలఁ గలసెఁ
గామకారవికార ♦ గతి కారణం బౌనె, యిమ్మెయికర్జంబు ♦ నెరవుసేయ

నేను దోడుగాఁగ ♦ నిన్నెఱినెలకొన, దిటవుపడుము దివ్య ♦ తేజముననుఁ
దమము విరియఁజూతుఁ ♦ దపనునిచక్కటి, యరుణు నట్టు లన్ని ♦ యంశములను.

ఆ॥ నేను మిత్త్రిపోలె ♦ నిను, గొల్చుచుండఁ గృ, తాంతుసడికి నీవ ♦ యగుచు నిలువ
నెఱిఁగియెఱిఁగి యెవ్వఁ♦డెదిరించు నెదిరించి, బ్రదుకు నెవఁ డెవండు♦బ్రదికి బలియు.

క॥ నీ కప్రియ మొనరింపఁగ, నేకాపురుషుండొ తొడర ♦ నేమో యనుప
ల్కేఁ కాదు లోకమెల్ల న, లోకం బొనరింప నేర్తు ♦ లోఁగొని పెలుచన్. ౨౧౮

ఆ॥ ఈయయోధ్యలోన ♦ నెవ్వాఁడు వారల, పక్ష మెనయు వానిఁ ♦ బట్టి ద్రుంతుఁ
గైకఁ గేకయులనుఁ ♦ గాల్తు శరాగ్నికి, మిడుత లట్టులగుచు ♦ మిడుకుచుండ.

క॥ భరతుఁ డెదిరించి నిలిచిన, నరవరుఁ డటు కానితలఁపు ♦ నకు దొరఁకొనినన్
పరుసఁ దెగఁజూచెదను భూ, భర ముడిగింపంగ నిదిమె ♦ ప్రారంభముగన్.

ఆ॥ మృదువు స్థితికిఁ గాడు ♦ మేవడిమైయె చను, వానిజతన కాన ♦ వనితనుడికిఁ
బ్రాయమునకుఁ దిరిగి ♦ పాల్పడునీతేనిఁ, గూల్పవలదె దీనఁ ♦ గొఱఁత గలదె.

క॥ కార్య మకార్యము నరయక, నార్యుండై గర్వపడిన ♦ యము సెడనొదు
శ్చర్యకు లోఁబడినట్టిక, దర్యు న్గురునైన నగును ♦ దండ్యు నొనర్పన్. ౨౨౨

క॥ నాతో నీతో నైరం, బీతం డొనరించి యిచ్చు ♦ నే రాజ్యము ని
శ్శేతావన్మాత్రమె యిది, నీతి యనుచు సమ్మతింప నేర్తురె నేతల్. ౨౨౩

క॥ అని బిట్టలిగి జననిఁ గ, న్గొని యన్నకుఁ గూర్తుఁ గూర్తుఁ ♦ గువలయమెల్లన్
దన కిన్నెఱిదప్పిన నే, ననిమొద నిరయంబు వెరయ ♦ నొదు నటంచున్. ౨౨౪

ఆ॥ ధనువుముట్టి తపము ♦ దత్త మిష్టముఁ గూర్చి, శపథ మే నొనర్తుఁ ♦ జానమాట
కన్న యడవిఁ జొరఁగ ♦ నై నన్ను పీడంగఁ, దలఁప నగ్నిఁ బడుదుఁ ♦ దక్షణంబ.

క॥ ననుఁ గూడముట్టఁ గొనిచని, నను దనతో నడపినే న ♦ నలజలములనే
నయ మశంకితవృత్తిం, గొనకొని చొచ్చెద సుర ల్వి ♦ కుంతుఁ డితఁ డనన్.

తే॥ ఇనుఁ డుదయమొంది యిప మెట్టు ♦ లెడలఁ జేయు
నల్లె చుట్టినయీాయఘుం ♦ జడఁచి నైతు
నమ్మ ; నాదుపరాక్రమం ♦ బరసె దీవు
భ్రాంతియు నెఱుంగుఁ గాత మా ♦ జ్ఞాత మొసఁగి. ౨౨౭

—♦ కౌసల్య లక్ష్మణునిమతంబు గొని రాముని నిరోధించుట ♦—

మ॥ అనినన్ గోసలుకన్నె రాముఁగని య ♦ న్నా ; యన్న సౌమిత్రి యే
మనెనో వింటివె యేటి పీవరము లి ♦ క్లానా ; ప్రపంచంబునన్

దనయుఁ రాజ్యపరుం బొనర్చె నగుఁబో ♦ తప్పేది నిన్బొమ్మనన్
వనవాసం బొడగూర్చె నే తదుపసే ♦ వావర్తనం బిత్తఁటే. ౨౨౮

ఆ॥ తమ్ముకుఱ్ఱ కిడితి ♦ ధరణీరాజ్యం బెల్లఁ, బిన్నతల్లిపలుకు ♦ పెద్దసేయ
నాదునుడి నిచటున ♦ నన్నాదరించుచు, నిలువు మేనుఁ దగనె ♦ నీకుఁ దెలుప.

క॥ పౌరుషముం బొనరింపఁగ, నౌరీతిఁ జనుము లక్ష్మ ♦ ణాభిమతమునన్
నేర ననుఁగొనియె దేని స, మారంభము లుడిగి నిలువు ♦ మాత్మగృహమునన్.

ఆ॥ రాజు పూజ్యుఁ డెట్లు ♦ రాణి సవిత్రియు, నైన నేనుఁ బూజ్య ♦ నైతి నట్లుఁ
గాన నడవికేగఁ ♦ గా వలవ దటంచు, నిన్ను ధర్మమునన ♦ నిలువరింతు. ౨౩౦

ఉ॥ నాదుసపత్ని రోసమున ♦ నన్నిటుసేయఁ దలంప నీవు న
ట్లాదృతి వీడి వీడిచన ♦ నైనవినీతి స్వధర్మ మంచు నీ
కౌదటఁ గల్గునే నిలువు ♦ మమ్మయిపున్నము లాచరింపు మా
మోదముఁ గాంచెఁ గాశ్యపుఁడు ♦ మున్కొని తల్లినిఁ గొల్చి ధన్యుఁడై. ౨౩౨

మ॥ అదియుం గాదని యిచ్చవచ్చినటులీ ♦ వన్యాయ పుందారికై
కదియంబాఱెద వేని నింక బ్రదుకం ♦ గాఁజాల కేఁ బ్రాణము
ల్వదలన్ సందిపుబ్రహ్మహత్య యటులే ♦ హాటిల్లు నాహత్యయున్
దుది నిక్కం బిది దీనినెంచి మది మ ♦ ద్దుఃఖంబు వారింపవే. ౨౩౩

ఆ॥ పుత్ర ; నీవొసంగఁ ♦ బూఁటయు నమృతంబె, యన్య లిడినయమృత ♦ మైన విషమె
యేమిసేయుదాన ♦ నింతకు నోమితి, ననుచుఁ దనసవిత్రి ♦ యడలుటయును.

—♦ శ్రీరాముఁడు కౌసల్యం బ్రార్థించుట ♦—

తే॥ పాదములు పట్టుకొని యేను ♦ బరిభవింప, నేరఁ దలిదండ్రులను నను ♦ నీదుకృపకుఁ
బాత్రు నొనరింపు మిదె తండ్రి ♦ ప్రతిన నెఱపి, వత్తు శీఘ్రంబ నీయాన ♦ వలను గనఁగ.

క॥ పితృవాక్యవర్తనమునకు, మతిమంతుఁడు కండు వనెడు ♦ మానివరుఁడు స
మ్మతి గోవును హింసించి సు, గతి వడసెను దొల్లి విను స ♦ కలధర్మజ్ఞా. ౨౩౬

తే॥ మనకొలంబున సగరాఖ్య ♦ మండలీంద్రుఁ
డనుపఁ దనయు లవనిఁద్రవ్వి ♦ యడ్డుపడిన
వారి దునుపఁ గడంగి య ♦ వ్వలఁ గృతార్థు
లైరని వినంగ లేదెనీ ♦ వార్యవినుత. ౨౩౭

క॥ మేను దొఱఁగిరేనియు వా, రూనినధర్మంబు విడువ ♦ రొకమాత్రఁ దదీ
యానూనవ్రత మసదే, యానయమునఁ గాదె వారి ♦ కబ్బె దివ మటన్. ౨౩౮

ఆ॥ జామదగ్న్యుఁ డట్లు ♦ జనని రేణుకనుఁ గు, ఠారధార నఱికె ♦ బీర మొప్పఁ
దండ్రియానఁ బిదపఁ♦దా వేఁడి బ్రదికించు, కొనియె నాపె నతఁడు♦ఘనుఁడు గాఁడె.

క॥ దేవసము లిట్టివారలు, దేవి ; యనేకులు గురూప ♦ దిష్టులయి కృతు
ల్గావించిరి శ్రీమించిరి, సేవించిరి సుకృతిలభ్య ♦ సిద్ధాస్పదముల్. ౨౮౦

తే॥ బాసనేసి తలఁగరామిఁ ♦ బలికెఁ గాక
తండ్రి కీడెస దక్షిణ ♦ త్వంబులేదె
యడలుచున్నాఁడు నేల పె ♦ ల్లావటిల్లఁ
బొరలుచు నిదేమి తనపూర్వ ♦ పుణ్య మనుచు. ౨౮౧

క॥ ప్రతికూలాచరణం బో, మతిమతి ; నీకై ఘటించు ♦ మతకరినే నే
నతులము స్వధర్మవర్త్మము, ప్రతి లేదని బుధులు వొగడఁ ♦ బడయం గంటిన్.

క॥ అవలంబించితి నింకన్, సవరణసేయంగఁ జనదు ♦ జనని ; పితౄణం
బవలఁ గడచి కొలిచెద నీ, ప్రవరము పదపద్మయుగముఁ ♦ బ్రతిపత్తిమెయిన్.

తే॥ కాన నంగీకరింపు మో ♦ కన్నతల్లి ;, నీయనుజ్ఞనుఁ బితృవాక్య ♦ నిరతి మెఱసి
వత్తుఁ బదునాలుగేం డ్లన ♦ వర్ష శతము, లౌనె పురిఁజేరి నీకర్జ ♦ మరయ రాదె.

క॥ వచ్చెద యయాతివలె నీ, కిచ్చెద నభయంబు శోక ♦ మెడలి దయితు నే
పొచ్చెముఁ దలఁపక కొలువుము, సచ్చారిత్రవు త్వదీయ ♦ సంయమ మసచే.

తే॥ ఈవు నేనును వైదేహి♦యీసుమిత్ర, లక్ష్మణుండునుఁ బ్రభువాక్య♦లన మెలంగ
వలయువారము ధర్మప్ర ♦ వర్తనం బ, నంగ నియ్యదె చూ జన ♦ సంద్యచరిత.

వ॥ త్రిశుద్ధిగా నాయాచరించుధర్మ వియ్యదియ యిద్దాని నెవ్వారేనియు వారింపఁ
దలంపం జన దని జనయిత్రికిం జెల్పి జననంద్యచరిత్రు లక్ష్మణుం దిలకించి. ౨౮౭

క॥ సంకటమున గుర్వుఁ డుండ ని, రంకుశమతి క్షాత్రపథ మ ♦ నార్య మెనసియీ
వింకిట మెలంగ ధర్మవు, శంకాతంకముల నవసి ♦ చనదె కుమారా. ౨౮౮

క॥ అని యంజలి ఘటియించి జ, ననిఁ గని మత్ప్రాణపణము ♦ నన్ శపథ మొన
ర్చినవాఁడ నింక నేమన, కనుమతి నెఱపుము జగద్ధి ♦ తార్థ మరయుచున్.

క॥ శోకం బాఁకపడు మెద వి, వేకముఁ బెనుపుము ప్రశస్త ♦ విధి నెక్కొను మిం
కేకరణినైనఁ బతిసే, వాకలన న్నెగడుగాంచి ♦ వఱలుము జగతిన్. ౨౯౦

క॥ అని ధర్మ్యం బవ్యగ్రం,బనితర మనుపమ మవిక్ల ♦ బాశయముగ న
మ్మనుకులతిలకుఁ డనిన నొ, య్యన విని మృత సంజ్ఞ నందె ♦ నన మేకొనుచున్.

తే॥ ఆయమ కడంగి రాము మ ♦ హాత్ముఁ గాంచి
యిట్టులనె నింక నాబ్రదు ♦ కేల కృచ్ఛ్రి
లబ్ధు వరసుతు నినుఁ బాసి ♦ లాఁతివారి
పోర్పున మెలంగఁగలనె యే ♦ బ్రొద్దు గనుచు. ౨౪౨

క॥ లోకము స్వాహాస్వధలును, నాకేశత్వమును జీవ ♦ నంబును నీవే
నా కనుఁగొనియెద నట్లయి, నీకాననగతికి నెట్టి ♦ నెఱి గనుదానన్. ౨౪౩

తే॥ వత్స; నాయెందు దశరథు♦వలనఁ బొడమి, సర్వభూతప్రియంవద♦త్వమున నెగడి
యుంఛవృత్తిని జీవింప ♦ నోర్తు వెట్లు, కష్టములకెల్ల నీవయ్యె ♦ కాననముల.

క॥ దాసులు భృత్యులుఁ గొలువ ర, సాసన్నసుఖాన్నభోజి ♦ వై వన్యము లి
ప్డేసన్నఁ గుడిచెదో కదె, నాసత్యసమానగాత్ర ♦ నాప్రియపుత్రా. ౨౪౪

తే॥ రామ; యభిరామమూర్తిని ♦ రాజు వనికిఁ
బనిచె నన నెవ్వనికి మది ♦ భయము గదుర
దెవ్వఁ డిఁక స్వస్థచిత్తుఁడో ♦ నింతలింత
లాకృతాంతునకే తెలి ♦ యంగనగును. ౨౪౫

ఉ॥ ఏమనుదాన నిన్ననమి ♦ హెచ్చినయీరుపుగాలి వెంప దుః
ఖామయ మిందనోఘముగ ♦ నశ్రువు లాహుతు లార్తి పెల్లు పె
న్ధూమముఁ గాఁగ నెక్కొనఁగఁ ♦ దోనె హృదంతరశోకవహ్ని న
న్నామని చిత్రభాను వెటు ♦ లాకృశకక్షము నట్లు గాల్పదే. ౨౪౬

క॥ కావున ననుఁ దోడ్కొని చను, మేవెతలుఁ దలంపఁ బిదప ♦ నెది యెటులైనన్
నీవదనలక్ష్మిఁ గాంచుచు, జీవితముం గడతు నింత ♦ సిద్ధము తనయా. ౨౪౭

—♦ రాముఁడు తల్లికి స్త్రీధర్మంబు లెఱింగించుట ♦—

తే॥ అనిన నయ్యెడఁ దెలుపంగ♦నతఁడ తగు న,నంగ నిట్లనె క్షితిసుతా♦నాయకుండు
మగడు జీవించి సుస్థితి ♦ మలసి యుండఁ, బుత్రుకడ నివసించుట ♦ పున్నె మగునె.

క॥ పతి ప్రాణముప్రాణం బగుఁ, బతి దైవము రక్షకుండు ♦ పడఁతుక కెపుడున్
బతి మించిన పరతత్త్వము, గతి యని యెుకఁడుండునే వి ♦ కారవిదూరా. ౨౫౦

క॥ ఎటురా జను నమ్మా; నీ, కటవికి రా జనుమతింప ♦ కన్య కథవ క
ట్లటఁజని పతిశుశ్రూషా, పటువ్రతస్థితికి సంపి ♦ భర్తవు గావే. ౨౫౧

తే॥ వంచన స్థానర్చెఁ గైక య ♦ టంచు నమ్మ,కడవి కే నేగ నీవు న ♦ నాదరించి
తలఁగఁజూడంగ నతఁడు దు♦ర్దశలపాలు,గాఁగలఁడొ;యంచు దీనికే♦కలఁగువాఁడ.

తే॥ ఎంతఘాతుకవృత్తి స్త్రీ ♦ కేడుగడయుఁ, దాన యగుభర్తవిడువంగఁ ♦ దలఁచుటరయ
మదినిఁ జేర్పకుమమ్మ య ♦ మ్మార్గమతివి, గర్హితము త్వత్ప్రశస్తి ♦ కనర్హపదము.

క॥ పతి విడువఁదలఁచెనేనియు, సతి విడువక కొలిచి కాంచు ♦ సద్గతినని స
మ్మతి నెఱవుఁగాదె నెట్టన, శ్రుతిస్మృతులు ధర్మనిష్ఠ ♦ సూనృతఫణితిన్. ౨౬౪

తే॥ అతని యానతియే శ్రుతి ♦ యని తలంచి, జీవితావధిగాఁ జెంతఁ ♦ జేరి కొలిచి
తత్పరిశ్రమ మెటులేనిఁ ♦ దలఁగఁ జూచి, పుణ్యగతిఁ గనగాంచు మో ♦ పుణ్యమూర్తి.

సీ॥ ఉచితవ్రతంబులు ♦ నుపవాసములు నిచ్చ, లొనరించుచున యుండె ♦ నూరకొండె
దేవపూజలు భూమి ♦ దేవతార్చనములు, గావించుచున యుండెఁ ♦ గాకయుండె
వృద్ధనమస్కృతు ♦ ల్వివిహితాదరంబులు, మైకొనఁగా నొండె ♦ లేకయుండె
శ్రుతిచోదితక్రియ ♦ ల్సూనృతసంస్క్రియ, ల్నేర్చివర్తిల నొండె ♦ నేరకొండె

నాతఁ డార్తుండుగా నార్త ♦ యతఁడు ముదితుఁ
డైన ముదితయుఁ బ్రోషితుం ♦ డైన మలిన
కృశయు నగుచు ననువ్రత ♦ వశత మెలఁగు
నది పతివ్రత యన నొప్పు ♦ ననఘచరిత. ౨౬౫

తే॥ అట్టు లనువర్తినియ కాని ♦ చెట్ట యెన్ని
పున్నెము లొనర్చియునుఁ బాప ♦ ుగతి గాంచు
నొడ్లమాటలు నీకేల ♦ యుచితవృత్తి
భర్తృశుశ్రూష లొనరించి ♦ పరఁగుమమ్మ. ౨౬౬

క॥ దేవతలం బ్రార్థింపుము, దేవి; స్వస్త్యయన మింకఁ ♦ దేఁకువమెయి నా
కీవేళ సంతరింపుము, సేవింపుము భర్త నెపుడు ♦ శ్రితవత్సలవై. ౨౬౭

—♦ శ్రీరాముఁడు లక్ష్మణుం బ్రశాంతు నొనర్చుట ♦—

తే॥ అని క్రుధితు లక్ష్మణుం గని ♦ యన్న; నీవు, తల్లిదుఃఖంబుఁ బెనిచెడు ♦ తరమె నాకుఁ
గూర్తు వెక్కుడుగా నైన ♦ గువలయంబు, గూల్తు నని యెద వద్దానఁ ♦ గొంతగలదె.

క॥ ఎఱుఁగుదు నీదుపరాక్రమ, మెఱుఁగుదు స్నేహంబు నెఱియు ♦ నెఱుఁగుదునైనం
దఱి యరయవలదె ధర్మం, బఱిఁ గొనుపురుషార్థ మొక్కఁ ♦ డవనిం గలదే.

ఆ॥ గురుఁడు రాజు తండ్రి ♦ కోవిదుం డధివృద్ధుఁ, డతఁడు క్రోధముననొ ♦ హర్షముననొ
కామముననొ పలికెఁ ♦ గాక యకార్యంబు, నాకుఁ దీర్పకునికి ♦ న్యాయ మగునె.

క॥ సత్యశమముల రహస్యము, నిత్య మరసి మెలఁగువాఁడు ♦ నిర్మలుఁడొఁ ద
త్పాత్యయములు నిలువవు ధ, ర్మాత్యయమున నవియు దాన ♦ నలవడియుంటన్.

తే॥ ధర్మమే పరమము లోక♦తతుల కెందుఁ, ధర్మమున సత్యము ప్రతిష్ఠి♦తమ్మె యుందు
ధర్మసంశ్రితమై యున్న ♦ తండ్రి యాన, నేను వెడద్రోయఁగా నెట్లు ♦ నేర్చువాఁడ.

క॥ ధర్మపరుఁ డగుచు నెత్తఱి, నిర్మలుఁడై మెలఁగుజనుని ♦ నిగ్రహ మొందున్
గర్మాయత్తము తా నా, మర్మ మరసి యతఁడు మలత ♦ మలయక యుండున్.

తే॥ తల్లిదండ్రులకును ద్విజ ♦ దైవతముల, కెది ప్రతిజ్ఞాత మగు నది ♦ యెడయఁ జూడ
రాదు ధర్మలోలున కన♦రాముఁ డొంటఁ, బితృనియోగంబు నెరవేర్పఁ♦బిఱికిపడును.

ఆ॥ అతడు తెలుపనేర ♦ కారాట మందుచు, ధర్మపాశమునను ♦ దవిలియుండఁ
గైక దెలుపనైనఁ ♦ గాదన్న నాకన్నఁ, గష్టుఁ డొకఁడు జగతిఁ ♦ గానఁబడునె.

తే॥ ధర్మవృషలోదయంబులఁ ♦ దవిలియున్న
యర్థకామంబు లెపుడుఁ గృ ♦ తార్థములగు
నందఱకు ద్వేష్యుఁ డగుఁ గేవ ♦ లార్థపరుఁడు
కామహితుఁ డెన్నటికి నెందుఁ ♦ గానివాఁడు. ౨౭౭

క॥ వశ్యమగు సత్కుటుంబ మ, వశ్యము గృహి కెట్టు లన్య ♦ వర్గం బటులే
వశ్యమగు ధర్మమున కా; దేశ్యం బిది దీనిగుట్టు ♦ దెలియుము వత్సా. ౨౭౮

క॥ పరలోకభీతిభీతుఁడు, పరాక్రమావక్రుఁ డమల ♦ భావుఁడు గురుఁ డ
వ్వరసత్యసంధుసత్యముఁ, బరఁగింపకయున్న నాదు ♦ బ్రదు కొకబ్రదుకే. ౨౭౯

క॥ కావునఁ దల్లియు నీవును, నావచనము వినుఁడు క్షాత్ర♦ నయతైక్ష్ణ్యం
బీవిధి మాని మెలఁగుఁ డిఁకఁ, గావింపుఁడు మత్ప్రియాణ ♦ కార్యోచితముల్.

వ॥ సౌమిత్రీ ; రాజ్యాభిషేకంబునకై నసంభారసంభ్రమం బంతయు వనప్రస్థానమహోద్యమంబున కుపయోగించుం గావుతకాలోపహతం బయ్యెడుజీవితంబుసుఖంబునకై రాజ్యకాంక్షంజేసి యచింత్యాప్రమేయాభ్యుదయంబునకుఁ గారణంబై చిరతరస్థాయిని యగుకీర్తి నధఃకరింపం జాలఁ, దల్లులకు నేనిఁ దండ్రికి నేనియు విప్రియంబగు నకృత్యంబు నబుద్ధంబుగఁగాని బుద్ధిపూర్వకంబుగఁగాని యేనాచరించువాఁడం గాను నామేలోర్చియే, తల్లియు నీవును నన్నీనెలవునన యుండుమనినను మధ్యమాంబకు సందియం బెడలనేరదు దానంజేసి సత్యభంగచకితుండగు తాత పూజ్యపాదునకు సుఖం బనువుపడంబోవదు నేను చీరాజినంబులుదాల్చి జటామండలధారినై యరణ్యమార్గంబువట్టి చనిన యాక్షణంబె కృతకృత్యయై యీసంభారంబులుపెట్టి భరతునియభిషేకమహోత్సవంబుంబొనరింపంజూచుఁ బదంపడి యెల్లరకుం జిత్తశాంతివాటిల్లు బుద్ధింబ్రణయించి మనస్సును సమాహితంబుఁ గావించి

శ్రమించి జీవించినజనకునకు నావలన నేల కష్టసంభావన యావహిల్లవలయు సర్వవిధంబులం గేకయపుత్రి సంతసించెనేనిఁ గులప్రతిష్ఠ చెడకుండుటయు నుత్తరశ్రేయం బీవలని కభివృద్ధిపడుటయు సంభవించు, నిట్లిది యంతయుం దైవకృతంబ, యేనాయమ యెడనేనియు సూనుని యెడనేనియు భిన్నభావంబున వర్తిల్లమియు నాపెయు మనల నశ్లేకనుంగొంటయు నెల్లవారలకును సువిదితంబకాదే, యెఱిఁగి యెఱింగి యిప్పట్టున నేమనవలసినదయ్యోనభిషేకనివృత్తిపరంబులుం బ్రవాసార్థంబులు దుర్వాచంబులు నగువచనంబు లుగ్రభావయై యేను వినుచుండ భర్తృసన్నిధియం దారాజపుత్రి యథాపూర్వప్రతిపత్తిక యైనచోఁ బ్రాకృతాంగనయుపోలె మత్పీడాకరంబులనక నిర్భీక యగుచు నెట్లువాకుచ్చు, నవిభావ్యప్రభావంబైనదైవం బెల్లభూతంబులం బట్టి పాలార్చునట్లులే యీయిందఱ నిట్టులాడింపం దొడఁగె సుఖదుఃఖంబులు భయక్రోధంబులు లాభాలాభంబులు జయాజయంబులు భవాభవంబులు ననునిన్నియు మఱికొన్నియుం దైవంబునకు లక్షణంబు లద్దానికిం గర్మరూపంబె రూపంబు వినీతుండుగాని జనుండు దీనితోడ నేట్లాడ నుద్యమించుం గాని ఫలం బించుకయుం గననేరండు సముదగ్రతపోయుక్తులగు ఋషివరులును దైవపీడితులై యొకప్పుడు నిజనియమంబులు వర్జించి కామమన్యువశంవదులై భంగపడుదురు సమారబ్ధంబైనయారంభంబు నివర్తింప ననారబ్ధంబయ్యు నాకస్మికంబై యేయదిప్రవర్తించు నయ్యది దైవకృతం బనం దగియుండు, నిట్లిదియంతయుం బుద్ధిబలంబున విచారించి యాభిషేచనికోత్సవలోపంబునకు లక్ష్మప్రాప్తివిపర్యయంబునకుం జంకెనయకున్నవాఁడ, వనవాసాయాసప్రసంగప్రపంచం బకించిత్కరం బని నాచిత్తవృత్తిం బొడకట్టుచున్నయది యన్నియుం దెలియనేర్చిన నీవింక నంకిలి దేఱె నాయెఱింగించినభంగి కభిముఖుండవై యుండుమని యన్నెఱవాది యానతిచ్చిన ఖేదమోదపదంబులకు మధ్యస్థుం డగుచు సుమిత్రానందనుండు.

—♦ లక్ష్మణుండు రోసంబు విడువక మాటాడుట ♦—

క॥ వంచినతల యెత్తక తము, వంచించినపిన్నతల్లి ♦ వలనునఁ జిత్తం
బుంచి బిలస్థము సర్పము, సంచున రోజుచు చిరం బ ♦ సహానార్దితుఁడై. ౨౮౨

తే॥ భ్రుకుటి యున్నతై యుండ ము♦న్నొప్పడమినట్టి, స్వేదబిందువు లంచిత♦శ్రీఁ దలిర్ప
నాననం బప్డు క్రుద్ధపం చాననంబు, రూపు రూపింపఁ జిత్తప్ర ♦ కోప మడర.

క॥ చేయి విదిర్చుచు నేనుఁగు, చేయట్టులు మేను వడఁక ♦ శిర మూఁపుచుఁ గ
ణ్ణాయతదృక్కులననె రఘు, నాయకుఁ గన్గొనుచు నొక్క ♦ నయమునఁబలికెన్.

సీ॥ అస్థానసంభ్రమం ♦ బలవడె నెక్కుడై, ధర్మలోకాతిసం ♦ ధానభీతి
నట్లు గాకున్న నీ ♦ యట్టిమహాత్ముఁ డి, ట్లాడునే దైవమ్ము ♦ నధికరించి
కృపణ మరక్తంబు కేవలం బది యెట్టు, లయ్యె శౌండీరమా ♦ నది యనంగ
ధర్మ వధ్వడి యొడ్లఁ ♦ దలకింపఁ జూచెదు, వారికి లేదె యా ♦ వలనిశంక

కనవు సుకృతోపధులు శ్లిష్ట ♦ గతులు నగుచు
గడుసుతనమున సుచరితం ♦ బెడలి స్వార్థ
పరత వర్తిల్లువారల ♦ బాంధవంబు
దలఁచె దేమని యీమెత్త ♦ దనము తగునె. ౨౮౫

ఆ॥ మున్నె యున్నఁ గోరి మొనసినఁ బోదె నేఁ, డేల యెన్నఁబడియె ♦ నీవరంబు
లోకు లీసడించు ♦ లోలత్వమున నీదు, మేలు గానలేమి ♦ మేలుకొనెనె. ౨౮౬

ఆ॥ ఎద్దియెంచి ద్వైధ ♦ మెనసె నీబుద్ధి యా, ధర్మ మొకఁడె మోహ♦దశకుఁ దెచ్చె
నిన్ను నన్ను ద్వేష ♦ నిష్ఠితుఁ జేసెదు, ననినఁ దెలుపవలసి ♦ నదియుఁ గలదె.

ఉ॥ ఎన్నిక గన్నవీరుఁడవె ♦ యేమని కైకకు మేనొసంగి య
ట్లున్నవరేంద్రువాగ్విష మొ ♦ హో ; కొనఁగోరితి పథ్య మర్థ మ
న్నన్న ; జనాభికాంక్షిత మ ♦ యత్నతఁ ద్రోయఁ దలంచి తింక నే
మన్ననుఁ బోల దీశ్వరుఁడె ♦ యన్నిటి కొననుమాట దక్కఁగన్. ౨౮౮

తే॥ కపటమున నిట్టిభేదంబు ♦ కల్పితంబు, గాఁగ నయ్యె నటంచు నేఁ ♦ గలతఁ నొంద
నీవు నిజమైనధర్మంబు ♦ నిందితంబు, గాఁ దలంచుట నిక్కట్టు ♦ గలిగె నాకు.

ఆ॥ అట్టికామవృత్తు ♦ లత్యాహితోద్యము, లైన తల్లిదండ్రు ♦ లనెడురిపుల
కామపూరణంబు ♦ గావింతు నని యెంతు,వింతమోహదశకు ♦ హేతు వెదియొ.

క॥ దైవప్రతిపత్తియె త, ద్భావంబులఁ జెందె నంటి ♦ తాదాత్మ్యమునన్
దావుకొనె నదియె నీయెడ, నేవిధమున నేని నర్థ ♦ మెక్కటి యగుటన్. ౨౯౧

ఆ॥ వీరయోగభావ ♦ విక్లబులగువారు, దైవ మడ్డుసేసి ♦ తలఁగఁ గాంత్రు
ప్రకటవిక్రములును ♦ భావితాత్ములు నైన, వార లెపుడు దాని ♦ వంకఁ గనరు.

క॥ పౌరుషముంగొని దైవం, బారసి తలఁగింపఁబోని ♦ యసమర్థుఁడు స
త్ప్రారంభంబుల నెఱపఁగ, నేరక యూరక నశించు ♦ నిహతసమయుఁడై. ౨౯౩

తే॥ నేఁడు వ్యక్తీకరించెద ♦ నీప్రయోజ, నంబు సెడఁజూచు దైవంబు ♦ నాదుపౌరు
షంబున మరల్చి తదుభయ♦సంగతంబు, తారతమ్యంబు జగముల♦వార లెఱుఁగ.

తే॥ ఇదె నిరంకుశ ముద్దామ ♦ మదబలోద్ధ, తంబు దైవగజంబుఁ బ్ర ♦ ధావితంబుఁ
బౌరుషమున మరల్చెదఁ ♦ బాప మనక, నన్ను మన్నింపవే జగ ♦ న్నాథ; యరసి.

సీ॥ ఈశ, నిన్నుదునాలు ♦ గేండ్లు వనంబున, నివసించుమని రవి ♦ నీతులగుచు
నెవ్వారు స్వార్థంబు ♦ హేయంబు భావించి, నీయభిషేకంబు ♦ నెఱిచెరల్చి
యాతల్లిదండ్రుల ♦ ననిచెద మున్నుగా, నయ్యరణ్యాపథంబు ♦ నధిగమింప
త్వత్కాననస్థితి ♦ తావకపుత్రరా, జ్యావలంబమున క ♦ నంతరంబ
యుచిత మయ్యెదె కాదె యీ♦యుద్యమంబు, లోకపాలకులేనియు♦ లోలవృత్తిఁ
దొడరి భంజింప నేర్తురే♦తోడుతోడ, నాదుపౌరుష మలమి త♦న్నయముఁగెడప.

తే॥ ఏఁ బ్రతిజ్ఞ నొనర్చెద ♦ నెడయ నెందు, నీవు శంకింపవల దొంట ♦ నిగ్రహింతు
రాజ నేకాగ్రుఁడైన స్వ ♦ రాజ్యమెల్ల, సాగరము వేల యట్లు ర♦క్షణ మొనర్తు.

మ॥ అభిషేకం బొనరించికొమ్ము శుభతీ ♦ ర్థాభిప్లుతిం గాంచు మా
విభవప్రాప్తిని మమ్ము దేర్పుము సుఖా ♦ విష్టుండవై యుండు మే
ప్రభులం దోలఁగనైన నే నగుదు మ ♦ ద్బాహు ల్విభూషోచిత
ప్రభము ల్గా భరియింపఁబోవు శరచా ♦ పప్రాసఖడ్గాదులన్. ౨౯౮

ఉ॥ కోరిక గద్దు పోరికని ♦ కూడికమై నరుదెంచెనేని వృ
త్రారినిఁ జీరికింగొనని ♦ యవ్విధి నేఁ జరియింతునంచు నొ
క్కేరి యెదుర్కొనంగ మహి ♦ నిప్పుడ యీయసిధార వీరహ
స్తోరుశిరస్సరోజముల ♦ నొయ్యన నర్చనొనర్చి తేర్చనే. ౨౯౯

తే॥ కొండలుంబోని వేదండ ♦ తండములు వి
భూషణంబులతో భూమిఁ ♦ బొరయుఁగాత
మొగిలుగుంపులు మెఱుఁగుల ♦ మొత్త మొలయు
దీని కరిగాఁపులై వచ్చు ♦ తెఱఁగు దోఁప. 300

క॥ ఏను శరాసన మెత్తిన, నీనేల న్నెగడుపురుషు ♦ లిందఱలోనన్
దానొకఁడు గలఁడె పూరుష, మానిత్వము సెడక పేరు ♦ మార్పడ కుండన్.

తే॥ పెక్కులాతూపులను నొంటి ♦ బెక్కుల క్షత్త్రి
ములను నొక్కండు తూపున ♦ మురువడంతు
నప్రిభుత్వంబు రాజున ♦ కందఁజేయుఁ
భారిభవము నీకుఁ గూర్చునా ♦ ప్రతిభ నేఁడు. 30౨

ఉ॥ చందనసారమెత్తి యని ♦ శంబును నీభుజకీర్తి కీయఁగా
నెందు వసుప్రదానమున ♦ నెల్లసుహృత్పరిపాలనంబునన్
ముందుగ నేమటంచు నిల ♦ మోస మొనర్పఁ దలంచువారి కా
క్రిందనము ల్ఘటింప నవుఁ ♦ గావుత మింకిట నాదుబాహువుల్. 303

ఉ॥ ఒవ్వనివార లెవ్వ రిఁక ♦ నుజ్జ్వలకీర్తిసుహృత్సుఖాసువుల్
దవ్వు లటంచు మించుపరి ♦ తాపమునం బెరలంగ నాదురో
యవ్విధి నివ్వసుంధర స్వ ♦ హస్తవశంబునఁ గన్నుసన్నలన్
మవ్వమునూపు నన్నెటని ♦ మామకకింకరవృత్తి మెచ్చవే. 304

తే॥ అనుచుఁ బాదములంబడి ♦ యడరు దొడ్డర
వేఁడు తమ్మునిఁ గని రఘు ♦ వీరుఁ డతనిఁ
దివిచి కౌఁగిటఁజేర్చి య ♦ శ్రువులు దుడిచి
యెలమి తీయదనం బొప్ప ♦ నిట్టులనియె. 305

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునకుఁ దత్త్వోపదేశంబునం గోపోపశమనం బొనర్చుట. ♦—

క॥ ఏ నీనెఱిమెఱఁగియుఁ దగు, పూనిక నిటమున్ను గొంత ♦ బోధించితి స
న్మానము నీదెస నసదని, యేనాఁడుం దలఁపఁబోకు ♦ మెంచుము తఱియున్.

ఆ॥ ఎద్ది నీదుకనుల ♦ యెదుటఁ గన్పట్టు నా, విశ్వరాజ్యదేహ ♦ విభవమెల్ల
సత్యమేని నసఘ; ♦ సఫలమ్ము తనప్రయా, సమ్మటంచు మదిని ♦ నమ్ము మెపుడు.

సీ॥ కలుగుభోగములు మే ♦ ఘవితానసంస్థాన, చంచలాచాంచల్య ♦ సరణి గాంచు
నగ్నిసంతప్తలో ♦ హస్థమా జలబిందు, వట్టు లాయువు పొడ ♦ వడఁగిపోవుఁ
దగ నీడయట్టిదె ♦ తఱుఁగొరగులతోడి, జాడఁ దోఁచు నశించుఁ ♦ జపల లక్ష్మి
నీటిపైబుగ్గకా ♦ నిజమున వర్తిల్లు, నధ్రువం బనఁ జను ♦ యౌవనంబు
దేహి యిమ్మెయి తెఱఁగెల్ల♦ దెలిసి సౌఖ్య, పరత నెట్టన రేబవ ♦ ళ్లరయ కెపుడుఁ
బాల్పై పడుచుండుఁ గానఁ దే♦పట్ల రిత్త, సంభ్రమం బిది మృగతృష్ణ♦సం చటంచు.

క॥ పితృమాతృభ్రాతృసతీ, సుతబాంధవసమితికైన ♦ చుట్టఱికముఁ గా
థ్తతతికి నడియేటం బ్రపఁ, దతిగాను ప్రాణులకు నట్లు ♦ దలఁపుము మదిలోన్.

క॥ అప్పాముసోటఁ జిక్కిన, కప్ప పురువు లాడిచికొనఁగ ♦ గాంక్షించు నరుం
డప్పగిది మృత్యుముఖమున, నొప్పుసెడియుభోగముల క ♦ హా,యత్నించున్.

ఆ॥ ఎనయఁజూచు నెడయ ♦ దేనాడు రాగాది, సంకులమ్ము స్వప్న ♦ సదృశ మసదు
గానసై నవింత ♦ గంధర్వపురము సం, సారసుఖము నాక ♦ జడజనుండు. 300

తే॥ రవిగతాగతములఁ బవల్ ♦ రాత్రి యనుచు
నెన్ను నాయువు గడచను ♦ చెన్నఁబోఁడు
కాలవేగము జర రాక ♦ కాలమృత్యు
విధము వినఁడో నరుం డెంత ♦ వెఱ్ఱివాఁడో. ౩౧౨

ఉ॥ ఆమఘటాంబువట్టులు క్ష ♦ యం బెనయు న్మనుప్రొద్దు మేనునకా
గీ మొనరించికొంచుఁ గను ♦ గిన్క సపత్నులు వోలె రోగముల్
దా మునుమున్నె వ్యాఘ్రివలెఁ ♦ దారసిలుం జర వీక్షసేయుఁదో
నా మెయిమిత్తి యేమనియొ ♦ యాపద దోఁపకయుంట దేహికిన్. ౩౧౩

తే॥ జనుఁ డహంకారమమకార ♦ సంగతుఁడయి, రాజు నేనని లోకాభి♦రాముఁడనని
చివికి విధ్వస్తమయమయి ♦ చెడెడు మేని, కాసపడు సుంతగానఁబోఁ ♦ డంతగతిని.

తే॥ మొనకొని త్వగస్థిమాంసవి ♦ ణ్మూత్రబీజ, రక్తయుక్తము పరిణామి♦రాగముఖ్య
వికృతిసంయుతమిమ్మేని♦విధముగాంచి, యాత్మయెటులయ్యెనో తెల్ప♦వయ్య; నీవు.

ఆ॥ దేనియాశ్రయమునఁ ♦ దివిరి లోకములెల్లఁ, గాల్తునంచుఁ దొడరఁ ♦ గడఁగి తీవ
యిట్టిదోషవితతి ♦ యెందు దేహాభిమా, నిత్వముననె తోఁచు ♦ నిజము వత్స.

ఆ॥ వినుము మేనునేనె ♦ యనెడుబుద్ధి యవిద్య, యేఁ జిదాత్మ దేహ ♦ మెట్టులౌదు
ననెడు మతియె విద్య♦యది సంసృతికిమూల,మైన యాయవిద్య♦నడఁచి వెలయు.

క॥ కావున విద్యాభ్యాసం, బేవేళ ముముక్షు లెడఁగి ♦ యే పొనరింపం
గావలతురు కామాదుల, కావర మడఁగించు నేర్పు ♦ గాంచి కుమారా. ౩౧౮

తే॥ క్రోధ మన్నింటిలోపలఁ ♦ గుచ్ఛితంపు, శత్రు వియ్యది మోక్షేచ్ఛ♦సడలఁజూచు
దేనియవలంబనంబునఁ♦దివురు నరుఁడు, మాతృపితృసోదరాదుల ♦ మడియఁజేయు.

క॥ క్రోధము వ్యథలకు మూలము, క్రోధము సంసృతికి మొదలి ♦ కూర్పు చెఱుపనౌఁ
గ్రోధము ధర్మపథము నా, క్రోధము డిగనాడువిధికి ♦ గొనకొను మయ్యా.

ఆ॥ క్రోధ మంతకుండు ♦ క్రూర యాతృష్ణ వై, తరణి సంతసంబు ♦ సురవనంబు
శాంతి కామగవి వి♦చారింపుమా శాంతి, నెనసి నీకు శత్రుఁ ♦ డెవఁడు గలఁడో.

సీ॥ ఆత్మశుద్ధుండు స్వ♦యంద్యోతుఁ డవికారి,యానందమూర్తి య♦వ్యయుఁ డజుండు
దేహేంద్రియప్రాణ ♦ ధీవృత్తులకు సాక్షి, యనుచు నారసి కను ♦ నంతవట్టు
బాయదు సంసార ♦ బంధంబు జన్మజ, రామృత్యుముఖపీడ ♦ లాముకొనఁగ
దుష్పూరయగునాస ♦ తోడఁ దెర్లాడుచు, దివియునేటం బడి ♦ తెరువుగొనని

పురువుచాడ్పున సుఖదుఃఖ♦ములనుఁ బుణ్య, పాపసంబంధకలనలఁ♦బడయఁగాంచు
దొరయఁ బ్రారబ్ధదశలకు ♦ దోసిలొగ్గి, యవశుఁడై యవివేకి యి♦ట్లహరహంబు.

తే॥ తత్త్వమెఱిఁగినజనుఁడు ని ♦ స్తంద్రుఁ డగుచుఁ
గష్ట మిష్టంబుఁ గాంచుచుఁ ♦ గర్జముల మె
లంగుచునునైనఁ గనఁడు లో ♦ లత్వ మెందు
దాన నాతండు సుఖనిరం ♦ తరుఁడు ఘనుఁడు. 3_౨3

క॥ ఎట్టులు మెలఁగినఁ దలఁగిన, నిట్టలముగఁ జిత్త మాత్మ ♦ నెనయించుచు స
ప్రేమా ట్టగు నెట్టనము క్తికిఁ, జుట్టంబనఁ దనరి పూరు ♦ షుం డనవద్యా. 3_౨౪

క॥ ఈనాచెప్పినతత్త్వము, ధ్యానింపుము మదినిఁ జెఱుపు ♦ తలఁపు లుడిగి ని
ధ్యానించెద వఖిలము నీ, లోనే మాయావికృతికి ♦ లోఁబడ వెపుడున్. 3_౨౫

తే॥ అనుచు సౌమిత్రి కెఱిఁగించి ♦ యంబఁ గాంచి
యిదియె నీవును భావించి ♦ యెలమి మించు
మనుచు బోధించి యిట్లన ♦ నఖిలలోక
నాథుఁ డాదటఁ దనయను ♦ నయము వెలయ. 3_౨౬

ఆ॥ కర్మమార్గవృత్తి ♦ గడగట్టి వర్తించు, వారి కెపుడు నేటి ♦ వంకఁబోవు
నోడలకును వలెనె♦యొక్కచో నుండంగ, వలనుపడ దటంచు ♦ వలయుఁ దెలియ.

క॥ ఈకొలఁదికాలమే నే, నాకాననవృత్తి మెలఁగి ♦ యరుదెంచెద న
ల్లాకర్జమున జనకునుడి; ప్రాకటముగఁ జెల్లు టొకఁడె ♦ పథ్యం బనుచున్. 3_౨౭

మ॥ అనుమానింపకు మమ్మ; నాచనుటకై ♦ యమ్మాన్యుఁ బూజింపు మ
మ్మ; నితాంతవ్రతనిష్ఠ వేల్పులు ద్విజు ♦ ల్మానింపఁ గైకొంచు నె
మ్మనము న్నిర్మలముం బొనర్చి కడుసా ♦ మత్యంబున న్మించుమ
మ్మ; నిను న్మెచ్చెద రెల్లవారలు శుభ ♦ మ్మమ్మ; నాకు సంధిల్లెడిన్. 3_౨౮

ఆ॥ అగ్నిదేవతాద్వి ♦ జార్చన ల్గావింపు, మేను వచ్చునంత ♦ కెల్లప్రొద్దు
శుద్ధవృత్తి భర్త్రు ♦ శుశ్రూషలొనరింపు, మాతఁ డడరుతొడర ♦ నడలకుండ.

మ॥ నయసన్నాహ మెలర్ప నమ్మయికృతి ♦ న్నాతల్లి; కావించి యే
నయసంధానవిధాన ముప్పతిల నా ♦ య్య న్వచ్చెద న్మిందటన్
నియతిం గొల్చెద నీపదాబ్జముల మ ♦ న్నీతి న్విమర్శించి మే
ల్పయనం బొనతియిమ్ము స్వస్త్యయనము ♦ ల్పాటించి వాక్రుచ్చుచున్. 33౦

—♦ కౌసల్య శ్రీరామునకు స్వస్త్యయనం బొనగూర్చుట ♦—

క॥ అని తనయుఁడుగుల కెఱిఁగిన, తనయునిఁ గనుఁగొనల బాష్ప ♦ తతిగొనఁగొన నె
ట్టన కౌఁగిటఁ దార్చి మహా, జననంద్యచరిత్ర సాను ♦ శయముగఁ బలికెన్.

శా॥ నోముల్నేర్చిననేర్మి యింత కగుచో ♦ నోరాడ దెట్లైనఁ గా
నీ; మాటాడఁగ నేర కేఁగుమనఁగా ♦ నెట్లోపంటి నాతండ్రి; నీ
నేమంబే ఫలియించుఁగాత శుభమే ♦ నిన్బొందెడుంగాత నీ
వీమేరం గ్రమియించి గాఁ గనెడునాఁడే ♦ భాగ్య మౌఁగావుతన్. ౩౩౩

తే॥ నీవు చరితవ్రతుండవై ♦ నిష్ఠ వెలయఁ
దండ్రి ఋణమునుఁ దీర్చి త ♦ ద్దయుఁ బ్రియమున
నేఁగుదేరంగ నైన మే ♦ లిదెయటంచు
నెలమిఁ గన్గొననొపున్నె ♦ మెన్నఁడొక్కొ. ౩౩౪

క॥ నాకష్టంబులఁ బాపఁగ, నై కన్నయ్యా; బిరాన ♦ నరుదెంచెదవే
నాకెలనియాఁకలత నెం, తే! కృతులనుఁ జిక్కుపడక ♦ హిత మొనయింతే. ౩౩౫

చ॥ అడవిఁ జరించి మేలెనయ ♦ నై చనుదెంచెడునాఁడు చీరలున్
జడలును గట్టి యుట్టిపడు ♦ జాడనె కన్గొని వీతశోకనై
బడలిక దీఱ నిన్నెడఁదఁ ♦ బ్రాముకొనంగ శుభోచితంబులౌ
నుడులను నీవుదేర్పఁ బలు ♦ నోములకల్మి ఫలించుఁ బుత్రకా. ౩౩౬

తే॥ అనుచు నాయాసపడ నిది ♦ యదను గాద
టంచు సరగున నెంచి య ♦ య్యనఘమూర్తి
సలిలసంస్పర్శ మొనరించి ♦ సంయమంబు
దనర రక్షావిధానత ♦ త్పరత మించి. ౩౩౭

*క॥ రేచకపూరకకుంభక, సాచివ్యముతోడి యోగ ♦ సంగతి జపని
ష్ఠాచేతనతాత్త్తకలా, శ్రీచతురత సిద్ధలిపిగా ♦ చేకొను మనఁగన్. ౩౩౮

ఒప్పారుసుధృతి నొప్పుల, కుప్పా; మ్మాయప్ప; యని ర ♦ ఘుప్రవరుదెసన్
మెప్పొన నానసేయఁగ, నప్పావని తోడరె చిన్మ ♦ యాచింత్యకలా. ౩౩౯

| వల సిదె పోయిరమ్ము గుణ ♦ వార్ధి; రయమ్మున సన్నయమ్ము నీ
వలనిదె కాఁగ ధర్మము ప్ర ♦ వర్తన మెచ్చెదుగాన నద్ది తా
వలమయి నిన్ను బ్రోచుట క ♦ వశ్యము నొప్పెడుఁగాత మెల్లవే
ళలఁ దఁదుపాస్యదైవతము ♦ లాలనముం బొనరించుఁ గావుతన్. ౩౪౦

క॥ చైత్యాయతనంబుల సుర, లత్యయము లడంత్రుగాత ♦ మాదృతు లౌచున్
నిత్యముఁ గౌశికదత్త, ప్రత్యయములు శరము లోమఁ ♦ బరఁగెడుఁ గాతన్. ౩౮౧

క॥ మాతరపితృశుశ్రూషల, నేతఱినేనియుఁ బొనర్ప ♦ నెంచెదు మది ని
న్నాతగవు సత్యమును సం, స్థితములై మనుచుఁగాత ♦ చిరకాలంబున్. ౩౮౨

ఆ॥ కుశసమిత్పవిత్ర ♦ కూటంబు లాయత, నములు స్థండిలములు ♦ ననుచు వేదు
లగునుగాత నీమ ♦ హార్ధికిఁ గాచున, య్యగనగశ్రుపప్రహ ♦ దాదికములు. ౩౮౩

క॥ పన్నగమ్ములు సింగంబులు, మున్నగుజంతువులు తోడు ♦ మొనసి ప్రసాదా
భ్యున్నతిఁ దనరుంగావుత, మిన్నియుఁ జుట్టటికమున స ♦ మీహిత మెలయన్.

వ॥ సిద్ధులు సాధ్యులు విశ్వాఖ్యదేవతలు మహర్షులును ధాతయు విధాతయుఁ బూషభగార్యమాఖ్యులును వాసవప్రముఖులగునిఖిల దిక్పాలకులును నీకు స్వస్తింగూర్తురుగాత సంవత్సరంబు లయనంబులు ఋతువులు మాసంబులు పక్షంబులు దివసంబులు ముహూర్తంబులు కలాకాష్ఠాదికంబులు నగు కాలవిశేషంబులు నీకు శుభదాయకంబు లగుంగావుత స్మృతియు ధృతియు ధర్మదేవతయు నిన్ననుసరించి ప్రోచుచుండుదురు భగవంతుండైనస్కందదేవుండును సోముండును బృహస్పతియు సప్తర్షులును నారదుండును సిద్ధయోగివరులును నిన్ను రక్షింతురు దిక్కులు విదిక్కులు దిగీశ్వరులును నిరంతరము నిన్ను బోషింతురు నదీనదసముద్రంబులును వరుణుండును భూర్భువస్స్వరాదిలోకంబులును లోకేశులును భూతధాత్రియునంతరిక్షంబును నక్షత్రగ్రహతారకలు నహోరాత్రులు నుభయసంధ్యలును నీకు శుభప్రదంబు లగుంగావుత వసురుద్రాదిత్యప్రముఖదైవతవ్యతికరంబులు నిన్ను గూర్చి భవ్యంబు లొడగూర్చువారలు రాక్షసపిశాచ రౌద్ర క్రూర కర్మక్రవ్యాద ప్రధానంబులు నీవలనిభయంబెంచి తలంగుదురుగాతఁ బ్లవగవృశ్చిక దంశమశకసరీసృపకీటంబు లకించిత్కరంబు లవుంగావుత శరభసింహ వ్యాఘ్రమహాద్వీపఋక్షదంష్ట్రిశృంగిమహిషముఖ్యంబులు నృమాంసభోజనంబులు నాదగునెల్లసత్త్వంబులు నావలనిమేలరసి నీకు ద్రోహంబొనరింపకుండెడు సదాగమంబులు శివంకరంబు లయ్యెడుఁ బరాక్రమంబులు సిద్ధించుచుండెడు మశేషసంపదలు సుసంపన్నలగు నిఖిలాకాశంబులవలన నఖిలదేవతలవలన సకలపార్థివులవలన సమస్తపరిపంథులవలన నీకెప్పుడును విజయంబు సమకూరుంగాత నాచేత నర్చింపంబడుగురుసోమసూర్యధనదయమప్రభృతులు నిన్నుఁ బ్రోతురుగాత వాయుధూమంబులు ఋషిముఖచ్యుతమంత్రబులును భవద్వశంవదంబులై యుపస్పర్శనకాలంబున నిన్ను రక్షింప వీక్షసేయునవియు యవుంగావుత సర్వలోకప్రభువగు బ్రహ్మయు భూతభర్తయు

మఱియు మహితులగు మహర్షులును మిగిలినయెల్లజేజేలును వనవాసివగు నిన్నుఁ
గాపాడుచుండుదురుగాత మని రక్షావిధానంబు గావించి శ్రీమించు వేలుపుల
మొత్తంబులకు నత్తమిల్లి పదంపడి యప్పతిదేవతావతసంబు. ౩౮౪

ఆ॥ సురభిగంధమాల్య ♦ సుమహితసుమములు, తదనురూపనుతిని ♦ తతులు వెలయ
నర్చనల నొనర్చె ♦ నమరలోకంబెల్ల, నమరఁ దత్పరత్వ ♦ మందుచుండ. ౩౮౫

చ॥ జ్వలననిభుండు సంయమివి ♦ శారదుఁ డొక్కద్విజుండు హోతగా
జ్వలనముఖంబ మర్చుకొని ♦ సంస్తుత రాముని కెప్డుమంగళం
బలవడుఁగాత మంచు ఘృత ♦ హవ్యసమిత్సితసర్షపాచ్ఛపు
ష్పలలితమాల్యముఖ్యములు ♦ చయ్యన వేల్చె సమర్త్యు లుబ్బఁగన్. ౩౮౬

ఆ॥ శాంతిహోమ మట్లు ♦ జరిపి హవ్యావశే, షంబు సదధిమధుఘృ♦ తంబు సాక్ష
తంబు గాఁగ బలివి ♦ ధానం బుపాధ్యాయుఁ, డెఱిఁగి తఱి నొనర్ప ♦ నిచ్చ మెచ్చి.

క॥ సంపూర్ణదక్షిణల నా, సంపూజ్యన కొసఁగి స్వస్తిఁ ♦ జదువుద్విజులు న
ట్లింపునఁ దేలఁగఁ దోడ్తో, సంపన్నులఁ జేసె మేలి ♦ సౌవర్ణములన్. ౩౮౭

క॥ ఆసచ్చరిత్రి యమ్మెయి, భూసురసురలోకతృప్తిఁ ♦ బొనరించి కలా
భాసురయై రఘురాముని, శ్రీసముపాత్తజయుఁ జేయు ♦ సిరి తనరారన్. ౩౮౮

సీ॥ మంగళం బమరర్షి ♦ మాన్యుఁ డింద్రున కెద్ది, వృత్రనాశంబున ♦ వెలయనయ్యె
మంగళం బదితి య ♦ మర్త్యుల కిడె నేది, యంభోధిఁ దరువంగ ♦ నరుగునాఁడు
మంగళం బురగారి ♦ కిం గూర్చె నెది మాత, సుధ దేర సురపురి ♦ సొచ్చునపుడు
మంగళంబు త్రివిక్ర♦మక్రమంబున హరి, గాంచె నెయ్యది త్రిలో♦కములు వొగడ
మంగళం బది యెల్ల ని ♦ న్మలయుఁ గాత, మంగళాలయ పొత్తున ♦ మనెదుగాత
మంగళాంగసమృద్ధి స ♦ మస్త సర్వ, మంగళావిభుఁ డర్థిన ♦ మర్చుఁగాత.

తే॥ అంబుధులు ద్వీపములు సక♦లర్తువులును, దిశలు లోకము ల్వేదము♦లిష్టములును
మంగళంబులు నీకొస ♦ గంగ నగుచు, ననుచు కూరిమి నిన్నెద్దు ♦ మనుచుఁ గాత.

మ॥ అనుచు న్సేసలు శీర్షమం దునిచి యొ ♦ య్యన్మౌళిగంధంబులన్
దనయు న్మేనునఁ జక్కఁగా నలఁది సి ♦ ద్ధార్థాఖ్య నొండోషధిన్
ఘనపుణ్యాకృతియా విశల్యకరణి ♦ న్గావించె రక్షావిధిన్
జనసన్మానిత యిష్టమంత్రజపని ♦ ష్ఠాపారతంత్ర్యంబునన్. ౩౯౧

తే॥ లోనిదుఃఖంబుఁ బైకి రా♦నీని తెఱఁగు, గొంచు వత్సల తనదగు♦కూర్మి నెఱయ
సజ్జమానవచోమాత్ర♦సక్తమైఁ బ్ర, హృష్టయై యిట్టులనియెఁ బ్ర♦హేలికాఢ్య.

సీ॥ గంటికే కెల్లసం ♦ కల్పము ల్ఫలియింప, నభ్యుదయుంబుతో ♦ డగుచునుండ
రాజమార్గంబున ♦ రాణమై నరుదెంచి, పూర్ణచంద్రానన ♦ స్ఫురణ వెలయ
భద్రాసనం బెక్కి ♦ ప్రతిభమైఁ దనరారు, నిన్నుఁ గన్గొందు నా ♦ యన్న తీర్ణ
గుమసంగరుండవై ♦ కోవిదు ల్మెచ్చంగ, రారమ్ము నెట్టన ♦ రాజవదన

ముగ్ధ ముగ్ధాక్షి వధువు నా ♦ ముద్దుమొలక
నీదుచెంగట మెలఁగుచు ♦ నీవు వనుపఁ
జెలఁగుచు బహూకరింప నా ♦ సిరులఁ గనులఁ
గాంచుచు నిదానమునఁ బ్రమో ♦ దించుదాన. ౩౫౪

తే॥ శివుఁడు శివ వేల్పులు మహర్షి ♦ శేఖరులును
సకలభూతమ్ములును నని ♦ శమ్ము శమ్ము
నీకుఁ గూర్తురు నాచేత ♦ నిచ్చ లర్చ్య
మానులగుచు సదామోద ♦ మానులగుచు. ౩౫౫

క॥ నాశౌనరించిన పున్నెము, లోపి శుభోదయములెల్ల ♦ నొడఁగూర్పఁగ నా
ప్రాపై జనముల ప్రోపై, యాపై నీరాక హృద్గ ♦ తార్తిఁ దొలంచున్. ౩౫౬

తే॥ అనుచు స్వస్త్యయనం బట్టు♦లాచరించి,యశ్రుపరిపూర్ణలోచన♦యగుచు రాముఁ
జుట్టి శిరమున మూర్కొని♦సారిది గ్రొచ్చి, ననుచుకూరిమి నాలింగ ♦ నంబొనర్చి.

క॥ ఆనందనావహిత యు, ట్లానందను మోము గాంచి ♦ యానును జెక్కి
ళ్ళాని పుణికి పరవసమున, నానెరి గద్గదిక దోఁప ♦ నటునిటుఁ గనుచున్. ౩౫౮

తే॥ పోయిరమ్ము వైశమ్మన్నఁ ♦ బుట్టి కొంత,పుట్టకయు కొంత నేర్చిన ♦ ప్రోడవాఁడు
మాతృచరణారవిందము♦ల్మొలయఁ గనుల,నద్దుకొని ముద్దుకొనునామె♦నాదరించి.

—♦ శ్రీరాముండు సీత నగరి కరుగుట ♦—

క॥ ఆమంత్రణపూర్వకముగ, నామాన్య స్వీడుకొంచు ♦ ననుజుఁడు తోడన్
రా మహిజాసదనమునకు, రామమహీజాని చనియె ♦ రాజీవదృశా. ౩౬౦

ఆ॥ ధర్మమార్గమార్గ ♦ తత్పరు రాజవి, రాజమాను రాజ ♦ రాజతనయు
రాజవీధిపట్టి ♦ రాఁ గాంచు నప్పుడె, హృదయమథన మొదవె ♦ నెల్లరకును.

క॥ వైదేహి యపుడు పరమా, మోదం బెసలారఁ దనదు ♦ ముచ్చటలకు మ
ర్యాదలకు సరిగ జయాసం, పాదివిధు ల్గూర్చి భర్తృ ♦ భావితవృత్తిన్. ౩౬౧

ఆ॥ రాక వేచియుండ ♦ రాజచిహ్నవిహీన, భావమునకుఁ దనదు ♦ భావవికృతి
తోడుసూపఁ దోడు ♦ తోడ నెదుర్పడి, యాతఁ డపుడు కనుల ♦ కందుటయును.

క॥ పాదములు గడిగి శుభసం, పాదకములు తజ్జలములు భవ్య ♦ శిరసునం
దాఁదాల్చి యర్చలిడి మదిఁ, దాదాత్మ్యకకలన లెంచి ♦ తద్దయుఁ బలికెన్. ౩౧౮

సీ॥ నీముద్దుమోముతో ♦ నెఱయ నెక్కొనదేమి, శతశలాకము సిత ♦ చ్ఛత్రరాజ
మిందుహంసనిభంబు ♦ లించుచామర లిరు, క్రేవలొందవి దేటి ♦ కృపణవృత్తి
నాల్గువేదము లట్లు ♦ ననుచువాజులతోఁ బ, రఁగుపూలతేరేల ♦ రాజ్ఞ ముందు
శ్రీమంతమై నీదు ♦ సిరి దెల్పు మదహస్తి, కాన్పింపమికి నేది ♦ కారణంబు
చుట్టి వీరులు పఱతేర ♦ సురుచిరము శుభాసనము దెచ్చియిడ రెంత ♦ యాగడంబు
రాజుఁ జేయరె నిన్న బా ♦ ర్హస్పతంబు, పుష్యభము నేఁడు శశితోడి ♦ పొం దెడలెనె.

తే॥ ఒంటిఁ జనుదేర నెది యిట్టు ♦ లొంటదయ్యె, వందిమాగధు లేమైరి ♦ వాద్యములకు
మూఁగతన మేమిటికి వచ్చె ♦ మొద్దువడెనె, ప్రకృతిమండలసామంత ♦ పౌరవితతి.

తే॥ పుణ్యతీర్థోపహితములు ♦ పూజితములు, రసము లొలికింపరే నీకు ♦ రమ్ముపైని
నాదునోముల నొక్కింత ♦ నయము సెడెనె, చెంగటం గమకింపనో ♦ సిరికి నేఁడు.

క॥ మున్నెన్నఁడులే దీవిధ, మున్నేయముగా దొకొంత ♦ నోజస్వితయున్
సన్నయయి కానుపించెడు, సన్నాహం బెదియొ తెలుపఁ ♦ జనుఁ బ్రాణేశా.

క॥ అని తత్తఱపాటునఁ ద, న్ననునయ మొనయంగ నడుగు ♦ నంగనఁ గని యి
ట్లనిపలికె నపుడు రఘునం, దనుఁడు నిజప్రౌఢి వెలయ ♦ దయితామణితో. ౩౧౯

తే॥ గొప్పకొలమునఁ బొడమితి ♦ కోవిదమణి
యనఁగఁ దనరితి ధర్మజ్ఞ ♦ వైతి ధర్మ
చారిణివి నీకు వినిపింపఁ ♦ జనదె యెదియు
వినుము పొడమినయావెడ ♦ విధము దెలియ. ౩౨౦

—♦ రాముఁడు వనవాసప్రసంగము సీతతో వివరించుట ♦—

ఆ॥ అనువుపడియె నిపుడు ♦ వనమునరాజ్యంబు, నాకు భరతుఁ డిచటు ♦ నకు విభుండు
తండ్రియానఁ జేసి ♦ తరలంగ నయ్యెను, దనకు నింతమాత్రఁ ♦ దనకపలదు. ౩౨౧

క॥ ఆసన్నం బభ్యుదయం, బాసన్న స్వీడవలసె ♦ నంగనరో చే
రాస న్నవయఁ జనదు విధి, యాసన్నతపదుప్రతిజ్ఞ ♦ నధిగతమయ్యెన్. ౩౨౨

ఆ॥ దాఁపసేల తెలిపె ♦ దను మున్నె పినతల్లి, వరయుగంబు విభుని ♦ వలనఁ బడసెఁ
గోరె నిపుడు మేలు ♦ కొఱకుఁగా యత్నించు, వార లెందుఁ దమప్ర ♦ వర్గమందు.

క॥ పదునాలుగేండ్లు కానన, పదవిన్ వర్తించువాఁడ ♦ భరతుఁ డయోధ్యా
పదముం బాలించెడు నా, పదలెల్ల స్వీడుఁ బిదపఁ ♦ బంకజవదనా. ౩౨౪

ఆ॥ సత్యసంగరుండు ♦ జనకుం డతనియాజ్ఞ, నెఱపవలదె యిదియు♦ నేఁడ పాడమె
నే తలంగ కెపుడు ♦ నిక్కాలంబునవారు, తండ్రిప్రతినఁ దీర్పఁ ♦ దలఁచువారు.

క॥ మునివేషధారినై నే, వనమునఁ జరియింతు స్థిరతఁ ♦ బాటింపుము నేఁ
జెనయంజన్ము నచ్చోటు నా, కనువర్తింపుము గురూత్త ♦ మారాధనలన్. ౩౨౬

తే॥ అత్తమామలశుశ్రూష ♦ లనయమును న
యమ్మ మీఱంగ నెఱపు మ ♦ ధ్యక్షుఁ డగుట
భరతుఁ బ్రేమాల నాగానములు ♦ ప్రస్తుతింపఁ
బోకు మది తగ దలలు ప్ర♦ భుప్రకృతులు. ౩౨౭

క॥ ప్రకృతులయేనియుఁ బోషణ, సుకరప్రజలేనియుం బ్ర ♦ సూనసమేన
ప్రకృతుల ననువర్తనమున, వికృతిం బెరయంగనీక ♦ వెలయుదు రెపుడున్. ౩౨౮

తే॥ వారిపోషణమున నుండ♦వలయుఁ గాన, నది యననుకూలవృత్తి శ♦క్యంబు గాదు
రాజొసఁగె నాతనికి యావ♦రాజ్యమింత,దలఁచి మెలఁగంగనగుఁ గూర్చు♦దారిసేరి.

క॥ కులమునకు దేశమున కి, య్యిలకునుఁ బ్రభుఁ డతఁడు గాన ♦ నేవేళను న
వ్వలనునఁ గూడదు విప్రియ, మొలయింపఁగ నేర్చిమెలఁగు ♦ ముదురాజముఖీ.

క॥ ఆరాధించుచు శీలము, తోరముగాఁ గొలుచువారి ♦ దుఃఖము లెడపం
గా రక్షింతు రొరుల ని, స్సారింతురు నృపతు లెపుడుఁ ♦ జందనగంధీ. ౩౩౧

తే॥ అహిత మొనరించువారల ♦ నౌరసాత్మ, జులనయేనిఁ ద్యజింతురు ♦ చోద్యమనక
పరులనేని హితార్థులఁ ♦ బట్టి విడరు, స్వార్థరతు లెప్డు నృపతు ల ♦ బ్జాయతాక్షి.

సీ॥ ప్రొద్దుప్రొద్దునవేగ ♦ నిద్దుర మేల్కాంచి, కాల్యంబు లైనయ ♦ క్కఱలు దీర్చి
యిష్టదైవతపూజ ♦ లెలమిమై నెలయించి, నాతండ్రి కభివంద ♦ నం బొనర్చి
కోసలాత్మజ నల్లి ♦ కొలిచి యాయమకష్ట,దశలెంచి తాపంబు ♦ దలఁగఁ గాంచి
యుపచరింపుము కూడి♦యుండుము మదుపమా,తలకు నవ్విధిని స♦త్కారములను

నడుపఁజూడుము నాకయి♦నవసి చెడకు, మిహపరప్రాప్యధర్మమం ♦ దిమ్ముగనుము
కొలఁదికాల్ల మరుగ నీదు ♦ కోర్కులెల్ల, నెఱపువాఁడ నిచటుసేరి ♦ నీవు మెచ్చ.

ఆ॥ భాగ్యతృప్పుత్రసమత ♦ భరతశత్రుఘ్నులఁ, గాంచు మెపుడు నాకుఁ♦గలికి; కూర్తు
రెలమి మీఱఁ బ్రాణ ♦ ములుగ నవ్వారల, నెంతు నింతయును ని ♦ రంతరంబ.

ఆ॥ కానఁ దెల్పవలసెఁ ♦ గాన కే నరిగిన, సత్యధర్మసంప్ర ♦ శస్తులమర
నన్వయంబుస్థితి స ♦ మర్థింపు మన్నిట, నెఱుకగలవు నిలుపు ♦ మేణనయన.

—♦ సీత తన యభిప్రాయంబు రామున కెఱింగించుట ♦—

చ॥ అనుప్రియుపల్కు లారసి ప్రి ♦ యార్హ ప్రియోచితభాషణప్రశ
స్తినిరత హార్దముం బెరయు ♦ చెల్వునఁ జెల్వగునల్క చెల్వపై
నెనయఁగఁ జేరి యిట్లనియె ♦ నిట్లన నేలొకో యెనెఱుంగనిం
తనియనరాని హైన్య మప ♦ హాస్యముఁ జొప్పడనైన చొప్పునన్. ౩౮౬

తే॥ వీరు లధిపీను లఖిలాస్త్ర ♦ విదులు నైన, రాజపుత్రుల కిమ్మోయి ♦ రాదు నొడువ
నలఁతిగ ననర్హ మయశస్య ♦ మనుపయుక్త, మట్టు లశ్రవ్యమునుఁ గాఁగ ♦ నాడితధిప.

క॥ వీరుఁడ వనుమాటయె కా, దీరేడుజగంబు లేల ♦ నెఱుఁగుదు విపుడీ
సారరహితవాఙ్మయము ప్ర ♦ చారం బేసుని తలంచి ♦ సమకూర్చితివో. ౩౮౭

ఆ॥ ఆర్యపుత్ర; యయ్య ♦ యమ్మ సోదరులు లాత్మ
జులు స్నుషాదు లెట్టి ♦ చుట్టములును
ననుభవింప నేర్తు ♦ రాత్మీయమగుకర్మ
మెంత లంతవట్టు ♦ నెలయుఫలము. ౩౮౯

ఆ॥ భర్తృభాగ్యగతికి ♦ భార్యయొక్కర్తు గా, కన్య లెవ్వ రింక ♦ నలముకొనఁగ.
నిన్నె పొమ్మనంగ ♦ నేను నందునచేరి, యున్నదాన నెదియు ♦ నోర్చుదాన. ౩౯౦

తే॥ కారు తలిదండ్రు లాత్మజు ♦ ల్గారు తనదు, భాగితలు సఖీజనము లెల్ల ♦ బాంధవులును
గారు సు మ్మిందునందును ♦ గతియనంగ, బతి యొకఁడ కాక యెటు లేని ♦ బడతుకలకు.

ఆ॥ నేఁడ యడవిద్రోక్క ♦ నిక్క మెంచితివేని, ముందు నేను నడిచి ♦ ముండ్లు ద్రాలుఁ
గుశలుఁ దలఁగఁ ద్రోచి ♦ కూర్చెద నీమేలి, యడుగు లెందుఁ గష్ట ♦ మందకుండ.

ఆ॥ పీత శేషములఁ గృ ♦ పీటంబులం బోలె, నీసు రోసమును బ ♦ హిష్కరించి
నన్నుఁ దోడుకొని చ ♦ నంగ నెంచు మొకొంటఁ, బాప మెఱుఁగ నిట్లు ♦ పట్టివిడువ.

తే॥ ఆకసంబునఁ బుడమి వ ♦ నాంతరమున, హర్మ్యమున నెందు నేనియు ♦ నబల కెపుడు
భర్తృపాదతలచ్ఛాయ ♦ ప్రక్కబ్రదుకు, బ్రదుకునకు సరియే యింద్ర ♦ పదవియైన.

క॥ మున్నే తల్లియుఁ దండ్రియు, నెన్ని తెలిపి కనుచుచుండి ♦ యెన్నియొ నీతుల్
కన్నది యని కానని దని, యున్నదె నేఁ డొకఁడు నెఱపు ♦ యోజన తక్కన్.

తే॥ ఏను నీతోడ దుర్గమం ♦ బైనవనము, సొచ్చెద వసించెదను నిచ్చ ♦ సుఖతరముగఁ
దండ్రిగృహమేని నటుజగ ♦ త్త్రియమయేని, దలఁపఁ జుమ్ము పతివ్రతా ♦ ధర్మమంసి.

క॥ నియత నయి బ్రహ్మచారిణి, నయి నే శుశ్రూషమాణ ♦ నయి నీతోడన్
నయమున మెలఁగుదుఁ బుష్పం, ధయకీర్త్యము లగులతాప్ర ♦ తానతలములన్.

సీ॥ ఇంతకన్నను మేటి ♦ సంతసం బనరాదు, నీతోడిగమనంబు ♦ నిశ్చితంబు
కాదనంబో రెట్టి ♦ ఘనులేని నిద్దాని, ననమర్థతయును నా ♦ యందు లేదు
నిన్నుఁ గాఁచియపెట్టు♦నెటికి నేఁ జోరఁబాఱ, ఫలమూలములఁ దీర్తుఁ♦బ్రాశనంబు
గాననంబుల మెలం♦గఁగఁ గాంక్షయుం గద్దు,భవదీయభుజగుప్తి♦భయమొదవదు

నాథ; నాముద్దు చెల్లించు ♦ నయముకాని
యొండొకొండు గొఱంతయుం ♦ దుండ దరయ
భువనపాలనకలనాప్రవ ♦ బుద్ధునకును
దనదుభార్య భరింప నా ♦ తగవు సెడుగె. ౩౯౮

ఆ॥ అల్పకాల మిదియు ♦ నగునె యొక్కఁడు లెక్క, యెన్నివేలయేండ్లు ♦ నేని నీదు
పాదసేవనమునఁ ♦ బరఁగుదు వనము భ, వనము గాఁగ నింత ♦ వట్టు నిజము.

క॥ వానరవారణముఖమో, గాననయనము దనరువనము ♦ నంది త్వదీయం
బౌనయమునఁ వర్తించెద, నేనాఁడును నొండుదశల ♦ నెంచనివేడ్కన్. ౪౦౦

క॥ నీపాదనియతసేవం, బాపోత్సాదన మొనర్చు ♦ భంగి కలరువి
ద్యాపారంగతు లెంతురె, యేపట్టుననేని స్వర్గ ♦ మిది యది యనుచున్. ౪౦౧

చ॥ నదులు నదంబులు న్బహువ ♦ నంబులు హంసబిరంసికారమా
స్పదములు వట్పదప్రతతిర ♦ నస్తుతము ల్సరసీవరంబులున్
బొదలుచుఁ గాంచి పొంగెదఁ బ్ర ♦ భుత్వము నీయదె యంచు మెచ్చుచున్
వదలక నిన్ను గొల్చి మను ♦ వారలకెల్ల నభీష్ట మిచ్చుచున్. ౪౦౨

తే॥ నీవు నాథుండవై యుండ ♦ నేర్చి బ్రదుక, నేరనే గిరికందరా ♦ నిర్ఝరములఁ
బుణ్యతరుచత్వరంబులఁ♦బూవుటీర,ముల మొలకనవ్వు లొలుకునీ♦మోముగనుచు.

క॥ నాయాచితంబు సఫలము, సేయు మనన్యానుషక్త ♦ జీవిత నిరతన్
నాయాన యాన యిడుమో, నాయక నాయఁకరఁపుంబ్ర ♦ ణాలిక వెలయన్.

క॥ గారవము నెఱపుమో రఘు, వీర; లఘుతఁ దలఁగఁ గనుము♦వెర వరయుము వా
క్సారముఁ గొను మింతకు నే, నేర మిగులఁ బలుక మైత్రి ♦ నిరతిఁ దలఁపుమీ.

క॥ అని కన్నుల నీరొలుకఁగఁ, దను వేఁడెడు దయితతలఁపు ♦ దలఁచియుఁ దా ని
ట్లనె రాముఁడు వనవాసం, బున కష్టము లెన్నుచుం బ్ర ♦ భూతరసోత్కట.౪౦౬

—♦ రాముఁడు సీతకు వనవాసక్లేశంబు లెఱింగించుట ♦—

తే॥ మంచికాలమునఁ బొడమితి♦మానసంబు,మేను నమ్మెయి మార్దవం♦బూనియుండు
నవియు నొవయంగఁ జనవు వ♦నాంతరమున,కలుగుసిలుఁగుల వగసెడి♦కంబుకంఠి.

ఆ॥ ఏన యడవిపనుల ♦ నెల్లమైఁ దీర్పంగ, నేర్తుఁ గాన నొంటి ♦ నెకొ్కనంగ
నెంచినాఁడ నాతఁ ♦ లంచుజాడనె ధర్మ, మిందు నిలిచి నడుపు ♦ మిందువదన.

క॥ తెలిపెద బహుదోషము వన, మలఁతిగఁ బోఁబోదు తెల్ల ♦ మది నామదిలో
నెలకొనినది కృతబుద్ధిని, వల నరయం గనుము తగని ♦ వర్తన మేలా. ౪౦౯

సీ॥ గిరినిర్ఝరంబుల ♦ గిఱికొనుసింగము, ల్పృబలి నిర్ఘాతో్గ్ర ♦ భంగి నఱచు
మదమత్తములు మహా♦మాతంగములు నొంటఁ, గవియుమానుషగంధ♦గతుల నెంచి
క్షణపూర్ణసలిలలై♦చనుదెంచుఁ బయిపయి, నేంక్లు పూంక్లును నెల్ల♦యెడలు దఱిసి
లత లల్లుకొని క్రేవ ♦ లంగ్రమ్ముఁ గంటక, వ్యాప్తదుర్గమమార్గ ♦ వర్తనమున
నుబ్బలి గుదించు నొక్కచో ♦ నూషరమ్ము
పాలుపడు నొక్కదెస నొంటఁ ♦ బలుగుఱాలుఁ
గోమలాంగివి నీవిట్టి ♦ కొఱఁత లాదవ
నొక్కయెడు గెత్తి యిడనైన ♦ నోపఁ గలవె. ౪౧౦

ఆ॥ తిరిగితిరిగి భుక్తి ♦ దీర్ప నొక్కటిలేక, పండుటాకులందుఁ ♦ బవ్వళించి
నీరుముట్టనైన ♦ నెఱిగాన మనుతఱి, నేమనంగలావొ ♦ యెంచికొనుము. ౪౧౧

తే॥ సీత ; శీతలజలములఁ ♦ జిల్లులుపడఁ, బ్రొద్దుప్రొద్దునఁ గ్రుంకంగఁ ♦ బొటమరించి
మేను వడఁక నావలనిదా♦మేలు దలఁచి, సంతసింపంగ వలయు నా♦జాడఁ గనుము.

తే॥ ఓసు కేశి ; జడల్దాల్చి♦యొక్కప్రొద్దు, లుండి పులుఁగుల తెఱఁగున♦నొదిఁగి మెదిఁగి
శీతవాతాతపంబులఁ ♦ జిక్కపడెదు, నవ్వ డేరీతినాభాగ్య ♦ మరయుదొ్కొ్క.

తే॥ పాములునుఁ దేళ్లు నీఁగెలు♦దోమ లొండు, కీటములు గ్రొచ్చి మేనికిఁ♦ గీడొనర్ప
నాలనము పాలనము సేయు ♦ నట్టివారు, లేమి కేమి ప్రతిక్రియ ♦ లేమ; కనెదొ.

ఆ॥ కటికిచీఁకటిగతిఁ ♦ గారురాకాసుల, బారిఁబడెడునట్టి ♦ భంగి నడవి
చిచ్చుముట్టుకొనెడు ♦ చిక్కన నెకొ్కనఁ, జాలవీవు నిలువు ♦ బాల; యిచట.

ఆ॥ కడుపు గట్టుకొనియుఁ ♦ గాదన కతిథులఁ, బూజసేయవలయుఁ ♦ బ్రొద్దువోవు
నంతకును మెలంగనగుఁ ♦ గర్జముల వెంట, నోలమాసగొనక ♦ యొర్తు వెట్లు.

ఆ॥ మానలోభములను ♦ మలఁచి కాయక్లేశ, మెన్న కెపుడుఁ దపము ♦ నేర్పఱించి
భయముఁ బాసి నిలువ ♦ ఫలియించు వనవాస, మింత సేయనొదె ♦ యేణనయన.

క॥ అంతిపురికోమలతోడఁ, సంతస మొప్పార మెలఁగు ♦ జాడయ తక్కఁ
గొంతి యిడుమపడువారల, శొంతం జని మెఱుఁగ వింత ♦ పున్నెంబునకుఁ. ౪౧౮

తే॥ కాన నాయాన కొకఁ డన ♦ కానయమున, న త్తమామలమేలుకీ ♦ ళ్లరసికొనుచు
గారవంబున మెలఁగు మీా ♦ కానితలఁపు,గొనకు మేవచ్చితీర్తు నీ ♦ కొఱఁతలెల్ల.

క॥ అన బాష్పజలాపూర్ణన, యనఘై పతిమోము గాంచి ♦ యనవద్యరసా
వనలీల దనర నిటులనెఁ, దనగుణసంపత్తి యతనిఁ ♦ దనుపునఁ బేర్వన్. ౪_౨౦

—♦ సీత రామునితోఁ దనకు వనవాసము సుఖప్రదం బని యుగ్గడించుట ♦—

సీ॥ ఎవ్వి దోసములంచు ♦ నెఱిఁగించి తవి యెల్ల, గొనములౌ నీకూర్పు ♦ గోపనమున
గాచు రాకాసులఁ ♦ గారించుత్వత్తేజ, మరసి నిల్వ మొకంబు ♦ లనఁగ నెంత
లధిప; యదృష్టపూ ♦ ర్వాకృతి నీయది, యెవ్వారితలఁపుల ♦ నిరవుకొనదు
భవదంకపాళిసం ♦ భావ్యనౌ నను గన్ను, లెత్తి కాంచఁ గలాడె ♦ యింద్రుఁడైన
గురుజనానుజ్ఞఁ గొంటివి ♦ కూడదనక, నన్ను విడనాడుమనియెదు♦ నయము దానఁ
గలదె నినుఁ గూడి వచ్చెదఁ ♦ గాదటన్న, మేను దలఁగెడుపనికన్న ♦ మించ నగునె.

క॥ అక్కృతాత్ముల కిట్లనినది, సకలంబును సంభవింపఁ ♦ జనుఁబో యడవిన్
బ్రకటప్రభావుఁడవు నీ, కకటా దొసఁ గగునె తగవె ♦ యార్తుల మనుపన్. ౪_౨౨

చ॥ జనకునిమందిరంబున ద్వి ♦ జప్రవరు ల్ననుగాంచి పల్కి రి
య్యనువరి కానకేగుఁ బతి ♦ యంకముఁ బాయ దటంచు నొక్క యో
గిని యటు తేర్పడ న్నొడివెఁ ♦ గీర్తిత మాజనయిత్రిమోల నే
విని నిను వేఁడికొంటి నొక ♦ వేళ వరంబుగ నిట్టియర్థమున్. ౪_౨౩

క॥ పెద్దలు దెలుపఁగ వింటిన్, దద్దయు రామాయణముల ♦ తత్త్వంబెల్లన్
ముద్దియ సీత విడిచి చనె, నద్దైవతమూర్తి రాముఁ ♦ డన విన నెందున్. ౪_౨౪

తే॥ ఇన్ని యిటులుండ నీచెల్మి ♦ కెడపడంగ
నెట్టులయ్యెదఁ బతిఁబాసి ♦ యెందునేని
బ్రిదుకునే సతి యపలాప ♦ భంగి కేల
తొడరి తవ్విధి యొక్కింత ♦ తోఁచబడదు. ౪_౨౫

ఆ॥ కాన నాన వెలయఁ ♦ గా నరుదెంచెదఁ, గాననమున కీవు ♦ గదలిచనఁగ
నిన్నుబోల నేను ♦ నెఱపెద నవ్వారి, సత్యవాక్ప్రసక్తి ♦ చక్కఁబడఁగ. ౪_౨౬

తే॥ నీకు గురులిడ్డయానతి ♦ నేర్మి నరయ, నన్వయింపదు నాకెట్టు ♦ లర్థమూర్తి
కిల సహోప్తినివృత్తుల ♦ యెలయుచుండు, సన్నియోగవిశిష్టులౌ ♦ జనుల కనఁగ.

క॥ లావరివి శూరుఁడవు నీ, తో వనవాసంబు నెరపి ♦ తుష్టిం గనఁగా
నొ వెర వబ్బెను వీడఁగ, నావిధమున వనిత కెందు ♦ నాయం బగునే. ౪_౨౭

తే॥ నిత్యశుశ్రూష లొనరించి ♦ నిర్మలాత్మ, నాదుఁ బతిదేవత యనంగ ♦ నైన నేను
నన్ను నీకిడె నాతండ్రి ♦ నాకలోక, మందు నిందును గతి నీవ ♦ యనియు కాదె.

ఉ॥ ఏమని మేలుకీడులను ♦ నెక్కటినై సమనై సువృత్తనై
దీమసమంచులేక నిను ♦ దేవునిఁగాఁ బరికించు నన్ను ని
ట్లామయ మందఁజేసె దగు ♦ నా; తగునా; పతిఁబాసి యన్యులన్
నేమము వీడి కొల్చుసతి ♦ నిక్కమ పల్కుము ధర్మసారమున్. ౪౩౦

తే॥ తప్పు నాయది యని మీఁదఁ ♦ దలఁపరాదు,నిన్ను బాసినమే నెట్లు ♦నిలువఁబోదు
నిజమ పలికితిఁ బ్రాణేశ;♦నెఱియెఱింగి,నన్నుఁ గొనిచనుమదె ♦నీకు♦నాకుహితము.

మ॥ అని విస్పష్టముగాఁగ బల్కునతి నె ♦ య్యం బెంచియున్ స్వాత్మనీ
ననయుం గెట్లును మెచ్చుకున్న నభిమా ♦ నం బాదరాసత్తియున్
జనవు న్నెట్టన దోఁప నిట్లనియె నా ♦ సాధ్వీవతంసంబు సాం
త్వనము ల్వల్కుచు పీడనెంచు పతిచి ♦ త్తస్థైర్య మూహించుచున్. ౪౩౨

—♦ సీత రామునితో మర్మోద్ఘాటనం బొప్ప మాటాడుట ♦—

తే॥ తలఁపఁడా యేమి రామ; నా♦తండ్రి జనకుఁ,డాయశోనిధి మిథిలాధి♦నాయకుండు
స్త్రీ పురుషవిగ్రహంబయి♦సిరికిఁగూర్చె,ననుట జామాత తనకెటో♦యబ్బెననుచు.

తే॥ అకట; యజ్ఞానమున జనం♦బాడికొనఁగ,నయ్యో నన్నృతంబయైన నే♦మనఁగవచ్చు
నాతపనుఁడో దివాకరు ♦ నందునట్లు, రాము దెసఁ దేజమే యన ♦ రాదటంచు.

ఆ॥ ఏమి తప్పుసేసి ♦ తే వెంట భయము నీ, కొదవెఁ దెలుపు మిట్టు ♦ లొదుఁగ నేల
దేనిఁగూర్చి తనదు ♦ తేఁకువ సెడనన, న్వాప్య నన్నువీడి ♦ యలఁతిపడెదొ.

క॥ మున్ను ద్యుమత్సేనాత్మజు, నన్నియతిన్ సత్యవంతు ♦ ననుగత యగుచున్
బన్నము దలఁగిన సావి,త్రి న్నను నొక్కఁడుగఁ దలఁపు ♦ ధీవర్తనలన్. ౪౩౬

క॥ నిన్నువినాగా నన్యునిఁ, గన్నులనైనం గనంగఁ ♦ గా నెవ్విధియె
ట్లున్నను ననుఁ బ్రాకృతగా, నెన్నెదవే యెడసి యుండు ♦ నే యెపుడేనిన్. ౪౩౭

తే॥ ఉరకఁ గౌమారి సతి చిరా ♦ ధ్యుషిత భార్య
నిట్టిన న్నొడ్లపాల్సేయ ♦ నెంచె దెట్లు
పాపి శైలూషు నట్టులు ♦ పట్టువిడిచి
చనఁ దలంచిన యన్నెరి ♦ చాలకున్నె. ౪౩౮

తే॥ ఎవనిపథ్యంబ కోరితి ♦ వెవనియర్థ
మెంచి యిట్టినిరోధంబు ♦ నెనయఁ గాంచి

తతనిదెస పశ్యతయు విధే ♦ యతయు నెఱపు
మనఘ; యది పోలుఁగా కేక ♦ దర్ధ మేల. ౪౩౯

సీ॥ కలికుతాలును ముందుఁ ♦ గల్పప్రదేశమ్ములు, య్యాడుగుమడుంగుల ♦ ననువుపఱప
శాద్వలంబులె దర్భ ♦ శయనంబులే మించు, మెత్తనిసెజ్జల ♦ మేల్మినూప
నుద్వేలవాతస ♦ ముద్ధూతములు పరా, గము లంగరాగసం ♦ గతికిఁ గాఁగ
నీ తెచ్చియిచ్చిన ♦ నీరకందఫలాదు, లమృతాశనవిధాన ♦ మావహింప
నిన్నె కూడివత్తు ♦ నీతోడిదే లోక, మేపథిశ్రమంబు ♦ లెట్టిగొడవ
లెన్నఁబోను నీదు♦హితమె కాంక్షింతు న, న్నాదరమునఁ గొంచు♦ నరుగు మధిప.

క॥ ఏవిప్రియ మెటులేనియుఁ, గావింపఁ ద్వదుక్తి మెలఁగ ♦ గా నేర్తు నసం
భావహిలు వెతలడఁగు నై, రావణగామినసమ దుర్భ ♦ రనె యే నీకుఁ. ౪౪౧

శా॥ సంతోషంబున మించు మానుడులమే ♦ ల్చర్చింపు మెుండొక్కకీ
లెంతున్నాకుము పుట్టినింటిబలఁగం ♦ బెట్లుండెనో యంచు భా
వింతేమో యనఁబోకు మేవిధుల నే ♦ వేళన్ స్వకీయాంఘ్రిప
ద్మాంతర్వృత్తియె వృత్తి దీనికని య ♦ య్యర్థంబు మానింపుమా. ౪౪౨

ఆ॥ ఇన్నిమార్లు దెలుప ♦ నేల నిన్నాసి నే, శోకమోహములవి ♦ పాకమునకుఁ
దాళఁజాల నంత ♦ దనుక నిమ్మోనుండ, దనిన భావితత్త్వ ♦ మరసికొనుము.

క॥ పదిమూడునొకఁడునేండ్లు, య్యాది యిది యని యెన్న నేల ♦ యరగడెయు న్ని
న్వదలి మన నింతనిక్కము, పదరనిమది నూహసేయు ♦ పద్ధతిఁ గనుమా. ౪౪౪

—♦ సీత విషణ్ణ యగుట ♦—

చ॥ అని తెగఁబల్కి శోకరస ♦ మగ్నవులై వడిఁబాఱఁ గాకలీ
ధ్వని నెగడొంద నుత్కలిక ♦ దార్కొనఁ బేర్కొని నాథ ; దీనినే
మని విడఁజూచె దంచుఁ గది ♦ యంజని కంఠనిషక్తబాహుబం
ధన యయి లేమ బిట్టడలెఁ ♦ దత్పరుఁడై పతి తల్లడిల్లఁగన్. ౪౪౫

ఆ॥ కలికి చేడుపూఁత ♦ ములుకులొ నమ్మోయి, పలుకులంది కరిణి ♦ భాతిఁ గుంది
విడిచె వెంటవెంట ♦ వేఁడినిట్టూర్పులు, డరణి యగ్గి నట్టు ♦ లలరుబోఁడి.

ఆ॥ స్ఫటికనిభములగుచుఁ ♦ జారుహాసినిచెక్కు, లందుఁ దామరాకు ♦ లందు నటులె
పడియెఁ గనులనుండి ♦ పంకజంబులనుండి, యల్లె వారికణము ♦ లంబుజాక్షి.

ఆ॥ అమలచంద్రికాంత♦మాయ తేక్షణ రేఖ, మబలమోము శుష్క♦మగుచుఁ దోఁచె
నీర మెడలఁ దివియ ♦ నీరజంబునకట్టిఁ, డవు నవస్థ వికసి ♦ తాబ్జవదన. ౪౪౮

—♦ రాముఁడు సీత నూఱడించుట ♦—

ఆ॥ బాహువులనుఁ బొదివి♦ పట్టి యక్కునఁ దార్చి, కనులనీరు దుడిచి♦ యనిత రేచ్ఛ
శోకనిహత యగుచుఁ♦జొక్కిన ప్రియ తెఱంగు, గరసి రాముఁ డిట్టు♦లనియె నపుడు.

ఉ॥ ఇంతిరో ; దుఃఖపూరమున ♦ నిట్టిగతిం గనెదంచు మున్ను నే
నింతయుఁ గాన నీతలఁచు ♦ నిమ్మరయం దమకించిపల్కినన్
జింతకుఁ బాలొనర్తె మదిఁ ♦ జెట్టలకోర్తె త్వదీయ మిష్ట మా
వంతయులేక యెట్లు గొన ♦ నౌ నది స్వర్గము మోక్షమేనియున్. ౧౫౦

క॥ వనమునకు నిన్నుగొనిచనఁ, గనిమనుప నశక్తుఁడనె వి ♦ కారినె నను గ
న్గొను మీశు స్వాయంభువునిఁగ, వనరంచుం గలదె తనకు ♦ వారిజనేత్రా.

తే॥ ఆత్మవంతుండు తనకీర్తి ♦ నట్లు నిన్ను, నేను విడిచి ప్రవర్తింప ♦ నేరఁ జుమ్మి
నమ్మి మీనుడి పొడమితి♦నన్ను గూడి, వనమునఁ జరింప నింకేల♦వల దనంగ.

క॥ సూర్యు సువర్చల యెట్లటు, లార్యవు నన్ననుసరింతు ♦ వని యెఱిఁగియె ని
న్నార్యఁగఁ బడసితి నీవన, చర్యకుఁ దలఁకుదు నె నేఁడు ♦ చంద్రనిభాస్యా. ౧౫౩

సీ॥ వనమున కేను బో♦వక యుండఁ జుమ్మింకఁ, బితృవాక్య మొనరించు♦ప్రేరణమునఁ
బెద్దలెల్లరు నిల్చి ♦ పెనుపువహించిరి, దీని మించిన మేలి ♦ తెఱఁగు లేదు
తలిదండ్రులు గురుండు♦దైవతంబు ననంగఁ, దనుధారులకు సత్ప♦థములు నాల్గు
మొదలివి ప్రత్యక్ష ♦ ములు మూడు నవ్వాలి, దగు వీనికెటులేని ♦ నవ్వాలిదన
సత్యము తపంబు దానంబు♦శౌచ మాప్త, దక్షిణాకములైనయ♦ధ్వరము లెన్ని
యును గురూపాసనకు సరి♦యనఁగఁ బోల, వనిన సాధారణంబెయ♦య్యది పురంధ్రి.

ఆ॥ గురులసేవవలనఁ ♦ గూడు నెల్లసుఖంబు, లఖిలవైభవంబు ♦ లమరు మోక్ష
మబ్బు గురునితంబ ; ♦ యాదట దుర్లభం, బెద్దిగలుగు నిట్టు ♦ లింత గనుము.

క॥ మాతాపితృసేవాపరు, లోతలిరుంబోఁడి కాంతు ♦ రుత్తమగతులన్
ధాతృపదంబునవారలు, చేతులు సాఁచెదరు వారి ♦ సిరి లాలింపన్. ౧౫౬

ఉ॥ నీ వనవద్యమూర్తివి వి ♦ నీతవు పుట్టువుతోనె ధర్మసం
భావన నొప్పు చెప్పుడు వి ♦ భాస్వర వేవిభవంబు లొల్లకే
భావిని నాదుసంగడముఁ ♦ బాయక కాన నెలంగ నెంచితొ
నీవలన న్గులద్వయము ♦ నిర్మలకీర్తి వహించి మించెడిన్. ౧౫౭

ఆ॥ సాధ్వి ; నీవునాకు ♦ సహధర్మచరివైన, యపుడ యెల్లశుభము ♦ లమరె నింకఁ
జాలమేల లెమ్ము ♦ సంతరింపుము పయ, నమ్ము జయరమాస్ప ♦ దమ్ము గాఁగ.

క॥ ఇదియె త్రిలోకీరాజ్యము, ముదితరో ; పదిలంబుగాఁగ ♦ మొనసె నొసఁగుమా
యది యిది యనక ద్విజన్ముల, కుదరిద్రాణులకు భృత్య ♦ కోటి కఖిలమున్.

ఆ॥ స్వర్ణభాజనములు ♦ శయ్యలాసనములు, మేలివసనభూష ♦ ణాలు లొఱపు
నెఱపుమణిగణములు ♦ నీవొసంగుము లోక, మెల్లఁ దనియ నసము ♦ వెల్లివిరియ.

చ॥ అని వచియించుభర్తనుడి ♦ యాదృతిమీఱ గ్రహించి మించుబోఁ
డి నిభృతమ్ము వెసందనదు ♦ డెందము వొంగ వితీర్ణి కమ్మెయిన్
గొనకొని రత్నకోటులనుఁ ♦ గొంకక కొల్లలుసేయుచుండె భా
విని తెఱఁగెంచి సత్కవులు ♦ వేడ్కమెయిన్ స్తవము ల్పొనర్పఁగన్. ౪౬౧

—♦ లక్ష్మణుండు తనరాక కనుమతింప శ్రీరాముని వేఁడికొనుట ♦—

తే॥ వారిసంవాద మటువిని ♦ వర్ణనీయ
చరితుఁ డనఘుఁడు సౌమిత్రి ♦ సన్నకంఠు
డగుచుఁ గనుగొలుకులనుండి ♦ యడరుత్రోడి
వేఁడినీ రొలుకఁగ బిట్టు ♦ వెఱఁగుపడుచు. ౪౬౨

క॥ పాదముల కెఱఁగి శుభసం, పాదకగతి కొరగి పలికెఁ ♦ బాడిమెయి న్వాఁ
డాదరము రాముమదిలోఁ, బాదుకొన న్నిఖిలనిగమ ♦ పారమ్యదృశా. ౪౬౩

మ॥ విధి యెట్లున్న విధిజ్ఞత న్నెగడెదో ♦ విశ్వాత్మ; త్వద్వ్యత్తి దు
ర్విధులా కన్గొనువారు నాకనమి యా ♦ వెంటం దలంగింపనా
విధ మొప్పారఁగ బల్కి తయ్యుపకృతి ♦ న్వీడంగ నేర న్దయా
నిధి; నీయంఘ్రులు మెట్టునత్తెరువున ♦ న్నేవత్తు మన్నింపవే. ౪౬౪

తే॥ విల్లుకైఁదాల్చి నీయాన ♦ వెంటనిల్చి, కొల్చెద నిఁకేవరమ్మును ♦ గోర నింద్ర
విభవమునుమెచ్చ నీపొత్తు ♦ విడిచి బ్రదుకఁ, దలఁపుగొన నిట్టులిదియెల్లఁ ♦ దథ్యమధిప.

ఆ॥ అనుడుఁ దనదుపయన ♦ మాఁగ భావించి సాంత్వములఁ దేర్చుభ్రాత ♦ తలఁపెఱింగి
వాఁడు పలికెఁ దొంటి ♦ వరుసఁగూర్చి తనుజ్ఞ, యేమికతనఁ దలఁగ ♦ నెంచె దిపుడు.

క॥ మున్నడి నాదెసఁ గల్కం, బెన్ని తలంగించి తేల ♦ యీయెడ దానిం
బన్ని పొనర్చెదు బన్నం, బన్నా; నీకగునె సంశ ♦ యాస్పదుఁ జేయన్. ౪౬౫

తే॥ నాదుతప్పెఱఁగింపు మో ♦ నాథ; యనుచు, దోసిలొగ్గి యాచించెడు ♦ తోడుగాంచి
యతఁడు తపకన్నమున్నెగ ♦ నవధరించు, టెంచి యిటులనె ధరణిజా ♦ ధీశ్వరుండు.

—♦ రాముఁడు లక్ష్మణు నింటనుండుమని నిర్బంధించి పలుకుట ♦—

కం॥ హితుఁడవు ధర్మరతుండవు, సతతము సత్పథమునంద ♦ చరియింతువు వి
రతముఁడవు భ్రాతృవీజీ, వితమున కవునఖుఁడ వెల్ల ♦ విధముల ననఘా. ౨౬౯

ఆ॥ వత్స; నీదురాక ♦ వారింపఁగా నొల్ల, నైన నన్ను మొనసి ♦ యడవి కీవు
రాఁగ నంబ లిర్వు♦రను భరించెడువార, లెవరు తెలుపు మింత ♦ యెఱుఁగ వాక్కా.

తే॥ పృథివిఁ బర్జన్యుఁడుంబోలెఁ♦బెనుపు మీఱ, నెల్లకోర్కులు గురియుమ♦హేంద్రుఁడిపుడు
ధర్మపాశంబుబంధంబు ♦ దవులుకొనఁగ, నొందు పెస కడుగిడ నేర ♦ కున్నవాఁడు.

తే॥ రాజ్యమబ్బిన తెరువున, రాజమాత, కైక సవతులగతికిఁ దాఁ ♦ గాకయుండు
నాపె చిత్త మనుసరించి♦యలఁతిఁజూచు, భరతుఁడేనియు నివ్వారి♦ పాట్లరయక.

తే॥ ఆర్యలగు నంబల భరింపు ♦ మయ్య నీవు, స్వార్జితంబునఁగాని త ♦ త్ప్రార్థనమునఁ
గాని పున్నెంబులకు నెల్లఁ ♦ గారణంబు, వారిశుశ్రూష లొనరించు♦వలను మనకు.

ఆ॥ నాదునుడి పొనర్చి♦నాయన్న; వెలయు మ, వ్వారి మనిచి మనుము♦తీరుగాంచి
వచ్చి యిచ్చవచ్చు♦వర మొసంగెద నాదు, తలఁపెఱింగి మేలి♦దారి గొనుము.

కం॥ అని పలుకు రాముఁగని మృదు, వనఘుఁడు లక్ష్మణుఁడు శ్లక్ష్ణ♦యగు వాక్కున ని
ట్లనె నాతనితో నొడువఁగ, విన వారే నేర్తు రాత్మ ♦ విదుషీమణిరో. ౨౭౫

—♦ లక్ష్మణుఁడు రాముని బ్రార్థించుట ♦—

ఉ॥ సందియ మొందనేల యను ♦ జన్ముఁడు నీదగు తేజ మొంచి నే
ర్మిం దనమేల్దలంచి స్థితి ♦ మేవడియై చనకుండఁ బ్రోచుచుం
డుం దగువృత్తి నంబలు ము ♦ డుంగు తెఱంగునఁ బోఁడు పోయినన్
నిందకుఁ బాల్పడండె కొను ♦ నే ఘనుఁ డంతటిపాపకర్మమున్. ౨౭౬

కం॥ దుస్సంగంబున సజ్జను, లిస్సీ యను తెరువు గాంచ ♦ నెంచెన యేనిన్
నిస్సీమమహిమ; యాతని, లెస్సగొనక దండ్యు జేయు ♦ లీలకుఁ గూర్తున్. ౨౭౭

తే॥ మున్న తెలిపితిఁ దత్పక్ష♦మున మెలంగు, వారి నెల్లర వధియింతు♦వరుస ననుచు
నిపుడు వింతగ భావింప ♦ నేమిగలదు, నన్ను నీ యేలికొననైన ♦ నయము తక్క.

ఉ॥ కోసలుకన్నె ప్రోచు బహు ♦ కోవిద; దీనుల వేవురన్ ధృతిన్
నాసరిగా రొకొండ్లనఁగ ♦ నంద్యచరిత్ర కెసంగు నూళ్లు వేల్
గ్రాసమొసంగి భృత్యతతిఁ ♦ గావఁగఁ బెద్దల సత్కరింప నే
మోసములేదు స్వీయజన ♦ పుంబరిపాలన మట్లొనర్పఁగాన్. ౨౭౯

—♦ రాముఁడు లక్ష్మణు నింటనుండుమని నిర్బంధించి పలుకుట ♦—

కం॥ హితుఁడవు ధర్మరతుండవు, సతతము సత్పథమునందఁ ♦ జరియింతువు వీ
రతముఁడవు భ్రాత్రివిధేయ, వితమున కవుసఖుఁడ వెల్ల ♦ విధముల ననఘా. ౨౭౪

ఆ॥ వత్స; నీదురాక ♦ వారింపఁగా నొల్ల, నైన నన్ను మొనసి ♦ యడవి కీవు
రాఁగ నంబ లిర్వు♦రను భరించెడువార, లెవరు తెలుపు మింత ♦ యెఱుఁగవోక్కో.

తే॥ పృథివిఁ బర్జన్యుఁడుంబోలెఁ♦బెనుపుమీఱ, నెల్లకోర్కులు గురియుమ♦హేంద్రుఁడిపుడు
ధర్మపాశంబుబంధంబు ♦ దవులుకొనఁగ, నొండు పెస కడుగిడనేర ♦ కున్నవాఁడు.

తే॥ రాజ్యమబ్బిన తెరువున • రాజమాత, కైక సవతులగతికిఁ దాఁ ♦ గాకయుండు
నాపె చిత్త మనుసరించి♦యలఁతిఁజూచు, భరతుఁడేనియు నివ్వారి♦ పాట్లరయక.

తే॥ ఆర్యలగునంబల భరింపు ♦ మయ్య నీవు, స్వార్జితంబునఁగాని త ♦ త్ప్రార్థనమునఁ
గాని పున్నెంబులకు నెల్లఁ ♦ గారణంబు, వారిశుశ్రూష లొనరించు♦వలను మనకు.

ఆ॥ నాదునుడి పొనర్చి♦నాయన్న; వెలయు మ, వ్వారి మనిచి మనుము♦తీరుగాంచి
వచ్చి యిచ్చవచ్చు♦వర మొసంగెద నాదు, తలఁపెఱింగి మేలి♦దారి గొనుము.

కం॥ అని పలుకు రాముఁగని మృదు, వనఘుఁడు లక్ష్మణుఁడు శ్లక్ష్ణ♦యగువాక్కున ని
ట్లనె నాతనితో నొడువఁగ, విన వారే నేర్తు రాత్మ ♦ విదుషీమణిరో. ౨౭౫

—♦ లక్ష్మణుఁడు రాముని ప్రార్థించుట ♦—

ఉ॥ సందియ మొందనేల యను ♦ జన్ముఁడు నీదగు తేజ మొంచి నే
ర్మిం దనమేద్దలంచి స్థితి ♦ మేవడియై చనకుండఁ బ్రోచుచుం
డుం దగువృత్తి నంబలు ము ♦ డుంగు తెఱంగునఁ బోఁడు పోయినఁ
నిందకుఁ బాల్పడండె కొను ♦ నే ఘనుఁ డంతటిపాపకర్మముఁ. ౨౭౬

కం॥ దుస్సంగంబున సజ్జను, లిస్సీ యను తెరువు గాంచ ♦ నెంచెన యేనిఁ
నిస్సీమమహిమ ; యాతని, లెస్సగొనక దండ్యు జేయు ♦ లీలకుఁ గూర్తుఁ. ౨౭౭

తే॥ మున్న తెలిపితిఁ దత్పక్ష♦మున మెలంగు, వారి నెల్లర వధియింతు♦వరుస ననుచు
నిపుడు వింతగ భావింప ♦ నేమిగలదు, నన్ను నీయేలికొననైన ♦ నయమ తక్క.

ఉ॥ కోసలుకన్నె ప్రోచు బహు ♦ కోవిద; దీనుల వేవురఁ ధృతిఁ
నాసరిగా రొకొండ్లనఁగ ♦ నంద్యచరిత్ర కెసంగు నూళ్లు వేల్
గ్రాసమొసంగి భృత్యతతిఁ ♦ గావఁగఁ బెద్దల సత్కరింప నే
మోసము లేదు స్వీయజన ♦ పుంబరిపాలన మట్లొనర్పఁగాఁ. ౨౭౮

తే॥ లేదు వైధర్మ్య మింకిటు♦లెంకఁ జేసి, యేలుకొనుమయ్య ననుఁగృపా♦వాల నిన్ను
విడిచి యొకక్షణమైన జీ♦వింపనోపఁ, జక్కఁబడు నన్ని మేళ్లు నీ♦ సంశ్రయమున.

శా॥ విల్లమ్ముల్పిటకాఖనిత్రములు నో♦ విశ్వేశ ; నేఁదాల్చి నీ
యుల్లంబెంచి చరించెదన్ సుపథము♦ న్యోజించెద న్వన్యముల్
గొల్లల్గా నొనయించెద న్గొలిచెదన్ ♦ క్ష్మోణీజయు న్నీవు న
త్యుల్లాసంబునమించ రేఁబవలు ని♦ త్యోదాత్తభావంబునన్. ౪౭౧

—♦ రాముఁడు లక్ష్మణునిరాకకు సమ్మతించుట ♦—

ఆ॥ అనిన సంతసించి♦ యాతని మన్నించి, యన్న; నీవుచని మ♦హాత్ములైన
గురుల కెలమి నీకుఁ♦ గూర్చుమిత్రులకును, జెప్పి పయనమునకు♦ సిద్ధపడుము.

చ॥ మహితమహాధ్వరంబున సు♦మాళమున న్జనకు న్మహాత్మునిన్
మహిపుని మెచ్చి యిచ్చెఁ దన♦ మాన్యత చొప్పడ జోడువిండ్లు స
న్నహనము లట్లు తూణులు ఘ♦నత్సరురిష్టులు రెండురెండుగాఁ
గ హితుఁడు పాశపాణి పతి♦ కల్మికి నీడుగ నాకొసంగెఁ దాన్. ౪౭౩

క॥ అవి యాచార్యునిసన్నిధి, సువిహితములు గాఁగ నిడితిఁ♦ జొచ్చి తదాజ్ఞన్
గవగూర్చి తెమ్ము నెమ్మి, న్నివేశనముసేర్చి తెలుపు♦ నీప్రత్యయమున్. ౪౭౪

ఆ॥ అనిన మిన్నుముట్టి♦యన్నియుఁ గొని తెచ్చి,యన్న మెచ్చ నెఱియ♦నందుటయును
రాముఁ డాజ్ఞ సేసె♦ రాణమై గురుపుత్రు, నాసుయజ్ఞుఁ దేర♦ నరుగు మనుచు.

ఉ॥ ఆతఁడు పోయి యుత్తపసి♦ యాత్మనికేతనమంది యాప్తుఁ జి
ద్భూతుఁ బవిత్రువహ్నిపరి♦తోషణతత్పరుఁ గాంచి మ్రొక్కి సం
పాత మెఱింగితే సఖుఁడ♦ పాయక దుష్కరకారిమందిరం
బీతఱిఁ జిత్తగించి కను♦మీ నిను బిల్వఁగఁ బంచె నావుడున్. ౪౭౬

—♦ శ్రీరామమందిరంబునకు సుయజ్ఞుం డరుదెంచుట ♦—

ఆ॥ అతఁడు సంజఁగొల్చి♦ యమ్మెయివానితో, నరుగుదెంచి కాంచె♦ నభినివేశ
మొప్పఁ దన్నివేశ♦ మురులక్ష్మితో రమ్య, మగుచునున్నదాని♦ యంతరంబు.

చ॥ అతఁ డడుగిడ్డయాక్షణమె♦ ప్రాంజలియై రఘుమౌళి సీతతో
జతనముమీఱ వహ్నినటు♦ స్వర్చితుఁ జేసెనుఁ జుట్టిమ్రొక్కి స
మ్మతి పెనుపొంద హారమణి♦ మండితకుండలముఖ్యమండన
ప్రితతులొసంగె నూత్నరుచి♦ భాసుర భూసురమూర్తి శ్రీఁ గొనన్. ౪౭౭

తే॥ భూమిసుత దెల్ప హారము ♦ క్షౌమసూత్ర, రశన లంగద కేయూర ♦ రమ్యచిత్ర
రత్నపర్యంకముఖ్యముల్ ♦ రాణమెయి నొ,సంగె నివి సీతగూర్చె నీ♦వతి కటంచు.

తే॥ మహితుఁ డర్పించె మామామ ♦ మదకరీంద్ర
మదియు శత్రుంజయాభిఖ్య ♦ నలరుచుండు
దానితోఁ గొను మంత లి ♦ ద్దానిదశశ
తంబు నని యిచ్చె మంగళా ♦ ధాని మునికి. ౪౯౦

ఆ॥ అతనియాన నాతఁ ♦ డన్నియుఁ గొని జయా, శీర్వచనములిడి వి ♦ శేషవిధులఁ
గూర్చెఁ దనదుమొదలి ♦ కూరిమి వెలయించె, భావికాలశుభముఁ ♦ బరిగణించె.

ఉ॥ ఆదట ధాత యిందిర నటు ♦ లాయనుజన్మునిఁ గాంచి రాముఁ డా
మోదముమీఱ నిట్టులనె ♦ మున్నడి యన్న; యగస్త్యుఁ గౌశికుల్
శ్రీదులఁ జేయు మాద్విజులు ♦ చిన్నతనంబుననుండి కూర్చువా
రేదియు వారికిచ్చునెడ ♦ నిచ్చఁ దలంపకు మన్యభావముల్. ౪౯౨

తే॥ స్వర్ణశతములు గోసహ ♦ స్రములు మహిత
రత్నకోటులు యానముల్ ♦ రహి నొసంగ
నొసఁగి తృప్తిఘటింపు మి ♦ వ్వ్యాజ సస్య
గణము వెలయింపనేర్చిన ♦ ఘనుఁడ వగుము. ౪౯౩

సీ॥ తైత్తిరీయాచార్యు ♦ ధనవంతునిఁగఁ జేయు, మభిరూపుఁ డతఁడు వే♦దార్థవిదుఁడు
కాఠకాలాపులఁ ♦ గావింపు మతిసమ్ము, ద్ధులు గాఁగ నవ్వారి ♦ తలఁపు లెంచి
దండమాణవులు స్వా♦ధ్యాయశీలురు గాన, వారికేమి గొలంచు♦వలను గాంచు
మన్యులు స్నాతకు ♦ లర్థార్థులై యుందు, రెందునేనిఁ గొఱంత ♦ లెనయనీకు
మలసులును స్వాదుకాములు♦నగుచు నింద,జొందువనులకు నొపర♦వ్యాజలారసి
యాత్రకాముల నొనరింపు♦మయ్య ; యిదియ,తఱి యలం చర లేనిస♦ధర్మమరసి.

ఆ॥ అమ్మ సంతసించు ♦ నను వెఱింగి పొనర్చు, నిట్టివితరణమ్ము ♦ నెంచి కానఁ
గొల్లనేయు మెల్ల♦గోచయమ్ములు రత్న, మణులు యానములు వి♦మానములును.

క॥ ఆశ్రితులు వీరు తల్లిక, నాశ్రియులుగ నుండఁబోల ♦ రన్నియుఁ గని సి
ప్రశ్రయము వెలయ నెరపుము, సశ్రీకుఁడ వగుము మేలి ♦ సౌజన్యమునన్.

ఆ॥ అరసి మేఖలులమ ♦ హాసంఘమునకు భ, ద్రకసహస్రములు ప్ర ♦ ధానములుగ
శాలివాహనివహ ♦ శతములు నిడు మెల్ల, ద్విజులఁ దనుపు మిట్లు ♦ తెలివి పొదల.

క॥ దాయులు వాహనములు గొ, శేయమ్ములు మణులు ధనవి ♦ శేషము లిడి సు
శ్రీయుతులఁ జేయు మిట్టియు; పాయమ్మున నెల్లరకు న ♦ పాయము లేడలర్.

ఆ॥ సూతుఁ జిత్రరథుని ♦ సుచిరోషితుని సచి, వుని సమృద్ధుఁ జేయు ♦ పొంటె మెలఁగు
మిన్ని యేల యేరి ♦ కెద్ది యిష్టం బట్టు, లిడుము ధవదుకీర్తి ♦ నెనయఁగనుము.

—♦ శ్రీరాముని యానతిగొని లక్ష్మణుం డాశ్రితుల కభిలార్థంబులఁ గొల్లవెట్టుట ♦—

తే॥ అనిన నెల్లర నర్చించి ♦ యతనియాన, చొప్పున నొసంగె నన్నియు ♦ శుద్ధమాన
సుండు లక్ష్మణుఁ డన్నెడ ♦ సూచి కాచి, యున్న యనుజీవివర్గంబు ♦ లోరసికొనుచు.

ఉ॥ కన్నుల నీరు దొట్రిల వి ♦ కాసము సన్నము గాఁగ నెట్టెటో
తిన్నని పల్కులం బలుకు ♦ తీరు సమాదరవృత్తిఁ దెల్ప మా
యన్నను వీడనొబ్బిదుకు ♦ మాకొనగూర్చె విధాత చెద్దయ మే
మన్నను దీఱ దోయని బ ♦ యల్పడు వారల గోర మెన్నుచున్. ౫౦౧

తే॥ ఒక్కొకనిఁ బిల్చి వారి క ♦ ట్లొసఁగె ద్రవ్య,మింత లనరాక తనవచ్చు ♦ నంతదనుక
గొఱఁత లెవ్వియు లేకుండఁ ♦ గూర్మిమిగుల, నవ్విభుం డప్డు నిత్యాశ ♦ ద్ధాంతరంగ.

తే॥ వారితో ననె రాముఁ డో ♦ వారిజాక్షి, మాని వేళన మనుజుని ♦ మందిరము న
శూన్యములుగాఁ బొనర్పఁడు ♦ శుద్ధవృత్తి, యచ్చుపడుచుండ మా వచ్చు ♦ నంతకనుచు.

క॥ ఇది యొకపనియటె మాకని, గుదిగొని వారడల నిండు ♦ కూరిమి మనముల్
పదిలపడఁగఁ బలుకులతీ, యదనం బదనంబుగా న ♦ వాశ్వాసించెన్. ౫౦౪

మ॥ తలీవో యియ్యాదె యంచు వేగమె ధనా ♦ ధ్యక్షుం దగం బిల్చి య
క్కఱ బోధించి స్వకార్యజాతము గడం ♦ కం బ్రోవుగావించి కీ
డఱఁ దాఁబంచియిడెన్ సలక్ష్మణుఁడుగా ♦ నాబాలగోపాల మం
దఱు నొక్కుమ్మడి బీదసాదలు సమృ ♦ ద్ధత్వంబునం దేలఁగాన్. ౫౦౫

—♦ త్రిజటాఖ్యుని వృత్తాంతము ♦—

ఉ॥ అందొక బాడబుండు త్రిజ ♦ టాఖ్యుఁడు పింగళుఁ డర్థహీనుఁ డ
స్పందుఁడు గార్గ్యుఁ డేకృతికిఁ ♦ బాఱఁడు జీవన ముంఛవృత్తిమై
నందును వానిఁ గాంచి సతి ♦ యాదర మొప్పఁగఁ బల్కె నై జమా
చందము నెంచి యెల్లయగ ♦ చాట్లుఁ దలంగఁ దలంచి నేర్పునన్. ౫౦౬

ఆ॥ పెద్దవాఁ డతండు ♦ పెక్కండ్రు బిడ్డలు, యువతి తాను లేమి ♦ కోర్వలేమి
మగని వేఁడుకొనియె ♦ మానిని తప్పెమి, జగతి మనుపలేరె ♦ సాధ్వులెందు.

ఉ॥ ఏలొకొ నాథ; రామధర ♦ ణీంద్రునిఁ గానఁగఁబోవు నీవు తా
నేలఁడె యేరికేవినఁగు ♦ నిక్కటు లెల్లఁ దొలంచి పాలకు
ద్దాలకలాంగలంబు లెడఁ ♦ దార్చి తలిర్చెదు ధర్మపాదపా
వాలము సేరఁగాంచు మని ♦ వారణఁ జేకురు నెద్దియేనియున్. ౩౦౮

మ॥ అని వాక్సీమణి యెల్ల వల్లెయని వాఁ ♦ డర్ఘార్ఘ్యమై వచ్చె నె
ట్టన జీర్ణంబగుకట్టుగట్టి జడ లొం ♦ టన్వ్రేల నావేల రా
ముని శుద్ధాంతము సేరఁ గాజపథము ♦ న్మున్నీడి యచ్చోటనా
ఘనకక్ష్య ల్గ్రిమిమించి మించుకుతుకా ♦ క్రాంతి న్విజృంభించుచున్. ౩౦౯

తే॥ ఐదుద్వారము ల్దాఁటెబో♦యాంగిరస్సు,మాను భృగుతుల్యునవ్వాని♦మానుమ నెడు
వాఁడు లేఁడెవ్వఁడును బ్రహ్మ♦వర్చసమున,గ్రాలుచు నతండు రఘువీరుఁ♦గాంచిపలికె.

ఆ॥ ఏను నిర్ధనుండ ♦ నింతలంతలు గాఁగ, నొదవినారు బిడ్డ ♦ లొక్కబారు
కూరలాకు లడవిఁ ♦ గూర్చి కణంబులు, నేర్చి తెచ్చి యిడుదు ♦ నింతవట్టు.

క॥ నీకీర్తివింటి నిప్పటి, కీకరణి న్నిన్నుఁగంటి ♦ నిటరాఁగంటిన్
జేకూరె సిద్ధులంటిన్, వేకన్గొనవే కదర్యు ♦ విధమింత యనన్. ౩౧౨

ఆ॥ పిన్ననగవు దొనఁకఁ ♦ బెద్దలకును బెద్ద, వాఁడు రామవిభుఁడు ♦ వల నెఱింగి
యిట్టులనియె నవిగొ♦మ్మెల్లగోధనము లం, దొక్క తెగయు నేర్చి♦యొసఁగ నీకు.

క॥ నీ వెగచి కఱ్ఱవిసరిన, నావలనున నెంత దేశ ♦ మది యాక్రాంతిం
గావించునొ యాలోనివి నీవేయా లాలయు మెలయు ♦ నెఱి నాఁచికొనన్.

తే॥ అనుడుఁ గటితటిశాటిఁజ♦య్యన బిగించి,సంభ్రమంబొప్పఁ బాఱుఁడు♦చాఁచివైచెఁ
బ్రాణమునఁ గల్గుశక్తియే♦ర్పడఁగ దేని,నట్టిదండంబు సరయూత♦టాంత మొరసెం

మ॥ బహుసాహస్రము గోవ్రజం బతనికిం ♦ బ్రాపించె నద్దానఁ దా
నహితోల్లాసుఁడు కౌఁగిటం బొదివి యా ♦ నందంబు చెన్నొంద స
న్మహితుం డీతఁడపో యటంచు ద్విజు స ♦ న్మానించి తాఁజేర్చె స
న్నహనం బొప్పఁగఁ దద్ధనంబు సురలె ♦ న్న న్వానిచో టొందఁగన్. ౩౧౬

తే॥ మఱియు నాతనిఁ బూజించి♦మలసి పలికె,మన్న్య వొనటంపఁబోకుము♦మాన్యచరిత
నవ్వుటాలకసియుకాక ♦నాదునుడులు,బ్రాహ్మణోత్తముఁ జర్చింపఁ♦బరఁగునయ్య.

శా॥ ఈనీతేజ మనీదృశం బరయనా ♦ నిచ్చం బ్రశంసించితిన్
మానింపంబడె నంతయు న్వేలసెఁ ద్వ ♦ న్మాహాత్మ్య మల్లాట నే
మేనర్థంబులు గోరుకొమ్ము కొను మే ♦ నీవెంటఁ గాకేల సం
ధానంబుం బొనరించినాడ ధన మా ♦ తాత్పర్య మూహింపుమా. ౩౧౮

ఆ॥ అనిన నిచ్చ మెచ్చి ♦ యాశీర్వచస్తతు, లొనరఁ గూర్చి యిచ్చె ♦ మొలయకుండఁ
దనిపి యాతఁ డనుపఁ ♦ దద్దయు నుప్పొంగి, చనియె బాడబుండు ♦ జలరుహాక్షి.

మ॥ కలదే చాఁగదె ♦ రామచంద్రుఁడు మన ♦ స్కారంబు చెన్నొంద న
ర్థుల సంప్రీతులఁ జేసి మేలినుడులం ♦ దోడ్తో సమర్థించి వా
రలు దీవింపఁ దనర్చెఁ గల్మిపొనరా ♦ రక్ గల్గులాభంబు వాఁ
డలఘుం డప్పుడె కాంచె నాశ్రితభృతి ♦ వ్యాసంగవశ్యాత్మికా. ౧౨౦

క॥ లేఁడు దరిద్రుఁ డనంగాఁ, బోఁడన్యుల వేఁడ నొకఁడు ♦ పోఁడిమి సెడఁగన్
గాఁడొందు ననంతృప్తుఁడు, నాఁ డా రఘునాథుచూపు ♦ నం దిరమైనన్. ౧౨౧

ఆ॥ అట్లు నెరు లడంచి ♦ యానంద మందించి, యోజ నెల్లవారి ♦ నూరడించి
తరలె వాఁడు తండ్రిఁ ♦ దలఁపించి చననెంచి, తమ్ముతోడఁ దనదు ♦ తరుణితోడ.

క॥ అని శంభుఁ డెఱింగించిన, విని శాంభవి యవల నైన ♦ వృత్తం బెల్లన్
వినిపింపుమనుచుఁ దను వేఁ, డిన నందముచంద మొలసి ♦ డెందము పొంగన్.

శా॥ చింతాతంతునికృంతనక్షమమహా ♦ శ్రీనిత్యపాదాబ్జ య
త్యంతామోదకరాత్మదర్శన సురా ♦ ధ్యక్షాదిసేవ్యా దయా
సాంతత్యోచితదృక్ప్రచార జగదా ♦ శ్చర్యప్రభావోదయా
స్వాంతస్థాఖిలదృశ్యజాలసమవే ♦ తాఖండతేజోనిధీ. ౧౨౨

క॥ సకలభువనాఢ్యయోగ, ప్రకటమహైశ్వర్య లోక ♦ పాలవిభూతి
స్వకటాక్షహేతుకత్వ, ప్రకారమహితాప్రమేయ ♦ భావానుభవా. ౧౨౩

స్రగ్విణి॥ భావనాతీతచి ♦ ద్భావసంలక్షితా, శ్రీవిలాసోదయా ♦ చింత్యసంపద్వ్రతా
దేవదేవాధివా ♦ ర్థిసమభ్యర్హితా, సావధానత్వల ♦ క్ష్యప్రహర్షోచ్ఛ్రితా.

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం దృతీయాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథాఽమృతము

## అయోధ్యాకాండము.

—:o:—

### చతుర్థాశ్వాసము.

—o—



శ్రీసంయోగవియోగా
దాసీన్యవిలక్షణాత్మ ♦ తాంచితనిగమాం
తాసాద్యద్వైవపురచి
త్ప్రాసాదాగ్రానుభావ్య ♦ పరమైశ్వర్యా. ౧

ఆ॥ అవధరింపు మిట్టు♦లనెఁ బ్రియాంగన కనం, గాభియాతి యతివ ; ♦యాలకింపు
మట్లు వెడలి రాముఁ ♦ డలరాజపథమున, నడుగు లిడుచుఁ బోవు ♦ నవసరమున.

—♦ రాముఁడు రాజానగరి కరుగుట ♦—

సీ॥ శ్యామాయమానంబు♦స్మారసుందరము నౌ, నెమ్మేనిమెఱుఁగుల♦ నిగ్గు నెఱయఁ
దనలక్షణములకుఁ ♦ దలఁకనిబంగారు, కొండ దమ్ముఁడు జోడు ♦ గూడి వెలయ
సీతపూజలతోడి ♦ సిరినెఱు ల్దుప్ప్రేక్షభావంబు ధనువుల ♦ పట్లఁ బొనర
శమధను ల్గొనకొని ♦ చర్చింపనగు మేలి, సంయమం బొకవింత ♦ జాడ నెగడ
వచ్చుచున్నవాని ♦ వరపదన్యాసంబు, లచ్చుపడఁగ నైన ♦ యందమునను
బావనత్వమునను ♦ బడలికఁ బుడమికిఁ దీర్ప నెంచువాని ♦ తెఱఁగు గాంచి. ౩

క॥ ఆరాజమార్గ మొరయుచుఁ, బౌరులు ప్రాసాదములను ♦ బడఁతులు నొకఁడౌ
తీరు మొగంబుల నెక్కొన, నైరటఁ దమలోన నిట్టు ♦ లాడికొనంగన్. ౪

— ♦ పౌరులు పరిపరివిధంబులం బలుకఁదొడఁగుట ♦ —

తే॥ కష్ట మిది చెట్టకాలంబ ♦ కాదె జోడు
గోడుగు ననిలేక యితఁడు కా ♦ ల్నడకఁ దొడరెఁ
దమ్ముఁడును సాధ్వియుఁ ♦ దవిలి యల్లె
రాఁగ విధిఁ దిట్ట నోరెత్త ♦ రాదె యిఁకను. ౫

క॥ ఏదార కదలినఁ దోడ్తో, నాదుకొనునొ నాలుగంచు ♦ లమరుబల మతం
డేదైవము సేఁతినొ యెర, వై దారిన్మోనసి కాన ♦ నయ్యో న్మనకుఁ. ౬

శా॥ ఔనో కాదో యనంగరా దొకట నే ♦ యర్థం బనంబోలు నొం
డైనం దీఱదు పల్క కేమివర మే ♦ యాశాస్య మీ జ్యేష్ఠు ని
ట్లానే శానలకంపఁ గామగుణమా ♦ యాచిత్యమా తండ్రి కి
యాన న్మెచ్చెన కైక జానకి యనూ ♦ ర్యంపశ్య కీడోర్చునే. ౭

ఆ॥ ఎద్దియేని నొక్కఁ ♦ డెఱుఁగదు పసిబిడ్డ, యొంటికంటఁబడెనె ♦ యున్నచోట
నుండి కాంచెఁ గీర్తి ♦ నుజ్జ్వలగుణ రాజ, పథముఁ బెరసిచన నె ♦ వంబు గలదె.

క॥ అందఱుఁ గనఁగా నేఁడి, ట్లుండక దారితల మొనయు ♦ నగుకష్టం బీ
సుందరి యడవింబడి యె, ట్లుండెడునో గోడవ లరయు ♦ రా యొకరేనిఁ. ౯

తే॥ మేలితిండికి మైపూఁత ♦ మెఱుఁగులకును, మానితాలంకృతులకు నీ ♦ మంగళాంగి
కూర్చుఁగాక కోనల నాకు ♦ గూరలుఁ దిని, శీతవాతాతపంబులఁ ♦ జిక్క నగునె.

క॥ పతితో నరుగఁ దలంచెను, సతీతిలక మగుట వెతల ♦ జాడ లరయకే
మతిమంతులైనవా రీ, యతివతలం పెఱుఁగ రెట్టు ♦ లనఁజను నింకఁ. ౧౧

ఆ॥ అనఘ మగుతపఃఫ ♦ లార్థంబు మగధజ, పెద్దబిడ్డ యితఁడుఁ ♦ బ్రీతితోడ
నన్నకొలువు గోరి ♦ యరిగెడు నిప్పుడి, కిత్త యగున కాని ♦ రీతి గనునె. ౧౨

క॥ రాము విడిచి యెవ్వా రే, యామయమునుం గాంచఁబోవ ♦ రధిపునిఁ గైకం
బ్రాముకొనె నింత కెద్దియొ, గా మటులుంగాక మేలి ♦ గతికిఁ జెడుదురే. ౧౩

క॥ సుసమాహితుఁ డైశ్వర్యము, రస మిప్పటి కిపుడ కాంచె ♦ రహినరులకుఁ
బొసఁగించె బహుసమృద్ధుల, ననదే యితఁ డిట్టివార ♦ లవనిం గలరే. ౧౪

ఆ॥ ఆనృశంస్య మాధ్య ♦ మగు ననుక్రోశంబు
దమము శమము సుశ్రు ♦ తంబు శీల
ము ననంగ నాఱు ♦ గొనములు రాముని
మొనసి కొలుచు సురలు ♦ మునులుఁ బొగడ. ౧౫

ఉ॥ కావున నీయుపద్రవము ♦ గల్గెను రామున కన్నమాట గా
కీవిధి నెల్లవారలకు ♦ నిక్కటులే కననౌను గ్రీష్మపుం
బ్రావ జలంబులన్ బ్రదుకు ♦ ప్రాణులకట్టులు మీఁదెఱింగి యీ
త్రోవ మెలంగ మేలనుచుఁ ♦ ద్రుళ్ళక మున్నది నిశ్చయింపుఁడా. ౧౭

తే॥ ఈజగత్పతి కగుపీడ ♦ యెల్లప్రజల, కౌదవు మాలోపహాతిఁ దరు ♦ వొందఁ గనవె
పత్రపుష్పఫలాదు లా ♦ భంగదశను, ధర్మసారం బనంగ నీ ♦ తండ కాఁడె. ౧౮

క॥ ఇంక నుపేక్షించిన నే, వంక శుభం బొదవు మన క ♦ వారణమై రా
మాంకనదులమై వని నక, లంకత మనువార మదె త ♦ లంపునఁ గొనుఁడా. ౧౯

క॥ అనఘుం డీసౌమిత్రి మ, హానీయ మహిజయునుఁ దోడ ♦ నరుగఁగ ధృతిగాం
చిన తెఱఁగరయుచు మన కి, ట్లునికి దగునె కడఁగి తలఁపు ♦ లూఱటఁ గనునే.

తే॥ గృహము లుద్యానపదములు ♦ క్షేత్రములును
విడిచి సమదుఃఖసుఖులమై ♦ విభునితోడ
నరిగి మేలందుకొంద మ ♦ నంతరమ్ము
చింత పాల్గాఁగ మనకేల ♦ సిరి తలంగ. ౨౦

తే॥ నిర్వృతిం గాంచువార మీ ♦ నియతి మనము, రామసేవాపరులమై ని ♦ రంతరమ్ము
నుగ్రములు వన్యమృగపక్షు ♦ లోరపిడి గని, యిప్పురము సేరఁ బాఱఁగా ♦ నింతగనుచు.

క॥ వనమెల్ల నగరమగు ని, య్యనద పురం బడవి యనఁగ ♦ నమ్యోఘు దానిం
గొని కాలుఁగాక కైకకు, మొనయఁగ మేలనుచుఁ గలదె ♦ ముల్లోకములన్.

తే॥ ఇట్టికర్మం బెనయుపాంసె ♦ నింతవట్టు, బ్రదికెఁ బోవృద్ధరాజంక ♦ బ్రదుకఁ గలడె
పూలుఖిల్చినయూర నే ♦ ర్పుసెడ నెట్లు, కట్టియుల నమ్మి యేమేలు ♦ గాంచువాఁడు.

క॥ ఈహేయంబగు సత్యము, స్త్రీహేతుక మేమిలగ్గు ♦ సేకూర్చెడిఁ బు
ణ్యాహమని రామురాజ్యం, బూహించి తలంగె నిట్టిఁ ♦ డుచితం బగునే. ౨౪

సీ॥ ధూళి బ్రుంగుడుపడి ♦ తోరంపు నెలవులు, తేజోవిహీనవి ♦ దీర్ణములుగఁ
గలుగుజలాశయం ♦ బులు తోఁటలుం దొడ్లు, నాలన తెఱవు లే ♦ కడఁగిచనఁగ
ధనధాన్యములు గావఁ ♦ దత్పరు ల్లేకున్కి, హ్రాతసారము ల్గాఁగ ♦ నెడలిపోవ
బలికర్మతతు లిజ్య ♦ లలమంత్రజపహోమ, ములు నశింపఁగ ♦ వేల్పు లలఁతిగాంచ

దుష్టకాలంబమై సిరి ♦ తొలఁగినంతఁ
బాడుపడినట్టి యిమ్మన్కి ♦ పట్టు పట్టి

యాదలం బాల్యుఁగాపుత ♦ మనద యొక తె
కొడుకు తనుదిట్టి రాముని ♦ గొలిచి మనఁగ. ౨౫

ఆ॥ కాన రాముఁ డున్న ♦ గహనంబె రాజ్యంబు
గాని రాజ్య మెన్న ♦ గహన మింత
యెఱిఁగి శ్రేయ మెనయుఁ ♦ డెల్లవారు నిఁకొండు
దలఁపఁబోకుఁ డిదియె ♦ తత్త్వ మరయ. ౨౬

క॥ అని నాగరులెల్లరుఁ దెం, పున నాడెడుపలుకు లఖిల ♦ పూజ్యుఁడు వినియుఁ
దనుకక జనకునిఁ గనఁజనె, వినమ్రభావంబు దనర ♦ విజయోల్లాసా. ౨౭

—♦ వామదేవముని రామదేవుని ప్రభావంబు నాగరుల కెఱింగించుట ♦—

ఆ॥ మఱియు నొండువృత్తి ♦ మాని మానితులు త, దేకచిత్తులగుచు ♦ నెరియుచున్న
వారిఁ గాంచి పలికె ♦ వామదేవాఖ్యుండు, మౌనివరుఁడు భువన ♦ మాన్యచరిత.

క॥ సారవిచారుల రగుమీ, కారాటం బెనయఁ జనునె ♦ యగు నూఱడిలం
గారణ మేవినిచెద రఘు, వీరుల కేనాఁడు నిదియె ♦ విహితము సుండీ. ౨౯

ఉ॥ అందఱ యట్లు గాక యితఁ ♦ డాదిమపూరుషుఁడై నవిష్ణుఁ డా
సుందరి యోగమాయ సిరి ♦ చొప్పడె శేషుఁడె లక్ష్మణుండు నాఁ
బొందికమీఱ సజ్జనులఁ ♦ బ్రోవఁగ దుర్జనులైనవారలన్
డ్రమందఁగఁజేయ నిట్లనుచు ♦ మానసవృత్తులఁ జేర్పుఁ డింకిటన్. ౩౦

క॥ మాయాగుణయుక్తిం ద, చ్ఛాయానుగవృత్తి నితఁడు ♦ శతధృతిహరిరు
ద్రాయితవేషంబులు, ప, ర్యాయపదంబులు వహించుఁ ♦ బ్రముఖత నెగడన్. ౩౧

క॥ మచ్ఛమగుచు మును మనువే, పొచ్ఛమునం బోకయుండఁ ♦ బ్రోచె జలధిలో
ముచ్చునడఁచి శ్రుతులొడిచియుఁ, దెచ్చి యజునకిచ్చె నితఁడు ♦ తేఁకువ మెఱయన్.

క॥ సింధువు మథించునాఁడా, మంథానపుఁగొండ మోసె ♦ మాన్యుఁడు దాగ
ర్వాంధుల నసురుల మొఱఁగి సు, ధాంధుల కమృతంబు వోసె ♦ నంగన యగుచున్.

క॥ అడుగునఁబడిన పుడమి వెం, బడి దంష్ట్రిందాల్చి యెత్తెఁ ♦ బాథోమయమా
నెడఁ జెడుగు హిరణ్యాక్షునిఁ, గెడపెన్ ముజ్జగములందుఁ ♦ గీర్తి నెఱయఁగన్.

క॥ డింభకునిఁ గావ దంభో, త్తంభితు నమరారిఁ ద్రోవఁ ♦ దత్ప్రహతసభా
స్తంభమున సంభవించిన, శుంభన్నరసింహమూర్తి ♦ చూ యితఁ డెన్నన్.

క॥ కశ్యపుఁ డదితియు వేఁడ న, వశ్యంబని ముగ్ధమూర్తి ♦ వామనుఁడై నం
వశ్యత బలి నడిగి యితఁడె, వశ్యంబొనరించె హరికి ♦ స్వారాజ్య మెఱుఁగన్. ౩౬

క॥ చెట్టల తేండ్ల మడఁపఁ దా, బిట్టడరెం బరశువూని ♦ భృగురాముఁడనన్
మట్టుపెడె ననుచుఁ దోడ్తో, నట్టె పొడమె రాఘవాన్వ ♦ యము వెలయంగన్.

ఆ॥ రావణాదులం దు ♦ రంబునం దెగటార్చ, నెల్లవారితలఁపు ♦ లిట్లొనర్చెఁ
బొగడి యడుగఁ దెలిపెఁ ♦ బోరోగిరముతిండి, పోతుమునికి వనికిఁ ♦ బోదు ననుచు.

ఆ॥ నరునిచేతఁ గాని ♦ నాకాధిపవిరోధి, మడియఁ డనుచుఁ దాన ♦ మలసె నిట్లు
తెలిపెఁ గాదె మున్ను ♦ దేటపడంగ య, జ్ఞేశ్వరుండు నృపవ ♦ రేజ్యఁ బెరసి.

క॥ కావున నిపుడే యన్నైజిఁ, బోవుం గాకొండు దలఁపఁ ♦ బోఁడు జగములం
గావ నరుడెంచి మసలునె, ప్రోవడె యామీఁద మనలఁ ♦ బొచ్చెము లెడలన్.

క॥ ఈతెఱవునఁ దెరలక మీ, రీతటి సీతనిభజింప ♦ నెంచుఁడు దానన్
మీతలఁపులు ఫలియించును, జేతోముద మొదవు నొంటఁ ♦ జేద్పడకుఁ డిఁకన్.

మ॥ కలికాలుష్య మడంచుఁ ద్రెంచు విపదా ♦ క్రాంతిన్ సమర్థించు ని
ట్టలమాసంపదఁ దెల్విఁ బెంచు ద్విషదా ♦ డంబంబు మాయించు మా
యలమంత్రంబులసంచు మంచు మిహిరుం ♦ డ ట్లాహరించున్ విని
ర్మల మీరామపదం బెదం జొనిపి స ♦ మ్యాభింపుఁ డేవేళలన్. ౪౨

తే॥ అనిశ మెవ్వారు రామ ; రా ♦ మా యటంచు
జపమొనర్తురు వారల ♦ జాడఁ బోఁడు
జముఁడు మిత్తియు వారిపై ♦ సక్తిఁ గొనదు
ముక్తి వరియింప నెంచుచు ♦ మురియుచుండు. ౪౩

ఆ॥ ఇది రహస్య మింత ♦ లెంచి మీమది నుంచి, యితని పేర్మిఁ బొంచి ♦ యెలయుచుండుఁ
డెల్లశుభము లొసఁగు ♦ నీజానకీజాని, కడఁగి ముక్తు లీను ♦ కాఁగలారు. ౪౪

చ॥ అని ముని దెల్ప విస్మయము ♦ హర్షముఁ జిత్తములం దలిర్ప మే
లనిరటు వేత్తృభావము న ♦ యంబునఁ గల్గినయమ్మహాద్విజుల్
ఘనుఁ డటులేగి తండ్రిఁ గనఁ ♦ గావలెఁ గాంచివచింపు మంచు సూ
తునిఁ గని పల్కె వాఁ డరిగెఁ ♦ దోడనె ఘూర్ణితచిత్తవృత్తియై. ౪౫

—♦ సుమంత్రుండు రాముని రాక దశరథున కెఱింగించుట ♦—

సీ॥ తే జొండువిధ మైన ♦ తెప్పరంబునచాయ, నుపరక్తుఁ డగు సూర్యు ♦ నొరయువాని
నింధనంబటు ప్రోపు ♦ టిక్క గానఁగరామి, నివురుగప్పినయగ్ని ♦ నెరయువాని
వడినేటుపడి యందు ♦ బడి లేక యుడికెడు, నురగమో యన రోజు ♦ చున్నవాని
మండు వేసవి నీరు ♦ మాయింప గతి సెడ్డ, యాతటాకము పోక ♦ మందువాని

రామరామా యటంచు వి ♦ రామ మిడక
రాముని స్మరించు నెఱిన క ♦ రంగువాని
నెలఁత దెసఁ గన్గొనుట మాని ♦ నేలఁ జూచు
వాని మానవనాథు న ♦ వ్వాఁడు గనియె. ౪౬

క॥ చూచినయంత సుమంత్రుం, డేచినయుడు కడరనీక ♦ యెడ నిలిచి జయ
ప్రాచుర్యము భయలగ్నము, వాచారంభణ మొకంట ♦ వఱలఁగఁ బలికెన్. ౪౭

శా॥ ఆనీబిడ్డఁడు రాజసింహము త్వదా ♦ జ్ఞానక్తుఁడై కాననం
బోనే పోవుచు స్వీయమాధనము సాం ♦ పు న్బెంపు దీపింపఁ ద్వా
గానూనస్థితిఁ గొల్లసేసి సుహృదా ♦ ద్యాపృచ్ఛనాంతంబునన్
దా నిన్గన్గొనవచ్చి ద్వారమున ను ♦ న్నా డన్నెఱిం గాంచితే. ౪౮

తే॥ రాజగుణము లన్నియు రవి ♦ రశ్ము లట్లు
పొదువ రుచు లెక్క. నెక్కటి ♦ పొలుచువానిఁ
గాంచుమయ్య జనుష్మత్త ♦ గన్న ఫలము
రామనామము మనుకులా ♦ రామభవము. ౪౯

ఆ॥ అనిన నులికిపడుచు ♦ నాథర్మ్య వాసత్య, వాది యాగభీర ♦ భావవార్థి
యాయపంకమహిత ♦ మాకాశ మనె నిట్టు, లాప్రధానవర్యు ♦ నామతించి. ౫౦

ఉ॥ పొమ్ము సుమంత్ర యంతిపురి ♦ పొల్తులనెల్ల మదాజ్ఞ దెల్పి తో
డ్తెమ్ము మదీయ మాజనము ♦ తేఁకువ నన్నటియంగఁ గాంచి యా
పిమ్మటఁ బిల్వనెంతు సుతుఁ ♦ బేర్మికి నీడుగ ధార్మికోత్తముం
డిమ్ములయిక్క వానిఁగని ♦ యీక్షణ మీక్షణతృప్తి మించెదన్. ౫౧

ఆ॥ అనిన నాతఁ డరిగి ♦ యావార్త దెలుప సా, ర్థము శతత్రయంబు ♦ తలిరుబోండ్లు
కోసలాత్మజాతఁ ♦ గొని చుట్టి యరుదెంచి, రధిపునాన సిరము ♦ లందుఁ దాల్చి.
క॥ వారలు రాఁ గని యపు డా, సారవిచారుండు పిలువఁ ♦ జను మన వాఁడుం
దీరుగని వారి ముప్పురఁ, జేరి ప్రవేశంబు నెఱపు ♦ సిరి గాంచుటయున్. ౫౩

—♦ దశరథుండు రాము నెదుర్కొనుట ♦—

చ॥ అడుగిడె రాముఁ డన్న నెఱి ♦ కప్పటి కప్పుడె యుత్థ్పుతంబు చొ
ప్పడ నెదురేగనైనపతి ♦ భావన భావిను లెంచి యట్టిరై
తొడరఁ దమోభిభూతుఁడయి ♦ తోడనె వ్రాలెఁ బదాంతరంబునన్
వడకుచు వాని మూఁగుకొని ♦ వా రనువారనియార్తిఁ గుందఁగన్. ౫౪

ఆ॥ శోకదీర్ఘుఁడై ధ♦రాకాంతుఁ డోరామ ; , యనుచు వ్రాల వార♦లట్లు మొరయ
భూషణారవములు♦పొడవుపడంగ నా, యులివు బయటపడియె♦నుత్పలాక్షి. ౫౫

క॥ ఆరామలక్ష్మణులు సీ, తారామామణియుఁ దోన ♦ తటియం జని హా
హారవ మెసఁగ యశోవి, స్తారు సలలిఁ బొడివి యుడిరి ♦ చయ్యన శయ్యన్.

ఆ॥ ఒకముహూర్తకాల ♦ మున్నట్టు లుండి యా, తండు కనులు దెఱచి ♦ తల్లడిలుచుఁ
దన్ను గాంచరిత్తఁ ♦ దా నెంచియును రాముఁ, డిట్టులనియె మదగ ♦ జేంద్రగమన.

—♦ శ్రీరాముఁడు దశరథునకు శోకోపశమనం బొనరించుచు దశ్యుఁ వేఁడుట ♦—

క॥ ఆమంత్రణ మొనరింతు మ, హామహిలాధీశ మాకు ♦ నెల్లరకును నీ
శ్రీమహితము శాసనమే, కామప్రద మట్లుగానఁ ♦ గానకుఁ జనఁగన్. ౫౮

ఆ॥ కొన్నికారణములు ♦ గాని తెల్పినను దాను, నన్ను బాయనేర ♦ కున్నవారు
సాక్షి యీవె వేఁడె ♦ పైదోడు నాతోడ, నడుగుదేరఁ దలఁచి ♦ రాన యిడవె.

చ॥ కనుఁగొను మయ్యమున్నటులు ♦ గా మముఁ గామము శోకముల్ భయ
మ్మును విడనాడు మయ్య యను ♦ మోదముచొప్పెనయుంపు మయ్య నీ
యనుఁగుపజం బ్రజాపతిన ♦ యంబునఁ బాలనసేయు మయ్య నా
యనుకృత మీవ్రతంబు తెఱ ♦ వాసి మేలను మయ్య చయ్యనన్. ౬౦

క॥ అని యచలితుఁడై వనగతి, కనుజ్ఞయిడు మనెడు జనక ♦ జాధిపుఁ గని యి
ట్లనె జగతీపతి తనదగు, మనోభిలషితము తదాత్మ ♦ మయ మగుచుండన్.

—♦ దశరథుండు రామునకు వనవాసాజ్ఞ నొసంగుట ♦—

తే॥ కూరు కైకేయి విరకథా ♦ క్షోభణమునఁ
దన్ను మోహితుఁ జేయన ♦ రథముఁ దలఁచిన
వీనివ్యక్కారమున ధరా ♦ విభుఁడ వగుము
టంచు నా తెల్పినది తోంచి ♦ తియ్య రామ. ౬౨

మ॥ అనినన్ ధర్మభృదగ్రగణ్యుఁడు మహా ♦ త్మా ; యిట్లనం బోలునే
చని నీసత్యము చెల్ల నాల్గుపదియున్ ♦ సంవత్సరంబు ల్వనిం
బనులందీర్చి యనంతరం బెనసి నీ ♦ పాదాబ్జము ల్గొల్చువాఁ
డ నొకొం డెన్నకు మన్నఁ దన్మతము వీ ♦ డంగానిడం జాత్మలోన్. ౬౩

ఆ॥ ఉడుకుచున్నయాతఁ ♦ డువిదయుఁ బ్రేరేప, ధర్మపాశకలనఁ ♦ దవులుకొన్న
వాఁడు తేఁడు వలికె ♦ వనరు పైకొన నన్న, కంఠఘోషుఁ డగుచుఁ ♦ గంటుకంఠి.

క॥ శ్రేయము సుసమృద్ధియుఁ బున, రాయానశుభం బరిష్ట ♦ హీన మభయముం
బాయక నీయెడ మేకొన, నాయనుఁగుంగూన యరిగి ♦ నయమున రావే. ౬౫

సీ॥ ధర్మ వాక్యాంతయుఁ ♦ దలఁగఁ జాలనివాని, మరలింపఁ దనతర ♦ మా యటంచు
మత్ప్రియార్థంబె ని♦మంత్రించి యెదఁగూర్చి, కొన్నవాఁడవు తిట్టఁ♦గూడ దనుచు
దుష్కరంబులు దీర్ప♦దొరఁకొంటి వెట్లును, సాధింతు వలికింప♦సడల వనుచు
నెల్లభోగము లిడ్డె ♦ యిన్నేరి విడనాడి, పోఁబోవ లోలోనఁ ♦ బొక్కపడుచు

కాలము వృత్తము దిగఁద్రావి ♦ కూళ కైక
యురులువన్ని తెరల్చిన ♦ యొఱకటమున
నీవు తలయిడి చొరఁబాఱ ♦ నేర కేగు
మనవలసె నింత నిక్కమో ♦ యన్న వినుము. ౬౬

క॥ ఛన్నాగ్నికల్ప యిది ము, న్నన్నసుడికి నన్ను గాల్ప ♦ నైనసడికి న
న్నన్నా సమర్థుఁడవు నీ, వున్నం గాకొంట సుగతి ♦ యొక్కఁడు గలదే. ౬౭

ఆ॥ ననుఁ దరింపఁజేయ ♦ నాయన్న జనియించి, తగ్రసుతుఁడ వగుచు ♦ నన్మృతకథకుఁ
బాసినాడ నింకఁ ♦ బాపవే నాయార్తి, వ్రతము నెఱపివచ్చి ♦ వలను సూపి. ౬౮

ఉ॥ నేఁటికి నింపె నిల్చి జన ♦ నిన్ననుఁ దేర్చి సుఖోచితక్రియ
ల్పాటిలఁజేసి కాంచఁదగు ♦ పద్ధతిఁ గైకొను మట్టులైననీ
నాఁటికినేనియుం మనఁగ ♦ నట్టె గలవారల మట్లొనర్పవే
సూటికి రేపట స్వనము ♦ సొచ్చెదుగా కగునిచ్చ రాఘవా. ౬౯

క॥ అని యార్తి నొగులు నాతనిఁ, గని రాముఁడు తోడుతోడు♦గా నిట్లనియెం
మనము తదీయవ్యసన, మ్మున మొనకొనుదీనభావ ♦ మునఁ జేడ్పడఁగం. ౭౦

సీ॥ నేఁటిబుద్ధులు నిల్పు ♦ నే యెల్లిజనుల క, ప్పటికి బోధింపనా ♦ ప్రభువు గలఁడె
తలఁచిమేలని యిట్లు ♦ తర్లఁజూచితి మింక, మ మ్మాఁగనెంచిన ♦ మతము సెడదె
నీసత్య మిద్ధర ♦ నెలకొనుఁగావృత, మెల్లకాలము సమా ♦ హితము గాఁగ
భరియింపఁ బా నేర్పుఁ ♦ బ్రాభవం బంతయు, భరతుండు భవదాజ్ఞ ♦ పరిఢవిల్లఁ

జింతపడనేల తనకైన ♦ చింతితంబ, కాని యిక్కర్జ మొండనఁ ♦ గాదు సుమ్ము
నెఱపివచ్చెద మిమ్మెలి♦నియతి నియతి, పౌనర వనవాసఖేలనం♦బునకుఁ దొడరి.

క॥ దుర్ధర్షము సాగర మొక, యర్థమునకుఁ దలఁకునే మ ♦ హావీర ; సతీ
ప్రార్థిత మొసంగి కడఁగి క, దర్థం బొనరించుతలఁపు ♦ వ్యర్థమ కాదే. ౭౧

ఆ॥ భర్తవనుచు నాఁడు ♦ పాటించి నినువేఁడె, సుతుఁడ వనుచు నన్నుఁ ♦ జూచి పలికి
యనుమతింపఁ జేసె ♦ నయ్యర్థమే నేఁటి, కయ్యొ తీర్పవలదె ♦ యామెకోర్కి. ౨౩

ఉ॥ నిక్కము తెల్పువాఁడ విను ♦ నేలయు మిన్నుఁ దలంగనిమ్ము నే
నిక్కృతిమాన నేసుకృత ♦ మేసుఖము ల్దలపోయ సూక్తికిం
దక్కువ మింక నెల్లతను ♦ ధారుణిలోపల నాజి మేటి య
మ్మక్క; యనం జెలంగుము న ♦ యంబిదె యంచుఁ దలంచు నేర్పునన్. ౨౪

క॥ ఈకర్జ మొలసి సీత న, శోకమునన్ డింపనైన ♦ సొలయం జుమ్మీ
మేకొనుము మేటిధృతి నీ, శోకం బెడలించి నిత్య ♦ శుద్ధవిచారా. ౨౫

ఆ॥ అల్పకాల మిదియు ♦ నగునె మాకొకలెక్క, సీదువ్రతిన నిష్ఠ ♦ నెఱపి వత్తు
మేము మువ్వురము వ ♦ నేందిరాసుందరీ, మందహాసకృతమ ♦ మత్వ మొలయ.

క॥ ఈమాతల్లుల నిందఱ, నేచుంబున నెలయఁ జేసి ♦ నిశ్శోకతమై
నామంత్రింపుము తొలఁగెద, మామయముల నెల్లఁ బునరి ♦ హాగమనమునన్.

తే॥ దేవతలకేనియుం దండ్రి ♦ దైవతంబు
గాన నింతయు నెఱిఁగి యి ♦ క్కార్యమునకు
నేను దొరఁకొంటి వెలయింతు ♦ నీనిదేశ
మార్తిపడక సుఖంబుండు ♦ మయ్య; యనిన. ౨౮

చ॥ అనుశయమొప్పఁ బుత్రుని న ♦ యంబున బిగ్గనఁ గౌఁగిలించి యొం
డన దరిలేక గాఢమగు ♦ నాపద పెల్లున నుక్కడంగి చే
తన సెడఁ జూచు నద్దశ ప ♦ దంబొదవించె ననంగనైన నా
ఘనతిమిరంబున న్మునుఁగఁ ♦ గా విలపించిరి కాంత లొక్కటన్. ౨౯

—♦ సుమంత్రుండు కైకం దూలనాడుట ♦—

క॥ అయ్యెడ సుమంత్రుఁడును నా, యయ్యదశం బాలుకొనియె ♦ హాహాకృతమై
యయ్యిరవు వెరవు సెడె నా, దయ్యము పూనినది కైక ♦ దలఁకక యుండెన్. ౩౦

మ॥ తలయూఁగించుచు వెచ్చనూర్చుచు వెసన్ ♦ దాలేచి నేత్రంబులు
ల్కలరాల్పన్ దశనంబులం గటకటా ♦ స్పందం బమందంబుగాఁ
గలఁగం బాఱిన మేను నెమ్మదియు నొ ♦ క్కండై వడంకంగ ది
క్కులు వీక్షించి సుమాన్యుఁ డాకయిక సం ♦ క్షోభంబు పాల్సేయుచున్. ౩౧

ఆ॥ చేతు లప్పళించి ♦ శితశరంబులఁ బోలు, పలుకుబడులు తొడరఁ ♦ బలికె నిట్లు
మర్మకృంతనములు ♦ మానిని దెసఁ బోల, వనక దశరథాశ ♦ యంబు పొదల. ౩౨

సీ॥ ఏపీనిఁ దెగనాడె ♦ దినకులేశ్వరుఁడన, కతఁడపో భర్తచ ♦ రాచరమున
కజితుఁ డకంపితుం ♦ డక్షోభ్యుఁడును జువ్వె, హరిగిరీంద్రోదధు ♦ లట్లుగాఁగ
నీచేయనేరని ♦ నేరమంచు నొకొండు, గలదె పతిఘ్నివ ♦ కావా యింకఁ
గుల మి[illegible]మెత్తునం ♦ గూలకే యిమ్మాడ్కి, నిలుచునే మారివి ♦ నీవు పొదువ
నన్నిటం జెడుగొన్నయీ ♦ యన్వయమున
జ్యేష్ఠు మొనయుంగనౌరాచ ♦ సిరి దెరల్చి
నీయెదం బెట్టకొంటివి ♦ నీతిదక్క
మనెదుగా కందఱకుఁ దానె ♦ మాఱనంగ. ౮౩

ఆ॥ చేసికొన్నమగనిఁ ♦ జెట్లపాల్సేసెదు, కొడుకు చాలునొక్క ♦ కొఱవి దిప్ప
విభు నభీప్సితంబు ♦ వెలయింప కెబ్భంగిఁ, బుణ్యలోకమునకుఁ ♦ బోఁదలంత్రొ.

తే॥ నీవు నీకొడు కేలంగ ♦ నిలుచుదాన, వెక్కటి ధరించు ధాత్రికి ♦ వెక్కసముగ
నేము పోయెద మొచ్చోట ♦ నినకులేంద్రు, రాము నడుగులపూజ తీ ♦ రమ్మువడునొ.

తే॥ వివృతగాదేమి మేదిని ♦ వెఱఁగుపడెనొ, దిట్టవగునీదు చెయిదంబు ♦ చెట్టఁ దలచి
రాముఁ దోలెదునన్ను ని ♦ రాకరించి, తిట్టరేమని వాగ్దండ ♦ ధృత్పవిరులు. ౮౬

ఆ॥ మావిఁ ద్రెంచి వేఁప ♦ ప్రమాని నిర్పోషించెఁ, బాలువోసెఁ జేఁదు ♦ వాయుననుచు
నతని కబ్బె నింత ♦ లా తేనియలు గ్రోలఁ, బ్రకృతి తెరలునే ప్ర ♦ పంచమునను. ౮౭

క॥ నీతల్లి యెట్టు లట్టులె, నీతివిధుర వీవు పుట్ట ♦ నేల సెడె యథా
మాతాసుతాతథాయను, నీతివిదులపలుకు తలఁగ ♦ నేర్చునె యెపుడున్. ౮౮

సీ॥ ఒకమునీంద్రునికూర్చు ♦ నుపదేశమునఁ గాంచె, నీతండ్రి కేకయ ♦ నేత మున్ను
సకలభూతరుతసం ♦ జ్ఞానప్రకారంబు, దానవిజ్ఞానంబు ♦ దనరుచుండ
జాయతో తనదగు ♦ శయ్యాతలంబున, శయనించి యుండ నా ♦ చాయఁ బెరసి
జృంభం బనెడుపుర్వు ♦ చేరి యెద్దియొ విరు, తం బొనర్పఁగ నవ్వె ♦ దా నటంచు
నీజనని పాపజనని వి ♦ నింద్య యపహా, సించె దేమని నన్ననఁ ♦ జెలువుఁ డింత
నీకుఁ దెలిపితినేనియు ♦ నేఁడె మడియు, హాఁడనని పల్క నెఱిఁగిన ♦ వాస్తవంబు.

క॥ అంతటనేనియుఁ దలఁకక, యంతలుసేయంగఁ దలఁచు ♦ నాజంతయు నీ
వంతముగాంచిన నేమగు, నింతదెలుప కిచటువాసి ♦ యెటులేగె దనన్. ౯౦

ఆ॥ తెప్పిఁజిల్లి వాఁడు ♦ దేవతాత్ము యమీంద్రుఁ
గాంచి మ్రొక్కి యేమి ♦ గతి యనంగఁ

బోలఁతి పొడవడంగి ♦ పోవుఁగావుత మీవు
తెలుపఁబోకు మనిన ♦ దిట్ట యగుచు. ౯౧

క॥ పొమ్మని దాని నడిచి తా, నమ్మహితుఁడు ధనదకల్పుఁ ♦ డలరె ననదయై
బమ్మెరపా టయ్యాది గనె, నిమ్మహిపతి నిట్లుచెఱుప ♦ నెంచితి వీవున్. ౯౨

ఆ॥ వఱలు లోకమునఁ బ్ర ♦ వాదంబు పుత్త్రిండు, తండ్రిఁబోలుఁ గన్నె ♦ తల్లిఁబోలు
ననుచు నిచట నది య ♦ థార్థంబ యననయ్యె, నీప్రవర్తనంబు ♦ నేఁడు చూడ.

ఉ॥ ఇంతటనైన మేలుగను ♦ మింతిరో మేల్కొని యొడ్లమాట లం
తంతలుగా నెఱింగి పతి ♦ యందనురాగము సూపి రాము దు
ర్దాంతు మరల్పు మెల్ల కడ ♦ దాఁటిన సూటి చెడంగ నీకు న
య్యంతకుబారికిం దలఁగ ♦ నయ్యెడునో పరికింపు మెమ్మెయిన్. ౯౪

తే॥ మూఁడుకాళ్లముదుసలి రాజు ♦ మోసపుచ్చి
జ్యేష్ఠు సుగుణాఢ్యు సుతు వని ♦ సేరఁ బనిచి
జనులు దిట్టంగ లోలోన ♦ సగమునచ్చి
చనెద వావల నీవల ♦ శమనుపురికి. ౯౫

క॥ రాముఁడు రాజ్యముసేయఁగ, నామురువునఁ దమ్ములెల్ల ♦ నాతనిఁ గొలువన్
నేమమున మగనిమఱువున, నీమురిపెముచెల్లు నింత ♦ నేరక చెడెదే. ౯౬

ఆ॥ కొలముధర్మ వెంచి ♦ కులపతి నిష్ఠమై, నిలుచునేనిఁ దోన ♦ నీవు నరిగి
శుభపదంబు మేలి ♦ శుశ్రూష లొనరించి, పడయఁ గాంతు వేల ♦ పాడుపడఁగ.

క॥ మంచిగతి నెంచికొమ్మని, యంచితుఁ డటులార్వనైన ♦ నది క్షోభ మెదం
గాంచదు మోమోడదు తన, వంచనకై పొంచియుండె ♦ వ్రాత యెడయునే. ౯౮

—♦ దశరథుండు రాముని రాజ్యాంగములతోడఁ బనుతు ననుట ♦—

క॥ అంతట రాజు సుమంత్రుని, మంతన మాయమతలంపు ♦ మార్గముఁ గని ధీ
మంతుఁడయి పలికెఁ దనదగు, చింతాభర మాప్రతిజ్ఞ ♦ సేరి ముదుంగన్. ౯౯

సీ॥ రత్నసంపూర్ణమై ♦ రాణువ తోడుగా, నాలుగంచులసేన ♦ నడువవలయు
ధనధాన్యకోశము ♦ లుద్దయుఁ బండ్లపై, నెత్తించి తరలింప ♦ నెంచవలయు
నాయుధాగారంబు♦లందుఁ బ్రముఖ్యము, లేర్చి మోచికొని తో♦నెయిదవలయు
రంభాత్తదంభోప ♦ రామలారామ ల, ట్లాటపాటలఁ దేర్ప ♦ నరుగవలయు
మేలివర్తకు లయ్యెడ ♦ మేకొనంగ
వలయుఁ బుణ్యదేశంబుల ♦ వలనులందు

యజనము లేని స్వాధ్యాయ ♦ మలఁతిపడక
యుండ విప్రోత్తములు కాచి ♦ యుండవలయు. ౧౦౧

తే॥ రాముఁ డారణ్యకం బగు ♦ రాజ్య మేల
భరతుఁడు భరించుఁగాత మి ♦ ప్పత్తనంబు
గొఱఁత లెందునులేమి నా ♦ కోర్కె గాఁగ
నెంచి యిమ్మొయినెఱి ఘటి ♦ యింపుఁ డనిన. ౧౦౨

—♦ కైక విరసోక్తులాడుట ♦—

ఆ॥ మోము వెల్లవోవ ♦ మోసమెల్లఁ దలంచి, కలఁగి వ్యసనవృత్తిఁ ♦ గైక రాజు
మ్రోల నిలిచి పలికె ♦ ముక్తలజ్జ యటంచు, నలువు రాడికొన స ♦ నాథ యగుచు.

చ॥ భరతున కేల యమ్మెయిన ♦ పాడ్పడిపోయినరాజ్య మేలఁగా
నరయఁడె పీతమండ యగు ♦ నాసురఁ ద్రావఁగనేర్చువాఁడు త
త్పరుఁడవుఁ గాక కుచ్ఛితము ♦ దార్కొన నీవిడుతుచ్ఛమైనయీ
భరణము గోరి యింతటికిఁ ♦ బాల్పడుదాన నె మాటలేటికిన్. ౧౦౩

ఆ॥ ఇడఁ దలంచితేని ♦ నితని రిత్తకురిత్త, ద్రోచిపుచ్చి యిడుము ♦ త్రోవఁ దలఁగ
నెంతువేని నింత ♦ యేల యసత్యాబ్ధి, మునుఁగువాఁడ ననుము ♦ మొదలు సెడఁగ.

—♦ దశరథుం డాక్రోశించుట ♦—

తే॥ అనిన నద్దానిచెడునుడు ♦ లాలకించి, కొట్టెదవె గాటఁగట్టి యో ♦ కొఱవి నీదు
పట్టుచెల్లింప దొరఁకొన్న ♦ పాపమునకు, నేలపై నిల్వఁగా నింక ♦ నేర్తు వటవె.

క॥ అని యినుఁడు క్రోధమున నా, డిన ద్విగుణక్రోధయై న ♦ టించుచు నది ప
ల్కెను మును నీవంశంబున, జనపతి సగరుండు జ్యేష్ఠు ♦ నడలింపఁడొకో. ౧౦౪

తే॥ నీమొగంబునఁ దోఁచెబో ♦ నేఁడువింత, లనిన నిస్సీ యటంచు మో ♦ మతఁడుత్రిప్పె
నెల్లజనములు నిందించి ♦ రెఱుకమాలి, యాహితముపాలిదై యది ♦ యట్టులుండె.

—♦ సిద్ధార్థుండను మంత్రి కైకను నిందించుట. ♦—

క॥ వృద్ధుఁ డమాత్యవరేణ్యుఁడు, సిద్ధార్థుం డనెడువాఁడు ♦ స్నిగ్ధుఁడు పతి కా
సద్ధర్ముఁడు కైకంగని, యుద్ధతమనస్కుఁ డగుచు ♦ నొయ్యనఁ బలికెన్. ౧౦౫

సీ॥ నీయన్నవాఁ డవి ♦ నీతుండుపో యస, మంజుం డనఁగఁ గొఱ ♦ మాలినట్టి
కొయ్య మెల్లరఁ బసి ♦ కూనలఁ గొనిచని, సరయువులో వైచి ♦ జడిసివారు
మిడుకుచుండఁగఁ దాను ♦ మిట్టెక్కిచూచుచు, నవ్వుచు నుండు నా ♦ నాటఁబ్రజల
కోటమి పనుపడ ♦ నొక్కట మనుజేంద్రుఁ, జేరి నీపుత్రుని ♦ సిరి దలంతొ

మమ్ము బాలించెదో తెల్పు ♦ మఱియు నింక
రెండు ననినఁ దద్వృత్త మా ♦ గండఁ డడిగి
తెలిసికొని వానిఁ బెల్చునఁ ♦ దిట్టి పనిచె
వెలఁదితోఁగూడ నపునరా ♦ వృత్తి నోడివి ౧౦౯

క॥ ఫాలపిటకములు గొనిచని, వాలాయము కొండచఱుల ♦ వలనులఁ బడి వాఁ
డాలోనె యనుభవించెను, బాలిశభావంబు గూర్చు ♦ ఫల మట్టి కాఁగన్. ౧౧౦

తే॥ ధార్మికుం డతఁ డనిచెఁ బో ♦ తనయు నట్టు
లట్టిఁడే రాముఁ డనద ; నీ ♦ వరసినావె
చందురునియందుఁ గందొక ♦ చంద మైన
నంతమాత్రంబ మైన నిం ♦ దనఁగఁ గలదె. ౧౧౧

ఆ॥ పలుకు మిపుడ వంశ ♦ పాంసని యెఱిఁగిన, యంతవట్టు నేర ♦ మనఘుఁ గూర్చి
తప్పఁ బలికితేని ♦ దండించు నింద్రుని, వజ్ర మెగిచి నిన్న ♦ వార్య మగుచు.

క॥ నిజమేని నితనిఁ దోలమ, నుజవిభుఁడే నేర్చు రిత్త ♦ నోనాడకు మీ
ప్రజ లెల్లఁ దెగడ నీదగు, ప్రజ నీవును మీఁద పొడవు ♦ పడఁగలవారే. ౧౧౩

తే॥ శత్రునంతటివానినిఁ ♦ జావనడన
కున్నె యీధర్మవిప్లవం ♦ బోపి యెట్లు
లెంచితివి పాపమనఁబోక ♦ యీకువృత్తి
మకట; గొడ్డా లనఁగ నైతి ♦ వలసి కనియు. ౧౧౪

ఆ॥ మాయఁజాల వెట్లు ♦ మోసంబె వాటిల్లు, నెల్లవారుఁ దిట్ట ♦ నిట్టినింద
గట్టివాతనంబు ♦ గా దాదటఁ దలంపు, మరసి రాము నిలుపు ♦ మనము గొనుము.

మ॥ అనుచో రా జనువాద మొప్పఁ జెనఁటీ ♦ యాలింపు మీపల్కు లే
మనినం బోలదు మేలుగీండ్లరసి కొం ♦ డాడంగనా నింక నీ
వనయం బెట్లును వీడవేని వని కా ♦ హో; పోయెదన్ రాముతో
డన నేనున్ సకలార్థజాతము గొనుం ♦ డా నీవు నీపుత్త్రుఁడున్. ౧౧౬

—♦ రాముఁడు రాజ్యాంగంబులు వనవాసోచితంబులు గావని నిరాకరించుట ♦—

క॥ అని యతఁ డాడఁగ విభుఁడు త, దను మోదము నెఱపఁ గైకె ♦ యవినయమున చూ
ప నయజ్ఞుఁడు రాముఁడు తన, వినీతి వెలయంగఁ బలికె ♦ విధిముఖవినుతా.

ఉ॥ భోగములెల్లవీడి యొక ♦ పోకకునై వనవృత్తి సర్వసం
త్యాగము గోరునాకె యను ♦ యాత్ర మహోదయలాభ మిట్టినం

రాడక లోఁగ్రుశించువిభు ♦ నాండ్రవిధంబులు నెంచి నిల్చి మో
మోడక చూచుకైక స్మయ ♦ మున్నతియుం గని క్రోధమూర్తియై. ౧౨౮

—♦ వశిష్ఠుండు కైకఁ దిట్టి సీతకు వల్కలధారణంబు వలదని వారించుట ♦—

తే॥ కులగురుం డప్పు డాగ్రహాతి ♦ కూల్య మరసి, సీత వారించి చీ యింత ♦ సిగ్గుమాలి
యేమిగతి కేగదే కేక♦యేంద్రుకోలము, పాడుసేసెదె కైక; నీ ♦ పాపమునను.

క॥ అతిసంప్రవృత్తనైతివి, మతి సెడె నీకింక మేధ ♦ మాట గలదె దు
ర్గతికోడవు శీలమునం, గతి యెచ్చట నెచట నీదు ♦ కాపథరతియుఁ. ౧౨౯

ఉ॥ వంచనసేసి రాజు నని ♦ వార్యవమై తమకించి పొంచి కీ
లించితి చిత్తశల్య మిటు ♦ లేమలు నవ్వఁగ నప్రమాణ నే
నంచుఁ దలంచెదే తగునె ♦ యాగడ మింతలుసేసి అంతుచా
లించినఁ బోదె యాచనవు ♦ లేదె జగంబున నొక్కచానవుఁ. ౧౩౦

తే॥ ఏల చనవలె సీత యి ♦ న్నేలయెల్ల
నేలఁగారాదె యర్థాంగ ♦ మీదినేళ
వంశమణిరాముని కుదార ♦ వర్తి కాత్మ
సతియ యని తెల్పుశ్రుతి సమా ♦ శ్రియ మరయమె. ౧౩౧

ఉ॥ రామునిపై నిప్రేమమిడి ని ♦ రామయమై సతి పోఁ దలంచినన్
మేము పురంబు రాష్ట్రము న ♦ మిత్రముగా సపరిచ్ఛదంబుగాఁ
బోమె సుపుత్రుఁ డన్నగతిఁ ♦ బోవఁడె యాభరతుండు సానుజుం
డై మతిలేనినీతలఁ ప ♦ హో; పెడకీడ్వదె నిన్ను నీకృతిన్. ౧౩౨

తే॥ ప్రజల కిష్టముగానియీ ♦ ప్రతినఁ బట్టి, నీవ యేలెద వీపాడు ♦ నేల యెల్ల
రాముఁ డున్నవనంబె రా♦ష్ట్రంబు నీదు, భవనమె వనంబు గాఁగ నో♦పాపజాతి.

చ॥ క్షితిపతివల్లఁ బుట్టినది ♦ సిద్ధమయేనిఁ ద్వదాత్మజుండు పా
మతిసెడ నేలఁ డీమహి న ♦ మాన్యుఁడనంబడి నీదుమాతృతో
న్నతియుఁ దలఁపఁ డిచ్చటున ♦ నాయమ చెల్లునకాని నీదురు
ర్గతి యెటులేనియు న్బరము ♦ గాంచదు పారము దుష్టమానసా. ౧౩౪

తే॥ మేలుసేయంగఁ దలఁచితి♦మేలుగాని, యదియ సమకూర్ప నౌదు నీ♦వాత్మజునకు
బుడమిఁ బొడమినయట్టి యే♦పుట్టువైన, రాముఁ బాయదు నీకట్టి ♦ వ్రాత లేదు.

క॥ చెట్టులు పుట్టలు రాముని, పట్టగయుచుఁ జనఁగ నీదు ♦ పాపపుగతి యా
మట్టున కెడల నొకటి మదిఁ, బెట్టెదవో యిప్పుడైన ♦ బెడమట్టెదవో. ౧౩౬

రాడక లోఁగృశించువిభు ♦ నాండ్రవిధంబులు నెంచి నిల్పి మో
మోడక చూచు కైక స్మయ ♦ మున్నతియుం గని క్రోధమూర్తియై. ౧౨౭

—♦ వశిష్ఠుండు కైకఁదిట్టి సీతకు వల్కలధారణంబు వలదని వారించుట ♦—

తే॥ కులగురుం డప్పు డాగ్రహాతి ♦ కూల్య మరసి, సీత వారించి చీ యింత ♦ సిగ్గుమాలి
యేమిగతి కేగెదే కేక♦యేంద్రుకొలము, పాడుసేసెదె కైక; నీ ♦ పాపమునను.

క॥ అతిసంప్రవృత్తవైతివి, మతి సెడె నీకింక మేధ ♦ మాట గలదె దు
ర్గతికోడవు శీలమునం, గతి యెచ్చట నెచట నీదు ♦ కాపథరతియుఁ. ౧౨౯

ఉ॥ వంచనసేసి రాజు నని ♦ వార్యవయై తమకించి పొంచి కీ
లించితి చిత్తశల్య మిటు ♦ లేమలు నవ్వఁగ నప్రమాణ నే
నంచుఁ దలంచెదే తగునె ♦ యాగడ మింతలుసేసి అంతుచా
లించినఁ బోదె యాచనవు ♦ లేదె జగంబున నొక్కచానకుఁ. ౧౩౦

తే॥ ఏల చనవలె సీత యి ♦ న్నేలయెల్ల
నేలఁగారాదె యర్థాంగ ♦ మీదినేశ
వంశమణిరామున కుదార ♦ వర్తి కాత్మ
సతియ యని తెల్పుశ్రుతి సమా ♦ శ్రియ మరయనె. ౧౩౧

ఉ॥ రామునిపై నిప్రేముడి ని ♦ రామయవై సతి వోఁ దలంచినఁ
మేము పురంబు గాష్ట్రము న ♦ మిత్రముగా సపరిచ్ఛదంబుగాఁ
బోమె సుపుత్రుఁ డన్నగతిఁ ♦ బోవఁడె యాభరతుండు సానుజుం
డై మతిలేనినీతలఁ ప ♦ హో; పెడకీడ్వదె నిన్ను నీకృతిఁ. ౧౩౨

తే॥ ప్రజల కిష్టముగానియీ ♦ ప్రతినఁ బట్టి, నీవ యేలెద వీపాడు ♦ నేల యెల్ల
రాముఁ డున్నవనంబె రా♦ష్ట్రంబు నీదు, భవనమె వనంబు గాఁగ నో♦పాపజాతి.

చ॥ క్షితిపతివల్లఁ బుట్టినది ♦ సిద్ధమయేనిఁ ద్వదాత్మజుండు వా
మతిసెడ నేలఁ డీమహి న ♦ మాన్యుఁడనంబడి నీదుమాతృతో
న్నతియుఁ దలఁవఁ డిచ్చటున ♦ నాయమ చెల్లునకాని నీదురు
ద్గతి యెటులేనియు న్నరము ♦ గాంచదు పారము దుష్టమానసా. ౧౩౪

తే॥ మేలుసేయంగఁ దలఁచితి♦మేలుగాని, యదియ సమకూర్ప నౌదు వీ♦వాత్మజునకు
బుడమిఁ బొడమినయట్టి యే ♦ పుట్టువైన, రాముఁ బాయదు నీకట్టి ♦ వ్రాత లేదు.

క॥ చెట్టులు పుట్టలు రాముని, పట్టగయుచుఁ జనఁగ నీదు ♦ పాపపుగతి యా
మట్టున కెడల నొకటి మది, బెట్టెదవో యిప్పుడైన ♦ బెడముట్టెదవో. ౧౩౬

మ॥ చెడనేలా తలపోసికొమ్ము స్నుష కీ ♦ చీరప్రదానమ్ము ము
న్నొడఁబా టొందెనొ కర్మిమ్మలం బొడమెనో ♦ యోజించి భావ్యంబు చా
వ్వడ మేలౌనగలం దుకూలముల సం ♦ భావింపు మీకన్య నీ
యుడురాజానన చింతిలంగఁ గడకే ♦ యుద్వృత్తి వాటిల్లునో. ౧౩౭

తే॥ తగినమర్యాద లొప్పార ♦ దాశరథిస, తీవతంసంబుఁ బనుపు మా ♦ తెలివిదక్కి
కానిపోనివికారము ♦ ల్గాంచదేని, నీనికారం బొదవు నింత ♦ నిక్క మబల. ౧౩౮

ఆ॥ అనిన మిన్నకుండె ♦ నాపె వల్కలములు, నైవ స్వీయయోగ్య ♦ వసనములు ధ
రింపఁ బనిచె గురుఁడు ♦ స్త్రీరత్న మవనిజ, ధవునితలఁపుచొప్ప ♦ దలఁచుచుండె.

—♦ దశరథుండు కైకం దిట్టుచుఁ బరవశుండగుట ♦—

ఆ॥ నాథవతి యనాథ ♦ నాఁగ వల్కములు, దాల్పఁ గడగు టరసి ♦ దశరథేంద్రుఁ
డిట్టఁదొడరెఁ దప్పి ♦ దేశంబుజన మాతఁ, డడలె జీవితాశ ♦ యెడలె ననుచు.

శా॥ నిట్టూర్పు ల్నిగుడించి కైకఁగని నీ ♦ నిర్వాణపుంద్రోవ చూ
పట్టెం గాలకు మింక నేమనుచు నీ ♦ భామావతంసంబు నా
కట్ట న్వల్కములిచ్చి తోపుదువె ని ♦ న్నాలుండు గోయింపఁగాఁ
గట్టా పుట్టితివేల రాజసుతవై ♦ కాకున్నఁ గీడున్నదే. ౧౪౧

తే॥ సీత నీకొంప దీసెనే ♦ సిగ్గులేని, దాన దానవివో కాక ♦ తగవు విడుతు
వెట్లు తాపసి యట్టు లీ ♦ యేణనయన, చనిన సుఖపడెదే మను ♦ జాడ లేదె.

క॥ నీపాదుప్రతిజ్ఞాతం, బీపద్దులనెల్లఁ జేర్చి ♦ యే పొడమెనె యా
పాపోపకృతియె వేణువుఁ, బాప జనించినసుమంబు ♦ భంగిఁ బడసెనే. ౧౪౩

తే॥ నీవు పుట్టినపుట్టువు ♦ నీదుబ్రదుకు, తెలవు రామునిఁ దెరలింపఁ ♦ దేటపడియె
నింత కీక్రోఁతిగంతు లిఁ ♦ కేల నైవ, నిరయ మేనాఁటికిని నీకు ♦ నిశ్చితంబు. ౧౪౪

క॥ అని యాక్రోశించుచు వాఁ, డనయము శోకమునఁ గుంది ♦ యాతురుఁడై మే
దినిపైఁ బడెఁ దలయెత్తం, గననోడి వికాసవిజిత ♦ కమలవనాంతా. ౧౪౫

—♦ రాముఁడు దశరథు నూఱడించుట ♦—

ఆ॥ వానిఁ దేర్చి పలికె ♦ వరవర్ణినీ ; రాముఁ, డేను వనికిఁ బోవు ♦ టెఱిఁగి యెఱిఁగి
కోసలాత్మజాతఁ♦గొనకొని పోషించు, కొనుము తలఁచి మేలు♦ కొనుము లెమ్ము.

క॥ నాతల్లి యశస్విని భృశ, మాతురయైనది సుశీల ♦ యత్యుద్ర యిటం
జేతనఁ బాయకె యుండ, జేతయచూ మేలునీ క ♦ చింత్యగుణాఢ్యా. ౧౪౭

తే॥ పుత్రశోకంబుఁ బొరసి తాఁ♦బొలిసెఁ బో యు,నంగనీకుము నీకల్గు ♦ నాడులకును
నీదుసన్మానముఁ దలంచి♦నిన్ను గొలిచి,యెడరు మఱచి ప్రవర్తింప♦నేలుకొనుము.

క॥ ఎన్నఁడు శోక మెఱుఁగదని, కన్నయ్యా; యింతదెలుపఁ ♦ గావలసెను నీ
కన్న నొరు లరయుదు రె యే, కన్నాకగు ధర్మ మైనఁ ♦ గని నడిపింపన్ ౧౪౯

క॥ అనినం బ్రత్యుత్తర మొసఁ, గను గనుఁగొననేనినా ర ♦ కం బఱ వ్యథలో
మునిఁగి ముహూర్త మసంజ్ఞతఁ,గొనిదుర్మనుఁడగుచుఁ బొరలె♦క్షోణీంద్రుఁడుమా.

ఆ॥ ఏడ్చె నిట్టులనుచు ♦ నేణాంకముఖ; రామ;,యాల నే వివత్స ♦ లై కృశింపఁ
జేసినాడ నెన్ని ♦ చేతనములనేనిఁ, జంపినాడఁ బాప ♦ జాతినగుచు. ౧౫౧

ఉ॥ దానిఫలంబు నాకిడక ♦ తా నెడతీయునె మిత్తి యెట్లునో
నా నది కైకయే యనఁగ ♦ నైనఁ దలంగవు మేనిఁ బ్రాణముల్
గానకు నీవు పోవ గతి ♦ గాన కుపేక్షితవృత్తు లన్నియుం
గా నద నయ్యెదే యనుచుఁ ♦ గాంక్షితముం దలపోయుచుండెనో. ౧౫౨

క॥ కాకున్న నీపె వేఁపఁగఁ, బోకకు నీ వియ్యకొని వి ♦ భుఁడ వీచీరల్
గై కొని తాల్పఁగ నిమ్మయిఁ, బోకుండునె యెంతమొండి ♦ పుత్త్రలికంబో. ౧౫౩

క॥ అని రామా; యని దిక్కులు, గని కన్నులుమొగిచి కట్టెఁ ♦ గంపం బడనై
పనవిపనవి నెట్టన సూ, తునిఁగనుఁగొని పలికె వాఁడు ♦ తుహినాద్రిసుతా.

—♦ దశరథుండు సీతకు దుకూలాంబరాభరణంబు లొసంగుట ♦—

ఉ॥ చాలు గొనంబులెల్ల నొక ♦ చాలుగ బెంపిడఁజాలు పుత్త్రునిన్
దోలఁగనైన యాఫలమ ♦ తోఁచెడు నింకిటఁ గన్నవారికిన్
మేలనరాదు నాపలుకు ♦ మేలున మేలిరథంబుఁ బూన్చి యు
ద్వేలవనాప్తి ఏనికిడి ♦ వృత్తము దెల్పు మనంతరంబుగన్. ౧౫౪

తే॥ అనఁ గనకభూషితంబగు ♦ నరద మొకఁడు
వన్ని కొని తెచ్చి నృపుఁజేరి ♦ ప్రణతుఁ డగుచు
దెలుప సత్వరుఁడై కొని ♦ తేరఁ బనిచెఁ
దనదుకోశాధికారి న ♦ ర్థము స్ఫురింప. ౧౫౫

తే॥ దేశకాలము లరసి ని ♦ దేశమున మె, లంగ నేర్చినఘనుఁడు క ♦ లానిధి శుచి
వాఁ డతనితోడవచ్చియు♦వ్వాని కెఱఁగి, యానయేమనితలఁపించి♦యడుగుటయును.

ఉ॥ పట్టదుకూలము ల్పసిఁడి ♦ పైపని మెచ్చులమేనిక్రొన్నగల్
గట్ట ధరింప నీసమయ ♦ కాలము నెంచి కొఱంత యెట్లు నే

వట్టున లేదనం బుడమి ♦ వట్టి కొసంగుము నామనోరథం
బిట్టులమయ్యు నిత్తఱికి ♦ నింతకుఁ జాలెఁ గృతాంతుదుర్మతిన్. ౧౫౮

ఆ॥ అన మహాప్రసాద ♦ మనుచు వాఁడవియెల్ల, నదనెఱింగి సీత ♦ కప్పనంబు
సేసి ధన్యుఁ డయ్యె ♦ సీమంతినీమణి, దాల్చి మెఱసె వైద్యు ♦ తద్యుతియుఁగ.

క॥ అది యుదయగిరియకా న, య్యది భానుప్రభయ కాఁగ ♦ నయ్యెడ నయ్యెన్
సుదతి ప్రయాణోన్ముఖియై, సదయుఁడు హరితోడిదా ప్ర♦సంగముఁ బెరయన్.

—♦ కౌసల్య కోడలిం గుఱించియెత్తి బుజ్జగించుట ♦—

తే॥ దైన్యసంపాదినియుఁ గాక ♦ తరలుదాని, దాని స్వభుజాంతరంబునఁ ♦ దద్దదార్చి
శిరము మూర్కొని యిట్లనె ♦ శీలవిదుషి, కోసలాత్మజ తనమేల్మి ♦ కొనలువాఱ.

క॥ మారాజలక్ష్మినైవి వని, వారితవై వనికిఁ బోవు ♦ వల నరసితె నీ
నేరమని కలదె నేరిమి, సారోదారం బనంబు ♦ సమకూర్పదొకో. ౧౬౨

క॥ సతులమని యసతు లటుసం, తతసత్కృతలగుచు నుండి ♦ దయితు విపత్సం
గతుఁ గని యనాదరింతురు, మతిఁ దమగతు లూహసేయ♦మార్కొన రెందున్.

ఆ॥ ఎంతకలిమి గనియు ♦ నెన్నిభోగంబులుం, బడసియును నొకింత ♦ లడలు పొడమ
భర్తమేల్మి సుంత ♦ పాటింప కెడయింప, నెంతు రెవియొ దూఱు ♦ లేర్చికూర్చి.

ఉ॥ శీల మసత్య మావికృతి ♦ సిద్ధ యనాప్యము హృద్గతం బస
న్మాలము సంశ్రుతంబు బలు ♦ మోసపుటిక్కలు చేష్టితంబు లు
న్మాలనదక్షము ల్కృతిస ♦ ముద్గతపాపచయంబు లింతు లా
వాలము లింతకున్ క్షణవి ♦ భాగవిభిన్నవిరాగసౌహృదల్. ౧౬౫

తే॥ కోలము దలఁపరు కృత మను ♦ కొనరు విద్య
శూన్య దత్త మవిత్తము ♦ సుగ్రహం బ
వగ్రహం బెవ్విధినిఁ బట్టు ♦ వడుదు రబల
లరయ నశ్వత్థదలచలి ♦ తాత్మ లెపుడు. ౧౬౬

ఉ॥ శీలము సత్యమున్ శ్రుతముఁ ♦ జిన్మయమాశ్రుతమున్ శుచిత్వమున్
బాలనసేయునారులకు ♦ భర్తయె దైవత మట్లుగాన నీ
వోల మతండ యం చెదదు ♦ రూహము లెంచక వన్యకేగునా
బాలునిఁ గావవమ్మ పతి ♦ వత్నివినా నెగడొందు మమ్మరో. ౧౬౭

క॥ ధనముగలవాఁడయేని న, ధనుఁడేనియుఁ బతియ తనకుఁ ♦ దానకమని నె
మ్మనమునఁ గూర్తురు సాధ్వులు, వనితామణి నిన్నుఁబోలు ♦ వారలు ధాత్రిన్.

క॥ అని బుజ్జగింప నెలకొని, యనురాగము రూపమొందె ♦ నన నాయమతో
నన సీత కృతాంజలియై, యనుకృతధర్మార్థముగఁ ద ♦ దభిముఖియగుచున్.

—♦ సీత యత్త కెఱఁగి యనుజ్ఞగొనుట ♦—

తే॥ ఆర్య ; నీయనుశాసనం ♦ బంది నేఁ గృ, తార్థనైతిఁ బ్రవర్తింతు ♦ నట్లె మున్ను
వింటి నిత్తఱి నీకూర్పు ♦ విధమునం బ్ర, బుద్ధ యన నాదు నొండొంటఁ ♦ బోవ నెందు.

క॥ ఇయ్యది యసజ్జనముకృతి, నెయ్యము మదిఁ జేర్చునదియె ♦ నెఱిధర్మువున్
డయ్యెక మెలఁగునకా కొక, దయ్యమునకుఁ జేయిసాఁపఁ ♦ దలఁచు నె యెపుడున్.

తే॥ చందురుని కాంతి సుమ్మది ♦ సంభ్రమంబు, పీడవమ్మ యతంత్రియా ♦ వీణ మ్రోయు
రాణ గలదె యచక్రంబు ♦ రథము గదలు, నే యపతి సతి సుఖయోగ ♦ నిష్ఠఁగను నె.

క॥ అతివ శతాత్మజ యేనియుఁ, బతిఁగొల్చి ప్రతిష్ఠఁ గాంచుఁ ♦ బరయోగతి ను
న్నతి గననేర దసము సెడ, మతిహీనత నతనితలఁపు ♦ మలఁచునయేనిన్. ౧౭౩

క॥ మితముగ నిడుఁ దనతండ్రియు, మితముగ నిడుఁ దల్లి సుతులు ♦ మితముగ నిడువా
రతివ కమితదాత యనం, బతియాఁ దా నతని కొలువుఁ ♦ బడయక చెడదే.

క॥ శ్రుతధర్మపరావరయనఁ, బ్రతీతనై మేలియోగ ♦ పద్ధతిఁ గొని నే
బతి నవమానింతునె దై, వత మే యతఁడనుచుఁ గొలిచి ♦ వఱలుదు నెపుడున్.

చ॥ అను ధరణీజపల్కు లమృ ♦ తాంచితసేకములై తలిర్ప భా
వన పెనుపొంద సర్వజన ♦ వందిత కోసలకన్యదుఃఖహా
ర్షనియతిహీనబాష్పజల ♦ సంగతి సత్త్వ మసత్త్వయోగమున్
వినిహతముం బొనర్ప గుణ ♦ విశ్రుతయయ్యె ధరాధరాత్మజా. ౧౭౪

—♦ రాముఁడు తల్లికి వందనంబొనర్చి సెలవుగొనుట ♦—

తే॥ తల్లులందఱలో సత్కృ ♦ తత్వమొలయఁ, దనరు తనతల్లి సురవల్లిఁ ♦ గనిమహేచ్ఛఁ
దల్లనల్లనఁ జేరంగ ♦ నరిగి యెరఁగి, యెలమి మీఱంగ రఘువీరుఁ ♦ డిట్టులనియె.

ఉ॥ చింతిలఁబోకుమమ్మ పరి ♦ శీలనసేయఁగదమ్మ నాథునిన్
మంతన మొప్పఁ గొల్చునెఱి ♦ మానకుమమ్మ యొకింతకాల మీ
వంతదలంగవమ్మ భగ ♦ వంతుని సత్కృప శ్రేయ మెక్కుడౌ
వంతున కెక్కునమ్మ నిజ ♦ వర్గము గన్గొనవమ్మ యమ్మరో. ౧౭౫

ఆ॥ కనులుమూసి తెఱచు ♦ కాలంబులో నెల్లఁ, గడచు నిదియుఁ బెద్ద ♦ కాల మనక
మేను వనిజరించి ♦ యిట్టట్టు సుహృదులఁ, గూడివత్తు మేలు ♦ కొనియె దపుడు.

క॥ అనయము నిద్రాక్షయమున, మొనయుఁ బ్రబోధోదయంబు ◆ మున్నడి తమముల్
దనరంగనీ కడంచుచుఁ దనతత్త్వం బదియ కాఁగఁ ◆ దలఁపుము జననీ. ౧౮౦

తే॥ భానుఁ డుదయింప నేపట్లఁ ◆ బరఁగఁబోదు, తమము దారుం డతని నెదఁ ◆ దద్ద దలఁచు
జన మహోద్యోగ మొదవునే ◆ జగతి కెన్నఁ, డేని నీవేనిఁ దద్భావ ◆ మెంచి మనుము.

ఆ॥ అనుచుఁ బ్రోడ యాత ◆ డంబ కౌలంబ మా, సంబరంబ కాఁగ ◆ శంసితంబు
శాసితం బొనర్చు ◆ సడి ననుశాసనం, బొలయఁగాంచి యూర్జి ◆ తోక్తి బెంచి.

తే॥ తడయ కెదనుంచి సార్థశ ◆ తత్రయంబు, మాతృమండల మీక్షించి ◆ మలసి మ్రొక్కి
యార్తలగు వారి నెల్లర ◆ నాదరింపఁ, దలఁచి యిట్లనె ధర్మత ◆ త్పరుఁ డతండు.

క॥ ఏ నెఱిఁగి యేని నెఱుఁగక, యేనిఁ జనవున నయేని ◆ నేమంటినొ యా
స్థానేరమి మఱచి యను, జ్ఞానం బొసఁగుఁడు వనప్ర ◆ చారంబునకున్. ౧౮౪

క॥ ఆమంత్రణ మొనరించెద, నోమహితచరిత్రలార ; ◆ యుంచుఁడు దయ నా
పై మీరక వా రాఖీ, లామయహతచిత్తలగుచు ◆ నందఱుఁ బెలుచన్. ౧౮౫

క॥ క్రౌంచికలకరిణి నపుడ, భ్యంచితలను వేది యఱచి ◆ రలజడిపడి ము
న్నెంచనగు తూర్యరవముల, మించునగరు శోకనాద ◆ మేదురమయ్యెన్. ౧౮౬

—◆ సీతారామలక్ష్మణులు వనప్రచారంబునకుఁ బయనంబగుట ◆—

ఉ॥ అంతట దుఃఖసాగరము ◆ నందు మునింగెడు రాజుఁ దేర్చి దీ
నాంతరవృత్తులై సుతులు ◆ జ్యాసుతయు న్సపరిక్రమంబుగా
నెంతయు భక్తిమై వినతు ◆ లేర్పడఁ జేసి యనుజ్ఞఁ గాంచి ధీ
మంతులు కోసలాత్మజకు ◆ మానుగ వందన మాచరించిరన్. ౧౮౭

ఉ॥ అందఱ గ్రుచ్చియెత్తి కరు ◆ ణాలసవాఙ్మయ మొప్ప దీవెనల్
పొందుగఁ గూర్చి నద్దలఁచి ◆ పొచ్చెములే కరుదెంచు నైశమం
చుం దనివోక పల్కుచు వి ◆ శుద్ధగుణార్ద్రి యనుజ్ఞ సేయ సం
స్పందితులై సుమిత్ర నటు ◆ చయ్యనఁ జేరి నమస్కరించిరన్. ౧౮౮

—◆ సుమిత్ర యందఱం దీవించి లక్ష్మణునిఁ బ్రబోధించుట ◆—

తే॥ అందఱకు దీవెన లొసంగి ◆ యుపహితాత్మ
యయ్యు సుతమోహావశమున ◆ నవశయగుచు
శిరము మూర్కొని చెక్కులు ◆ చేతఁ బుణికి
యిట్టులనె హితమెంచి న ◆ గేంద్రతనయ. ౧౮౯

ఆ॥ నిను సృజించె ధాత ♦ నీతిమై నన్నతో, వనికిఁ జని మెలంగ ♦ వలె నటంచు
మలయనీకు మేప్ర♦మాదంబునేనియు, నన్న ; యతనిఁ గొలువు♦మహరహంబు.

క॥ వ్యసనియని పీడఁదలఁచుట, సుసమృద్ధుం డనుచుఁ గొల్వ ♦ జూచుటయును రా
గసమేతున కవు నవి తగ, వు సమాహితవృత్తిరెంటఁ ♦ బొసఁగుట దక్కన్.

ఆ॥ నీకు గతి యితండె ♦ నేర్చి ప్రవర్తింపు, మగ్రజుఁడు మహాత్ముఁ ♦ డభిగుణుండు
జగతి జ్యేష్ఠవశగుఁ ♦ డగువాఁడె ధన్యుండు; ననుచుధర్మ విది స ♦ నాతనంబు.

క॥ మనకొలముధర్మ మిదెచూ, మనుప్రొద్దున దాననిరతి ♦ మఖదీక్ష దురం
బునఁ దలఁకక మే నొసఁగుట, యనువర్తితమయ్యె నేఁటి ♦ కనుపూర్వముగన్.

క॥ అన ననుమతిఁగొని యరిగెడు, తనయుని తెఱఁ గరసినదియు ♦ దత్త్వనిధి క్షమా
ఖని మఱియు నిట్టులనె నె, మ్మనము తదాశంసితార్థ ♦ మహితము గాఁగన్.

తే॥ అన్న; దశరథుఁగా రాము ♦ నెన్నఁగనుము
మలసి నన్నట్లె భావింపు ♦ మాజనకజ
నటవి నెడ్డ్వ నయోధ్యఁగా ♦ నరసి కొనుము
ననుచుము యథాసుఖస్థితి ♦ మనుముచనుము. ౧౯౫

—♦ సుమంత్రుఁడు రాముని బ్రేరేపించుట ♦—

క॥ అని సెలవొసఁగె సుమంత్రుఁడు, మనుకులమణి రాము నింద్రు ♦ మాతలివలెఁ జ
య్యనఁజేరి మ్రొక్కి యిట్లనె, వినీతుఁ డధివినయుఁ డగుచు ♦ విలసితమూర్తీ.

తే॥ శుభము తేరెక్కు మిప్పుడే ♦ శోభనాంగ
యశము నీకగు రాజయో ♦ గ్యంబు జయము
నీయదియ నీతలంచువ ♦ నీతలంబు
నేర్తు నొకగడెలోనె సం ♦ సిద్ధి వెలయ. ౧౯౬

ఆ॥ కైకపలుకుపలుకు ♦ గావించి భూమీంద్రు, నన్నృతయోగతీర్ణుఁ ♦ డన నొనర్పఁ
దలఁచినాడ వింకఁ ♦ దామసం బేటి కు, పక్రమింపు వనని ♦ వాస మనఘ. ౧౯౭

—♦ రామలక్ష్మణులు సీతాపురస్సరులై రథమెక్కుట ♦—

క॥ అనునెడ సూర్యనిభము స్యం, దన మారోహించె సీత ♦ దలకొని హృష్టా
త్మనిరతి జయమెన్నుచు నది, తనపనిగా సిద్ధియోగ ♦ దశ నెగడొందన్. ౧౯౮

ఉ॥ తోడనె యన్నదమ్ము లధి ♦ తోషణ భూషణులై సదీక్షులై,
యోడనిచిత్తము ల్వెలయ ♦ నూర్జితులై రథమెక్కి రథ్యర

శ్రీనుడిత వేదినాఁ దనరె ♦ నిత్థశిఖిత్రయి తత్త్రియాస్థితిన్
గూడినచొప్పునై నదిపి ♦ కుంతవిలాసవిశేషవై దుషీ. ౨౦౦

తే॥ వననివాసంబు లెక్కించి♦వారిజాక్షి, కొనఁగ నెమ్మెయిభూషలు ♦ వసనములును
గొడుకులకు నల్లె కవచముల్♦గూర్చువిండ్లు,నను చుశస్త్రములిచ్చెన♦మ్మనుకులుండు.

—..♦ సుమంత్రుఁడు రథముఁదోలుట ♦—

క॥ సీతాతృతీయులను సమ, వేతుల సారూథియుతుల ♦ నెంచి సమంచ
త్పాతముల సమ్మతములఁ బ్ర, వాతజవుల హయుల వాఁ ♦ డవారణఁ దోలెన్.

తే॥ రాముఁ డడవికిఁ బోయెడు ♦ రయము చూరఁగ
మూర్ఛ మునుకొనెఁ బౌరస ♦ మూహమునకు
నంతిపురి కట్టు లాచతు ♦ రంగబలము
లకునుఁ జిత్తములందుఁ గ ♦ లానిధాన. ౨౦౩

వ॥ అప్పు డప్పురవరంబున నెప్పాటిప్రాణులకేనియు విప్పిచెప్పరాని ముప్పువాటిల్లె నందు సమాకులత్వంబునం దరలుజనంబుల సంకులారావంబులును సంకుపితద్విప క్షోభంబులును నిర్ధూతతురంగ మశింజితనిర్ఘోషంబులును యావతార్తనాదంబులును సంపాతాభియాతంబునం బన్ని మిన్నుముట్టె ఘర్మార్తులు సలిలంబునకై యెట్టు లట్టులు రామునింగూర్చి యాబాలవృద్ధంబుగాఁ బ్రస్థితులై యెల్లనాగరులును సముత్కటయగుపీడ తోడ్పడం గూడముట్టనెంచి పరువడించి పరువులిడుచు వెనుబడిప్రేలుచు వ్రాలుచుఁ బ్రక్కలకెక్కుచుఁ దదున్ముఖులై బాష్పపూర్ణముఖులును భృశనిస్వనులు నగుచు దైన్యంబున నోసూతపుత్రా; నీకుం బున్నెంబయ్యెడు రథ్యంబుల ప్రగ్గంబుల నొక్కింత చిక్కపట్టు మొక్కపరి రాము మోముసోముచక్కి సక్కగనుంగొనియెదము, చిరకాలం బియ్యది మాకు దుర్లభంబుగదే యని యడలువారును గానుమాత హృదయం బాయసంబకాఁ బోలు నట్లుంగాకున్న దేవగర్భప్రతీకాశుం డీతం డడవిపాలై చనుచుండ వినిర్భిన్నంబు గాకుండునే యనువారును మేరుపర్వతంబు నర్కప్రభ వోలెఁ బతి ననుసరించి ధర్మనిరతయై ఛాయానుకృతి వీడక యోడక జరుగుచున్న జనకజాతయే కృతకృత్యహో యనువారును లక్ష్మణా; యెంతసిద్ధార్థుండవు దేవతానువాదియు సేవకానుమోదియు ననారతప్రియవాదియు ననుసడిసన్నలుగల యీయన్నకుం బరిచర్యలొనరింప నరుగుచున్నవాఁడ వనువారును ఇదియే నిఖిలసిద్ధి యిదియే మహాభ్యుదయం బిదియే స్వర్గద్వారం బిదియే నిశ్రేయసంబు సుమ్మి యమ్మనువారును నిట్టట్టనేరక యూరకయ కనుంగొనలనుండి బాష్పాంబుకణంబులు దొరల మరలక చనువారును గా నగుచుండ నంతిపురివెలువడి దీనాంగనాజన

పరివృతుండై మేదినీపరివృఢుండు నా ప్రియపుత్రునిం జూపరే యనుచుం దెర లుచుఁ బొరలుచు యంత్రనిబద్ధంబగు కుంజరంబుచాడ్పునం బొడకట్టఁ గరేణుకా గణంబట్టు లరీణంబైన స్త్రైణంబురోదలు చదలుముట్టం దోడన పఱతేర తీఱని యాపద పదనెఱింగి పదపదమని సనిగ్రహాగ్రహంబునూప గ్రహోపప్లుతుండగు పూర్ణశశాంకునిం బెరయుచు నరయుచు హాపుత్ర; హాపుత్ర; యని యఱచుచు వెఱచుచు సన్నుండయ్యు నాసన్నుండై రాఁగని విరాగంబున నచింత్యాత్ముండగు రాముండు సూతునిం ద్వరపెట్టుటకును వెనుబడివచ్చునాతని మెచ్చునవ్వారలెల్ల నాఁగుమాఁగు మనుటకును నప్రతిహతస్యదంబగు నరదంబు వశంవదంబయ్యె నయ్యెడ జనసంబాధంబునం ద్రొక్కుడుపడినపుడమినుండి పైకెగసి చనఁజూచు పరాగంబు పౌరజనాశ్రుజలంబులచే నపరాగంబుగా మీనసంక్షోభచలితంబులగు పంకజంబులవలనం దొట్రిలు సలిలధారలపగిది నవరోధాంగనలనయనంబుల దొరఁగు బాష్పజలంబుల సోన లొక్కండై ప్రవహించి శోకార్ణవసమావే శంబు నిర్దేశించుచో హాహారవంబులు తరంగరింగణనిర్ఘోషంబుల ననుకరింప నిలింపవల్లభసఖుండగు నాభూమీంద్రుం డావినిపాతంబునకు హతమూలంబగు ద్రుమంబు చాడ్పునఁ బుడమింబడ హలహలాశబ్దంబులతో నంతఃపురజనం బులు పరిజనంబులుం జుట్టుకొని యత్యంత దుఃఖితుండగుచు నవసాదోన్ముఖుం డగు నాతని నెత్తిపట్టి తొట్రిలుచు నోరామా; యోరామమాతా; యనుచు నెలుంగెత్తి యెత్తి పిలుచుచుం దత్కాలోపనతంబులగు నుపచార వచనప్రచారంబులం గొంతవట్టుసేదదేర్చి కూర్చికొని యెప్పటియట్లై కొని పోవుచుండ దండం గోసలాత్మజయు వత్సాభిలాషంబున నిష్ఠయెడలి గోష్ఠంబు వెరయంజను సంబద్ధవత్సయు వత్సలయు నగు ధేనువునాఁ గనన్నై యోరాఘవా; యోజనకజా; యోలక్ష్మణా; యొక్కంతతడవైనం దడవుసేయంజనదే యని జనంబులమనంబులు సడలఁ గడలకెక్కు నావేశంబున నాక్రోశించుచు డగ్గుత్తిక పడ లగ్గొత్తుడువడ నస్రంబులుజాఱఁ దమిస్రింబులుందూఱ నవశయా వివశత నిట్టట్టునట్టేదునెఱిం బరిభ్రమించుచుం బఱతెంచుచుండ దశరథుండు రథవేగం బాఁగంగదే యని సుమంత్రు నిమంత్రితుం జేయ నోరూర నెలుంగారం బిలువఁ జెలువుదోఁప రాముండు ప్రేరేప నుభయచక్రాంతరవృత్తనిమిత్తం బిట్టు లాతని చిత్తం బనుపాత్తార్థంబుగా నలుఁగుడువడం దోత్త్రార్దితంబైన ద్విపంబుకరణిఁ బురుషవ్యాఘ్రుండగు రఘురాముండు తల్లిదండ్రులపడుపాట్లెల్ల నెఱింగియు నయ్యాం గడలం గాననోపక కాననోపకలితకృత్యకల్పంబునకు వికల్పంబు గావింపనోడి ధర్మసంయతుండై పాశబద్ధంబగు కిశోరంబుమాడ్కిఁ జూచియుం జూడక తేరు దోలించుకొని పోవుచుండె నయ్యవసరంబున. ౨౦౮

తే॥ నన్ను నాదృతుఁ జేయుదే ♦ యన్న ; యనెడు
తండ్రిఁ గన నిల్వరాదె నా ♦ తండ్రి ; యనిన
సూతుత్రోసనె నాఁటికిఁ ♦ జూతు మింత
లరయ మారయమున నయ్యె ♦ ననఁగ ననుచు. ౨౦౫

క॥ అంతిపు రంత సమాగతు, లంతికగతులైనవార ♦ లాలింపఁగ శ్రీ
మంతుఁడగు రాముమత మొ, క్కింత దెలిపి తటిమె వారుల ♦ హిమధరతనయా.

— ♦ అమాత్యులు నాగరులు రాజప్రభృతుల మరల్చికొనుచు మరలుట —

తే॥ పురియు నంతిపురియు వాని ♦ పోవుకర్జ, మరసినమదిం బ్రదక్షిణ ♦ మాచరించి
రాజజనము మరల్చువి♦రాగమునకు, మరలె మన మశ్రుధారలు♦మగుడ కెనయ.

క॥ ఎవ్వనిపునరాగతి మతి, నివ్వటిలునో వానితోడ ♦ నెలకొని పిరుదం
దవ్వరుగరా దనుచు నృపు, నవ్వేరవున నిలిచి నిలిపి ♦ రతనియమాత్యుల్.

ఉ॥ మేనునఁ జెమ్మట ల్వోడమ ♦ మించినయార్తిఁ గృశించుచుం దమో
లీనత దీనభావము వ్య ♦ లీకునిఁజేయ మహీంద్రుఁ డాంద్రతోఁ
దా నడునిల్చి యాత్మజునిఁ ♦ దత్పరతం గనుచుండె నెంత క
య్యానము గానవచ్చెడునో ♦ యంతయు మేలను చిత్తవృత్తితోన్. ౨౦౮

తే॥ అంతకంతకు రాముని ♦ యరద మెగచి, చనఁగ నంతిపురిం గల ♦ చానలెల్ల
వత్సవిరహితలౌ నాల♦వలనుదోఁప, నినుఁడు విన నార్తి నోగులుచు♦నిట్టులనిరి.

—♦ అంతఃపురస్త్రీలు విలపించుట ♦—

తే॥ ఏము కైకేకొనర్చిన ♦ దేమొ తేనిఁ, జిక్కఁబట్టి మహామహు ♦ శ్రీసనాథు
రాము నడవికిఁ బంపించె♦నయము గలదె, యధిపునిశ్చేతనత్వ మి♦ ట్లరసి యరసి.

ఆ॥ సత్యసంధు ధర్మ్య ♦ సజ్జనప్రియు శరి, ణార్థిరక్షకు న్మ ♦ హాత్ము రాముఁ
గాన కనిచె నింత ♦ గానదే తనమేలె, మేలె యెల్లవారి ♦ మేలు వలదె. ౨౧౨

చ॥ కుపితుఁడుగాఁడు తిట్టినను ♦ గూర్చి యొకొండ్ల మనఃప్రసాద మె
ల్లపుడును గోరు నోడ్లవ్యథ ♦ లంగని చింతిలుఁ దల్లి నట్టులే
నృపసుతు లిందఱం గొలుచు ♦ నేత ప్రజావలికెల్ల నిట్టిఁ డే
యపకృతి కిట్టిచేతఁ బడె ♦ నాలన పాలన లేదె యింకిటన్. ౨౧౩

ఆ॥ధర్మమంచు ధరణి ♦ తనయువోఁ దల్లి పొ, మ్మన సుమిత్రకొమరుఁ ♦ డట్టులేగ
గలదె యిచట నింక♦గతియు మోక్షము నాఁగ, బ్రదుకుటింకధరకు♦ భరమకాక.

క॥ అని యఱచువారియార్త, ధ్వనులాతం డరసి మున్నె ♦ తనపని చెడఁగా
ననద యయి యున్నగతి కది, యనుగతి రూపింప నవసి ♦ యడలుచునుండెన్.

—♦ పౌరజన వైముఖ్యము ♦—

సీ॥ అగ్నిహోత్రములుసే ♦ యరు గృహమేధులు, పాకమెన్నరు వంట ♦ పట్టువారు
కర్జమ్ము లెవ్వియుఁ ♦ గనఁబోవ రేప్రజ, ల్గానరాఁ డమ్మెయిఁ ♦ గర్మసాక్షి
కబళము ల్గొనవు నా♦గములు తురగములుఁ, బసులు గ్రేపులకునుఁ♦బాలొసఁగవు
కాన కపత్యంబు ♦ గని పొంగదు సవిత్రి, భర్తరా సాధ్వి సం ♦ భ్రమముఁ గొనదు
తల్లిదండ్రులఁ గనఁబోరు♦తనయు లన్న, దమ్ము లొండొర్ల నెన్నరు♦తపులు లేదు
విందులన నంద అన్నియు♦విడిచిరపుడు, రాముఁ డడవికిఁ జననైన♦యామయమున.

చ॥ పవనుఁడు వీవఁ డెందు నెల ♦ భాసిలఁబోదు వెలుంగుచూపఁ డా
రవి దెసలం బ్రిసాద మన ♦ రా డెడలెం గ్రహతారక ల్సను
ష్యవహిత మయ్యెఁ జీకటి స ♦ మాకులమయ్యె జనంబు నాఁడు రా
ఘవుఁ డఖిలైకపూజ్యుఁ డటు ♦ గానకు నేగెడు నన్నవార్తకున్. ౨౧౮

తే॥ వక్రముఖ్యగ్రహావళి ♦ వక్రగతినిఁ, జంద్రుఁ బైకొనె దుష్టగ్ర ♦ సంగమునను
ధూమ్ర లగుచు విశాఖలు♦దోఁచె నొదవెఁ,గాళికానిలరయమహీ♦కంపములును.

ఆ॥ ఒరయుదుర్దినము మ♦హోదధినట్టు ల, య్యార్త నగరరాజ ♦ మలముకొనఁగ
ఘోరుకొనియె నదియు ♦ ఘోరన జగమున, కిట్టిచేటు మూఁడు ♦ నింకననుచు.

క॥ అందఱు శోకపరాయణు, లందఱుఁ బర్యాకులాత్ము ♦ లతిదైన్యగతుల్
మందులుననవైరయ్యెడ, నందొకఁడును లేఁడు హృష్టుఁ ♦ డని మందునకున్.

తే॥ అతనిసుహృదులలోఁ గొంద ♦ ఱయ్యుహమునఁ
బడినయదె పాటుగాఁ బడి ♦ పంచలందుఁ
బండియుండిరి చింతాగ్ర ♦ పాతమునను
గానఁబడ దప్పురికి నేమి ♦ గతి గలుగునో. ౨౨౧

క॥ నైకం దిట్టనియతఁడును, శోకమునకు మేను వైవఁ ♦ జొరనియతండున్
బ్రాకట మగునప్పురమున, నేకరణిం గనిన నవ్వ ♦ యింపఁ డొకండున్. ౨౨౨

తే॥ అలపురందరుతో వినా ♦ యైన జగతి, యెట్టు లట్టులె రాఘవుం ♦ డెయిదునంత
నంతమొందెడునను సన్న♦నడలఁ దొడరె,నడలి పురితన కెదినిల్చు♦జాడయనుచు.

క॥ ఘోషిల్లునప్పురిం గని, శోషిల్లుచు రామురథముఁ ♦ జూచి పరాగో
న్మేష మరసి యది దోఁపమి, భాషలుడిగి మూర్ఛమునిఁగి ♦ పడె నృపుఁ డబలా.

క॥ దక్షిణబాహువు నూఁది సు, దక్షిణ కౌసల్య మెత్తె ♦ దయితు నితరమా
పక్షముఁ గొనఁజనెఁ గైక యు, దక్షిణ భరతార్థకలిత ♦ దాక్షిణ్యమునన్.

తే॥ నయవినయధర్మమహితుఁ డ ♦ న్నాథుఁ డప్పు
డువిదఁ గన్గొని రామవి ♦ యోగజనిత
తాపసంవ్యాధితేంద్రియ ♦ త్వమున నులికి
పడుచు నిట్లని పలికె నే ♦ ర్పడ మృగాక్షి. ౨౨౬

—♦ దశరథుఁడు కైకను నిరాకరించుట ♦—

సీ॥ దుష్టచారిణి నీవు♦తోలుచుకొంచునటించి, యేల నాయెడ లాన ♦ నెంచె దిపుడు
ధూమకేతువ పోలెఁ ♦ దోఁచితి కేకయు, నింట రెండుకొలంబు ♦ లంటఁగాల్ప
భార్యవుం గా వెట్టి ♦ బాంధవంబును లేదు, నాకు నీకును నిన్ను ♦ నను చుప్రజకు
నింక నీమోము నే ♦ నెన్నఁడుం గనఁబోవఁ, ద్యక్తధర్మవు కేవ ♦ లార్థపరవుఁ

గానఁ విడనాడినాడ సా♦క్ష్యమునకైన, వహ్నియురయుచు నే యున్న♦వాఁడులోక
యుగమునందునుఁ దత్ఫల♦మొదవుఁగాని,యూరకేపోవ దంతకు♦ నోర్చి మనుము.

క॥ భరతుఁడు ప్రీతుఁడై రా, జ్యరమావిభవాంచితత్వ ♦ మంది మదర్థం
బెరవుపడి సేయుక్రియలు, న్వరయ వనుము రిత్తధనవి ♦ నిష్క్రియమేలా. ౨౨౭

క॥ అని స్పష్టముగా నొడువుచు, జననాథుం డోసరిల్ల ♦ జనవందిత రా
మునిజనని యతనిఁ గొని మర, లెను నిరవునకై చిదేక ♦ లీలాకలనా. ౨౨౯

—♦ దశరథుండు చింతించుట ♦—

తే॥ అగ్గిఁ జేత స్పృశించిన ♦ యట్లు విప్రిఁ
గూల్చినట్టులు వాఁ డప్డు ♦ గొడుకు నడవి
కనిచి ఘూర్ణిల్లెఁ దత్ప్రివ ♦ ర్తనముఁ దలఁచు
కొనుచుఁ గుందుచు లోలోనఁ ♦ గోమలాంగి. ౨౩౦

క॥ వెనుకకుఁ దిరిగి తిరిగి చూ, చును వచ్చెడుయానములను ♦ శోధించును నె
మ్మన మట్టిద తనతనయుని, పునరాగమనముతలంపుఁ ♦ బొరయింపనిచే. ౨౩౧

క॥ గ్రస్తుండై యావలనున, నస్తాద్రికిఁ బోవనున్న ♦ యాదిత్యుఁడనన్
ధ్వస్తరుచి యయ్యె నాతఁడు, స్వస్తరుణీపూజ్యమాన ♦ చరణాభరణా. ౨౩౨

తే॥ వాఁడు విలపించెఁ బ్రియపుత్రు ♦ వల నెడేంగి
రాఁడు నాకర్మ మింతియ ♦ రాముఁ డిపుడు

నగరసీమాంత మెనసెఁ బో ♦ నన్నుగాంచఁ
బోఁడుగా యింకనంచుఁ బ్రి ♦ బోధమహిత. ౨౩౩

కం॥ వానియరదమునఁ బూన్చిన, వానియడుగు లివిగొ లోక ♦ వందితుఁ డవ్వాఁ
డే నాకన్నుల కగపడఁ, డే నెగతి కేగనైన ♦ నేమగుఁ బిదపన్. ౨౩౪

ఉ॥ చూపులు గన్నభాగ్య మని ♦ చొక్కుచుఁ జేరి మిటారులెల్ల వీ
చోపు లిడంగఁ జాదనము ♦ సొంపెనయింపఁగ మేలిసెజ్జపై
నాపులకాంగి సీత కొలు ♦ వంది ధృతిన్ శయనించుమేటి నేఁ
డాపలుముండ్లు తూలుఁ గల ♦ యవ్వని నెవ్వగఁ బండియుండునో. ౨౩౫

కం॥ మేదినిఁ బొరలుచుఁ బాంసువు, లామెకొన న్వన్యనాగ ♦ మన నిట్టూర్పుల్
వే దరలించుచు విన్నను, వేదం బ్రసవణతటుల ♦ నెటు మేల్కానునో. ౨౩౬

కం॥ ఆదీర్ఘబాహు రాఘవు, నాదీనవకలితుఁ గాంచి ♦ యాటవికులు న
న్గాదనరె లోకనాథుని, నాదేబె యనాథుఁ జేయ ♦ నయ్యోనె యనుచున్. ౨౩౭

తే॥ జనకు గారాముకూఁతురు ♦ జ్యాతనూజ, యది సుఖోచిత కష్టంబు ♦ లనియెఱుఁగదు
శ్వాపదానర్దితములు దు ♦ శ్చర్య లరసి, యెట్టులయ్యెడునో మది ♦ నెంతపడునో.

తే॥ ఆపురుషరత్నమును విడ ♦ నాడి యింక, నే బ్రదుకఁబోవ నింతయు ♦ నిశ్చితంబ
కేకయాన్వయపాంసనీ ; ♦ కృపణవృత్తి. విధవవు సకామవును నై ప్ర ♦ వీణ వగుము.

కం॥ అని పొగులునతనిఁ బరిజన, మును స్త్రీలునుఁ జుట్టిగొఁగ ♦ ముప్పునస్నానం
బొనరించి యిల్లు సేరెను, ననయంబునభంగి కాన ♦ నయ్యెను దన్వో. ౨౪౦

తే॥ పాడుగొట్టాడుచును నిరా ♦ పణయు శూన్య
చత్వరగృహాంతయు నసంవృ ♦ తత్వగతయు
నై నయప్పురిఁ జొర బాతె ♦ నాతఁ డపుడు
సూర్యుఁ డంబుదమండలిఁ ♦ జొచ్చినట్లు. ౨౪౧

తే॥ రామలక్ష్మణసీతావి ♦ రహితమైన యది గతమహామహోరగం ♦ బైన హ్రదము
గాఁగ నక్షోభ్యమయ్యు ని ♦ ష్ప్రాంతిసూపు, దానిఁ జింతార్ణవముతో న ♦ తండు వెరసె.

ఆ॥ ఖిన్నకంఠుఁడై వి ♦ కీర్ణుఁడై యల్లన, ననియె వాఁడు దీనుఁ ♦ డగుచుఁ గోస
లాత్మజాత యిరవు ♦ నందింపుఁ డొండొంట, మదినిఁ బ్రత్యయంబు ♦ మలయ దనుచు.

— ♦ దశరథుండు కౌసల్యానగరి కరుగుట ♦ —

ఆ॥ అనినఁ బరిజనంబు ♦ లట్లొనరింపంగ, మేలిసెజ్జపైని ♦ మేనువైచి
రామ; నన్నుఁ జూడ ♦ రావె పీడఁదలంచి, నావె యనుచు నడలె ♦ భావకలిక.

క॥ నను నిర్భాగ్యునిఁ గొని యిది, మొనయదు సంపదల వెలయ ♦ మునుఁ జంద్రశ్రీ
చన రాహువుతో నాకస, మనఁగా నీనాఁటి కనద ♦ యన నయ్యోఁ గదా.

ఆ॥ మంచికాల మొదవు ♦ మా రాముఁ డరుదెంచు, నోర్పుమీఱ బ్రదికి ♦ యున్నవారు
సుఖితు లౌదు రతనిఁ ♦ జూతు రాలింగనం, బంది యధికభాగ్య ♦ మందఁ గలరు.

క॥ నామేను నిలువ దింకిట, నామే లే నెనయఁబోవ ♦ నన్యాక్రాంతన్
శ్రీమానిని నీక్షింపక, యే మానఁగ నౌనో కాదో ♦ యింతటికైనన్. ౨౪౭

క॥ అని విలపింపఁగ రాత్రియుఁ, దనపాలిటికాలరాత్రి ♦ దశఁ గైకొని తాఁ
జనుదేర నర్ధరాత్రము, నను గోసలుకన్నెఁ గాంచి ♦ నాథుఁడు వలికెన్. ౨౪౮

క॥ నాచూడ్కి రాముఁడే కొని, యాచాయం జనియె నేమొ ♦ యబలామణి; నీ
వే చాటుపడితి కానని, యాచందము కనుల కొదవ ♦ నయ్యెం జుమ్మీ. ౨౪౯

క॥ నను నీపాణి స్పృశింపుము, కనులకు మేలొదవునేమొ ♦ గాత్ర మనర్థం
బును బాయునేమొ మనమున, ననుహిత యగువృత్తి పొడమ ♦ నయ్యెడు నేమో.

క॥ అనుమనుజేంద్రునిచెంగట, ననివర్తిత యగుచునిలిచి ♦ యాశ్వాసింపం
గొనకొనియుఁ దనదుదుర్దశ, మనమునఁ దలపోసికొనుచు ♦ మానిని పలికెన్.

—♦ కౌసల్య భర్తతోఁ దనయాపదలం గూర్చి ముచ్చటించుట ♦—

సీ॥ కుబుసంబువీడిన ♦ కోడెత్రాఁ చన్నువ, కాఁగ నున్నది నేఁడు ♦ కైక యింట
విసము రామునియందు ♦ విడిచి యింతలొనర్చె, నెవరి నెంచెనో యింక ♦ నిట్లు సేయు
నడరువుట్టెను దీన ♦ నడవికేగక బిడ్డఁ, డూరఁ బిచ్చముగొంచు ♦ నుండఁ జనదె
తనకోర్కి సంపద ♦ ల్గొనఁ దీఱ కొండున్న, నితనిదాస్యము గణి ♦ యింపరాదె
దైవతంబగు భాగంబు ♦ దైత్యసమితి, కిచ్చమై నిచ్చకంబున ♦ నిచ్చునట్టిఁ
డాహితాగ్నియుఁ గలఁడె యే ♦ మనుచు నిట్టి, పర్వమునుఁ జెడఁగొట్టితి ♦ పార్థివేంద్ర.

ఉ॥ ఆగజగామి యాసుభుజుఁ ♦ డట్టిధనుర్ధరుఁ డెట్టులేనిఁ దా
నేగె వనాంతభూమి కను ♦ టెంతియు కాకటమున్న యింతియున్
లోఁగొనె నన్నిపాట్లను సు ♦ లోచనుఁ డన్ననుఁ గూర్చి తమ్ముఁడున్
బోఁగనె మీఁద నేమిగతి ♦ పుట్టునొ తెల్పఁగనేర నింతయున్. ౨౫౩

తే॥ ఆయతివ గూర్చినట్టి దు ♦ రంతమునకు, నీవు లోఁబడి బిడ్డల ♦ నీతిమాలి
తోలఁ ఫలకాలమున నెట్టి ♦ దుఃఖములను, నెన్నఁ డెఱుఁగని వా రెట్టు ♦ లెనయఁగలరొ.

ఆ॥ రత్నహారులగుచు ♦ రాణించు సెజ్జలఁ, బట్టిచూచి పండు ♦ పట్టు లిప్ప
డాకలమ్ము లెట్టు ♦ లారగింతురు శయ, నింతు రెటు కుశాస ♦ నీస్థలముల.

ఉ॥ ఎన్నకె యొడ్లనన్నఁ బని ♦ యేమగుఁ బూర్వభవంబునం ది ఱే
యన్నులబిడ్డలం గెడపి ♦ హర్షము తర్షము దీరఁగంటినో
యిన్నెప మిట్లుగా నఘమ ♦ యీబిడమై నవవత్సవత్సమున్
బన్ని హరించుసింగ మటు ♦ పాల్పడె నాసుతు నన్నుఁ బొవఁగన్. ౨౫౮

క॥ పాలుంగ్రోలెడునాసన్, బాలురు రాఁదొడరఁ గాంచి ♦ పసచెడఁగాఁ ద
ద్బాలజననీస్తనక్షతి, నాలోఁ గావించి తత్ఫ ♦ లాహతనైతిన్. ౨౫౯

తే॥ అన్ని గొనములు గలిగి య♦ట్లన్ని చదివి,యెన్నఁ దగియున్నయవ్వాని♦నేకపుత్రుఁ
గాన కనిచితిఁ గానక ♦ కంటిఁ గానఁ, గానఁబడ వింక నాచేతఁ ♦ గలఫలములు.

క॥ ఉపవాసంబులు వ్రతములు, జపములు తపములు నెలర్చు ♦ జన్నంబులు న
ట్లుపహితము లయ్యెఁ దుది నే, యపకృతినో యిట్లొనర్ప ♦ నయ్యెం బెలుచన్.

క॥ ఆయువు గలిగినసుభుజుం, డేయిరవుననేని బ్రదుకు ♦ నిట్టితనూజున్
బాయఁగని పాయ కేనని, యేయనువుననేని బ్రదుక ♦ నిఁక నేనోపన్. ౨౬౦

మ॥ కలదో లేదో యెఱుంగ నాదుఘనశో ♦ కం బీఁగఁగా నెంచి క
న్నులు మూయం దెఱవంగ నాతఱిన మ ♦ న్మోహంబు వాయంగ నీ
పలుకుం జెల్లఁగ వన్యవాసకలన ♦ న్బాటించి బోటిన్ సుని
శ్చలుఁ దమ్ముం గొని వచ్చువానిఁ గననా ♦ సౌభాగ్య మీదృష్టికిన్. ౨౬౧

సీ॥ పండువునం బొంగు ♦ పాలసంద్రముకీర్తి, యేతఱి నగునొ సా ♦ కేతమునకు
బూలుపండ్లొసఁగుచుఁ♦బురిఁ జుట్టిరా ద్విజ, కన్య లెన్నఁడు ధృతిఁ♦ గాంచువారొ
యెదురేగఁ గొనితేర ♦ నేనాఁడు మంగళ, తూర్యధ్వను ల్దెస ♦ ల్దొరయునొక్కొ
పుణ్యాంగనలు పొరి ♦ పొరి జల్లుసేస లే, వేళ నాపట్టిపై ♦ వెలయఁగలవొ

గోవు వెనుకొని చనుదెంచు ♦ గోవృషమ్ము
పగిది సతి ముందురా దాని ♦ పజ్జఁ దానుఁ
దమ్ముఁ డాయుధములు గొంచుఁ ♦ దన్ను దఱియఁ
బెరసి వాఁడెప్డు నను దేర్చు ♦ నెర వరయునొ. ౨౬౨

క॥ ప్రాయమున బుద్ధిఁ బొనుపున, నాయమరుల[illegible]డివాఁ డ ♦ యం బెనయఁగనై
నాయెదుట నిలిచి దీవన, లాయాయుపలాలనములు ♦ నందెదు నొక్కొ. ౨౬౩

క॥ మూఁడేండ్లబిడ్డపాడి, న్వ్రీడకె తనుఁజుట్టి మెలఁగు ♦ వెరవునఁ జని యా
టాడి మరలి చిట్టాడుచు, నోడకుమని పెరయుపున్నె ♦ మున్నదొ లేదో. ౨౬౪

క॥ అంతలు భాగ్యం బున్నను, వింతలు తోఁచునె యెలర్చు ♦ విధి సెడునె ప్రభా
వంతుం డస్తంగతుఁడౌ, వంతున నెడఁబోవునిట్టి ♦ వరఁకున కగునే. ౨౬౫

ఆ॥ సుతవియోగజంబు♦శోకానలము సమి, ద్ధంబు నన్నుశోష ♦ దశకుఁ దెచ్చె
నానిదాఘమున మ ♦ హాతేజమున మించు, తరణి ధరణినట్లు ♦ దవిలి యిపుడు.

— ♦ సుమిత్రి కౌసల్య నూరార్చుట ♦ —

క॥ అని విలపించెడుకోసల, తనయన్ బ్రియదామణిన్ సు ♦ ధర్మం గని యి
ట్లని తాఁ బలికె సుమిత్రా, వనజేక్షణ ధర్మరూఢి ♦ వలనుపడంగన్. ౨౬౭

ఆ॥ పూజ్యురాల నీదు ♦ పుత్రుండు సకలక, ల్యాణగుణగరిష్ఠుఁ ♦ డనఁగ నెగడె
పూరుషోత్తముండు ♦ పుణ్యాత్ముఁ డన్వానిఁ, గూర్చి పనవునంత ♦ గొడవ యేల.

తే॥ దేవి నీబిడ్డఁ డడవికిఁ♦దేఁకువ మెయి, నరిగె మహితుఁడు తండ్రి స♦త్యమ్ము నెఱప
శిష్టులం దిది శశ్వత్ప్రి ♦ సిద్ధ మరయ, నైహికాముష్మికప్రద ♦ మదియు కాదె.

క॥ సద్గుణయుక్తుఁడు పుత్రుఁడు, సద్గురు లానఁ గృతిప్ర ♦ సక్తిం జనఁ బ్రాం
చద్గుణ పీ విటు లడల ల, సద్గతికిం గూర్చుమేలి ♦ జన మొకఁడున్నే. ౨౭౦

చ॥ అనఘుఁడు లక్ష్మణుండు తన ♦ యన్ననుఁ గొల్వఁగ నేగెనన్న నే
యనువున నేని వాని కదె ♦ యాఁగద యుత్తమవృత్తి యెల్లరం
గని నెనరుంచువారలకుఁ ♦ గల్గదె లాభ మరణ్యవాసమం
దనఁ బనియేమి శేషుఁ డతఁ ♦ డాతని కమ్మెయి నెల్లకాలమున్. ౨౭౧

క॥ ఎఱిఁగి యెఱిఁగి వనవాసము, తఱి దఱియఁగ నరిగె జనక ♦ తనయయుఁ దనయ
క్కఱ పతి ధర్మనిరతు నే, మఱక గొలుచు టనుచు నుచిత ♦ మార్గము కాదే.

తే॥ కీర్తిభూత పతాక సం ♦ కీర్తితుండు, త్రిప్పుచున్నాడు తనదు ప్ర ♦ తీతి వెలయ
ధర్మసత్యవ్రితతపఃప్ర♦ధానుఁ డనఁగ, నెంను జయలక్ష్మి గొనఁడె నీ♦నందనుండు.

సీ॥ అతని శుచిత్వమ♦ హత్త్వంబులఁ దలంచి, తపనుండు పాదము ♦ ల్దవుల నెఱయ
డతని సౌగుణ్య మం ♦ దను వెంచి సేవించు, నాతిశీతోష్ణుఁడై ♦ యనిలుఁ డెపుడు
నతని నిర్మలతత్త్వ♦మరసి చంద్రుఁడు తండ్రి, నిరతి రాత్రుల మేను♦నిమురుచుండు
నతని మేల్గాంచి నె♦య్యమచూపు నీభూత, ధాత్రి ధాతయు వీఁడె♦తన కటంచు
నతఁడు సామాన్యుఁడన నగు ♦ నమ్మ; శంబ
రాత్మజునిఁ దున్ంచి జనకుఁ బ్రీ ♦ తాత్ముఁ జేయు
టొకఁడ కా కస్త్రము ల్విధి ♦ యొసఁగ నొడిచి
కొనె వనస్థితుఁ డయినంతఁ ♦ గొఱఁత లున్నె. ౨౭౪

ఆ॥ ఎవనిబాహుసీమ♦నెనసి యుర్వి సుఖించు, సిరి యురమ్మునం బెరసి♦చెలువు గాంచు
వానిశాసనమున ♦ వర్తింప రెవ్వార, లిషుపథంబు నొరసి ♦ యెవరు చెడరు.

క॥ తనమందిరమున నెటు లటు, వనమున నరసింహుం డతఁడు ♦ వర్తించుధృతిన్
దనరెడువాం డెందును భా, గ్యనిరతిమై వెలయుచున్న ♦ యనవద్యగుణా. ౨౭౬

క॥ ఆతని సిరి శౌర్యము మతి, యాతనికల్యాణగుణము ♦ లంచితసత్త్వం
బాతటిరాం బురి నెనసి మ, హీతల మంతయును నొక్కం♦డే యేలు ననున్.

చ॥ అరుణున కాతఁడే యరుణుం ♦ డగ్గికి నగ్గి ప్రభుప్రభుండు దా
సిరిసిరి కీర్తికీర్తి కటు ♦ సిద్ధికి సిద్ధి క్షమాక్షమర్ధి ని
ర్జరులకు నిర్జరోత్తముఁడు ♦ సర్వచరాచరభూతజాతకృ
త్స్ఫురుచిరభూతభూతుఁడును ♦ జువ్వె తదర్థము గాని దుండునే. ౨౭౮

క॥ మహి వైదేహియు సిరియును, మహనీయుం డతఁడు పురికి ♦ మలయంగనౌన
య్యూహమున నహమహమికతో, సహాభిషేకోత్సవప్ర ♦ సక్తులు గారే. ౨౭౯

ఆ॥ అతఁడు వెడలునప్పు♦డసృము ల్జాఱంగ, బుడమి పుడమిజనులుం♦బొల్లువోయి
రింక రాజ్యమేల ♦ నెనయరా నందఱా, నందబాష్పవిలస ♦ నంబు గొనరె.

క॥ కుశచీరధరుండై యస, దృశుం డాతఁడు వెడలె ననెడు ♦ దృష్టిని వ్యధకున్
వశపడెదవేల సిరియు సు, దృశ సీతయుం దోడనరుగు ♦ తెఱంగరసితివే. ౨౮౧

తే॥ విల్లునమ్ములుం గొంచుం బ్రబ ♦ వీణుండైన
యన్నకుం దగుతోడు తో ♦ డగుచు ముందు
నడుచుచున్నా డటన్న యా ♦ నయము నీదు
మదికిరాం బోలదే యింత ♦ మమత చనునె. ౨౮౨

క॥ నినుంగాంచి యప్రమత్తుల, రనం దగుపౌరులును నాత్ర ♦ మందెద రిట్లుం
జనునే యవసర మరయం, జనదే జనపాలకులప్ర ♦ సంగ మలుపమే. ౨౮౩

ఉ॥ మానుము శోకమోహములు ♦ మానిని పుత్త్రుఁడు తీర్ణసంగరుం
డై నయమొప్ప నీపదము ♦ లందు వినమ్రుఁడుగాం బ్రహృష్టజం
బైనజలంబునం దొలుత ♦ నాతని నీవభిషిక్తుం జేయంగాం
దా నట రాజ్యపీఠమునం ♦ దాత్త్వికమయ్యభిషేక మందెడిన్. ౨౮౪

తే॥ ఇంత కీవిట్టులైతి వా ♦ వంతయేని, వంతలే దాతనికిం జూడ ♦ వలదె వాని
గమనసన్నాహ మది శివం♦కరమ కాదె,యదియె సమకూర్పదే సక♦లార్థములును.

క॥ శోకింపకు మాతనిక్కై, లోకాధీశుండు వాని ♦ లోఁ గల వక్షుల
శ్రీకలనలు తత్సదృశుఁడు, లోకాలోకాంతపృథివి ♦ లోఁ లేఁ డొకఁడున్. ౨౮౬

ఆ॥ వార్షికాబ్దరేఖ ♦ వడువున గిరివోలు, నతఁడు ప్రమొక్క నీవు ♦ హర్ష సలిల
ధారఁ దడుప నవల♦శారదోదితచంద్రు, సిరికిఁ గూర్చు వాఁడు♦సిద్ధ మిదియు.

క॥ పోలుహృదంతర మింతకుఁ, బోలదు విక్లబ మొనర్పఁ ♦ బుణ్యావు నీకై
జాలిపడుజనము దేర్పం, జాలియు నీపట్టు లౌదె ♦ చర్చ వలవదే. ౨౮౮

క॥ వచ్చెద రమ్మువ్వురు నీ, మెచ్చువడ సెదరు తలంపు ♦ మేలగు నీవీ
రొచ్చెము గనకుండఁగ నీ, యచ్చపుఁదేఁకువ నగున్ హా ♦ తాఘులఁ జేయన్.

క॥ ఈవిలపించుట మానుము, దేవీ ; చరితార్థ వైతి ♦ తెలియుము సుతుఁడై
దేవనిభుఁ డతఁడు నీయం, దావిర్భావంబు గాంచ ♦ నైనకతమునన్. ౨౯౦

క॥ మృదుపీనకరాబ్జంబుల, సదమలుఁ డతఁ డొదిఁగి నీదు ♦ చరణాబ్జంబుల్
పొదలుచు నంటి యెరంగిన సుదతీ ; నీసుకృతఫలము ♦ సుప్రథిత మగున్. ౨౯౧

క॥ పరమేశ్వరు ధ్యానింపుము, పరమార్థంబైనతత్త్వ ♦ పరమరహస్యం
బిరవుకొనె నిట్టు లనఁ గొను, మెరవుపడంజూడు మఘ మ ♦ హేతువు సిరికిన్.

ఆ॥ అనుచు నివ్విధమున♦ననువృత్త మగు వృత్త, మరసి తెలుపు తెలివి♦యసదుగాని
భవ్యపాకమున శు ♦ భంయువాగ్ధోరణి, నరణి శుచినపోలె ♦ ననువుపఱప.

ఉ॥ రామమహత్త్వమున్ సదభి ♦ రామవచోరచనాప్రవీణ యా
రామపవిత్రికం దెలిపి ♦ రామ ప్రసంగవిరామసక్తగా
నామహనీయ పొల్చె శర ♦ దాగమ రాత్రియ కాఁగఁ జంద్రుఁడై
మో మలరన్ స్వకీయగుణ ♦ మోచితమోహపయోదరోధమై. ౨౯౪

—♦ శ్రీరామునిఁ బౌరజన మనుగమించుట ♦—

ఉ॥ అంత ననంతవిక్రముఁ డ ♦ హర్పతి తేజుఁడు రాముఁ డమ్మెయిన్
సంతస మొప్ప సంతతవ ♦ సంతవనాంతము గాంచ నెంచి ని
ష్క్రాంతతఁ గొన్నిశకుప్రఁ డనఁ ♦ గాననసీమకుఁ బోవుచుండ సం
భ్రాంతతఁ గూడముట్టిచనెఁ ♦ బౌరజనామరవార మాదృతిన్. ౨౯౫

క॥ నెట్టన వారింపఁగనై, తుట్టతుదకు జేనితోడి ♦ దొరలు ప్రకృతులున్
గట్టిపడి మరలి రన్యులు, పట్టువిడక చనిరి వారి ♦ భావ మసదటే. ౨౯౬

తే॥ పూర్ణచంద్రుండపోలె నా ♦ పురజనులకు
సర్వగుణపూరుఁ డాతఁ డా ♦ శాన్యుఁ డయ్యెఁ

దా నడవి వెన్నెలల్గాయఁ ♦ దరలుచుండ
నోర్తురే తమకిచ్చోట ♦ నొకటి గలదె. ౨౯౭

ఆ॥ తండ్రి సత్యవత్ప్రి ♦ థానుఁ జేయంబూని, తాను వనికిఁ బోవఁ♦దలఁచెఁ గాక
స్వానురక్తులైన ♦ యవ్వారి వారింప, నెంచె నట్టిదాన ♦ నేమిగలదొ. ౨౯౮

క॥ తనప్రజలఁబోలె నాప్రజ, లనుఁ గొని సస్నేహదృష్టి ♦ లాలింపుచు ని
ట్లనె రాముఁడు సుస్నిగ్ధం, బనితర మగు వాక్ప్రిచార ♦ మావహిలంగన్. ౨౯౯

—♦ శ్రీరాముఁడు పౌరులనిలువుఁడని ప్రార్థించుట ♦—

సీ॥ ఏప్రీతిబహుమతు ♦ లింతలో నాకయి, భరతుపై నమ్మోయిఁ ♦ బఱపు డింక
మీమేలుగోరు నమ్మేటి కల్యాణచా, రిత్రుండు వాఁడెల్ల ♦ రీతులొరయు
బ్రాయం బరయఁ దాను♦బాలుఁడైనను జ్ఞాన, వృద్ధుఁ డీజగమేలు♦వెరవుగలఁడు
శౌర్యధైర్యౌదార్య ♦ వీర్యగుణాన్వితుఁ, డనుకూలుఁడై యుండు ♦ నందఱకును
రాజలక్షణయుతు యువ ♦ రాజపదవి, రాజితునిఁ జేసె నమ్మహా ♦ రా జెఱింగి
మేకొనందగు మీకును ♦ మాకు రాజ, శాసనం బవిలంఘ్యప్ర ♦ శస్త మగుట.

తే॥ ఏను వనవాసమునకేగ ♦ నెట్టులైనఁ
దాపమొందకపోఁడు నా ♦ తండ్రి గాన
నట్లుగాకుండఁ దేర్ప మీ♦రర్హులరు మ
దీయమగుప్రియ మొదవించు ♦ తెఱఁగటంచు. ౩౦౧

క॥ ఈకొలఁదికాల మిన్నెఱిఁ, జేకొనుఁ డనురాముసుడులు ♦ చేత్రాశ్లి త
త్ప్రాకామ్యముపై గావగు, పాకమ్మున లాగికొనియెఁ బౌరులయెదలన్. ౩౦౨

క॥ ధర్మాస్థితుఁ డెట్టెట్టు ల, మర్మోక్తులఁ దమ్ముదేర్ప ♦ మాలిమి సూపెన్
నిర్మాయు లట్టులట్టులు, పేర్మి న్వారతనిఁ ద్రిప్పు ♦ పనిఁగొని రబలా. ౩౦౩

తే॥ వఱలుధర్మైకపదవశం ♦ వదత నెంచి
దైన్య మొప్పారఁ దమ్మునిఁ♦దన్ను బాష్ప
పిహితనేత్రులై కనుఁగొంచుఁ ♦ బౌరిమ మించు
వా రొకట వీడుదురె వెట్టి ♦ వారె వారు. ౩౦౪

—♦ ద్విజవరులు రాముని వేఁడుకొనుట ♦—

క॥ జ్ఞానవయోవృద్ధులు తే, జోనూనులు ద్విజులు శిరము ♦ లల్లార్చుచు ని
ధ్యానించుచు దూరగులై, యానతవరదుని మరల్ప ♦ నని రిటు నవలా. ౩౦౫

తే॥ మేలుగూర్చుడు పతికి మీ ♦ మేలు మెఱయ
నోజవాశ్వములార మీ ♦ రోజ నెఱయ
మరలుఁ డరుగంగవలవదు ♦ మా మొఱవిని
యుత్తరోత్తరోత్కృష్టాప్తి ♦ నొలయఁగలరు. ౩౦౬

ఆ॥ కర్ణవంతములు స♦కలభూతములుఁ దురంగ, గమము లందు మఱియుఁ♦గాన నిట్లు
వ్రాలి వేఁడుకొనెడు ♦ వారము మాచేయు, విన్నపంబు భర్త ♦ వినెడువిధికి.

తే॥ ధర్మమూర్తి మహావీర ♦ తముఁ డితండు
శుభదృఢవ్రతుఁ డత్యంత ♦ శుద్ధమాన
సుండు మీ కుపవాహ్యుఁ డా ♦ చొప్పు విడిచి
యేల యుపవాహ్యు జేయఁగా ♦ నెంచినారు. ౩౦౮

క॥ వనవాసు నొనర్పఁగ మీ, కనువగునే యితని నిర్మ ♦ లాత్ముల కిది ల
గ్గనఁజనునదియే యెటు లి, ప్పనిఁ బూనితి రవలిదొసఁగు ♦ భావింపరొకో.

క॥ అని యార్తులై ప్రలాపము, ల నడర్చెడువారిఁ గని క ♦ లాశేవధి స్వం
దన మనుపదమే డిగి యు, ల్లన నడుగుల నిడుచు నుండె ♦ లాలితవృత్తిన్. ౩౧౦

క॥ తోడనె తోడుం జేడెయుఁ, దోడుపడిరి వానికృతికిఁ ♦ ద్రోవఁ బెరసియున్
వాఁ డరుగ నిలువఁ దోఁచని, వాఁడయ్యెను నెనరుపెంపు ♦ వలనన్ లలనా.

ఆ॥ నడుచుచున్నవాఁడు♦నాథుఁ డింకిట నిది, యేమి యనుచు తప్త♦హృదయు లగుచు
సంభ్రమంబు గదుర ♦ సద్ద్విజు ల్వారిట్టు, లనిరి రాముతోడ ♦ వనద వేణి. ౩౧౨

క॥ బ్రాహ్మణ్యం బిట్లింతయు, బ్రహ్మణ్యుని నిన్ను మొనయఁ ♦ బఱతెంచెడు సు
బ్రహ్మణ్యనిభా ; యిదె తమ, బ్రాహ్మణ్యులతోడఁ గూడఁ ♦ బాలింపఁగదే.

తే॥ వాజపేయోత్థితాతప ♦ వారణంబు
లరణులుంగూడ మూపుల ♦ యందుఁ దాల్చి
యరుగుదెంచెద మిదె శార ♦ దాభ్రచయము
లట్టు లవి పొల్చుచుండ నో ♦ యధిప ; కంటె. ౩౧౪

తే॥ గొడుగులే కరుదెంచితో ♦ కొడుకుకుట్ర
రశ్మిసంతాప మొనయు నీ ♦ రమ్యమూర్తి
చాయ లొనగూర్తు మీవాజ ♦ పేయికములు
ఛత్రములు పట్టి నిలునిలు ♦ జరుగవలదు. ౩౧౫

తే॥ వేదమంత్రానుసారిణి ♦ పేరిబుద్ధి, సాగె నిటు వనవాసాను ♦ సారిణి యయి
నిన్నుఁ గూర్చినవారికి ♦ నీదుచరిత, మబ్బు టబ్రమె యొండొక్కఁ ♦ డంతరంబె.

క॥ తమహృదయములందే వే, దములున్నవి వారలింట ♦ ధర్మపరత్వం
బమల మొనర్పఁగ నున్నా, రమరసమా ; యొండుమాట ♦ యనవల దింకన్.

క॥ వేదములే ధనములు మా, కోదయితా ; వానిఁగొంచు ♦ నుదయం బెనయన్
మోదంబున నీకాశీ, ర్వాదంబు లొనర్చునేర్మి ♦ వఱలుదు మెపుడున్. ౩౧౮

క॥ ఇఁక నొండు దలఁపవలవదు, ప్రకటిత మిటులింత లొరసి ♦ ప్రస్తుతధర్మ
ప్రకరణ మరసి తథాస్తను, మకలంకచరిత్రి ; యస్మ ♦ దాస్థ ఫలింపన్. ౩౧౯

తే॥ మరలుదువయేని మరలుము ♦ మమ్ముఁగూర్చి
యరిగెదవయేని మాతోడ ♦ నరుగు మిట్లు
రెండు లేవింక ధర్మ మీ ♦ వొండుసేయఁ
దలఁప నెవ్వార లద్దానిఁ ♦ దలఁచువారు. ౩౨౦

క॥ యాచించెద మిట్లుండఱ, మోచతురమతీ ; విశిష్ట ♦ ముచితం బిదెపో
యాచారము త్వద్భక్తులఁ, బాచెదవే భక్తభక్తి ♦ పరుఁడవ కావే. ౩౨౧

ఆ॥ నీకు ప్రొక్కెదము వి♦నిభృతసదాచార, కూర్చుమయ్య ; చేర్చి♦కొనగదయ్య ;
హంసశుక్లతాస ♦ మంచితకేశమ్ము, లాశిరములు ధూళు ♦ లందఁ జేసి. ౩౨౨

క॥ ఏకు లనేకులు ద్విజు లిటు; నీకొఱ కరుదెంచినారు ♦ నిహితాధ్వరులై
చేకొను మిందఱ నీయభి, షేకం బవభృథముఁ గూడఁ ♦ జెల్లించి కృపన్.

క॥ నీవలనిభక్తి గల వీ, స్థావరములు జంగమములుఁ ♦ ద్వత్ప్రాప్తికినై
యావాహన మొనరించెడు, నావెరవున నీకు పేని ♦ యాదృతి వలదే. ౩౨౪

ఆ॥ పాదుకొనియ యుంటఁ ♦ బాదపంబులు సము
న్నతము లనిలసంచ ♦ లితము లగుచు
నానతత్వ మొప్ప ♦ నఱచుచున్నవి వాని
నరయు వయ్య యోద ♦ యాంబురాశి. ౩౨౫

తే॥ సర్వభూతానుకంపి వీ♦శ్వరుఁడ వనుచు, నిన్ను యాచించుచున్నవి♦నేఁడు జూడు
వర్జితాహారసంచార ♦ వర్తనములు, పక్షు లవె వృక్షనిష్ఠైక ♦ పక్షు లగుచు.

క॥ ఎత్తినమోముల డింపక, యెత్తెయ్యది మదినిఁ గలదొ ♦ యీపసులకుఁ జే
యెత్తుధన మిడిన నుండునె, యిత్తావున నిన్నుపేడ ♦ నెంచిన నెదియున్. ౩౨౭

క॥ అని యాక్రోశించుచు వా, రనుగతులై చనఁగఁ దమస ◆ యడ్డపడియె న
య్యనువృత్తినివృత్తుల నొక, యను వరయఁగ రాముఁ దేర్తు◆ననుతలఁ పొదవన్.

తే॥ దానియొడ్డున హరుల శ్రాం ◆ తముల నిలిపి
నీరుఁద్రావించి యొడళుల ◆ నిమిరి కడిగి
శాద్వలములఁ బ్రిచారంబు ◆ జరిపి నెఱయఁ
జేసెను సుమంత్రుఁ డామంత్రి ◆ సిద్ధుఁ డలర. 332

క॥ అచ్చోట నిలిచి రవనివి, యచ్చరు లన్యులునుఁ బౌరు ◆ లనుసృతులై యే
పొచ్చెములేక విభునిమది, మెచ్చొలయం గొలుచు చున్ స◆మీహిత మెలయన్.

తే॥ రమ్యమగుతమసాప్రతీ ◆ రమున రాముఁ, డట్లువిడిసి సౌమిత్రితో ◆ నవనిజాత
వినఁగ నిట్లనె నిదె మొద◆ల్మనకు వనము, నందు నిలనైనరాత్రు లిం◆దలుకు వలదు.

క॥ శుభ మగు నీకు విభావరి, విభువై ఖగమృగవిలీన ◆ విధి నెఱపఁగ ని
ర్విభలగు వనతతు లిప్పుడు, సభయత విలపించుచున్న ◆ సడి గన నయ్యెన్.

సీ॥ మనరాజధానియుం ◆ దనుపూర్వ మనురక్తు, లనరానిజనులు లే ◆ రరసిచూడ
నిటురాఁగ శోకాబ్ధి ◆ నెనయుదు రెల్లవా, రధిపుఁ డంబయు నట్లె ◆ యడలువారు
విని తమ్ము లరుదెంచి ◆ విశ్లేషదుఃఖమ్ము, వాపఁ దలంపరే ◆ వలనుగాంచి
యూహింతు భరతుని◆యుత్తమగుణము ల, ద్దాన నూఱట మది◆దవుల నుంటి

యానృశంస్యంబు వెలయ న ◆ య్యనఘుఁ డోరసి
యరసి యంధులగతి నున్న ◆ యల్లవారిఁ
దేర్ప నెంచక పోఁ డను ◆ తీర్పు వొడమి
నాయడ రడంచుచున్నది ◆ నాయమునకు. 333

తే॥ కడఁగి నీవొనరించిన ◆ కర్జ మసదు, గాదు నాతోడవచ్చి తీ ◆ క్రమ మెఱింగి
యేమఱక గావనగు భూజ ◆ నింతలంత, లనుచు వనవాస మీగఁనౌ ◆ నన్నినాళ్లు.

క॥ నేటినిశిఁ గడపుదము నది, నీటం బారణయొనర్చు ◆ నెఱి రేపకడన్
బాటదఱిసి వన్యము ల, ప్పాటన్ సమకూర్చురీతిఁ ◆ బరికించుటకున్. 334

క॥ వన్యములు వివిధములు గల, వన్యాదృశము లనఁగాని ◆ వైన న్నేఁ డు
క్తాన్యము పొసంగ దెట్లును, మాన్యము తీర్థోపవాస ◆ మహ ముచితముగాన్.

ఆ॥ అనుచుఁ దోడుతోడ◆నని సుమంత్రుం గాంచి,హయవిమర్శనప్ర◆యత్నమున వ
ధానివగుము నా న ◆ తఁడుఘాసజలతృప్తి, వాని కొదవఁజేసి ◆ వలనుసేర్చి.

క॥ ఆదిత్యుఁ డస్తమింప స, మాదిష్టప్రకృతకృతుల ♦ నటుదీర్చి సమా
సాదితనవయవసములం, బ్రోదిగ నవ్వాని కనిచి ♦ పొదలెడువేడ్కన్. ౩౩౮

క॥ వచ్చెను సాంధ్యవిధానము, లచ్చో నవ్వారు దీర్చి ♦ రటఁ దా రెదలన్
మెచ్చఁగ సూతుఁ డమర్చె ని, యచ్చరులానఁగఁ దలిరు ♦ టాకులసెజ్జల్.

తే॥ అందు శయనించి రాఘవుం ♦ డతివతోడ, నిదురకొలువంద సౌమిత్రి ♦ నియతి వెలయ
రాముగొనములు దెలుపుచు ♦ రాత్రిఁ బుచ్చె, సూతుఁ డాదృతివినుచుండ ♦ శుద్ధచరిత.

క॥ శుభలక్షణుండు లక్ష్మణుఁ, డభయుం డటు రాముఁ గొలువ ♦ నై మేల్కొనఁగన్
విభుఁడు విభాకరుఁ డయ్యెడఁ, బ్రభాత మొనరించుగుతిఁ బ్ర ♦ పన్నుండయ్యెన్.

తే॥ గోకులాకులతీరసా ♦ ద్గుణ్యయుక్త
మున్నె తమస యద్దానిఁ బ్ర ♦ ముఖ్యఁ జేసె
రాముఁ డచ్చోటుప్రకృతుల ♦ తో మహాత్ముఁ
డధిశయించి నెయ్యమునూవు ♦ నాకతమున. ౩౪౨

చ॥ మొనసినపౌరులెల్లఁ దరు ♦ మూలములం బడియుండి రంత మే
ల్కని రఘునేత వారిగతి ♦ గాంచుచు లక్ష్మణుతోడఁ బల్కె ని
య్యనఘులు పట్టువట్టిరి ప్ర ♦ యాసము లోర్చియు నెట్టులేనిఁ దో
ద్కొని చనఁజూతు రట్లగుటఁ ♦ గూడునె వీరలపొత్తు మీఁదటన్. ౩౪౩

క॥ ఇల్లెడలివచ్చి రిమ్మెయి, నల్లాడుచుఁ దమ్ముఁ గూర్చి ♦ యనవద్యులు మి
మ్మెల్ల మనరాదు గొనిచను, టెల్లగతుల దోషయుక్త ♦ మేకద యింకన్. ౩౪౪

ఆ॥ చూచితయ్య; వీరి ♦ సోలియున్న తెఱంగు, పాయనేరమన్న ♦ పట్టుదలయు
నిట్టివార లెట్టు ♦ లేనిఁ బ్రాణంబుల, పై నిరాశసూపఁ ♦ బరఁగువారు. ౩౪౫

ఆ॥ పీలుగానిపట్ల ♦ విడుదలచేసైనఁ, బౌరకష్టములనుఁ ♦ బాపు టొప్పు
విభున కట్లుఁగాక ♦ వెరవుసిరికిఁ గల, దనఁగ బాసిచనుట ♦ యఘము గాదు.

క॥ రాజు మనుచుండఁగ యువ, రాజు భరతుఁ జేయునవస ♦ రంబున కిమ్మా
నోజ మెలఁగి వచ్చెద మన, నాజతనఁ దలంపగాదె ♦ యభిమత మొప్పన్. ౩౪౭

తే॥ వీరు నిశ్చయ మింతకు ♦ వీడఁబోరు, తాను గన్గంటఁ గాంచుచోఁ ♦ దరలిచనఁగఁ
గాన మేల్కాంచునంతలో ♦ నౌనుఁ గాన, నాంతరముసొచ్చి యెందేని ♦ నరుగుటరయ.

క॥ ఆవల వలగొనువినువురఁ, దావలముం జేరఁగలరు ♦ తగుసిది యన స
ద్భావుఁడు మేలని సూతుం, దేవలయుం దేరుపన్ని ♦ తేఁకువ ననినన్. ౩౪౯

ఆ॥ ఆతఁ డట్లుఁగూర్ప ♦ నాలమందలు నిల్చి, వాఁకదరిని నంత ♦ వట్టు నిదుర
  సేసి పిడి రాత్రి♦శేషంబు గలుగంగఁ, దమస దాఁటి చనిరి ♦ తత్త్వవిదుపి.

క॥ అలఁతిగ నది నావర్తా, కుల సులలితుఁ డతఁడు గడచి ♦ సుపథముగొని ని
  ర్మల మిడి యుభయము, భయద ద్ర్మలకేనియు ననుచు దాని♦చొప్ప నరయుచుఁ.

ఆ॥ కొంతదవ్వుచని వి ♦ కుంతుఁ డకుంఠిత, ముగ నయోధ్యదారి ♦ మొనయఁబాఱి
  రథముద్రిప్పి మరల ♦ రమ్మనవుడు వాఁడు, నట్లుసేయఁ గడగి ♦ యరద మెక్కి.

క॥ వాని న్మెచ్చుచు మేలా, నానయమునఁ దెల్లవారు ♦ నంతకు బహుదూ
  రానయన మెుప్ప నరిగిరి, శ్రీనంద్యులు వారు గుణవి ♦ శేషవిశిష్టా. ౩౪౩

క॥ అని వల్లభుఁ డెఱిఁగించిన, విని సల్లలితాత్మ గౌరి ♦ విశ్వాత్ముచరి
  త్రి ననంతర మంతరసహ, మన రానిమనమునఁ దెలుపు ♦ మని వేఁడుటయుఁ.

శా॥ భక్తాపాయవిమోచనోచితలస ♦ ద్భావానుభావాఢ్య ని
  ర్ణిక్తామేయకలావిలాసపదని ♦ ర్ణిద్రాత్మముద్రార్పణా
  త్యక్తారుంతుదశోకమోహగుణవి ♦ స్తారా సభాస్తారసం
  పృక్తాశేషవిశేషవాదవిషయా ♦ భిప్రాంత సర్వాంతరా. ౩౪౪

క॥ సంసారవార్ధిపూర, ధ్వంసాగస్త్యాయితాత్మ ♦ భజన శుభజనా
  శంసార్హపద తమోగ్రహ, కంసారీ వందమాన ♦ కలిమలహారీ. ౩౪౫

మాలిని॥ సకలభువనభారా ♦ శ్రాంతవిశ్రాంతియోగ
  ప్రకటితనిజదాక్ష్యా ♦ బ్రహ్మభూమైక్యలక్ష్యా
  వికలితబహుజన్మా ♦ విష్కృతాఘౌఘదివ్య
  త్సుకృతశతవిభావ్యా ♦ శుద్ధభావానుభావ్యా. ౩౪౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం జతుర్థాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



కరుణాబ్ధిభావంబు ♦ గైకొన్నమన్నీని, కీవంచనార్థిత్వ ♦ మెట్లుగలిగె
నొంటిమైఁ గానలో♦నొదుగంగఁ దలపించె,గాఁబోలుఁ దనమీఁది♦క్షామ్రభరమ్ము
కట్టియలు గల వగ్గియుఁ ♦ గానఁబడదొ
యడవిఁబడి పోవఁబోవ నే ♦ రడ్డగింతు
రేల యిఁక జాలము గుణాల ♦ వాల మితనిఁ
బాసి మనఁజాల మరయుఁడా ♦ పథమువిధము. ౬

తే॥ తెచ్చెదమటంచుఁదోడ్పడి ♦ వచ్చి యతని, నడవికిందోలి యేమని ♦ యరుగువార
మడుగువారలతో నెట్టు♦ల నెడువార,మవల మనువార మెయ్యది ♦ యనుభవింప.

క॥ ఇమ్మెయిఁ జెడనై తిమి కై, కమ్మ యెడం బొడమినట్టి ♦ యనుచితవృత్తిం
జుమ్మ లిఁక నెన్ని దోఁచునొ, యిమ్మహినున్నంతపాప ♦ మెందుం గలదే. ౭

ఆ॥ అనుచుఁ జేతులెత్తి ♦ యవ్వార లేడ్చిరి,వత్సలత కవశ్య ♦ వశ్యు లగుచుఁ
దోఁచితోఁచకున్న ♦ తొడను చేతోవృత్తి, యవల దారిసూప ♦ నచటువాసి. ౮

క॥ అరద మిటులరిగె నిదె యని, సరగుననాజాడఁ గొనుచుఁ ♦ జనఁ దుదిమొదలుం
బరఁగనిద యగుచు నది తమ, పుర మెనసిన బాటసేర్చి ♦ పొడవడఁగుటయున్. ౯

—♦ పౌరులెట్టకేలకుమరలి పురికింబోవుట ♦—

క॥ దైవోపహతుల కిట్టివె, త్రోవలు గనవచ్చు ననుచుఁ దొడిఁబడెడునడం
బోవకపోయిరి నగరికి, వావిడిచి వ్యథార్తి నఱచు ♦ వా రగుచు సఖీ. ౧౦

ఆ॥ పాపజేనిఁ బాసి ♦ పాతాలతల మట్లు, చంద్రురుండులేని ♦ చదలు మాడ్కి
సలిలహీనమైన ♦ సంద్రమ్ముచాడ్పున, నున్నదానిన య్యో ♦ యోధ్యఁ గనిరి. ౧౧

క॥ అందు మహార్హములగునిజ, మందిరములఁ గాంచి కనరు ♦ మఱి స్వీయు నొరుల్
ముంపె యెఱుఁగఁబో రెఱిఁగియుఁ, గ్రందునఁబడి మనము లెఱియఁ♦గల్యాణగుణా.

తే॥ ఎట్టకేల కాత్మీయు లం ♦ చెఱిఁగి చేరి, వారుఁ దారును శోకించు ♦ వారలైరి
గాని ముందును వెనుకయుఁ♦గానఁబోవ, రలఁతిపడి రట్టు లమ్మహి♦తాత్ము లగజ.

శా॥ అంగళ్లంచునులేవు లేదు కృతులం ♦ దామోద మాహర్ష మా
భంగిం జొప్పడ దెందుఁ గానఁబడ దా ♦ పాకప్రవేశంబు పు
ణ్యాంగప్రస్తుతు లావహిల్ల వస ద ♦ య్యాయవ్యయస్థాన మ
ర్థాంగీకారమయేనిఁ బన్పడదు స్వీ ♦ యత్వాభిమానంబునన్. ౧౪

క॥ నష్టబహుధనము లబ్బిన, కష్టము లెవి యెట్లు పాయుఁ ♦ గానైన గుణా
విష్టుఁడు ప్రథముఁడు పుత్రుం, డిష్టము లొదవ నొదవిన ర ♦ హింపరు పౌరుల్.

ఉ॥ ఇంటికిఁ జేరినట్టిసుఖ ♦ మేదఁగ భర్తను గాంచినంతనే
కంటికి రెప్పలట్టు లనఁ ♦ గా నుతిగన్న సతీవతంసముల్
మంటికి మింటికిం దలఁపు ♦ మార్గము లల్లుచుఁ దిట్టి రొక్కటన్
బంటికి బంటులైనపలు ♦ బల్కులఁ జుల్కగఁ జిల్కుచున్ సతీ. ౧౬

తే॥ తోత్రముల ద్వీపముల నట్లు ♦ దోలి రింత, లంతలనఁ గానుపించిన ♦ యంతలోనె
సుఖము దుఃఖమ్ము నెన్నక ♦ చొప్పరయక, రాము విడనాడి చనిన నేరమున కార్య.

—♦ పౌరస్త్రీలు భర్తలఁ దూలనాడుట ♦—

ఉ॥ ఎవ్వరు రామునిం బెరసి ♦ యేగఁ గడంగి మలంగి వచ్చిరో
గవ్వకుఁ గానివారలకుఁ ♦ గర్జములేల గృహంబులేల లే
జవ్వనులేల సంతతివి ♦ చారణలేల సుఖంబులేల యే
నెవ్వగ లిందు లేవనుచు ♦ నిష్ఠమెయి న్బరికించి కాంచిరో. ౧౭

క॥ ఒక్కఁడె పుణ్యుఁడు లక్ష్మణుఁ, డక్కన్నియ సీత ధన్య ♦ యనఁదగు నగుఁబో
తక్కొరులకు నెక్కనునే, యక్కామితఫలదు రాము ♦ ననుగమనింపన్. ౧౮

క॥ కమలాకరములు సరసులు, విమలనదీనదము లెట్టి ♦ విస్తృతపుణ్యం
బమర నమరియున్నవొ యీ, సమయంబున రాముస్నాన ♦ సత్కృతుఁ జేయన్.

తే॥ పూలుఁ బండ్లనుఁ గలమేలి ♦ పుణ్యతరువు, లంచితములగుగిరులు కుం ♦ జాంతరములు
నించుతలఁపుల నతిథిగా ♦ నెంచి రాముఁ బూజసేయవె యద్దానఁ ♦ బొలుపుగనవె.

క॥ వదలంగలవె రాముని, సదయాత్ము మహానుభావుఁ ♦ జక్కటిగని పూ
పొదరులు గిరిదరులు దరువు, లద నిదె యనుకొని తదర్చ ♦ నాంచితవృత్తిన్.

తే॥ మొనయఁ జిత్రసుమాపీడ ♦ ములును మంజ, రీలతాయోగసుమహిత ♦ కేతులునుఁ బ
రిభ్రమద్భ్రమరోద్గీత ♦ విభ్రమములుఁ, గా నగము లయ్యమదికిసౌ ♦ ఖ్యంబొనఁగవె.

ఆ॥ పూజసేయుపొంతఁ ♦ బొలుపారఁగా నకొ, లమున నేనిఁ బూవు ♦ లన్ గడింపఁ
జాలి జాలివాపి ♦ శైలముల్ రాముని, యడుగులకు మడుంగు ♦ లిడకయున్నె.

క॥ సెలయేండ్లదరులఁ బులినం, బుల ద్విజసూక్తుల ప్రఫుల్ల ♦ పుష్పంబుల స
త్ఫలముల జల్లిమెకంబుల, విలసనముల రాముజాజ్య ♦ విధి గిరులకగున్. ౨౪

ఆ॥ లేదులేదు భయము ♦ లేదు పరాభవం, బెందు శూరుఁ డజితుఁ ♦ డీర్ఘచరితుఁ
డైనరాముఁ డుండు ♦ నచ్చోట నరుదెండు, త్రోవయరసిపోవ ♦ దొఱకకున్నె.

క॥ దాశరథి సారతరధి ద, యాశరధి యొకొండుజాడ ♦ నరుగకమున్నె
యాశంస వెలయుచుండఁ ద, దాశాదేశమ్ము మొనయు ♦ టర్హముకాదే. ౨౬

క॥ పాదచ్ఛాయయు సుఖకరి, తాదృశుఁడు మహాత్ముఁడున్న ♦ తల మొనసినచో
నాదయితుఁడె పున్నెమునకుఁ, బాదు పరాయణము గతియుఁ ♦ బ్రజలకు నెల్లన్.

శా॥ సీతం గొల్తుము మేము నేమ మలరన్ ♦ శ్రీరాము సేవింపుఁ డే
యాతంకంబులు దోఁప వీతెగలయం ♦ దాలించి పాలింత్రు వా
రేతాదృక్పథ మబ్బినుబ్బనయశే ♦ కేలా యహ్మాద్యం బసం
ప్రీతం బార్తజనం బయోగ్యమగుసీ ♦ వీడొంది గో డందఁగాన్. ౨౯

క॥ కైకనెల వేల జీవిత, మే కా దాసింప ననఁగ ♦ నేకాంక్షితముల్
ప్రాకటవైభవములు సుతు, లేకలుములు నేల భార ♦ మిందఱు ధరకున్. 30

ఆ॥ మీకు మేలు గూర్చు ♦ మేటిరాఘవుఁడు మా, కవనిజాత శుభము ♦ లందజేయు
నని తెలిఁగు లరసి ♦ యడవిఁ బాలింపంగఁ, జనిరి వారు మనల ♦ మనుపలేరె.

ఉ॥ ఏయది పుత్రు భర్తను ని ♦ జేష్టఫలాప్తికిఁ ద్రోవ నెంచెనో
యాయసతిం గులఘ్ని నడి ♦ యాసమెయిం గొలువం దలంచినన్
జేయదె యేరి నెట్లయినఁ ♦ జేటులకెల్లను మూలమైన యా
చాయకుఁ జేయిచాఁచువని ♦ చాలుఁ జనుం డిఁక రాముఁ గన్గొనన్. ౩౧

తే॥ ఈయుపద్రవ మొదవెఁ బొం ♦ డిట ననాయ, కం బనాలంబకమునై పు ♦ రంబు డంబు
సెడ నశించునుగాని యే ♦ సిరికిఁ గాదు, వాదుగాంచిన వెనుక మ ♦ వ్యాంబు గలదె.

క॥ ఆయుత్తముఁ డరిగెను రా, జేయొచ్చెమునని మునుంగు ♦ నిఁకఁ గైక యథ
ర్మాయత్త మనాథముగాఁ, జేయున్ రాజ్యం బవస్థ ♦ చెప్పందరమే. ౩౪

ఆ॥ రాముఁబాసి యింక ♦ రాజు జీవింపఁబోఁ, డతఁడు వోవ నుండ ♦ నైనఁ గైక
కొడుకు నడ్డుసేసి ♦ గొనకొను నడరంగ, నింతకన్న దుఃఖ ♦ మెన్నఁ గలదె. ౩౫

క॥ ఎటులైనఁ గైక నెఱపెడు, తుటారముల మనము సుతుల ♦ తోడు మనముసుం
డిటులెంచి యింక మనముం, బటుతర మొనరింపుఁ డచటి ♦ ప్రాపింపంగన్. ౩౬

క॥ తా నరుగుచు కైకేయీ, సూనుఁడు మిమ్మోము ననుచుఁ ♦ జూపుట పసులన్
సానికున కప్పఁజెప్పుట, గా నిందఱ మూహసేయఁ ♦ గాడే మీఁదన్. ౩౭

క॥ పున్నెము కడచన నిమ్మెయి, బన్నములకుఁ బాలుపడిన ♦ వారము రాముం
గన్నులఁ గన్గొన నటుగా, కున్న న్మేనుదొఱఁగంగ ♦ యోజింపుఁ డెదన్. ౩౮

సీ॥ పొడుపుచందురు గేరు ♦ పోఁడిమి నెక్కొను, నెలనగు మోము వె ♦ న్నెలకుఁ గూర్ప
సింహవిక్రమమున ♦ చెలువుసూపెడునడ, యిభరాజగతి పొంక ♦ మీసడింపఁ

దోయదంబునభంగి ♦ దూర్వాదలశ్యామ, మగుమేను శుభవృష్టు ♦ లందఁజేయఁ
గమలషండమునేలు ♦ కలికికన్నులమేలు, కారుణ్యదృష్టులఁ ♦ గాంచి పెంచ
వెలయుసత్యవాది ♦ విశ్వజనీనుండు, మధురభాషి శత్రు ♦ మర్దనుండు
సామ్యదర్శనుండు ♦ సౌభాగ్య మటవికి, నొసఁగకున్నె యదియుఁ బొసఁగకున్నె.

క॥ ఆబిడ్డ యాదయాంబుధి, యాబుద్ధిగురుండు తండ్రి ♦ యాఱేఁ డావి
ద్యాబోధనుఁ డాదేవుఁడు, మాబన్నము లరయఁడయ్యె ♦ మాకర్మమునన్. ౪౦

వ॥ అనియిట్టు లన్నాగరకుటుంబినీరత్నమ్ములు మగల నాఁకపడి పలుపోకల పలుకు
బడుల నాఁకరించుచుఁ జీకాకుపడుచున్న నెమ్మనమ్ముల యుమ్మలమ్మున. ౪౧

ఆ॥ కన్నబిడ్డఁ డొంట ♦ గతితావుసెడినట్లు, దోడునీడ సిరికిఁ ♦ దొలఁగినట్టు
లార్త లగుచు నేడ్చి ♦ యారాటపడఁ గన, నేర కత్తశిఖరిఁ ♦ జేరె నినుఁడు.

క॥ మిత్త్రికిఁ దలఁకుగతిఁ గయికొ, యొత్త్తారవున కులికి జనము ♦ లొఱపుసెడఁగ సం
పత్తి యెడలె నటురాత్తిరి, కత్తఱి సౌభాగ్యహీన ♦ యది యగు టరుదే. ౪౩

తే॥ చీఁకటులు గ్రమ్మె రజనితోఁ ♦ జేరఁ బాఱి, పురముతోఁ బ్రజచిత్తమ్ము ♦ పాలముల్లె
దీపములె కానఁబడవన్నఁ ♦ దెరువు వేల్పుఁ, దెరువుచుక్కలు లేకున్న ♦ తెఱవుగానదె.

ఆ॥ దిక్కులేని దగుచుఁ ♦ దిట్టులుపడుచుఁ బెం, పెక్కువిధము లెడల ♦ మొక్కపడుచు
నగరి రేయి నొక్క ♦ తగవుమైఁ జూపట్టె, నైక కిట్టిగతియె ♦ కలుగు ననుచు.

క॥ తలుపులు నైచినవారే, పలుకకయుండియును రాముఁ ♦ బలికెడువారే
యులుకక కైకందలఁచుచు, నులికిపడెడువారె నైర ♦ యోధ్యాజనముల్. ౪౬

క॥ లే వధ్యయనంబులు గొఱ, గా వుత్సవములును నైన్య ♦ కలితోక్తు లెటుం
బో వనరావు సుగీతము, లేవలనునవేనిఁ బురిని ♦ హితసచ్చరితా. ౪౭

ఆ॥ వేదు లంట రగ్ని ♦ వెరవు యోజనసేయ, రెందుఁ బాకయోగ ♦ మెన్నఁబోరు
దాన వహ్ని లెడలెఁ ♦ దమ మెల్లెడలఁ గ్రమ్మెఁ, నదియుఁ గాననంబ ♦ యనఁగ నయ్యె.

తే॥ ఆత్మజాతులపైఁ బేర్మి ♦ యగ్గలంబ
యంతకన్న నాత్మప్రేమ ♦ యధిక మెందు
నుభయనిష్ఠము రామునం ♦ దొఱపుమీఱెఁ
బొలఁతి; యవ్వారిభాగ్యమ్ము ♦ పొగడఁదరమె. ౪౯

—♦ శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యపథం బధిగమించుట ♦—

క॥ అచ్చట రాముఁడు పొచ్చెం, బొచ్చెము నెడలంగ, జంద్రు ♦ నొఱపున నొలపుల్
విచ్చలవిడిగా నెఱపుచు, నచ్చటు విడనాడి కాన ♦ నాభిముఖుండై. ౫౦

క॥ ఆరాత్రిశేషమున బహు, దూరంబు గ్రమించెఁ దనదు ♦ తోడుం జోడుం
దోరా రథగతి నెఱయఁగ, నారఘుకేసరికిశోర ♦ మతిదుస్సహమై. ౫౧

క॥ తనతండ్రిప్రభిని దలఁచి జ, ననిదుఃఖావేశ మెంచి ♦ ననుచుప్రజలతి
న్ననిప్రేముఁజినయ మరసియు, మనుకులతిలకుఁ డాకమట్టు ♦ మదిఁ గొనడయ్యెన్.

సీ॥ ఆరజని మంగళావహ ♦ యట్లుగొలిచి
యరుగుటఁయుఁ గాల్యకృత్యముల్ ♦ జరిపి మెఱసి
విషయసీమాంత మరసి ర ♦ వ్వైరవుతోడ
నూళ్లు పల్లెలు వనులు చే ♦ లారసికొనుచు. ౫౩

ఆ॥ ప్రిసవపుష్పలలిత♦బహువనాంతము లట్లు, పంటపొలము లెలయు♦పాడిమొదవు
గుంపులును ధరిత్రి ♦ గూర్చినసుకృతంబ, కాఁ దలంచి కనులఁ ♦ గని యలరుచు.

— ♦ జానపదులు రాముని గనవచ్చుట ♦ —

క॥ త మ్మరయనచ్చువా రలు, సమ్మదమునఁ బొదలువారు ♦ జతన మెఱిఁగి యే
మమ్మా; యనువా రెడఁదల, నుమ్మలికముఁ గాంచువార ♦ లూరూరిప్రజల్.

తే॥ ఎంతయంతకు రాలె యా♦యింతి యింత. పాప మెటులోర్చెనే పసి♦పాప లనక
యడవి కనుపుమనంగ నో♦రాడెనకొ కో, లంబుపాడియు మఱచెనే♦లాఁతు లటవె.

ఆ॥ ఇట్టిరాచబిడ్డ ♦ నిమ్మెయిధార్మికు, నీదయాబ్ధి నీజి ♦ తేంద్రియచయు
నేమిమూటగట్టి ♦ నెంచినదే యది, పాఱఁదోలి భృతికిఁ ♦ బాలుమాలి. ౫౭

ఆ॥ వెఱ్ఱివాఁడ కాక ♦ వెరవుగలండకొ, పెద్దరాజు తనదు ♦ పేర్మి సెడఁగ
నెట్టులనుపనెంచె ♦ నేణాంకముఖుఁ డితం, డాకఁడ చాలకున్నె ♦ సకలమునకు.

క॥ మున్నాడిననుడిసడికై, బన్నములకుఁ బాలుపడియుఁ ♦ బనిచె నెటులో తాన్
సన్నుతుఁడ కాఁడె యతఁడును, మన్ననసెడె నేఁడు కర్మ ♦ మార్గవశమునన్. ౫౯

క॥ ఎది యెటులైననుఁ గా దీ, సదయుం బోఁదోల రిత్త ♦ సంబరమకొ మే
లౌదవునె యిందఱిట్టుల, మద ముడుగదె ముందు మంచి ♦ మార్గముగలదే.

తే॥ ప్రజలపాలిటిదగు మేలి♦భాగ్యమిదియ, కాదె యిందఱమేళ్ళ ని♦క్కఁతనఁ జెఱుపఁ
జూచెఁబోఁతేఁడు వగలాఁడి♦చొక్కు వెనుపఁ, గనరె కామాంధులిట్లుజ♦గమునరట్లు.

క॥ జనకునిగాదిలికూఁతురు, జనని యనంజాలు నెల్ల ♦ జగతికి శుభవ
ర్ధని నిరతసుఖాకాంక్షిణి, కనఁగలదె ట్లనఘ సీత ♦ కడగం డ్లడవిన్. ౬౨

తే॥ మేనుమెత్తన మెఱుఁగుల♦మెఱుఁగుబోఁడి, మురిపెములజొంపమిల్లాలు♦ముద్దరాలు
గాన నెటులుండునే యింత ♦ గానఁబడదె, రాలుగాయకుఁ గైకకు ♦ మేలుఁగీడు.

క॥ రవివంశ్యులఁగలసి ప్రజల్, మలసి ముదంబలరఁ బొగడ ♦ మాన్యతఁగని యే
మలయక నిలయముఁగొని యి, మ్ముల మెలఁగెడునాఁటిభాగ్య♦ము న్మది నెంతున్.

ఆ॥ అనుచు ముచ్చటించి ♦ యాతఁడు సెచ్చరి, కలు పౌనర్వఁ దేఁజ ♦ కలిమిమీఁటి
తా నయోధ్యవెసకుఁ ♦ దలఁచూపి మధురవా, గ్ధార దారసిల్లఁ ♦ దనరి పలికె. ౭౬

క॥ ఆమంత్రణ మొనరించెద, నామంత్రితవైతి మును మ ♦ హాత్ములచే నే
నేమోయి నేనియు గురునిబు, జామయము దీర్చి పేర్చి ♦ యరయుదు నిన్నున్.

క॥ నీయందలిదివ్యులకు వి, ధేయత నా మ్రొక్కులిడుము ♦ తేఁకువ వెలయన్
మాయమ్మ సేమ మారయు, మేయుక్తినయేని నీవు ♦ హిత మొనగూర్తున్. ౭౮

క॥ అని యశఃపూర్ణముఖులై, వినీతిఁ గనుజానపదుల ♦ విధ మారసి య
మ్మనుకులతిలకము పలికెను, సునంద్యుఁ డవ్వాఁడు వారి ♦ చొప్పున కగుచున్.

—♦ శ్రీరాముఁడు జానపదుల నామంత్రించి వీడ్కొనుట ♦—

తే॥ మీరు దయగలవార లి♦మ్మెయిన నిలువుఁ, డిందఱును వీడి నిర్దయుం♦డీతఁ డర్థ
సిద్ధికై యొండు-చో టిట్లు ♦ సేర నెంచి, నాడు క్రమ్మఱఁగాంచు నే♦ నాఁటికైన.

క॥ అని పలుకునతని చక్కికి, వినమ్రులై మ్రొక్కి భక్తి ♦ వివశులగుచు నె
క్కొని రెడ నెడనిలువఁగఁ దమ, కనుఁగొన లుచ్ఛ్వానములుగఁ♦గనుఁగొననగుచున్.

తే॥ అటు లత్యుత్తత నర్చించు♦నట్టివారి, చూడ్కి కెందామరలచాలు ♦ చొక్కుచుండ
నర్కుఁడు నిశాముఖంబున♦నట్టఁలగుచుఁ, జాటుపడె నప్పు డారామ♦చంద్రవిభుఁడు.

ఉ॥ దానము శీలము న్వెలయ ♦ దాక్ష్య మెసంగ ననేకయూపసం
స్థానము లొప్ప ధాన్యధన ♦ సంపద లింపగుచుండఁ బ్రాంచితో
ద్యానజలాశయావనిక ♦ లాలు విశాలపుఁబంటచేలు నా
ధ్యానము స్వర్గలోకమున ♦ కప్పటికప్పుడె కూర్చుచుండఁగన్. ౮౩

తే॥ బ్రహ్మఘోషప్రణాలికా ♦ భాసురములు
భూసురముఖోద్యమంత్రాహ ♦ తాసురములు
నైనకోసలమండల ♦ వ్యాప్తజనప
దాగ్రహారము లడచె సం ♦ యమినుతుండు. ౮౪

—♦ శ్రీరాముఁడు గంగను గనుంగొనుట ♦—

సీ॥ ఎది భూతసృష్టికి ♦ హేతుభూతంబగు, ధాతృకమండల ♦ స్థం బమృతము
లోకరక్షావిధి ♦ లోలుఁడౌహరిపాదకమలనాళిక దేనిఁ ♦ గని పెనిచెనొ

హరజటాజూటము ♦ హాటవి యెద్దాని, యాటపాటలకు దీ ♦ మైనచోటూ
సాగరు గూర్ప నే ♦ సత్కన్య కుంకువ, యాభగీరథుసము ♦ దగ్రితపమొ

అట్టి త్రిపథగ యాదివ్య ♦ యాశివాప,యాయశైవల యాపుణ్య ♦ యాగుణాఢ్య
యామునిసురేంద్రసేవ్య గం♦గామృడాని, యాప్రతీక్ష్యున కపుడుప్ర♦త్యక్షమయ్యె.

ఆ॥ ఆశ్రమములు యద్గృ♦హారామభూములో, యప్సరశ్చయము య♦దాలిజనమొ
త్రిభువనము యదీయ ♦ దీప్తసామ్రాజ్యభ, వనమొ యామె వారి ♦ వలనిదయ్యె.

ఉ॥ మువ్వురజుల్ దదీయలగు ♦ ముగ్ధనలేక్షణ లెల్లవేల్పులా
జవ్వనులుం దపోధనులు ♦ సాధ్యులు సిద్ధులు కిన్నరోరగుల్
మవ్వముగన్నతత్సుతులు ♦ మాన్యులు మర్త్యులు తద్వధూమణుల్
దవ్వన కేగుదెంతు రెది ♦ తానకమం చది వొల్చెఁ జెంగటన్. ౮౭

తే॥ పాపచయమెల్లఁ బాపుట ♦ పాప మనదు, రోగులచికిత్సలకు సుంత ♦ రోఁతపడదు
నంస్మృతులఁ దెరలింపంగ ♦ సంశయింప, దట్టినెఱజాణఁ గన్నవా ♦ రైరివారు.

సీ॥ మొగము గన్నులు మున్న♦మొగియుతానకముల, దేవతాపద్మముల్ ♦స్థితివహింప
నట్టహాసముతోడి ♦ డాదర్ప మిదియని జలచయాఘాతప్ర ♦ సక్తి నొడువ
మొలకనవ్వులముద్దు ♦ మురిపంబు లనుచోట్ల, సురుచిరఫేనము ♦ ల్పుట్టి నిలువఁ
గలికిచూపులసోయ♦గముఁ బంచి యిడునెడ, గండుమీలఖులతోఁ♦గలిసి యాడ

వాలుకలు పులినంబు లా♦వర్తములును
జక్రిచక్రాంగమకరక ♦ చ్ఛపతరంగ
రింగణంబులు నవయువ ♦ రీతు లొలయ
బాలుచుమినువాఁక యవ్వారి ♦ పున్నె మయ్యె. ౮౯

క॥ ఒక్కెడ వేణీకృతజల, యొక్కెడ నావర్తపృథుల ♦ యుగువేగయు నొం
డొక్కెడ స్తిమితయుఁ గా ధృతి, నెక్కొనునమ్మహిత యాధునీ♦మణి పొనరెన్.

క॥ ధీరధ్వనిగంభీరయు, భైరవనిస్వనయు మధుర ♦.భావరసితయున్
సారకలరవాంతరయును, నైరాజ్ఞిగఁ దనరెఁ దత్త్ ♦ దారంభములన్. ౯౦

క॥ కవిహంసచక్రిసారస, కవితాగోష్ఠుల మదాలి ♦ గానంబుల స్వీ
యవిహితతరంగభంగి,ప్రవాహములఁ దనరుదాని ♦ ప్రాభవ మొప్పెన్. ౯౧

తే॥ వరుస దిగ్గజములు వన ♦ వారణములు
నట్లు దేవోపవాహ్యముల్ ♦ హంసచక్ర

ములుసు ముజ్జగములు గొల్చు ♦ మురువుసూప
నది మహారాజ్ఞి యూ టబ్బ ♦ మనఁగ నగునె. ౯౩

క॥ ముద్దులుసూపు నొకదెసం, బద్దులురూపించు నొక్క ♦ పట్టున మేలా
పెద్దటిక యొకట నెఱపును; దద్దయుధృతి నన్నదీవ ♦ తంస మభిరతిఁ. ౯౪

తే॥ కుముదకల్హారపద్మని ♦ కుంజతీర, తరులతాకుంజపుంజవి ♦ స్తారలలిత
కుందకుట్మలహాసితల ♦ త్రుస్మలఁ బొసంగు, నాఁపెసిరిఁ గని యుల్లాస♦మంది రబల. ౯౫

క॥ వా రలరుచు దరిఁజేరఁగ, వారలఁగని పుట్టినింటి ♦ వా రనుముద మ
వ్వారిగ నాయమయు మురియు, తోరఁపుసడిసన్న లపుడు ♦ దులకించె సఖీ. ౯౬

తే॥ సుమరజముతోడి దీరభూ ♦ క్షోద మెనయ
చెఱఁగుమాయ నొక్కట మాఁపు ♦ చీర వదలి
యవల సుస్నాతయై నిర్మ ♦ లాంబరయు న
లంకృతయునై పొసంగువి ♦ లాస మొలయ. ౯౭

క॥ మణినిర్మలదర్శన స, ద్గుణలలిత రసోర్మికాను ♦ గుణచేల సుభూ
షణపదలక్షిత భాస్వ, ద్ఘృణినికరయుఁ గాఁగ నది సు ♦ కీర్తిత యయ్యెన్. ౯౮

తే॥ మలయుతీరజసుమవృక్ష ♦ మాల లొప్పఁ
గలపరాగము లంగరా ♦ గములఁ గూర్ప
హంసలక్షణకలిత శు ♦ ద్ధాంశుకాఢ్య
రసతరంగిణి శుభగుణో ♦ ల్లసిత యయ్యె. ౯౯

ఉ॥ పూవులు పండ్లు తోయములు ♦ పుష్పొడు లొప్పెడుతే నెపెందెరల్
భావనకల్మిఁజేసి తరు ♦ పఙ్క్తులు చెంగటఁదాల్చి నిల్వ హృ
ద్యావిరతద్విజోక్తులు మ ♦ దాలిరసోచితగీతులుం దగన్
బావనసేవ లుల్లసిలఁ ♦ బావని యాధుని వొల్చె నత్తఱిన్. ౧౦౦

క॥ ఆసాగరసన్మానిత, యాసాదితమంగళార్థ ♦ యై లాలింపన్
గా నమశ్కట్టి యెదుర్పడు, శ్రీసన్నాహమున తెఱఁగు ♦ సిద్ధం బయ్యెన్. ౧౦౧

ఆ॥ ఊర్మికాదిముద్ర ♦ లొప్పార ననుచున, ముద్రమహిషిఁ గాంచి ♦ మోదమలర
శృంగిబేరపురము ♦ చెంత రథావరో, హణమొనర్చి రతఁడు ♦ ననుయుతులును.

ఉ॥ సూతునిఁగాంచి యిట్లనియె ♦ శుద్ధమనస్కుఁడు రాముఁ డత్తఱిన్
బాతకజాలము ల్గెడపు ♦ భవ్య భవార్చిత నిమ్మహానదిన్

మాతృసమక్షము గనుంగొనఁగ ♦ మానితపూజ లొనర్ప వేడ్కమై
నేతదహమ్ము శుద్ధముగ ♦ నిందువసింపఁ దలంపు గల్గెడిన్. ౧౦౩

తే॥ ఇంగుదీవృక్ష మిదె తీర♦మెనసియున్న, దిదియు నిగురులఁ బూల స♦మృద్ధిగలది
దీనికడ నివసించి యి ♦ ద్దేవిసేవ, చేసికొంద మీనాఁ డెల్ల ♦ సిద్ధులొలయ.

ఆ॥ అనిన వల్లెయనుచు♦నందఱు నచ్చోటు, మొనసి రంత యుగ్య♦ములను విడిచి
సముపచారవిధులు ♦ జరిపి రామునిసన్ని, ధాన మెనసె వాఁడు ♦ తరలనయన.

—♦ గుహుఁడు రామునిసన్నిధికి వచ్చుట ♦—

ఉ॥ అంత నిషాదజాత్యుఁడు గు ♦ హాఖ్యుఁడు తత్పుర మేలువాఁడు ధీ
మంతుఁడు రామురాకవిని ♦ మంతన మంతయు సంతసంబకా
నింతటిభాగ్యవంతుఁ డనె ♦ యే ననుచున్ గులవృద్ధు లాప్తు లా
వంతునవారలై మొనయ ♦ వారును దానును వచ్చి చెచ్చెరన్. ౧౦౬

క॥ ఆబాల్యస్నేహంబున, సౌబాంధవమునకు నిదియ ♦ యవసరమని వాఁ
డాబుద్ధిమత్ప్రిధానుం, డాబోధమయాత్ముఁ దఱియ ♦ నరిగినయంతన్. ౧౦౭

ఆ॥ రాముఁ డెదురుఁబోఁ బ ♦ రాకు సామీ యని, చేరిపాదయుగముఁ ♦ జేతఁ బట్టి
కడిగి జలము మస్త ♦ కంబున ధరియించి, యర్ఘ్యవిధుల నెల్ల ♦ నాచరించి.

క॥ ఫలభక్ష్యాదుల నమ్మేయి, నలరుచు నర్పించె నంత ♦ ననఘుఁ డినకులుం
డెలమిఁ గవుంగిట నిడ వాఁ, డలభ్యలాభమున కరుస ♦ మందుచుఁ బలికెన్.

క॥ ఒరులకుఁ గలదే యీభా, గ్యరమావైభవము రామ ; ♦ కలఁడే నీకున్
సరియగునతిథి జగంబులఁ, బరమావధి యిదియ కాదె ♦ ప్రాణులకెల్లన్. ౧౧౦

సీ॥ తొలిపుట్టువున సూర్యుఁ ♦ గొలిచినకతననే, కనులకు నీమూర్తిఁ ♦ గాంచఁగలిగె
నటు సరస్వతి నిచ్చ♦లర్చించెఁ గాఁబోలు, నిను రామయని పిల్వ♦నేర్చె నాల్క
యొక్కప్రొద్దుండెనో♦యుడురాజుఁ బూజింప,మానసంబరసెఁ ద్వ♦న్మంత్రమహిమ
నాప్రొద్దు శివుసేవ ♦ లాచరించెనొ యేమొ, చేతికందెను నీదు ♦ శ్రీపదంబు
కోసలునికన్య ధన్య సం ♦ కోచమేల, దశరథుం డౌనకాదె యా ♦ దశరథుండు
నాకొదవినట్టిభాగ్య మీ♦నాఁటనెంచి, పొగడువా రెట్టు లవ్వారిఁ♦బొగడువారు.

తే॥ స్వాగతమె నీకు దేవ మ ♦ హానుభావ
యఖిలమహియు నీయదియ యే ♦ మనుచు వేఱు
గలదె శాసింపు మెవియేనిఁ ♦ గలుగుపనుల
లెంకలముగా మెలంగుదు ♦ మింక నిజము. ౧౧౨

ఆ॥ ఎటు లయోధ్య యట్లై ♦ యిప్పురియును నీకు, నీదుతమ్ములందు ♦ నేనొకండఁ
గింకరుండ నాదు♦కీర్తిత విజ్ఞప్తి, నవధరింపు మొక్కఁ ♦ డనఘ యింక. ౧౧౩

క॥ ఇదె భక్ష్యం బిదె భోజ్యం, బిదె పేయం బిదియె లేహ్య ♦ మీయిన్నిటిలో
మదికొదవినయవి గొనుఁడ, య్యదె శయ్యాతతి యవే హ♦యాహారంబుల్.

క॥ అని మఱిమఱివేఁడుచు నె, మ్మన మఖిలము రామమయము ♦ యగుచుండ నిషా
దనికేతనధనపతి వాఁ, డనువర్తన మొలయఁ జేరి ♦ యనువలరారన్. ౧౧౫

క॥ సాష్టాంగమెఱఁగి నాయఘ, శేష్టములు ఫలించెఁ దొంటి ♦ యిష్టాపూర్తా
వష్టంభమె యిది యింక న, నిష్టమనుచుఁ గలదె వీని ♦ కేనాఁడైనన్. ౧౧౬

ఆ॥ నీదుపదము లాను ♦ నెఱిఁగాంచినంతనే, నేఁ బవిత్రుఁ డనఁగ ♦ నెగడినాడ
ఆదమఱచి యిట్టు♦లనినాడ నాదగు, కొలము పొలముఁ గూడఁ♦గూర్చికొనక.

క॥ అనువిదె యని యీపాదము, లను నాయిలుద్రొక్కి పూజ ♦ లనుఁగొనుజతన
న్నను నావారిఁ గృతార్థుల, నొనరింపవె మోదయాప ♦ యోరాశి ; దయన్.

—♦ శ్రీరాముఁడు గుహుని బహూకరించుట ♦—

ఆ॥ అనిన వాని గ్రుచ్చి ♦ యక్కునఁ గీలించి, యనియె నర్చితులము ♦ హర్షితులము
కాలినడక వచ్చి ♦ కాంచితి మేలెంచి, తింతకన్నఁ బేర్మి ♦ యెందుఁ గలదె.

సీ॥ నినుఁ గాంచఁగంటిమి ♦ నీకు నీవారి క, నామయంబే కద ♦ యఖిలజనులు
పుత్రమిత్రాదులుఁ ♦ బోఁడిమిమెయి నున్న, వారలే తనుఁ గొల్చు ♦ వలనుగలరె
తండ్రిసత్యమునకై ♦ ధరవీడి తాపస, వర్తనంబున నుందు ♦ వనములందు
బదునాలుగేం డ్లంత♦వఱకుఁ గైకొన నుప, హారంబులెవియు వ♦న్యముల తక్క
వల్కలాజినములుదాల్చి♦వచ్చురీతిఁ, గాంచితివికాదె వారులకు♦ఖాద్యముల నొ
సంగి తదె చాలు నీతోడి♦ సంగడంబు, జాలుకొనినది చనదు త్రి ♦ కాలములను.

ఆ॥ అనిన నట్లొనర్చి ♦ యవ్వాఁడు తనకొల్వు, గోరి యుండ విభుఁడు♦చేరి సాంధ్య
కృత్యములనుఁ దీర్చి ♦ కేవలగాంగతోఁ, యములఁ దృప్తుఁడయ్యె ♦ నంతలోన.

క॥ తృణములసెజ్జ యమర్చిన, గుణవతియగు సీతతోడఁ ♦ గూర్చుండఁగ ల
క్ష్మణుఁడు గడిగెఁ దచ్చరణము, లణుమధ్యంగూడి రాముఁ♦డట శయనించెన్.

తే॥ అవల సౌమిత్రి వృక్షమూ ♦ లాశ్రితుఁడయి
సూతుతోడను గుహుతోడ ♦ సూనృతములు
పలుకుచుండె మేల్కని యప ♦ పాప్ముఁ డన్నఁ
గాచికొనియుంటయే తన ♦ కర్జమనుచు. ౧౨౩

ఆ॥ వానిఁ గష్టమొంది ♦ వాఁడు నిషాదాధి, నాథుఁ డప్పుడు పలికె ♦ ననుచు భక్తి
నిట్టులైతి వయ్య ♦ యిట్టి కష్ట మనుభవింపు, మేముఁ గలుగఁ గలదె ♦ యింతభయము.

గీ॥ నను మూఁటలు మోచితే, నను నియతితో నుండు మనసి ♦ నో శ్రీవనమునకు మీ
వనవాసము కొనసాఁగులటే, మనమునఁ బ్రీతిపడియుండుమ ♦ మది తెలియఁ గగుటన్.

క॥ చతురంగబలముగొని నేఁ, బతిఁ గొలుచుచునుందు నీవు ♦ పన్నుండుము స
న్మతిఁ గొను మీ సపత్నులం, బతిఁ బ్రసిత నుగునకాదె ♦ యార్యులఁ గొలువన్.

క॥ సుకుమారులు మీ రిట్టయి, యొకపకపడుచుండఁ గాంచఁ ♦ గానయ్యెను నా
కకలంకులార ; నాదగు, సకలము మీయది యవలదు ♦ సంశయ మిపడఁగన్.

—♦ గుహుఁడు రాముని వనవాసముం గూర్చి చింతిల్లుట ♦—

తే॥ రాముఁడనఁ గూర్తు నతఁడయ్యె ♦ రక్షకుండు
ధర్మమున కర్థమునకు ని ♦ దానమతఁడె
ముజ్జగమ్ములవారిలో ♦ ముఖ్యుఁ డతఁడె
శ్రేయ మొనగూర్ప నెందు నం ♦ సిద్ధుఁ డతఁడె. ౧౨౮

ఆ॥ అమ్మహాత్ముఁ డిట్టి ♦ డై తృణశాయిగాఁ
గన్నదోయి కింపు ♦ గాకయున్న
దోయి యన్న యెంత ♦ లోదవె హా : యిందుఁ గై
కేయి మూలమయ్యెఁ ♦ గేవలముగ. ౧౨౯

ఉ॥ మెత్తని సెజ్జ నెల్లుటులలో ♦ మే నిడువాఁ డలభోగ్యజాతసం
పత్తికిఁ గూర్చువాఁ డడవి ♦ పట్టుల దర్భశయానవృత్తికి
ట్లెత్తఁ జొల్పడెం గలదె ♦ యింకఁ బ్రవృత్తిసుఖం బొకండ్లకున్
గత్తర కాఁడ కాఁడె విధి ♦ కాల మొకండుగ నుండ నేర్చునే. ౧౩౦

—♦ లక్ష్మణుండు గుహు మాఱడించుట ♦—

క॥ అని వాఁ డనుతాపముతో, ననుచుండఁగ ననియె రాము ♦ ననుజన్మం డో
కని కొఁకఁడు గీమసేయునె, తనకర్మమె తనకుఁగాక ♦ దాక్షిణ్యనిధీ. ౧౩౧

తే॥ ఎవఁడొ సుఖదుఃఖములఁ గూర్చు ♦ నెడయఁ జేయు
ననుచుఁ దిట్టిన దీవించి ♦ నను ఫలంబు
గలదె స్వార్జితకర్మము ♦ ల్కారణములు
గా నహంకృతి వితతయగుం ♦ గాదె సఖుఁడ. ౧౩౨

తే॥ [illegible] [illegible]వారమునఁ♦బట్టిచూడ
[illegible] ఫలములతొ నట్లు[illegible] రెట్లు♦సంచితమువ.

తే॥ [illegible]కులనింతనితోకొ, నీవు శ్రోచిన బో[illegible]బోదు♦నియతి గలుగఁ
[illegible] ♦ [illegible] చెప్పు [illegible] న నిచ్చావనత్వంబు ♦ నంగవలదు.

ఉ॥ [illegible] ♦ బుట్టెను మే సది యూటుతోట నా
[illegible] ♦ సంగతకోపు విమిశ్రకర్మముల్
[illegible] దవల ♦ మున్నడి వెన్నడి గాక రెండునుం
[illegible] జల ♦ సంకములట్టివి వానిచోద్యముల్. ౧౩౬

తే॥ [illegible] వలయుఁగా ♦ కదియు నిదియు
[illegible] ♦ లందమున్న
[illegible] ధన్యుం డవశ్యభా ♦ వ్యత యాలంఘ్య
[illegible] నచ్చోటఁ ♦ దవిలియుంట. ౧౩౭

సీ॥ [illegible]ద్రియకాని♦కాఁదొండు రాజన్యు, కొడుకంచుఁ బ్రజ లను♦కొనెడువాఁడు
[illegible] దేవాసురు ♦ లైన్యరమ్ము దలపెట్టి, వచ్చిన జముఁజేర ♦ బుచ్చువాఁడు
[illegible]సంపాదించు ♦ కృత్యంబు మొనసిరాఁ, దాను మే నను లెక్క ♦ లేనివాఁడు
[illegible] గావవే యన్న ♦ మాట విన్నంతనే, తనయాపదయ కాఁగఁ ♦ దరలువాఁడు
[illegible]లు గాఅగాని ♦ పిటికిపోల్కి, బద్ధునింబలె నజ్ఞాత ♦ భంగి నేలఁ
బండియున్నాఁడు కంటిగా♦పార్థివేంద్రుఁ, డింక నాగంటి యరయంగ♦నేమిగలదు.

ఉ॥ కావఁగఁ జాలునాథుఁడు ♦ కట్టినయట్టిమొకంబ కాఁగ న
ల్లానని తావతంసమును ♦ నమ్మియిపొల్లనె పాలుగై కొనక
నావగ లేమిసేయుఁ దుది ♦ నన్నునువా రొకరున్నవారె య
న్నా; విధిమేల్మి యీమదికి ♦ వచ్చునె కంటికిఁ గూర్కు వచ్చునే. ౧౩౮

ఉ॥ పున్నెము లన్ని సేసి కని ♦ పూజ్యుఁడు రాజ్యమొనర్చుభాగ్యముల్
గన్నులగాంతుమంచు నెఱ ♦ కాంక్ష తలిర్పఁగ వేచియున్నయా
యన్నలమిన్న తల్లి యటు ♦ లయ్యాయెఁ బొక్కుచు నేలఁగూల నీ
యన్న వనాధివాసకృతి ♦ నందుటకన్ననుఁ బాప మున్నదే. ౧౩౯

మ॥ ప్రజ లెల్లం బ్రజలట్లు వెంటపడఁగన్ ♦ బన్నాగము ల్వన్ని యా
విజనస్థానమునందు వీడి యిటకున్ ♦ విచ్చేసినా డట్టిడా
స్వజనం బింతకు నేమిగాఁగలదొకో ♦ చర్చింప నీరాత్రితో
విజయం బెట్లగు నన్న చో నవల భా ♦ వింపంగఁ జోటుండునే. ౧౪౦

తే॥ రాజు జీవింపఁ దన నల ♦ రాజ్ఞమాట
దెలుపఁగానేల మాతల్లి ♦ దీర్ణహృదయ
యై నశించునో కడగొట్టు ♦ వానిప్రాప్తి
నెంచి ధరియించునో యింత ♦ యెఱుకపడదు. ౧౪౧

తే॥ పోయినది పోయినది యెల్ల♦భోగ్యపదవి, యడవిపాలగుఁజు మ్మయో♦ధ్యాపురమ్ము
రమ్యచత్వరసుస్థాన♦రాజధాని, కోసలేంద్రుల కివె కద♦కూర్చునదియు. ౧౪౨

ఆ॥ కన్నతండ్రి యట్లు ♦ గా సంస్కరింపఁగా, వచ్చువారె పొగడ ♦ వచ్చువారు
మాకుఁ గలుగ దట్టి ♦ మానితయగువృత్తి, విధి తలంచి యిట్టి ♦ విధికిఁ గూర్పె.

క॥ కల్యాణనిధి సుగుణసా, కల్యాత్మక రాజధాని ♦ క్ష్మాజానికి స
త్కల్య సురమ్య యయోధ్య య, హల్యావరదునకె దూర ♦ మనవయ్యెఁ గదే.

తే॥ మంగళాశోద్యముఖ్యప్ర ♦ సంగకలిత, యిష్టపుష్టజనాకీర్ణ ♦ యిద్ధచరిత
దేవతారాధ్య యద్దానిఁ దెలిసి యేలి, యెవ్వ రేకీర్తి నెవ్విధి ♦ నెనయఁగలరో.

తే॥ కందుమేమో బ్రదికియుండఁ ♦ గా మహీంద్రుఁ
గన్నతండ్రినిఁ గన్నుల ♦ కఱవుదీఱ
నుందుమేమో వ్రతముఁ దీర్చి ♦ యూరివార
లెదురుకొన వచ్చి యప్పురి ♦ యెలమి మెచ్చి. ౧౪౬

క॥ సమ్మతుఁడు త్రిలోకికి శ్రీ, లమ్ముగలఁడు మనుపఁజూచు ♦ లాఁతులనైనన్
గ్రమ్మఱి యిమ్మెలున నితఁ, డిమ్మెనసి సుఖించుఁగాత ♦ మెల్లరు మెచ్చన్.

ఆ॥ అనుచు నొవుచుండ♦నారాత్రి యారాజ, సుతుల వ్యసనవృత్తిఁ♦జూడనోప
నని తలంగె ననఁగ♦నప్పటికప్పుడె, యాప్రభాత మెనసి♦యైక్య మొందె. ౧౪౮

ఆ॥ ఆనిషాదనాథు ♦ నాస్యమం దంబువు, లంబుజంబునందు ♦ నట్లు దొరఁగె
నమ్మతోడిపరిభ ♦ వమ్మ తమ్మఱుమంగ, నంగలార్చుచుండు ♦ టచ్చుపడఁగ.

క॥ గురుసౌహృదమున గుహుఁ డా, ర్వారార్తమగునాగ మట్లు♦వ్యసనాతురుఁడై
సరభసముగ నిట్టూర్పులు, పరఁగించె న్వేగుఁబోక ♦ పవనుఁడు వీచెన్. ౧౫౦

—♦ గుహుఁడు శ్రీరామప్రభృతుల గంగ దాఁటింపఁ బ్రయత్నించుట ♦—

ఉ॥ రాముఁడు మేలుకాంచి యిట ♦ రమ్మని తమ్మునిఁ బిల్చి కంటివే
యామిని దేవి తానరిగె ♦ నర్కుఁడురాఁ దటే యయ్యెఁ గోయిలల్
గోముగ బ్రహ్మణంబులునుఁ ♦ గూయుచునున్నవి గంగదాఁటిపో
నామనకన్న నన్ననుడి ♦ నాతని కాతఁడు దెల్పివచ్చినన్. ౧౫౧

తే॥ పరిజనముఁ గాంచి స్థపతియుఁ ♦ బారిబర్హ
ముతియు సుస్రృథయు సుశ్రీక ♦ యును ననంగ
నైనచక్కని నావఁ దెం ♦ డనినఁ దెచ్చి
వాండు గని మెచ్చి యు ♦ వ్వాఁడు వచ్చి. ౧౫౨

ఆ॥ కడిసి రాముచరణ ♦ కమలంబులకు మ్రొక్కి, నన్ను గన్న తండ్రి ♦ నావ దెచ్చి
నాఁడఁ జూడవే న ♦ నాథ దయాదృష్టి, ననుచువాఁడ ననిన ♦ నాథుఁ డలరి.

క॥ అంకసదుండవే నిన్నా, తంకమ్ములు మొనయ నఖిల ♦ ధనిస్వైతి వనర
గింకరుఁడను నీకలపను, లింకఁ దెలుపు సెజ్జో సేయ ♦ నే రామనరా. ౧౫౪

క॥ ఈయెడ మే మీరాత్రిపై, నీయనుజ్ఞన నిలువఁ బార ♦ మెనయించుట నే
చేయఁదగునని యనిన వాఁ, డోయధిపా ; నీయనుజ్ఞ ♦ కొక యాంకిలియే.

ఆ॥ జ్ఞాతి నాతిఁ జేయు ♦ రీత్రఁ దనర్చునీ, పాదపాంకజములఁ ♦ బరఁగురజము
బ్రాఁతి యగుచె కొయ్యఁ ♦ బడఁతి నొనర్చుట, దనకటంచు విం్తి ♦ దలఁకువాఁడ.

క॥ నీపాదంబులు గడిగెద, మూఁపున ధరియించి తరణి ♦ మొనయించెద ని
న్నాపగ దాటించెద న, న్నాపయిఁ జేర్పవె భవాబ్ధి ♦ యవ్వలిదరికిన్. ౧౫౭

సీ॥ తనపుట్టు వెసఁ గూర్మిఁ ♦ దవిలి యజ్ఞేశుండు, పాయసం బొసఁగఁ జూ ♦ పట్టుటయును
గాకపక్షధరుండ ♦ వే కౌశికునియిజ్య, కసురులఁ జోకార్ప ♦ నరుగుటయును
మునిపత్ని శాపార్త ♦ ముంగాలిధూలిచే, వినిహతపాపఁ గా ♦ వించుటయును
ముక్కంటిచేత ము ♦ న్నొగ్గకొన్న యావిల్లు, వాలి యెక్కిడి త్రెంచి ♦ వైచుటయును
విన్నవాఁడ మేలు ♦ కొన్నాఁడ నన్నాఁడ, నెన్ననైన చెలిమి ♦ గొన్నవాఁడఁ
గన్నవాఁడ నన్ను ♦ మన్నింపుమని వేఁడు, చున్నవాఁడ నలువఁ ♦ గన్నవాఁడ.

క॥ అని సల్లాపములాడుచు, మునివందితుచెంతఁ జేరి ♦ మురియుచుఁ దను ధ
న్యునిఁగా నెంచుచు మించుభృ, తిని వాఁ డవ్వేళఁ దెప్ప ♦ దేలెడుభక్తిన్.

ఆ॥ పాదయుగళిఁ గడిగి ♦ పైఁ జల్లుకొని మ్రొక్కి, పూజ లొనరఁ జేసి ♦ పుణ్యమూర్తి
జనకజాత ననుజు ♦ సత్కారములఁ దేర్చి, వాఁడు సుకృతి యయ్యె ♦ వామనయన.

క॥ రాముని దనమూఁపున గా, రా మొప్పఁగఁ జేర్చికొంచు ♦ రాణ వొనర సీ
తామహిళను లక్ష్మణుఁ గని, యీమేలౌ తటిఁ దరిన్ ర ♦ హించు మెలఁతువరా.

క॥ ఆరోహింపుఁ డనఁగ నవు, డారాముని యాన శరశ ♦ రాసనముఖ్య
శ్రీరమణీయకలాపము, లారోహణసదృశుఁ డనుజుఁ ♦ డను వెనయించెన్. ౧౬౨

—♦ సుమంత్రుఁడు శ్రీరాముం బ్రార్థించుట ♦—

తే॥ తోడుతో జోడుతో నోడ♦కోడ కరుగు, జాడఁగని నన్నువిడనాడఁ ♦ జూడనగునె
నేఁడవచ్చితినేనేను ♦నిన్నుఁగొలుచు, వాఁడఁ గానే యనుచుసూత♦వరుఁడు దఱిసి.

క॥ నాచేయుకర్జమే మిఁక, నీచేత న్విడిచిచనఁగ ♦ నేఁ జాలుదునే
యేచోటున డాఁగఁగ నగు, నేచినత్వద్విరహావహ్ని ♦ యెరియింపంగన్. ౧౬౪

—♦ శ్రీరాముఁడు సూతుని బుజ్జగించి వీడ్కొనుట ♦—

చ॥ అనవిని రాముఁ డాతనిఁ గ ♦ రాత్మవిమర్శసుఖాత్ముఁ జేయుచున్
మనమునఁ జింతమానుము వి ♦ మానన లెన్నకు మేనువచ్చిన
య్యానువుదలంచి యయ్యకడ ♦ నాతనినేమము లారయంగనై
తనుకకయుండు మేగుమపె ♦ తావకయోగ్యత కానవాలగున్. ౧౬౫

క॥ అగునంతవఱకు వచ్చితి, వగదంకారుఁడ వనంగ ♦ నై యార్తిదొలం
పఁగ నేమడవులఁ జొరఁగా, దగ దిటపై నీదురాక ♦ దాక్షిణ్యమయా. ౧౬౬

క॥ అరదముగొనిచను మయ్యాది, యిరవునకుం జేర్పఁదగిన ♦ దే యింకిట మే
లరయుమనుచుఁ దఱిమెదుదా, శరధితలఁపు దలఁచి నాఁడు ♦ తద్దయుఁ బలికెన్.

ఉ॥ యోజననేసిచూడ ఫల ♦ మున్నదె విద్దెల బుద్ధులన్ గుణ
భ్రాజితవృత్తి మార్దవము ♦ బాగున నార్జవమందు నెఁచునుం
దేజముసూపకున్న నినుఁ ♦ దెచ్చె సభార్య్య సహానుజన్ము ని
ట్లీజడతాప్తి కిన్ని యన ♦ నేమనఁగావలె నొడ్లసంగతుల్. ౧౬౮

తే॥ నిఖిలతంత్రస్వతంత్రుఁ డ ♦ న్నేత ధాత, నీవునట్టులె యన్నియు ♦ నేర్తుకానఁ
గాననుండి జయింతు లో♦కముల నెల్ల, వంచితులమైతి మేమె మీ♦వలన రామ.

క॥ పాపమొనర్చితి మమ్మెయిఁ, బాపాత్మక కైకపాలఁ ♦ బడితిమి తానై
త్రోపాడుఁగాక యింకిటఁ, బ్రాపుగలదె యిట్టిదుఃఖ ♦ భాగుల కధిపా. ౧౭౦

క॥ అని యాత్మసముని రాముని, వనగతు వనటమెయి నాడి ♦ వాఁ డేగతియున్
దనమదిఁ దోపమి విలపిం, చెను హాయని పెద్దతడవు ♦ శ్రితభరణచణా. ౧౭౧

ఆ॥ అట్టులైనవాని ♦ నాశ్వాసితు నొనర్చి, కనులు గడిగికొని ము ♦ ఖంబుసూపు
మింకననుచుఁ బనిచి♦యెనయ రాఁ బొదివియిట్లనియె రామవిభుఁడు♦ననుచుఘణితి.

సీ॥ ఇక్ష్వాకుకులమున ♦ కీనీకు సరివచ్చు, హితుఁడు లేఁడనుచు నా ♦ కెఱుకగలదు
దశరథేంద్రుఁడు శోక♦దశఁ గుంది నశియించె, ననుకీడు పడకుండ♦నరయవలయు

నటుగా కొంకొంట ని ♦ న్నరుగుమందునె ధర్మ, బద్ధుఁడై యావృద్ధు ♦ బడలినాడు
కామవశంబున ♦ గతిసెడెఁ బో యంచు, వాదల్లుకొనియె నీ ♦ వసుధయందుఁ
దనయుఁ క్లిష్టంబునకుఁ గాని ♦ ధరణి యేలు, కష్టమేటికివచ్చె భూ ♦ కాంతులకును
నిన్నియుఁ దలంచి యే నేత♦దిచ్చఁ ద్రోవ, నెంచకున్నాడఁ జూయిది♦యింతనిజము.

క॥ అతఁ డార్యుఁడు వృద్ధుఁడు ని, ర్జితేంద్రియుఁడు సూనృతోక్తిఁ ♦ జెనసి గెలిచినా
డతిదాక్షిణ్యుఁడు గురుఁడ, మ్మతిమంతునితలఁపు సెఱుప ♦ మాకుందగునే. ౧౭౪

తే॥ కష్టవడియైన నీవు న ♦ న్గాంచి యాయ
దృష్టదుఃఖుని యిష్టంబు ♦ దెలిసి మెలఁగి
నడుపు మీకొన్నినాడు లి ♦ న్నయము దోఁపఁ
జక్కపడు నన్నియును మత్ప్రి ♦ సంగమునను. ౧౭౫

ఆ॥ కాన నమ్మహాత్ముఁ ♦ గదిసి నానుడి గాఁగ, బలుకు మేను సీత ♦ భ్రాతయునుఁ ద
లఁపము వీడు వీడు♦లా గెంచియును వన, మందు మెలఁగుచుంటి ♦ మలతిననియు.

క॥ ఈరేడువత్సరంబుల, నీరేడుదినంబు లట్టు ♦ లెనయించి తుదిన్
జేరెదము నీపదద్వయి, మారూఢిం గాంచి మ్రొక్క ♦ నభినందింపన్. ౧౭౭

తే॥ ఈవు పర్యుత్సుకుఁడవు గా ♦ కెలయు మనుచు
దెలిపి మాతల్లిఁ గౌసల్య ♦ దేవిఁ గొలిచి
యాదరింపుము మాతల ♦ కందఱకును
మఱియుఁ గైకేయికిం దెల్పు ♦ మావినతులు. ౧౭౮

క॥ భరతుని రావించి సుగుణ, నిరతు నిపుడె రాజ్యపదవి ♦ నిలుపుమని కృపా
భరితుఁడగుజేనిఁ దేర్పుము, విరతముగాఁబోల దిట్టి ♦ విధికృతి నదియున్. ౧౭౯

తే॥ అతనితోఁ జెల్పు మాతల్లు♦లందఱను సుమిత్రఁ గౌసల్యఁ గనఁగాంచి♦మేలెఱింగి
యాదరింపుము నీతల్లి ♦నట్టె కాని,యంతకును నెక్కుడుగఁ గాని♦యని నయమున.

ఆ॥ తండ్రిమేలు దలఁచి ♦ తనభావ్య మూహించి,నన్నుగూర్చి నైన♦ నడుపు మనుము
కలుగు నుభయలోక♦గతి సౌఖ్యములు నిట్టి,యాపయికము వలన♦నని తెలుపుము.

క॥ అని బోధించి యరుగుమన, ననితరశోకాభితప్తు ♦ డై వాఁ డతనిం
గన లేక గాంచి పలికెను, వినమ్రభావంబు పొదల ♦ విశ్వగుణజ్ఞా. ౧౮౦

—♦ సుమంత్రుఁడు రామునితోఁ దనకొలువు గొనుమని మఱిమఱివేఁడుట ♦—

సీ॥ ఉపచారములువల్కు ♦ చుంటినాకుము గొను, మతిభక్తివివశు న ♦ న్నాదరమున
నీవులే కీతేరు ♦ నిలుచునో నడుచునో, మున్నాడి యీయున్న ♦ నన్న గనుము

పుత్రశోకార్తనాఁ ♦ బొనుపడునట్టి యప్పురిఁ జొరంబాఱినా ♦ తెరు వరయుము
జనని మాతులువీటి♦కనిచివచ్చితిఁ బుత్రు, నందునో కందునో♦యది దెలుపుము
నే నెఱుంగ నిట్టి ♦ నీతిబాహిరవృత్తు, లెన్నఁడును బ్రియంబు ♦ లే వచించి
తక్కఁ దక్కఁగలుగు ♦ దళెల్లఁ దలఁచి నేఁ, డందుఁబోవమొనయ♦నైతి ననఘ.

ఆ॥ దూరగతుఁడ వగుట ♦ దోఁపక మనమున. నున్ననిన్నుఁగనుచు ♦ నన్న మనక
యున్నపురజనంబు ♦ నోదార్తుఁ గాకేమి, యడవి విడిచినాడ ♦ నయ్య ననుచు.

క॥ కావున నయోధ్యఁ గానం, బోవంబో నీవు నిల్చు ♦ పొలమున మెలఁగం
గా వలతు నట్లుగాదన, నావలఁ దుదిముట్టఁగాంచు ♦ నంతెర మెంతుర్. ౧౮౫

క॥ నీకనులసన్న మెలఁగగ, నీ కగునవిగూర్చ విఘ్న ♦ నిరతి దొలంపన్
స్వీకృతవృత్తిఁ జరించెదఁ, జేకొనవే నాదుకొలువు ♦ శ్రితసంతరణా. ౧౮౬

ఆ॥ అప్పు డప్పురంబు♦నం దొనరించితి, నూతకృత్య మిపుడుఁ ♦ జొచ్చి యడవి
యందుఁ గూర్తు నేర్చి!యావల నిన్నుఁగొని, యరుగ మెసఁగ వీటి♦ కరుగఁ దలఁతు.

క॥ ఋణదేశ్వరముఖ నీదరి, ఋణములుగాఁ గడతు నిట్టి ♦ సంవత్సరముల్
గణనకువచ్చునె తనవీ, ఋణ మెనసి సుఖించుచున్న ♦ జనమున కెపుడున్.

క॥ భృత్యుఁడు భక్తుఁడు వీఁడీ, కృత్యమునకుఁ దగు నటంచుఁ ♦ గీర్తించి కృతిన్
మత్యుపహితఁ జేయుము మ, న్మత్యవగత మిదియ నన్ను ♦ మనుపు మధీశా.

క॥ అని వేఁడుకొనెడువానిం, గని సేవకజనహితార్థ ♦ కాముఁడు నిష్కా
మనుఁడు మనుకులతిలకుఁ డి, ట్లనెఁ దద్దయుఁ బుజ్జగించు ♦ నను వేర్పడఁగన్.

— ♦ రాముఁడు సుమంత్రు నయోధ్యకుఁ బనుచుట ♦ —

తే॥ నీదుభక్తి యెఱుంగుదు ♦ నిన్నె యిప్పు, డనుపవలసినదయ్యె నీ ♦ వరుగకున్న
నధిపుసత్యమ్ము నిలువ దా♦యమ్మ నమ్మ, దయ్యకు సుఖమ్ము సేకూర♦దందువలన.

క॥ మిథ్యావాది యటంచు న, తథ్యమ్ములె పలుకుచుండు ♦ దాన నతనికిన్
బథ్యము పనుపడదు యథా, తథ్యం బొడఁగూర్చి మేలి ♦ దారి నడుపుమీ.

తే॥ భరతు రాజ్యంబు స్థితియుఁ జొ ♦ ప్పడదు దాన
నాపెకు ముదంబు లేదు నీ ♦ వరిగి తీర్పు
మిన్నియు నెఱింగి నాదగు ♦ హితము గూర్పు
మలఁతి సేసితి ననఁబోకు ♦ మన్న యిపుడు. ౧౯౩

క॥ అని తగవచించి యెట్టకొ, యనుమతు నతనిం బొనర్చి ♦ యనుపదమె గుహుం
గని సజనంబుగువనమున, నునికి పొసఁగ దొకట నొంటి ♦ నుండఁగ వలయున్.

ఆ॥ [illegible] లయుఁ ♦ దగినయ[illegible]మమున, సుచితమెఱుఁగి [illegible]ంక ♦ నుండఁబోదు
ముని[illegible] ♦ న్యగ్రోధతరువర, క్షీరములు ఘటించెం ♦ జేర్చి జడలు.౧౯౫

—♦ రాముఁడు లక్ష్మణుఁడును జడలు దాల్చుట. ♦—

క॥ అన వటక్షీరముఁ దెచ్చిన, జననాథుం డల్లఁ దనకు ♦ సౌమిత్రికి నే
ర్పున జడలు దాల్చిపొల్చిరి, ననుఁ బోల్పఁగ నగుచు వారు ♦ నగరాజసుతా.౧౯౬

ఆ॥ వల్కలము లుఁగట్టి ♦ వరజటామండల, ధారులగుచు నిష్ఠ ♦ వారుపూని
వఱలి రపుడు మేలి ♦ వైఖానసము మార్గ, మనుసరించుతపసు ♦లట్టు లబల.౧౯౭

క॥ ఆదట గుహుఁగని యిటులనె, నాదయమానుండు ♦ నగరి కరుగు మెఱిఁగిసం
పాదింపు మప్రమత్తుఁడ, వైదాత్మ్యము నెఱయఁ గీర్తి ♦ ననితరవృత్తిన్. ౧౯౮

క॥ బలకోశదుర్గజనపద, ముల రక్షణమునఁ బ్రసక్తి ♦ మొనయుము దానన్
నెలకొను జేనికిఁ బున్నెము, నెలవు ప్రజాపాలనంబు ♦ నేర్చి మెలఁగినన్. ౧౯౯

తే॥ నన్ను భావింపు మెద నీకు ♦ ననుచువాఁడ
గొలఁదికాలమునను వత్తుఁ ♦ గోర్కు లలర
ననుచు నామంత్రణ మొనర్చి ♦ యతఁడు ననిచెఁ
దరిదఱియఁ దమ్ముఁ డతివయుఁ ♦ దరలిరాఁగ. ౨౦౦

—♦ సీతారామలక్ష్మణులు నౌకారోహణం బొనర్చుట ♦—

ఉ॥ వేగవతీలలామ నతి ♦ వేగమున న్దరియింపనెంచి హ్రా
ద్భాగము నేర్చి సన్నుతులుఁ ♦ బన్ని సహోదరుఁ గాంచి వత్స ముం
దీగణనీయ దీనిపయి ♦ నెక్కఁగఁ జూడుము త్రోడ నీవుగా
రాఁగలవాఁడ నేను నచి ♦ రంబన నాతఁడు నట్లొనర్పఁగన్. ౨౦౧

ఆ॥ ఆనిషాదవిభుని ♦ హస్తంబు చేఁబూని, యరిగివత్తు ననిన ♦ నధిప మేలు
గాదె నాదురాశ ♦ కలఁకమై నిచ్చోట, నింక నుండఁజాల ♦ నెట్లు ననిన. ౨౦౨

ఆ॥ ఆసుమంత్రునట్లు ♦ లాతనిఁ దేర్చి నా, తావెఱింగి వచ్చి ♦ పోవుచుండు
వాఁడ వేను వత్తు ♦ వ్రతము సాఫల్యంబు, నొందఁ గాంచి యనుచు ♦ నూఱడించి.

క॥ తరణివయి రాముఁ డమరినఁ, దరణిప్రభ లొదవె నమర ♦ తతి వినుతించెన్
దరివావాఁలకు గుహుఁడు హె, చ్చరికం బొనరింపఁ గదలెఁ ♦ దద్దయు నదియున్.

శా॥ బ్రహ్మక్షత్రజపప్రధానవిధితా ♦ త్పర్యంబు చెన్నార నా
బ్రహ్మణ్యుండు జపించె మంత్రములు సం ♦ భావించి రయ్యాపగన్

బ్రహ్మణీనుత సీత యమ్మగధజా ♦ పత్యమ్ము దాను న్నిజా
జిహ్మాత్వం బెసఁగ న్నతు ల్నుతులు సు ♦ శ్రీయుక్తిఁ గావించుచున్. ౨౦౫

మ॥ నడువంజొచ్చెను నావ నావికజనా ♦ నందానుసంధాన మె
క్కుడుగా రామకథాసుధాక్షరసుధ్ర ♦ క్త్సత్యార్థ వస్తుస్థితిన్
నడివాఁకం జొరఁబాఱునయ్యెడ కెడ ♦ న్నారీవతంసంబు చొ
ప్పడుభక్తి న్నిధిలేంద్రకన్యక ధునిన్ ♦ బ్రార్థించె భవ్యార్థినీ. ౨౦౬

—♦ సీత గంగం బ్రార్థించుట ♦—

చ॥ దశరథపుత్రుఁ డమ్మరో యి ♦ తండు తదాజ్ఞఁ బ్రతిజ్ఞమై వనిన్
వశిజనవృత్తి నాల్గుపది ♦ వత్సరము ల్చరియింప వచ్చె న
వ్వశమునఁ దమ్ముఁ డేనుఁ గొలు ♦ వం జనుదెంచితి మిట్టిమాదశన్
విశదముగా నెఱింగి యతి ♦ వేలశుభోన్నతి గూర్పు మేర్పడన్. ౨౦౭

తే॥ ఏము పునరాగతులముగా♦నితఁడు రాజ్య, మేలఁ గనునంత సర్వస♦మృద్ధనగుచు
వేలకొలఁదిగఁ గూర్తునీ♦మేలుదలఁచి,పూలపూజలుయజనము ♦ ల్పున్నెములును.

తే॥ గోశతసహస్రచయములు ♦ పేశలాన్న, పేయవస్త్రసమృద్ధులుఁ ♦ బ్రీతిఁగూర్చు
దాన దానము ల్నియందుఁ♦దవ్రులుభక్తి,ద్విజవరేణ్యులఁబిలిపించి ♦ తృప్తి నెఱయ.

క॥ ఓతాపసవందిత నే, నేతన్మార్గమున మేల్మి ♦ నెనసి యరుగుచో
సీతీర్థాయతనంబుల, భూతములకు వేల్పులకునుఁ ♦ బూజ లొనర్తున్. ౨౧౦

చ॥ అరసి సురాసుధాఘటస ♦ హస్రశతంబులు మాంసభావితా
న్నరుచిరభక్ష్యరాసులును ♦ నవ్యఘృతాక్తములై చెలంగ నీ
దరిఁ గొలుపు ల్ఘటింతు నియ ♦ తస్థితి పాల్పడ నేటనేట న
మ్మరో! త్వదుపాత్తయాకరుణ ♦ మాకు శుభోదయవృత్తి గూర్పఁగన్. ౨౧౧

తే॥ ఏనుఁ దమ్ముఁడుఁ దోడుగా♦నిత్థచరితుఁ, డితఁ డయోధ్యకుఁజేరి మే♦లెనయఁగనెడు
చొప్పు చొప్పడ నినుగొల్తు♦శోభనాంగి,మఱచుదానను గాను నీ♦మహిమలెపుడు.

ఆ॥ నీవు బ్రహ్మలోక ♦ నియతవై త్రిపథగ, నైతి లోకపావ ♦ నాత్మమూర్తి
వగుచు హరజటాంత ♦ నాసాద్యవై యబ్ధి, పత్ని నాఁగ జగతిఁ ♦ బరఁగి తెపుడు.

క॥ నీయనుభావం బెన్నఁగ, నీయలఁతుల కింతమాత్ర ♦ నే యగునే వి
ద్యాయోగవిదధినేత్రివి, మాయోగక్షేమ మరయు ♦ మా గిరిపుత్రీ. ౨౧౪

తే॥ అనుచుఁ బ్రార్థించుచుండె న♦య్యవనికన్య,దక్షిణతటం బెనసె నావ♦తత్క్షణంబ
యాసుదక్షిణ తలఁచిన♦యవియు నెల్ల,దీర్తునని గంగ పొంగారు♦తెలివి దోఁప.

క॥ ఆలోన నావఁ జేతము, లాలావరులైన దాశు ♦ లటుపాడి కృతం
బాలలితంబై యుండఁగ సు, శ్రీలాలితులైరి మౌని ♦ చింత్యపదాబ్జా. ౨౧౭

సీ॥ రామన్న భావింపుఁ ♦ డేమన్న మోక్షంబు, రాదన్నలార యీ ♦ పాదరయుఁడు
రా మన్న సంపదల్ ♦ రామన్న సేవింపఁ, బో మన్న యనుచు గా ♦ రాము నూపు
రామన్నఁ బూజింప ♦ రా మన్న నల్గూర్చు, రా మాన మేలరా ♦ పామరుండ
రామన్న దేవుండు ♦ రామన్న కన్నయ్య, రా మమ్ముగన్నయీ ♦ రామ లక్ష్మిశ్రీ
గా యనుచు రావదేర బ♦రాన యనుచు, రాపొనర్పంగఁ జెల్లదు♦రా యటంచు
ధీవరులు బోధకలనాసు♦ధీవరు లయి, రామహాహ్లాదయులబ్ధిఁ బ♦ద్మాయతాక్షి.

ఉ॥ ఆదట నావవీడి నది ♦ కంజలిసేసి పథిప్రసక్తులై
పోదలఁ బూను నయ్యెడనె ♦ పుణ్యుఁడు రాముఁడు తమ్ముఁ జూచి ని
ర్వేదమువంకఁ బోనిమది ♦ రేపును మాపును నెల్లవేళలన్
బ్రోదియ కాఁగఁ బ్రోవనగుఁ ♦ బూజ్య విదేహజ వైరిమర్దనా. ౨౧౯

తే॥ అగ్రభాగమునను నీవు ♦ నవల నవని, జయునుఁ దదనుపదం బేను ♦ నయి తనర్చి
నడువవలె సజనం బజ ♦ నంబుఁ గాఁగ, నెట్టులగు చోటునను వల ♦ దేమఱంగ.

క॥ ఒండొకళుల రక్షణమున, నుండవలె న్మనము కడచి ♦ యొక్కండగునే
దుండగితన మొదవిన వా, దుండనగునకాని మంచి ♦ యోజన కలదే. ౨౨౦

చ॥ అనఘుఁడ నేఁడుగాఁ దెలియ ♦ నయ్యెడుఁ గాననవాసకష్ట మే
జనమును క్షేత్రముల్ గనని ♦ జాడమెయిన్ విషమప్రపాతముల్
ఘనగిరిదుర్గముల్ గదియఁ ♦ గాఁ జొరఁగాఁ దినఁ ద్రావఁ గానమిన్
ననుచు నొకొండుచోటికిఁ జ ♦ నంజనునక్కడగండ్లఁ బొల్పడన్. ౨౨౧

క॥ అనుచున్న యన్న యన్నుడి, గొని సజ్యాస్త్రము సుమిత్ర ♦ కొడుకు ధనువు గై
కొని నడువఁ దోడ ధరణిజ, యనంతరము రాముఁడుగను ♦ నరిగిరి గిరిజా.

క॥ గంగాపరపారంగతు, నిం గాంచఁ దలంచి యెగయు ♦ నెఱిఁ గానమి దృ
ష్టింగీలించియుఁ జేడ్పడి, భంగపడె సుమంత్రుఁ డపుడు ♦ పర్వేందుముఖీ. ౨౨౩

—♦ సీతారామలక్ష్మణులు గంగదాఁటి యడవిత్రోవం గొని చనుట ♦—

క॥ ఆలోలాంబకతోఁ గని, రాలోలతరంగ గంగ ♦ నటుదాఁటి యటన్
శ్రీలలితసస్యమాలా, వేలనమృద్ధులగువత్స ♦ విషయముల నుమా. ౨౨౪

తే॥ అవి గడవఁ గాంచి యాకలి♦యగ్గలంబు, గాఁగ మెకముల నాల్గింటిఁ♦గాంచి త్రుంచి
మేధ్యములు మాంసములు గొని♦మేలెఱింగి, యొకవనస్పతిరాజమ్ము♦నొలసి రపుడు.

ఉ॥ పశ్చిమసంధ్యవార్చి సుర ♦ పాలసమర్చితుఁ డాతఁ డాత్మనై
పశ్చితి మీఱఁ దోరముగఁ ♦ బారణ స్వీయులుఁ దానుఁ దీర్చి యా
స్వశ్చరుతానసం బరఁగు ♦ సన్నియతిం దగి తోడివారివా
నిశ్చయము ల్గనం దలఁచి ♦ నిర్మలభావముతోడ నిట్లనున్. ౨౨౬

—♦ రాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యవాసకష్టంబుల నుగ్గడించుట ♦—

క॥ ఒకరాత్రి గడవనయ్యెడు, నకలంక సుమంత్రువీడ ♦ నైతిమని మదిన్
గకవికపడకు మతండ్రి, త్వకలితవృత్తిన మెలంగ ♦ వలయుఁ గుమారా. ౨౨౭

క॥ ఊర్జితులమయ్యు నేఁడిటు, స్వార్జితతృణశయనశయుల ♦ మైతిమి దొసఁగే
యార్జవమునఁ గననయ్యెఁ బ్రబ, మార్జన మొనరింపనెంచు ♦ మలయిక వలనో.

ఆ॥ అన్న లక్ష్మణా ; మ ♦ హాసమృద్ధుఁడు వృద్ధ, రాజు నేలఁబోరలుఁ ♦ దేజ మెడలి
తుష్టయగుచు నుండు ♦ దుష్టకామన కేక, యాత్మజాత సిద్ధు ♦ లమరె ననుచు.

వ॥ ఇంతటిజంత భరతునిరావించి మించినరాజ్యోన్మాదంబు కారణంబుగా ముదుక తేనిం బరిమార్పనేర్పఱపకుండునే మునుమున్న కామవశంవదుండై యన్నాతి పన్నినవలలంజిక్కియున్న యన్నాథుం డనాథుండును గతవయస్కుండును మద్వి రహితుండునై నేఁడేమిచేయంగలవాఁడు, ఇట్టిదగుగట్టివ్యసనంబును మహారాజ మతివిభ్రమంబును భావించి ధర్మార్థంబులకన్నను గామంబ యతిశయితంబైన యది యని నిర్ణయించెదఁ గాకున్న నవిద్వాంసుండేనియుం గన్నతండ్రియగు నాతండు ఛందానువర్తియగుపుత్రుని నపత్రప మాని ప్రమదయగునది వలచిన యిష్టకృత్యంబువలని పరిపూరణంబునకై పరిత్యజింపనేర్చునే తాతపాదుండు వయోఽతీతుండగుటయు నే నరణ్యాశ్రయుండనగుటయు సభార్యుండై సుఖం బుండి కేకయసుతాసుతుండగు భరతుండు భరతపదం బన్వర్థంబుగా ముదితంబు లుదితంబులునగు కోసలదేశంబుల ననేకంబుల నేకముఖంబుగా నేలంగాంచి యధిరాజ సింహాసనపదం బధిష్ఠింపంగలండు, కామమెక్కుడుగాఁగొని యర్థ ధర్మంబులంబెద్దసేయక వర్తించునాతం డీచక్రవర్తిసన్న నాసన్నుండగు నను కొనుము ఇంతకు దశరథాంతంబునకు మద్వనాంతప్రాప్తికి భరతురాజ్యంబునకు నిక్కైకేయి యకొల్లంబునం బొడమినయది కాఁబోలు, సౌభాగ్యమదమోహి తయై యయ్యది యాహితం బెన్నక మత్కృతంబునం గౌసల్యాసుమిత్రల నెట్టి యొరపిడిపెట్టంగలదో కద క్షుద్రకర్మోచితయగునక్కైక ద్వేష్యంబెంచి యవ్వా రల కన్యాయ్యం బాచరింపకపోవదు సుమీ. అది యట్లులకావలె సభార్యుండనై యేనిక్కాననంబున వసియించెద నిక్కాలకర్మంబులనెంచి తఱిగడవకయమున్న యన్నగరికీవరిగి యయ్యనాథల కుయ్యాలించి యిష్టపడెదేని భరతునిపోషణంబు

ననునిచి పంః పట్టంబనితోఁచెనేని స్వతంత్రయుక్తిమనిచియు నుద్ధరింపంజాలుదుము నాపుజన్మాంతరంబున నేనారులబిడ్డలతోడ నెడఁబాపితినో యయ్యనిష్టం బిప్పుడం గష్టించుచున్నదయ్యె. కష్టలబ్ధుండనైన చిరపుష్టుండనగు నేను ఫలకాలంబున నాయ మను జీవింపఁ ద్రోచివచ్చితి నింక నిమ్మెయివాఁ డేయిమ్ముననేనియు నేయమ్మకును జనియింపకుండుంగావుత లక్ష్మణా; నాకన్నతల్లిచే బెనుపఁబడినయల్లశారికయే నాకన్న నెక్కుడగు ప్రేముడిముడిగలయది యని యెన్నుచున్నవాఁడ వింటివకాచే యడి, యోసకమా; మనకత్యంతారియగు బావురుకానికాలు కఱవు మని సమయ మరసి పలికి యాయమకుఁ బ్రీతి నొదవించినది, యంతమాత్రం బేనియు భాగ్యహీనయై శోకించుచున్న యమ్మాతకుఁ బుత్రుండనై యే నొనరించి నది యేమియున్నది అత్యల్పభాగ్యయగుమజ్జనని కౌసల్యననువీడి పరమదుఃఖార్తయై శోకసాగరంబునంబడి మునుంగుచున్నయది దశరథుంబోలి ధర్మపాశంబునం దవులుకొని యుంటింగాని యేనొక్కండ నిద్ధరావలయంబు నయోధ్యతోడం గూడఁ జీర్ణకరింపం జాలనే, యధర్మపరలోకభయభీతుండనగుట జాలిదలంచి చాలించి వచ్చితి నట్లుంగాకయున్న నిజాభిషేకంబు నివారింప నీరేడులోకంబుల నేని నొండొకొం డుండునే, యిట్టిదియంతయు నీయంతరంగంబున సంతరించి తోఁచినవిధం బాలోచించుమని సకరుణంబుగాఁబలికి యవ్విజనంబగువనంబునం బుడమిపై నొడలువైచియున్నయన్న తెఱం గరసి యన్నయ వేదియగు లక్ష్మణుం డేలాకో యీజ్వాలనుండు జ్వాలాశూన్యుండయ్యె నీసాగరంబు వేగడంబరం బేమి కతంబున నుపసంహృతంబయ్యెనో యనుచుం దలపోసికొనుచు నిట్లనియె. ౨౩౦

—♦ లక్ష్మణుండు రామునిఁ బ్రశాంతు నొనరించుట ♦—

క॥ వధ్యునిఁగ నెంచితేసి న, యోధ్యం డొకఁడున్నె నీక ♦ యోధ్యాపురనా
ధా? ధ్యానింపుము నీదగు, నధ్యాత్మప్రతిభ యలఁతి ♦ యగునే యెందున్.

క॥ నాబోంట్లు తెలివి గనుటకుఁ, గాఁబోలు న్నీవు నిన్నుఁ ♦ గలఁకపడుజనుం
గాఁ బోల్చుకొనుచుఁ బలుకుట నీబోధమయాత్మవృత్తి ♦ నెఱిఁగంటిఁ గదే.

ఆ॥ చంద్రుఁబాసినట్టి ♦ శర్వరి చాడ్పున, నేఁడు నిన్నువీడి ♦ నీనగరియుఁ
నిష్ప్రభత్వ మెనసి ♦ నెఱిమాలి మాలెఁత, యట్టులున్న దనుచు ♦ నరసి కనుము

క॥ నీ వాయాభావన మది, భావింపుచుఁ బరితపించు ♦ పద్ధతి యిపుడో
దేవా తతభావాయి, ద్దేవియు నేనునుఁ గలంగు ♦ తెఱఁగున కయ్యెన్. ౨౩౪

తే॥ ఏము నినుఁబాసి యొకక్షణ ♦ మేని బ్రదుక
జాలము జలోద్ధృతములైన ♦ ఝషములట్టు

లెంచఁ గనఁ దల్లిదండ్రుల ♦ నేనిఁ దమ్ము
నేని స్వర్గమునేని నే ♦ నీవు వెలిగ. ౨౩౫

క॥ నెనరుంచుము నాసేవం, గొను మను నసుజుని స్మితాప్తిఁ ♦ గులకితయగుదృ
ష్టినిఁ గనె రఘుకులతిలకుం, డనంతరము నిద్రసేసి ♦ రందఱుఁ దరుణీ. ౨౩౬

క॥ గిరిసానుగతమహాకే, సరు లటుమేల్కని వటప్ర ♦ సక్తి నెడలి యు
య్యరుణుం డుదయించునెడం, దరలిరి భాస్వరులు వారు ♦ తాపసవంద్యా. ౨౩౭

—♦ రామప్రభృతులు ప్రయాగకుఁ జేరుట ♦—

ఆ॥ గంగయమునతోఁ బ్ర ♦ సంగం బెనసె నెందు, నెది తపస్విజనుల ♦ కేడుగడయొ
బ్రహ్మయజనయోగ ♦ భాసితం బాప్రయా, గస్థలంబు సేరఁ ♦ గాఁ దలంచి.

తే॥ తఱిమినడుచుచు సన్మహా♦తరువనముల,భూమిభాగంబుల నదృష్ట♦పూర్వముల మ
నోరమమనోరథోదయ♦సారవిషయ,ముల నరసికాంచుచును వారు♦మొనసిరబల.

ఉ॥ తమ్మునిఁగాంచి రాముఁడు ము ♦ దమ్మున నిట్లనిపల్కె నవ్వు డీ
యిమ్మెనయంగఁగంటె మవె ♦ యిత్థరసద్వయమేలనధ్వనుల్
సొమ్ములువెట్టినట్టు లవె ♦ చూడ్కులకబ్బెడు మేల్తరంగపుం
బొమ్మలమెమ్మె లిన్నదుల ♦ పోఁడుము లెన్న విధాత శక్తుఁడే. ౨౪౦

క॥ సారస్వతప్రవాహము, సారతరం బాంతరప్ర ♦ సక్తి నెగడు నీ
తీరమెనయువారికి మది, నారయఁ గొనరానిభాగ్య ♦ మని యొకఁ డున్నే. ౨౪౧

క॥ మునిమండలమండనుపద, మున మొనసినదారి దారి ♦ మొనకొనె నదిగో
యనలుని భగవంతునిఁ దా, ననుమితికిం గూర్చుధూమ ♦ మగపడు బలే.

ఆ॥ వనమునందు దారు ♦ నర్ధనం బందందు, గాంచి యెదుర మేలి ♦ కళఁ దలిర్చు
నుపవనంబు నెంచి♦యూహించితిని భర, ద్వాజమునిపదంబు ♦ వల నటంచు.

—♦ భరద్వాజాశ్రమగమనము ♦—

క॥ అనితెలుపుచు వారలతో, ననుగతుఁడై యరిగె భానుఁ ♦ డస్తాద్రికిఁ బో
ననువగునయ్యెడ సంయమ, ధనముఖ్యునియాశ్రమంబు ♦ దఱియఁగ సుగుణా.

ఆ॥ చేరి యొక్కశిష్యుఁ ♦ జీరి తమ్మెఱిఁగించి, యెఱుకసేయుమన ము ♦ నీంద్రునకు న
తండు మ్రొక్కి తన్వి♦తమ్ముండుఁ దోడరా, నరుగుదెంచె రాముఁ♦ డయ్య; యనిన.

క॥ పూజాద్రవ్యములంగొని, పూజితుఁ బూజింప నత్త ♦ పోధనముఖ్యుం
డోజమెయి నెమరుపడియెను, తేజము తేజమ్ము మొనయు♦ తెఱఁ గగపడఁగన్.

ఆ॥ అమ్మహానుభావు ♦ నల్లంతఁగని మ్రొక్కి, తనదురాక విభుఁడు ♦ తెలిపిన మెఱుఁగ
సేయ ... పూజ♦సేసి వారలఁగొని, చనుచు నిట్టులనియె ♦ వనజనేత్రి. ౨౪౭

—♦ భరద్వాజముని రాముని బహూకరించుట ♦—

ఉ॥ లోకము పాడిపాఁడవె య ♦ లోకసమానవిలోకనా; నిరా
లోకముఁ గంటకంబుల వి ♦ లూనము సేఁతకుఁ దోఁచినట్టిమ
ల్లోకముకర్తఁ గాంచనగు ♦ లోపలిచూపము రెం ద్వదీయము
ల్లోకముదావహంబగు న ♦ లోపతపఃప్రణిధాన మేర్పడన్. ౨౪౮

ఆ॥ బ్రహ్మచేత మున్నుఁ ♦ బ్రార్థింపఁబడి యేయ, రిణకృతికి నవత ♦ రించినావొ
యీయరణ్యవాస ♦ మేరీతిమెయిఁ బన్ని, నావొ యరసిగాంచి ♦ నాను దేవ.

కం॥ చెప్పవలె నింకనేమని. యిప్పగిదిఁ గృతార్థభావ ♦ మెనయంగని మే
ల్చొప్పడదె పరికృతికవ్వలి, యప్పురుషాఖ్యంబు తత్త్వ ♦ మరయుట గలుగన్.

తే॥ నాతపములెల్ల ఫలియించె♦నన్నఁగన్న, యన్న; నాతోడనిలువు మా♦యర్థమునకు
నుభయసరిదంతరాంచిత♦ముత్తమోత్తమంబయినయీస్థలంబున♦యుంబుఁ బెనుప.

కం॥ సీతాసమేతుఁడవుగా, సీతావ్రత నీవు తమ్ముఁ ♦ డితఁడు గొలువన్
జేతోముదమున నిలువఁగ, నేతన్మాత్రమున గెలువ ♦ నే ముప్పాలముల్. ౨౪౯

మ॥ అనినన్ రాముఁడు వల్కె నోమునివరే ♦ ణ్యా; యశ్లైయాఁగాక యే
ననయం బిచ్చటనుంటినం చరయు మా ♦ యర్థంబునన్ దీనిపొం
తనివేశంబుల నూళ్లఁ బల్లెల జను ♦ ల్నన్గాంచఁగా నెంచి వ
చ్చినఁ గాదంచనఁ బోల దానెఱిని వి ♦ క్షేపంబ చేసూరెడిన్. ౨౫౩

తే॥ కాన నేకాంతముననుండఁ ♦ గాఁ దలంతుఁ
గాననేష్టం బవధి యెల్లఁ ♦ గడచువఱకు
నట్టిచోటొక్కఁ డరసి నె ♦ య్యమునఁ దెలుపు
మెందు వైదేహిమది ముద ♦ మెనయఁగలదొ. ౨౫౪

కం॥ అనినఁ దదీయశుభోక్తి, న్మనమునఁ దలపోసి పలికె ♦ మాన్యుం డక్కా
నను నిటపైఁ బదికోసులు, జన జననంద్యం బొకండు ♦ శైలం బుండున్. ౨౫౫

తే॥ గంధమాదనమట్లు ప్ర ♦ ఖ్యాతమయ్యెఁ, జిత్రకూటంబనఁగ నది ♦ సిరులఁ దనరి
వేవురు మహర్షివరులు సే ♦ వించిసిద్ధు, లైరి మేనులతో స్వర్గ ♦ మందఁగాంచి.

ఆ॥ కాంచునంతలోనె♦కల్యాణధామంబు, లెపుడుఁ బావబుద్ధు♦లెనయఁబోఁడు
నరుఁడు యచ్ఛిరోబ్జ ♦ నాలికాపాలిక, ల్గనిసుఖింపఁగలుగు ♦ కాల మగునొ.

క॥ సురగరుడోరగకిన్నర, వరగంధర్వులు చరించు ♦ వారమ్యోడఁ గుం
జరరాజములుమయూరము,లురురురుముఖ్యములుమృగము♦లొలయుచునుండున్. ౨౭౯

క॥ పుణ్యప్రస్రవణంబు ల, గణ్యంబులు మధురపృథుల ♦ కందఫలాదుల్
పణ్యాచితములొనర్చున, రణ్యంబులు దానిచోట్లు ♦ రమణీయంబుల్.

ఉ॥ కోకిలపంచమశ్రుతు ల ♦ కుంఠితచంద్రకిలాస్యకృత్యవ
త్కేకలపాకసంపదలు ♦ కీచకసంభృతవాంశికత్వముల్
నీకును నీసతీమణికి ♦ నిచ్చలుఁ బొచ్చెములేనిమెచ్చులం
గైకొనికూర్చుచుండు మదిఁ ♦ గానవనాసవిశేషసౌఖ్యముల్. ౨౮౦

ఆ॥ అందుఁ దీర్చుమయ్య; ♦ యాసాదితవ్రత, దీక్ష యనుచు వారిఁ ♦ దేర్చి పేర్చి
యర్చలొనరఁగూర్చె ♦ నర్చితుం డమ్మసి, వరుఁడు పురుషులేని♦యరుస మెసఁగ.

తే॥ సర్వకామసమృద్ధుల ♦ సన్మునీంద్రుఁ, డాప్రియాతిథివర్గంబు ♦ నట్లు పూజ
సేసి తనియించె సత్కథా ♦ శ్రీవిశేష, మధురభాషణములు గూర్చి♦ మంజువాణి.

క॥ అదె పుణ్య యయ్యె యామిని, యదె ధన్యం బయ్యె మాని ♦ యాశ్రమపద మ
య్యదెపో ప్రయాగతీర్థము విదితంబై పరఁగె నదుల ♦ వేల్పులతోడన్. ౨౮౩

క॥ సీతాతృతీయుఁడై సం, ప్రీతుండై రఘువరుండు ♦ పేర్మి నెఱపె నా
రాతిరి యధ్వశ్రాంతిస, మేతయుఁగాఁ జనఁ బ్రభాత♦మెనయం గనియెన్. ౨౮౪

క॥ ఆలో నరహరి మునిశా, ర్దూలుంగని మ్రొక్కి ముదము ♦ తోనన నిశ యీ
లీలఁదగ నిచట భగవ, ల్లీలాయిత సత్యశీల ♦ లేములు దలఁగన్. ౨౮౫

తే॥ అనఘ! సుఖముంటి మిచ్చోట♦నాన యొసఁగు, మింక నీనొడివినయెడ♦కేగుటకును
భావుకాశీఃప్రభావసం♦పత్తి నెపుడు, మాదొసంగులఁ దొలఁగించి♦మనుచుఁగాత.

క॥ ఆమాటకు స్మేరాననుఁడై ముని యగునయ్య యట్లు ♦ యనిచెద పొమ్మా
నీమేలె మాకు మేలిడఁ,గా మూల మటంచుఁ బొంగి ♦ కలయిక వెలయన్. ౨౮౭

తే॥ అపుడె స్వస్త్యయనముగూర్చి ♦ యాత్మజులను
దండ్రి యట్టులె ప్రేమించి ♦ తదనుగామి
యై తనర్చి యనుప వచ్చి ♦ యనియె వారి
దారి తెలుపంగ నుత్సుక ♦ త్వంబు నెఱయ. ౨౮౮

క॥ గంగాయమునలసంధి శు, భంగములార; వెనుపడెడు ♦ భంగింజని చూ
డంగలరు ప్రత్యగాస్యఁద, రంగిణిఁ బింగల శివాంగ ♦ రవిసుత నచటన్. ౨౮౯

మ॥ అతివేగాంచిత దాని దాఁటననువౌ ♦ యత్నంబునం బేర్చి స
న్మతిసై మేలిప్లవంబమర్చికొని య ♦ మ్మాన్యం బ్రశంసింపుచున్
సుతరం జేసి యెలర్చి పైఁజనఁ గనన్ ♦ సుచ్ఛాయ మత్యుచ్ఛ్రితం
బతివిస్తారము సత్ఫలాశము వటం ♦ బచ్చోటఁ గన్పట్టెడిన్. ౨౭౦

తే॥ దాని సిద్ధులు సేవింత్రు ♦ తవులుభక్తి, గొలుచువారి కభీష్టము ♦ లూర్చుచుండు
నది తదీయప్రసాదంబు ♦ నందఁగాంచి, సీత నెలవగు సకలార్థ ♦ సిద్ధులకును. ౨౭౧

క॥ అచ్చో మెలఁగిన మేలగు, బొచ్చెములే దచటువిడిచి ♦ పోఁ గ్రోశమునన్
సచ్చరితము నీలాఖ్యం, బుచ్చైస్తర మగువనాంత ♦ మొకఁ డెదురుపడున్.

ఉ॥ యామునవంశము ల్బదరి ♦ కాగము లట్లు పలాశవృక్షముల్
శ్రీమహితంబులౌ నచటఁ ♦ జెల్వగుమార్గము మార్దవంబునన్
సేమముగూర్ప నగ్గిరికిఁ ♦ జేర్పఁగఁ జాలు దవాగ్నిముఖ్యముల్
బాములుగీములందుఁ జొరఁ ♦ బాఱవు క్షేత్రమహత్త్వసంపదన్. ౨౭౩

క॥ అని తెలిపి మౌని మరలెను, జనితానందుఁడయి రామ ♦ చంద్రుఁడు తమ్ముం
గని పున్నెమకాదే యి, మ్మునియిమ్మెయిఁ బ్రీతినెరయ ♦ మొనయు టలఁతియే.

ఆ॥ అనుచుఁ దెలిపికొనుచు ♦ నాత్రోవఁగొని చని, యధికవేగయుక్త ♦ నాస్రవంతి
గాంచి చింతపడిరి ♦ కట్టియు ల్వేణువుల్, గూర్చి మేలిప్లవము ♦ నర్చి రపుడు.

తే॥ మేలగునుశీరముఁ దెచ్చి ♦ మెత్తసెజ్జ
సేసి శ్రీమూర్తి యద్దేవి ♦ సిగ్గుపడఁగ
నెత్తిగూర్చుండఁబెట్టె న ♦ య్యెడ మహోమ
హుండు రామేంద్రుఁ డపుడు బిం ♦ బోష్ఠి వింటె. ౨౭౬

ఆ॥ ఆపెభూషణంబు ♦ లంబరంబులు మూట, గట్టి గట్టిసేసి ♦ పెట్టె నడుప
మందు నక్టై స్వీయ ♦ మాయుధౌఘము సేర్చి, యమరి రచటవారు ♦ నవల నబల.

క॥ ఇరుప్రక్కల తెక్కలఁగొని, యిరువు రరసినడుప నర్థ ♦ మొనసె నది నదిన్
దరియించుతఱిని ధరణిజ, తరణిజకున్ మ్రొక్కి యిట్లు ♦ తద్దయుఁ బలికెన్. ౨౭౮

ఆ॥ స్వస్తి దేవి మమ్ము ♦ దరిఁజేర్పు మోయమ్మ, నామగండు వ్రతము ♦ నడుపునెడల
నొండుపాసఁగకుండ ♦ నోము మీమేము వ్ర, త్యాగతులము గాఁగ ♦ హర్ష మెసఁగ.

క॥ నిను గంగ నెట్టు లట్టులె, గొనకొనిపూజింతు ననుచుఁ ♦ గోర్కి దెలిపి మ్రొ
క్కినయంతన తనయంతన, చనెసన దరి మొనసెఁ దరియు ♦ సద్గుణశీలా. ౨౮౦

ఆ॥ దానివిడిచి వార ♦ లానది కంజలి, సేసి తతిమినడిచి ♦ చేరి రవుడు
మానిసూక్తిసరణి ♦ మాన్యమాన్యగ్రోధ, మటు తదీయభాగ ♦ మందఁగనిరి.

ఆ॥ దోసిలొగ్గి చుట్టి ♦ దోఁతెంచి మ్రొక్కి స్వీ, యేచ్ఛఁదెలిపి వేఁడి ♦ యెలమిగాంచి
నిలిచె నంత సీత ♦ నిర్మలవృత్తిమెఁ, బలికె ననుజుతోడ ♦ భానుకులుఁడు. ౨౮౨

క॥ ఎన్నఁడు యాచించియెఱుఁగ, దిన్నళినదలాక్షి యెల్ల ♦ యెడ వేఁడెడుఁ దా
బన్నములఁ దలఁచి మనకై, సన్నుత యేమఱక దీనిఁ ♦ జనుఁ బాలింపన్. ౨౮౩

క॥ కోరినపూవులు ఫలములుఁ, జేరిచి యొసఁగందలఁపుము ♦ సిరిసంపద లా
తీరున నరసినమది కాక, దారి నరుసమందఁజేయు ♦ తగ వగుఁగాదే. ౨౮౪

క॥ అని తెలిపి క్రోశమాత్రం, బనవద్యుఁడు సీతతోడ ♦ ననుజునితోడన్
జనిగాంచె నీలవనమున్, ఘనతరులతికాదరీవి ♦ కాసనదనమున్. ౨౮౫

క॥ కుంజరిచాడ్పున నానృప, కుంజరయుగళాంతరమున ♦ గొనకొని నిర్భ
తింజనె జనకజ మేలిని, కుంజలతాతతు లారయుచుఁ ♦ గువలయనయనా. ౨౮౬

తే॥ వార లందిచ్చుసుమఫలా♦వళులు గొనుచు, నానదీమణిసౌభాగ్య ♦ మరసికనుచుఁ
దత్తటంబునదారిని ♦ దారితాఁ, నలరఁజేయుచు నన్నారి ♦ యరిగె గౌరి. ౨౮౭

క॥ ఆయమునాతీరమ్మున, చాయ న్వసియించి యార ♦ జనిఁ గడపి చనన్
బో యగునని పోయి గుణ, శ్రీయుతమగువాస మరసి ♦ చేఁదినవేడ్కన్. ౨౮౮

తే॥ మేధ్యమృగముల వధియించి♦మించుమేలి, పక్వమొనరించి దేవతా♦పఙ్క్తిఁ దనిపి
తారు భుజియించి సైకత♦స్థలమునందు, వారు శయనించి రానాఁడు♦ వారిజాక్షి.

క॥ ఆరాత్రి గడవ సామి, త్రీ; రవిదోఁచుతటి యయ్యెఁ ♦ దెరు వెనయఁగనా
సారవనద్విజసువ్యా, హారస్వనములు పొసంగె ♦ నని రాముఁ డనన్. ౨౯౦

ఆ॥ అతఁడు మేలుకాంచి ♦ యాసుప్తిశంద్రావ, ధిశ్రమముల వీడి ♦ తెలుఁగుగనిన
నన్నదీజలముల ♦ ననువెంచి స్పృశియించి, చిత్రకూటపథము ♦ చేరఁగాంచి.

క॥ పోవుచుమండిరి వార, ప్పావుంబోఁడియు సుమిత్ర ♦ పుత్రుఁడు విన సం
భావనసేయుచు రాఘవుఁ, డావనికంగూర్చి మనము ♦ లలరఁగఁ బలికెన్. ౨౯౨

తే॥ అవిగొ కనుఁగొంటె యాశిశి ♦ రాత్యయమునఁ
బెండిలిజనంబులట్లు దీ ♦ ప్తిస్ఫురణల
పోఁడుములెసంగఁ గింశుకం ♦ బులు సుపుష్ప
మాలికలఁ దాల్చె మణిరత్న ♦ మాలికలుగ. ౨౯౩

క॥ ఫుల్లియ[illegible] గనుపట్టెడు, భల్లాతకతతి సరాను ♦ భవ మెఱుఁగనిదై
యల్లి[illegible]ఫలపత్రాసన్, యుల్లాసముగలుగఁజేయు ♦ చున్నది నాథా. ౨౯౪

తే॥ అతి[illegible]ద్రోణప్రమాణంబు♦లై ప్రతినగ,లంబమానంబులై దృష్టి ♦ లాలితములు
గాఁ దన[illegible] మధుకారి♦కాభృతములు, తేనెపెర లంచితంబు లిం ♦ దీవరాక్షి.

క॥ సత్యాసన్న[illegible]క్రోశమునకుఁ, బ్రత్యుద్దేశమునఁ గేకి ♦ పలిపెడుఁ గేకా
ప్రత్యయము గంటె లక్ష్మణ, సత్య మెదిరికృతి సహింపఁ ♦ జాలరు శూరుల్.

క॥ గజరాజయూథగతులన్, ద్విజరాజతూ[illegible]జితముల ♦ ధృతచిత్రమృగ
వ్రజరామణీయకంబుల, నజరార్చ్యము చిత్రకూట ♦ మదె కననయ్యెన్. ౨౯౭

క॥ సమభూమితలము రమ్యము, ద్రుమవిస్తృత మంచితము వి ♦ ఘూతాఘము పు
ణ్యము నగ మిది మనకు నివా, సముచేయఁగ యోగ్యమగుఁ బ్ర♦శంసితులారా.

తే॥ అనుచుఁ జెలుపుచు రా వార ♦ లరుస మొందఁ
బాదచారమ్మునన పోయి ♦ పడయఁగనిరి
చిత్రకూటంబు మణిరత్న ♦ చిత్రకూట
సారసుమనోరమంబు మ ♦ నోరమంబు. ౨౯౯

చ॥ గిరిఁగని వారు పొంగిరి న ♦ కించను లబ్బురమైనపెన్నిధిన్
సరగునఁగాంచి యుబ్బుగతి ♦ సౌమ్యలతాద్రుమకుంజపుంజభా
సురఫలసూనసంతతము ♦ సుందరకందరమందిరమ్ము స
త్సరసరసోపమోదకము ♦ చాగురె యియ్యదె యంచు మెచ్చుచున్. 300

తే॥ తలియఁజని రాముఁడనెఁ దన ♦ తమ్ముతోడ
ననిచె నిది జీవనాడియై ♦ నాకుఁ జూడ
స్వాద్యబహుమూలఫలముఖ్య ♦ సంగత మగు
నిందు మహితాత్ములాముని ♦ లుందు రెపుడు. 30౧

క॥ కావున నీశైలంబున, నే వసతిఘటించి సౌఖ్య ♦ మెనయుద మనుచో
నావిర్భవదానందులు, గా వారును వల్లెయనిన ♦ ఘనుఁ డాదృతుఁడై. 30౨

—♦ వాల్మీకిమహర్షి సందర్శనము ♦—

తే॥ ఇచట వల్మీకసంభవుం ♦ డిద్ధతేజుఁ,
డైనమునియాశ్రిమంబుండు ♦ నందుఁజని మ
హాత్ముఁగని మ్రొక్కఁగని తదీ ♦ యాజ్ఞఁగొని ని
వాసము రచింపుద మటన్న ♦ వార లలరి. 303

ఆ॥ తోడరాఁగ నేగి ♦ ధుతరాగునయ్యాశ్ర, మాంతమెనసి సమయ ♦ మరసి పెరసి
యమ్మునీంద్రనుతుప♦దాబ్జమ్ములకు మ్రొక్కి, నిలిచెఁ దోడివారు♦నియతి దనర.

క॥ వందనములనొనరించిన, నందఱి నాశీర్వచించి ♦ యానొరా మా
సుందరమూర్తిమె, యాశ్రిత, మందారము గానవచ్చె ♦ మాకన్నులకున్. ౩౦౫

క॥ అని యలరుచు నర్చలు నా, సనములు సమకూర్చి రాము ♦ సకలాత్ముని న
మ్మనువంశ్యుఁ బొదివి యాలిం, గనమొనరించి ప్రమదాశ్రు ♦ కలితేక్షణుఁడై.

—♦ వాల్మీకిమౌని శ్రీరాముని స్తుతించుట ♦—

సీ॥ ఇదెకదా క్షీరాబ్ధి ♦ నెనయుహర్షాబ్ధిపై, శయనించునాశేష ♦ శాయిమూర్తి
యిదెకదా తోడసేర్చి ♦ యిందిరాసుందరి, కరనలార్చఁగొనర్చు ♦ చరణయుగళి
యిదెకదా విధిజన్మ ♦ మెంచుమించులసంచు, పుట్టినిల్లనిపించు ♦ బొడ్డుదమ్మి
యిదెకదా నిజహితా♦హితులమేలుంగీండ్లుఁ గేలిమైమొనయించు ♦ కేలుదోయి
యిదెకదా కూర్మినెనరుల♦యిల్లటంబు, కలువములకొటారు శుభవృష్టి♦కలిత దృష్టి
యిదెకదా రామణీయకం ♦ బేలుసీమ, సత్ప్రసాదనరమ మోము ♦ చందమామ.

సీ॥ కాదుకా దిది త్రిజ ♦ గన్మోహనౌషధి, భవపాశమోకప్ర ♦ పాతకంబు
కాదుకా దిది కోటి ♦ కందర్పసందర్భ, మైరమ్మదీయాంత ♦ రమృతనాడి
కాదుకా దిది మాయి ♦ కప్రథాభూమిక, సకలజీవంజీవ ♦ చాంద్రిలక్ష్మి
కాదుకా దిది పరా ♦ క్రమదీప్తిరింఛోళ్ళి, సిద్ధాశ్రమజనాత్త ♦ సిద్ధఘుటిక
కాదుకా దిది సురలోక ♦ కాంక్షితార్థ, మఖిలధాత్రీప్రథితసుకృ ♦ తాబ్జవనిక
కాదుకా దిది దశరథ♦క్రతుసమృద్ధి, యఘహరము రామనామర♦సాయనమ్ము.

క॥ నిత్యానందరసాత్మక, మత్యాహితమోచకము స్వ ♦ యంద్యోతకదృ
క్ప్రత్యయ మమలము శాంతము, ప్రత్యగ్జ్యోతి యన నీవు ♦ పరఁగుదు రామా.

ఆ॥ వల్కలములు చుట్టి ♦ వరజటామండల, మండితుండ వగుచు ♦ మాకనులకుఁ
గానవచ్చితయ్య ♦ కలుముల నెల వీవ, యయ్య భూతభావ ♦ నాంతరాత్మ.

క॥ అని తన్మయమానసుఁడయి, యనితరభావమునఁ బొగడు ♦ నమ్మునిఁ గని యి
ట్లనె రాముఁడు భవదీయం బనఘము దర్శనము మొనయు♦నయ్యెను మాకున్.

తే॥ మీయెఱుంగనియది లేదు♦మేము నేఁడు, తోడరి జనకునిసత్యసం♦ధునిఁ బొనర్ప
నరుగుదెంచితి మిచ్చోటు♦నందుఁ దగిన, యాశ్రమ మొనర్చి నిలువంగ♦నానతిండు.

క॥ సీతాసహితుఁడనై యీ, భ్రాతయు సాయంబొనర్పఁ ♦ బరఁగుదు నిచటన్
నీతిమెయి ననిన నమ్ముని చేతోముద మొదవ మేలి ♦ చిఱున వ్వొలయన్.

—♦ వాల్మీకిముని శ్రీరాముని మాహాత్మ్యం బభివర్ణించుట ♦—

ఆ॥ ఇట్టులనిమె దేవ; యెల్లలోకముల కీ, వే నివాస మనఁగ ♦ నెన్నఁబడితి
వేనివాస మెవ్వ ♦ రెఱిఁగింపఁ గలవార, లఖిలభూతజాత ♦ మదియ కాదె. ౩౧౪

క॥ అని సాధారణపద మి, య్యదనున నీనుడి విశేష ♦ మచ్చుపడె న్నా
మది నిట్టు లిదియు నొడివెద, ముదితుఁడవై విశ్వసించి ♦ మొనయుము రామా.

శా॥ సీతంగూడి వసింతునంటివి బళే ♦ చిన్మాత్రతత్త్వుండ వీ
వాతంకంబులులేనిచోట్లు గల వ ♦ య్యర్థాప్తి కేఁదెల్పెదన్
బూతాత్ము ల్సమదృష్టు లంచితభవ ♦ ద్బోధు ల్ప్రశాంతు ల్ఘను
ల్వీతాసూయులు నైనవారిమది స ♦ ద్వేశ్మంబు నీకైతగున్. ౩౧౬

క॥ ధర్మాధర్మము లరయని, నిర్మమవృత్తిఁ గొని నిరతి ♦ నినుగొలుచుటయే
ధర్మ మనువాని హృదయము, నిర్మల మది నీకుఁదగిన ♦ నిలయ మధీశా. ౩౧౭

క॥ నీమంత్రమే జపించుచు, నేమమ్మున రామ; రావె ♦ నీవే గతి న
న్నోముమనుచు నిర్ద్వంద్వని, రామయుఁ డగుఘనునిచిత్త ♦ మధిపద మధిపా.

క॥ మమతాహంకారరహితు, లమలాత్ము లరాగవైరు ♦ లంచితచరితుల్
సమలోష్ఠకాంచనులునగు, శమధనులమనంబు నీకు ♦ సదనం బనఘా. ౩౧౯

ఆ॥ నెఱి మనమ్ము బుద్ధి ♦ నీకప్పనమొనర్చి, నిత్యతుష్టుఁ డగుచు ♦ నెగడి త్యక్త
కర్మఫలుఁడు విజిత ♦ కామాదివర్గుండు, నైనవానిహృద్గృ ♦ హమున నిలుము.

క॥ ప్రియమొనసి పొంగిపడక, ప్రియమొదవినఁ గష్టపడక ♦ పేర్మి న్నిను న
మ్మి యఖిలము మాయికమ యను, నియతాత్మునియంతరాత్మ ♦ నీగృహముహరీ.

ఆ॥ వికృతు లెల్ల దేహ ♦ వృత్తు లధ్యాత్మమ్ము, నందఁబోవు తత్త్వ ♦ మరయత్సుత్రృ
షార్తిభయసుఖాదు ♦ లటు ప్రాణధీగతు, లనఁ నసంగుస్వాంత ♦ మాఁచికొనుము.

ఉ॥ సర్వగుహాశయస్థు ఘను ♦ సత్యచిదద్వయవిగ్రహు న్మహా
నిర్వృతిదాయి శేషశయ ♦ నీయనిరంతరశాయి నిన్నె యే
గర్వమువంకఁబోక గను ♦ శాంతునినెమ్మది మాదృగార్తదృ
క్పర్వముగా వసింపు మిఁకఁ ♦ బావని జానకిఁ గూడి రాఘవా. ౩౨౩

మ॥ నిను లోఁజూపునఁజూచి నిచ్చలును ధ్యా ♦ నింపం దదభ్యాస పుం
బని మేల్కొల్పనువారు నీదుపదప ♦ ద్మంబు ల్ధృతింగొల్చువా
రనువొప్పన్ భవదీయనామపదమే ♦ యన్నింటికిం జాలుఁబో
యని కీర్తించెడువారు ధన్యులు తదీ ♦ యాత్మస్థితిం గాంచవే. ౩౨౪

క॥ రామా; నీనామమహిమ, మేమని వర్ణింపనేర్చు ♦ నేవాఁడైనన్
భూమానందమయుం బది, సామాన్యమె యెల్లకగునె ♦ చర్చింపంగన్. 3౨౫

—♦ వాల్మీకిమునీంద్రుండు నిజపూర్వవృత్తాంతం బెఱింగించుట ♦—

తే॥ ఏనె బ్రహ్మర్షినైతిఁగా ♦ యింతకన్నఁ, గలదె విస్మయ మీనాఁడు ♦ కథ వచింప
వేడ్క పొడముచున్నది♦వినుము తెలుపు,వాఁడ నీవాఁడనై నయ♦వ్వలను నెఱయ.

సీ॥ ద్విజమాత్రుఁ డనిపించు♦తెఱఁగునఁ బొడమితి,లలిఁబ్రచేతసుఁడుమూ♦లంబుగాఁగ
దుష్టకర్మస్థితి ♦ తొడరి కిరాతుల, తోఁ జేర్చి తాఁ బెంచె ♦ ధూర్తుఁ జేసి
యజితేంద్రియుఁడ నౌట♦నబ్బె నాకొక శూద్ర,దానియందొదవె సం♦తానశతము
గాలించి కొంపలు ♦ గడిగితి దొంగల, తోఁగూడి యర్థాశ ♦ తొలుచుచుండ
పట్టుపడక గొన్న ♦ పట్టువీడక యెల్ల, ప్రాణిహింసలకునుఁ ♦ బాలుపడుచుఁ
దిరిగినాడ మిత్తి ♦ తెఱవునఁ దెరువులు, గొట్టి యాయుధములు ♦ పట్టి ముట్టి.

క॥ మన్నీ లరయఁ గనుంగొన, మన్నముసార రాక బయిసి ♦ మాలి విసువునన్
జన్నివిడిచి రెదురనిలే, కన్నెఱఁ జరియించితిని స ♦ మధికుఁడ ననుచున్. 3౨౮

మ॥ ఒకనాఁ డూర్జితభావవైభవభవం ♦ బుల్లాస మొప్పార స
ర్వకలాకోవిదు లంచితాత్ములు మహా ♦ రంభు ల్నిరీహు ల్ఘనుల్
స్వకకారుణ్యరసార్ద్రదృష్టు లనుయు ♦ క్సప్తోపసంఖ్యు ల్మునుల్
ప్రకటద్యోతులు నాదుబారిఁబడి రే ♦ భాగ్యంబు పైకెక్కెనో. 3౨౯

క॥ వారిం గాంచినయంతనె, వారనిలుబ్ధత్వ మెగిచి ♦ వల నెఱఁగింపన్
జీరంగని చేరంజని, మారిమసంగెడు తెఱంగు ♦ మై నిట్లంటిన్. 330

చ॥ నిలునిలుఁ డింక నొండువిధి ♦ నెక్కొనఁగాఁగలవారె యేమిపో
కలు పలుగాకిపాలఁబడి ♦ కంటకులై నిహతిం గనంగ నే
ఫలమొదవున్ వితాకుపడు ♦ భావన మేలె విధాతచెయ్ది య
వ్వలికథఁ దెల్పునే మనుచు ♦ వర్గమువా రిటఁజేరవత్తురే. 33౧

ఆ॥ అనిన వారికెట్టి♦యనుతాపమును లేదు, మోము మోడ్పు మున్నె♦మొనయరాదు
స్మితము కనులకొనలఁ♦జిందులాడకపోదు, నన్ను గాంచి పలికి♦నారు మునులు.

తే॥ ఓద్విజాధమ యేమేమొ♦యులికిపడుచుఁ, బలుకుచున్నావు మున్నొడిఁ♦బడినదేమి
యిపుడు పోయెడునది యేమి♦యింతమాత్ర,కలఁతిపడనేల కలయంత♦లరయరాదె.

క॥ నీవచ్చినపని దెలుపుము, నావుడు నుద్రేకమెడలి ♦ నానోటనె నే
నీవిధిఁబ్రదుకుదుఁ బుట్టువు, తోవచ్చెనుఁ ద్రోవగొట్టు ♦ మడుకుతనంబున్. 33౪

ఆ॥ పెనుపుగాంచువారు ♦ బిడ్డలున్నారు పె, క్కురు కుటుంబినియును ♦ బొరుగుచోటు
ద్రొక్కి యెఱుఁగ దట్టి ♦ తోడసులఁబోషింప, వచ్చినాడ నర్థ ♦ వాంఛఁ జేసి. ౩౩౫

తే॥ ఎద్దియేనియు మీయొద్ద ♦ నెనయ నగున
టంచు వచ్చితి నన వార ♦ లట్టులైనఁ
గడకుఁ గిల్బిషరాశి న ♦ గంబుపంచి
కుడుతు రేమొ యిందఱుఁ గూర్చి ♦ కొని యరయుము. ౩౩౬

క॥ ఏమెందుఁ జనెడువారము, గా మియ్యెడనుందు మేమి ♦ గతి నందురో వా
రామెయివార్త లరసి నీ, కామితము ఘటించి యరుగఁ ♦ గాఁగల మనినన్.

ఆ॥ వారినుకులవలని ♦ వలనెంచి చని తిట్టు, వడియు నంతవట్టు ♦ వారి నడుగఁ
బెచ్చియిడినయంత ♦ దినికూర్చుమే మేల, పాపములకుఁ బాలు ♦ పడుదు మనిన.

క॥ విసువుజనింపఁగఁ దాపము, గసిమసఁగఁ దలంపఁ దరలి ♦ కరుణామయమా
నసులు మును లున్నదెసకు ర, భసమునఁ జనుదెంచి పడితి ♦ పదముల కెలనన్.

ఆ॥ ఎంతగలరో వారి ♦ నెనసినయంత నె, చిత్తశుద్ధి యొదవె ♦ సిరులు పొదలె
విల్లువైచి మ్రొక్కి ♦ వేఁడితి శరణార్థి, నంటిఁ బాపభీతి ♦ నందఁగంటి. ౩౪౦

క॥ ఓపుణ్యమూర్తులారా, పాపార్ణవమందుఁ గూలఁ ♦ బడితిఁ బెరలఁగా
నోప దరిఁజేర్పరే యని, యాపట్టే పట్టుగాఁగ ♦ నఱచితిఁ బెలుచన్. ౩౪౧

ఆ॥ లెమ్ము లెమ్ము కంటి ♦ లే మేలు నిన్నేలు, దేవుఁ డున్నవాఁడు ♦ దిట్టవగుచుఁ
జక్కనిలువు మనిరి ♦ సత్సమాగమ మెందు, మంచిసేయ కొండు ♦ మాట పడునె.

క॥ అని వార లొండొరులయా, ననములు గనుఁగొనుచు నెట్లు ♦ ననుచునొ వీ డొ
య్యన సుగతికిఁ బాపాత్ముఁడు, వినమ్రుఁడై నాడు త్రోపు ♦ వెరవే యనుచున్.

క॥ యోజించి రామపదవి, భ్రాజితవర్ణద్వయంబు ♦ వ్యత్యస్తముగా
నోజ మెఱయ నుపదేశం, బాజాణలొనర్చి యిట్టు ♦ లని రాదృతులై. ౩౪౪

క॥ ఈనామమంత్ర మెది యెటు, పోనాయెనయేనిఁ బ్రొద్దు ♦ పొడువం గ్రుంకం
గా నైననేనియును నోరఁ, డై నిలువన వలయు నీహ్రొ ♦ దంతరసీమన్. ౩౪౫

ఆ॥ ఇది సుమంత్రరాజ ♦ మీరాజహంసావ, తంస మెపుడు నియతి ♦ దనర నీదు
మానసమున నిలిచి ♦ మనుచు నిన్ను మునిప్ర, పంచమునకుఁ బట్టు ♦ భద్రుఁ జేసి.

తే॥ అరసి యే మరుదెంచెదు ♦ నంతవఱకు, నుండు మిట్టులె యని వార ♦ లూర్ధ్వగతినిఁ
జనిరి నిలిచితి నమ్మెయి ♦ శాంతమూర్తి, నై తదీయోపదిష్టమ్ము ♦ ననుసరించి. ౩౪౭

క॥ ఏకాగ్రవృత్తి యొదవ న, నేకాహము లరుగ బాహ్య ♦ మెఱుగని తెఱఁగే
నాకేర్పడెఁ దన్మహిమం, బేకాంతము నిర్వచింప ♦ నెట్లగు స్వామీ. ౩౪౮

తే॥ సర్వసంగంబు లన్నెటి ♦ సడలిపోవఁ, బుట్టపెరిఁగెను నాపయిఁ♦ దుట్టతుదకు
క్షుత్పిపాసలు లే వింక ♦ క్షోభ మెద్ది, గలదు త్వన్నామజపనిష్ఠ ♦ వెలయ రామ.

ఉ॥ ఆదటఁ బెక్కులౌయుగము ♦ లమ్మెయి యిమ్మున. బ్రోవ నెమ్మితో
నాదెసకేగుదెంచిరి న ♦ నాతను లమ్మునివర్యు లంచితా
మోదముపాదునెమ్మనము ♦ ముచ్చట మెచ్చెడుస్మేరదృష్టుల
త్యాదరవృత్తిఁ జెల్ప స్వక ♦ మాఫలవృక్షముజాడఁ గన్గొనన్. ౩౫౦

శా॥ లెమ్మోయీ ఫలియించె నీనియతి లే ♦ లేఁగొమ్మదానిమ్ము మా
సొమ్ముంగూర్చెను దోహదమ్ముకలనన్ ♦ జోద్యమ్ము లేదింక ని
న్నెమ్మిన్ గన్గొనవచ్చినార మనిన ♦ న్నెక్కొన్నయానొక్కలే
కెమ్మెన్ గర్ణరసాయనంబు లగుచుం ♦ గాకుత్స్థవంశోద్భవా. ౩౫౧

ఉ॥ ఎక్కడిశక్తియో తలఁపు ♦ లెట్టివొ బన్నములెందుఁబోయెనో
చక్కనియావివేకమున ♦ జాడనె పుట్టఁబెకల్చికొంచు మం
చుక్కననుక్కడంచి యుద ♦ యోజ్జ్వలుఁ డయ్యెడుభానుచందము
న్నెక్కొనఁజేయుచుం బొడమి ♦ నేను మునీంద్రులచక్కి నిల్చినన్. ౩౫౨

ఆ॥ పుట్టఁబుట్టి యిట్టి ♦ పోఁడిమిగన్నావు, పుట్టపేరు నీకుఁ ♦ బొసఁగకున్నె
వఱలువాఁడ వింక ♦ వాల్మీకియన నిది, యుత్తరంబు జన్మ ♦ మోమునీంద్ర.

క॥ అని సర్వసంస్కృతునిఁ జే, సిసిరాబారులు చనంగ ♦ సిరి నెగడొందం
గనినాడ నాఁడుమొదలుగ, మొనకొనుత్వన్నామమహిమ ♦ మున రఘుతిలకా.

తే॥ నాఁటి కీనాఁటి కిట్టిదా ♦ నయము సూపి, నాదుకన్గవ కొరులుగ ♦ నంగరాని
కాన్పుపండువు గూర్చితి♦కాన్కలెన్నఁ, గలదె సతితో ననుజుతోడఁ♦గానుపించి.

సీ॥ నిర్వికల్పుఁడ వన్న ♦ నీవిట్లు నెలకొల్పు, సంకల్పమున నె ప్ర ♦ స్తావవికృతి
యవుదు వగోచరుం♦డవు నిరాభాసుండ, వనుమాట నోడువ నో♦రాడదయ్యె
నాద్యంతముల కీవ ♦ యాదువు సాక్షి వ, ప్పాలమునవంకఁ బోఁ ♦ బోదు దృష్టి
నిరుపద్రవుండవు ♦ నిర్ముక్తబంధుండ, వైన నన్యులఁగాచు ♦ టసదు గాదు
నిత్యుఁడ వనీహుఁడ వమేయ♦నిష్ఠుఁడవు సి, రత్యయుఁడవు నిరాకృతి♦వచ్యుతుఁడవు
దాంతుఁడవు శాంతుఁడవు నాస♦దాశివుఁడవు, నీపరిభావంబు వర్ణింప♦నేర మభవ.

ఆ॥ ఓయి శ్రీనివాస ♦ యోయనంతచిదాఖ్య, యోస్వయంప్రకాశ ♦ యోసుఖాత్మ
మమ్ము బ్రోవ నిట్లు ♦ మాయామనుష్యరూ, పాయితుండవైన ♦ చాయ నిజము.

ఉ॥ కన్నులె మిన్న లిట్టినినుఁ ♦ గాంచుటఁ గర్ణయుగంబు తృప్తిఁగై
కొన్నది నేఁటినీనుడులఁ ♦ గోర్కులెలర్పకయున్నె మున్నె రా

మన్ననం గొన్ననాల్కకు ద ♦ దంచితభాషణయుక్తి నింక నే
మన్ననుకేఱ దెందర్థియుచ ♦ యంబు ముదాత్మత మించె శ్రీహరీ. ౩౫౮

తే॥ విందు వెలయంగ పుడా యింటి♦విందు లైతి, రనుచు సరసోక్తులాడుచు♦ననుచుకూర్మి
నోగిరమ్ములు వెట్టించి ♦ యుల్లసిల్లఁ, జేసి విలసిల్లె మునిసింహుఁ ♦ డోసురాజ్ఞి.

క॥ సమయోచితవాక్యంబుల, విమలమనస్కుండు మౌని ♦ విశ్వాత్మునితో
సమరసగోష్ఠి మెలంగుచుఁ, దమస్విని గెడపెఁ బెద్ద ♦ తడ వభియుక్తౌ. ౩౬౦

తే॥ అమ్మహాకవి యాకృతి ♦ కట్టు లమరు,
టబ్రమె పయోనిధిశయానుఁ ♦ డవలఁ దోడి
వారుఁ దానును శయసించి ♦ వఱలు వేగుఁ
బోక మేల్కాంచి మునిఁజేరఁ ♦ బోయి నిలువ. ౩౬౧

—♦ వాల్మీకిమహర్షి రామునకు నివాసస్థలంబు నిరూపించుట ♦—

తే॥ వాసయోగ్యస్థలంబు సీ♦ వచనసరణి, నెంచియున్నాడఁ దండ్రి రా♦ వే యటంచు
మౌనివర్యుండు వారితో ♦ మలసిచని వి, నిర్ణయం బొనరించె వి ♦ నీతి వెలయ.

తే॥ అదియు మందాకినీనది♦ కయ్యహార్య, మునకు సంగతమై మేల్మి♦ మొనసియుంట
సంతసించిరి వా రను ♦ జన్మతోడ, శాల నిర్మింపుమనిరామ ♦ చంద్రుఁ డనియె.

క॥ మునినిర్దేశమ్మున న, మ్మునిశిష్యులుఁ దోడుపడఁగ ♦ మొనసి విశాలన్
బొనరించె శాల లక్ష్మణుఁ, డనితరశీలత సలీల ♦ మగుయత్నమునన్. ౩౬౪

క॥ నిష్ఠితయు బద్ధకటయున్, గోష్ఠీపదయుతయు మహిత ♦ గోష్యస్థలయున్
శ్రేష్ఠయు శ్రేష్ఠయు నగుచు వ, రిష్ఠుఁడురాఘవున కదియె ♦ ప్రీతి ఘటించెన్.

క॥ శాలాయజన మొనర్పఁగ, నౌలక్ష్మణ; యైణమాంస ♦ మగు శ్రిపణింపన్
లేలెమ్ము తెమ్మనఁగ నతఁ, డాలీలం గూర్చె విధివి ♦ ధాన్వాణ తనరన్. ౩౬౬

ఆ॥ అన్న; తెచ్చినాడ ♦ నన్నియుఁ గుశలుండ, పీవ యెల్లయెడల ♦ దేవయజన
తర్పణముల ననుచుఁ ♦ దన కెఱింగించిన, సంతసించి రామ ♦ జనవిభుండు. ౩౬౭

శా॥ స్నాతుండై సవనావసానికములా ♦ సన్మంత్రిము ల్జప్యతా
ఖ్యాతంబు ల్పఠియించి శాకునవచ ♦ స్సందర్భ మొప్పన్ సుఖ
స్థితుండై గృహదేవతాలి భువన ♦ క్షేమంకరుం డుత్తమ
శ్రీతేజోనిధి తృప్తి నుల్లసిలఁ జే ♦ సెన్ హోమవిధ్యర్చలన్. ౩౬౮

తే॥ వైశ్వదేవబలియు రౌద్ర ♦ వైష్ణవములు, వాస్తుసంశ్రయమంగళ ♦ వర్తనములు
జప్యజపములు పాపసం♦శమనములును, మేలిపూజలు నొనరించె♦మిహిరకులుఁడు.

తే॥ విహితబలిహోమములొనర్చి♦వేదికాయ, తనికచైత్యప్రముఖ్యము♦ల్తద్దసేర్చి
భూతతృప్తి వనీఫల♦మూలపక్వ, మాంసములగూర్చెఁ రఘువంశ♦మండనుండు.
క॥ సీతాసమేతుఁడై యను, జాతుఁడుఁ దోడగుచునుండ ♦ సకలార్చనముల్
చాతురిమెయి జరిపి శుభో, పేతోదయమున గృహప్ర♦వేశ మొనర్చెన్. ౩౭౧
ఉ॥ ఆకులకప్పు వాకిళుల ♦ యందలియొప్పు సువేదికాదిక
శ్రీకృతమైనచొప్పు తన ♦ చెంగటిపూపొదరిండ్లఁ దీనెలన్
ప్రాఁకుల మించువిప్పు దరి ♦ మాన్యసరిన్మణియప్పు నప్పురీ
మోకము రామదేవుమది ♦ ముప్పనిపింపనిమెప్పుఁ గూర్పఁగన్. ౩౭౨
ఆ॥ ఆసుధర్మఁ బెరసి♦యమరేంద్రుఁ డాశచి, తోడ సురలుగొలువఁ ♦ దోఁచు నట్టు
లట్టు లవనిజాత♦యనుజుండు మునులును, మొనయఁ గొలువుకూట♦మునఁ దనర్చె.
క॥ అయవిధివిహితం బమ్మై, దయామయుఁడు గొని తపస్వి ♦ తాత్త్వికగోష్ఠిన్
నియతిఁ దనరె నితఁడె జితేం, ద్రియుఁ డని యెల్లరును మెచ్చ ♦ శ్రితపాలనికా.
క॥ అని విభుఁ డెఱిఁగించిన నా, నని భాసురమూర్తి గిరిజ ♦ యవ్వలికథమె
ప్పున కువ్విళులూరుతలం, పెసయించుచు వేఁడ నాతఁ ♦ డించుమనమునన్. ౩౭౩

—♦ ఆశ్వాసాంతపద్యములు ♦—

శా॥ నిత్యానందవిభూతిలక్షణజగ ♦ న్నిర్మాతృతాచాతురీ
ప్రత్యక్షప్రతిభాప్రభావ మునిభా ♦ వప్రేక్ష్యసద్భావ ప్రీ
శ్రీత్యాగగ్రహణోపపత్తిమదుదా ♦ సీనత్వసంభావనా
స్థిత్యాగూఢవిభావ భావభవల ♦ క్ష్మీశవ్యాపకప్రాభవా. ౩౭౪
క॥ ఆగోరహితమహితసం, త్యాగోల్లసితప్రకార ♦ తానిర్మలచే
తోగోష్ఠీసంజ్ఞాతమ, హాగోవిషయాధికృతచి ♦ దానందమయా. ౩౭౫
ఉపేంద్రవజ్రా॥ స్వయంప్రకాశప్రతి♦భాసమానా, నియంత్రితాత్మస్థితి♦నీయమానా
దయామయత్వోచిత♦దానమానా, వయోముఖావ్యాప్తి♦వర్తమానా. ౩౭౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం బంచమాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—♦—

శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథాఽమృతము.

## అయోధ్యాకాండము.

---:o:---

### షష్ఠాశ్వాసము.

---o---



కం॥ నిత్యవిశ్వమోహక
థాఽనిత్యకలావిలాస ♦ హతకిల్బిషభా
వానత్యయభాసా జన
తానత్యవగతవిశేష ♦ తత్త్వవికాసా. ౧

వ॥ దేవా ; దివ్యాంతరాత్మ వృత్తినవధరింపు మట్లనంతరవృత్తాంత శ్రవణకుతూహలాయత్తచిత్తయగు దేవేరికి దేవేరితపాదపద్ముండగు పద్మాసఖసఖుం డిట్లనియె నట్లు రాముండు సహదారసహోదరుండై భాగీరథీదక్షిణరోధంబుం బ్రసాధించి యవ్వలనిమార్గంబు స్వీకరించి యనర్గళగమనంబున నరుగుచుండునయ్యవసరంబున.

తే॥ రాముగానములువర్ణించు ♦ రాణ తనయ
దియయనందగి సూతుండు ♦ దెలుపమలయు
సొమ్ము తనపాలిదే యను ♦ నెమ్మి గ్రమ్మ
నానిషాదుండు వినుచుండె ♦ నలఘుమతిని. ౩

ఆ॥ కానవచ్చువఱకుఁ ♦ గలయంగఁ బరికించి, యవలఁజనినదారి ♦ నట్లుగాంచి
మరలె వారిదృష్టి ♦ మనము తన్మయముగా, నచట నిచట నాట ♦ లాడుచుండ.

—♦ గుహుఁడు నిజపురికింబోవ సమంత్రుం డయోధ్యకువచ్చుట ♦—

క॥ రామునియానతి రాజ్యము, బూమెలు పరికింపఁబోయె ♦ బోయ తదన్యుం
డామెయినరదముదామక, మహామంత్రముఁగొని యయోధ్య ♦ కరిగె సుమధ్యా.

తే॥ దారితలఁగాంచె నాతఁడు ♦ ద్యానకల్ప
ములు సుగంధిసుమాంచిత ♦ ములు వనములు
సరససారసములు సరో ♦ వరము లట్లు
ననుచసలిలాఢ్యములు నదీ ♦ నదపదములు. ౬

క॥ ఉత్తమకేదారములఁ బు, రోత్తంసంబుల ద్విజన్మ ♦ యుతవేదివే
దాత్తమహామాస్పదంబులఁ, దత్తరమునఁ జనెడువాఁడు ♦ తద్దయుఁ గాంచెన్. ౭

తే॥ పుణ్యతీర్థసలంబులు పోఁడుములకుఁ
బుట్టినిండ్లగుపల్లెలూ ♦ ళ్లట్టు లెనయఁ
గాంచుచుఁ గ్రమించి సాయాహ్న ♦ కాలమునకు
నాతృతీయాహమునఁ బురి ♦ కరిగె నతఁడు. ౮

చ॥ నృపసచివుండు గన్గొనె వి ♦ నీతుఁడు వీతకుతూహలుండుగా
వ్యపగతయత్నవో యిది య ♦ హో ముదమేదఁగ శబ్దశూన్యమై
నిపుణతఁబాసి చీఁకటులు ♦ నేటుకొనం గనుపట్టుచున్న ద
య్యపరిమితార్తి చిచ్చుఋను ♦ నాహుతిగాంచెనో యంచు నెమ్మదిన్. ౯

ఆ॥ శ్రీఘనిపాతిహాయవి • శిష్టం బరద మట్లు, తటిమి తోలుకొనుచు ♦ ద్వారదేశ
మెగిచి లోఁజనంగ ♦ నేడి రాముఁ డటంచుఁ, బౌరజనులు వెంటఁ ♦ బడిరి గిరిజ. ౧౦

—♦ పౌరజనులు సుమంత్రుంగని దుఃఖించుట ♦—

ఉ॥ గుంపుగ వేనవే లటులు ♦ గూడుచు వేఁడుచు రాఁగ వాఁడు నై
లింపసరిత్తటంబున స ♦ లీలచరిత్రుని వీడుకొంటి న
న్నంపెను ధార్మికుండు మహి ♦ తాత్ముఁ డతం డన విన్నయంతనే
పొంపిరివోవుజూర్తి జల ♦ పూరితలోచనులైరి వా రుమా. ౧౧

ఆ॥ పలికి రిట్లు వెతల ♦ పాలైతి మింక న, య్యుత్తచరితుఁ గాంతు ♦ మే వ్రతోత్స
వాదు లున్నె యతని ♦ నలరుచుఁ గొలిచెడు, భాగ్య మున్నె యిట్టి ♦ పాపులకును.

ఆ॥ తల్లిదండ్రు లెడయు ♦ తరమున దుఃఖించు, ప్రజల మైతి మింక ♦ భవ్యమంచుఁ
గలదె సుఖముపేర్మి ♦ గలుగునే మది కేమి, సేయువార మని వి ♦ శీర్ణులైరి. ౧౩

మ॥ కలదే రాముని బోలువాఁడు జగతిన్ ♦ గల్యాణధాముండు వాఁ
డలఁతింబోవఁగ దే కనుంగొనెడుభా ♦ గ్యం బబ్బునే యింక న
య్యాలఘుల్ ధర్మపరుల్ వ్రతోత్సవవివా ♦ హాది ప్రసంగంబులన్
మలయంగాంచినకన్నులియ్యపి యిట ♦ న్మల్లామడిం గాంచవే. ౧౪

క॥ ఇంటింటికరిగి మీకే, కంటకములు లేవుగద సు ♦ ఖసమృద్ధు లటుల్
బంటింపవకద యెదప్రియ, మంటి ర నెడురాజపుత్త్రుఁ ♦ డవనిం గలఁడే. ౧౫

ఆ॥ తండ్రియగునొ వాఁడు♦తనయుండొ కాక త,దన్యుఁ డనఁగ నగునె♦యందఱకును
గొల్పడితిమి రాము♦గోడొందితిమి మేలి,గతి యెకొందు మనకుఁ♦గలదె మీఁద.

క॥ వాతాయనగతలై స్త్రీ, లాతతదుఃఖమున మునిఁగి ♦ యమ్మోయినడులం
గాతరలై నొడువఁగ వగ, కాతఁడు వాల్పడుచు వినుచు ♦ నరిగెఁ బురంధ్రి. ౧౭

ఆ॥ మోము గప్పుకొనుచు ♦ మురువెల్లవీడి య,వ్వాఁడు రాజపథముఁ ♦ బాసి నగరు
సేరి తేరుడిగ్గి ♦ తీరొందుకక్ష్య ల,య్యేడుఁ గడచి లోని ♦ కేగుచుండ. ౧౮

క॥ హాహాకారము లెసఁగ సి, రిహమగుచు నంతిపురిమ ♦ హేచ్ఛమి బలఁగం
బూహించి యొండొరులఁగని, మోహపరిభ్రాంత మగుచు ♦ మునుకొను చింతన్.

తే॥ అశ్రువేగపరిప్లుత ♦ యగుచు నేత్ర, కమలవని బాలభాస్కరు ♦ కానరామి
ముడుఁగ నల్లిన తేఁడుస♦మ్మోదమెడలి,వినఁగ నొక్కండునుడిగాఁగ♦నని యెనిట్లు

ఉ॥ రామునిఁ దోడుకొంచుఁ జనె ♦ రాము నెటోవిడనాడివచ్చె నిం
కేమనువార మీతనికి ♦ నింతలుదోఁచెనె కోసలాత్మజ
న్నేమముసన్ గనంగలఁడె ♦ నీతులువల్కునె రామమాత లం
చీమెయినున్న యిందఱకు ♦ సేగతి సూపఁగ నోపువాఁడొకో. ౨౧

తే॥ ఆశలం ద్రెంచికొని కొడు ♦ కరుగ నిచటఁ, గోసలాత్మజ బ్రదికెడు ♦ కుచ్ఛితంపు
బ్రదుకు గాంచుచు నింకిట♦వశమె జీవ, నంబు గడపుట యిదియు వ♦నంబ కాదె.

— ♦ సుమంత్రుఁడు రాజమందిరమునం బ్రవేశించుట ♦ —

ఆ॥ అనుచు రాజపత్ను♦లడలంగ వినుచు ని, క్కంబ యింత యనుచు♦గాసిపడుచుఁ
దాను శోకవహ్ని♦దరికొన్నయన్నగ, రంది లోని కరిగె♦నాతఁ డతివ. ౨౩

క॥ ఆయష్టమకక్ష్య కృత, చ్ఛాయయు విచ్ఛాయ గాఁగ ♦ జనపతి ప్రాప్తా
పాయోన్ముఖుఁడై నిజతన, యాయత్తతఁ జిత్తమెడల ♦ నవశత నుండన్. ౨౪

ఉ॥ ఆవిభుఁ జేరఁగాంచి యతఁ ♦ డంజలిసేసి ప్రసంగమెత్తికొ
లావఁగగూర్చ నేర్పరయు ♦ నంతన మూర్ఛమునింగె తేఁడు త

ద్భావనఁజేసి యంతిపురి ♦ వర్గము చేష్పడె వాఁడు నేలపై
గోవటుగూల నెత్తి రెటా ♦ కోసలపుత్రియు నాసుమిత్రియున్. ౨౫

తే॥ పలికెఁ గౌసల్య యిదియేమి ♦ పాటు సూతుఁ
డరుగుదేరంగఁ దద్వృత్తి ♦ మరయ వలదె
సిగ్గుపడదేల చేసిన ♦ చేఁత కదియె
మేలిడుంగాక శోకింప ♦ మేలు గలదె. ౨౬

క॥ అసహాయత యొక్కండే, పోసఁగునపో యేమిగలుగుఁ ♦ బోలఁతి కలికెదో
యిసుమంతయేని విను మ, య్యసంగతుం డడవినుండి ♦ యచ్చినయదియున్. ౨౭

ఆ॥ ఇంతయరయు మింతి ♦ యిచటునలే దని, యాపె దీర్యమాణ ♦ యగముశాఖ
వోలెఁ గూలెఁ దోడి♦పొల్తు లందఱును బో, రనఁ గలంగి యేడ్చి♦రపుడు పడఁతి.

తే॥ అంతిపురిపాటు విని పౌరు ♦ లటులె నేల, వట్టి శోకింపఁదొడఁగిరి ♦ మట్టుమీఱ
నాఁటిబన్నంబె మున్నిటి♦నయముదోఁప, నన్నగర మాఁకవడి నెఱి♦యంగ నబెఁ.

ఆ॥ కొంతవడికిఁ దెలివి♦గాని తన్నుఁ బిలువంగ, సూతుఁ డెదుటనిలిచి♦స్రుక్కి దక్కి
యున్నవాని జేసి ♦ నొయ్యనఁగని మ్రొక్కి, యతనితో రెఱింగి ♦ యలుకుచుండ.

—♦ దశరథుఁడు రామువృత్తాంతము సూతు నడుగుట ♦—

ఆ॥ అపుడు బద్ధనాగ ♦ మట్టు లస్వస్థతఁ, బడిన వృద్ధు రాజు ♦ బడలియున్న
వానిఁ బాంసులాంగు ♦ బాష్పపూర్ణేక్షణు, దైన్యయుక్తుఁ గాంచి ♦ తద్దవలికె.

సీ॥ ఎచ్చోట నున్నవాఁ ♦ డీనాఁట ధర్మాత్ముఁ, డేచెట్టుమొద లయ్యె ♦ నిరవు తనకు
సుఖభోజి కేటిది ♦ చొప్పడె భుజియింప, నమరునే యప్రయా ♦ సముగ నదియు
నేదుఃఖ మెఱుఁగని ♦ యిక్ష్వాకుకులదీపుఁ, డేనేలఁ బవళింప ♦ నిచ్చగించెఁ
బలుసైన్యములు గొల్వఁ♦బరఁగెడుదొర యిప్డు, విజనస్థలం బెట్లు ♦ విడిది సేసె
వ్యాళమృగములు కృష్ణస♦ర్పములుఁ దిరుగు, నట్టిపట్టున నెటునిల్వ♦గట్టిపడియె
నాతపస్విని సుకుమారి♦యనుజుఁ డట్టిఁ, డును సమవ్యథులై కొలు♦వెనయుచుండ.

తే॥ మెత్తనివ యగ్గు లిగురుల ♦ మెలపుగలవి, పూవుబోఁడి వసుంధరా ♦ పుత్రి యెట్లు
రథముడిగి యిడె నడవిలో♦రాణ రాణి, వాసమున నలరుల మెట్టు♦వలను మఱచి.

తే॥ రాకొమారులు తారట్లు ♦ రాటుపడిరి, పాదపద్మంబు లడవుల ♦ పాలుసేసి
యాదితేయులఁబోలువా ♦ రథమగతినిఁ, బోవఁ గూర్చినదైవ మే ♦ నైన వెలార్పఁ.

క॥ మందరము దస్రు లట్టుల, మందులు మందులయి యడవి ♦ మలయఁగఁ దోనా
సుందరియుఁ జొరఁగ నికనే, మందు న్వ్రాతఫల మ♦హా సూతసుతా. ౩౫

తే॥ ఏమిచెప్పెను రాముఁ డే ♦ మేమి నొడివె, లక్ష్మణుం డైరి వా రిట్లు♦లాఁతివార
లకడ నిక్కన్నయప్పుడే♦ మనియె వత్స, మహిజ వైదేహి యిచ్చటి♦మాటఁ దలచి.

క॥ నాకొమరుఁడు సుకుమారుఁడు, నాకాధిపసదృశుఁ డిట్లు ♦ నయ మేర్పడఁగన్
జీకాకుపడెడుగతి విన, గా కొంట న్మేన నుసురు ♦ గడుకొని యెడునే. 3౮

తే॥ మంటి సిద్ధార్థుఁడవ యోసు ♦ మంత్ర నీవు
నాకులే దట్టివున్నెం బ ♦ నయముకతన
మనికిప ట్టొనరించి స ♦ న్మాన మొసఁగ
దొరయనుప వచ్చి తిచ్చటి ♦ దొసఁగు లరయ. 3౯

ఆ॥ మాన్యునికి భుక్తి ♦ మార్గంబు శయితంబు, వర్ణనం బొనర్చి ♦ వఱలుమయ్య
పతితుఁడయ్యు సత్ప ♦ పత్తి యయాతియు, ట్లంతవట్టుసౌఖ్య ♦ మందువాఁడ.

క॥ అనియిట్లు ప్రేరితుండే, సిన బాష్పపినద్ధకంఠ ♦ స్పష్టికతన నె
ట్టన స్ఖలితవాగ్గతుండై, మొనయించెను వాఁడు వార్త ♦ మునిపూజ్యపదా. ౪౦

—♦ సుమంత్రుఁడు రామువృత్తాంతంబు రాజున కెఱింగించుట ♦—

ఉ॥ అంజలి యాదలం గదియ ♦ నట్లుగ ధర్మపరుండు దార్చి యీ
యంజకు మ్రొక్కు లెక్కుడగు ♦ నాచరణంబునఁ జేర్చి కూర్చి నీ
నెంజిలికిం జలించుచు వి ♦ నీతతమై వచియించె నిట్టు లా
మంజిమ వానికే తగును ♦ మానవనాథ గణింపశక్యమే. ౪౧

సీ॥ నాచేసినవి వంద ♦ నము లయ్యయంఘ్రిల, కర్పింపుమోయి నా ♦ యల్లె నీవు
విన్నపించితి నను ♦ విదితాత్ముఁ డతనితో, నుత్కంఠపాలుగా ♦ కుండు మనుచు
నంతిపురిఁ గల ♦ యవ్వారికి యథార్హ, మారోగ్య మడిగి మ ♦ దర్చ లిడుము
ననుగన్నతల్లికిఁ ♦ బొనరింపు కుశలంబుఁ, బ్రశ్నించి వినతులుఁ ♦ బ్రార్థనములు
నప్రమాదంబుగా నను♦మనఘు ధర్మ, నిత్యపగుచు యథాకాల♦నియతి నగ్న్య
గారపరవయి పతికొల్వు♦గనుము మెలఁగు, మంబలం దభిమానమా♦నాదు లెడలి.

తే॥ రాజునెడఁ బోలఁ గైకయం ♦ దోజపడుము
భరతు యువరాజు పాడినైఁ ♦ బ్రస్తుతింపు
మర్థమున రాజు లౌదు ర ♦ త్యధికు లెపుడు
ధర్మనిరతి యిట్లని మడిఁ ♦ దార్చి మనుము. ౪3

క॥ ఆయమకిట్లని తెలిపి స, మాయుక్తుఁ భరతుఁ గాంచి ♦ యడిగితిఁ గుశలం
బాయుష్మంతుని నని నిర, పాయంబుగ మెలఁగు నెఱియుఁ ♦ బలికితి ననుమీ. ౪౪

తే॥ తల్లులందఱి నొకఁడుగాఁ ♦ దలఁపు మెపుడు
తండ్రి పూజ్యుండు వృద్ధుండు ♦ ధర్మపరుఁడు
తదుపహితశాసనంబునఁ ♦ దవిలియుండు
మఱయుము త్వదీయయావరా ♦జ్యంబు గరిమ. ४७

క॥ అనెఁ దెలుపుము నీతల్లిం, గనినటు ననుఁగన్నతల్లిఁ ♦ గాంచు మనుచు న
న్నని కన్నుల నీరుంచెను, ఘనుఁ డాతం డేవిధమున ♦ కరుణ గలండో. ४८

ఉ॥ నిట్టూర్పు ల్నిగుడించుచు న్నయకలో ♦ న్నిద్రుండు సౌమిత్రి తాఁ
గట్టల్క న్వచియించె నిట్లు మహిజా ♦ కాంతుండు వర్తించె నే
మట్టున్నీఱుమహాపరాధమున ధ ♦ ర్మంబంచుఁ బోఁదోలఁగాఁ
గట్టా; కామవిలోభము ల్తొలఁచు చోఁ ♦ గద్దా వివేకాప్తియుక్. ४९

తే॥ అది యకార్యమనక కార్య♦మనుచు నెడఁద, నెంచెఁ గైకేయిశాసితి♦యిచ్ఛకమున
దానిపరిణామ మిందఱఁ ♦ దవిలికాల్చె, నింక నేమేమిసేయంగ ♦ నెంచినదియొ.

క॥ లోభమనిన వరకృతమగు, లాభమనినఁ గిల్బిషంబ ♦ లా గొం డరయం
గా భాసిల్లదు మున్నే, యీభాగం బెంచి యునిచి ♦ రే యవియెల్లన్. ५०

తే॥ ఈశ్వరత్వకృతం బిది ♦ యిచ్ఛమెయిన
కానగునకాని హేతువు ♦ గానఁబడదు
రాము నెడలించుకృతి సమా ♦ రబ్ధ యగుచుఁ
బ్రజలయాక్రోశ మాఁగంగఁ ♦ బాలుపడెనె. ५१०

ఆ॥ బుద్ధిలాఘవంబె ♦ పొనుపడఁజేసె గా
రవము నొంటఁగలదె ♦ రహి యటంచు
నింక నమ్మహీంద్రు ♦ నేఁ దండ్రి యనఁ దండ్రి
భ్రాంత గురుఁడు హితుఁడు ♦ రాముఁ డగుట. ५११

క॥ నాకె యననేల రాముడు, లోకములకు నెల్ల గురుఁ డ ♦ లోలుఁడు సుకృతా
నీకములఁ బ్రోవు ప్రోవఁడె, యీకలుషం బెసయకున్న ♦ నిందఱఁ దమ్ముల్. ५१२

ఆ॥ సర్వలోకసుహృదు ♦ సర్వాత్మ సర్వాభి, రాము రాము విడిచి ♦ రా జటంచుఁ
బలుకఁబడునె నోటఁ ♦ బండ్ల నొకండ్లచేఁ, క్షితికి నెల్లఁ దా న ♦ హితుఁడ కాఁడె.

చ॥ అని యతఁ డగ్నికల్పుఁ డపు ♦ డాడె ధరాత్మజ విస్మితాస్మిత
త్వనియతి నూర్పువుచ్చెడువి ♦ ధంబున భూతహితాత్మవృత్తిగా

సను గను స్నానంబుఁ గను ♦ నాథునిఁ గన్గొను మోమువాడఁ గ
న్గొనల వ్యథా(క్రా)వు ల్దొనఁక ♦ గన్పడుఁ గాని వచింప దద్దియుఁన్. ౫౭

ఆ॥ రాముఁ బోల్చ నయ్యె ♦ రాముండు నయ్యెడ, నీదుకష్టమెంచు ♦ నిరతినేమొ
యిరుప్రకను దాన ♦ యేలికగా నున్న, వాఁడు లక్ష్మణుండు ♦ బాహుగుప్తి.

క॥ ఏమని తెలుపుదు నరవర?, యామహితు నుదారభావ ♦ మన్నిటికినిఁ దా
నేమమునఁ జాలఁగా కెటు, లీమహి నొకఁడుండనేర్చు ♦ నింత దొనఁకినన్. ౫౮

తే॥ గంగయొడ్డున నలగుహు♦సంగతిఁ గని, యతఁడొసఁగినఫలాదుల ♦నటస్పృశించి
యునిచి సోదరు ల్మఱ్ఱిపా♦లను బిగించి,రటుజటామండలము లొంట ♦ననువుపడఁగ.

క॥ మున్నె శివమూర్తి యాఘనుఁ, డున్న తెఱఁగునను శివాత్మ ♦ యుక్తి మెఱసె నే
మన్నను దీఱదు మనవా, పోన్నతి యాఁకపడి యిట్టు♦లోరయుటఁ దలఁపన్. ౫౯

తే॥ గంగ దాఁటంగనైన న(ప్ర)♦సంగముననను, బోయివచ్చెద మనుచు నే♦ర్పున వచించి
యడవిసుఖ ముగ్గడించి మి♦మ్మడలవలవ,దనియె మోమునవికసనం♦బచ్చుపడఁగ.

క॥ నృహరిం బూజంచె బలే, గుహుఁడయ్యెఁ గృతార్థుఁ డతఁ డ ♦ కుంఠితుఁ డాయా
విహితములు నెఱపు నయ్యెడ, నహర్పతిప్రతిభుదృష్టి♦నందినకతనన్. ౬౦

ఆ॥ ఓడఁ గూడఁబాఱు♦నోజ ధరిత్రిజ, యుత్తమామలకు స ♦ మర్హులకు మ
దీయవందనములు దెలుపు మంచని చనె, నవల గంగదాఁటి ♦ యరిగి రధిప. ౬౧

క॥ నిలువుఁడని యతని నన్నుఁన్, గలికితనంబున విభుండు ♦ గనుకలివెట్టన్
నిలిచితిమకాక యొక్కని, కలవుగలదె మనుమరల్ప ♦ నాఁచికొనంగన్. ౬౨

తే॥ అప్పు డభివందనమ్ములే ♦ నాచరించి, వారియానతి నిల్చి య ♦ వ్వల నె కాంచు
చుంటి గుహుఁడునుదోడుగా♦నుండెమీఁది,కష్టదశ లెంచుచు నెబిట్టు♦గ్రాఁగుమదిని.

క॥ కొంతవడికేనిఁ బిలుచునొ, కాంతుఁ డనెడునాస నిలువఁ ♦ గంటిఁ ద్ర్యహములా
వంతునఁ గడపి గుహుఁడు చనె, నంతట నరుదెంచినాడ ♦ నను విటుదోపన్. ౬౩

ఉ॥ కన్నులనీరుగార్చుచు నె ♦ కాలిడ వశ్యము లెన్నబోలు రా
మన్నవనాంతవాసదశ ♦ నట్టిటు లాగఁ గడంగెఁ ద్రోవలో
నున్నసుమద్రుమాదికము ♦ లొయ్యన వాడెను వేఁడినీళ్లుగా
నన్నదు లాసరస్సులు బ ♦ యల్పడెఁ దద్వ్యథమోయునన్నెఱిన్. ౬౪

ఆ॥ కట్టెలట్టివయ్యెఁ♦గాననారామము, ల్మృగములేని గడుసు♦మెకములేనిఁ
దిరుగ విట్టునట్టు♦దేబెలై పక్షులు, వలుక విప్పు డెందుఁ♦బార్థివేంద్ర. ౬౫

క॥ ఏమి యపత్రప వొడమెనొ, యేమోయిదూ ఱింతకును న ♦ యించెనొ భూత
గ్రామ మొకట గతిసెడియె నిఁ, కేమని వచియించువాఁడ ♦ నినవంశభవా. ౧౮

తే॥ పద్మవనములు మొగిడె వి ♦ పత్రములుగ, నవసుమప్రాఁ దేలె వాసన ♦ లడుగువట్టె
జలచరకవిప్రచారము♦ల్పాటుపడియె, భృంగగానరసోద్యత్ప్రి♦సంగ మెడలె. ౧౯

క॥ జలముల స్థలముల వనముల, గలయొప్పిద మిప్పు డెందుఁ ♦ గానఁబడదు నే
నలసితిఁ గనికని యిట్లు, య్యలాసుతాదయితుఁ డేగు ♦ టే మొద లనఁగన్. ౨౦

క॥ నారాకఁ గాంచి యాతఁడె, యారాముని డించివచ్చె ♦ నటె బా గనుచున్
నేరములు పన్నువారలె, యోరాజవరేణ్య యిచట ♦ నొందెడ నైనన్. ౨౧

చ॥ పలుకరు నన్నుఁగాంచి యెటొ ♦ పల్కినఁ దిట్టెడువారితోడిదా
నలుకయె కాని వేఱొదవ ♦ దయ్య; పురిం జొరఁబాఱునంత న
మ్మలు నటులయ్యలు న్విగత ♦ మండనులై విలపింపఁజొచ్చి రే
వలనున మేలుగూరెడునొ ♦ వారల కెల్లరకున్ హితాయతిన్. ౨౨

తే॥ పట్టులను మెట్టులను బడి ♦ పంచలను వి
మానముల హర్మ్యముల రాజ ♦ మార్గములను
నెందు రాము నరయువారె ♦ యెఱియువారె
కాని సుఖులంచు నొక్కటఁ ♦ గానఁబడరు. ౨౩

క॥ కన్నులసిరొల్కఁగ నా, కన్నయ్యను నెమకువారె ♦ కన్నజనం బ
ట్లిన్నగరియాండ్రి బిన్నలు, లన్నన్ని; యెన్నన లవి ♦ యగునె నరేంద్రా. ౨౪

ఆ॥ పుత్రుఁ బాయఁగాంచి♦పొక్కెడుకౌసలు, కన్నెఁ బోల్పనయ్యెఁ ♦ గాంత యిప్పు
డీయయోధ్య యెచట ♦ నేని హితాహిత, భేద మిడని వెతల ♦ పెల్లిదమున.

క॥ నరులనియే కా దిప్పుర, వరమునఁ గలయెట్టిస్వల్ప ♦ వస్తునయేనిన్
విరముపడు మేల్మిఁ గనుపడ, దరయఁగ రాముపయనమున ♦ నైనయలంతన్.

* క॥ ణ్యాంతము రము, ధాత్వర్థము స్వాంతంబై రామునెడ స ♦ మర్థం బయ్యెన్
వింతపడనేల యాతని, వంతునకున్ వత్తు రెవరు ♦ వానవమిత్రా. ౨౭

—♦ దశరథుని విషాదము ♦—

క॥ అనుచు సుమంత్రుఁడు దెలుపఁగ, వినుచునె బాష్పోపహతియు ♦ విన్నదనంబున్
ఘనగద్గదికయుఁ బొడమఁగ, ననఘుం డినుఁ డిట్టులనియె ♦ నతివిహ్వలుఁడై. ౨౮

ఉ॥ పాపపుఁబుట్టు వాకయిక ♦ పల్కినపల్కున కాడి తప్పఁగా
నోపనటన్న వెట్టిఁ బడి ♦ యూరకె రాముఁ దొఱంగఁ గంటి నా

పాపమె పంపెఁ బండితులు ♦ బాంధవు లాప్తులు మంత్రులు న్వృథం
జేసిరి న్వచింతు రది ♦ యెంచిమెలంగక మోసపోయితిన్. ౭౯

క॥ ఈహేయంబగు కృత్యము, స్త్రీహేతుక మని యెఱిఁగియుఁ ♦ జెడితి నియతియే
సాహసికవృత్తి యిడి స, మ్మోహమువాటిల్లఁజేయ ♦ మొనయంగంటిన్. ౮౦

ఆ॥ ఇట్టివ్యసన మొదవె ♦ నిది కులనాశంబుఁ, జేయుఁ గాని మాఱు ♦ చేతఁబోవ
దొండనంగఁ గలదె ♦ యసుఅలు త్వరపెట్టు; చున్నయవి యుపాయ ♦ మెన్ననీక.

ఉ॥ ఇప్పటికైన నాసుకృత ♦ మించుక యుండెనయేని రాము నేఁ
జెప్పినమాట చెప్పి యిటఁ ♦ జెచ్చెరఁ దోడ్కొనిరమ్ము వాఁ డెటుం
దప్పడు నాయనుజ్ఞ కిది ♦ తప్పనియెంచినఁ దండ్రిదక్కఁ డో
యొప్పులకుప్ప యం చనుము ♦ యోగము వేగమ కూర్పు మాదృతిన్. ౮౨

క॥ దూరగతుఁ డయ్యెనోయని, యూరకె మది నెంచి నీ వ ♦ నుత్సుకుఁడవుగా
కీరథమున న న్నిడుకొని, యారఘువరుఁ జేర్చి మనుపు ♦ మయ్యా యింకన్. ౮౩

ఉ॥ ఎక్కడనున్నవాఁడొ కద ♦ యిందునిభాననుఁ డల్లవాఁడు నా
చక్కదనాలతోఁట నెఱ ♦ జాణతనమ్ములపేఁట మక్కువల్
నెక్కొనుకోట మేల్మినరు ♦ నించినబాట వరాలమూట నేఁ
డక్కట నాకుఁ గాననగు ♦ నా హతదైవముచేత చెల్లునా. ౮౪

క॥ ఆవృత్తదంష్ట్రి నాస, ద్భావు మహేష్వాసు సుభుజుఁ ♦ దమ్ముని తోడన్
భావినితోడ న్మానయఁగ, జీవముతో నుంటినేనిఁ ♦ జేరంగాంతున్. ౮౫

ఆ॥ ఆప్రసన్నవదను ♦ నారక్తనేత్రు నా, ముక్తకుండలాఢ్యు ♦ మోహనాంగు
నాదయాసముద్రు ♦ నాజానకీజానిఁ, జూడకున్న జమునిఁ ♦ జూచువాఁడ. ౮౬

క॥ ఇంతకు మిక్కిలి గలదే, వంత యనఁగ నీయవస్థ ♦ వాటిలె సీతా
కాంతుఁ డెడచనిన యప్పుడె, చింతాలత పెచ్చుపెరిఁగి ♦ చిక్కెడదె యికన్.

తే॥ రామ ; రామానుజ ; విదేహ ♦ రాజతనుజ
యెచటనున్నారు నాగతి ♦ యెఱుఁగ రకట
దుస్తర మపార మగుశోక ♦ తోయనిధి ము
నుంగుచున్నాడ దిక్కెఱ ♦ నొవ్వఁగాంచి. ౮౮

క॥ అని దుఃఖపూర మటు తల, మునుకలు గా దేవిఁగాంచి ♦ మొనయఁగ నయ్యెన్
దనపాలిటిచరమదశా, దిన మిదె కా మెలఁగు మింకఁ ♦ దేఁకువ నెలయన్. ౮౯

సీ॥ రామాపదాభోగ ♦ భూమసంలక్ష్యంబు, సీతావిరహపార ♦ చింతితంబు
శ్వసితోర్మికావర్త ♦ సంస్థంబు బహుజల, భావవిస్తారవి ♦ స్ఫారితంబు
బాహువిక్షేపమీ ♦ నాహతం బాక్రంది, తాఘోష మహోగ్రఫే ♦ నావిలంబు
కీర్ణప్రకీర్ణోరు ♦ కేశశైవాలంబు, హాకుబ్జికోత్క్రమ ♦ హాగ్రహంబు
కేకయాపత్యబడబాముఖాకులంబు, మదఘువేగంబు వరవేల♦మదయ మభము
రామవనవాసపర్వతీ ♦ వ్రిము సగబ్ధి, మస్తరం బిది దీనిలో ♦ మునికినాడ. ౯౦

తే॥ రాము సహరాము సానుజు ♦ రాగమహితు
నోడఁ గాఁ గాని కడచు భా ♦ గ్యోదయంబు
లేదు నా కిఁక నైతి వి ♦ లీనుఁడ నని
మూర్ఛితుం డయిపడె జగ ♦ న్మోహనాంగి. ౯౧

ఆ॥ అవనిపాటు గాంచి ♦ యాపల్కుబడి త్రెఱం, గెంచి తన్ను దానె ♦ ముంచుకొనిన
యట్లు గాఁగఁ గోస♦లాత్మజ శీతాత్మ, యమ్మో దారి గతియు♦ననఁగ మఱచి.

క॥ భూశోపసృష్ట పోలిక, నాతలిరుంబోఁడి కంప ♦ మందుచు నిలపైఁ
బాతరలాడుచు నిట్లని, సూతునితోఁ బలికె జ్ఞాన ♦ సూనవిలసితా. ౯౩

—♦ కౌసల్యవిలపింప సుమంత్రుఁడు ప్రతిబోధించుట ♦—

ఆ॥ ఎచట రాముఁ డనుజుఁ ♦ డెలనాగయును నున్న
వారొ యచటు సేర్చ ♦ వలయు నన్ను
మలఁచు మింక రథము ♦ మామకజీవితం
బట్టుగాక నిలువ ♦ దరక్షణంబు. ౯౪

క॥ ఏఁ గనఁగాంచెద వారల, నేగతియెట్లగునో పిదప ♦ నిమ్మెయినున్నన్
వేగ మయమమందిరమున, కేగెద నిర్విఘ్నము బుద్ధి ♦ నేర్పడఁ గనుమా. ౯౫

క॥ అన ఖిన్నకంఠుఁ డై వాఁ, డనె జేతులుమోడ్చి పలుకు ♦ లటునిటుగా నీ
కనువగునె దేవి యిట్లన, మొనయునె సాహసము నీవు ♦ మూఢతఁగొనెదే. ౯౬

చ॥ విడువుము శోకమోహముల ♦ విభ్రమమందకు మెట్టిచెట్టఁజే
ద్పడకుము రాముఁ డయ్యడవిఁ ♦ బాలనసేయఁగ నున్నవాఁడు త
మ్ముఁడు గొలువంగ సీతధృతి ♦ ముచ్చటఁ గూర్పఁగ నూర్ధ్వలోకముల్
దొడరి జయించి తండ్రికిడఁ ♦ దొరఁపుధర్మువున న్మెలంగెడిన్. ౯౭

క॥ ఏకాంతము కాంతారం, బే కాంతమటంచుఁ గాంతు ♦ నిచ్చ మెలఁగుచో
నాకాంతతలఁపు లొప్పెదు, నాకాంతసము ల్లుతించు ♦ నయ మేర్పడఁగన్. ౯౮

ఉ॥ దైన్య మొకింత లేకడవిఁ ♦ దా నునుమెట్టినగుట్టుదోఁప న
కన్యక సీత చంద్రముఖి ♦ కాంతునిపై ధృతి దృష్టియు న్నిలన్
ధన్యతఁ జెల్పుచున్నయది ♦ తత్పరత న్ననుబోంట్ల కెన్న సా
మాన్యముగాదు తన్మతము ♦ మాన్యము వేల్పులపట్టి కేనియున్. ౯౯

క॥ ఉద్యానవిహారం బెటు, హృద్యం బగు రాముతో న ♦ నీదృశ కిపుడీ
పద్యమెలఁగుటయు లాభం, బద్యాతనం బనెడుతలఁపు ♦ నందించెఁ జుమీ. ౧౦౦

క॥ తదధీనహృదయజీవిత, కదనున రాముఁ డెడఁబాయు ♦ నపుడె యయోధ్యా
పదము దవ మనెడుతలఁ పటు, విదితంబయితోఁచె నీవు ♦ వెతపడనేలా. ౧౦౧

ఆ॥ దారితలను దయితుఁ ♦ దద్దయు మఱఁది నా, యమ సపుష్పలసిత ♦ హసితతరుల
తానికుంజనదన ♦ దీనిగమాదులఁ, గూర్చి యడుగుచుండుఁ ♦ గొసరికొసరి. ౧౦౨

తే॥ పులిని సింగంబునేనియుఁ ♦ బోలఁతి గాంచి
భయమునొందదు రాఘవు ♦ బాహుసంశ్ర
యమున యామునపథమున ♦ నట్టులరుగు
చుండ నాతపాదులవంక ♦ నోటలేదు. ౧౦౩

ఉ॥ ముద్దులుగుల్కు నెన్నడలు ♦ ముచ్చట లాననచంద్రచంద్రికల్
తద్దయు వింటొనర్ప సతి ♦ దాశరథి స్మరించుచుండు నే
ప్రొద్దును విన్నవోవునను ♦ బోల దలక్తరసోచితమ్ముల
మ్ముద్దియయంఘ్రు లిప్పుడు న ♦ ముక్తసురక్తపయోజభాగ్యముల్. ౧౦౪

క॥ ఆమోము తెలివి యాభా, షామాధురి యాటపాట ♦ సంగతిననసా
నామాలిమియు వెలయఁదగు, నామాన్యయె కూర్చు భర్త ♦ కఖిలార్థంబుల్.

క॥ ఒండొకఁడుఁ గైకఁగూర్చి యు, ఖండరసోచిత వచించెఁ ♦ గాని మదికిరా
కుండె నది దెలుప నటుపో, నిం డేమిటనేనిఁ గొఱఁత ♦ లెనయవు వారిన్. ౧౦౫

ఉ॥ కాన విచారముల్గెడపి ♦ కాంతుఁ గనుంగొను మట్టిమేలునన్
గానకుఁబోయి వారునుఁ బ్ర ♦ కాశితకీర్తిత నేగుదెంతు రు
ద్యానవిహారకల్పముల ♦ యా రఘురామున కిప్రచారముల్
నీనెఱి సూనుసుస్థితియు ♦ నెక్కొను ముజ్జగముల్లుతింపఁగన్. ౧౦౬

క॥ అనినొడువుసూతు నుడు ల, ప్డను మోదించియును రాము ♦ నటవీవాసం
బెనయించు దుఃఖపూరం, బున మొనయుచు భర్తఁగాంచి ♦ పొలఁతుక పలికెన్.

—♦ కౌసల్య దశరథునితో రాముప్రవాసముంగూర్చి యాక్రోశించుచుం బలుకుట ♦—

సీ॥ ప్రియవాది నెఱదాత♦దయగలవాఁ డంచు, నిను ద్రిలోకి నుతింప♦నెగడె దెపుడు
రామతోఁ గూడంగ ♦ శ్రీమంతు సత్పుత్త్రు, వనమున కనిచి తే ♦ మనితలంచి
నేరమ్ము లనిలేక ♦ యూరకే త్రోవంగ, నేర కాతం డేగె ♦ నీతి యనుచు
ననుజుండు తోడయ్యె ♦ నాతనియగచాట్లు, కంగన యేవెంట ♦ నలఁతిపడునొ
యాపె సుకుమారి కడమవా♦రట్టివార, మృదుమధురభోజ్యము లోగొని♦మెత్తసెజ్జ
లందుఁ బండెడువా రింత ♦ కొందు రెట్లు, శీతవాతాతపాదులొ ♦ సిలుగు లొదవ.

ఆ॥ అడవికూళ్లు గుడిచి ♦ యందందుఁ దిరుగుచుఁ, గఱకుత్రాల ముండ్ల ♦ గాసిపడుచు
మిట్టపల్లములను ♦ మేనులువైచి యా, బిడ్డ లుందు రెటులు ♦ పెనుపుదక్కి. ౧౧౦

తే॥ భద్రతూర్యధ్వను ల్విని ♦ భద్రమూర్తి, నిద్రమేల్కాంచు మైథిలి ♦ నీతనయుల
మాట లట్లుండ మెకములు♦మలసియార్వ, నిప్పు డేరీతినిఁ బ్రబోధ♦మెనయఁగలదొ.

క॥ ఇంద్రధ్వజసంకాశం, బింద్రనిభుని బాహుపరిఘ ♦ మిపు డుపధానా
తంద్రత్వ మెనయనున్నది, సాంద్రయశుఁడ నైననీప్ర ♦ సాదముకతనన్. ౧౧౨

ఆ॥ తమ్మిఁబోలఁ బరిమ ♦ ళమ్ములు గ్రమ్మను, కేశ మాధ్యదృశము ♦ కీర్తితమ్ము
రాముమోము గాంచు♦రాణ నా కున్నదొ, లేదొ యరయ నిట్టి♦లేమి వెరయ.

ఆ॥ ఇంతకరుణకర్మ ♦ మీ వొనరింప నా, కన్నులారఁగంటిఁ ♦ గదలకుంటి
నింక వజ్రసార ♦ మీహృదయఁ జేల, వ్రయ్యఁగలదు వేయు ♦ వ్రక్కలగుచు.

క॥ పమనేనగునేటికిఁగద, బ్రదికిన నరుదెంచు టరయఁ ♦ బరభుక్తయకా
నదనని సంపదకై యా, సదమలమతి యాసపడుప్ర ♦ సంగముగలదే. ౧౧౫

ఉ॥ కొందఱు శ్రాద్ధమంచుఁ దమ ♦ గూర్చినవారల తృప్తిఁగూర్చి యా
మందలదాఁటి యందఱస ♦ మానముగా భుజియింపఁజేయఁగా
నుందురు వారిభోజ్య మవ్వ ♦ తోన్నత మైనను సద్ద్విజర్షభుల్
గొందరె శృంగభంగ మను ♦ కొందుకు పీడుతలంపుపెంపునన్. ౧౧౬

ఆ॥ అట్లు తమ్ముఁ బొక్కఁ ♦ డనుభవించినసిరి, కానపడునె జ్యేష్ఠుఁ ♦ డగ్రగణ్యుఁ
డైన గ్రామశశి ప ♦ రాశితశేషమ్ము, వ్యాఘ్రి మరసి పీడు ♦ వలను వినవె. ౧౧౭

ఆ॥ యాతయామములగు ♦ హవిరాజ్యకుశపురో, డాశయూపచయము ♦ లేశములును
నొందు జన్నమునకు ♦ నొనగూర్తురే నష్ట, సోమ మధ్వరమ్ము ♦ చూడఁగలదె.

క॥ కావున నీరాజ్యరమన్, భావింపఁడు రాముఁ డింకఁ ♦ బరహృతసారన్
ధీవెలయువాఁడు సురనటు, లావిలభావమున రెంటి ♦ యర్థమొకఁడుగాన్. ౧౧౯

ఉ॥ కాంచనపుంఖము ల్మెఱయఁ ♦ గాశితధారము లౌ శరంబు ల
క్ష్యించితుఁ డూఁనిల్చిన సు ♦ రాసురు లేకతఁ గ్రమ్మివచ్చియున్
మించికిఁ దార్కొనంగలరె ♦ మాయఁగఁ జేయక పోవనిచ్చునే
చించి విరించిభాండ మటు ♦ చేతులతీఁటకు నాటలాడఁడే. ౧౨౦

క॥ మందరముం జూర్ణింప న, మందగ్రహభము నభమ్ము ♦ మహిఁగూల్ప నిలం
గ్రందునఁ బడఁద్రోయఁగ నా, నందనుఁడే చాలు నొడ్ల ♦ నయమునువలెనే.

ఉ॥ నీ కపకారము న్నెఱప ♦ నేరఁడు గా కెటు లోకసంచయం
బాకులపాటు నొందదు మ ♦ హాభుజుఁ డాతఁడ యల్గెనేనియున్
దేఁకువలేక వాలధివి ♦ దిల్చివ నోర్చునె వ్యాఘ్రి మింతయున్
నీకతనన్ శమించుటయె ♦ నెక్కొనె ద్రిక్కక యిట్టిపట్టునన్. ౧౨౧

క॥ మచ్చెము తనబిడ్డను దిను, మచ్చున నీసుతుని నీవె ♦ మాయింపఁగ నా
నిచ్చఁ గొని మెలఁగి తేమన, వచ్చును వలగొన్న ధర్మ ♦ వాసనసెడఁగన్.

ఆ॥ పతియె మొదలిదైన ♦ గతి సతి కాత్మజుం, డవలగతియ తలఁప ♦ నటఁ దృతీయ
గతి యనంగ జ్ఞాతి ♦ కాండ మామీఁదటి, గతి చతుర్థి యెందుఁ ♦ గానఁబడదు.

ఆ॥ నాకుఁ గానివాఁడ ♦ వే కదా నీవు నా, తనయుఁ డరిగె వనికి ♦ ధర్మ మెడలి
నేనుఁ బోవరాదు ♦ నీచేఁత ని న్నింటఁ, జెఱుపఁబడితి నింకఁ ♦ జెప్పఁగలదె.

క॥ ఆసింహసత్త్వు నానర, కేసరి వృషభాక్షు వసతి ♦ గెడసిచనంగాఁ
జేసితి వింకిట ధర్మం, బేసరణిం ద్రొక్కనొక్క ♦ యింతయు నెఱుఁగన్.

క॥ ఈనీవు ధర్మనిరతుఁడ, వే నేఁటికిఁ దగవుమెయిన ♦ యేలితి విలఁగా
కీనాఁటికృత్యమున నవ, సానంబొనగూడెఁ దర్త్రి ♦ సంగంబునకున్. ౧౨౭

క॥ ఏ నీవుఁ జెఱుటయే కా, కానెరి జగమెల్లజెడియె ♦ నాదట ధరలోఁ
బూని సనాతనధర్మవ, ధానమ్మున నెగడు ద్విజునిఁ ♦ దడవి పడయుదే. ౧౨౮

మ॥ హత నైతిన్ సతనూజ నే నిటులు నీ ♦ వా కాంతు వ ట్లాహతిన్
హతులై రీపురవాసు లా ప్తసచివు ♦ ల్హా రాజ్యమా రాష్ట్రిమా
హతమయ్యె న్మనుమున్న యింకిట సుఖం ♦ బవ్యాహతంబై తగన్
సతియున్ సూనుఁడుఁ బొల్చువారు స్వకమా ♦ సంకల్పకల్పంబునన్. ౧౨౯

—♦ దశరథుండు వ్యథితుండై కౌసల్యను వేఁడుకొనుట ♦—

ఆ॥ అనెడునుడులు పిడుగు ♦ లద్దేవితలనుండి, వెడలి తన్ను దుఃఖ ♦ వేగవివశుఁ
జేయఁ బార్థివుండు ♦ చింతించెఁ జిరకాల, మేమిపాపకర్మ ♦ మిదియటంచు. ౧౩౦

క॥ వ్యాహతుఁ డానృపుఁ డమ్మెయి, మోహమున మునింగి యెట్లొ♦మొనయు తెలివితో
నోహరిసాహరి బెనఁగెడు, నీహానిశ్వాసములయు ♦ హీనత జడుఁడై. ౧౩౧

తే॥ కెలనఁ గౌసల్యఁ గాంచి ని♦ష్కించనుండ, బోలె ధైర్యంబు పొనుపడ♦బుద్ధిసెదర
దీనుఁడై విలపించెను♦తీరునంచె, తోఁచెఁ బూర్వకృతం బగు♦దుష్కృతంబు. ౧౩౨

క॥ దానికి మిక్కిలివగచుచు, దానివతంసంబు మున్నుఁ ♦ దవిలినవగ య
ద్దాన ద్విగుణంబు గాఁగ ని, దానం బయి సుతవియుక్తిఁ ♦ దాపముఁ బెనుపన్.

క॥ ఆ రెండుశోకముల నతఁ, డారాత్కృతమౌళి యగుచు ♦ నంజలిబంధం
బారాణిపెనకుఁ గూర్చి యు, సారుండై పలికెఁ దత్ప్రి ♦ సాదనపరతన్. ౧౩౪

తే॥ నినుఁ బ్రసన్న నొనర్పంగ♦నెఱపినాఁడ, నిదియసు మ్మంజలి విధాత♦యిట్లుసేసె
నీవు వత్సల వనృశంస♦వితరులంద, యేనిఁ గావునఁ గరుణింపు♦మింతయరసి. ౧౩౫

క॥ గుణవంతుఁడయేనియు ని, ర్గుణుఁడేనియుఁ బతియ వేల్పు ♦ కులసతి కెపుడున్
గణియింతువు సద్ధర్మము, లణీయసుల యట్లుగాక ♦ యనవరతంబున్. ౧౩౬

తే॥ దుఃఖితవ యేనియు దురంత ♦ దుఃఖకలితుఁ
దొడరి విప్రియములు నరుం ♦ తుదములు నగు
నట్టి నుడుల నలంప నీ ♦ కర్హమగునె
యస్మారాల వటంచు ము ♦ న్నరయలేదె. ౧౩౭

— ♦ కౌసల్య క్షమాపణం బర్థించుట ♦ —

చ॥ కరుణముగాఁగ నిట్లు పతి ♦ గాసిలి పల్కెడు తీరుగాంచి య
ప్పరమపతివ్రతామణి వి ♦ పన్నత నెట్టన సోలి వ్రాలి స
త్వరయయి త్రస్తయై యతఁడు ♦ దాల్చినదోసిలిదమ్మి వట్టి తా
శిరమునఁ బూన్చుకొంచు సువి ♦ శీర్ణపదాక్షరవృత్తి చొప్పడన్. ౧౩౮

క॥ జలనిర్గమమార్గంబుల, జలజలప్రవహించు వృష్టి ♦ జలధారలనన్
గలికికను లశ్రుధారల, వెలార్పఁగా దుఃఖితాత్మ ♦ వివశతఁ బలికెన్. ౧౩౯

క॥ వెసఁ గరుణింపుము దాసిం, బ్రసాదమునుఁ గోరుచుంటి ♦ బద్ధాంజలినై
యసదుక్తికి భూమిపయిం, బ్రసక్తిమై నొరగి చేటు ♦ పాటుంగంటిన్. ౧౪౦

క॥ నీచే నిప్పటి కిమ్మెయి, యాచింపంబడుట నిహత ♦ నైతిన యింకన్
నాచేసినయపకృతి కిదె, నాచెలువుఁడ శిక్ష, తగుదు ♦ నను మన్నింపన్. ౧౪౧

ఆ॥ శ్లాఘనీయుఁ డఖిల ♦ శాసిత ధీమంతుఁ, డైన భర్తచేత ♦ నదనుగాంచి
మలఁచికొనుటకుఁ బ్రతి♦మాలించుకొనునట్టి, పొలఁతి యుభయలోక♦ములకుఁ జెడదె.

క॥ నీదాక్షిణ్య మెఱుఁగనే, నీదాతృత్వం బట్టు లరసి ♦ నేరన తెలియన్
లే దక్షమ నావలనునఁ, గా దక్షిణంబు జడను ♦ కదియఁబడుటయున్. ౧౮౩

ఆ॥ సత్యవాది వనుచు ♦ సకలజ్ఞుఁడ వటంచు, ధర్మపరుఁడ వనుచు ♦ దాత వనుచు
ని న్నెఱింగియుంటి ♦ నేఁ బుత్రశోకార్తి, నెఱుకమాలి యిప్పు ♦ డిట్టు లంటి.

ఉ॥ శోకము ధైర్యముం జెఱుచు ♦ శోకము ద్రెంచు శ్రుతప్రశస్తి నా
శోకము సర్వనాశనముఁ ♦ జొప్పడజేయునుఁ బ్రాణికోటికిన్
శోకమె నిత్యశత్రువు వి ♦ శోకుఁడు గాక సుఖింపనేరఁ డ
ప్రాకృతవర్తనంబునకుఁ ♦ బాల్పడు తత్త్వరసజ్ఞుఁడేనియున్. ౧౮౫

క॥ అహితుఁడు చేచేఁగూర్చిన, ప్రహార మోర్వంగవచ్చుఁ ♦ బాపఁపుశోకం
బహితం బొనరించు కాటున, నహహా విసమెక్కి చెడఁడె ♦ యంతకుఁడైనన్.

తే॥ అయిదు దివసము లయ్యె నా ♦ యయ్య యడవి
యందు వసియింపఁగాఁ బోయి ♦ యవియె శోక
హతధృతికి దీని కనసయ్యె ♦ నైదువత్స
రములు వాత్సల్యకృతము ని ♦ ర్ణయముకతన. ౧౮౭

క॥ అచింతలఁ బెరిఁగి యనా, లోచితమై శోక మింత ♦ లోఁగొనెఁ దతవే
గాచితల నదుల పెనకువ, నేచిప్రవర్తించు సంద్ర ♦ మే యననగుచున్. ౧౮౮

క॥ అని సౌజన్యము వెలయఁగ, ననితరగుణ కోసలాధి ♦ పాత్మజ సంప్రా
ర్థన సేయుచుండ సవిత్రుఁడు, చనెఁ జరమాద్రికిఁ ద్రియామ♦చయ్యన దోఁచెన్.

తే॥ అధికశోకసమాక్రాంతుఁ♦డయ్యె నృపతి,యాశుభచరిత్రశుద్ధవా♦క్యములశ్రుతిసు
గతికిఁ గూర్పంగఁ జాలుస♦త్కలన మెలఁగ, నిద్ర కొక్కింత వశపడె ♦నీరజాక్షి.

ఆ॥ ఒకముహూర్తకాల♦మొదిఁగి యట్టుండి ప్ర,బుద్ధుఁ డతఁడు ప్రాప్త♦బోధుఁడగుచుఁ
దన్నుఁ బొదువుచింతఁ♦దవిలి శోకార్ణవ, మందుఁ బడియెఁ దొంటి♦యట్టిఁడగుచు.

క॥ ఆసూర్యుఁ గవిసెఁ దమ మ, య్యాసుర మటు రామలక్ష్మ ♦ ణాసాద్యవనా
యాసస్మరణంబున న, వ్వాసవసముఁ డయ్యెపద్ర ♦ వంబునఁ దెరలెన్. ౧౯౨

క॥ అనఘుఁ డటు రాముఁ డడవికిఁ, జన నాపష్ఠి యగు రాత్రి ♦ జననాథునకున్
దనచేసిన దుష్కృతమే, కనుపట్టెను వింతయగు ప్ర ♦ కారము నెఱయన్. ౧౯౩

ఆ॥ పుత్రశోకమునను ♦ బొరలుచుఁ బుత్రశో, కార్త యైన దేవి ♦ నపుడు పిలిచి
యాదరించి పలికె ♦ నాతండు స్వపురాకృ, తంబు డంబరంబు ♦ దవులు మదిని.

— దశరథుండు కౌసల్య కాత్మకృతయజ్ఞదత్తవధ వృత్తాంతం బెఱిఁగించుట —

క॥ ఓకల్యాణీ; వింటివె, యాకులపడనేల యెవ్వఁ ♦ డశుభము శుభమో
యేకరణిం బొనరించునొ, యాకర్తకుఁ దత్ఫలంబ ♦ యగు నటు గుముదర్. ౧౫౫

తే॥ తొలుతఁ గృతినర్థముల గుణ♦దోషములను, గురులఘుత్వంబులనుఁగని♦కూర్పఁడేని
నవల శోకింప నేమగు♦నతని వ్యర్థుఁ,డనరు బాలుండ పో యందు♦రార్యులెపుడు.

ఆ॥ తివిరి యామ్రవణము ♦ త్రెంచి పలాశాలిఁ, బెంచి పూలుగాంచి ♦ పృథు ఫలాశ
మించి యవల నేడ్చు♦చిడికెడు జనుఁ డొందు,నన్నుఁ బోల్పఁజను న♦నాథుఁడతఁడు.

చ॥ శరధృతి శబ్దవేధిగతి ♦ చక్కఁగనేర్చి కుమారభావ మొం
డరయఁగనీని యాదశనె ♦ యా నితఁ డొక్కఁడె మేటియంచు నె
ల్లరు నన ధన్వినై తగి ఫ ♦ లస్థితిఁ గా దని త్రోవరాని దా
దురిత మొనర్చినాడ నది ♦ ద్రుంగకము న్ననుఁజేరి కాల్చెడిన్. ౧౫౮

ఆ॥ ఆపలాశముగ్ధు ♦ న ట్లది న న్నిది, సేసె నిట్లు వేత్రె ♦ చెప్పనేల
విసముఁగొన్నవాని ♦ విధమున సంతాప, మునకుఁ బాలుపడితి♦మొదలు సెడఁగ.

తే॥ ఆయవిజ్ఞాతశబ్దవే♦ధ్యమయఫలము, తెఱఁగు వినిపింతు వినుమప్డు ♦ దేవి నీ వ
నూఢ వే యువరాజునై ♦యుంటి నొదవె, రాగమదవృద్ధికరము వ ♦ ర్షాగమంబు.

క॥ కృషికిం జేయూఁతయకాఁ, గృషీవలు లొనర్చు తపము ♦ కృతిఫలగతికై
సుషమాఢ్యాకృతి సమయో, న్మిషితము మిషమున యథేచ్ఛ♦మేకొనె జగతిన్.

తే॥ భౌమరసముల సేవించి ♦ పరఁగి ధరణి, కంశుసంతాప మొనగూర్చి ♦ యాపరేత
చరితయగు దిశ కరిగె భా♦స్కరుఁడు తనదు,శాసనం బెందు నేనియు ♦ సాగుటరసి.

తే॥ ఉష్ణముడివోయె నప్పుడే♦యోజపడి ఘ,నములు స్నిగ్ధములై తోఁచె♦నని చెమిగుల
భేకసారంగ బర్హిణ ♦ ప్రీతి పులుఁగు; లార్ద్రపక్షములై చెట్ల ♦ నాక్రమించె.

క॥ వాతావధూతశాఖి, వ్రాతముల సమాశ్రయించి ♦ వానిగతియ కా
కాతటి తమ కొం డొదవమి, కాతంకము నొందుచుండె ♦ నఖిలఖగములున్.

తే॥ పడినయది పడుచున్నయ♦ప్పటిదియు నగు, జలవితతి గప్ప మత్తగ ♦ జప్రసక్తి
మచల మచలంబ యగు సంద్ర♦మట్లుపొల్చె,నాథునాగమకాలంబు♦నందుసాధ్వి.

చ॥ ధరముల ధాతువర్గములు ♦ దావకృతంబులు భస్మరాసులున్
బరువడిఁ గొంచుఁ దీవ్రగతిఁ ♦ బాఱెడు నన్నదు లెల్ల రక్తపాం
డురభుజగంబు లట్లయి క ♦ డుం గనుపట్టె నవక్రవక్రతా
నిరతి హుటాహుటి న్నెఱయ ♦ నెక్కొనువారలు సంభ్రమింపఁగన్. ౧౬౬

క॥ జలదాక్రమణమున న్నీ, స్థలముల స్రోతస్సు లెగచి ♦ రాగకలుషితం
బులు గలు యున్మార్గముఁ గొనె, వలగొను నిజమార్గ మెడలి ♦ వారని నికృతిన్.

తే॥ అట్టి సుఖసమయంబున♦యందు ధనువు,దాల్చి పొదు లిషువుల నింపి♦తద్దపొదలు
వేడ్క నెయిఁ దురగంబెక్కి ♦ వేట కరిగి,విడిసితిని సరయూతట ♦ విపినములను.

క॥ యోగులకు రాగులకును వి, రాగులకు నొకంట నొదిఁగి ♦ వ్రాలఁగ నౌ వ
స్థాగమము మత్ప్రసక్తదు, రాగమబోధకృతి కధిక్ర ♦ తాగమమయ్యెన్. ౧౬౯

క॥ ఏకాంతగతుండ నగుచు న, నేకాంతత్వమున నడరి ♦ యిటునటుఁజొరనౌ
నేకరణిమోక్షమునేనియుఁ, బోకార్పఁ దొడంగితిన్ బ్ర ♦ భుత గుబ్బతిలన్. ౧౭౦

ఆ॥ తీరగతము నెల్లఁ ♦ దీర్చితి వివృతకా, ర్ముకుడ నగుచు విసువు ♦ మొనయు దేర
దెనయు శబ్దముననె ♦ యేసి చక్కాడితి, హింస్రమేని నదిత ♦ దితరమేని. ౧౭౧

క॥ ఆరాత్రి నంధకారము. పూరించె న్నాదు బుద్ధి ♦ పొలము నటు లహం
కారము కారొక్కనె నగదం, కారుఁడు లేఁ డావిధిపప్తి ♦ కారం బఱుమన్. ౧౭౨

ఆ॥ అనువుపడియు యుంటి♦నజితేంద్రియత్వంబు, కతనఁ దన్ని పాన♦గతము మహిప
మట్లు జలనిమిత్త♦మభ్యాగతం బిభ, మ్మాఁకపడెడు శ్వాప♦దాలిఁ గెడప. ౧౭౩

తే॥ పూర్యమాణసలిలకుంభ♦భూత మక్షి,గోచరము గాని ధ్వని చెవి♦ నాఁచికొనియె
నాతమోవృత యా రాత్రి♦యందుఁ దనకు,ఘోరమైవారణధ్వాన♦కుమతిఁ జెనుప.

క॥ బుడబుడయనుశబ్దం బటు, లడరి గజభ్రాంతిఁ గూర్చె ♦ నగుఁబో యదియున్
నడయె యవశత్వమున నే, ర్పడెఁ గాక వనేభ మేయఁ ♦ బదరుదురె దొరల్.

క॥ ఆశీవిషోపమం బన, నౌ శర మొక్కండు దొడిగి ♦ యపుడ కడఁకమై
నాశబ్దమునను లక్ష్యము, నాశ మెనయ విడిచితిని న♦ నాథుఁడననుచున్. ౧౭౬

క॥ ఎచ్చోటు గూర్చి చనె శర, మచ్చోటనె శబ్దమొదవె ♦ హాహా యని కీ
డచ్చుపడ నీటఁగూలెడు, నొచ్చెము లేని వనవాసి ♦ యుక్తికి మొదలై. ౧౭౭

క॥ పడి యాడట నొడివెను జే, డ్పడుచుం బరువడిఁ దపస్వి♦పైఁబడ శరమున్
దొడిగినయతఁ డెవ్వఁడు మే, నెడల జలార్థి యని కాన ♦ కీ నిశివేళన్. ౧౭౮

ఆ॥ పాపమనక యిట్టి ♦ పాటున కొనగూర్చె, నే నొనర్చినదియు ♦ నేమొ తనకు
వన్యభుక్తి జడలు♦వల్కలమున్నెలు గొన్న, యడవిబడుపులును వ♦ధార్హ మైరొ.

క॥ నను వధియించిన యంతన, పనుపడునర్థంబదేమొ ♦ పరఁగ ననర్థం
బన కొనరించుచెనఁటికృతి, నను మోదించెదరె యార్యు ♦ లన్యులు నగరే. ౧౮౦

క॥ గురుతల్పగుఘల మేత, త్పరుఁ డొందునటంచుఁ దిట్టు ♦ పడఁజెట్టు లితం
డురుసుకృత మెంతలేనిఁ బొ, నరించెనో యదియుఁ జెడదె ♦ నాగతికతనన్.

ఉ॥ ఏ నిటువోవువెంట మది ♦ యింకయుఁ జింత నలంతఁ గాంచఁ బో
పైనను నాదుప్రోవుగాని ♦ యార్తులు వృద్ధులు తల్లిదండ్రు లి
క్కానని కాన్పది క్కనుచుఁ ♦ గన్నులులేనికబోదు లున్నవా
రేనెటి జీవయాత్ర నెన ♦ యించెదునో చెడు గిట్టిదా కృతిన్. ౧౮౨

క॥ ఏ నొక్కడ వా రిరువురు, దీన న్నిహతులము యింత ♦ తెలివి దొఱఁగి యి
మ్మేనున గ్రొచ్చునె యిమ్మెయి, నా నారస మింకఁ దనకు ♦ నా మే లున్నే.

తే॥ అనుమఁ గరుణోల్బణం బగు ♦ నా నుడివిని, చెడితి ననుకొనునంతలోఁ ♦ జేతనుండి
పడియె సశరశరాసనం ♦ బెడలి బడలి, శోకవేగాహతిం బడి ♦ పొక్కగదుర. ౧౮౪

క॥ దీనుఁడ హతసత్త్వుఁడ ని, ర్మానుఁడ నిర్గతుఁడ నొచు ♦ రహిసెడఁ జైత
న్యానితునియట్టులై చని, యానెలవుం గంటి నట భృ ♦ శార్తత్వమునన్. ౧౮౫

క॥ వారనిశరహతి సరయూ, తీరంబునఁ బెరలి పొరలు ♦ ధృతకీర్ణజటా
భారున్ శోణితదిగ్ధశ, రీరున్ సంయమికుమారుఁ ♦ ద్రిక్కుచుఁ గంటిన్. ౧౮౬

తే॥ నివురుగవిసిననిప్పట్టు ♦ నెగడు తేజు, పాంసువులఁ గప్పఁబడియును ♦ బరఁగుచుండ
జలకలశహస్తుఁడై ధరా ♦ శయ్య నొరగి, శల్యపీడితుఁ డగు నా ప్ర ♦ శస్తుఁ గాంచి.

చ॥ వడఁకుచుఁ జేరఁబోవు నెడ ♦ వారక నస్గని నాయసంజ్ఞతం
బొడగని నాదుపుట్టరసి ♦ పుణ్యుఁ డతం డెసలారు తేజునన్
బుడమియు నాకసం బవియ ♦ బోరన నిట్లనె నేను విన్ననై
బడిశముగొన్న మత్స్యమున ♦ పాటున నైయెడఁగాంచుచుండఁగన్. ౧౮౮

మ॥ తగునే యిమ్మెయి నేయఁ దాపసులమీఁ ♦ దన్ దర్పమా లాభ మే
మగు దీనన్ నిశిఁ బొంచి యిట్లుఱుముఁగా ♦ నౌ వేఁటచా ప్పవ్వరే
విగుణు ల్సేర్పిరి దూరదృష్టి వలదే ♦ విఖ్యాతచారిత్రు లీ
తెగవా రింతటికర్మము న్గొనిరె యా ♦ దిష్టంబునం గ్రాలరే. ౧౮౯

ఉ॥ నీ కపకారమైన కృతి ♦ నిర్ణయ మున్నదె యొంటఁబోక యే
మేకత ముండి యాకలము ♦ లెవ్వియొ బొక్కుచు జీవయాత్రికుం
బ్రాఁకిడుచుండ నోరువమిఁ ♦ బాపపుదైవము నిన్నుఁ బన్ని యి
ట్లోకతమాయఁ జేసెనొ మ ♦ హిన్ జనియించితొ యిట్టిచేట్లకున్. ౧౯౦

మ॥ తలిదండ్రుల్ గతసత్త్వ లంధులు జరా ♦ దాసు ల్పిపాసార్తులై
కలఁగం బాఱిన వారిఁ దేర్ప జలము ♦ లైకొంచుఁ బోఁబోవ న
స్త్రలఁగం బెట్టితి వొక్క ముల్కిఁ గొని యీ ♦ మాత్రంబునం బోదునీ
దులఘుత్వం బిటువారికీడరసి తో ♦ ట్రో నిన్ను బాధించెదిన్. ౧౯౧

క॥ ఎటు లోర్వఁగలరు వారలు, కటు వాత్రృప నేఁడు మీఁద ♦ గతిమెద్ది కృతం
బటునిటు సెలగక మిన్నక, తటుకున బోనెంచునే వి ♦ ధాత్రుఁ డలఁతియే. ౧౯౨

చ॥ చదివిననేమి సంయమము ♦ చక్క మెలంగిననేమి కిల్బిషం
బద నిది యంచుఁగాల్ప నయి ♦ యాఁకపడన్ దరిలేనివృద్ధుఁ డీ
సొదఁగనఁ గాంచెఁగా సుతునిఁ ♦ జూచునె యింకిటఁ జూచి యెట్టిదా
రి దవులువాఁ డశక్తుఁడు హా ♦ రీ పడుమ్రా నొకమాఱ్రిను నిల్పునే. ౧౯౩

ఉ॥ నేరకె చేసినాడ వీఁక ♦ నీకును నాకునుఁ దీర్చికోలునన్
నేరుపు లున్నె యున్నెఱిన ♦ నీ వటఁబొమ్మదె యాఁకటీరముం
జేరి వచింపు మిట్టిపనిఁ జెచ్చెర నాతఁడు నిన్ను శుష్కకాం
తారము దావవహ్నిగతిఁ ♦ దద్దయుఁ గాల్పకయుండుపద్ధతిన్. ౧౯౪

క॥ ఇదె యేకపది యదియు పో, సదమలవృత్తులు మదీయ ♦ జననీజనకుల్
మదిమది నెలకొనునాశ్రిమ, మదనున నారాక వేచి ♦ యుఱుచెద రచటన్. ౧౯౫

ఆ॥ తత్ప్రసాదనమునఁ ♦ దగుయుక్తి చొప్పడె, నేని బ్రదుకువాఁడ ♦ వీశరంబు
తీర మంబురయము ♦ తీరున నగలించు, చున్నయది పెకల్చు ♦ నోజఁ గొనుము.

తే॥ దీన నాబాధఁ దీర్చి నీ♦తెరు వెఱుంగు, మనుడు నితఁడు విశల్యుఁడై♦నను నశించు
నింకను సశల్యుఁడై యున్న♦నెట్టులోర్చు, వాఁడు దరిలేనియిమ్మహా♦వ్యథ నటంచు.

క॥ లోలోనకుంది కుమిలెడు, నాలో గతి నెంచి యోర్పు ♦ నలువొందఁగ న
న్వాలాయముగని నుడితెఱఁ, గాలోలముగాఁగ నిట్టు ♦ లనె సుడివడుచున్.

ఆ॥ శోకమాఁగి నీదు ♦ సుగతికి నెట్టెటో, పలుకుచుంటి నేను ♦ బ్రాహ్మణుండఁ
గాను బ్రహ్మహత్య ♦ గారించునని గుట్ట, కూలఁబోకు మిదియుఁ ♦ గూర్చికొనుము.

తే॥ వైశ్యజటిలువలన శూద్ర♦వనితయందు, బొడమినాఁడ దపోవృద్ధిఁ♦బొడవుపడితి
మాశ్రమంబున నిలిచి ప♦రార్థ్య మెంచి, సాఁకుచుండుదు వారిని♦చ్చలుఁ బ్రపత్తి.

క॥ అనిఘూర్ణిల్లుచు బలువే, దనఁబడి చెయ్యులుసెడ న్వి ♦ తాకుపడెడు నా
తనిఁ గనఁజాలక యూతలై, మ్మని శరముం బెఱికివైచి ♦ యటు గనునంతన్.

ఆ॥ ఉసుఱువాసి తపసి ♦ యుర్విపై శాంతాగ్ని, యట్టు లుండఁ దాఁటి ♦ యాయలంత
త్రోడి శోకమెగిచి ♦ తోడిఁబడ ననుముంప, బడలుపడుచు నేలఁ ♦ బ్రాఁకులిడుచు.

ఉ॥ ఎక్కటి దిక్కులేనిగతి ♦ కే నయి స్రుక్కుచు మంచిదారియుం
జిక్కనె యిట్టిపావున కి ♦ సీ యనుచున్ జడదారి పల్కినన్
జక్కటిదారిఁ గొంచు గురు ♦ సంయమిబారికిఁ జేరఁ బాఱితిన్
జక్కనివారి నించిన వి ♦ శంకటమా ఘట మూని చెచ్చెరన్. ౨౦౩

ఉ॥ అచ్చటఁ గంటి దుర్బలుల ♦ నంధుల వృద్ధుల లూనపక్షతన్
బొచ్చెము గన్న పక్షులనుఁ ♦ బోల్పఁగనై పరిణాయశూన్యులై
హెచ్చును గుందు లేక దెస ♦ లేకతఁ గన్గొను నయ్యనాథులన్
జచ్చినవానిమేలగుపరి ♦ చారమున న్గథలల్లువారలన్. ౨౦౪

తే॥ ఆసపడువారి నటుపిపా ♦ సార్దితులను, నతనితలిదండ్రులనుఁ గాంచు ♦ నంతఁజిత్త
వృత్తి భయశోకసంభ్రమ ♦ వివశగాఁగ, నల్లనల్లన దఱియనై ♦ యడుగులిడఁగ.

క॥ ఆ యలుకుడు విని ముదుకఁడు, నాయన్నా, యిట్లు తడసి ♦ నావేమిర పా
నీయము దేఁజనిజననిచి, రాయతృషావ్యథిత యామె ♦ రా యరయుమురా.

తే॥ తేర జలకలశం బిట్లు ♦ తెరలుచుంటి, మెన్నఁడును మసలనివాఁడ ♦ వేకతమున
నింతజాగొనరించితి ♦ వేకతమున, నీట నాటాడుటయు మేలొ ♦ నీతి సెడదొ.

క॥ నీకుఁదలఁగ వేనాఁడును, మాతెఱఁ గెఱిఁగి యరయుదువు ♦ మానవునియతిన్-
పాతరలాడెదు మము నేఁ, డేతలఁపున వీడి తడసి ♦ తేమొ తెలియన్. ౨౦౫

తే॥ పలుకునేరములైనఁ జొ ♦ ప్పడవ యెవియొ, యున్న నట్టివి నీమది ♦ నుంచఁబోకు
మెన్నఁటికి నీవ చూఁగతి ♦ యిట్టియగతి, కులకుఁ గను లీవ యీపుట్టు ♦ గ్రుడ్డులకును.

క॥ అసువులు నీదెస నున్నవి, మసృణము లవి యేల యింక ♦ మాటాడవి శే
కసిగొంటివొ యేయాపద, పొసఁగెనొ తెలుపవు కలంత ♦ పుట్టెడు మదిలోన్.

ఆ॥ అనుచుఁ బుట్టిమునిఁగి ♦ నట్టులై గుట్టెడ, లంగ వివశుఁడై య ♦ లంతపడెడు
ముదుకదబిసిఁ గాంచు ♦ మొగి ముప్పదలమునక, లైనఁ దెసలువాఱ్ఱు ♦ ననునయించి.

క॥ సిగ్గడలు నలజడియు నొక, ముగ్గడియై తన్నుఁ బొదువ ♦ మొదలఱు నొఁబవన్
డగ్గుత్తికపడు నెలుఁగున, దగ్గియుఁ దగ్గనిద తెంపు ♦ దగ నిట్లంటిన్. ౨౧౨

క॥ వాచంయమశేఖర నేఁ, రాచకొలమువాఁడఁ బఙ్క్తి ♦ రథనామకుఁడన్
నా చేసినకర్జంబున, నీచతఁ గననైతిఁ గాను ♦ నీతనుభవుఁడన్. ౨౧౩

తే॥ అయ్యొ సాకేతపురి మేలు ♦ నట్టివాఁడ, వల నగు వినీతి నెఱి గన్న ♦ వాఁడ వెట్టి
వేఁటతమకంబు గొనివచ్చి ♦ విధివశమున, రాత్రిఁ గాపుంటి మెకముల ♦ రాక లరయ.

క॥ బుడబుడయను శబ్దము నది, బొడమె ఘటము ముంప నదియ ♦ పో గజకృత మం
చడరి ధ్వనిలక్ష్యమునఁ జన, విడిచితి శర మొకఁడు దాన ♦ వెడఁగురుపడితిన్.

మ॥ నరవా కొక్కఁడు దోఁచె నానదినిపా ♦ న స్థానమం దంత స
త్వరితంబా గని శల్యభిన్నహృదయుం ♦ బ్రాణప్రయాణోన్ముఖున్
ధరణీభాగశయానుఁ దాపసు సము ♦ త్తామ్యద్గతిన్ గంటి ను
ర్వరశైఁ గూలితి నేను వాని కెనయై ♦ ప్రాప్తార్తివజ్రాహతిన్. ౨౧౯

తే॥ ఆతఁడు మదజ్ఞతాకృత ♦ మరసి యిుక, శల్య మెడలింపు మే నోర్వ ♦ జాలఁ దాప
మనుడు నట్లొనరించిన ♦ యంత స్వర్గ, మెనసె నమ్మహాసీయుఁ డే ♦ నెరియుచుండ.

క॥ జలకలశముఁ గొని మీయడు, గులు గొలువఁగఁ జేరినాడ ♦ గొనకొని మీప
లుక్కలె పలుకుచుఁ జనినా డా, యలఘుఁడు నీవ యగు దింక ♦ నన్నిగతులకున్.

క॥ అజ్ఞానలబ్ధ మియ్యది, సుజ్ఞానాసాద్యదృష్టిఁ ♦ జూచి నొడువు మ
య్యాజ్ఞమెయి మెలఁగువాఁడ న, వజ్ఞుఁ గడునొచ్చియున్న ♦ వాఁడ మహాత్మా.

తే॥ అనుచు వేఁడెదు నన్నుఁ గ్రూ ♦ రాఘశంసి, నురకవిడువంగ నయ్యోగి ♦ యొార్వరాని
చిత్తవృత్తిని నిట్టూర్పు ♦ సిలుగుఁ బెనిచి, యంతయును నగ్గిఁ జేయ బా ♦ ష్పౌఘ మడర.

ఉ॥ అంజలిఁ గూర్చి చెప్ప యటు ♦ లార్పఁ దలంకుచుఁ గాంచు నన్ను దా
నెంజిలి మీఱ నత్తపసి ♦ నిద్దపువేఁడిఁ గరంచుచూడ్కి మై
నంజక గ్రుచ్చి యిట్లనియె ♦ నో దురితాత్ముఁడ యింత సేసియీ
మంజులభాషణంబులనె ♦ మాలిమిసూపెద వేమి సేయుదున్. ౨౨౧

క॥ ఈ నీపొనరించిన చెడు, గా నోరీ ; తెలుపఁ దలఁప ♦ కచటనె యడఁపం
గా నెంచితేని నీతల, తోనే ధరవ్రాలు వేయు ♦ దుందునుకలుగాన్. ౨౨౨

క॥ ఏ నొకక్షత్రియుఁడ ననుచు, వానప్రస్థుల వధింప ♦ వచ్చితివా య
జ్ఞాన మనికాని యింతకె, యానీకుల మడఁగు నెంత ♦ లగు నీ వనఁగన్. ౨౨౩

తే॥ ఇదియె జ్ఞానకృతంబైన ♦ నింద్రుఁ డేని, స్థానచలనంబు పొల్గొక ♦ చనునె రిత్త
బ్రహ్మవాదిఁ దపోవంతుఁ ♦ బాడుములికి, వఱపి చంపితి వింక నీ ♦ వాసి గలదె.

క॥ లలిసెడ నొకఁ డొనరించిన, కలుషమునఁ గొలంబు మాయుఁ ♦ కథ వితథయగున్
దొలిదోసమె నీకింతగ, బలిసెఁ బదంపడి యిఁకెన్ని ♦ పరఁగించెదవో. ౨౨౪

తే॥ ఓరి యా దేశమున నె మ♦మ్మునుపు మింక, నతఁడు పశ్చిమదర్శను♦డార్తి నెఱయఁ
జేరి కాంచెద మతిరక్త♦సిక్తుఁ గీర్ణ, వల్కలు ధరాశయను యమ♦వశ్యుఁ దనయు.

చ॥ అన నెది దిక్కు మొక్కనక ♦ యస్తమరేయిన వారి నిద్దఱన్
గొనకొని మోచికొంచుఁ జని ♦ కూర్చితిఁ గూర్చుకుమారుకిత్తమే
ననఘుచరిత్రుఁ డత్తపసి ♦ యంగన తోడుగ సంస్పృశించి తో
డన ఘనశోకమోహములు ♦ తావుకొనం బయివ్రాలి యిట్లనున్. ౨౨౮

సీ॥ అలుకగొంకే తండ్రి♦పలుకవు మ్రొక్కవు, నేలపైఁ బడియుంటి♦నేమ మెడలి
యే నప్రియుఁడనైతి ♦ నేని నీజననితో, భాషించి లాలింపఁ ♦ బరఁగుమయ్య
యింక నెవ్వాని వౌ ♦ నించువాక్కులతోడి, విద్దెలు సుద్దులు ♦ వింద వత్స
సంధ్యాగ్ని హోత్రోపాసన ♦ ల్సలిపి మమ్ము భజించు, నతఁ డుండునేపుత్ర ♦ యవనిలోన
వన్యభోజ్యార్థముల నిచ్చి♦వచ్చు నట్లుఁ, జేర్చి కూరిమి గొసరి భు♦జింపఁ జేయఁ
గలరె యొడ్డి టమీఁద నీ♦కాలుసేయి, గన్నలేకున్న తోడుగులఁ♦గని కుమార.

తే॥ అనఘ భరియింతు నెట్టు లీ ♦ యంధ వృద్ధ, నీజనని వృద్ధ నంధుండ ♦ నే నెఱింగి
మున్నె పరలోకగతికి నై♦మూటగట్టి, యున్నయది యిది యిపుడేమి♦యోజగలదు.

ఆ॥ కన్నతండ్రి పుత్ర ♦ గర్ధిని యీపాటో, నన్నుఁగొని చనంగ ♦ నాయు మరసి
నేఁడు నిలువు మెల్లి ♦ నేమం బమర నేగు, వార మందఱము ను ♦ దారగతిని.

ఉ॥ ఈ విపు డిట్టులే చనెద ♦ వేనియు రేపట నేను వచ్చి యా
జీవితనాథునిం బెరసి ♦ తీర్పొనరింపఁగ వేఁడువాఁడ నో
దేవ ; యనాథు లంధు లిటు ♦ దిక్కఱియుండిరి వీరిఁజక్కఁగాఁ
బ్రోవఁగ వీని, బంపు మని ♦ పుణ్యుఁ డతం డభయం బొసంగఁజే ౨౩౧

తే॥ నీ వఘ మెఱుంగ విమ్మెయి ♦ నెఱకిఁ దక్కి, పాపకర్మునిచేఁ జిక్కి ♦ పడితి వింక
సత్యమున దీనఁ బడయుము♦శస్త్రయోధి, వర్గ మెనయనై పరఁగు సు♦వర్గసుఖము.

క॥ సత్య మహింసయుఁ దోడుగ, నత్యయరహిత మగుధర్మ ♦ వంది మెలఁగుసం
ప్రీత్యయు లెనసెడు పదమే, నిత్యముగా సద్గుణాఢ్య ♦ నీ కొదవెడిదా. ౨౩౩

తే॥ యుద్ధమున ననివర్తులౌ ♦ యోద్ధలకును, యోగసాధనులకు నేది ♦ యొప్పు నట్టి
సూర్యమండలమార్గంబు♦సుతుఁడ నీకు, నొదవుఁగాత మ మ్మరసిన♦యోజఁ జేసి.

క॥ మాతాపితృశుశ్రూషల, నేతఱినేనియుఁ దలంక ♦ కెలయించితి ద్యో
నేత యలరింపఁడే నిను, మాతలదొసఁగునన కాక ♦ మడియుదె తండ్రీ. ౨౩౫

తే॥ సగరశైబ్యప్రముఖు లెట్టి ♦ సత్పథమ్ము, నందఁగాంచిరో నీకట్టు ♦ లమరఁ దండ్రి
సర్వసాధులై స్వాధ్యాయ ♦ సత్తపస్య, లేమఁజనివారిబడవి కీ ♦ వేగు మనఘ.

ఆ॥ భూమి గోసహస్ర ♦ భూరిదు లాహితా, గ్నులు గురుప్రపత్తి ♦ కోవిదులును
న్యాసపరు లెట్టి ♦ జాగతిఁ గనఁ గాంతు, రదియ నీకునబ్బు ♦ నలఘుచరిత.

క॥ అకుశలగతిఁ గనఁబోవఁడు, స్వకులంబునఁ బొడమినట్టి ♦ జనుఁ డొక్కఁడున్
బ్రకటమగుఁగాక ని న్నిటు, లకలంకునిఁ దునిమినట్టి ♦ యతని కె యదియున్.

మ॥ అని దీనుండయి యేడ్చియేడ్చి సతితో ♦ నంతన్ జటాధారి నె
ట్టన వెల్వెంగని వానికిం దిలజలా ♦ ర్ఘ్యంబా నివాపాంజలిం
దనయిచ్చం బొనరించుచుండె నపుడే ♦ ధన్యాత్ముఁ డవ్వాఁడు శ
క్రనియుక్తం బగు తేరిపైఁ బొలిచెఁ బ్రా ♦ కామ్యం బసామ్యంబుగన్. ౨౩౯

ఆ॥ దేవరాజుతోడ ♦ దిటవుమై నమ్మెయిఁ, దోఁచి తల్లిఁ దండ్రిఁ ♦ జూచి మీర
లడలవలవ దింక ♦ నగు నిట్టిఁడగునట్టి, సుగతి మీకు నిత్య ♦ శుద్ధులార. ౨౪౦

క॥ మీశుశ్రూషలకతన సు, రేశాక్షికృపాకటాక్ష ♦ మెనసి మహితసౌ
ఖ్యాశయము నెరయ నరిగెద, యాశ లుడిగి మీరు నిల్లి♦ యనుదెం డనుచున్.

ఆ॥ వారి నూఱడించి ♦ వారని కుతుకంబు, మలయ నింద్రుసరవి ♦ మానమునఁ బొ
సంగి చనియె నతఁడ ♦ సంగిత్వమున ఫల, మనఁగనైన సుగతి ♦ కనువదంబ.

తే॥ అమ్మెయిం బరలోకకృ♦త్యమ్ము లతనిఁ,గూర్చి పొనరించి సతితోడఁ♦గూడి రాఁగ
వచ్చి దోసిలిగొని తమ♦వలను గాంచు,నన్ను గనుఁగొని యవశత♦నయ ముద్రోవ.

ఆ॥ మండిపడుచుఁ బడుచు ♦ మానంబునను మిట్టి, పడితి వింతలయ్యెఁ ♦ బాపగతికి
వింతలనియు గలవె ♦ వెడఁగా యపుత్రుఁగా, నేకపుత్రుఁజేసి ♦ తెఱుగ ననుచు.

ఉ॥ కావున నిప్డు నన్మడఁపఁ ♦ గా నయిన న్వ్యథ లేదు గాని నీ
వీవగఁ బుత్రశోకమున ♦ నీల్గెద వజ్ఞుఁడ నన్నమాటకున్
బో వల బ్రహ్మహంతృగతి ♦ పొల్తికి దక్షిణదాత కట్లు నీ
కీవృజినంబు శైలి ఫలి ♦ యించును నైశమ యంచు వ్యగ్రుఁడై. ౨౪౪

తే॥ కట్టియలుగోరి యేఁజేర్పఁ♦గాఁ జితాధి,రోహణ మొనర్చి చిచ్చిడి♦యాహుతాశుఁ
డౌ తపస్వి సదారుఁడై ♦యమరపురికిఁ, జేరె నటుమీఁద నేఁ బురిఁ ♦ జేరఁగంటి.

శా॥ చింతం బొక్కుచు బొర్లుచుండ నిటువ ♦ చ్ఛెన్ జ్ఞప్తికిం దీవ్రమౌ
సంతాపం బొనగూర్చుచున్ జటివచ ♦ స్సన్నాహ మావృత్తమి

ష్టంతంబుఁ ఘటించుఁ గాని విడఁబో ♦ దాశబ్దవేధోద్భవా
నంతారణ్యకమానిసంహారణకృ ♦ త్యాకృత్య మాఘిలమై. ౨౮౭

—♦ దశరథుండు తనకు కాల మాసన్నంబై నది యని కౌసల్యకుఁ దెలుపుట ♦—

ఆ॥ అతివ పుత్రశోక ♦ మద్దాన నొదవిన, యది యపథ్యభుక్త ♦ మన్నమున ర
సంబు జ్వరముఁ బెనిచి♦సన్నిపాతముఁ గూర్చు, నట్టిఁడగు విపాక ♦ మందె నిపుడు.

క॥ దీనికిఁ బ్రతిక్రియయు లే, దే నియ్యెడ నసుఁబాసి ♦ యొందే నరుగం
గా నౌనకాని పుత్రునిఁ, గానంగలభాగ్య మింకఁ ♦ గలుగ దొకొంటన్. ౨౮౯

శా॥ దుర్మార్గుం డనియేనిఁ బుత్రునిటు లే ♦ తోలింగ నేఁ దక్కనే
మర్మజ్ఞుం డగుతండ్రి పాల్పడును నా ♦ మాటం బ్రవర్తించు లే
ధర్మంబంచు రఘుప్రవీరుఁ డతఁడే ♦ తాఁ బోయెఁ గా కెవ్వఁ డీ
నర్మోచ్ఛేదకరంబు దుర్నయము స ♦ న్నాహంబు మన్నించెనన్. ౨౯౦

ఆ॥ నాకు నిదియ తగును ♦ నాకేశవంద్యుఁడా, తనికి నదియ తగునుఁ ♦ దనదుకర్మ
మునకుఁ బోలుదశన ♦ మొనయుంగఁ గలవార, లెల్లజగమువార ♦ లింత నిజము.

శా॥ దేవి; కన్నులు గానరావు స్మృతియుం ♦ దీఱుంగనో నద్దెసన్
బోవంజొచ్చెను యామ్యదూత లఱుమం ♦ బ్రొద్దెన్నుచున్నారు నా
యావేగం బధిభాగ మొందెనిదె యే ♦ నాసన్నతం గంటి ని
ష్ఠావిన్నాణపుమోమువానిఁ గనఁ బో ♦ యట్లయ్యె నిన్గంటయున్. ౨౯౧

తే॥ ఆతపం బల్పసలిలంబు ♦ నట్టు లుసుఱు, నూడ్చుచున్నది రామవి ♦ యోగజంబు
శోక మియ్యెడ నాతనిఁ ♦ జూచుగతికి, నోము దీనికి మిగులు ము ♦ ప్పేమి కలదు.

తే॥ చారుశుభకుండలము రామ ♦ చంద్రవదన,చంద్రమండలముం గాంచి ♦ సంతసించు
వారు వేల్పులపో నరు ♦ ల్గారు పోరు, వాయ నౌ పదునేనవ ♦ వత్సరమున. ౨౯౪

ఉ॥ తామరరేకుల న్నెఱపఁ ♦ దార్కొను కన్నులు మారుతుంటవిం
డ్లేమొ యనంగనొ బొమల ♦ నీద్పృశతారక లొంటఁగూర్పనొ
నామెయిదంతపఙ్క్తి మృదు ♦ హాసపువెన్నెల మించువాసనల్
గోము నెసంగ రెంటికినిఁ ♦ గూర్చెడు రాముని మోముఁ జూతు నే. ౨౯౫

ఆ॥ శారదేందుసార ♦ సప్రఖ్య మయ్యది, దానిఁ గాంచువారె ♦ ధన్యు లపుడు
నేర కేర్పికొన్న ♦ నేరమ్ము లన్నియు, నొకటఁ బొదివె నింక♦నుండఁగలనె. ౨౯౬

క॥ ఈవనవాసాస్తమయము, వోవఁ దఱిఁగని యయోధ్య ♦ పురి నడువీధిన్
శ్రీవెలయు శుక్రునట్టులు, రా వానిప్రసక్తి మేళ్లు ♦ రాణఁ బొసంగున్. ౨౯౭

క॥ ఓహితకామా; చిత్తవి, మోహము హృదయము నడంప ♦ మొనసెడు క్షీణ
స్నేహముదీపమురశ్ములు, గా హతిఁబడె నక్షములు స్వ♦కస్ఫురణలతోన్. ౨౫౮

ఆ॥ కాన నింద్రియార్థ ♦ గతి మాసె వాక్క్రమ, మాత్మశోక మెగిచి ♦ యాపగార
యమ్ము కూలమట్టు ♦ లాక్రమించె నికొండు, దెలుపనేర నిదియె ♦ తీఱుగడయు.

తే॥ నాథ; రామ; మదాయాస;♦నాశనా; య, నాథవత్సల; పితృభక్త; ♦నంద్యమూర్తి
యెచట నున్నాడవోకదే♦యిదె నశించు; చున్నవాఁడ దుర్గతివాప ♦యొడ్డ కగునె.

ఆ॥ ఋణము దీఱె మైథి ♦ లీ; లక్ష్మణా; రామ; మోక మెప్పు డపుడ♦మీకు నాకు
మిమ్ముఁ బాసితిని సు♦మిత్ర; తపస్వినీ; కోసలాత్మజాత; ♦ కూలినాఁడ. ౨౬౧

క॥ కేకయకులపాంసని యో, కైకా; నీకతన నిట్టి ♦ గతి పాల్పడె ని
ట్లేకతమ లోకమెల్లను, నీకతల ముడుంగఁ బాల ♦ నివ యగు మింకన్. ౨౬౨

—♦దశరథుండు స్వర్గతుండగుట.♦—

క॥ అని రామమాత లక్ష్మణ, జననియుఁ దచ్ఛోకమున దె ♦ సం బడియుండన్
జనవిభుఁడు రాముఁ దలఁచుచు, జనె నాకమునకు భృశార్తి♦సంగతుఁ డగుచున్.

ఆ॥ కాలరాత్రి రాత్రి ♦ గడవ రేపకడ వం, దులు సుసంస్కృతులు ను♦తులువొనర్ప
కలితమాఁగధోసు ♦ ఖప్రగీతము లొప్ప, రాజభవన మబ్ధి ♦ రాణమొరసె.

క॥ స్తుతు లొనరించెడు సూతుల, ప్రతిభం గొని పాణివాద ♦ వైజ్ఞానికు ల
ప్రతిహతముగఁ బతివృత్తం, బతివిశదముగాఁగఁ గూర్చి ♦ రనువాదములన్. ౨౬౫

క॥ కొమ్మలఁ బంజరముల నా, యిమ్మనఁ గలమేలిపులుఁగు ♦ కెల్లఁ దెలివిమై
నిమ్మ గని కూజితమ్ముల, గమ్మన నెలకొలుపఁ దొడరెఁ ♦ గళ లొప్పారన్.

తే॥ మ్రోసె వీణ ల్ప్రవీణలు♦మొత్తమగుచుఁ,గిన్నెరల కిన్నరుల ప్రౌఢ ♦ గీతి వెరసె
శుచిసమాచారమాచార ♦సూనృతోక్త,మమరెనమరీజనమువోలు♦యావతమున.

క॥ ఆశీర్వాదోల్లాస, శ్రీశస్తులు సుప్రశస్తి ♦ చిన్మహితులు భూ
పాశంసలొనర్పంగ ని, వేశాంగణ మెనసి యోజ ♦ వెలసిరి విప్రుల్. ౨౬౮

తే॥ పర్యుపస్థాన మిమ్మెయిఁ ♦బరఁగుచుండె, నాటపాటలవారి స ♦ య్యాట లొప్పె
వరవుడ మొనర్చువారల♦వర్తనంబు, లును యథాపూర్వలక్షణ ♦ మనుగమించె.

తే॥ ఆకుమారీబహుళమయి♦యలరు స్త్రైణ, మగరుహరిచందనోచిత ♦ మగు రసంబుఁ
గనకకలశంబులం గొని ♦ కానిపించెఁ, గాల్యవిధివిజ్ఞభావంబు ♦ గడలుకొనఁగ.

తే॥ మంగళాలంభనీయము♦ల్మలసెఁ బ్రాశ,నీయము లుపస్కరములతో♦నెగడుచుండ
జెలఁగె నాభిహారికము సు ♦ శ్రీవిశిష్ట, లక్షణోపేతవిధికలా ♦ లాలితముగ. ౨౭౧

క॥ అటు సూర్యోదయ సమయము, పటుతర మగుచుండఁ నింక ♦ బ్రభుదర్శన మే
మిటఁ గా దనుశంకం గొని, తటుకునఁ బయ్యుత్సుకత్వ ♦ దళ తగ నచటన్.

ఉ॥ చేరఁగఁబోయి జేనిదగు ♦ సెజ్జ కనంతరలై తదీయలా
నారులు మేలుకో ల్పెడు ♦ నందితశేతి విశేతి నీతియున్
జారుతరంబుగాఁ బొనరు ♦ సంగతి నెక్కొని చక్కఁగాంచి రా
తీరున యందు వానిదగు ♦ తేఁకువ చొప్పడ దయ్యె నయ్యెడన్. ౨౨౩

ఆ॥ ప్రాణవిషయశంక ♦ పనుపడ స్వప్నచే, ష్టావికారదార్ఢ్య ♦ చలనములనుఁ
బ్రాప్తరూప లెనసి ♦ పరికించి కించిత్తు, గానసేర రైరి ♦ కవిరిలుప్రెఱఁగు. ౨౨౪

క॥ సవయుచు వడఁకిరి వారలు, ప్రవాహపుందరితృణముల ♦ పద్ధతి నవలన్
నవలారతనము లాతఁడు, గవిసినదళ గవిసి కసిరి ♦ గవిసెన లెడలన్. ౨౨౫

క॥ కోసలుకన్నె సుమిత్రయు, భాసిల్ల రనంతరలుగఁ ♦ బడియుండి తమి
స్రాసంగతిఁ దారక ల, ట్లాసమయమునందు దీన ♦ లై విలులితలై. ౨౨౬

తే॥ పుత్రశోకపరాజిత♦ల్పుణ్యమతులు, సుప్తిబోధమ్ము లనరాక♦సుక్కియుండి
రానతాంగులు సన్నత♦లగుచుఁ జెంత, గండుకొను నశ్రువులు ముఖ♦కాంతిఁ జెఱుప.

క॥ ఆయంతిపురిజనం బటు, లాయింతుల గతులు గాంచి ♦ యహాహా పతి దా
బోయెన్ సుప్తిం బడియే, పో యెట్లనవలయు ననుచుఁ ♦ బొక్కెం జెలుచన్.

—♦ కౌసల్యాప్రభృతులు విలపించుట ♦—

తే॥ దిటవు సెడఁగ వరాంగన ♦ లీన లగుచు, చ్యుతకరేంద్రకరేణుకా ♦ గతికిఁ జాలి
రాస సెడి క్రందన మొనర్చి♦రపుడు నాథ, నాథ యను బోధనంబులు♦నాక మొరయ

ఆ॥ త్యక్తనిద్ర లగుచుఁ ♦ దత్తరపడుచుఁ గౌ, సల్య మాగధియుఁ బ్ర ♦ సక్తిఁ గాంచి
స్పర్శనం బొనర్చి ♦ చనినచొప్పరసి హా, దేవ యని ధరిత్రిఁ ♦ దెరలి రపుడు.

క॥ ధారుణి వ్రాలి రజోవృత, తార యనఁగ నాగరాజ ♦ తరుణి యనఁగనై
యారాజ్ఞి పొరలెఁ గోసలు, గారాబుతనూజ తనదు ♦ గారవ మెడలన్. ౨౩౧

క॥ ఆయంగన లందఱు న, ట్లై యార్వ నెఱింగి పెరసి ♦ యట్టిడెసకుఁ గై
కేయియుఁ బొల్పడి పొగిలెనుఁ, గాయము దొడిఁబడఁగఁ బాప♦కర్మము పొదువన్.

క॥ ఇంచుక స్థిరీకృతంబై, మంచి కెదుర్పడిన గృహము ♦ మఱి యార్తరవో
దంచితదుర్గతిపాలై, యెంచంబడె నిరయమార్గ ♦ మేమో యనఁగన్. ౨౩౩

తే॥ వడఁకువారు సంభ్రాంతులౌ ♦ వారు హేతు
పరిపరిసముత్సుకతకు లోఁ ♦ బడెడువారు

తుములమాక్రందముం దాప ♦ దూనతయును
దవ్వులువారును నైరి బాం ♦ ధవజనములు. ౨౮౪

క॥ నష్టానందవిలాసము, ప్లుష్టవికాసము విశీర్ణ ♦ పుణ్యోల్లాసం
బస్తాభాసము నగుచున్, గష్టావాస మన నచటు ♦ గానంబడియెన్. ౨౮౫

తే॥ అట్లు దిష్టాంత మొనసి శాం ♦ తాగ్నివోలె
నంబుహీనాబ్ధిగతి హత ♦ భాగ్యరీతి
నున్నపార్థివు బాష్పౌఘ ♦ మురలఁ గాంచి
మోముఁ బుణుకుచుఁ నఘపూర ♦ మున మునింగి. ౨౮౬

క॥ ఆకరణి శోకపుం దెర, లాఁకపడం గడవనేర ♦ కడ రవశతయున్
దోఁకొన నెట్టన దొడిఁబడి, యాకైకం గూర్చి కోస ♦ లాత్మజ పలికెన్. ౨౮౭

క॥ కోరికెలు దీఱె నన్నియుఁ, గూరిమిగల ఱేఁడు సనినఁ ♦ గొఱఁతయె యింకన్
దీరగు రాజ్య మకంటక, మై రా వనటపడనేల ♦ యలమట లేలా. ౨౮౮

క॥ ఆరాట మొకఁడు గలదే, యారాముఁడు వనికిఁ బోయె ♦ నదిదానఁ జనం
గారాదె నేరవో విభు, గారాముననింత వృట్టఁ ♦ గలదో యనుచున్. ౨౮౯

క॥ కింపాకభక్షణంబునఁ, గంప మొనయఁబోని లుబ్ధ ♦ గతికైతివ యా
సంపదలయాస విభునిం, జంపితి విపుడేల యింత ♦ జాలిపడంగన్. ౨౯౦

ఆ॥ రఘుకులంబు గూల్చు ♦ రవణమై నరుదెంచి, నావు నీవు భర్తృ ♦ నాశనమున
నంత వింత గలదె ♦ వంతలపాలగు, వార లున్నవారు ♦ వగవవలదు. ౨౯౧

క॥ అబ్జసుహృత్కులదీపు ప, దాబ్జంబుల కొల్వువీడ ♦ నయ్యెను మా కా
కుబ్జనెరి నీవుగొంట క, కుబ్జాతముఁ బెరసెఁ గీర్తి ♦ కొప్పొడియంగన్. ౨౯౨

ఆ॥ సుతుల వీడనాడి ♦ స్నుషమేలు గన కన్ని, వెతలఁ బాలుగొన్న ♦ విధము కాఁగ
నీసుమిత్ర యేను ♦ నీయాండ్రు నవసి నీ, కతనఁ బతినిఁ బాయఁ ♦ గంటి మిపుడు.

ఆ॥ కూళ నీకతమునఁ ♦ గొడుకుకుట్ర దొఱంగె, భర్తవాసి స్వర్గ ♦ పథముఁ బట్టె
నేనుఁ బోదు నటులె ♦ యిందఱేమగుదురో, యెదల నీదువృత్త ♦ మెంచుకొనుచు.

క॥ పతియే తనపాలిటిదై, వత మాతని నిటు లొనర్చి ♦ పడయుదు సుఖ మా
గతికేమి యనెడు సతియు జ ♦ గతిఁ గలదే నీవుదక్కఁ ♦ గలుషాత్మమతీ.

ఆ॥ నీనియోగమునను ♦ నేత రామునిఁ దోలె, నెఱిన కాంచి తిట్లు ♦ నీ వటంచు
విని విదేహరాజు ♦ వెరవఱ నాయమ్లై, యడలఁగలఁడు సుకృత ♦ మబ్బు నీకు.

ఆ॥ ఏను విధవ నౌట ♦ యింతపుట్టుట సుంత, రాముఁ డరయఁ డకట ♦ రాముదేవి
కళలనెలవు నాదు ♦ గాదిలికోడ లే, మగునొ యిదియు వినఁగ ♦ నైన నడలి.

క॥ మృగఖగవికటధ్వనులకు, మృగాక్షి యేమివెత కగునొ ♦ మెయివెంచుచు మ
మ్మగతికులఁ జేయ నెంచెను, విగీత మగు నీదుతలఁపు ♦ వేయువిధములన్. ౨౯౮

తే॥ దాని తెరు వెన్నుకొనుచుఁ జిం♦తల మునింగి, తానసంతానుఁడుగనె వృ♦ద్ధత్వ మొనసి
పోవుఁగాకేమి రాముఁ డే♦ప్రోడతనము, లేదు నీపాదుకొలిపిన♦లీలయందు. ౨౯౯

క॥ అనాటికష్టములు విన, నానాయకు నిపుడు పాయ ♦ నాకేలా యి
క్లైపు నియతి నితని దేహము, తో నవుదాహమున దివము ♦ ద్రోవఁ బొరసెదన్.

తే॥ అని మఱియుఁ బెక్కువిధముల♦ననదతనము, దోఁప వాపోవుచుం బతి♦తోడి గతికిఁ
బాలుపడి పయిఁ బడియున్న♦పార్థివసతి, దలఁగఁ బెట్టించి రట రాజ♦ధర్మవిదులు.

—♦ దశరథుని శవము తైలద్రోణి నుంచుట ♦—

చ॥ ఉచితము గాదు భూమివిభు ♦ నుత్తము నిత్తఱిఁ గర్మకర్త లే
క చితకుఁ బాలొనర్చు టని ♦ కాఁచిన తైలపుద్రోణి నుంచి యా
సచివులు గాచియుండి రటు ♦ శాయితుఁడైన నరేంద్రు చుట్టికో
లచిరకృతంబుగా నడలి ♦ రాంధ్రు నిరస్తసమస్తతోషులై. ౩౦౨

ఆ॥ చేతులెత్తి యెంత ♦ సేసితి మాకర్మ, మెట్టు లింక రాము ♦ నెడయఁ జేసి
నిన్నుఁ ద్రోచి కైక ♦ నెగడెను తఱి దరి,బ్రదుకు తోడుపాటుఁ ♦ బడయఁగలమె.

క॥ ప్రియవాది వెపుడు సత్యము, నియతి స్నేయదియ కాఁగ ♦ నెగడు దపనయం
బయ మెద్ది యష్టపడి యి, ట్లయమితగతిఁ దోడుకొంచు ♦ నరుగం గనెనో.

క॥ కాకున్న మే మొనర్చిన, యేకల్కములేం నెంచి ♦ తేమొ వినిచి య
ట్లాకృతులకైన విధికృతి, గైకొనఁగారాదొ యీవి ♦ గర్హాణ మేలో. ౩౦౫

తే॥ నీకు మాకును గతి యతం♦డే కదా స, దేకవినుతుండు రాముండు ♦ ప్రాకటముగ
లోక మేలంగఁ గలవాఁ డ ♦ లోలుఁ డరయ, నేకతన వానిసిరిఁ బాపి ♦ తిట్టుకైతి.

క॥ నిను ద్రుంప నిందఱును నె, ట్టన మాయింపంగ నక్క ♦ టా తలఁచిన యా
వనితకె తోడ్పడె దైవం, బననేలా నీవు నంత ♦ కై యుండంగన్. ౩౦౭

క॥ ఎమిసుఖించితి వాకొమ, నేమంబున నిన్ను మొఱఁగ ♦ నేఁబల్కినప
ల్కామెయిఁ జెల్లించెద నని, నీమానముతోడి ప్రాణ ♦ నిష్ఠఁ దలఁగితే. ౩౦౮

క॥ ఇందఱ కీగతిఁ గూర్చిన, సుందరి మమ్మొక్కలెక్క ♦ చూచి మెలఁపన్
గ్రందుకొనకున్నె మాయా, క్రందన మాలించువారు ♦ గలరే జగతిన్. ౩౦౯

ఆ॥ తమ్ముతుణ్ణ గొలువఁ ♦ దలిరుబోఁడిం గూడి, యరిగినాఁడు నీవ ♦ రాత్మజాతుఁ
డడవి దిరిగివచ్చు ♦ టారసి హైనఁగా, కురక యిపుడ తలఁగి ♦ తుచిత మిదియె.

క॥ అని రోదననాదమ్ములు, వినువీధికి నెక్కఁ బోదువు ♦ వివశతమై యఁ గ
న్గొన లక్షనివహముల జా, ల్గొనఁజేయఁగ నడలనైరి ♦ కోమలు లంతన్. 300

—♦ రాజమృతికిఁ బౌరులు దుఃఖించుట ♦—

సీ॥ కన్నీరు మున్నీరు ♦ గాఁ బౌర్ల నింటింటఁ, గులసతు ల్పతులతోఁ ♦ గూడి కూర్చు
హాహారవంబుల ♦ య్యాంబరచారుల, తో విమానంబులఁ ♦ దూలపుచ్చ
నగుచుఁ బ్రవర్తింప ♦ నంగడు ల్మూగియంగ, నటుచారసంచార ♦ మడఁగి చనఁగ
స్థలశోధనంబులు ♦ చత్వరాలంకృతు, లనరాక మాటాడు ♦ ననువులేక
పాడుపడియుండె నప్పురి ♦ ప్రథితుఁ డవని
విభుఁడు నన్ఁ బ్రియుఁ బాసిన ♦ వెలఁదిమాడ్కి
చందురుఁడు లేని రాత్రిరి ♦ చందమునను
నర్కు నెడసిన ద్యోకాంత ♦ యట్లు నపుడు. 302

తే॥ ఎందుఁజూచినఁ గైకేయి ♦ నిందతోడి, యిక్కముల యూరేలుంగులే ♦పిక్కటిల్లె
మంచివార్త యొక్కెడనేని♦మలయదయ్యె,నయ్యనాథత కార్తయా♦నప్పురినుమ.

చ॥ నరపతి శోకవేగమున ♦ నాకముఁజేరుఁ దదంగనాగణం
బిర నిరవొందుచుండు నది ♦ యిచ్చట నాదుప్రచారమొప్ప దం
చరిగె నినుండు చొప్పరసి ♦ యామిని తప్పదు స్వప్రచార మం
చారసి యరాజలక్ష్మి మదెన ♦ నొందుట నొందనిదయ్యెఁ జందముల్. 304

క॥ కాలమునకు తేడే కాఁ, జాలుం గారణ మతండు ♦ ననినకతనఁ ద
త్కాలము రేతత్సుతు లటు, లే లాలితగాని దశ న ♦ యింపఁగఁ బెరసెన్. 305

ఆ॥ రాత్రిఁ జనిన యితని ♦ రాత్రిరి సంస్కరిం, పంగవలయు సుతులు ♦ పజ్జ లేమి
నదియు వలనుపడని ♦ దయ్యె నంచమ్మెయి, నూనెతొట్టె నునిచి ♦ నొగులుచుండ.

క॥ అందెందుఁ జూచినను సా, క్రందనిరానందసాంద్ర ♦ కంఠజననమా
స్కందనమె నెఱియ నటు దా, నుం దలరుచుఁ దరలె రాత్రి♦నొ వ్వేర్పడఁగన్.

ఆ॥ మొగము చాటుసేయు♦మోమోట మెడపడు,టింతెకాక యదన♦మేమి యొదవు
నద నెఱింగి పీరి♦నాశ్వసించుటయె మే, లనుచుఁ దోఁచె నపు డ ♦ హస్కరుండు.

—— మంత్రిప్రవరులు మున్నుగా వసిష్ఠునితోఁ గార్యాలోచనం బొనరించుట ♦——

క॥ అంతటఁ దపోధనులు సా, మంతులు మంత్రులునుఁ గొలువు ♦మలయఁగనై యా
సంతమసహారి కులగురు, నెంతయు భక్తిమెయిఁ బొగడి ♦ యిట్లని రోకటన్.

తే॥ శార్వరత చెల్లఁ గడచె నీ♦శర్వరి ఘనుఁ, డాహితాగ్ని మహామహుం♦డరిగెఁ జేఁడు
రామలక్ష్మణు లేగి ర♦రణ్యమునకుఁ, జనిరి పెరవారు మాతుల♦సదనమునకు.

క॥ ఈయిక్ష్వాకుకొలంబున, నే యిక్కట్టింతవట్టు ♦ హేతుకృతముగా
నాయెంబోయెను రాష్ట్రము, చాయన రాజత్వ మెడసి ♦ చను టరయఁజనున్.

సీ॥ మెఱుఁగుపొందికతోడి♦మేల్మిమైఁ గురియించు, గుఱియుంచునే మొగిల్గూర్పువేల్పు
పంటవలంతిపైఁ ♦ బసుచిన్క లేకున్న, నంకురం బెత్తెడు ♦ నదియుఁ గలదె
దున్నువా రెనయఁ బో♦కున్న చేడ్పాటున, నావహిల్లదె క్షామ ♦ మదను గాంచి
దీనులై ప్రజ లొండు ♦ దెస కేగి కూలంగ, నెఱిదలంగక నిల్చు ♦ నియతి గలదె

యాధులును వ్యాధులును బొడ ♦ వడఁపఁ దొడర
సత్యమును శౌచవిధియుఁ గా ♦ ర్శ్యమున మునుఁగ
నొకట నల్లాడి వ్రాలరే ♦ యున్నవార
లెందునేని నరాజత్వ ♦ మేర్పడంగ. ౩౧౧

ఆ॥ పలుకు వినునె భార్య ♦ పరఁగునే సంతతి, పేర్మిఁబెండ్లి సేఁత ♦ పెనఁకువలును
గలవె యర్థలోప ♦ కారిక యగు నరా, జకత పాడుకొన్న ♦ జనపదమున.

క॥ సద్యానంబు లొదవునే, యుద్యానము లున్నె మేలి ♦ యూళ్లఁ దనరునే
విద్యాప్రసంగములు విల, సద్యాగారంభములునుఁ ♦ జనవే యెరవై. ౩౧౪

మ॥ శ్రుత మస్తేయము బ్రహ్మచర్యమును సం ♦ శుద్ధత్వమున్ భవ్యసం
తతిలాభంబు నహింసయున్ దపము శ్ర ♦ ద్ధాభక్తులున్ శాంతియున్
గృతసంసక్త్యకృతాప్రసక్తులును ని ♦ ష్కృష్టప్రభావంబు భూ
పతి పాలింపనిచోటుల ద్విజులకున్ ♦ బ్రాపింపఁగా నేర్చునే. ౩౧౫

తే॥ జన్నములు శుభకృతులు ను ♦ త్సవములును ద
లంగ నింగాల మట్టులి ♦ లాతలంబు
పొంగడఁగి యుండఁగలదె యే ♦ ప్రొద్దు బ్రమకు
తెఱఁగున మెలంగు మేలిసు ♦ ధీవరులకు. ౩౧౬

క॥ నటనర్తకాదులకు ను, ద్భటగాయకులకు సుభృత్య ♦ భటతతులకు నొ
క్కట జీవనవిధి చేడ్పడఁ, గటకటపడరే కలావి ♦ కాసము లెడలన్. ౩౧౭

క॥ యోగక్షేమము లని లే, కాగము లెవ్వేళ బలుపు ♦ లై యుప్పతిలన్
బోఁగడచు నెఱికి మాలి దు, రాగతులై జనులు నిరయ ♦ మరయం జనరే.

క॥ ఎచ్చోటఁజనసేని సత్త్రం, బచ్చుపనునె పిన్నపెద్ద ♦ లనంతరగతు లా
మచ్చెములు మచ్చెములఁ దిను, పొచ్చెమునకుఁ గాఁగ నరులు ♦ పొనుపడిపోరే.

క॥ ఒండొరులఁ బొడిచికొని తమ, తిండికిఁ బొల్పడెడు ప్రజలఁ ♦ దిట్టెడు వారే
యుండమి నండసెడి యిలా, ఖండము గుర్వింగణె విశేష ♦ గతు లెటు లున్నన్.

శా॥ ఆదానంబును దానముం జెడఁగ దు ♦ ష్టార్థార్థులా చోరులే
యేదారిం జననీక యాఁకపడ దు ♦ ర్దైతూ క్తులం బామరుల్
గాదంచున్ శ్రుతిపద్ధతిం జెఱుపఁగాఁ ♦ గల్యాణఘంటాపథం
బాదేవప్రియసజ్జనోచితతపో ♦ వ్యాసంగ మల్లాడదే. ౩౩౧

తే॥ వర్తకులులేక యంగడు ♦ ల్వ్యాసిచెడఁగ, దూరదేశంబులకుఁ బోవఁ ♦ ద్రోవశంక
రాబడియుఁ బోబడియు నన♦రాక పెరల, నమ్మహాక్షోభ మిట్టిఁడౌ♦ననఁ దరంబె.

ఉ॥ మేలికథాప్రసంగములు ♦ మేకొనుపూజలు భోజనంబులున్
జాలఁగ నొప్పు సత్కృతులు ♦ సర్వజనప్రియవేషభాషలున్
జాలుకొనంగనేర్చునె వి ♦ శారదుఁడై నలువొందు నేలతేఁ
డాలలి నన్నియుం దనవె ♦ యా ననువృత్తి భరింప కున్నచోన్. ౩౩౩

తే॥ రామ లడు సిఁడుదురె గృహా ♦ రామములన
యేనియుఁ గుమారికలకు మే ♦ లింత గలదె
దంపతుల సంపదల కొక్క ♦ దాఁ యున్నె
రాకొమరులు వెలయని ♦ రాష్ట్రమునను. ౩౩౪

చ॥ తెలుపులు లేనివైధనము ♦ ధాన్యము వట్టిచనంగ ముందువె
న్కలు నరిలేక యాపదలుఁ ♦ గార్కొనఁ దీఱెడువారిఁ బ్రోతుమం
చు లఘుతరు ల్గొడంగి కను ♦ సుంకములం గొని పోవుచుంద్రు గా
కలఘుగుణాఢ్యు లా నృపతు ♦ లట్లు భరించుప్రసక్తిఁ గాంతురే. ౩౩౫

ఆ॥ శస్త్రవిద్యనేర్మి ♦ చన సైన్య ముడివోవఁ, దారె దొరల మంద్రు ♦ దస్యు లెగిచి
యోపువాని దగుమ ♦ హోన్నతి యెవ్వేళ, రాచప్రోపునకు వి ♦ రామ మొదవ.

తే॥ రాజు వెలయు వసంతమ్ము ♦ ద్రుమాఁకు లట్లు
ప్రజలు శోభిల్లుదురు నేల ♦ పట్టుకొమ్మ
గలుగు లత యట్లు సుమఫల ♦ ఖ్యాతిఁ దనరి
యెల్లవారల భరియించి ♦ యెలయుచుండు. ౩౩౭

ఆ॥ నీరు లేని యేఱు ♦ నెగడొందుతృణతతి, లేని పొలము గోప్త ♦ లేని యాల
మంద యెట్టు లట్లు♦మడఁగు రాష్ట్రము ఱేని, ప్రోపు లేకయున్నఁ ♦ బాడవడంగి.
తే॥ పాపభీతులు గాని దు ♦ ర్భగులు భిన్న, సకలమర్యాదు లట్లునా ♦ స్తికులు నైన
వారలేనియుఁ గాంత్రుస ♦ ద్భావగతిని, రాజశిక్షాప్రసక్తి వి ♦ రక్తులగుచు.
క॥ మేనికి దృష్టి యెటులో భూ, జానియు రాష్ట్రమున కట్లు ♦ జను వర్తనముల్
బూని నడిపింప సత్యం, బానెటి ధర్మమునుఁ దనప ♦ దార్థము లగుటల్. ౩౮౦
క॥ రా జగు సత్యము ధర్మము, రాజే కులవంతులకు వి ♦ రాజత్కులప్రా
రాజే తల్లియుఁ దండ్రియు, రాజే హితకరుఁడు చూ ధ ♦ రాజనములకున్. ౩౮౧
తే॥ ఇంద్రయమపాశపాణియ♦క్షేశకళలఁ, బుడమిపాలన మొనరించుఁ ♦ బుడమిఱేఁడు
దానఁ దత్తత్ప్రభావవృ ♦ త్తముల నల్ల,వారి నెల్ల విశేషించి ♦ వఱలనేర్చు.
క॥ ఇది రిత్తతమోమయ మగు, నొడవ దొకింతయును దెల్వి ♦ యుక్త మయుక్తం
బద నరసి తెలుపనేర్చిన, సదమలమతి రాజులేని ♦ జనసంతతికిన్. ౩౮౩
క॥ జ్ఞాపనము ధ్వజము రథమున, కాపగిదిన్ ధూమ మగ్ని ♦ కటు లస్మద్వి
ఖ్యాపకుఁ డీయజనందనుఁ, డేపటి పరలోకమార్గ ♦ మెనయం గాంచెన్. ౩౮౪
క॥ ఆకాలము నీయానతిఁ, జేకొనియే ప్రోచె మమ్ము ♦ క్షితిపతి యట్లుం
గాక కులగురుఁడ వన్నెటి, గైకొని మాకెల్లఁ దెఱఁగు ♦ గల్పింపఁగదే. ౩౮౫
ఆ॥ అబ్ధి వేల నట్టు ♦ లనఘ నీయానతిఁ, గడవఁబోదు జగతి ♦ కాన నేఁడు
మే లొనర్పు మాసి ♦ మేదినీవల్లభుం, డితఁడు మీకటంచు ♦ నెఱుక గూర్చి.
క॥ ఇయ్యది యరణ్య మనఁగా, నెయ్యము నెడి యుండె మున్ను ♦ నిర్మలమొక దా
యియ్యార్తి గెడపి మనుజుల, మయ్యా నిలఁబెట్ట నీక ♦ యగు వేయేలా. ౩౮౭

—♦ వసిష్ఠుండు భరతుని బిలిపింప ననుజ్ఞ సేయుట ♦—

క॥ అనువారల పలుకులు విని, ఘనుఁడు వసిష్ఠుండు పలికెఁ ♦ గర్జము మదిఁ దె
ప్పున నిర్ణయించి యాచదు, రున నందఱుఁ గలయఁగాంచి ♦ రూఢి వెలయఁగన్.
క॥ మాతామహుఁ గన భరతుఁడు, మాతులుతోఁ జనెఁ దదీయ ♦ మండలమున క
ట్లాతటి శత్రుఘ్నునిఁ గొని, చేతోముద మొదవ నింత ♦ సిద్ధమ కాదే. ౩౮౯
క॥ మసలిరి వా రచ్చోటున, వెసఁ జని తోడ్తెండు కార్య ♦ విధ మయ్యెదెనాన్
బొసఁగుననువారువిన న, య్యసదృశమతి యిట్టులనె న ♦ నంతరదృష్టిన్. ౩౯౦
తే॥ అనఘ సిద్ధార్థ విజయ జ♦యంతుఁడా య,శోకనందన కదలుఁ డీ♦చొప్పుననె జ
వనవనాయుజముల నెక్కి♦వారిపురము,నేఁడ చొరఁబాఱవలయును♦ నియతిదనర.

ఆ॥ వారిఁ గాంచి సుమంత ♦ పనరుదోఁపఁగనీక, నాదుశాసనముగ ♦ నరవరేణ్యుఁ
డైన భరతశత్రుఘ్న♦ననుఁ డిట్టు లని మీర, లోకరీతి నెనయు♦యుక్తి వెలయ.

క॥ నీతగుకుశలం బడిగెను, నీతిజ్ఞుఁడు నీగురుండు ♦ నీ వనుజుఁడు నే
యాతంకము లేకుండిరె, మాతులసదనమున మమత ♦ మవ్వం బెసఁగన్. 3౫3

ఆ॥ అనుచు నేను మడిగి ♦ యాత్యయికంబగు, కృత్య మొండు వలసి ♦ కూర్మిమీఱ
మిమ్ము దోడితేర ♦ మమ్ము బంచె నొకొండు, దలఁప వలదు వేగఁ ♦ దరలిరండు.

క॥ అని వస్త్రభూషణాదుల, ననుపదమ యొసంగి పయన ♦ మమరింపుఁడు రా
ముని వనగతి జనపతిమృతి, యును నెట్లును వెలయనీక ♦ యుచితజ్ఞులరై. 3౫౪

—♦ మంత్రులు భరతశత్రుఘ్నులం దోడ్కొనిరా నరుగుట ♦—

చ॥ అనుచు ననుజ్ఞ సేసినఁ ద ♦ దర్థములం గొని వార లర్థిమైఁ
జనిరి హయమ్ము లెక్కి యతి ♦ సత్వరులై మహితాత్మనీనవ
ర్తనులు ప్రలంబమయ్యపర ♦ తాలము నీవలనావలందగన్
మన కనుమాలినీతటము ♦ మార్గ మసర్గళ మంచు నెంచుచున్. 3౫౬

తే॥ గంగ దాఁటిరి హస్తిపు♦రాంగణమున, నవలఁ బ్రత్యఙ్ముఖత్వంబు♦నందుచుఁ గురు
జాంగలంబులనడుమఁ బాం♦చాలదేశ, మెనయు నమ్మార్గిదారి వా♦రేగి రగజ.

క॥ సరసుల నదీనదంబుల, నరసియు నరయుని తెఱంగె ♦ యనువుపడఁగ వా
రరిగిరి ప్రసన్నశంబర, శరదండాహ్వయఁ దరించి ♦ జవ మొప్పారన్. 3౫౯

ఆ॥ కృత్యవిదులు వారు ♦ సత్యోపయాచన, మానికూలవృక్ష ♦ మంది మ్రొక్కి
మ్రొక్కఁదగిన దాని ♦ మురు వెంచి యవలఁగు, లింగపురిఁ గనుంగొ ♦ నంగనైరి.

క॥ పైఁ జని యభికాలముఁ గని, తేజోభిభవంబు దలఁగఁ ♦ దివిరి సుపుణ్యా
భాజిత నిక్షుమతీనది, నోజం దరియించి యరిగి ♦ రుత్పలగంధీ. 3౬౦

తే॥ పరఁగ నంజలిపానుల ♦ బ్రాహ్మణులను
వేదపారగులం గాంచి ♦ వేగ బాహ్లి
కాంతరము సొచ్చి యాసుదా ♦ మాఖ్యనగము
నెనసి విష్ణుపదము సంశ్ర ♦ యించి మించి. 3౬౧

క॥ లలిత విపాశఁ గడచి శా, ల్మలిఁ గనుఁగొని నదుల మేలొ ♦ లంకుల వనభూ
ములఁ జూచుచు దూరపథం, బలఘులు క్రమియించి చొచ్చి ♦ రామండలమున్.

తే॥ శ్రాంతవాహను లాగిరి ♦ వ్రజపురంబు, సేరి రవ్వార లానాఁడె ♦ సిద్ధిదెస నె
ననుచు సమధికవేగస♦న్నాహ మెగిచి, తమపరిశ్రమ మంతయుఁ♦దలఁగఁ జేయ.

క॥ ఏ రేయిని వా రప్సరిఁ, జేరిరొ యా రేయియందె ♦ శ్రీమానిత లీ
లారమ్యుఁడు భరతుఁడు కనె, దూరప్రియచరితమైన ♦ దుస్స్వప్న మొగిన్.

ఆ॥ రాత్రి కడచి చనియె ♦ రాఁగానిస్వప్నమి, ట్లాఁకపడియె నెట్టి ♦ పోకగలదొ
యనుచుఁ బరితపించె ♦ నపుడు రాజాధిరా, జాత్మజుఁడు ప్రబోధ ♦ మందఁ గాంచి.

చ॥ అతనివయస్యు లంత విని ♦ యాదృతినైఁ జని మేలిపల్కులన్
వితతకథాప్రసంగముల ♦ వేడుకపుట్టు లనంగఁ జెల్లు హా
స్యతతుల గానగోష్ఠుల మ ♦ హాకవిభావవిహారభంగులన్
జతనదలిర్పఁ దేర్పఁ గని ♦ చాలనివారలె వార లౌనెడన్. ౩౬౬

తే॥ అందుఁ బ్రియతముఁ డనఁజను ♦ నట్టి సఖుఁడొ
కండు మహితు నతనిఁ జేరఁ ♦ గాంచి బుజ్జ
గించి నేఁడొదవిన యట్టి ♦ కీడదేమి
ఁహామలఁక యొంటుచెవి కెక్క ♦ రామిఁ గొనెనె. ౩౬౭

క॥ స్వకము సుహృన్మండల మిటు, లకలంకము మలసి యర్థ ♦ మరయన వేఁడన్
వికలత నునికి చను నె నీ, కకృతప్రజ్ఞునకు నట్ల ♦ నాదృత మగు నే. ౩౬౮

ఆ॥ కష్టమేమొ తెల్పఁ♦గని తీర్పఁజను నంచుఁ, దన్ను వేఁడుటయు సు♦ధాముఁ డాతఁ
డిట్టులనె గ్రహింపఁ♦డీదైన్యమునకు మూ, లంబు నాగనగు వి♦డంబనంబు. ౩౬౯

—♦ భరతుండు దుస్స్వప్న వృత్తాంతంబు మిత్త్రుల కెఱింగించుట ♦—

మ॥ కలగన్గొంటిని దండ్రిచేటు గనుల ♦ న్గన్నట్టు లద్దానిచేఁ
గలఁగ న్గంటిని ముక్తమూర్ధజుఁడు త్యై ♦ క్తశ్రీకుఁడుం గాఁగఁ బ్రా
క్కాలనం బాసి గిరీంద్రిమెక్కి నెఱిద ♦ క్కుం దాఁ బడెన్ గోమయో
త్కాలమౌ నొక్క హ్రదంబున న్మనిఁగెఁ బొం ♦ తం దేలె దైన్యస్థితిన్. ౩౭౦

తే॥ తైలమును దోయిటం గొని ♦ త్రావుచుం ది
లోదనము భుజియించుచు ♦ నురక వెకలి
యై హసింపుచుఁ దలకిందు ♦ గా హఠమున
మరలఁ దైలంబునం జొచ్చి ♦ మాటుపడియె. ౩౭౧

సీ॥ సాగరం బినికిన ♦ చందంబు గనుపట్టె, భూమిపైఁ బడి శశి ♦ పొల్లువోయె
నవ్మెయి జగ మెల్ల ♦ నంధకారావృతం, బై యుపరుద్ధ మై ♦ యులఁతిపడియె
నౌపవాహ్యము నాగ ♦ మవిషాణమై తోఁచెఁ, జల్లారెఁ దెప్పున ♦ జ్వలిత మగ్ని
యాత్తకుసుమద్రుమ♦మై క్షోణి ఘూర్ణిల్లెఁ, బొగ పుట్టెఁ గొండల♦పొలములందుఁ

గప్పి గట్టి విభుఁడు ♦ కార్ణ్యాయసం బగు, నాసనమున నుండ ♦ నతనిఁ గాంచి
కృష్ణపింగలలు ని ♦ కృష్టలు ప్రమదలు, నవ్వుచున్నవారు ♦ నయము సెడఁగ.

క॥ సత్వరుఁడై ఱేఁడు సధ, ర్మత్వం బుడివోవ రక్త ♦ మాల్యాంబరలే
పత్వకలితుఁడై ఖరయు, క్తత్వంబు గలట్టి యొకర ♦ థముపై నిలువన్. 323

క॥ వెడనవ్వను వికృతాస్యముఁ, జెడుగుంజెయిదములుఁ దోఁపఁ ♦ జేడె యొకతెయా
యొడయని రక్తాంబరయై, పొడవడఁగం దివిచె జముని ♦ పొలము మొగముగన్.

తే॥ ఈభయావహ యగురాత్రి♦నింతవట్టు, గంటిఁ గలఁ గలయనుమాట♦కాదు కాదు
తండ్రినొండెను మత్సహో♦దరులనొండె, నేమిచే టిప్పటికి నెట్టు♦లాముకొనెనొ.

క॥ నాకెద్ది మూఁడనుండెనొ, నాకేశసఖుండు తండ్రి ♦ ననుచును యింకన్
శ్రీకలనతోడ సఖరం, బా ఖరరథము నెక్కి యట్టిఁ ♦ డై కలఁ దోఁపన్. 324

తే॥ ఏభయనిమిత్తమును గాన♦కిట్టిభయము, చొప్పడంగని మిముఁరిత్త♦చూచుచుంటిఁ
గాని సన్మాన మొనరింపఁ ♦ బూననైతి, నింక నేమనువాఁడ నీ ♦ యెడరుతోడ.

ఉ॥ కుత్తుక యెండిపోఁ దొడరె ♦ ఘూర్ణిలఁజొచ్చెను మానసం బళే
రిత్తకురిత్తగా నడరు ♦ రెమ్మెదుఁబైని స్వరంబుచాయసం
పత్తియు పీటిపోవు గతి ♦ పాల్పడె నిన్నియుఁగాన్ స్వగర్హ్యా
యఃస్థిత నుంటి నాదట బ ♦ యల్పడఁగా నగు చెట్ట యెట్టిదొ. 322

తే॥ అనుచు దుస్స్వప్నమాత్రుల♦కతఁడు దెలుపు,చుండఁ బెరసిరి దూతల♦యోధ్యారాజ
రాజపుత్రులఁ గాంచి స♦ భాజనముల, మించి తమచేనికొన్నుగా ♦ మించి పొంచి.

తే॥ పలికి రోజమ్ము నీకగు ♦ భద్రమూర్తి, కుశల మడిగెను సర్వార్థ ♦ కోవిదుండు
నీపురోహితుఁ జెలమిమై♦నిన్నుఁదోడి, తెమ్మనె నవార్యమైన కృ ♦ తిం దలంచి.

ఆ॥ ఈమహార్హవస్త్ర ♦ హేమభూషలు తాత, కట్లు మేనమామ ♦ కప్పనంబు
సేయు మీధనములుఁ ♦ జేర్పు మిర్వది పది, కోటు లల్లవారు ♦ గూర్మిఁ బొదల.

—♦ భరతుఁడు స్వకీయుల క్షేమం బడుగుట ♦—

క॥ అని యొసఁగినఁ గొని వారల, కనుపద మర్పించి స్వీయ ♦ మాగతము సుహృ
జ్జనముం గాంచి సుసత్కృతు, లనుఁ బొనరించి విలసత్క ♦ లత నిట్లనియెన్.

సీ॥ కుశలియే మాతండ్రి♦క్షోణీమహేంద్రుండు,సుఖియె మాయన్న వి ♦ క్షోభితాఘుఁ
డటు లక్ష్మణుఁ డరోగుఁ♦డై యున్నవాఁడే మ, హాత్ముఁ డాధర్మసూ♦త్మార్థవేత్రి
మాయుత్తమాంబ రా♦మసవిత్రి యారోగ్యంబు, లేక యొప్పెడునె ని ♦ ర్లేపసుకృత
మూర్తి సుమిత్ర స♦మ్మోదమ్ముమై నున్న,యదియె తమ్ములఁగన్న♦యలరుఁబోఁడి

మాప్రజావతి సౌజన్య ♦ మహిత జనక, మహిత యానందకలితయే ♦ తోడివారి
మెచ్చ వాత్మాభిమానిని♦యొచ్చె మెంచు, నట్టి నాకన్నతల్లియు ♦ నలరునదియె.

చ॥ అని యిటు వేఱువేఱ నతఁ ♦ డందఱసేమముఁ గూర్చి ముచ్చటిం
చిన ఘను లయ్యమాత్యులు వి ♦ శిష్టరమార్చితమూర్తి నీతలం
పున యదుపక్రమంబునుఁ బ్ర ♦ భూతము నౌ కుశలంబువేఁడి త
య్యనువున వార లందఱకు ♦ నయ్యెడు మే లవి దెల్ప నేటికిన్. ౩౮౩

క॥ త్వరసేయు మింక మనకై, నిరీక్షణము సేయుచుండ్రు ♦ నేమంబున నా
భరతుఁడు కేకయవల్లభు, సరభసముగఁ గాంచి సత్ర్ప ♦ సక్తిం బలికెన్. ౩౮౪

తే॥ ఏను గురునానఁ బనివిన ♦ నెంచినాడ, మరలవత్తు నీతలఁపున ♦ మలసినపుడ
రాకపోక లనఁగ నెన్న♦రాని యవియె,కూర్చి మాసేమ మెపు డీవు♦గోరుచుండ.

క॥ అనుమనుమనిఁ గొని యాలిం, గన మొనరించి తనరెడు వి ♦ కాసమున శిర
మ్మున మూర్కొని యాతం డి, ట్లనియె శుభాశంస లొలయ♦ననుమతి వెలయన్.

—♦ భరతశత్రుఘ్నులు కేకయరాజు వీడ్కొని పయనం బగుట ♦—

ఆ॥ అన్న ; పోయిరావె ♦ యాకైక సుప్రజ, నిన్ను గాంచినంత ♦ నెగడు దాని
సేమ మట్లు విభుని ♦ సిరిమించు కుశలమ్ము, ననుచు కూర్మి నడిగి ♦ నార మనుము.

మ॥ మహనీయుండు వశిష్ఠమౌనికి ధృతి ♦ న్మాఱ్ఱమొక్కు లందింపు ము
న్మహులు ద్దాములు రామలక్ష్మణులు పే ♦ ర్మ న్వారి మే లెంచియా
వహిఁ దక్కంగలయట్టివారల సుఖ ♦ ప్రస్తావము ల్గూర్మ్మి లా
వహిలం గూర్పుము నాకు మాఱుగ లస ♦ ద్వ్యాహారపారీణతన్. ౩౮౮

ఆ॥ అనుచుఁ బలికి యుత్త♦మాశ్వంబుల మహాగ, జంబులను విచిత్ర♦కంబలముల
మేలి రత్నతతుల♦నోలి మహాధనం, బుల నొసంగె సంప్ర♦బుద్ధుఁ డగుచు. ౩౮౯

క॥ నమ్ముఁదగునట్టివారల, నమ్మోయి ననుయాయులఁ న్మ ♦ హాబలమతులన్
సమ్మద మనువార నతం, డ మ్మనుమని బలసికొలువ ♦ ననిచెఁ బలువురన్.

తే॥ ఐంద్రశిరములు ప్రియదర్శ ♦ నాంచితములు
నైన నాగము లతిజవా ♦ ఢ్యములు ఖరము
లటు మహాధనములును రా ♦ జాత్మజుండొ
సంగె సంప్రీతితోడి ప్ర ♦ సక్తి నెఱయ. ౩౯౧

తే॥ వ్యాఘ్రవీర్యబలాన్వయ♦వ్యాప్తి గలిగి, యంతిపురి కాపుగొని యుండు♦నట్టివైన
మేలిదంష్ట్రాయుధముల న♦మ్మేనమామ, మేనయల్లున కిడెఁ దన♦మేను పొదల.

కానరా వేమొకో ♦ కల్యాణభూమిక, లుద్యానవనవిహా ♦ రోద్యమములు
పాడుకట్టెంబో వేమొ ♦ పురబాహిరస్థలీ, మహితోత్తమతురంగ ♦ మండలములు
చందనాగరుకర్పూర ♦ చర్చ లొరసి, ధూపధూమకలాసమ్మ ♦ ద్ధులం దనర్చి
మలయం దలపెట్టుకున్నాడు♦మలయపవనుం,డెట్టిదుర్ణయ మొదవెనో♦ యిన్నగరికి.

క॥ భేరీమృదంగవీణల, సారస్యం బెలయంజేయు ♦ శబ్దతతులపై
వైరాగ్యమె పొల్పడె నే, కారణమున నిప్పురంబు ♦ గతి మార్పడెనో. ౪౦౫

తే॥ శారికాకీరవితతుల ♦ చదువు లుడిగె
భ్రమరికాముఖగీతి సం ♦ భ్రమము లడంగెం
జంద్రకుల లాస్యములు హంస ♦ చంక్రమణము
లెడలె నెడసొచ్చి వెడలుట ♦ లెఱుకపడను. ౪౦౬

మ॥ అడవిం బోలంగ నున్న దిన్నగరి యు ♦ ద్యానంబులా శూన్యముల్
పడయంగాదు నరప్రచార మని యే ♦ భద్రార్థశబ్దాయితం
బడుగ న్వచ్చనె వల్గువాశితములు ♦ ద్యన్మార్గ సంచారముల్
గడచె న్మాశ్రితులు శోకపూరితములై ♦ కన్పట్టె నిప్పట్టునన్. ౪౦౭

క॥ నాకు నిమిత్తము లన్యము, లై కనుపట్టెడు విషణ్ణ ♦ మయ్యెనుం జిత్తం
బేకారణమో మోహం, బాకపడెడు నెదియొ వినంగ ♦ నయ్యెడు నింకన్.

ఆ॥ ఎవరి కేమిపొసంగె♦నేమో యనుచు గ్రస్త,హృదయగతుండు విలులి♦తేంద్రియుండు
నగుచుం జొచ్చెం బురము♦నప్పాటు లటు దల, పోసికొనుచు బిట్టు♦ గాసిపడుచు.

తే॥ వైజయంతం బనెడు సంజ్ఞ♦వఱలు నగరి,ద్వార మొలసి తత్రత్యులు♦త్థానవిజయ
శంసనములొనరింప సా♦శంకుం డయ్యు,వారిం బ్రత్యర్చలనయించు♦వల నెనయుచు.

క॥ లోంజని యిక్ష్వాకుముఖ, భ్రాజిష్ణుమహీమహేంద్ర ♦ పరిపాలిత య
ప్పూజితపురి యపిరాజిత, యాజతనకు నొగిలి సూతు ♦ నారసి పలికెన్. ౪౧౧

ఉ॥ ఆరయ మొప్ప నన్బిలువ ♦ నంపినవార్తయ తక్క నెద్ది యె
ట్లారయనేనియు న్మదికి ♦ నందదు శీలముపీడి భావ మే
కారణ మెన్నకే దొసంగు ♦ కల్పనల న్నెలకొల్పసాగె నె
వ్వారును రారు నన్నెనయ ♦ వచ్చె నటన్న సుమాళ మెచ్చంగన్. ౪౧౨

ఆ॥ మున్ను దొరలు పేరు♦,గన్నవా రెడసిన,యప్పు డిట్లె యుండె ♦ ననదయగుచు
నిది యనంగ వింటి♦నేమందు నానోటి, మాట యెదియు నోటి ♦ మాటయయ్యె.

మ॥ బలికర్మంబులు లేవు ధర్మ మని సం ♦ భావింపరా దధ్వర
మ్ములవార్త ల్గనుపట్ట వేశుభము లి ♦ మ్ముల్దోఁప వేమేలిగు
ర్తులుఁ జూపట్టవు మార్జనార్జవకల ♦ ల్దూరోజ్ఝిత త్రైకృత్త్కశో
భలు ద్వారాంగణభూము లీనగరి కే ♦ భంగంబు వాటిల్లెనో. ౪౧౪

క॥ వాకిళులు దీయ మూయం, గా కంగడు లుంచుటయును ♦ గానఁబడ కల
క్ష్మీశ్రీకములగు గృహముల గృహు, లే కనులకుఁ దోఁపకుండి ♦ రిది యేగతియో.

క॥ ఏవలనున నేనియు లే, వావసథములందు ధూప ♦ మటు దీపంబుల్
దేవాలయముల రథ్యల, నేవా రడుగిడఁ దలంప ♦ రెంతటిదోసఁగే ౪౧౬

క॥ సంతమస మెనసె నెల్లెడ, నంతస్స్వం బగుచు శోక ♦ మగపడుచుండెన్
జింతార్ణవము తెరలఁ బురి, కంతపుదశఁ గూర్చునట్టిఁ ♦ డౌ గతిఁ గవిసెన్.

తే॥ ధ్యానసంవిగ్నహృదయము♦ల్దీనములుగ,శైలిచెడి చైత్యములనుబ్రా♦సాదములను
బక్షులే యిట్లుగాజన♦పక్షహైన్య, మెంచి యూహించు నెడఁద కిం ♦ కేమిగలదు.

క॥ అని దీనమానసుండై, జనితవిషాదమునఁ జేరఁ ♦ జనె రాజగృహం
బనితర మింద్రసదననిభ, మనింద్ర మది నిరయ మట్టిఁ ♦ దై యుండంగన్. ౪౧౯

తే॥ అనధికృతమయి శూన్యమై ♦ యప్రియమయి
ధూళి బ్రుంగుడువడి తోఁడు ♦ తోఁడ దుఃఖ
పూరమున ముంచె నది వాఁడు ♦ సారమెడలి
కదిసె నట్టన దలవాంచి ♦ గతిదలంచి. ౪౨౦

ఆ॥ తండ్రినగరు సొచ్చి ♦ తతదుర్గతం బయి, పాలనంబు లేక ♦ పసువ మెడలి
యున్నదానిఁ గాంచి♦యూహించి తనతల్లి,సదన మెనసె ననుజ ♦సహితుఁడగుచు.

—♦ భరతుండు తల్లియున్నచక్కటి కరుగుట ♦—

క॥ ఆభరతుఁ బ్రోషితున్ సుతు, నాభగ్నోత్సాహుఁ గాంచి ♦ నంతఁ గయిక ర
త్నాభాంచిత మాసనము స, లోభ మెడంబ్రోచి యెగసి♦లోఁగొనెడు నెడన్.

తే॥ శ్రీరహితమైన నగరున ♦ చెట్టలెంచి
యును జననిపో యటంచు న ♦ య్యార్జితుండు
పాదములచక్కిఁ బడి మ్రొక్కి ♦ ప్రశ్రయమ్ము
సాశ్రయము నాగ నెగడున ♦ య్యాద నెటెంగి. ౪౨౩

చ॥ తనయుని గ్రుచ్చియెత్తి త్వరి ♦ తంబుగ నంకముసేర్చి శీర్షమున్
గొనకొని మూర్కొనంగ నయి ♦ కోర్కులు దార్కొని యిర్కటంబునన్

జెనఁగొన వాని మోముపయిఁ ♦ బ్రేముడిచూడ్కి నిగిడ్చి స్వీయ మ
య్యనయముపంకఁ బోని మది ♦ నల్లరిఁ గల్లరి సేసి యిట్లనున్. ౪౨౪

—♦ కైక కొడుకుతో నెల్లర సేమముం గూర్చి ముచ్చటించుట ♦—

తే॥ ఎన్నినాళ్లయ్యెఁ దండ్రి య ♦ య్యిష్టబంధు
పురము వీడి పయన మయి ♦ పొలుపు దక్కి
తెంతయుఁ బథశ్రమంబున ♦ నెల్లవారుఁ
గుశలులే కద నాపైనిఁ ♦ గూర్మి గలరె. ౪౨౫

క॥ మాతామహమాతులముఖు, లాతతసుఖులై చరింతు ♦ రయ్యా ధృతిఁ బ్ర
ఖ్యాత మొనరించు మంతయు, నీతలఁ పలరార నిచ్చ ♦ నెగడిరె మెలఁగన్.

ఆ॥ అనిన భరతుఁ డనియె♦నమ్మరో; యేడునా, ళ్లయ్యె నచటు వీడి♦యరుగు దెంచి
యందఱును సుఖాత్ము♦లై యున్నవా రెందుఁ, గొదవ లనుచుఁ బేసు♦కొనఁగ లేవు.

క॥ బలకనకరత్నపరికర, ములుఁ బరిజనములు మదర్థ ♦ ముగ నిడినవి పె
క్కులు గల వధ్వశ్రాంతి మ, సలె నెల్లియొ నేఁడొ చక్కి ♦ చక్కం బెరయున్.

ఆ॥ ఏను రాజసచివు♦లేర్తెఱఁ ద్వర పెట్టఁ, దఱిమి నడిచి యిచటు♦దఱియఁ గాంచి
నాడ నాతలంపు♦నం బొంగు నుద్వేగ, ముచ్చిపోవఁ బలుకు♦మొంటఁ జనక. ౪౨౯

మ॥ శయనీయం బిటు శూన్య మయ్యెఁ బురి నే ♦ సన్మార్గముం దోఁప దే
నయముం జొప్పడఁబోవ దంతిపురి స ♦ న్నాహాంబు సన్నాహమై
ప్రియముం బాసినయట్టిదైనది గుణ ♦ ప్రీతుండు ధర్మిష్ఠుఁ డా
దయమానాత్మకుఁ డేడి తండ్రిగొలువం ♦ దాత్పర్య మొప్పారెడిన్. ౪౩౦

తే॥ కోసలునికన్నె మాయమ్మ♦కొలుచుచుండ, నచట నుండెనొ యేవెంట♦నరిగెనో వ
చింపు మిత్తఱిఁ జిత్తంబు♦సిరి దలంగ, నుత్తలపడంగ దరి దారి♦యొదవ దనిన.

—♦ కైక దశరథుని వృత్తాంతంబు కొడుకున కెఱింగించుట ♦—

క॥ తనమే లెంచినయదెకా, ననయం బిదె యనక యప్రి ♦ యమె ప్రియ మనుచున్
వినిపింపఁ దొడరె నడ పెడు, ననంతరపు గతికి దేని ♦ ననువు పఱచెనో. ౪౩౨

తే॥ యాయజూకుండు తేజస్వి♦యాయశోధ, నుండు మహితుండు ధర్మలో♦లుం డతండు
నీదుజనకుండు సకలభూ♦నేత భూత, వితతి కెది గతి యచ్చోటు♦వెలయఁ జనియె.

క॥ అను నుడి పిడుగు నడపడిం, గొని వడిఁబఱతెంచి నెఱియఁ♦గూలె నతఁడు నె
మ్మన మదరి చెదరి పొనుపడ, ననుపదమే హా హతోఽస్మి♦యనుచుం బెలుచన్.

తే॥ ఎట్టకేలకు జీవితం ♦ బెనసి మొనసి, నట్టి పితృమృతిజనితశో ♦ కాంధకూప
మున మునుంగుచు నిట్లనె ♦ మోసపోయి, నాఁడ నాటాడ నొండెడ ♦ ననుచు జాడ.

తే॥ మున్ను జలదాంతమున శశి ♦ మొనయు రాత్రి యందు శోభాకరంబగు ♦ నంబరంబు
భాతి నలువొందు నీసెజ్జ ♦ పాడువడుట, కుమ్మలిక మేల జనియింప ♦ దో యెఱుంగ.

ఆ॥ నీకు వట్టిపోవ ♦ నెరిని మున్నె రట్టిఁ, డయ్యె నియ్యనాథ ♦ మైన నగరు
నన్నుగన్నతండ్రి ♦ నానేత నాగురుం, డతఁడు నాకుఁ గాక ♦ యరుగుటయును.

క॥ అని కనుల నీరెడల్చుచు, వనజాతాక్షుండు వాఁడు ♦ వదనము వస్త్రాం
బునఁ గప్పుకొనుచు విలపిం, చె నీరెలుం గడరఁ బడలి ♦ చేడ్పడు మదితోన్.

శా॥ లీలామానవమూర్తి దేవనిభుఁ డా ♦ లిప్తుండుగా నయ్యెడన్
సాలస్కంధముఁ బోల నేలఁబడి ప్ర ♦ చ్ఛన్నాస్యుఁడై చంద్రుఁ డి
ట్లాలోలత్వముఁ గాంచెనో తెరఁ బ్రెనో ♦ యాహేళి యాయగ్నికీ
జ్వాలం బేర్పడెనో యనంగ నయి యో ♦ జం బాసి శోకించుచున్. ౨౩౯

తే॥ మత్తమాతంగ మట్టిఁ డ ♦ మ్మనుకులుండు, పుట్టిమునిఁగిన తెట్టునఁ ♦ బొరలఁ బట్టి
యెత్తియిటునీకుఁజనునె మ ♦ హీంద్రుదవలనఁ,బుట్టి యిమ్మాత్రకేయనుంగు ♦ పట్టితెరల.

తే॥ నిన్నుబోఁటులు శోకంబు ♦ నెలవులే స, దస్యసమ్మతుఁడవు సత్ప్ర ♦ ధానుఁడవు స
దానయజ్ఞ శ్రుతితపోని ♦ దానశీల, యర్కప్రభఁబోని నీమతి ♦ యలఁతిపడునె.

—♦ భరతుం డారాటంబున నెల్లవృత్తాంతంబునుఁ దల్లి నడిగి తెలిసికొనుట ♦—

క॥ అని యాపె ప్రబోధించిన, విని వినవిధంబు దోఁప ♦ విశ్వజనీనుం
డను శోకపరిప్లుతుఁడై, యనుపద మెదఁబొడము వృత్తు ♦ లాఱడిపెట్టన్. ౨౪౨

ఉ॥ జన్నము సేయ నెంచెనొ ప్ర ♦ జల్వొగడన్ రఘురాము రాజపీ
ఠి న్నెఱయింపఁ జూచెనొ దృ ♦ ఢీకృతచిత్తుఁడు వేగఁ దోడితెం
డన్న విధం బొకొం డనెడు ♦ నాధృతిమై నరుదెంచినాఁడ ని
ట్లన్నయ మెల్ల వీడఁ జర ♦ మార్తి బయల్పడు నన్నుఁ గానమిన్. ౨౪౩

తే॥ అంబ యెది మూల మయ్యె మా ♦ యయ్య మేనిఁ
బాసి చన నాధియా వ్యాధి ♦ యా సమస్త
మెఱుక సేయుము రామాదు ♦ లే కృతార్థు
లమ్మహాత్మ్ముని సంస్కృతి ♦ కనుపుపడుట. ౨౪౪

ఆ॥ నన్నెఱుంగఁ డిపుడు ♦ నాతండ్రి కీర్తిమం, తుఁడు మహాప్రభుండు ♦ దొరయునంత
శిరము మూర్కొనంగ ♦ జేసాఁచి కౌఁగిలిం, పంగ నాఁచికొనఁగఁ ♦ బదరు నతఁడు.

క॥ ఏమయ్యెనో దయామయహర, మా మెయికర మిపుడు ధూళి♦యంటె ననుచు ము
న్నామేని నిమిరి కడుగా, రాముని లాలించు నెది క ♦ రం బుజ్జ్వలమై. ౨౪౬

ఆ॥ అన్న తండ్రి దాత ♦ యధినేత బాంధవుం, డార్యుఁ డాత్మనిష్ఠుఁ ♦ డంచితుండు
రామచంద్రుఁ డామ ♦ హామతిశాలి యెం, దున్నవాఁడొ యిప్పు ♦ డెఱుకపడదు.

ఆ॥ దైవ మనఁగ నతఁడె ♦ తానకం బతఁడె నా, కెల్లవారలకు న ♦ధీశుఁ డతఁడె
విన్నవాఁడె మా న ♦ వేగాగమనవృత్త, మెఱుకసేయరొక్కొ ♦ యింతవట్టు.

క॥ ఏ నతని దాసుఁడను నా, కానాథుఁడె తండ్రి జ్యేష్ఠుఁ ♦ డౌకతనఁ బదా
బ్జానత్రముఁడనై యమ్మెయి, మానుగఁ బూజింతుఁ దెలుపు ♦ మా జనయిత్రీ.

ఆ॥ ధర్మవేత్త నిత్య♦ధర్మండు సత్యసం, ధుఁడు దృఢవ్రతుం డ ♦ దుష్టసత్య
విక్రముండు తండ్రి ♦ వెరవుమై నేమంచు, జరిపెఁ జరమ మైన ♦ శాసనంబు.

క॥ అది వినవలె నొడువుము మది, గుదురదు రామునకు నన్ను ♦ గూర్చి తెలిపెనే
యది ప్రోషితుల న్నము నె, మ్మది నిడక తలంగుమాట ♦ మహితున కగునే.

తే॥ అనిన రామా ; యటంచు సీ ♦ తా ; యటంచు
లక్ష్మణా ; యటంచుఁ జనియె నా ♦ లబ్ధవర్ణుఁ
డుత్తమ యనంగ నగుగతి ♦ కొండు దలఁపఁ
డతఁడు పాశాహ్వతం బగు ♦ హా స్తిహోత్ర. ౨౫౧

క॥ సిద్ధార్థులు కందురు సం, సిద్ధుల నవ్వారిఁ బురికిఁ ♦ జేరిననాఁ డా
బద్ధుఁడ నా కదిలే దని, యద్ధార్మికుఁ డమరనగరి ♦ కరిగెను వత్సా. ౨౫౩

క॥ అనుడు ద్వితీయాప్రియశం, సన మిదియని వెల్లఁబోయి ♦ సన్మహితుఁడు వాఁ
డనె నమ్ముత్రివ్వరు సన్నిధి, ననుపొందరె యెందు నిలువ ♦ నై రేకతనన్. ౨౫౪

ఆ॥ అనినఁ జీరవసనుఁ ♦ డై దండకాటవి, నుండఁబోయె రాముఁ ♦ డువిదతోడ
నండ యగుచు నరిగె♦ననుజుం డతనికొల్వు, ననుచు మానసంబు♦నయము సూప.

మ॥ అన నాశంక కడంకతోడ మదిఁ బె ♦ ల్లారాట మాటాడ నే
మని రాము న్వెడలించి రేజనులహా ♦ త్య ల్సేసె నేవిప్రు ని
ర్ధనునింగాఁ బొనరించె నేమహితులన్ ♦ దర్పంబునం దిట్టె నె
వ్వని దార న్హరియించె నో వ్వెసయకే ♦ వా దోపిరే మోపఁగన్. ౨౫౬

క॥ ఊరకె యన నేమయ్యెన, సారంబగు పలుకు చెల్లఁ ♦ జనునె యతనిదా
నేరమొ తమనేరమియో, ధీరు లరసిరేమొ తెలుపు ♦ తెల్లముగ ననన్. ౨౫౭

ఉ॥ మంచి యటంచు నెంచె నవ ♦ మాన మెఱుంగదు మూఢచిత్త య
భ్యంచితుఁ డాతఁ డిప్పనుల ♦ యం దొకఁడేనియు నాచరింపఁ డే
వంచనకుం గడంగఁ డొక ♦ వాదు ఘటిల్లదు నీకుఁగాఁగ నా
యెంచినకర్జ మిట్లు ఫలి ♦ యించె నివారితవారణంబుగన్. ౭౫౮

క॥ అని వెండియు నిట్లనెఁ దలఁ, కనిదై కని దైవ మట్లు ♦ గరకరి నెరపన్
తనచావున కగుమం దన, కనదతనము తన్ను బొదివి ♦ యాటాడింపన్. ౭౫౯

—♦ కైక రాముని వనవాసనిమిత్తంబు భరతున కెఱింగించుట ♦—

ఆ॥ రాజు రాము యావ ♦ రాజ్యాభిషిక్తుఁ జే, యం దలంపఁ దొల్లి ♦ యర్థి నొసఁగి
నట్టి వరము లెంచి ♦ యాచించితిని నీదు, శ్రీసమృద్ధి తద్వి ♦ వాసనంబు. ౭౬౦

తే॥ సత్యసంధుండు తనదగు ♦ సంగరము దొ, అంగనేరక రాముఁ ద ♦ లంగఁ జూచె
మెలఁత పతితోడ నరిగె సౌ♦మిత్రి యన్నఁ, బాసినిల్వఁ డమ్ముత్వు ర♦ప్పాటఁజనిరి.

క॥ రెండవవరమునకై నిను, మండలపతిఁ జేసెఁ దదభి ♦ మాని విభుఁడు రా
ముండు చన గండడఁగి దివి, నుండఁ దలఁచి యేగె నిచ ట♦యోగ్యం బనుచున్.

ఉ॥ నీ వఖిలార్థము లుస్కృత ♦ నిష్ఠమెయి న్బరఁగింప నేర్తు వం
చీవగ నాపొనర్చినది ♦ యెల్ల ఫలింపఁగఁ బ్రాజ్యరాజ్యమున్
ద్రోవక పూని ప్రోవు మెదఁ ♦ దొట్రిలఁ బోకుము పారలౌకికం
బౌవిధిఁ దండ్రికి న్నెరపు ♦ మంచితులౌ ద్విజు లొనరన్ ధృతిన్. ౭౬౩

ఆ॥ ఆవసిష్ఠముఖ్యు ♦ లారాము రాజ్యంబు, కన్న మేలు భరతు ♦ కలిమి యనుచు
నిన్ను రాజపీఠి ♦ నిలిపి కృతాభిషే, కుం బొనర్ప నేర్పు ♦ గొని మెలఁగుము.

—♦ భరతుఁడు కైకను నిందించుచు నాక్రోశించుట ♦—

క॥ అని విస్పష్టముగా నొడి, విన దుఃఖమ నూత్ముఁ డగుచు ♦ విని విసిపాతం
బున కిట్లు మూల మిదె యు, య్యో నయ్యయోయనుచుఁ దాప♦మేపఱఁజేయన్.

ఆ॥ ఆపెతోడఁ బలికెఁ ♦ బాపాత్మురాల నా, కేల పుడమి బ్రదుకు ♦ కేమిటికి మ
హాత్ము గురు వధింప♦నన్నుఁ దత్సుతు నంప, వచ్చినాడఁ బనులు ♦ వలని కెక్కె.

క॥ రాముని వని కనిచి మనో, రాముని దివి సేరఁ బనిచి ♦ రాజ్య మరయు మం
చేమని పలికెదు వ్రణమున, దీమసమున నుప్పు పెట్టి ♦ తెరలించెదవే. ౭౬౭

క॥ నోరాడె నెట్లొ భర్తను, బోరి మడఁప సుతునిఁ పనుపఁ ♦ బూనిన జతనన్
నేరవొ యిట్లన నమ్మెయి, ఘోరం బెడచ నెనొ యిపుడు ♦ కూళవు గావో. ౭౬౮

ఆ॥ కాళరాత్రి యిది జ♦గంబు ముంప జనించె, నిప్పుప్రోవు గూర్మి♦నెఱయఁ గొంటి
నని తలంపఁజాలవఁ ♦ డక్కటా మాతండ్రి, మోసపోయె నేల ♦ మొదలు దలఁప.

క॥ అత్యయ మొనగూర్చితి వా, సత్యమతికిఁ బతికి నేను ♦ చన నెన్నడు న
ప్రత్యయము గొంటివేమొ యు, పత్యము గంటి నని మగని ♦ పా టెంచెదవే.

తే॥ అనఘుఁ డాసత్యనిధి యమ్మ♦హాయశుండు, తీవ్రశోకాభితప్తుఁడై ♦ తెరలి యెట్టు
లణఁచెనో కదె నిను గొన్న♦యట్టి కర్మ, మునను ధర్మము డిగనాడి♦ముట్ట మునిఁగి.

క॥ నీ వాడుపుట్టు వెనసితి, వివిధమున భర్తృనాశ ♦ మెంచితి వింకన్
గావలమున నినుఁ బోలం, గా వలతురొ మగలఁ జంపఁ ♦ గామిను లిలలోన్.

ఆ॥ నిన్ను బుట్టు మనియె ♦ నీపొట్టలోఁ బుట్టఁ, బనిచె నన్ను విధి వి ♦ పాక మెంచి
పొట్టఁబెట్టికొంటి ♦ పురుషాదినివ కాఁగఁ, బుణ్యుఁబురుషుఁ బుత్రుఁ ♦ బోవనడఁచి.

క॥ న న్నేమిసేయ నెంచెదొ, ము న్నింత లొనర్తు ననుచు ♦ ముట్టించితివే
మన్నన సెడఁబాఱిన యా, సన్నన సన్నద్ధ వగుచుఁ ♦ జన కుండెదవే. ౪౭౪

శా॥ రాజు న్వేఁడిన రాజ్యలుబ్ధ వగుచున్ ♦ రారాపు గావింప నా
యోజం బుణ్యచరిత్రుఁ బుత్రు వనమం ♦ దుద్వృత్తిఁ ద్రోయింప నే
బీజం బుద్భవ మొందె నీమది విషో ♦ ద్భేదం బదే చాలె ని
న్నీజన్మాంధతఁ ద్రోయఁ దొంటిధృతి మా ♦ యింపం గులధ్వంసినీ. ౪౭౫

ఆ॥ నీవు నెలవుసొచ్చి ♦ నెగడిన యది మొద, లాసుమిత్ర కోస ♦ లాత్మజయును
బీడ లొంది రిపుడుఁ ♦ బీడింపఁబడుచుండి, రడరు పుత్రశోక ♦ మందఁగాంచి.

చ॥ నిను భగిని న్వలెం గను వి ♦ నీత యశస్విని జ్యేష్ఠమాత య
ట్లనుసృతవృత్తిఁ దత్సుతుఁ డ ♦ హంకృతిదూరుఁడు తల్లిఁబోలఁగా
ననవరతంబుఁ గొల్చు ఫల ♦ మందఁగఁ జేసితి వీవు కాననం
బున వసియింపఁగా ననిచి ♦ పుట్టితి పాపముతోడ దుష్కృతీ. ౪౭౭

తే॥ పాడుపొట్ట కిమ్మెయి పట్టు ♦ పట్టినావు, ప్రాణవిభు మిత్తిపా ల్సేసి ♦ పనిచినావు
చీర లిడి జ్యేష్ఠు సుతు వనిఁ♦జేర్చినావు, పాప మనినను నీకింక ♦ భయము గలదె.

మ॥ చిరకాలంబు భరించె రాజ్యము మహా ♦ శ్రీమంతుఁ డాధర్మస
త్పరతుం డాశ్రితవత్సలుండు సబలుం ♦ డాయింద్రుఁడే మేదినీ
భరము న్మోవఁగఁజాలు నంచు స్వకమా ♦ భాగ్యోదయం బెంచి రా
ము రఘూత్తమునిన్ గోరె నొం డహా మన ♦ న్మోహంబ కా కన్యమే. ౪౭౮

క॥ మేరువు మేరువనము బలె, సారయశుం డతని వీడి ♦ చనె నొడయం డి
ష్టాగామలక్ష్మణులు సము, దారులు వని నుండ నాకు ♦ దరియుం గలదే. ౪౮౦

క॥ ఆభగవంతుఁడు రాముని, డా భారం జే వహింప ♦ నౌదునె దమ్ముం
జేభాతి మహాధుర్యధు, రాభుగ్నము గాక నెఱసి ♦ రహిఁగనఁ గాంచున్. ౪౮౧

ఉ॥ ఉండున కాక శక్తి మహి ♦ మోజ్జ్వలుఁ డాతనికొల్వు గోరి యే
నుండెదఁ గాని నీవలచు ♦ నుత్పథముం గొనఁబోవ భూమిపై
నుండెదొ పోయెదో యిపుడె ♦ యూరు దలంగఁగఁ బుత్త్రు నన్ను రా
ముండు దయాబ్ధి యేమనునొ ♦ మోసమొకో యని మిన్నకుండితిన్. ౪౮౨

ఉ॥ ఎట్టులు దోఁచె నీదుమది ♦ కెవ్వరు చెప్పిరి పాపకర్మ మి
ట్లుట్టిపడంగఁ బూన్పుల గు ♦ ణోజ్జ్వలవృత్తులు పేటిపోవ నీ
పుట్టినయింగ భ్రష్ట వయి ♦ పూజ్యులు దిట్టఁ బరం బిహంబు నా
కిప్టు చెడంగనౌ సుగతి ♦ కైతవి నీతి దొఱంగి దుర్మతీ. ౪౮౩

క॥ జ్యేష్ఠుఁడు రాజ్య మొనర్పఁ గ, నిష్ఠు లతనిఁ గొల్వఁ గ్రీరి ♦ నెగడొందు గుణ
శ్రేష్ఠం బీరవికుల మప, నిష్ఠం బనవయ్యె నీయ ♦ నీతి కతమునన్. ౪౮౪

ఉ॥ చొచ్చితి వీవు పాపగతి ♦ చొప్పున నిట్టికొలంబునందు నీ
యిచ్చకు వచ్చినట్లు ఘటి ♦ యించితి వెల్లదురర్థ్యగార్థముల్
పొచ్చములేని రాచతిక ♦ పుం గరువం బెఱుఁగంగనైన యా
పుచ్చుట నీదు మోమెనయ ♦ మున్ను విధాత లిఖింప కుండుటన్. ౪౮౫

తే॥ నీకొలము మంచి చెడ నవి ♦ నీత నైతి, గాని నీపాపనిశ్చయ ♦ గతి మెలంగ
జీవితాంతకరం బది ♦ చేటుఁఱుంగు, నాఁడు గొనఁబోఁవఁ డీనేర్మి ♦ వలనుపడదు.

క॥ ఆసవితృవంశభూషణు, దాసుఁడ నై కొలుతుఁ దెత్తు ♦ దద్దయుఁబ్రీతిన్
భాసిల్లుదు నీమొగమున, వ్రాసినవ్రాత యది యేను ♦ వాసి చెడుదునే. ౪౮౭

క॥ అని ముట్టనాడి నెట్టన, దనికెడు రోసమున విమువు ♦ దవులని చిత్తం
బునవంకఁ బొనరి గర్జిం, చెను గిరికందరమ్మృగేంద్రుఁ ♦ జెనయఁగ నగుచున్.

సీ॥ రాజ్యయోగమున క♦ర్మప్రవగావు కైకేయి, దుష్టచారిణి యిల్లు♦దొలఁగు మింక
సద్ధర్మ మున్నె నృ ♦ శంసురాలా; నీకుఁ, గులవినాశము గూర్చి♦కొంటి గదవె
యీభూరిణహత్య ని ♦ న్నేనాఁడు పీడదు, పతిలోకగతి కద్దె ♦ పాపమతికి
నిప్పుడు చర్చింతు ♦ వే చన్నవారికై, యున్నవారల కేడ్పు ♦ టుత్తమంబు

భర్తఁ జంపి తడవి ♦ పా లొనర్చితి మహా, మహు సుపుత్రు నాదు ♦ మానసమునఁ
జిచ్చుపెట్టి తేమి ♦ సేయవు నిను గన్న, వారి ధాతఁ దిట్ట ♦ వలదె యెఱిఁగి.

తే॥ మాతృరూపవై యిమ్మెయి ♦ మలసినావు
మిత్త్రివో కృత్త్రివో నాదు ♦ మే ల్దలంతె
రాజ్యకాంక్షఁ బతిఘ్నివై ♦ రాజినావు
మంటెదవ యింక ననుఁ గూడ ♦ మడఁపఁ దొడరి. ౪౯౦

క॥ దోషము వచ్చును నిను గని, భాషించిన నెట్లొ మాటు ♦ పడు మెందైనన్
రోష ముడిగి సాధ్వులు సం, తోషింపఁగఁ గొలిచి మనుము♦దుర్గతి దలఁగన్.

క॥ కులదూషణి నీకృతిఁ గో, సలుకన్నె సుమిత్రి యొద్ద ♦ జనయిత్రులు నే
వలనున వెతలకుఁ బాల్పడ, రలఁతిగఁ బోనిచ్చి తెన్నఁ ♦ డనుస్మృతి వెలయన్.

ఆ॥ అశ్వపతికిఁ బుట్టి♦తనరాదు నిన్ను ధీ, మద్వరుండు ధర్మ ♦ మహితుఁ డతఁడు
చెడుగుజాతి రక్క♦సివి తల్లిపే రెంచఁ, బొడమినావు కొలము ♦ పొడ వడంప.

ఉ॥ పాపితి కన్నతండ్రి నటు ♦ భ్రాతృవియుక్తినిఁ జేసి తీతఁ డా
పాప సుతుం డనంగ నగు ♦ బాటు ఘటించితి కీర్తిమాసె నే
యాపద లందఁబోవ నిఁక ♦ నందఱుఁ దిట్టఁగఁ బూవులమ్మి యా
తేపకుఁ గట్టియ ల్వీలుచు ♦ దేవె నొనర్చితి వింత చాలదే. ౪౯౧

తే॥ దోస మెఱుఁగని కోసలు ♦ దుహిత ధర్మ, యుక్త నింతలు సేసితి ♦ వొక్క నాఁటి
కేనియును నీదుకిల్బిషం ♦ బెడసిచనదు, పుణ్యలోకంబు తెరువునఁ ♦ బోక లేదు.

క॥ అరయవు రాము మహిమ నే, వెరవరి ననుకొంటి విట్టి ♦ వీగతి విట్ల
వ్వరదుఁ బితృసముఁ గెడపి తృత్పరుఁ బరు నొనరించి తది వి♦పాకముఁ బెరసెన్.

తే॥ అంగమునను ప్రత్యంగము ♦ నందు హృదయ
మందు భవ మొందు పుత్రుని ♦ యందుఁ గూర్మి
యెక్కుడు సవిత్రి కనుచు నీ ♦ కెఱుకయున్నఁ
దక్కొరుల బాంధవం బల్లె ♦ తలఁప వలదె. ౪౯౨

— ♦ ఇంద్ర సురభి సంవాదము ♦ —

మ॥ ఒకనాఁ డూర్జితభావవై భవమహో ♦ ద్యోగాఢ్య సద్ధర్మము
ర్మకలాభిజ్ఞ సురార్చ్య యా సురభి భా ♦ మంబు ల్మహాభారవా
హాకృశంబు ల్దివసార్థభాగగతసూ ♦ ర్యాభీశుసంవిగ్నముల్
ప్రకటాఘంబులు నైన యర్భకములం ♦ బాటించి నిర్భగ్నమై. ౪౯౩

క॥ కన్నుల నీరొలుకఁగ మా, యన్నలు గీడ్పడిరె యింత ♦ లని నేలదెసం
దిన్నఁగఁ గనునెడ శక్రుం, డన్నెలవున నడుగుచుండె ♦ నధిగతకృతియై. ౨౯౯

తే॥ అటు లధస్తలమునఁ జను ♦ నతని మేన
బాష్పములు జారిపడ నుల్కి ♦ పడుచు సురభి
లంబు లివి యెచ్చటివొ యని ♦ యంబరమున
దృష్టి నిగుడించి యాకామ ♦ ఘృష్టిఁ గాంచి. ౩౦౦

క॥ దీనయు భృశదుఃఖితయును, గా నగు నద్దేవి తెఱఁగు ♦ గని త్రిదశేంద్రుం
డానతుఁ డుద్విగ్నుఁడునై, తో నిట్లని పలికెఁ బలుకు ♦ దొట్రిలుచుండన్.

ఉ॥ మాన్యవు దేవి యెల్లరకు ♦ మంచి దలంతు సుధన్య వాత్మవా
దాన్యక మన్యదుర్లభము ♦ తద్దయు ధర్మవె నీవుమూర్తి సౌ
జన్యము సత్తపఃఫలము ♦ సారము తావకమౌ యశమ్ము మూ
ర్ధన్యము నేఁటి కిట్లు పరి ♦ తాపము నొందుచుఁ గుంద నేటికిన్. ౩౦౨

ఆ॥ ఒడువలని భయము ♦ నొంద మే మింతకు, నొరుగుతరుగు లేక ♦ యున్నవార
మేమి తలఁచి తల్లి ♦ యిట్లు శోకించెదు, తెలియఁజేయు మెల్ల ♦ తేటపడఁగ.

క॥ అన విని శాంతము పాపం, బనుమానింపకుము మేల ♦ యందఱకును నా
తనువునఁ బొడమిన బిడ్డల, యనుపమదుఃఖమున నిట్టు ♦ లైతిని దేవా. ౩౦౪

ఉ॥ వేడివెలుంగురశ్మిఁబడి ♦ వేఁగుచు దీనములై కృశింపుచున్
బీడల కోడి నట్టి నిరు ♦ పేదలఁ గట్టి కృషీవలుండు పైఁ
జూడఁడు చూడు మల్లవిగో ♦ చూచి సహింపఁగ నేర్తు నెట్టు లీ
జాడకుఁ గన్నతల్లి నిలఁ ♦ జాలునె పుత్రునిఁ బోల నుండునే. ౩౦౫

ఆ॥ అనిన నామె పలుకు ♦ లాలించి సురనాథుఁ, డర్థి బల మొసంగు ♦ నట్టి తృణము
లొదవఁజేయు వృష్టి ♦ నూహించి కురియించెఁ, గాన్పువలని పేర్మిఁ ♦ గని గణించె.

ఉ॥ వేలకొలందిబిడ్డ లతి ♦ వేలగుణాఢ్య సుశీలనిత్య శ్రీ
లాలిత లోకధారణ ♦ విలాసవిచక్షణ కామధేను వ
ట్లాలపనం బొనర్చి తన ♦ యార్తిఁ బ్రవర్తిలఁ జేసి కుందె నిం
కేలలన ల్సహింపఁ గల ♦ రీఁగఁగరాని యపత్యదుస్థితిన్. ౩౦౭

ఆ॥ ఏకపుత్రి లోక ♦ హితకామ్య సాధ్వి కౌ, సలునికన్నె రాము ♦ సద్గుణాభి
రాము నిజతనూజు ♦ నీమెయి నెడఁబాసి, తెరలి కుందుదెసకుఁ ♦ దెచ్చి తిపుడు.

తే॥ నీవు బ్రదికిన మడిసిన ♦ నీచగతిక, వత్తు వెందును మే లొందు ♦ వలను లేదు
కీర్తి గొందుఁ బితృభ్రాతృ ♦ ఖేద ముడుపఁ, జాలు జతనంబు మదినెంచి ♦ సంతరించి.

చ॥ అడవికిఁ బోయి రాముఁ గని ♦ యంఘ్రులపైఁబడి యొత్తి వేఁడి నా
బడలిక ద్రిజ నాతఁ డను ♦ భావపక్తుఁడు గారవింప నీ
వెడఁగుతనంబు దెల్పి ముని ♦ వేసమునం జరియింప నేన నై
పుడమికి భర్తగా నతనిఁ ♦ బూన్చెదఁ బంకము నిస్తరించెదన్. ౫౧౦

ఆ॥ అడలుపౌరజనుల ♦ యాపద ల్గననేర, నీదునేరమునను ♦ నిరయగతికిఁ
బోవనేర నీకు ♦ బున్నె మా నను వీడి, యరుగు మెచట నైన ♦ నదరిపడుము.

క॥ అగ్గిం జొరఁబడి కాలుము, బొగ్గై పడు మడవిసొచ్చి ♦ పొలియుము మెడకున్
బగ్గము దవిలించి కడుం, బగ్గె నెఱపు మెట్టులేనిఁ ♦ బ్రాణము లెడలన్, ౫౧౧-౨

క॥ నానేరని తెఱ వారసి, యానేరిమికాఁడు మరలి ♦ యరుదేరఁ గృతి
త్వానూనగతి మనద లే, దా నేనుం దెరలి యుసుఱు ♦ దద్దయుఁ బుత్తున్.

—♦ భరతుఁడు తన్నరయవచ్చినవారితో స్వకనిరపరాధం బుగ్గడించుట ♦—

చ॥ అని తెగనాడి మోడికొని ♦ యంకుశచోదితమై కడంగు న
వ్వనగజ మట్టు లేటుపడి ♦ వారక యార్పెడలించు పన్నగం
బును బలె వీఁకమై నడరు ♦ పొల్పున సింగముపోల్కిఁ దన్ను దా
గనుఁగొననీని యల్కమెయిఁ ♦ గన్నుల నిప్పులు రాలుచుండఁగన్. ౫౧౪

క॥ అంబరము జాఱ నాభర, ణంబులు సడలంగ సద్దు ♦ ణంబుల దెస నే
రంబులె వెదకుచుఁ బదరుచు, నంబుధిసడిఁ బెచ్చుపెరిఁగి ♦ యవనిం బొరలెన్.

క॥ తాపపరితాపములు బి, ట్టేపునఁ ద న్నొంచుచుండ నన్య ♦ మెఱుఁగని గతికై
కోపుచెడియున్న తల్లిం, జూపోపక చూచి తిట్టు ♦ చుం జేడ్పడుచున్. ౫౧౬

తే॥ తనయమాత్యులు నేరఁ ద ♦ ద్దయునుఁ బలికె
వార లెల్లరు విన వంశ ♦ పావనుండు
తలఁపునం దున్న యంతలుఁ ♦ దథ్య మగుచు
వేదమునఁ గొన్న ప్రామాణ్య ♦ విధి గుణింప. ౫౧౭

ఉ॥ కోరను రాజ్య మెద్దియును ♦ గూర్చి వచింపను దల్లితోడఁ క్షో
ణీరమణుండు మేల్విధి గ ♦ ణించినవార్త యెఱుంగ నింతయున్
శ్రీరఘురాము సద్గుణవి ♦ శిష్టునిఁ గానల నుండఁబంచు నీ
నేరముఁగానఁ గానని య ♦ నీతి ఘటిల్లెఁ బురాకృతంబునన్. ౫౧౮

తే॥ తనదుమాతామహుని♦జూడఁ దమ్ముఁ డట్టి, తోడఁ జనఁగంటి నమ్మోయి♦జాడ దూర
దేశమున కొం డెఱుంగని ♦ తెరువుపట్టి, వంశమున లేని యపకీర్తి ♦ వచ్చిపడియె.

ఆ॥ అమ్మహాత్ముఁ డట్టు ♦ లరుగు నంతలుగాఁగఁ, దోడ నేగువారి ♦ దోస మున్నె
తలఁపుఁ బాయకుండఁ♦దరుణి సాధ్వీమణి, తమ్ముఁ డన్నమాటఁ ♦ దప్పఁ డెపుడు.

—♦ భరతురాక నడిగని కౌసల్యరా నెంచ నాతం డాయమ సన్నిధి కరుగుట ♦—

క॥ అని యాక్రోశించెడు న, మ్మనుకులభూషణము భరతు ♦ మాట విని సుమి
త్రను గని కోసలసుత యి, ట్లనె మనమున నెంచి మించు ♦ న య్యాదృతితోన్.

ఆ॥ క్రూరకార్యకైక♦కొడుకు కదె యరుదెంచె, దీర్ఘదర్శి యొంచు♦ తెరువు గొనెడు
వాఁడు గాఁడు వాని ♦ వలను గన్గొన నంద, పోవుదాన నదియె ♦ బుద్ధి యనుచు.

క॥ అని మలిన కృశ వివర్ణయు, ననదయు నై తెలివి సెడిన ♦ యద్దేవి వడం
కెనయఁ జన నెంచు న త్తఱి, ననఘుం డనుజన్ముతోడ ♦ నయ్యెడ కరిగెన్. ౨౨౮

క॥ అన్నయుఁ దమ్ముఁడుఁ గోసలు, కన్నం గనినంత నడరు ♦ గదుర దొరసి యా
పన్నులు సన్నసెడి పడిన, యన్నయవతిఁ బొదివికొనుచు ♦ నడలిరి పెలుచన్.

ఆ॥ తెప్పిఱిల్లి వారిఁ ♦ దేఁకువమైఁ గాంచి, యవల భరతుతోడ ♦ ననియె నట్లు
వృద్ధికామునకుఁ బ్ర♦వృద్ధిఁ గూర్పఁగఁ జాలెఁ, దల్లితలఁపు మెచ్చఁ♦దగున కాదె.

శా॥ క్రూరారంభ మొకండె కూర్చనెఱిఁ దాఁ ♦ గూర్పించె సామ్రాజ్య మి
ట్లీరాము న్వనిఁ ద్రోవ నేమి పొసఁగెన్ ♦ హేతుప్రకారంబు కీ
డా రారాపున కొక్కదారి గలదా ♦ యాఁగాక యప్పాటున
న్నేరం బెద్దియుఁ దోఁపదే సుతునితో ♦ నేమించి న న్పంపఁగన్. ౨౨౯

ఆ॥ నాహిరణ్యనాభు ♦ నాబిడ్డ నాకూనఁ, బాసి యిట్టిచోట ♦ బ్రదుకఁ జాల
నమ్మతోడఁ దెలుపు♦మంపింపు మోయన్న, నీకుఁ బుణ్యమొదవు♦నెఱియఁగలదు.

మ॥ మునివృత్తిం గొని యున్నవాఁడు కొడుకా ♦ ముక్కారుద్రిక్కారు కా
నను గానన్వలె వానిఁ బంపుఁ డెటులై ♦ న న్గానిచో నీసుమి
త్రను దోడ్కొంచుఁ దదర్థ మేఁ జనెద నై ♦ తానాగ్నినెక్కోలు చూ
పైనయ న్నా కదియొప్పుఁ గాక యొకఁడా ♦ హీనత్వ ముద్భావ్యమే. ౨౩౦

మ॥ పురుషవ్యాఘ్రుఁ డతండు తండ్రి వనుప ♦ న్బోయెం దపోనిష్ఠుఁడై
బరుసంబేల మృదూక్త మేమిటికి మీ ♦ భాగ్యమ్మన న్వాజిహ
స్తిరథోపేతము శ్రీసమృద్ధము ధరి ♦ త్రీప్రాజ్యరాజ్యంబు నే
ఁకుర నయ్యెం గొని యేలుకొమ్ము మహితా ♦ క్షోభ్యత్వలక్ష్మస్థితిన్. ౨౩౧

ఆ॥ అనుచుఁ బలుకు మెయిన♦యద్దేవి భర్త్సింప,వ్యథకుఁ బాలుపడి యె♦వ్రణమునందు
సూదిగుట్టుకట్టుఁ♦జొనుపంగ నౌ నట్టి, డగుచుఁ దెలుపు దోఁప♦కనఘుఁ డతఁడు.

—♦ భరతుఁడు కౌసల్యపాదంబులపైఁబడి యొట్లు పెట్టుకొనుట. ♦—

చ॥ చరణతలంబునంబడి వి♦సంజ్ఞుఁ డనం జని సంజ్ఞ యెట్టకో
పరఁగిన యంత నిల్వఁబడి♦ప్రాంజలియై కడు నెంజిలిగా విజి
త్వరుఁ డటు సత్వరుం డగుచుఁ♦దద్దయు నెవ్వగఁ గంది కుందు న
వ్వరజననిం గనుంగొని నె♦పంబులు నత్తెరువొప్ప నిట్లనున్. ౫౩౩

ఆ॥ ఆర్యురాల యిట్టు♦లనియెదవే రామ, కింకరుండ విగత♦కిల్బిషుండ
నని యెఱింగి యుష్మ♦దంఘ్రిపూజకునిపై, నింత లలుక గొన నిఁ♦కేమి గలదు.

వ॥ జనయిత్రీ నానోడివెడు నుడు లాలకింపుము సత్యసంధు సద్వరేణ్యు మహామహు దయాసాంద్రు శ్రీరామచంద్రుఁ గాననంబున కనుచు నను వెఱింగి సమ్మతించిన యమ్మానిసి చదివిన యెల్లశాస్త్రంబులు స్మృతికి రాకయుండఁ దత్కృతమతికిం గాక వ్యర్థుండై చెడుంగాత పాపాత్ములకుం బ్రేష్యుండై వినష్టుండగుంగాత, ఇంక సూర్యున కెదుర్పడి మలమూత్రవిసర్జనం బొనరించువాఁడును గోవుం దన్ని లేపువాఁడును గృత్యంబుల మెలంగిన భృత్యున కర్థలోభంబునం దప్పులు వట్టి యేమియునిడక నిరర్థకమ్ముగాఁ బొమ్మనువాఁడును గన్నబిడ్డయట్టు లేలువాని యేలుబడి నుండి యాతనికిం గీడొనగూర్ప నెంచువాఁడును నాఱవభాగం బాహరించుచుండియుఁ బ్రజలకష్టంబు లారసి ప్రోవనివాఁడును దపోయజ్ఞాదులయందుఁ బ్రతిశ్రుతంబులైన దానదక్షిణల నీయక తప్పుకొనువాఁడును జతురంగసంబాధంబు శస్త్రసమాకులంబును నగురణాంగణంబుననుండి తలంగువాఁడును బుద్ధిమంతుండైన గురువర్యునిచే సప్రయత్నంబుగా నుపదేశింపబడిన సుసూక్ష్మంబగు శాస్త్రార్థసంప్రదాయంబుం బోకార్చువాఁడును జంద్రార్కసమ తేజస్కుండును వ్యూహబాహ్యాంసుండును సింహాసనస్థుండునై రాజ్యభారంబు వహియించి యున్న రాజేంద్రుని జూపోపమిఁ జూడఁబోవనివాఁడును బాయసకృసరాన్నభాగంబుల నిర్ఘృణుండై యపరమార్థంబుగా భుజియించువాఁడును గురువుల నిందించువాఁడును గోజాతిం గొట్టువాఁడును బెద్దలపై నేరంబులు మోపువాఁడును మిత్రద్రోహం బొనరించువాఁడును నేకాంతంబున విశ్వాసకథితంబగు పరీవాదంబు వెల్లడించువాఁడును నొడ్డమే లోర్వనివాఁడును జేసినమేలు మఱచినవాఁడును దపోనిష్ఠ విడనాడువాఁడును గురులసన్నిధింజంకనివాఁడును సిగ్గెగ్గులు లేనివాఁడును నెల్లరతో ద్వేషించువాఁడును గృహంబుననుండి యభ్యాగతపుత్రదారభృత్యాదులకుం బెట్టక మిష్టం బొక్కఁడు కుడుచువాఁడును దగినకన్నెం బెండ్లియాడక

మేలియపత్యంబు వడయక యపక్రియాతంత్రుండై మడియువాఁడును సంతతిం గానక చింతమైఁ గొన నొండుపథం బొన కర్థాయువై మేనెడయువాఁడును రాజస్త్రీబాలవృద్ధుల వధియించువాఁడును భృత్యుల విడనాడం జూచువాఁడును వేతనంబులకు మాఱుగా లాక్షామధుమాంసలోహవిషాదు లొసంగి యసత్కల్పంబున నల్పజీవనులగు ననుజీవుల భరించువాఁడును శత్రుపక్షభీమంబగు సంగ్రామంబున భీతుండై పఱువిడునాతని బొలియించువాఁడును పానప్రసక్తుండును స్త్రీలోలుఁడును నక్షాభిరతుండును గామక్రోధోద్ధతుండును నే యే దుర్గతికిం బొల్పడుదురో యట్టిద యవస్థ యివ్వానికిం దటస్థించుంగావుత మఱియు నిట్టి ద్రోహం బొనరించినవాఁడు కపాలపాణియుఁ జీరసంవృతుండును భిక్షాశనుండు నున్మత్తుండును నై పిశాచంబుకరణి భూమిపయిం దిరుగుంగాత ధర్మకర్మంబులు మనంబున కెక్కక యధర్మాసక్తుండును నపాత్రవర్షియు నయ్యెడుఁ జిరకాలకష్టార్జితంబులగు బహుధనంబులం దస్కరు లపహరింప శోకించుంగావుత ఉభయసంధ్యల శయనించువాఁడును వహ్నిదాయకుండును గురుతల్పగామియు స్నిగ్ధవంచకుండును దేవర్షిపితృతర్పణంబులు మాతాపితృశుశ్రూషలుం జేయనివాఁడును నెట్టి నారకకూపంబులం గూలుదురో యదియు నిదియునెల్ల నివ్వానికి నెట్టన సంప్రాప్తించు సల్లోకంబువలనను సత్కీర్త్యంబు సంజుష్టంబు నగుకర్మంబువలనను వాఁడు పరిభ్రష్టుండు గాఁగలండు మాతృవందనం బొనరింపని దోషంబునం బోవు బహుపుత్రుండును దరిద్రుండును జ్వరరోగపీడితుండును సంతతక్లేశియునగు, ఆశలం దెలిపి దీనులై యూర్ధ్వదృష్టు లగుచు నొల్లంబోవు నర్థుల నిరర్థులఁ జేయు దుష్కృతంబునం జను మాయావియుఁ బరుషవచనుండును పిశునుండును నశుచియు రాజభీతుండును నధర్మాత్ముండు నై చెడు సతియు ఋతుస్నాతయు సముచితానురోధినియు నైన భార్యను దుష్టవర్తనంబున నతివర్తించువాని భ్రూణహత్యకుం బొల్పడు ధర్మదారపరిత్యాగంబును బరదారనిషేవణంబును ధర్మాసక్తి లేకుండుటయు మూఢత్వంబును నిట్టివానికి సంభవించు విప్రలుప్తసంతానుండైన విప్రుని దుర్దశకుం బొలగు పానీయంబులు గలుషంబులు గావించి విషాన్నంబు లిడి బ్రాహ్మణసత్కారం బొదవింపంబూనియును మానికలుషేంద్రియుండైనవాని దురితంబునం బొడవడంగు, లేఁదూడ నోరు గొట్టి యావుపాలు గొనువానికి దృషార్దితులకుం బానీయం బెడసేయువానికి వివాదం బొనరించువారి నడుమం జేరి చూచుచుండువానికి నెట్టిదోషంబు లావహిల్లు నట్టివ గొట్టు లాకట్టిడిం జుట్టుకొని ముంచుంజు మ్మని యుమ్మలించుచు నొట్టులుపెట్టుకొని.

॥౩॥

క॥ పతిపుత్త్రు లట్లు వాసిన, గతిసెడియున్న గురుజననిఁ ♦ గని స్వీకయాఽస
న్మతి సెదర నావ్యలీకం, బతిమాత్రం బగుడుఁ గూలె ♦ నాతం డవనిన్. ౫౩౬

ఆ॥ అట్లు పడినవాని ♦ ననరాని వినరాని, తిట్టు లొట్లు సేసి ♦ తెగువ సూపి
నట్టివాని సుతుని ♦ ననవద్యుఁ గని తల్లి, దిగులు బాసి యతని ♦ దిగులు గొనియె.

—♦ భరతుండు మూర్ఛమునుంగఁ గౌసల్య యాతనిం దేర్చి యూఱడించుట. ♦—

ఆ॥ సేదదేర్చి పలికెఁ ♦ జిన్నారిపొన్నారి, కూన రార యింత ♦ కొఱఁత పడితి
వేర యిట్టిచెట్ట ♦ నారాటపడు మేన, నుసుఱు నిలుపఁజాల ♦ నోయితనయ. ౫౩౮

మ॥ వరధర్మస్థితి నించుకేనిఁ జలియిం ♦ పం బోదు తత్త్వార్థత
త్పర యన్యాయవిదూర ప్రాంచితగుణ ♦ ప్రస్తావ నీబుద్ధి మే
లరయ న్నెక్కొను నెప్డు నూఱడిలఁ జే ♦ యం జాలి తౌ సత్యసం
గరతం గాంచితి పుణ్యలోకముల ద ♦ క్కం గొంటి సత్పుత్రకా. ౫౩౯

క॥ అని భరతునిఁ దనతొడపై, ననితరగుణ సేర్చి గ్రుచ్చి ♦ యాలింగనముల్
బొనరించి భ్రాతృవత్సల, యని యాహ్వానించి తేర్చి ♦ యట దుఃఖించెన్. ౫౪౦

క॥ ఆయమ ప్రసన్న యగుటకు, నాయదనున ధృతిఁ దనర్చె ♦ నంతియు భృశదుః
ఖాయాసితుఁ డాతఁడు మదిఁ, బాయని మోహమున ఱిచ్చ ♦ పాటున నుండెన్.

ఉ॥ భ్రాతృవియోగముల్ బితృవి ♦ పత్తియు నెక్కొని చిత్తవిభ్రమో
పేతునిఁ జేయఁ జేతనకు ♦ హీనత చొప్పడ నష్టబుద్ధియై
పాతరలాడుచుండె నెఱి ♦ పాడ్వడ నేడ్చుచు వెచ్చనూర్చుచున్
బాతకరాశియట్టె తమ ♦ పాలిటి దా నిశ నుత్తరింపఁగన్. ౫౪౨

ఆ॥ వేఁగునంతలోన ♦ యేగుదెంచెఁ దపస్వి, కులగురుండు సర్వ ♦ కోవిదేంద్రుఁ
డవ్వశిష్ఠుఁ డరసి ♦ యాడె నిట్లనుచుఁ ద, త్ప్రస్తుతోక్తమెల్లఁ ♦ బ్రస్తుతముగ.

క॥ చాలింపుము శోకభరం, బాలింపుము నాదునుడుల ♦ నోఁగావుత మే
లోలలితభావ యిమ్మెయి, లోలతఁ గొందురె యశోర్థు ♦ లు నరేంద్రసుతుల్.

తే॥ ప్రాప్తకాలంబె పతికిని ♦ పాపవిధులఁ, దీర్పు మామీఁద నారయు ♦ తెఱఁగు లేదె
చేయ నేమగు గతజల ♦ సేతుబంధ, నంబు నీబోఁటి కజ్ఞభా ♦ వంబు వలనె.

—♦ వశిష్ఠప్రేరితుండై భరతుండు దండ్రికి నివాపవిధు లొనర్చుట ♦—

ఆ॥ అనిన దెలివిదెచ్చి ♦ కొని ధృతిమెయి వల్లె, యని కడంగి యమ్మ ♦ హామహీంద్రు
మేని నూనెతొట్టి ♦ లో నుంచినది గాంచిఁ పరఁగఁ బొదివి నిలిపె ♦ భానుకులుఁడు.

క॥ నానారత్నపరిష్కృత, మహా నెలవునయం దమూల్య ♦ మగు సెజ్జను న
మ్మానవపతి యొడలిడి యనె, మానధనుఁడు ఘూర్ణమాన♦మానసుఁ డగుచున్.

సీ॥ అగునయ్య నీబోఁటి♦ కనరాని యీవృత్త, మెట్లు యోజించితో ♦ యెఱుకపడదు
నినువీడి యుండెడ ♦ నిలిచిన తప్పెంచి, నారాక గోరమి ♦ నయము గాదు
కాదన్న రామునిఁ ♦ గానల కంపుట, వెరవె లక్ష్మణుఁ డంత ♦ వెట్టివాఁడె
పురుషసింహులఁ బాసి♦ పొలిసితివో కాని, యీదుఃఖితము జన♦ మెడయ నగునె

యున్నదియె స్వర్గమున నింత ♦ కన్న మేల్మి
మున్న నీయరయనిదియే ♦ యున్నగరికి
యోగమును సేమమునుఁ గూర్చు ♦ నుజ్జ్వలుం డె
వండుగా నిర్ణయించి తా ♦ వాసి చెడదె. ౧౦౮

ఆ॥ విధవయయ్యె నేఁడు ♦ విశ్వంభరాదేవి, చంద్రహీన రాత్రి ♦ చందమునను
నగరి నాదు మదికి ♦ నచ్చుకున్నది తోడు, నీడ లేక యేను ♦ నిలువఁ గలనె.

చ॥ అని విలపించు నాతని క ♦ నంతరుఁడై గురువర్యుఁ డేల జా
గనుపద మీవిశాంపతికి ♦ నక్కఱ లెల్లను దీర్చి కాక యి
మ్మన మిటు సేసికొన్న గతి ♦ మానుగఁ దోఁచునె వ్యగ్రభావ మెం
దును ఫలదంబె భావితుఁడు ♦ దుఃఖము వెంటఁ జరించు టొప్పునే. ౧౧౦

క॥ అని హెచ్చరించినంతనె, మనస్వి యతఁ డుచితమెంచి ♦ మన్నించి నయం
బున ఋత్విజులఁ బురోహితు, లనుఁ ద్వరితులఁ జేసెఁ దదుపఁ ♦ లాలితమతియై.

తే॥ అగ్న్యగారమునం దున్న♦యమ్మహాగ్ని, చిత్ర్పవరు నగ్ని కెత్తితె♦చ్చిరి ప్రపూజ్యు
లైన ఋత్విగ్వరేణ్యులు ♦ యాజకులును, సన్మహిత మాశరీరంబు ♦ సంస్కరింప.

చ॥ మణిమయమైన యానమున ♦ మండలనాథుని మేను సేర్చి వీ
క్షణముల వేఁడినీరొలుకఁ ♦ గాఁ దగువారు వహింపఁజొచ్చి రా
క్షణము విలక్షణం బగుచుఁ ♦ గన్పడె మానికము ల్సువర్ణముల్
గణనకు మీఱి నల్దెసలు ♦ గ్రమ్మఁగఁ జల్లుచునుండి రమ్మొగిన్. ౧౧౩

ఆ॥ సరలపద్మకాఖ్య ♦ చందనాగరుచంద్ర, దేవదారుతతులు ♦ దివ్యవస్త్ర
భూషణౌఘములునుఁ♦బురుహూతనిభుఁ గొని, పోవ్వ నెడము నెఱసి♦పొలిచె నపుడు.

క॥ గంధములు వెలయఁజేసెను, గంధవహుం డట్టు లరిగి ♦ క్ష్మావల్లభు ని
ర్గంధులు ఋత్విజులు చితా, సంధానయుతుం బొనర్చి ♦ సముచితభంగిన్. ౧౧౫

చ॥ హుతవహుఁ జేర్చి యిష్టిజప ♦ హోమసమస్తములు స్విష్టకృత్సున
మ్మతములు గాఁగ సామగులు ♦ మానితు లంచితసామగానముల్
శ్రౌతము లొనర్ప వేల్చి రతి ♦ శుద్ధుని మేని దహించెఁ బావకుం
డతులితవిశ్రుతార్చు లటు ♦ లంబరముం బరికించుచుండఁగన్. ౫౫౭

మ॥ శిబికాయానముల న్యథార్హముగఁ ద ♦ త్సీమంతిను ల్యోగ్యవృ
ద్ధబలోపేతలుగాఁ బురంబెడలి సం ♦ తాపంబునం బొక్కుచున్
గబరీబంధము లూడఁ జింత యెడలన్ ♦ గాఢన్ వ్యథాశ్రుప్లుతిన్
సొబగుల్వీడఁగ వచ్చి రచ్చటునకున్ ♦ శోకాధిదైవాత్మతన్. ౫౫౮

ఆ॥ చేరి యగ్నిచిద్వి ♦ శిష్టుని చితిచుట్టుఁ, గోసలాత్మజాతఁ ♦ గూడి తిరిగి
రార్తనాదసాధ్వి ♦ సాకంపములతోడఁ, గ్రమము ఋత్విగార్తి ♦ కలన నరసి.

ఉ॥ క్రౌంచికలట్టు లాకోమలు ♦ గాఢవిషాదనిమగ్న లౌచు ఘో
షించుచు వైమనస్యమునఁ ♦ జేతన యూతఁదొఱంగ నెట్టులో
సంచితకర్మసంగతిని ♦ షక్తగతిన్ సరయూప్రతీరమున్
గాంచిరి చేర స్నానముఖ ♦ కల్పవిధు ల్నెఱయించి రమ్మెయిన్. ౫౫౯

ఉ॥ పుత్రులతోడివా రగుచుఁ ♦ బూజ్యులు వార లమాత్యముఖ్యులున్
బుత్రివరేణ్యుఁడౌ నృపతి ♦ భూరిగుణాఢ్యునిఁ గూర్చి కూర్చి రా
పత్రిబలుల్ జలాంజలులుఁ ♦ బావనవృత్తు లెలర్పఁ బుణ్యసాం
యాత్రికు లౌచు నయ్యఘము ♦ నాత్రిము నీఁగు తలంపు లొప్పఁగన్. ౫౬౦

ఆ॥ పురికిఁ జేరి రంత ♦ భూశాయితాముఖ్య, నియతి తనరుచుండ ♦ నెఱపి రట్టు
లాదశాహమునఁ ద♦దంతకృతస్నాన, శుద్ధులైరి స్మృతిని ♦ బద్ధులగుచు. ౫౬౧

ఉ॥ ఆదట ద్వాదశాహమున ♦ నర్చితుఁడా భరతుండు తమ్మునిన్
వేదవిదు ల్విధించు పద ♦ విన్ గొని శ్రాద్ధములెల్లఁ దీర్చి ని
ర్వేదమువంక నెమ్మదిఁ జ ♦ రింపఁగనీని పితృప్రపత్తి హ
వ్యాదుఁడు విప్రవర్యులు ని ♦ రంతరతృప్తి వహించుచుండఁగన్. ౫౬౨

మ॥ ధన మన్నంబును రత్నము ల్వసనము ♦ ల్దాసీసహస్రంబులున్
ఘనయానంబులు వేశ్మము ల్మోదవులున్ ♦ క్ష్మాదేశసత్సన్నివే
శనముఖ్యంబులుఁ దండ్రితృప్తికయి యా ♦ శ్రద్ధాళు వాశ్రద్ధ మ
త్యనఘంబై నలువొందఁ జూఱయిడె ది ♦ వ్యస్తోమ ముప్పొంగఁగన్. ౫౬౩

తే॥ అంతఁ బదుమూఁడవది యైన ♦ యట్టియహము
నం దుదయవేళఁ జితిమూల ♦ మందు శోధ

నార్థ మఱిగినవాఁడు త ♦ దర్థములఁ ద
లంచి యిట్లనె భరతుఁ, డ ♦ భ్యంచితుండు. ౫౬౪

ఉ॥ అన్య యనంగరాని దగు ♦ నాదృతిఁ బెంచితి వింతకాలముం
మాన్యుఁడవే కదా కలుగు ♦ మాటఁ దలంపవె రాముఁ బంచి సౌ
జన్యము పీటవోవ నను ♦ జాలిదెసం బడవైచి తేల యీ
శూన్యముపాలివాఁడ నయి ♦ శోకమహార్ణవ ముత్తరింతునే. ౫౬౫

ఆ॥ ఆయనాథఁ గోస ♦ లాత్మజ నాయంబ, నావిశుద్ధచరిత ♦ నట్లొనర్ప
నేమినేర మొదవె ♦ నేకపుత్రి సుపుత్రి, నెడయఁ జేసి తింత ♦ యెఱుక సెడెనె.

మ॥ అని దాహారుణితాస్థిభస్మవద మ ♦ య్యాశాస్యవృత్తుండు చ
య్యన డాయంజని యేడ్చుచుంబడియె నై ♦ రాశ్యంబునం శక్రికే
తనమో నాగ యయాతిభాతి నటులా ♦ తన్నేతతో మంత్రుల
మ్ముగ్రను లట్లే యభిపాతమందఁగని ర ♦ మ్మాలంబునం బొక్కుచుం. ౫౬౭

ఆ॥ అట విసంజ్ఞతాప్తి ♦ నటులవ్రాలె శత్రుఘ్నుఁ, డన్నతోడివాఁడ ♦ యనఁగ నగుచు
నయ్య గుణములెంచి ♦ యాదట విలపించెఁ, దెలిసి తెలివిఁ బాపు ♦ తిక్క గొనుచు.

క॥ ఆఁకపడి మంధరోత్థము, కైకేయీగ్రాహయుతము ♦ కాపథవరదా
నాకుల మక్షోభ్యము నగు, శోకార్ణవ మతని ముంచు ♦ చొప్పునఁ గవిసెం.

క॥ సుకుమారు బాలు లాలితు, నకపటు నత్యార్తు భరతు ♦ నక్కట వీడం
వికటమతితోఁచె నెట్టులు, స్వకము జనము వ్యథఁ దలంచు ♦ జాలియుఁ జనెనే.

ఆ॥ భోజ్యపానవస్త్ర ♦ భూషణంబులపట్ల, నొడ్లఁ గా దటంచు ♦ నోజమెఱయ
నీవ మమ్ము దనుప ♦ నేర్తు వమ్మెయివార, లెవరు మాకు మహిమ ♦ హితశేంద్ర.

తే॥ ధర్మమర్మజ్ఞుఁడ వటంచుఁ ♦ దవిలి కొలిచి, నీమహత్త్వంబు నీసొంపు ♦ నెఱయు నరసి
యేలవిడనాడె యిన్నేల ♦ యెడయు నవుడె, పగులకున్నది యిదియేమి ♦ పాపమొక్కొ.

చ॥ అను నెడఁ గైకయాత్మభవుఁ ♦ డమ్మెయిఁ బొక్కుచు లేచి యన్న తా
వనమున కేగెఁ దండ్రి పితృ ♦ వర్గముఁ జేరఁగఁ బోయె నింక ని
య్యినకులమాలిపాలిత బు ♦ ధేడ్య యయోధ్యఁ జొరంగనేర నే
వనలముఁ జొచ్చువాఁడ హృద ♦ యాస్థ తలంగెను నేఁడు తమ్ముఁడా. ౫౭౩

ఆ॥ శూన్య మీపురంబు ♦ సొచ్చి నాపానరించు, పనియుఁ గలదె సత్త ♦ పరిప్రసక్తి
వనము సేరువాఁడ ♦ వారింప నేమగు, నన్నతోడిదైన ♦ యట్టి గతిని. ౫౭౪

—♦ భరతశత్రుఘ్నులు వ్యసననిమగ్నులై పౌరల వశిష్ఠుం డవ్వారలం దేర్చుట ♦—

తే॥ అని వ్యసనమగ్నులై వార ♦ లదనునందు, భగ్నశృంగము లగు వృష ♦ భములపగిది
నవనిపైఁబడి పౌరలఁ ద ♦ దాశ్రితులును, నట్టిరై తెరలంగ భా ♦ వ్యర్థ మెడలె.

చ॥ భరతుని లేవనెత్తి యిటు ♦ పల్కెఁ దపోమయమూర్తి వైద్యుఁ డా
దరయుతుఁ డా పురోహితుఁడు ♦ తాత వశిష్ఠుఁడు సావశేషయా
నిరతి దః నిట్లుఱుము ♦ నెయ్యము మెత్తురె మూఁడు ద్వంద్వముల్
నరులను బాయునే యరసి ♦ నంద్యచరిత్రు లుపేక్షసేయరే. ౫౭౬

ఉ॥ వృద్ధుఁడు లోకనాథుఁ డతి ♦ వేత్త మహామహితుండు సత్యసం
బద్ధపరాక్రముండు సుఖ ♦ భావ్యము లన్నియుఁ గొన్నవాఁడు సం
పద్ధనయుక్తు లెన్నక స ♦ వప్రవరంబులఁ దీర్చినాఁ డిఁకే
పద్ధతి కావలెం ద్రిదశ ♦ పాలపదార్థముఁ గొంటఁ దక్కఁగన్. ౫౭౭

తే॥ ఆత్మనిత్యుఁడు శుద్ధుఁ డ ♦ వ్యయుఁడు జన్మ, నాశవర్జితుఁ డధిచిత్ప్ర ♦ కాశమూర్తి
జడము మే నపవిత్ర మ ♦ శాశ్వతంబు, వీని తెఱఁ గరసియు నిట్టి ♦ వెత్తెఁ గొనెదె.

చ॥ తనయుఁడు తండ్రి మృత్యుగతి ♦ దారొకని రంచును శోక మాత్మతా
డనకలితంబుగాఁ గొనఁ గ ♦ డంగుదు రజ్ఞులు ప్రాజ్ఞు లెమ్మెయిన్
జననము మృత్యుహేతు వను ♦ సంయమ మెంచి యసారసంసృతిన్
మొనయు విరక్తి శాంతిఁ గని ♦ ముక్తిసుఖం బెదఁగాంతు రెప్పుడున్. ౫౭౯

తే॥ కర్మవశమునఁ బుట్టు న ♦ క్కతన గిట్టు,జంతు విది నిక్కమను జ్ఞాని ♦ జరుగు ననుఁగు
బందుగులఁ గూర్చి శోకవి ♦ పాక మెనయు,నెంచునేనియు నది రిత్త ♦ మెఱుకగాదె.

తే॥ ననుచు బ్రహ్మాండకోటులు ♦ నష్టగతినిఁ, గనవె క్రమ్మఱఁ గలుగవే ♦ కడమపడవె
యబ్ధులటు శుష్కములు గావె ♦ యాస్థ యేల, క్షణికమగు జీవితముపైని ♦ సారమతికి.

మ॥ చలపత్రాంతవిలగ్ననీరకణల ♦ క్షయ్యం బాయు విద్వానిపైఁ
గలదే ప్రత్యయ మాత్మ ప్రాక్తనకృతిన్ ♦ గాంచున్ శరీరంబు దు
ష్కలనన్ జీర్ణత నొందెనేని నెడయం ♦ గాఁ జూచు నూత్నగ్రహం
బొలయు న్నిర్ణయ మిట్టిఁ డంచరయ శో ♦ కోత్పత్తి వర్తిల్లునే. ౫౮౨

ఉ॥ పోవఁడు జీవుఁ డెన్నఁడును ♦ బుట్టఁడు ముట్టఁడు హానివృద్ధులన్
భావవికారవర్జితుఁ డ ♦ పారసుఖాత్ముఁడు జ్ఞానమూర్తి స
త్తావిదితుం డమేయుఁడు స ♦ దాశివుఁ డద్వయుఁ డక్షరుండు నా
నీవు దలంపు మిట్లని య ♦ నింద్యచరిత్ర వగ ల్దలంగఁగన్. ౫౮౩

క॥ అని గురుఁడు బోధసేయఁగ, ననితరగుణుఁ డైన భరతుఁ ♦ డటపైఁ జిత్తం
బును గట్టిసేసి శిష్టం, బును దీర్చి తనర్చె సకల ♦ పూజితుఁ డగుచున్. ౨౮౪

—♦ భరతశత్రుఘ్నులు పితృయజ్ఞపరిసమాప్తి నొందించి నగరుసేరం గనుట ♦—

ఉ॥ కన్నుల నొత్తుకొంచుఁ గడుఁ ♦ గందిన మోములు దీనవాసి య
ట్లున్న మనంబులున్ బడలి ♦ యొప్పని మేనులు నొప్పఁ జేరి రా
యన్నయుఁ దమ్ముఁడున్ నగరి ♦ కయ్యెడఁ బెద్ద తెఱం గెఱింగి యా
పిన్న వచించె నిట్లనుచుఁ ♦ బెంపు వహించు తలంపు చొప్పడన్. ౨౮౫

చ॥ గతియఁట సర్వభూతములఁ ♦ గావఁగ నౌనఁట నేఁడు దుఃఖసం
గతులని నిన్ను నన్నుఁ గని ♦ కారుణికోత్తముఁ డాదరింపఁడే
యతిజవసత్త్వుఁ డాతఁడు వ ♦ నాంతమున న్సతితోడ నిల్వ న
న్మతిమెయిఁ బోయెఁ గాల మిటు ♦ మార్పడె నొండగు నేర్పు చెల్లునే. ౨౮౬

తే॥ బలయుతుఁడు వీర్యసంపద్వి♦భాసితుండు, లక్ష్మణుండన్న యన్నయ♦లాక్షణికుఁడు
పైతృకము నిగ్రహమొనర్చి♦భ్రాతకొలువు, గోరియరిగెనుఁ దనకూర్మి♦గొనకొనంగ.

ఉ॥ తప్పొనరించినార మిది ♦ తప్పని యెన్నక మున్నె స్త్రీకి మే
నప్పనసేసి యుత్పథము ♦ నందిన తండ్రిఁ దలంగఁజూడఁగా
నొప్పఁదకించి దాన నిటు ♦ లోటమి గల్గె నిఁకేమిచెప్ప నా
యొప్పులకుప్ప లెప్పగిది ♦ నుండెడువారొ వనాంతసీమలన్. ౨౮౮

ఆ॥ ఆప్రవాసయోగ ♦ మనదకర్మము గాఁగ, నన్నప్రోవుఁ బాసి ♦ యడల వలసె
నింక నొందు గలదె ♦ యిక్ష్వాకుసంతతి, వారి కొదవె నిటు వి ♦ వల్గనములు.

—♦ శత్రుఘ్నుఁడు మందరం బట్టి పరాభవించుట ♦—

చ॥ అనుచు సుమిత్రపిన్నకొడు ♦ కాడెడు నయ్యెడఁ బూసి కట్టి మిం
చిన బలుసొమ్ములుం దొడిగి ♦ చెట్టదలంపక పట్టభద్ర యా
వనచరివోలెఁ దూర్పుదెస ♦ వచ్చి నిలంబడెఁ గుబ్జ తోడివా
రనువుపడంగ నట్టి దొసఁ ♦ గారసి ద్వారనివాసు లయ్యెడన్. ౨౯౦

శా॥ ఆపాపం గొనిపోయి పిన్నదొరతో ♦ నయ్యా యిదే యింతలా
వాపంబు ల్సమకూర్చు పన్నుగడలం ♦ బన్నె న్నరితీ్రవిభుం
డాపన్నుం డయికూలె నన్న చని వ ♦ న్యం దూలె నిద్దానికిన్
రూపింపం దగు శిక్ష నీదుహృదయా ♦ రూఢానురోధంబుగన్. ౨౯౧

మ॥ అనునంతన్ భృశదుఃఖితుం డతఁడు పె ♦ ల్లారాట మొప్పారఁ జ
య్యన నాజ్యాహుతి నెల్గు నగ్గి యనఁగా ♦ నై యెల్లరుంజూడ ని
ష్ఠైనయుంగావ్రత మాకాలంబునకుఁ జే ♦ ర్చేరీతిఁ గల్పించె న
ట్లన యావశ్యకమౌ ఫలం బిదియు నం ♦ చాఘూర్ణమానాత్ముఁడై. ౫౯౩

ఆ॥ పొదవి పట్టుకొనినఁ ♦ బొర్లి కూయిడ దాని, తోడి చేడె లెల్లఁ ♦ గీడుమూఁడె
నింక నొకతెఁ దక్క ♦ నీయఁ డీదొరయంచుఁ, జెదరి పాటి యొకటఁ ♦ జేరఁబాఱె.

ఆ॥ నెనరుగలదు ధర్మ ♦ నిష్ఠితాత్మ యశోవి, శాల కోసలాత్మ ♦ జాత యభయ
దానశీల మనుచుఁ ♦ దద్దయు నద్దేవి, శరణుఁ జొత్తు మనుచు ♦ జరుగునంత.

శా॥ ఆశత్రుఘ్నుఁడు దాని నేలపయి మో ♦ మై యుండఁగా నీడ్చె నా
క్రోశింప న్గడఁక న్గడంగి యెడ నె ♦ క్కొల్లన్న భాండంబు త
న్నాశం బెన్నుచు వీడిరాల నగు స ♦ న్నాహంబు చెన్నార న
ద్దేశం బొప్పెను శారదాంబరమునం ♦ దీరొందు సత్కాంతులన్. ౫౯౪

మ॥ బలవత్క్రోధమున న్నృపప్రవరు డా ♦ పాపాత్మికం గొంచుఁ బో
యి లయోగ్రుం బురుడించుచుం గయిక ని ♦ న్నీదుష్ట మంత్రంబు తె
క్కలిపా ల్సేసెనకాదె దీనిగతిఁ జ ♦ క్కంగాంచితే దుష్కృతిన్
ఫల మిట్లే జనియించు నం చటిమి ని ♦ ర్భర్త్సించుచుం బల్కుచోన్. ౫౯౬

ఆ॥ ఉగ్రమూర్తి యతని ♦ యోజఁ గన్గొని యుల్కి
యభయదాన మొసఁగు ♦ మయ్య యనుచు
భరతు వేఁడికొనియెఁ ♦ బాల్పొక కైక య
య్యనఘుఁ డుచిత మెఱిఁగి ♦ యనుజుఁ గాంచి. ౫౯౭

ఆ॥ వలవ దబల లెందు ♦ వధ్యలు గా రందుఁ, దల్లి యీపె యదియు ♦ దాసి యనద
లైన వీరిఁ ద్రుంప ♦ నగు మే లిఁకెయ్యది, మన కటంచు మున్న ♦ మానుకొంటి.

ఉ॥ మన్నన వీడి యన్న యను ♦ మానపడన్ మనవృత్త మెంచి రా
మన్న దయాళు వొండనిన ♦ నందు నొకొండగు చెట్టవుట్టరే
వన్న యవస్థఁ గాంచమె య ♦ నర్థ మెఱింగి క్షమింపు పాపమే
యున్నను శాసకుం డతఁడ ♦ యొద్దు స్వతంత్రత నూన శక్తులే. ౫౯౯

చ॥ అనిన మతం బెఱింగి యతఁ ♦ డాజరభి న్మనుమంచు వీడెఁ జ
య్యన రుషతోడ నయ్యదియు ♦ నంతకుబారిఁ దలంగు ప్రాణియై

పనఘ్రుచుఁబోయి కేకయజ ♦ పాదములంబడి క్రొంచి యట్లు నె
ట్టన మొరయంగ నూరటప ♦ డం బొనరించెఁ బ్రసక్తి నాపెయున్. ౬౦౦

ఆ॥ దైవగతియయట్టి ♦ దారిచూపెనకాక, కోరి కొంపఁ గూల్చు ♦ కొనెడువార
లందుఁ గలరె తలఁప♦కుందురే యానాఁటి, మచ్చు విరియ నుచిత♦మార్గవిధము.

—♦ వశిష్ఠుండు భరతుం బ్రబోధించుట ♦—

క॥ అంతఁ ద్రియోదశదివసా, నంతరకల్యమున మంత్రు ♦ లాప్తు లనుఁగులుం
జెంత నెలకొన గురుండు స, భాంతరపీఠి జనమండ ♦ లాభ్యర్హితుఁడై. ౬౦౨

ఆ॥ ఆచతుర్ముఖుండె ♦ యన నుండి భరతు రా, వించి ప్రేమ గార ♦ వించి దేశ
కాలయుక్తమగు ర ♦ కంబున తెలివిమై, నిట్టులనె మహీధ ♦ రేంద్ర తనయ.

శా॥ వత్సా ; రాజ్య మనాయకం బగుచు ని ♦ ల్వంబోదు మీతండ్రి దా
దిత్స న్వీడఁగఁ బోల దెట్టులయినన్ ♦ దేవేరి ప్రార్థింప సం
వత్సారం బొనఁగెన్ ద్వ్యదర్థముగ న ♦ భ్రాంతి న్భవద్భ్రాతయున్
సత్సంగోచితుఁ డానచెల్లుబడి కా ♦ సందర్భము న్గైకొనన్. ౬౦౪

తే॥ జనకుపత్రిన జ్యోత్స్నఁ♦జంద్రుండు వోలెనా, ఘనుఁడు వీడ కరిగెఁ♦గల్లనిజము
లరసి నీవు నట్టు♦ల య్యుభయుల యాజ్ఞ, నెఱపఁ దలఁచుటయును♦నీతిగాదె.

క॥ కొలుతురు ప్రాచీప్రముఖత, గల దిశలం గలుగువారు ♦ కలిమి వెలయ నిన్
పలనుమెయి నిహతకంటక, యిల యేలు మహీనవిభవ ♦ మేపారంగన్. ౬౦౬

క॥ అమ్మహితు నేలుబడిఁ గని, యిమ్మహి యిపు డెడసి భర్త ♦ యే కఱవైనం
బమ్మెఱపాటున నెఱిసెడి, దిమ్మరి యగుఁగాదె తనదు ♦ తేఁకువ తెరలన్. ౬౦౭

ఆ॥ కానఁ బితృసముండు ♦ కాననంబుననుండి, వచ్చునంతవఱకు ♦ వలదునాక
ప్రజలఁ బ్రోవుమయ్య ♦ ప్రాభవంబున నభి, షేక మెనసి మేలి ♦ సిరి దలిర్ప. ౬౦౮

క॥ నేఁడే నెఱపెద మాకృతిఁ, గీడాడకు మనుచు దేవ ♦ కీర్తితుఁ డనినన్
వాఁడియలుంగుల గ్రొచ్చిన, జాడంబడి శోకవేగ ♦ సంహతుఁ డగుచున్. ౬౦౯

—♦ భరతుఁడు విషణ్ణుండై తనయభిప్రాయం బెఱింగించుట. ♦—

ఆ॥ ధర్మనిష్ఠ నెఱయ ♦ ధర్మజ్ఞు రాము నె, మ్మదిఁ దలంచి మ్రొక్కి ♦ మౌనివరుని
యిచ్చఁ దెగడి పొగిలి♦యెడ్చె గద్గదకంఠ, కలన హంసనాద♦కలితుఁ డగుచు.

ఆ॥ పలికె నిట్లటంచుఁ ♦ బాపాత్ముఁరాలు నా, తల్లి జరిపినట్టి ♦ త ప్పెఱింగి
యుంటినేనిఁ గర్మ ♦ యుక్తి గురుద్రోహ, మాచరించినాడ ♦ ననఁగ వలయు.

మ॥ అగునా యిట్లన నయ్య నేఁటివఱకి ♦ య్యాదిత్యవంశంబువా
రగచా ట్లందఁగ జ్యేష్ఠుఁ బంచి యవరు ♦ ల్వ్యాపారులై విక్రమిం
పఁగఁ గాంక్షించిరె నీయెఱుంగనిదియున్ ♦ బ్రాప్తంబె నాకాననే
యఁగరాదే యటు గాననుండుమని ప్ర ♦ త్యాసత్తి కన్పట్టినన్. ౬౧౨

శా॥ విద్యాస్నాతుఁడు ధర్మలోలుఁడు లస ♦ ద్వీర్యుండు నా రాము సం
పద్యోగంబు హరింపఁ బుట్టితినె సం ♦ భావించెదే యిట్లనా
ర్యోద్యుక్తం బగుకర్మము న్నెఱపునే ♦ యుద్యోతుఁ డా నాజి మే
ల్పద్యంబట్టి జనించినట్టి జనుఁ డ ♦ ల్పంబైన కల్పంబునన్. ౬౧౩

ఆ॥ అఘ మనార్యజుష్ట ♦ మస్వర్గ్య మియ్యది, యే నొనర్తు నేని ♦ నినకులంబు
సెఱుపఁ బొడమినట్టి ♦ చెడుగున కాకుందు, నెట్టు లింత యెఱుఁగ ♦ వే మునీంద్ర.

ఆ॥ జ్యేష్ఠుఁ డాఘనుండు ♦ శ్రేష్ఠుండు ధర్మాత్ముఁ, డనుదిలీపనహుషుఁ ♦ డాశ్రితావ
నుండు తా నె దశర ♦ థుం డెట్టు లట్టులే, యేలఁగలఁడు రాముఁ ♦ డింత నిజము.

తే॥ అనువుపడకుంట నిచ్చోట ♦ నడఁగియుంటి, రాము నెమ్మదిలో నిడి ♦ రక్తి మంటిఁ
బ్రొద్దుపొడుపున నచటికిఁ ♦ బోవనుంటి, శ్రీఘనుని దెస కంజలి ♦ సేయుచుంటి.

క॥ అలఁతిగ నతని మరల్పఁగ, వలనుపడద యేని నే న ♦ వారితవృత్తిన్
నిలుతు నచట లక్ష్మణువలెఁ, గొలుతున్ రఘునాథుఁ గీర్తి♦గొనకొని నెఱయన్.

క॥ సమపక్షులైన సాధుల, సమక్షమున రామదేవు ♦ సన్నుతిసేయన్
మమత న్నెఱపఁడె గాఁడే, యమాన్యుఁగా ననుఁ బొనర్చు ♦ నంతటివాఁడే.

తే॥ విష్టికర్మాంతికుల సర్వ ♦ విదుల మార్గ, శోధకుల రక్షకుల మదిఁ ♦ జొనిపినాడ
నాదయామయుఁ జేరంగ♦నరుగ నాచ, తుర్విధవ్యూహ మవిపత్తి♦తోడ నడుప.

ఉ॥ కూర్పము గొప్పనేన గుణ ♦ కోవిదు నమ్మహాసీయుఁ గొల్వఁగాఁ
దార్పము నేను మంత్రులునుఁ ♦ ద్వత్కృత మియ్యభిషేకభాండమున్
నేర్పునఁ గొంచు నేగి కడు ♦ నెయ్యమునన్ రఘునేతఁ దేరఁగాఁ
దీర్పొనరింపు మట్లతనిఁ ♦ దేర్పము న న్గృతకృత్యుఁ జేయఁగన్. ౬౨౦

ఉ॥ నీవు పురస్కృతుండ వయి ♦ నిర్మలమానసవృత్తి మున్నుగా
భావిత లంబలుం బ్రజలుఁ ♦ బౌరులుఁ బెద్దలుఁ దోడివారుగాఁ
బోవలె రాజచిహ్నములుఁ ♦ బూనికమైఁ గొని భద్రదంతియున్
రావలె రాము నచ్చటనె ♦ రాజుఁ బొనర్చి పురంబు సేర్పఁగన్. ౬౨౧

తే॥ మాతృగంధిని యాకైక♦మాటయేల,వచ్చినను నొచ్చినను నొక్క♦వలను గలదె
యవసరంబేని నే నుందు♦నడవియందు,భ్రాతగైకొన్న మునివృత్తి♦భంగి కగుచు.

క॥ రక్షులు దోడుగ శిల్పా, ధ్యక్షులు సమవిషమపథము ♦ లరసి రయమునన్
దక్షతఁ జక్కపఱప ముని, ఋక్షేశా; పనుపు మిప్పుడె ♦ యెలమిదొలంకన్.

క॥ ఆత్రం బెడలఁగ నాయీ, యాత్రం జాటింపఁబనుపు ♦ మట నెవ్వరున
త్పాత్రతఁ గందురొ యవ్విభు, నేత్రములలరంగఁ గాంచు ♦ నెఱిగలవారో.

తే॥ అని సభాసదులం గల♦యంగఁ గాంచి,యందఱును నిట్లు హర్షింప♦నవునటంచుఁ
దెలిపి మంత్రులతో నిడె♦తీరొకొండు,మదినిఁ జేర్పకుఁ డనియె న♦మ్మానధనుఁడు.

—♦ భరతుని తలం పెఱింగి యందఱు నానందించుట ♦—

శా॥ ఆనందాశ్రుపరీతనేత్రు లయి యా ♦ హా యెంతవాఁ డీతఁ డీ
శ్రీనంద్యుం గొనియాడ నేర్పుగలదే ♦ చిన్మాత్రగాత్రుండ కా
కీనేర్మి ల్గలవే జగంబుల నొకం ♦ డ్లేపాటివా రిన్నెఱిన్
గాన న్గాదని తెల్పనంచుఁ బ్రథితా ♦ కాంక్ష ల్తలల ల్మీఱఁగన్. ౬౨౮

తే॥ ఇట్లు పలికిన నిను సిరి ♦ యెల్లవేళఁ, బ్రోచుఁగావుత మిమ్మెయి ♦ బుద్ధి మెచ్చి
బిడ్డనట్టులు రాముపైఁ ♦ బేర్మి నెఱయ, రాజు నొనరింతు నంటివి ♦ రాజతనయ.

తే॥ ఇమ్మహామహు గురునాన ♦ యి మ్మెఱింగి
మంత్రులును మేము నిజసైన్య ♦ మార్గమెల్ల
సంస్కృత మొనర్పఁ దగువారి ♦ సత్కరించి
యనుచు వారమ యుందేమి ♦ యడ్డుగలదు. ౬౨౯

క॥ అనిన గురువర్యుఁ డలరుచు, జనవంద్యుం డితనివృత్తి ♦ చక్కనిదే కా
యనితరసాధారణఁ గీ, ర్తినిఁ గనె నది ముజ్జగములఁ ♦ దేఁకువఁ గొనియెన్.

తే॥ అతని తలఁపునఁ గలకర్జ ♦ మనువు పఱుపుఁ
డన మహానందలక్ష్మియొ ♦ య్యారమొలయఁ
గమలవని యయ్యె సభ పురి ♦ గలయ నంతి
పురి వెలయ నొక్కఁడగుచు నం ♦ భోరుహాక్షి. ౬౩౦

క॥ ఆభానువంశ్యుఁ డెలమిన్, నాభాగ్యం బని తలంప ♦ ననిచెఁ బ్రయాణ
శ్రీభావ్యము మంగళతూ, ర్యాభగ్నోత్సవమురవ మ ♦ నంతం బగుచున్. ౬౩౧

క॥ అని తెలిపిన దయితునిఁగ, న్గొని మెచ్చి నగాత్మజాత ♦ కూరిమి నెఱయన్
మనమలర ననంతరకథ, వినిపింపుము దేవ యనుచు ♦ వేఁడికొనుటయున్. ౬౩౨

—♦ ఆశ్వాసాంత పద్యములు ♦—

చ॥ లలితకలానిధాన శుభ ♦ లక్షణయోగవిధావిధాన సం
వలితజగత్ప్రధాన కృతి ♦ వారణకారణసంవిధాన ని
ష్కలనిరుపాధికత్వవర ♦ కాల్పనికత్వకృతావధాన భా
వలయసుఖాత్మధాన ముని ♦ భావవినోదనభవ్యసాధనా. ౬౩౩

క॥ అమృతమయమూర్తి; తతని, ర్మమతామమతాప్రయుక్త ♦ మార్గవివర్తీ
సమరససద్గుణవర్తీ, విమలమహానందయోగ ♦ విశ్రుతకీర్తీ. ౬౩౪

మాలిని॥ అనుదయలయయోగా ♦ వ్యాపృతానందభాగా
వినిగమనవిదూరా ♦ వేదవేదాంతసారా
సునయనయనవేద్యా ♦ శుద్ధభావాతిహృద్యా
సనకముఖసమస్యా ♦ సత్కృతాంచన్నమస్యా. ౬౩౫

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబున షష్ఠాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—♦—

శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

---

## సప్తమాశ్వాసము.

---


నిత్యధర్మపుష్కల
స్వానందరసాతిహృద్య • యతిసేవ్యగుణా
ధానచణ సర్వధనికా
మానిప్రతిరూపరూప్య • మండలదీపా. ౧

వ॥ అవధరింపు మనంతర కథాశ్రవణ కుతూహలాయత్త చిత్తయగు తుషారాద్రి తనయతో రజతాద్రినికేతనుం డిట్లనియె నట్లు నిర్దోషుండైన భరతుండు గురు భావానుసారంబు తోరంబుగా నాజ్ఞాపించినమంచి దలంచి మించినకుతూహలంబు పారావారంబు వెల్లివిరిసినట్లై యెడలెల్లం గ్రమ్మం గమ్మనివార్తాగంధంబుల నెల కొల్పం గంధవహప్రచారులై చారులు ప్రవర్తింప సచివులంపఁ దలంపు పెంపున స్వకర్మాభిరతులు శూరులునగువారలం దోడ్కొని భూమిప్రదేశజ్ఞులు సూత్ర కర్మవిచక్షణులు ఖనకులు యంత్రికులు కర్మాంతికులు స్థపతులు వర్ధకులు మార్గి కులు వృక్షతక్షకులు కూపకారులు సుధాకారులు వంశకర్మకారులును దరలి నిఖిలసాధనంబులు సమకూర్చుకొని సమర్థులైనయుపద్రష్టలతోడం గూడిచని యుద్దేశవిషయంబగు వనమార్గప్రవేశంబునం బ్రవేశించి ౨

—♦ మునియానతి శిల్పి ప్రవరులు వనపథంబు ఘంటాపథం బొనరించుట ♦—

సీ॥ చెనుగుదీఁగెలు పొద♦ల్చెట్లు గుట్టలు మోళ్లు, ఛేదించి యొండొంటఁ♦జిక్కఁ జొనిపి
యవురుమబ్బులు చెక్కి ♦ యనువుగా సవరించి, అాలు టంకాహతి ♦ నేలఁగలిపి
చట్టుదిబ్బలు గొట్టి ♦ చదునుగావించి ని, మ్నస్థలంబులఁ బూడ్చి ♦ మలకలూడ్చి
మరుభూములను నీడ♦మలయు మ్రాఁకులు నాటి, కూపము ల్మేల్నిటఁ♦గుదురుపఱచి
కట్టడంబు లమరఁగట్టి♦కాల్వ లెనయఁ జేర్చి క్షోద్యంబు లొదవించి♦చిదురుపలుగ
భేద్యముల నెల్ల భేదించి♦పేరులేని, దారి రహదారి సేసి ర♦వ్వారు దొడరి. ౩

క॥ నిర్జలదేశము లన్నియు, నిర్ఝరదేశంబు లయ్యె ♦ నిర్ణయకారో
పార్జితముహూర్తబలమో, గార్జవమున నల్పకాల ♦ మందె పురంధ్రి. ౪

ఉ॥ పూజితకుట్టిమస్థలము ♦ పుష్పఫలాఢ్యలతాప్రతానరా
రాజితశాఖిబృంద మలి ♦ రావకలాంచిత ముల్లసద్ద్విజ
భ్రాజితవాదమోదము ప్ర ♦ భావవివృణ్వదుదూఢవైజయం
తీజనితార్కవీజనము ♦ తీర్చిన మార్గ మెలర్చె నత్తఱిన్. ౫

తే॥ చందనోశీరజలములు ♦ చల్లి సరస, రసనివేశమ్ము లొదవించి ♦ రాణివాస
యోగ్యలగు నుపకారిక ♦ లోజఁగూర్చి, సురపథోపమ మనిపింపఁ♦జూచి రపుడు.

క॥ ఇమ్ములగునిమ్ములకు మే, ల్సొమ్ములు పెట్ట గమకించు ♦ చొప్పున మెప్పుల్
గ్రమ్మఁగొన నెఱపి రమ్మెయి, నమ్మార్గముఁ గట్టడమ్ము ♦ లాశిల్పివరుల్ ౭

క॥ భూషించి యుజ్జ్వలములగు, భూషణరాజముల మేలి ♦ పొలుపున లక్ష్మీ
యోషాసులు జాహ్నవిఁ గన, వేషం బటుదాల్చి వెడలు ♦ విధ మొప్పారన్. ౮

తే॥ చలువపందిళ్లు మేలి ప్ర♦పలు పలుతెఱఁగుల వితానప్రతానము♦ల్యూటయంత్ర
తంత్రములు కలువడములు ♦ దారితలను, దనరె నద్దానిఁ జైత్రర ♦ థం బొనర్ప.

క॥ స్వాదుఫలతరువు లటు లా, మోదప్రదసుమమరంద ♦ ములు పొదరులు స
ద్వేదీవిలసితదీర్ఘిక, లాదయితుని చిత్తవృత్తి ♦ ననురోధించెన్. ౧౦

ఆ॥ విడిదిచోటు లనుచు ♦ విశ్రుతుం డారాజ, తనయుఁ డెంచినవియుఁ ♦ దలఁచినట్లె
పరిఖ లింద్రకీల♦భంగులు ప్రాకార, సౌధపఙ్క్తులునుఁ బ్ర ♦ సక్తిఁ బొసఁగె. ౧౧

క॥ ఆసాదితప్రసాదము, లాస్మృతి ప్రాసాదములు వి ♦ యత్తలమెల్లన్
భాసిల్లఁజేయ శిల్పుల, శ్రీసముపాత్తము యశమ్ము ♦ సిద్ధి వహించెన్. ౧౨

ఆ॥ ఆవిమానవితతు ♦ లాప్రతోలిక లట్టి, వగు విటంకములును ♦ నాపతాక
లాజలాశయంబు ♦ లనువొందు నుపవనం, బులును లేవు స్వర్గ ♦ పురమునందు.

క॥ శారదరాత్రి సచంద్రస, తారాగణమండితంబు ♦ తారాపథమ
ట్లారాజమార్గ మయ్యెడ, నారాజిత మగుచు శిల్పి ♦ రచనల నలరెన్. ౧౪

క॥ ఎప్పుడు సంకల్పించిరొ, యెప్పుడు కల్పించిరొకొ ♦ యెవి యెన్నియొ తా
రెప్పగిదివారొ యెందఱొ, యప్పాటవ మెన్న దరమె ♦ యజునకునైనన్. ౧౫

క॥ ఆమార్గము నటుపేర్చి శ్రీ, ధామార్గంబెరయఁ జేర్చి ♦ తాత్పర్యమునన్
ధీమంతులు శుభవృత్తము, శ్రీమంతున కెఱుకపఱుప ♦ జెలఁగిరి వేడ్కన్. ౧౬

—♦ సూతమాగధులు భరతుని స్తుతించుట ♦—

సీ॥ అంత నాందీముఖ యనంగ ♦ నైన రాత్రి, సూతమాగధు లానిత్య ♦ శోభను నను
జన్మఁ బొగడిరి మంగళ ♦ సంహితాను, షంజితములగు శ్రుతిపాఠ ♦ సంగతముల.

క॥ యామాభిహతము దుందుభి, యామహితునిద్రమోల మొరసె ♦ నామెయి శంఖో
ద్దామగుణరవము నెఱసెను, ధామాధుకిఁ బెరసె శుభత ♦ తధ్వానములున్. ౧౮

క॥ ఆపొలుచునాదములు దివ, మాపూరితముం బొనర్చ ♦ నటుగాఁ గైకే
యీపుత్రుఁడు తనదుఃఖం, బేపున మేకొనఁగ వారి ♦ నేర్పడఁ గనుచున్. ౧౯

ఆ॥ రాచలచ్చిమగఁడు ♦ రాముఁడౌ గాని నేఁ, గాను వేడబములు ♦ గావు నెఱప
నచట వలయుఁగాన ♦ నాగుఁ డిమ్మొయి నని, వారి ననిచి యనుజు ♦ వలను గాంచి.

—♦ భరతుఁడు శత్రుఘ్నునితోఁ దనదుకష్టదశను విపరించుట ♦—

క॥ తమ్ముఁడ చూచితె యాక్రై, కమ్మ పొనర్చినది యెంత ♦ యపకృతియో నా
కిమ్మహిప్రజలకు నిమ్మన, నెమ్మెయిఁ జరియించువాఁడ ♦ నేనాఁడైనన్. ౨౧

ఆ॥ తలకుఁజుట్టి చనియెఁ ♦ దండ్రి దయాసనా, థుండు నాథుఁ డడవి ♦ నుండఁబోయె
నేమిసేయువాఁడ ♦ నీరేడుజగముల, మ్రోసెఁ బాపజాతి ♦ మోస మిట్లు. ౨౨

క॥ నాపై దుఃఖములెల్లఁ, న్నోర్చిపిరి నే నోపుపెట్లు ♦ మోహావశమునన్
ప్రాపుచెడి చెడుదుఁగాకే, యాపుదలం గాంచి శుభము ♦ లందెద నింకన్. ౨౩

ఆ॥ ధర్మరాజునాఁగఁ ♦ దనరె మహాత్ముఁ డా, దయితు రాజలక్ష్మి ♦ ధర్మమూల
యలవుసెడి జలౌఘ ♦ మందపకర్ణిక, యోడజాడఁ దిరుగు ♦ చున్న దిపుడు.

క॥ నాచేయునదియుఁగలదే, చేచేతులఁ దోలెఁ గైక ♦ శ్రీమన్మూర్తిన్
యాచనికకల్పశాఖిన్, గాచమునకుఁగాని నన్నుఁ ♦ గన్న నెపమునన్. ౨౫

క॥ అని నగవ నంతిపురివా, రనుశోచింపంగ సచివు ♦ లావల సభకున్
జనుదెంచిరి గురుశాసన, మనువర్తించి చరితార్థు ♦ లై మోదమునన్. ౨౬

—♦ వశిష్ఠప్రభృతులు సభ కరుదెంచుట ♦—

ఉ॥ అంచితశాతకుంభమయ ♦ హర్మ్యవిలాసము వైజయంతభృ
త్సంచితభావికాసము సు ♦ దామజనిప్రతిభాసమున్ సుధ
ర్మాంచలమాసమాసమును ♦ నైన సభాంతరవాసమున్ బ్రవే
శించె గురుండు తత్కలము ♦ శ్రీమగపోఁడిమి వేసమోయనన్. ౨౮

క॥ స్వగణము గొలువఁగ మణిర, త్నగుణాస్తరణాఢ్య మాస ♦ నప్రవరముపై
నిగమజ్ఞుఁడు మునివర్యుం, డగణితవైభవమునన్ స ♦ మంచితుఁడగుచున్. ౨౯

క॥ ఉండి యనుజీవులం గని, నిండుమనంబునను గార్య ♦ నిర్ణయ మొప్పన్
బొందు గొనిరండు నృపజుల, దండిమగలఁ బ్రకృతులం బ్ర ♦ ధానుల ననుచున్.

క॥ ఆనతి సేసిన వారటు, లానందితచరితు వచన ♦ మాదలనిడి స
న్మాన మెసఁగ నెఱిఁగించిన, నానమ్రుల యగుచు వార ♦ లాక్షణమె ధృతిన్. ౩౦

తే॥ నాల్గుజాతులవారును ♦ ననుచు ప్రకృతు
లును ననుపదంబ యచ్చటు ♦ మొనసిరి ముని
యానమెయి భరతుండును ♦ నతనితమ్ముఁ
డును బెరయఁగాంచి రాచదు ♦ రును గడంగి. ౩౧

క॥ సునయుఁడు భరతుం డత్తఱి, ననుజుఁడు దోడగుచునుండ ♦ హర్యశ్వకులా
వనతత్పరు గురుఁ జేరం, గని తచ్చరణముల కెఱఁగి ♦ ఘనతఁ దనర్పన్. ౩౨

తే॥ ఎల్లప్రకృతులుఁ బౌరులు ♦ నేకవృత్తి, నతని నమరేంద్రు నమరు ల ♦ ట్లనుసరించి
రపుడు దశరథుఁడే రూప ♦ మంది రాఁగ, నయ్యెనో యనుబుద్ధి చ ♦ య్యన జనింప.

క॥ తిమినాగముఖ్యసంకుల, మమలమణీశంఖశర్క ♦ రాదిసమృద్ధం
బమితసలిలౌఘమునునై, యమరు హ్రదం బనఁగఁ బరిష ♦ దధిపద మొప్పెన్.

క॥ విద్వజ్జనులును మునులును, సద్వంశ్యులు ప్రకృతిపౌర ♦ జానపదులు సం
పద్విహితశుభశోభా, ముద్వలమాను లయి మొనసి ♦ మురియుచునుండన్. ౩౪

తే॥ ఆసనముల యథాన్యాయ ♦ మాసభాంత, రమున గురునానతిన యెల్ల ♦ రమరు నపుడు
భవ్యవస్త్రాంగరాగస ♦ త్ప్రభల శుభల, సన్మహోద్యోతమై యది ♦ చాల నెగడె. ౩౬

క॥ తానును దమ్ముఁడును దదా, జ్ఞానందితవృత్తులై వ ♦ రాసనయుగమున్
మానుగ నలంకరించిరి, శ్రీనాయకునంశయుగము ♦ సిరి దళుకొత్తన్. ౩౮

తే॥ ఆర్యగణపూర్ణమై నట్టి ♦ యాసభఁ గని, పూర్ణచంద్రుండు శారద ♦ స్ఫూర్తి నెగడు
రాత్రి నట్టులు దా నెంచె ♦ రాముఁ దేర, జనెడు కుతుకమ్ము సంద్రమ్ము ♦ సంతరింప.

క॥ అందఱఁ గాంచి రవికులా, నందనసంధానభావ ♦ నాంచితుఁడు గురుం
డందము చందము నుడులం, బొందుపడం బలికె భరతుఁ ♦ బూజ్యా నొనర్పన్.

తే॥ తండ్రియానతి నెఱి జవ ♦ దాఁట ననుచుఁ, దా నడవి కేగినాడు సీ ♦ తావిభుండు
సత్యసంగరుఁడగుటఁ బ్ర♦శస్తుఁడగుట, మరలివచ్చు ననెడు మాట♦మాటగాదు.

క॥ స్వారాజ్యనిభము పూజ్యం, బౌ రాజ్య మరాజకముగ ♦ నడఁగార్చి చనం
గా రాదు మానఁగా రా, దారాత్తత్సన్నిధాన ♦ మనువుపడంగన్. ౪౧

తే॥ మున్నె తెలిపితి నింక ని♦ర్మోహవృత్తి, రాజ్య మేలు మవలఁ గాంతు♦పూజ్యతనని
దానఁ జూపి తసమ్మతి♦దానఁజేసి, యిచ్చగించితి నేనుఁ ద్వ♦దీప్సితంబు. ౪౨

క॥ కావునఁ దరలుం డావల, దేవుండే యున్నవాఁడు ♦ తీర్పొనరింపన్
నీవలని చెడుతలంపులఁ, ద్రోవంగలుగుటయు మంచి ♦ త్రోవయ తలఁపన్. ౪౩

— ♦ భరతుండు గురూక్తులకు సదుత్తరం బొసంగి ప్రస్థానంబు వేఁడుట ♦ —

ఆ॥ అనినగురునినుడుల ♦ నాలించి భరతుండు, పలికెఁ బలుకుమేల్మి ♦ భాసిలంగఁ
దనకు రాజ్య మేల♦తను వేల రాణివా, సం బదేల యొండు ♦ జాడ లేల. ౪౪

క॥ రామపదాశ్రయమున నా, రామపదాశ్రీయమె సురపు♦రం బెడసినస్వ
ర్ధామమె నారక మిట్లని, నేమమున వహించినాడ ♦ నే మది నెపుడున్. ౪౫

క॥ అన్నియు నెఱిఁగిన నీయెదు, ర న్నేర్తునె నేర్చిపలుక ♦ రహిమీఱఁగ న
న్ని న్నెఱి రాముపదాజ్ఞయు, గి న్నెఱయఁగఁ జేర్న వే వి ♦ గీతి దలంగన్. ౪౬

క॥ సకలాగమవేత్తవు నీ, వకలంకచరిత్రుఁడవు మ ♦ హాత్ముఁడ వీనా
వికలత్వ ముడిపి ప్రోవవె, సుకృతం బొడగూర్చు త్రోవ ♦ చొప్పడ ననినన్. ౪౭

క॥ భరతునిభావ మరసి రస, భరితు లగుచుఁ బరఁగువా ర ♦ పారామృతవి
స్ఫురితచరితముల నటు సా, గరితు లనం దనరి రపుడు ♦ కల్యాణమయీ. ౪౮

క॥ ఎల్లయు సిద్ధంబైనది, యెల్లఁగడచి యతఁడు తఱిమి ♦ యేగకమునుపే
మొల్లముగాఁ జనవలె దొర, యుల్లమునన్ దొరయునట్టి ♦ యోజన నెఱియన్.

క॥ అనునుడు లాలింపుచుఁ దన, మనమున నవ్వారి నెల్ల ♦ మానింపుచుఁ జే
రినవారల లాలింపుచు, ఘనుఁ డాశ్రవజనులఁ జక్క ♦ గనుఁగొని పలికెన్. ౫౦

ఉ॥ అభ్యుదయంబు గోరుజను ♦ లందఱు లెండు మదుక్తిసంగతిన్
సభ్యులు మంత్రు లాప్తులు ప్ర ♦ సక్తులు చారులు పౌరు లింటివా
రిభ్యులు ప్రాజ్ఞు లూర్జితులు ♦ నిన్నెఱిఁ గొల్వఁ దలంపుఁ డొంట దా
ర్లభ్యము నెంచి రాముని ధ ♦ రాతనయాహృదయాభిరామునిన్. ౫౧

తే॥ మున్నె చాటింపఁబనిచితి ♦ మోస మున్నె
యాభిషేచనికము భాండ ♦ మట్లు రాజ
చిహ్నములుఁ దరలింపుఁడు ♦ స్త్రీజనముల
యానచయములు సాగింపుఁ ♦ డనుగుణముగ. ౫౩

క॥ అని గురువచన కెఱఁగి నా, కనుమతిసేసి చనుదేర ♦ నవ్వు నాపుడు మే
లని కదలె నాఘనుఁడు తో, డనె హాలహాల లొదవె భేరి ♦ భాంకారములున్.

తే॥ అట్లునెలకొల్పి తగువారి ♦ నామతించి
కాల్యకృత్యము ల్దీర్చి వి ♦ కార మెడలి
యాసుమంత్రుండు దెచ్చిన ♦ యరదమునను
దమ్ముఁడును దానుఁ బొల్చి స ♦ త్వరమె తరలె. ౫౪

—♦ భరతుండు రాముని సన్నిధికి ససైన్యుండై బయలుదేరుట ♦—

క॥ అంతటఁ బురోహితులు సా, మంతులు మంత్రులు రథాశ్వ ♦ మాతంగములన్
సంతసమున నెగడుచుఁ దదు, పాంతముల న్గదిసిచని ర ♦ హంపూర్వికతోన్.

ఆ॥ ప్రతికులంబునందుఁ♦బరఁగు రాజన్యులు,వైశ్య లన్యులును వి ♦ వాహమునకుఁ
బోవు నట్టు లెదలఁ ♦ బొదలుచు రామద, ర్శనము గోరి కడుఁబ్ర ♦ సక్తిఁజనిరి.

ఉ॥ సూర్యరథోపమంబులు స ♦ సూతమహాశ్వములౌ రథంబులం
దార్యవరు ల్ప్రధానులు త ♦ దన్వయ మొప్పఁగఁ బోయి రాత్మవి
ద్వర్యులు వృత్తసమ్మతులు ♦ బ్రాహ్మణు లంచితవేషు లౌచు న
య్యర్యమతేజునిం గనఁగ ♦ నయ్యెడ నేగిరి గోరథంబులన్. ౫౭

తే॥ పరఁగఁ దొమ్మిదివే లిభ♦పఙ్క్తు లట్లు, నూఱువేలు తురంగము♦ లూన్నత్నకళలఁ
దనరు నఱువదివేలు ర♦థములు నొప్పె,ధన్వివరు లల్లదారతోడఁ♦దరలుటయును.

తే॥ సత్యసంధు జితాత్ము ని ♦ క్ష్వాకుకుల సు, నందను సనందనాద్యభి ♦ నంద్యనిష్ఠు
రాజపుత్రు యశస్వి భ ♦ రతునిఁ గూడి, పత్తనంబెల్లఁ దరలె శు ♦ భంబు వేఁడి.

తే॥ కైక నేసిన నేరమ్ము♦కడన యొదిఁగె,నాపెయు సుమిత్రియునుఁగోస♦లాత్మజయును
భానుమండలనిభము లౌ♦యానములను,జనిరి రామునిఁగొని తెచ్చు♦సంభ్రమమున.

సీ॥ కందుమో కన్నుల ♦ కాటకం బెడయ నా, నీలమేఘశ్యాము ♦ నిర్మలాత్ము
నందుమో సిరియంక ♦ మోలగమ్మున నుండు, శ్రీపాదయుగలమ్ము ♦ చెంతఁ జేరి
విందుమో వీనుల ♦ విందుగా ముందుగా, వేదవేదమ్ములు ♦ విభుని నుడులు
మందుమో హృదయేచ్ఛ♦ మందుగా సంపూర్ణ,శతవత్సరంబులు ♦ సామిఁగొలిచి

యుదయభాస్కరుఁ డొగి తమం ♦ బూడ్చు నట్టు
లట్లు మనశోక మెడలించు ♦ నయ్య యింక
ననుచుఁ బొదలుచు నాగర ♦ జను లరిగిరి
రామదేవానయనకాంక్ష ♦ రాణఁ దనర. ౬౧

క॥ ఒండొరులఁ గౌఁగిలింపుచు, నొండొరులకు మేలివార్త ♦ లొగిఁ దెలుపుచు స
న్మండనముల సవరింపుచు, గండుకొనుచు రాముఁ గాంచఁ♦గాఁ జనిరి ప్రజల్.

వ॥ మఱియు నాప్రస్థానమహోత్సవంబున నెగడొందు నప్పురవరంబున నింటింటం బురంధ్రీరత్నంబులు నాథులం గని యింకం జాగేల లోకనాథునిం గొనితేర నరుగుచున్నవా రల్లదె యని పురికొలుపువారును మున్నేము నేరకాడిన యాడికలు మఱచి పాడిమెయి నచ్చోటున కేగి రామేంద్రుని వేఁడుకొని మోడి కొని తోడికొనియ రాఁజూడుఁ డని హెచ్చరికసేయువారును బరిజనంబుల నింటం గాపువెట్టి మమ్ముం గూడఁ దోడుతోడన కొనిపోవంజనదే యని ముచ్చటించువారును వలవదనుమాట పుట్టమికిం బొంగి భర్త్రనువర్తనం బొనరించువారును నై యుండ నాండ్రి యుల్లాసం బరసి నియోగింపంబడినవారికన్న నెక్కుడుగా బయలుదేరి యొండొరులం జీరు యోధవరేణ్యులును, రాజసమ్మతులునుఁ బ్రకృతిపరివారంబులును మణికారులునుఁ గుంభకారులును సూత్రకర్మమర్మజ్ఞులును శస్త్రోపజీవులును మాయూరకులునుఁ గ్రాకచికులును రోచకులును వేధకులును దంతకారులును సుధాకారులును గంధోపజీవులును సువర్ణకారులునుఁ గంబళధావకులును స్నాపకులును ఛాదకులును వైద్యులును ధూపకులును శౌండికులును రజకులునుఁ దంతువాయకులును గ్రామఘోషాగ్రణులును శైలూషులునుఁ గైవర్తకులునుఁ దమతమ కుటుంబినులతోడం గూడి కదలి రామసేవాభిరతుఁడగు భరతు ననుసరించి రయ్యవసరంబున. ౬౩

తే॥ అతఁడు శుద్ధాంతరంగులం♦చను వెఱింగి, రామభక్తికి మెచ్చుచు♦ రహిఁదనర్చెఁ
గాని కాదనఁ డొకళుల♦నేని నెవరొ, నర్చుపున్నెంబు వారిదై ♦ నను చు ననుచు.

ఆ॥ నెలవు గోడిపడఁగ ♦ నేల యీనినయట్టు, లంతమొనయరాని ♦ యాబలౌఘ
మతనితోడ నరిగి ♦ యాశృంగిబేరమ్ము, చెంత గాంగతటముఁ ♦ జేరె నపుడు.

—♦ భరతుఁడు ససైన్యపరివారుండై గంగదరిఁ జేరుట ♦—

ఉ॥ రాము ననుంగు నెచ్చెలి ప ♦ రాకొకయింతయు లేని సేవకుం
డామహనీయు నెప్పుడు హృ ♦ దంతరమం దిడు మేలిభక్తుఁ డు
ద్దామబలుండు వీరుఁడు ప్ర ♦ ధానులు జ్ఞాతులుఁ గొల్వ నేలు నా
భూమి నిషాదవల్లభుఁడు ♦ పూజ్యగుహాఖ్యుఁడు నేము మొప్పఁగన్. ౬౬

ఆ॥ అట్టిచోటు మొనసి ♦ యాసేన దేవసే, నావిలాసయుక్తి ♦ ననిచి నిలిచెఁ
జక్రవాకనివహ ♦ సమ్యగలంకృత, సైకతస్థలప్ర ♦ సక్తి కలరి. ౬౭

—♦ భరతుఁడు గంగాతీరమున నిజసేన విడియింపం బనుచుట ♦—

చ॥ అనుగతమైన వాహినిమ ♦ హత్త్వము తత్త్వవిదుం డెఱింగి నె
ట్టన సురవాహినిం బృథుత ♦ టక్ శివజీవన సేవ్య నెంచి తా
ననె నయకోవిదుండు భర ♦ తాధిపుఁ డల్లన మంత్రివర్గముక్
ఘనసుతిసర్గము న్గని ప్ర ♦ కాశితభవ్యగుణానుభావ్యుఁడై. ౬౮

తే॥ నాయభిప్రాయ మరసి సై ♦ న్య మభిమాన్య
మిచట విడియింపుఁ డెల్లర ♦ మెనయఁ గాంచి
బడలికలు దీఱ రేపటి ♦ పయనమునకు
నిమ్మహానదిఁ గడచుతీ ♦ రెన్నవలయు. ౬౯

క॥ పావనజలములఁ గ్రుంకి శు, భావహఁ బూజించి తండ్రి ♦ కంచితధృతిమై
నీవలె జలాంజలులు స, ద్భావుని స్వర్లోకగతి వి ♦ భావ్యత వొసఁగన్. ౭౦

క॥ అన వల్లె యనుచు నవ్వా, రనలసులై సేన నిలిపి ♦ రచ్చోటున గం
గను మొనసి సరాసరిగా, ననువర్తింపంగనైన ♦ యట్టులు తరుణీ. ౭౧

క॥ ఆనయమున నాతఁడు మహి, తానీకిని సుఖనివేశ ♦ మనువుపఱిచి యా
ధ్యానించుచుండె శ్రీరా, మానయనముఁ గూర్చి చిత్త ♦ మం దభియుక్తా. ౭౨

—♦ గుహుండు భరతుని సేనం గూర్చి శంకించుట ♦—

ఆ॥ కన్నులార ధ్వజినిఁ ♦ గాంచి గంగకుఁ దోడి, గంగ యగుచు నది ప్ర ♦ కాశిలంగ
నానిషాదనాథుఁ♦డతిసంభ్రమమున స్వీ, యులనుఁ బిలిచి భావ♦మొప్పఁ బలికె.

ఉ॥ కంటిరె సేన యియ్యది వి ♦ కస్వరమై వెడసంద్రిమట్టులై
మింటికి మింటి కొక్కుడుగ ♦ మార్కొనసెంచుచు గంగతోడి దా
గొంటున నుబ్బుచున్నయది ♦ క్రూరతమై భరతుండె స్వీయని
ష్కంటకితాప్తికై యుఱుమఁ ♦ గాఁ దలఁపూని బిరాన వచ్చెనో. ౭౮

క॥ అంతము లే దిద్దాని క, నంత న్నలిసేయఁ జాలు ♦ నది యిదెకా మ
త్స్వాంతమును నెఱయుచున్నది, చింతాబ్ధి న్బెనుపనోపు ♦ చెట్ట నొడువుచున్.

తే॥ కోవిదారధ్వజుం డదె♦గొఱలుచున్న, వాఁడు సమధికకాయుండు♦వాఁడిగలఁడు
దాశవర్గంబు గెడపునో♦దాశరథికిఁ, గీడొనర్చునొ యెది మదిఁ♦గీల్కొలిపెనొ.

క॥ బంధించునో యుండఁజూఁ ద, ద్బంధుత్వం బెంచి మప్పృ ♦ బంధుఁడు సిరికై
యంధనృపతి తోఁ ప్రిచిన ని, ర్బంధము చాలదొకో రాము ♦ పై నెత్తిచనన్. ౭౭
ఆ॥ కైకయందుఁ బుట్టు ♦ గాంచి కాపురుషుండు, గాకయున్నె సిరికిఁ ♦ గాక భ్రాత
ప్రాణములకుఁ గూడఁ ♦ బాల్పించుచున్నాడు, నాదుప్రాణ మనెడు ♦ నయమరయఁడు.
క॥ ఈగుహుని మే న్విడిచి యసు, లేగకమును రాము నొక్కఁ ♦ డితఁ డొనరింపన్
గాఁగలఁడె కాని చూతము, వేగమవలె నానయించు ♦ వెర వలవార్పన్. ౭౯
ఆ॥ జీవసఖుఁడు భర్త ♦ సేవ్యుం డతండైనా, దేవుఁ డట్లుగానఁ ♦ దెలిసి మీరు
చాలునంతవట్టు ♦ సన్నద్ధులర యయి, నిలువుఁ డేతదర్థ ♦ నియతి దనర. ౮౦
క॥ రామార్థకామపరులై, శ్రీమంతుల రగుచు సిద్ధిఁ ♦ జెలఁగుదురు తుదిన్
సామాన్య మనకుఁ డిదియు, న్నేమమున మెలఁగుఁ డొలయు ♦ నేర్పున నింకన్.
క॥ ఒగి నైదునూర్లు నావలు, మొగికొనఁగా నిలిపి యొడ్ల ♦ మోస మరయఁగాఁ
దగు కోడెతనమువా రా, శగములు గొని యుండవలయు ♦ సొలయక ధృతితోన్.
క॥ ఓడ కొకశతము వంతున, నోడక తతి వేచి కాచి ♦ యోజ గలబలం
బాడుచుఁ బాడుచు నిలవలె, నాడిక యామీఁద నెట్టి ♦ దగునో తెలియన్.
క॥ గంగానూపాశ్రియణ మె, సంగన్ ఫలమూలమాంస ♦ సంగ్రహ మొప్పన్
సంగతిమై నెలకొనుఁ డా, సంగం బితరము దలంగి ♦ జతన వొసంగన్. ౮౪
చ॥ బలముల నెల్లఁ జయ్యనఁ బ్రి ♦ భావసమగ్రిములం బొనర్చి బా
గ్గైలయఁగ నేఁటిసంగడము ♦ నేమఱకుండఁగఁ జేర్చి చాఁటఁబు
ష్కలముగ నాయుధోత్తమని ♦ కాయము లేర్పడఁ దార్చిరండు న
న్గలియ నుపాయనంబులు ర ♦ కంబులుగాఁ గొని సత్వరంబుగన్. ౮౫
ఆ॥ మంచి దలఁచెనేని ♦ మన్నింపవలయుఁ గీ, డెంచెనేనిఁ దొడర ♦ నేగవలయు
రాముఁ గొలువఁ బోవు ♦ రాణ గాకున్న మి, న్నేటివాఁక దాఁటి ♦ యెనయఁగలఁడె.

— ♦ గుహుఁడు భరతునిఁ గనుంగొనవచ్చుట ♦ —

క॥ అని శాసించిన వారు త, దనుశ్రుతముఁ గూర్చి మొనయ ♦ నరుగుటయును వాఁ
డనుపదము రాముపదముల, ననుస్మరించుచు నె ధృతిస ♦ మంచితుఁడగుచున్.
క॥ తెచ్చినవస్తుచయంబుల, మచ్చిక మెయిఁగొంచు భరతు ♦ మానితుఁ గాంచన్
జెచ్చెరఁ జనఁగ సుమంత్రుం, డచ్చపడు విసితి నేత ♦ కి నె నిట్లనుచున్. ౮౮
ఆ॥ ఈనిషాదనాథు ♦ నెఱుఁగుదే నినుఁ జూడ, వచ్చినాడు చాల ♦ వలనుగలఁడు
జేని కితఁడు గూర్పు ♦ నీనాఁడు రఘునాథు, భక్తియుక్తిఁ గొలిచి ♦ పరఁగినాడు.

ఆ॥ అట్టిచోటు మొనసి ♦ యాసేన దేవసే, నావిలాసయుక్తి ♦ ననిచి నిలిచెఁ
చక్రవాకనివహ ♦ సమ్యగలంకృత, సైకతస్థలప్ర ♦ సక్తి కలరి.

—♦ భరతుఁడు గంగాతీరమున నిజసేన విడియింపం బనుచుట ♦—

చ॥ అనుగతమైన వాహినిమ ♦ హత్త్వము తత్త్వవిదుం డెఱింగి నె
ట్టన సురవాహినిం బృథుత ♦ టఁ శివజీవన సేవ్య నెంచి తా
ననె నయకోవిదుండు భర ♦ తాధిపుఁ డల్లన మంత్రివర్గముఁ
ఘననుతిసర్గము స్గని ప్రి ♦ కాశితభవ్యగుణానుభావ్యుఁడై. ౧౮

తే॥ నాయభిప్రాయ మరసి సై ♦ న్య మభిమాన్య
మిచట విడియింపుఁ డెల్లర ♦ మొనయఁ గాంచి
బడలికలు దీఱ రేపటి ♦ పయనమునకు
నిమ్మహానదిఁ గడచుతీ ♦ రెన్నవలయు. ౧౯

క॥ పావనజలములఁ గ్రుంకి శు, భావహఁ బూజించి తండ్రి ♦ కంచితధృతిమై
నీవలె జలాంజలులు స, ద్భావుని స్వర్లోకగతి వి ♦ భావ్యత వోసఁగఁ. ౨౦

క॥ అన వల్లె యనుచు నవ్వా, రనలసులై సేన నిలిపి ♦ రచ్చోటున గం
గను మొనసి సరాసరిగా, ననువర్తింపంగనైన ♦ యట్టులు తరుణీ. ౨౧

క॥ ఆనయమున నాతఁడు మహి, తానీకిని సుఖనివేశ ♦ మనువుపఱిచి యా
ధ్యానించుచుండె శ్రీరా, మానయనముఁ గూర్చి చిత్త ♦ మం దభియుక్తా. ౨౨

—♦ గుహుండు భరతుని సేనం గూర్చి శంకించుట ♦—

ఆ॥ కన్నులార ధ్వజినిఁ ♦ గాంచి గంగకుఁ దోఁడి, గంగ యగుచు నది ప్ర ♦ కాశిలంగ
నానిషాదనాథుఁ♦డతిసంభ్రమమున స్వీ, యులనుఁ బిలిచి భావ♦మొప్పఁ బలికె.

ఉ॥ కంటిరె సేన యియ్యది వి ♦ కస్వరమై వెడసంద్రమట్టులై
మింటికి మింటి కొక్కఁడుగ ♦ మార్కొనునెంచుచు గంగఁ దోడి దా
గొంటున నుబ్బుచున్నయది ♦ క్రూరతమై భరతుండె స్వీయని
ష్కంటకితాప్తికై యిటుమఁ ♦ గాఁ దలఁపూని బిరాన వచ్చెనో. ౨౪

క॥ అంతము లే దిద్దాని క, నంత న్నలిసేయఁ జాలు ♦ నది యిదెకా మ
త్స్వాంతమును నెఱయుచున్నది, చింతాబ్ధి న్చైనుపనోవు ♦ చెట్ట నోడువుచుఁ.

తే॥ కోవిదారధ్వజుం డదె♦గోఱలుచున్న, వాఁడు సమధికకాయుండు♦వాఁడిగలఁడు
దాశవర్గంబు గెడపునో♦దాశరథికిఁ, గీడొనర్చునో యెది మదిఁ♦గీల్కొలిపెనో.

కం॥ బంధించునో యిండఱుఁ ద, ద్బంధుత్వం బెంచి దుష్ప్ర ♦ బంధుఁడు సిరికై
యాంధనృపతి త్రోచిన ని, ర్బంధము చాలదొకో రాము ♦ పై నెత్తిచనన్. ౭౭

ఆ॥ కైకయందుఁ బుట్టు ♦ గాంచి కాపురుషుండు, గాకయున్నె సిరికిఁ ♦ గాక భ్రాత
ప్రాణములకుఁ గూడఁ ♦ బాల్లించుచున్నాఁడు, నాదుప్రాణ మనెడు ♦ నయమరయఁడు.

కం॥ ఈగుహుని మే న్విడిచి యును, తేగకమును రాము నొక్కఁ ♦ డితఁ డొనరింపన్
గాఁగలఁడె కాని చూతము, వేగమువలె నానయించు ♦ వెర వలవార్పన్. ౭౯

ఆ॥ జీవసఖుఁడు భర్త ♦ సేవ్యుం డతండైనా, దేవుఁ డట్లుగానఁ ♦ దెలిసి మీరు
చాలునంతవట్టు ♦ సన్నద్ధులర యయి, నిలువుఁ డేతదర్థ ♦ నియతి దనర. ౮౦

కం॥ రామార్థకామపరులై, శ్రీమంతుల రగుచు సిద్ధిఁ ♦ జెలఁగుదురు తుదిన్
సామాన్య మనకుఁ డిదియు, న్నేమమున మెలఁగుఁ డొలయు ♦ నేర్పున నింకన్.

కం॥ ఒగి నైదునూర్ల నావలు, మొగిఁకొనఁగా నిలిపి యొడ్ల ♦ మోస మరయఁగాఁ
దగు కోడెతనమువా రా, శుగములు గొని యుండవలయు ♦ సొలయక ధృతితోన్.

కం॥ ఓడ కొకశతము వంతున, నోడక తఱి వేచి కాచి ♦ యోజ గలబలం
బాడుచుఁ బాడుచు నిలవలె, నాడిక యామీఁద నెట్టి ♦ దగునో తెలియన్.

కం॥ గంగానూపాశ్రయణ మె, సంగన్ ఫలమూలమాంస ♦ సంగ్రహ మొప్పన్
సంగతిమై నెలకొనుఁ డా, సంగం బితరము దలంగి ♦ జతన పొసంగన్. ౮౪

చ॥ బలములనెల్లఁ జయ్యనఁ బ్ర ♦ భావసమగ్రములం బొనర్చి బా
న్లైలయఁగ నేఁటిసంగడము ♦ నేమఱకుండఁగఁ జేర్చి చాఁబు
ష్కలముగ నాయుధోత్తమని ♦ కాయము లేర్పడఁ దార్చిరండు న
న్గలియ నుపాయనంబులు ర ♦ కంబులుగాఁ గొని సత్వరంబుగన్. ౮౫

ఆ॥ మంచి దలఁచెనేని ♦ మన్నింపవలయుఁ గీ, డెంచెనేనిఁ దొడరి ♦ నేగవలయు
రాముఁ గొలువఁబోవు ♦ రాణ గాకున్న మి, న్నేటివాఁక దాఁటి ♦ యెనయఁగలఁడె.

— ♦ గుహుఁడు భరతునిఁ గనుంగొనవచ్చుట ♦ —

కం॥ అని శాసించిన వారు త, దనుశ్రుతముఁ గూర్చి మొనయ ♦ నరుగుటయును వాఁ
డనుపదము రాముపదముల, ననుస్మరించుచునె ధృతిస ♦ మంచితుఁడగుచున్.

కం॥ తెచ్చినవస్తుచయంబుల, మచ్చికమెయిఁగొంచు భరతు ♦ మానితుఁ గాంచన్
జెచ్చెరఁ జనఁగ సుమంత్రుం, డచ్చుపడు విసితి నేత ♦ కినె నిట్లనుచున్. ౮౮

ఆ॥ ఈనిషాదనాథు ♦ నెఱుఁగుదే నినుఁ జూడ, వచ్చినాఁడు చాల ♦ వలనుగలఁడు
తేని కితఁడు గూర్చు ♦ నీనాఁడు రఘునాథు, భక్తియుక్తిఁ గొలిచి ♦ పరఁగినాఁడు.

ఉ॥ జ్ఞాతిసహస్రములఁ స్థపతి ♦ జాతుఁ దనుం గొలువంగ నంచితా
జ్ఞాతుఁడు కార్యదక్షుఁడు ప్ర♦శస్తబలుండును నై ప్రసక్తిమై
నీతఁడు దండకాఖ్యపద ♦ మెల్లయు నేలుచునున్నవాఁడు వి
జ్ఞాత మనంగ నా విభుని ♦ జాడయు నీతని కంచు నెంచెదన్. ౯౦

ఆ॥ కాన నితనివలన♦ఘనుని మే లరయంగ, వలయు ననిన యంత♦వాఁడు పొంగి
యింతకన్నఁ గలదె♦హితుఁడ కాఁడే తన, కన్నఁగొలుచు మహితుఁ♦డని కడంగి.

క॥ చెచ్చెరఁ బిలిపింపఁగ గుహుఁ, డచ్చటునకుఁ జని మహాత్ము ♦ ననవద్యు స్వసం
పచ్చయసువిరతు రామప, దోచ్చారణనిరతు భరతు ♦ నొయ్యనఁ గనియెన్.

ఆ॥ రాముపోక యెడఁద ♦ రారాపువెట్టంగ, నొగులుచున్నవానిఁ ♦ బగులఁదిట్టి
చెట్ట నెట్లు గట్టి ♦ సేసెనో విధి యను, వానిఁ బెరసె దాశ ♦ వల్లభుండు. ౯౩

క॥ సంసారవిరతిఁ ద్రిజగ, త్సంసారిపదాశ్రయణమె ♦ చాలు నని తదా
శంసాపరులఁ గొని యఘ, ధ్వంసాదృతి నెగడువాని ♦ వందితమానిన్. ౯౪

తే॥ తమ్ముఁ డార్యులు మంత్రులుఁ ♦ దన్నుఁ జుట్టి
రాముగొనములు వర్ణింప ♦ రక్తుఁడయ్యు
నంబుదశ్యామతనుఁడు చీ ♦ రాంబరుండు
కృతజటామకుటుఁడు నై ప్ర ♦ కృష్టుఁడగుచు. ౯౫

క॥ ఉన్నయతని సన్నుతు నా, పన్నుం బ్రతిపన్నుఁ జూచి ♦ బళిరా మారా
మన్నకుఁ దగుతమ్ముఁడె ము, న్నిన్నయితి నిట్టు లటంచు ♦ నెసఁగెడు భక్తిన్.

తే॥ విచ్చుకత్తులవారు ప్రా ♦ వీణ్యమెసఁగ, బలసిరాఁ దెచ్చినట్టి యు ♦ పాయనముల
నప్పనము సేసి సాష్టాంగ ♦ మైన వంద,నం బొనర్చి కడుం బ్రీతి ♦ ననుచుటయును.

—♦ భరతుఁడు గుహుని బహూకరింప నవ్వాఁ డాతనిఁ దనయింటికి రమ్మని వేఁడుట ♦—

ఆ॥ అతఁడు గ్రుచ్చి యెత్తి♦యాలింగన మొనర్చి,యాదరంబుమెయి న♦నామయంబు
పృచ్ఛసేసి చెలిమిఁ ♦ బెనుచుధోరణి వాని, నాత్మబంధుఁగాఁగ ♦ నరసె నపుడు.

క॥ గుహుఁ డాతని గురుభక్తికిఁ, గుహాకత్వము లేక తన్నుఁ ♦ గూర్చుకొనుటకున్
సహపరమామోదుం డయి, యహంయుత స్వీడి వాని ♦ కల్లన ననియెన్. ౯౯

క॥ ఆరామనిభమ కాదే, యారామవిభుండు నీవు ♦ నన్యులె పురికిన్
జేర నచ్చియు మాపై, నేరం బిడినట్టు లిచట ♦ నిలుచుట వెరవే. ౧౦౦

తే॥ దాసకులమున కేతేరఁ♦దగునుఁ గంద,మూలఫలములుగాని యా♦మోదమొసఁగు
రాజయోగ్యములగుపదార్థములుగాని,యొనయఁజేయుదుమిందొక్కఁ♦డెరవులేదు.

క॥ ఈసేనతోడఁగూడ ను, పాసించెద నిన్ను భక్తిఁ ♦ బాద్యప్రముఖ
శ్రీసారములగు విధులన్, భాసురకృతుఁ జేయవే శు♦భంకర యనినన్. ౧౦౩

ఆ॥ అనఘుఁ డాతఁ డిట్టు ♦ లనె నీప్రయత్న మ, త్యూర్జితంబ కాదె ♦ యొకఁడ వింత
సేన కభిసమర్చ ♦ సేయుము నంటి మ, ద్గురుసఖుండ వొంటఁ ♦ గొఱఁత గలదె.

క॥ తన కింతయుఁ గృత మయ్యెను, మొనసి భరద్వాజుఁ గొలువ♦ మునిపదమునకున్
జనవలె గంగానూపం, బనితరసాధ్యంబు గడచు ♦ నవ్విధిఁ జెప్పుమా. ౧౦౪

క॥ అని తన్నడిగిన గుహుఁ డ, య్యనఘున కిట్లనియె నింత ♦ యన నేమిటి కి
ప్పనివల నిది యని యరయమి, ననుమానం బొదవెఁ గాన♦ నడుగఁగ వలసెన్.

ఉ॥ అంతకు నేన యాదు విది ♦ తార్థుఁడ నైతిన యేని నొంట నొ
క్కింతయుఁ బాటులేక యొక ♦ యెత్తున నైన సిరి స్మరింప కి
ట్లింతటి సేనఁ గొంచు వని ♦ కేగఁ దలంపఁగ నేమివచ్చె నీ
వింతయలంత కా ఫలము ♦ వేఁడెద నూఱట గల్గఁ జెప్పవే. ౧౦౬

క॥ రామున కొండు దలంపమి, నామదికిం దోఁచెనేని ♦ నరవర నీకే
యామయ మొదవకయుండం, గా మొనసెద జ్ఞాతివర్గ ♦ కలితుఁడ నగుచున్.

ఆ॥ అనిన వెచ్చనూర్చి♦యలమటపా లయి, కైకచేఁత నెంత ♦ కానివాఁడ
నైతి ననుచుఁ బొక్కి♦యాతని గురుభక్తి, ఫక్కి కెదఁ గరంగి ♦ పరు వెఱింగి.

క॥ ఆకాశనిర్మలుం డనె, నాకష్టము లెన్నఁబోకు ♦ మన్నా యింకన్
నాకాంక్షితార్థ మారసి, యేకరణిం బలికె దట్టు ♦ లేఁ జరియింతున్. ౧౦౯

ఆ॥ అన్నఁ దోడితేర♦నరుగుచున్నార మీ, విన్నపంబు మెచ్చు ♦ విధము విభుఁడు
సూపెనేని నపుడె♦సోరిదినై నర్చించు, పనికి వలసె నింత ♦ పరిభవంబు. ౧౧౦

క॥ ఆనిర్ణయనిష్ఠానిధి, నానిర్దోషత్వ మరసి ♦ నను మన్నింపన్
మేనిదెస నాస లూనెద, మానెదఁ గాకున్నలోక ♦ మాన్యుఁడ నగుచున్. ౧౧౧

తే॥ అన్నకుం గూర్తు గురుకన్న♦నధికుఁగాఁగ, నెంతు నిచ్చఁ బ్రపత్తి సే♦వింతు నాదు
కర్మవశమునఁ గలిగె నీ♦కలవరంబు, నొవ్వ గంటిని సత్యమ్ము♦నోడువాఁడ.

క॥ కైకోలు నెఱపుమయ్యా. కైకవలని జనిమ తక్కఁ ♦ గాఁ బెరయఁ డితం
డేకొలయు నని తలఁపుమ, య్యా కారుణికత్వ మెలయు ♦ మయ్యా సుకృతిన్.

చ॥ కొలిచితి రాముఁ దత్పదముఁ ♦ గూర్చితి శీర్షము నాధుకౌఁగిటన్
మలసితి వాత్తకాముఁడవు ♦ మానుషదేహము సార్థకంబుగా

మెలఁగితి స్వామిపూజల న ♦ మేయగుణాకర నన్నుఁ జేర్చు న
ప్పొలితినిఁ బున్నెముం గొనుము ♦ భూరియశం బెసలారుచుండఁగన్. ౧౧౪

—♦ గుహుండు భరతునిభావం బారసి సంతసించుట ♦—

మ॥ అనినన్ సంతసమంది సంతమస మొ ♦ య్యన్నీఁడె బోధోదయం
బనవద్యం బననయ్యె నేకపట మే ♦ నందంగఁబో నింక ధా
త్రిని ధన్యుం డన నీవ కా కితరుఁడే ♦ శ్రేయం బుపేయంబె నాఁ
దనరెం జేసి తయత్నలబ్ధధనసం ♦ త్యాగంబు శుద్ధాత్మతన్. ౧౧౫

ఆ॥ మేలు మేలు తండ్రి ♦ మేకొంటి శాశ్వతిఁ, గీర్తిఁ గొంటి వీవు ♦ కేవలుఁడవె
యింక నిన్నె పొగడు ♦ నీరేడులోకంబు, లన్నఁ గొలిచి నెగడు ♦ సన్న లరసి.

క॥ రాము సుగుణాభిరాము సు, ధాముఁన్ గొని తేర బంధు ♦ తతితో నరు లి
ట్లాముకొన నరుగుచుంటివి, నీముచ్చట మురువుఁ బొగడ ♦ నేర్తురె యితరుల్.

చ॥ అని గుహుఁ డాడుచుండఁ దన ♦ యన్వయము న్వెలయింపఁ బుట్టినా
డనఘుఁడు వీఁడు రాముఁ గను ♦ నంతకు జాలము పోలదంచుఁ జ
య్యనఁ జనె భానుమంతుఁడు మ ♦ హామహుఁ డన్నిలవెల్ల వెల్గులన్
దనరఁగఁ జేయుచుండునెటఁ ♦ దా మదినుంచి హిమాద్రినందనీ. ౧౧౮

తే॥ రాత్రిరా సైన్య మెల్ల బి♦రాన సన్ని, వేశ మొనగూర్పఁబంచి వి♦వేకి గుహుఁడు
తన్నుఁబరితుష్టునిం జేయఁ♦దటియ భరతుఁ, డనుజుతోడ శయ్యాస్థల♦మందియుండె.

—♦ భరతుండు సంతాపపడుచుండ గుహుం డతని నూఱార్చుట ♦—

సీ॥ దావాగ్ని దరికొను ♦ తటిలోని యగ్గిచేఁ, దరురాజ మనఁగ సం ♦ తాప మొనసి
యినురశ్మి లెనసిన♦హిమవంతమున హిమ, మెట్టు లట్టులు స్వేద♦మెడల సడలి
యలుఁగులు డెగిన య♦బ్జాకరంబున నీర, మై బాష్ప మొడియంగ♦నలసిసొలసి
యబ్ధి మున్గెడు నావ ♦ యట్టిదా మది గావ, నేరమిఁ గర్మంబె ♦ నిర్ణయించి
రామచింతామయంబు వి♦రామ మిడక, తన్నుఁ బొదివిన శోకంబు♦దలఁగలేని
వాఁడు ధర్మాభిరతుఁడు మ♦హ్వంబు గెడయ, జేయు నద్దశ కయ్యెఁ బ♦ద్మాయతాక్షి.

తే॥ ధ్యాననిర్దర ముచ్ఛ్వాస♦ధాతుతతి ప్ర, యాసశృంగము మోహాద్య♦నంతసత్త్వ
మార్తిపాదపచయము తా♦పౌషధికము, దుఃఖగిరి త్రొక్కె వానిఁ దో♦డ్తోడ గిరిజ.

క॥ నాథునిఁ బాసితి నే నని, యూథచ్యుతము వృష మట్టు ♦ లొగి దుర్మనుఁడై
యాధిజ్వరపీడితుఁ డతఁ, డాధర్మపరుండు బడలె ♦ నంభోజాక్షీ. ౧౨౨

ఆ॥ ఆనిషాదవిభుఁ డ ♦ నంతంబు తద్దుఃఖ, మరసి పెరసి యిట్టు ♦ లగునె తండ్రి
కానఁబోవుచుంటి♦గాదె యగ్రజు ముట్ట, మునుఁగ నొంపు తన్ను♦మోవఁగలఁడె.

క॥ అని యాశ్వాసించుచు నా, య్యన రాముని మేల్మి పొగడి♦యనఘుఁ డతని కొ
ల్వున లక్ష్మణుండు మెలఁగుటఁ, గొని గొనకొని మఱియు ననియెఁ♦గోవిదవంద్యా.

మ॥ శరచాపాసివిశిష్టుఁడై సగుణుఁడై ♦ జాగ్రత్కలోపేతుఁడై
విరతిం బూనక భ్రాతృగుప్తి కయి ని ♦ ర్వేలపరిభావంబు మే
ల్పరఁగన్ రాత్రి మెలంగు లక్ష్మణుని వ్యా ♦ పారంబు వీక్షించి త
త్పరతం దత్సఖ మెంచి నేఁ బలికితిం ♦ బ్రస్తావ మొప్పారఁగన్. ౧౨౫

శా॥ సీతై గూర్చితి మయ్య శయ్యయిదె యీ ♦ నిర్నిద్రతం గొన్న దు
ష్పాకం బందదె మేను మెత్తనిది నీ ♦ భారంబు కైకోలునం
బ్రాకట్యంబు వహింతుఁ గష్టమనుచున్ ♦ భావింప రీజాతివా
రేకాలంబును సత్య మింతయు మదిన్ ♦ హేతుస్థితిం జేర్పవే. ౧౨౬

ఉ॥ రాముఁడె యిష్టబాంధవుఁడు ♦ రాముఁడె దైవము దేవుఁడన్న శ్రీ
రాముఁడె యెల్లయర్థములు ♦ రామునియందె ఘటింపనేర్చి యు
ద్దామతమైఁ జరింతు వెడ ♦ దంభము లే నెఱుఁగ న్మదీయమా
నేమముఁ జిత్తగింపు మెడ ♦ నెవ్వగఁ జేర్పకు మేవిధంబునన్. ౧౨౭

ఆ॥ ఏనుఁ దత్ప్రసాద ♦ మెనసి సంసృతివార్ధి, నుత్తరింపఁ దలఁచి ♦ యున్నవాఁడ
నమ్మమింతవట్టు ♦ నాతల్లిదండ్రులౌ, వీరిఁ గాచికొనెదు ♦ వెర వెఱుఁగనె.

క॥ ఈయడవిలోన నెద్దియు, నాయరయనియదియ లేదు ♦ నాజ్ఞాతులు నే
నీయెడ ధనుర్ధరులమై, యీయధిపుం గొలిచి యుందు ♦ మేమఱ కెపుడున్.

తే॥ ఒక్ల చతురంగబలముల♦నొక్కమాత్ర, గెలుతు మర్పింతు మనువులు♦గేళిమెయిని
రాముఁ డనినను నెడఁద ది ♦ రమ్ము సేసి, నీవు శయనింపుమయ్య వి ♦ నిర్మలాత్మ.

ఆ॥ అనిన ధర్మ వాకఁడె♦యతనిదృష్టికిఁ గూర్చుఁ, గాని యొండొకొండు♦గాదు మమ్ము
దేర్పఁ దొడరె నిల్లు ♦ దిక్కక నెలకొను, రామభక్తి కడుది ♦ రమ్ము పఱప.

చ॥ అతిసుకుమారి దేవి తన ♦ యంఘ్రిలచెంగట మేను వైచి యే
స్థితియుఁ దలంప కొత్తిగిల ♦ శ్రీఘనుఁ డారఘునాథుఁ డట్టు లీ
క్షితిఁ బడి చేద్పడంగ నెటు ♦ శేముషి నిల్పుదు నిద్రఁగాంతు జీ
వితము ధరింతు సౌఖ్యములు ♦ వేడ్కలు నెంతు వచింపుమో సఖా. ౧౩౨

తే॥ తృణములంబడి సీతతోఁ♦దెరలు నితనిఁ, గంటె తెఱఁగంటిబంట్లు ర♦క్షఃప్రవరులు
నొక్కఁడై యెత్తివచ్చిన♦నుదిలపడక, యోర్చువాఁ డిటుగా♦నెటు లోర్చువాఁడ.

క॥ బలుముంక్లు గఱకుటా ల్గల, నెలవులఁ దెర్లాడవలసె ♦ నిర్ణయ మిటులై
యలవడె విధి తనతలపున, చలము వహించిన మఱల్ప ♦ శక్తుఁడు గలఁడే. ౧౩౪

తే॥ పలుతపంబులు నెఱపెగా♦సిలెనుఁదండ్రి,యిమ్మహాత్మునిఁబడసి తా♦నెడఁదమెచ్చఁ
దగినపుత్రుఁ డితండ పో ♦ దశరథునకు, నెలమిమాలిన పెరమూఁక ♦ నెన్న నేల.

సీ॥ రాజు జీవింపఁడు ♦ రాము నిల్లెడఁబాసి, విశ్వధాత్రియు నేఁడె ♦ విధవ యగును
నెలుఁగురాల్పడ నేడ్చి♦యెడయుదు రంగనల్, శుద్ధాంత మంతయు♦శూన్యతఁగను
గౌసల్య యొడయని♦గతిఁ గాంచు మాతల్లి, తరలునో యాపుత్రుఁ♦దలఁచి మనునొ
గోరిక లన్నియుఁ♦గోలుపుచ్చి రిఁకేల, రామురాజ్యముఁ గాంచు♦రహి తలంగఁ

బోయెఁబోయెను మేల్మి యీ ♦ ప్రొద్దు గడవ
నయ్యయోధ్య మహాకష్ట ♦ మందఁగలదు
తండ్రిసంస్కార మొనరించు ♦ ధన్యుఁ డెవఁడొ
రాణమెయిఁ బురి నేలఁగను ♦ రాయఁ డెవఁడొ. ౧౩౬

చ॥ బలయుత రమ్యచత్వర వి ♦ భక్తమహాపథ భర్మహర్మ్యసం
వలిత మనోజ్ఞతూర్యరవ ♦ వర్ధితశోభన హృష్టపుష్టభా
వలలిత సజ్జనోచిత ప్రి ♦ యాలసుమ ప్రసవాఢ్యయోగ పు
ష్కలవనలక్ష్మి యిన్నగరిఁ ♦ గాచి సుఖించెడి వాఁ డెవండొకో. ౧౩౭

క॥ మాతండ్రిరాజధాని స, మేతోత్సవఁ గాంతుమొక్కొ ♦ మేముఁ బ్రతిన నీ
ర్భాతి కుశలిమై నెఱపెదు, వ్రాతఫలము గలిగి మరలి♦వచ్చితి మేనిన్. ౧౩౮

ఆ॥ అనుచు జాలి వొడమ ♦ నమ్మహామహుఁడు దుః, ఖించుచుండ నేనుఁ ♦గీర్తనీయు
తోడివాఁడ నగుచు♦వీడఁబాఱకె యుండ, నడరు శర్వరియు ద♦శాంత మెనసె.

క॥ పొద్దుపొడుపు గనుఁగొని వా, రిద్దరు జడ లల్లుకొని మ ♦ హీయఃప్రతిభల్
ముద్దియతోఁ దరలిరి నేఁ, దద్దయు సుఖవృత్తి నేఱు ♦ దాటింపగన్. ౧౪౦

ఆ॥ నేమ మొప్పుచుండ♦నేలఁద్రొక్కుచుఁ బోవు, వారు జడలుచుట్టు ♦ వల్కలములుఁ
గట్టువారు వనులఁ♦గందమూలాదులు, దినెడువారు నగుచు♦మొనసి రనఘ.

చ॥ అని తన కప్రియం బయిన ♦ దంతయు వాఁ డెఱిఁగింప ధ్యానముం
గొని యొకలీల నుండి ధృతిఁ ♦ గోల్పడి తద్దయు నేలఁ గూలెఁ జి

క్కనకరి తోమరాహతులఁ ♦ గీడ్పడుచందము దోఁప దుర్మనుం
డనితరవర్తనుండు నయి ♦ యత్యవసన్నదశాభిపన్నతన్. ౧౮౨

ఆ॥ అధికసౌకుమార్యుఁ ♦ డటు ప్రియదర్శనుం, డబ్జలోచనుఁడు మ ♦ హాభుజుండు
తనదుతోడు తెరలి♦ధరఁ బ్రాల శత్రుఘ్నుఁ, డడలె నతనిఁ బొదివి♦యనువుఁ బాసి.

క॥ అందఱు తల్లులు వారల, చందముఁ గని చేరి మున్నె ♦ సన్నసెడినవా
రెందు గతి గాన కేడ్చి ర, మందధ్వను లెసఁగ దీర్య ♦ మాణహృదయలై.

క॥ మతిసెడియుఁ గోసలాత్మ జ, సతీతిలక మట్లు సేరఁ ♦ జని నేర్పున నా
సుతుఁ బొదివి యంకమున నిడి, యతులితవాత్సల్య మొప్ప ♦ ననె నిట్లనుచున్.

—♦ భరతుఁడు రామునికష్టంబులు విని మూర్ఛవోవఁ గౌసల్య యాతని నూఱడించుట ♦—

ఆ॥ పేరులేని వ్యాధి ♦ పెరసెనే నాతండ్రి, యేల యిట్టు లైతి ♦ వింతలోనె
యధిపుఁ బాసి యనదనై ♦ రాము వని కంపి, నిన్ను జూచి బ్రదుకు ♦ చున్నదాన.

క॥ ఈగతిలేని పసుల కీ, వే గతి యనుకొంటిఁ దమ్ము ♦ డెలనాగయుఁ దో
డ్తోఁ గదిసి చనఁ ద్వదగ్రజుఁ, డేగిన విధ మెంచి యిట్టి ♦ యెడ నేమందున్.

తే॥ ఏకపుత్రినౌ నాపుత్రు ♦ నెడనకాని
లక్ష్మణుని దెసఁగాని యే ♦ లావుసెడిన
వార్త వినరాదుగా యేల ♦ వల నెడలితి
తెలుపు మోయన్న యీమూర్ఛఁ ♦ దేఱఁగాంచి. ౧౮౮

క॥ అని బోధించిన నెట్టన, ఘనయశుఁ డాతండు తెలివి ♦ గననై యమ్మా
తను నూరడించి గుహునిం, గనుఁగొని యిట్లనియె నార్తి ♦ గడలుకొనంగన్.

—♦ గుహునివలన రాముని కష్టములు విని భరతుండు పరితపించుట ♦—

ఆ॥ నాఁటిరేయి గడపె ♦ నాయన్న యెచ్చోట, నుండి తమ్ముతోడ ♦ నువిదతోడ
నెది భుజింపఁగాంచె♦నేయెడ శయనించెఁ, దెలుపుమయ్య సఖుఁడ♦తేటపడఁగ.

చ॥ అనిన నిషాదనాథుఁ డను ♦ నాతనియోగ్యత కిచ్చమెచ్చుచున్
జనవర రాము నయ్యతిథి ♦ చంద్రము సాంద్రకుతూహలంబునన్
మొనసి నమస్కరించి ఫల ♦ మూలసులక్ష్యరసాన్నజాతము
ల్గొనకొని చేర్చి యేర్చి యిడి ♦ కూర్మి గ్రహింపుఁ డటంచు వేఁడితిన్. ౧౯౧

ఉ॥ సత్యపరాక్రముండు వర ♦ సంయమిపూజ్యుఁడు రాముఁ డన్నిటిన్
బ్రిత్యనుషక్తభావమున ♦ భావనసేసి స్వధర్మమెంచి సం

ప్రత్యయము ల్పొచించెఁ జొరఁ ♦ బాటిగ్రహింపఁగఁబోఁ డొకొండ్లకున్
నిత్య మొసఁగుదాత గొన ♦ నేర్చునె యొడ్లపదార్థ మెద్దియున్. ౧౫౭

ఆ॥ ఆతఁ డనునయించె ♦ నందఱ లక్ష్మణా, నీతగాంగజలము ♦ నిర్మలంబు
గొనియె సాంధ్యవిధుల ♦ గొనకొని తీటిచి, శిష్ట మదియ త్రావఁ ♦ జిత్తగించి.

క॥ ఆముప్వురు నుపవాసం, బామెయి నెఱపిరి సుమిత్రి ♦ యధినందనుఁ డే
నేమమునఁ గుశాస్తరణము, రామునకుం గూర్చెఁ దరువ♦రమ్మునకిందన్.

ఆ॥ సీతతోడ నందుఁ ♦ జేరి రాఘవు డుండ, వారిచరణములను ♦ వారి వోసి
కడిగి చల్లుకొని ని ♦ కామభక్తి ననుజ్ఞ, వడసి నన్నుఁ జేర ♦ వచ్చె నపుడు.

క॥ ఇదె యాయింగుది యను తరు, విదె యాతృణశయ్య రాముఁ ♦ డింతిసరస న
య్యదనున రాత్రిరిఁ బుచ్చెను, విదితుం డటులొదిఁగి కీర్తి ♦ వెలయఁగ నధిపా.

క॥ శరరాజంబు లిషుధులుం, గరాంగుళిత్రములుఁ దాల్చి ♦ ఘనకార్ముకమున్
వరగుణయుతము నొనర్చి సు, నిరతిన్ లక్ష్మణుఁడు కాపు ♦ నెటెనుండె నృపా.

క॥ ఏనును నాబంధుగులును, నానెటి నన్నేతఁ గొలువ ♦ నైతిమి సన్నా
హానూనత తనదారఁగ, నానిశఁ గడపితిమి సుకృతి ♦ మజ్బె నటంచున్. ౧౫౮

క॥ అని నిపుణముగాఁ బలుకు న, తని పలుకులు వినుచు నరిగెఁ ♦ దల్లులు మంత్రుల్
తనతోడరా నచటు గన, ఘనాశయుం డాతఁ డపుడు ♦ కల్యాణగుణా. ౧౫౯

ఉ॥ ఇంగుదిమూలమం దరసె ♦ నిందునిభాస్యుఁడు రాముసెజ్జ వా
రిం గని పల్కెఁ గంటిరె య ♦ రీణుఁడు దర్భశయానుఁడైన తీ
రంగదఁగూర్పదే పరుల ♦ కైన సుఖోచితుఁ డార్తిఁగూర్చు రా
త్రిం గడపె న్విమర్ద మిదె ♦ తెల్పెడుఁగాదె తదీయకష్టమున్. ౧౬౦

తే॥ పెద్దవారికొలంబునఁ♦బేరు పెంపు, గలిగ పొడిమినవాఁడు శ్రీ ♦ ఘనుఁడనఘుఁడు
దశరథతపఃఫలం బనఁ ♦ దనరువాఁడు, రాముఁడా యిట్టిపట్ల రా ♦ రాపుపడుట.

సీ॥ మేరుదేశ్యత దోఁప ♦ మెఱుఁగారు బంగారు, పోఁడుము ల్గల సప్త ♦ భూమికలను
జంద్రప్రశాశ్రప ♦ చారంబు నడిఁకించు, చంద్రశాలాసము ♦ చ్ఛాయ్రయములను
బుష్పసంచయచిత్ర ♦ పుణ్యాగంధోపేత, సంస్తరప్రథితసం ♦ స్థానములను
శుకశారికాలాప ♦ శుద్ధాగమకలాప, భవ్యోపవనసరః ♦ ప్రాంతములను
మెలఁగువాఁడు జిలుగు ♦ మెత్తనిసెజ్జపై, మేనువైచి స్తుతుల ♦ మేల్మి గీత
సత్కలావిశేష ♦ సంగతి మేల్కాంచు, వాఁ డతండుఁ దగునె ♦ వన్యగతికి.

క॥ వందనము లొనర్తురు వర, వందులు మాగధులు సూత ♦ వర్యులు కవులున్
సుందరతరగాథాని, ష్యందరసామేయపరవ ♦ శత్వము పొసఁగన్. ౧౬౩

తే॥ మేలుకొలుపుదు రతనిఁ గ్రొ♦మ్మెఱుఁగుఁబోఁడు, లాటపాటలవలనుల ♦ నతివిచిత్ర
గాథల విపంచికాంచిత♦కళల మురజ,రణనముల భూషణరవాంత♦రములఁ దేర్చి.

క॥ పరులని తే రెల్లరు నా, పరంతపునిఁ గొలుచువారె ♦ ప్రాభవము గుణా
కరుఁ డతఁడు పొడమినప్పుడె, పరఁగెం దదధీన మగుచుఁ ♦ బ్రాజ్ఞులు వొగడన్.

తే॥ సత్యమని నమ్మఁదగని దీ ♦ జాడచూడ, నమ్మహామహుఁ డీజాలి ♦ కయ్యె ననిన
మోహమో స్వప్నమో విధి♦మోసమో త,టస్థమైనది మది కియ్య ♦ వస్థఁగూర్ప.

క॥ ఎవ్వారి నందుఁ గాదని, యెవ్వారు మలంక దీర్తు ♦ రిదమిత్థ మటం
చెవ్వారిసదుపదేశము, నివ్వటిలెడు తాప మార్చి ♦ నెలకొననగునో. ౧౬౭

తే॥ కాలదోషంబు నెట్టన ♦ గడలుకొనిన, దైవతము బలవత్తర♦త్వము దలంగు
దాశరథి రామచంద్రుఁ డే♦తద్వశమునఁ,బొడవు సెడిభూమిపైఁబడి♦పొరలెననఁగ.

ఉ॥ నాదుగురుండు భాసిత గుణ ♦ నందుఁడు కోసలుకన్నె పున్నెపుం
బాదునఁగన్న కల్పకము ♦ పావనుఁ డారఘుపుంగవుండు నేఁ
డీదెసనుండె నీతృణము ♦ లేర్పడె సెజ్జకుఁ బొర్లిగింతలన్.
క్రోదిసెడంగనై నలిగి ♦ పోయిన వవ్వియుఁ జక్కఁ గంటిరే. ౧౬౯

క॥ అమ్మెయిస్థండిలముననే, యమ్మహిజాత గుణపూత ♦ యౌవతమణి తా
నెమ్మె సెడఁగ శయనించెను, సొమ్ముపసిఁడిచుక్క లిందుఁ ♦ జూపట్టంగన్. ౧౭౦

క॥ ఈకఠినకుశాస్తరణం, బేకరణిం గొనెనొ కాంచుఁ ♦ డీ యదసీయం
బౌ కౌశేయము ప్రోగుల, సాకేతపురీంద్రుస్నుషకుఁ ♦ జనుఁగద యిదియున్.

ఆ॥ అలవిదేహవిభుని ♦ యాత్మజ సుకుమారి, సాధ్వి బాల యీయ ♦ శస్త శయ్య
భర్తఁ గొలుచునెఱినిఁ ♦ బాటింపదొకాని, యెన్నఁడెఱుఁగు నిట్టి ♦ హీనగతిని.

క॥ ప్రియదర్శన రఘురాముని, దయిత శయిత యయ్యె నేల ♦ దశరథుస్నుష సీ
త యనఘ యఘములపా లయి, నియతిగడవవశమె భువన♦ నేతకునేనిన్. ౧౭౩

ఉ॥ ఈమహనీయు లీసుకృతు ♦ లీయనవద్యులు దంపతుల్మహా
శ్రీమహితంబు రాజ్యమునుఁ ♦ జెచ్చెర వీడి యనాథవృత్తి ని
ట్లామయ మందఁగా నరసి ♦ హా మనువాఁడ నృశంసుఁ డింక నొం
డీమహి నున్నవాఁడె నను ♦ నిందఱుఁ దిట్టరె మేలు గాంతునే. ౧౭౪

క॥ వందనము లొనర్తురు వర, వందులు మాగధులు సూత ♦ వర్యులు కవులున్
సుందరతరగాథాని, ష్యందరసామేయపరవ ♦ శత్వము పొసఁగన్. ౧౬౩

తే॥ మేలుకొలుపుదు రతనిఁ గ్రొ♦మ్మెఱుఁగుబోఁడు, లాటపాటలవలనుల ♦ నతివిచిత్ర
గాథల విపంచికాంచిత♦కళల మురజ,రణనముల భూషణరవాంత♦రములఁ దేర్చి.

క॥ పరులని తే రెల్లరు నా, పరంతపునిఁ గొలుచువారె ♦ ప్రాభవము గుణా
కరుఁ డతఁడు పొడమినప్పుడె, పరఁగెం దదధీన మగుచుఁ ♦ బ్రాజ్ఞులు పొగడన్.

తే॥ సత్యమని నమ్మఁదగని దీ ♦ జాడచూడ, నమ్మహామహుఁ డీజాలి ♦ కయ్యె ననిన
మోహమో స్వప్నమో విధి♦మోసమో త,టస్థమైనది మది కియ్యె ♦ వస్థఁగూర్ప.

క॥ ఎవ్వారి నందుఁ గాదని, యెవ్వారు మలంక దీర్తు ♦ రిదమిత్థ మటం
చెవ్వారిసదుపదేశము, నివ్వటిలెడు తాప మార్చి ♦ నెలకొననగునో. ౧౬౭

తే॥ కాలదోషంబు నెట్టన ♦ గడలుకొనిన, దైవతము బలవత్తర♦త్వము దలంగు
దాశరథి రామచంద్రుఁ డే♦తద్వశమునఁ,బొడవుసెడిభూమిపైఁబడి♦పొరలెననఁగ.

ఉ॥ నాదుగురుండు భావిత గుణ ♦ నంద్యుఁడు కోసలుకన్నె పున్నెపుం
బాదునఁగన్న కల్పకము ♦ పావనుఁ డారఘుపుంగవుండు నేఁ
డీదెసనుండె నీతృణము ♦ లేర్పడె సెజ్జకుఁ బొర్లిగింతలన్.
బ్రోదిసెడంగనై నలిగి ♦ పోయిన వవ్వియుఁ జక్కఁ గంటిరే. ౧౬౯

క॥ అమ్మెయిస్థండిలమున నే, యమ్మహిజాత గుణపూత ♦ యావతమణి తా
నెమ్మెసెడఁగ శయనించెను, సొమ్ముపసిఁడిచుక్కలిందుఁ ♦ జూపట్టంగన్. ౧౭౦

క॥ ఈకఠినకుశాస్తరణం, బేకరణిం గొనెనొ కాంచుఁ ♦ డీ యదసీయం
బౌ కౌశేయము ప్రోగుల, సాకేతపుకేంద్రుస్నుషకుఁ ♦ జనుఁగద యిదియున్.

ఆ॥ అలవిదేహవిభుని ♦ యాత్మజ సుకుమారి, సాధ్వి బాల యీయ ♦ శస్త శయ్య
భర్తఁ గొలుచునెఱినిఁ ♦ బాటింపదోకాని, యెన్నఁజెఱుఁగు నిట్టి ♦ హీనగతిని.

క॥ ప్రియదర్శన రఘురాముని, దయిత శయిత యయ్యె నేల ♦ దశరథుస్నుష సీ
త యనఘ యఘములపాలయి, నియతిగడవవశమె భువన♦నేతకునేనిన్. ౧౭౩

ఉ॥ ఈమహనీయులీసుకృతు ♦ లీయనవద్యులు దంపతుల్మహా
శ్రీమహితంబు రాజ్యమును ♦ జెచ్చెర వీడి యనాథవృత్తి ని
ట్లీమయ మందఁగా నరసి ♦ హా మనువాఁడ నృశంసుఁ డింక నొం
డీమహి నున్నవాఁడె నను ♦ నిందఱుఁ దిట్టరె మేలు గాంతునే. ౧౭౪

ఉ॥ ఎంతటివారలుం దఱియ ♦ రీపురి నీభువి నెన్నఁడేని సా
మంతుఁడు రాముఁ డయ్యడవి ♦ మంతనమంచుఁ జరించునేనియుఁన్
జింతకుఁగూర్పదే యతని ♦ చిక్కులతోఁడిది బాహువీర్య మీ
పొంతకు వత్తురే యిచటి ♦ భూతి విపాన్నత నొంచరే రిపుల్. ౧౮౭

చ॥ ఇదిమొదలేను భూమిపయి ♦ నే తృణశయ్యనె పవ్వళింతు బో
న్కుడు ఫలకందమూలములె ♦ కూర్తు జటల్తరువల్కలంబులుఁన్
వదలకదాల్తు నిల్తె జన ♦ వందితుఁ డారఘువేద్యు పాదముల్
బ్రదుకుదుఁ గొల్చి తత్కరుణఁ ♦ బాటిలవే సుఖవృత్తు లన్నియుఁన్. ౧౮౮

చ॥ అతఁడు ప్రతిశ్రవం బెడయ ♦ నంచు వచించిన నేఁ దదర్థమై
గతిగనువాఁడ నుత్తరముఁ ♦ గాలము నెల్లఁ గ్రమింపఁ గానలో
నతులితు నీసుమిత్రసుతు ♦ నండగఁ గైకొని యెల్ల కానన
బ్రీతినయుఁ జెల్లు నట్లయిన ♦ భర్త భరించును రాజ్యభారముఁన్. ౧౮౯

తే॥ తన్ను లక్ష్మణుఁ డిట్టులే ♦ తవిలికొలువ, రాముఁ డుండు నయోధ్యాపు ♦ రంబునందు
భువనపరిపాలనంబునం ♦ బూన్చువార, లీగురువరేణ్యు లీహితు ♦ లెల్లద్విజులు.

క॥ నాపాప మెట్లు వాపఁగ, నోపుదు నీకైక కూర్చి ♦ యునిచినయది నే
నాపై నిర్లేపుఁడనై, యేపగిదినయేని మెలఁగి ♦ యెలయింతు ధృతిన్. ౧౯౧

ఆ॥ కాళ్లఁ జుట్టుకొంచుఁ ♦ గదలనీయక వేఁడి
కొందు నట్టులైనఁ ♦ గూర్చువాఁడు
గాఁడె విభుఁడు నన్నుఁ ♦ గడకుఁదోయునె ప్రసా
దము వహింపఁడే ము ♦ దం బొసఁగఁడె. ౧౯౨

క॥ కాదన వనమున నుండెద, నాదయితుం గొలిచికొని త ♦ దనువర్తన మా
మోద మిడఁజాలు సుర లను, మోదింతురుగాత నాదు ♦ ముచ్చటలెల్లన్.

క॥ అని నిశ్చయించి భరతుఁడు, గొనకొని యారేయి గంగ ♦ కూలంబున నె
ట్టన గడపి వేగుఁబోక నె, యనుజునితో నిట్టు లనియె ♦ నాతురుఁడగుచున్.

—♦ భరతుఁడు శత్రుఘ్నుని మేల్కొలిపి గంగదాఁటింప గుహునిఁ బ్రార్థించుట ♦—

తే॥ ఏమి శత్రుఘ్న నిద్రించె ♦ దింక భద్ర
మగునుగావుత మేల్కాంచి ♦ యనువు మీఱ
గుహునిఁ బిలువుము చెలికాఁడు ♦ కూర్మినెఱయ
గంగ దాఁటించు మేలి ప్రి ♦ సంగమొలయ. ౧౯౩

క॥ ఈనాఁడే సేవించెద, మానాయకు మేలియడుగు ♦ లంచితములు శ్రీ
మానితము లెల్లదొనఁగులు, వో నెగడెద మవల ననుచు ♦ పున్నెంపుసిరిన్.

ఆ॥ అనిన నిదురవోవ ♦ నయ్య మేల్కొనియుంటి
నన్న చెయిద మెడఁద ♦ నలముకొనఁగ
ననుచు మేలుకొలుపు ♦ నతనితో శత్రుఘ్నుఁ
డనియె నచటుసేరఁ ♦ జనియె గుహుఁడు. ౧౯౭

ఉ॥ ఆనరసింహు లట్టినెఱి ♦ నాలపనంబు లొనర్చు చుంచుచున్
దా నరలేక దోసిలిని ♦ దాశవిభుం డలికంబుదార్చి దే
వా; నదిపొంతనిల్చి సుఖ ♦ మందఁగఁ గంటె యనామయంబె నీ
సేనకు రాత్రి సేవఁగొను ♦ చెల్వున మించెతె మేలుకాంచితే. ౧౯౮

క॥ అని స్నేహముసెఱియఁగ గుహుఁ, డను నుడులకు నిచ్చమెచ్చి♦యనఘా సుఖమే
పనుపడె నీసత్కారము, లనువృత్తము లయ్యెఁ గొఱఁత♦లారయఁ గలవే. ౧౯౯

తే॥ గంగ దాఁటింపు మయ్య నీ♦కరుణపెంపు, దనర నిందఱితో మేలి♦ దారి గొంచు
నన్నపదముల సేవించి♦యలరువాఁడ, నన్నిటికిఁ ద్వత్సహాయంబె♦యధిక మనుచు.

—♦ గుహుఁడు భరతుని గంగ దాఁటించుట ♦—

చ॥ అనుభరతానుశాసనము ♦ నందినయంతనె సత్వరంబునన్
జని స్థపతీందుఁడన్నెఱిసె ♦ జ్ఞాతులఁ గన్గొని లెండులెండు నె
ట్టన నృపవాహిని న్గడపి ♦ తావునఁ జేర్పవలెన్ శుభంబ మీ
కనయముఁ జొప్పడుం దగిన ♦ యట్టులు నావలు దెండు నావుడున్. ౨౦౧

ఆ॥ విభుని శాసనమున ♦ వేగంబ చేర్చి ర
వ్వార లైదునూర్లు ♦ వరపతాక
లొరయ స్వస్తికాఖ్య ♦ లొప్పార ఘంటలు
మొరయ మెఱయుతరుల ♦ ముదము నెఱయ. ౨౦౨

క॥ అన్యల సుశోభమానల, ధన్యాత్ములు వారు కూర్చి ♦ దార్చిరి మఱియున్
మాన్యశుచికంబలాఢ్యల, విన్యాసవిశేషభక్తి ♦ విలసన మొప్పన్. ౨౦౩

తే॥ అనఘగతులు సుసంహతు♦లైనవానిఁ, గాంచి మేలని యొడికంబు♦గా గణించె
నునిచె స్వస్తికసంజ్ఞిత♦నూర్జిత గుణ, నందిఘోష నుజ్జ్వలమూర్తి♦ననుచుదాని.

క॥ శ్రీనందితఁ గల్యాణి వి, తానచ్ఛదరుచులఁ దనరు ♦ దానిన్ ఘనవి
ద్యానయుఁడు దాశవిభుఁ డిడి, తా నతులొనరించి పలికె ♦ దాశరథులతోన్.

ఆ॥ అన్నలార దీని ♦ నధివసింపుఁడు మీరు, గురులు వారితోడి ♦ కోవిదులును
దల్లు లెల్లరాజ ♦ దారలు నవ్వలి, పార మింతలోనె ♦ పడయఁగలరు. ౨౦౬

క॥ తక్కువపడినవా రెల్లరుఁ, దక్కినయోడలు భరింపఁ ♦ దరియించెద రిం
కొక్కగడెలోనె యిందఱు, మక్కువమెయిఁ జేర్చువారు ♦ మావా రనినన్.

ఆ॥ అతని మెచ్చి వార ♦ లట్లధిరోహింప, నపుడు మెఱసె నెలవు ♦ లధ్వనీకి
నీప్రచారణమున ♦ నెఱి నులివులు మిన్ను, ముట్టె మేలిగతికి ♦ మొనసెఁ దరులు.

క॥ కొన్నిట నారులు నరు లటు, గొన్నిటఁ దేరులును మఱియుఁ ♦ గొన్నిట వాజుల్
గొన్నిటఁ గరులు మహోన్నత, సన్నుతధనయానములునుఁ ♦ జక్కఁగ నమరెన్.

క॥ ఱెక్కలుగల కొండల నెఱి, చక్కదనము దోఁప ఘనవి ♦ శాలపతాకల్
నెక్కొను ఱెక్కలుం గలిగి చి, వుక్కున నెగసి చనునోజఁ ♦ బొనరెం దరణుల్.

ఉ॥ ఎప్పుడు గూర్చిరో రఘుకు ♦ లేంద్రుఁడు రాముని సచ్చరిత్రముల్
మెప్పొనగూర్చు పాటలుగ ♦ మేలు కృతార్థులకారె ధీవరుల్
రొప్పక పారవశ్యమున ♦ రూఢిఁ దలంగక పాడుచుండి రా
యొప్పులకుప్ప కైకసుతుఁ ♦ డోజ సుఖాంబుధి నోలలాడఁగన్. ౨౧౧

క॥ గజరాజంబులు నెలకొని, గజాధిరోహకులు నడుపఁ ♦ గాఁ గులగిరు ల
ట్లజరార్చిత నన్నది దాఁ, టె జవము బిరుదమ్ము లించు ♦ తేవఁ దలిర్పన్. ౨౧౨

తే॥ కొంద ఱోడలఁ బ్లవములఁ ♦ గొంద ఱట్లు, కుంభఘటములఁ గొందఱు ♦ గోర్తులమర
నమ్మహాపగఁ గడచి రో ♦ య్యార మొప్పఁ, గొందఱీఁదుచుఁ గాంచిరి ♦ కూలమెనయ.

క॥ ఆవాహిని పుణ్యాంచిత, యావాహిని నుత్తరించి ♦ యవలఁ బ్రయాగ
శ్రీవిలసిత వనసీమ, న్గావించె న్గాంచఁగనుటఁ ♦ గనుపండువుగన్. ౨౧౪

క॥ మైత్రముహూర్తంబున స, న్మిత్రుం డూర్జస్వలం బ ♦ మేయంబు బలం
బాత్ర మెడల దరిఁజేరఁగఁ, జిత్రితవృత్తి యగు నెడఁద ♦ సిరిఁ దనరారెన్.

ఉ॥ వారిని డించి యోడల ని ♦ వర్తిలఁ జేసిరి దాశముఖ్యు లు
త్తారితులు న్నివేశకృతిఁ ♦ దద్ద మెలంగిరి ఱేఁడు నిల్వ న
వ్వారల కాజ్ఞ సేసి గురు ♦ వర్యుఁడు ఋత్విజులుం జెలంగుచున్
జేరి క్రమింప నచ్చటి వి ♦ శిష్టతపోవనసేవనార్థియై. ౨౧౬

—♦ భరద్వాజాశ్రమ గమనము ♦—

క॥ ఒకక్రోశము గాల్నడతో, నకలంకుఁడు గడచి దొరసె ♦ నమరేద్యుఁడు సం
ప్రకటయశుఁ డఖిలశుభదా, యకుఁడు భరద్వాజుఁ డున్న ♦ యాశ్రమపదమున్.

ఆ॥ కాంచి కమలవిందు ♦ గావించుచు న్మించు, నమ్మహాత్ము రమ్య ♦ మాస్పదమ్ము
చాలు మేలిసిరుల ♦ జాలుకొనం జేయు, నౌర యనుచుఁ జేర ♦ నరిగె నతఁడు.

మ॥ దివిజేంద్రోపవనాకృతిం దనరు నా ♦ దివ్యర్షి వాసంబు సే
రి వినీతి న్నిహితాస్త్రశస్త్రుఁడయి స ♦ శ్రీకుండు సంశుద్ధవే
షవిధిన్ లోఁజనిచూచె భవ్యుఁడు నిజా ♦ చార్యుండు పూర్వుండుగా
భువనాతీతతపఃప్రభావకలనా ♦ పూజ్యుం దపస్వీంద్రునిన్. ౨౧౯

తే॥ ఆభరద్వాజమునియు మ♦హాత్ముఁ దపసి,చందురు వసిష్ఠుఁగాంచి యా♦సనముడిగ్గి
అర్ఘ్య మాసన మానయ♦యనుచుఁ జీరె, శిష్యజన మర్చనార్థసం♦సిద్ధు డగుచు.

క॥ భరతాభివందితుండై, పరమర్షి వసిష్ఠుఁ గూర్మి ♦ బరగించుచుఁ ద
త్పరతం బూజించి కుశల, మరసె న్గనుఁ డతఁడు తత్కు ♦ లార్థములందున్.

క॥ వరముని నటు మానించి నృ, వరసుతుఁగా భరతు నెంచి ♦ వారని కుతుకం
బిరవుకొన గారవించెను, దరమిడి యమ్మౌనివరుఁడు ♦ తద్దయు నేర్మిన్. ౨౨౨

తే॥ ప్రకృతులన్నిట సేమంబు♦పరఁగ నడిగె,గాని రాజేంద్రువృత్త మా♦ఘనుఁడుతలఁప
డెల్లజగముల వర్తన ♦ లెఱిఁగి మెలఁగు, వారి కియ్యది వింతయే ♦ వారిజాక్షి.

ఉ॥ ఆదట రాజపుత్రుఁడు మ ♦ హాత్ముఁడు తద్గురుఁడుం బ్రసక్తిశో
మోద మనామయంబు ముని ♦ ముఖ్యుని యాత్మతపోఽగ్నిశిష్యవ
ర్గాదులఁ గూర్చి ముచ్చటల ♦ నాడుచు వేఁడి రతండు మేల యం
చాదర మొప్పఁ దెల్పి మది ♦ నర్థ మొకొండు దలంచి చెచ్చెరన్. ౨౨౪

క॥ రామస్నేహనిబంధన, మా మార్గము వెలయ నిట్టు ♦ లనె భరతునితో
భూమానందమయుం డు, ద్దాముఁడుఁ దా నయ్యు స్థితివి ♦ ధానోత్సుకుఁడై.

—♦ భరద్వాజుండు భరతునిరాకం గూర్చి ప్రశ్నించుట ♦—

సీ॥ ఏమికారణమున ♦ నిట్లరుదెంచితి, ప్రజలఁ బాలించున ♦ ప్పనులు లేవె
స్త్రీజితుం డారాజు ♦ చెల్లఁబో సంసిద్ధి, నీకుఁ గూర్చెనకాదె ♦ నిజ మెఱింగి
కోసలాత్మజ గన్న ♦ కూరిమిబిడ్డండు, సతితోడఁ జనెఁ గాన ♦ జాడఁ గొనుచుఁ
దన్నుఁ బోలిన దరి ♦ ద్రాణుండె సౌమిత్రి, యన్నఁగొల్తు నటంచు ♦ నతనిఁ బెరసె

నలఁతిఁ బదునాలుగేం డ్లంచు ♦ నడవిఁ దిరుగ
గడువుపెట్టితి రింకెద్ది ♦ గడమపడియె
నొంటి నాతనిఁ దీర్చి ని ♦ ష్కంటకముగ
సుఖముఁ బడయంగ నొం డెత్తుఁ ♦ జూచినారొ. ౨౨౬

క॥ ఎంతటిసాహస మెన్నకె, యింతటిబలఁగమ్ము గొంచు ♦ నేగదవే నీ
శాంతనము పోల దనినన్, జింతార్ణవమందు మునిఁగి ♦ చేడ్పడు మదితోన్.

ఆ॥ కనుల దొట్టు నీరు ♦ కాల్వలై పాఱ సం, సజ్జమానవాక్ప్రి ♦ సంగుఁ డగుచు
మానితోడఁ బలికె ♦ మానధనుండు వాఁ, డెంచి రాముపదము ♦ లెదఁ గదించి.

—♦ భరతుఁడు సంయమీంద్రునకు నిజాభిప్రాయం బెఱిఁగించి ప్రార్థించుట ♦—

క॥ అజ్ఞ లనుకొనెడునెరి నక, లజ్ఞుఁడ వీ వనినఁ దెలివు ♦ లావు నెడదె నీ
వైజ్ఞానికత్వ మేర్పడఁ, బ్రజ్ఞాప్రతిపత్తి నరసి ♦ పలుకం జనదే. ౨౨౯

క॥ భగవంతుఁడ వీవంతయు, సుగమము నీకొక్కఁ డెంచి ♦ చోద్యంబుగ నా
డఁగ హాతుఁడ నైతిఁ దలఁపఁగ, నిగమముతోడి దగుఁగాదె ♦ నీనుడి యెపుడున్.

ఉ॥ నాయెడ దోసమున్న ముని ♦ నాథ మలంచి యలంచి తేనియున్
న్యాయమ యట్లొనర్పుము క ♦ దర్థ మదంబ ఘటించినట్టి య
మ్మాయనికృత్య యే నెఱుఁగ ♦ మామగృహమ్మున నుంటిఁ జేరి వి
చ్ఛాయతఁ గంటి గంటిపడి ♦ సంభ్రమ ముట్టిపడంగఁ దిట్టితిన్. ౨౩౧

క॥ ఆయజ్ఞ నీకు మేలగు, చాయ న్నమకూర్చితిం బ్ర ♦ సంగమున సటం
చా యెడఁ బల్కిన పల్కుల, తోయము దూషించి యపుడె ♦ తొలఁగితి నచటన్.

శా॥ అంగీకారము లేదు తద్వచన మే ♦ నాలింప నింతేని దు
స్సాంగత్యం బటుఁ రోసి రాము నెడఁదన్ ♦ సంగాతిఁ గావించి భ
వ్యం గాంతు న్విభుఁ గొల్తు రాచసిరి కు ♦ ద్యోగింపఁ బ్రార్థింతు స
త్సంగుం డాతఁడు మెచ్చి రా నిజపురీ ♦ సంసక్తునిం జేయుదున్. ౨౩౩

ఆ॥ అనుచు నెల్లబలఁగ ♦ మాతేని బిరుమల, ట్లాభిషేచనికత ♦ నమరు భాండ
మును మునీంద్ర కొంచు ♦ మోనయంగ నరిగెద, నరయుమింతయును ద ♦ యార్ద్రవృత్తి.

క॥ నాదెసఁ బ్రసాద మొప్పఁగ, నాదయితుం డున్నచోటు ♦ ననుచు విధంబున్
బోధియయి తెలిపి పొమ్మనఁ, బాదుం దత్పాదపీఠిఁ ♦ బూజింపంగన్. ౨౩౫

ఆ॥ అనుచు వేఁడుకొనఁగ ♦ నావశిష్ఠుఁడుఁ దోడి, మునులు నర్థిఁ దెలుప ♦ ననఘమూర్తి
సంయమీంద్రుఁ డతనిఁ ♦ జక్కఁ గనుంగొని, యెదురు దొలఁచు కూర్మి ♦ నిట్టులనియె.

—♦ భరద్వాజ మునీంద్రుండు భరతుని బహూకరించుట ♦—

మ॥ తగుఁ నీ కియ్యది నీవు దాశరథివే ♦ త్వద్వంశజు ల్దన్యులే
నగుబాటుం గనఁబోవు మేలితెరు వె ♦ న్నంజాలితే నింత కి

ట్లగుటె మ్మెంచుఁ దలంచియు న్మనమునం ♦ దాదార్ఢ్యముం బెంపఁ గీ
ర్తి గడల్కొల్పఁగ నంటి నీపలుకులే ♦ తిం గాంచి మోదించితిన్. ౨౩౭

తే॥ దమము శమమును సాధువృ♦త్తము గురుప్రవృత్తియు వశంవదములిన♦వంశజులకు
ధర్మపరులర మీర లీ ♦ తరమునందు, బొడమినా రందు నీకీర్తి ♦ పొడవు పడిసె.

క॥ రాముని లక్ష్మణు సీతా, రాము న్నే నెఱుఁగుదునుఁ బ ♦ రమధర్మజ్ఞుల్
శ్రీమహితు లనుచు వారల, సేమంబరయుచునె యుందుఁ ♦ జిన్మయదృష్టిన్.

తే॥ దేవనిభుఁడైన నీయన్న♦దేవయోగ్య,మనఁగఁ దనరెడు చిత్రకూ♦టాద్రియందుఁ
గుశలముగనున్నవాఁడెల్లి♦గూర్తుకనుల,కందమానందమునుమహి♦తాభ్యుదయము.

క॥ మీరలు ప్రియాతిథులు మి, మ్మారూఢిం గాంచినపుడె ♦ యలవడె మది స
త్కారోల్లాసము త్వద్వా, క్పూరం బద్దానిఁ బెనిచి ♦ పొడవొనరించెన్. ౨౪౧

శా॥ ఆతిథ్యం బొడఁగూర్చువాఁడ మును లి ♦ య్యార్యోత్తము ల్మంత్రులున్
బ్రీతిల్లం బవ లెల్లరేయు నిచటన్ ♦ శ్రీమీఱవర్తింపుఁ డా
ప్రాతఃకాలకృతప్రయాణమున నా ♦ భద్రాత్ము సేవింపఁ ద్వ
ద్యాతాయాతవిధావధానమున స ♦ ద్వ్యాసంగ మూహించెదన్. ౨౪౨

ఆ॥ అనుడుఁ బూజ్యపాదు♦లాచరించిన పాద్య, మర్ఘ్యమట్లు వన్య♦మైన యదియుఁ
జాలదొకొ యతిథి ♦ సత్కారము కృతంబ, యింతవట్టు దొడర♦నేల యనిన.

చ॥ భరతునిఁ గాంచి యాఘనుఁడు ♦ పక్కన నవ్వి ప్రతీతభావ మే
నరసితి నీదెస న్దనకె ♦ యాదర మెక్కుడుగా ఘటిల్లెఁ ద్వ
ద్వరగుణయుక్తికి న్మహిత ♦ వర్తనకుం దగినట్టి సత్కృతుల్
సురుచిరవృత్తినై నెఱపఁ ♦ జూచెద నొండుదలంప నేటికిన్. ౨౪౪

తే॥ నీకు నీసేనలకు మంత్రి ♦ నివహమునకు, రాజదారలకునుఁ గవి ♦ రాజులకును
నిమ్మునిమహేంద్రులకు నేర్చి♦యిమ్మునందు, సరసమృష్టాన్నములఁదృప్తి♦సంతరింతు.

క॥ విధివిహితాతిథి సత్క్రియ, లధిపసుతుఁడ వధిగుణుండ ♦ వంది చనిన న
వ్విధ మారసి రఘునాథుఁడు, సుధార్మికుఁడు మెచ్చు మేలి♦ సుకృతం బొదవున్.

తే॥ అర్హుఁడవకావె నీవు రా♦జర్షిచంద్ర, సకలపరివారములతోడఁ ♦ జనదె యిచటు
మొనయమునివాటి యనిదూర♦మున నెనిలిపి,వచ్చువాఁడవెనీవుమా♦వాసమునకు.

క॥ అని ప్రేముడి నెఱపెడు న, మ్మునివల్లభుఁ గాంచి రాజ ♦ ముని భరతుఁడు నె
మ్మన మలర నిట్టు లనియెనుఁ, దనభక్తివిధావధాన ♦ దశ చొప్పడఁగన్. ౨౪౮

మ॥ భగవానుండవు నీవు త్వద్భయ మెదం ♦ బాటిల్లదే సంయముల్
నెగడంజాలెడుచోట్ల గొంటిచను శే ♦ నిర్ణీత మాఁగావె యి
జ్జగమెల్ల న్నెఱయంగఁ జాలునది యీ ♦ సైన్యంబు మన్నాథునిన్
వగ దీఱంగన నుత్సహించినది భ ♦ వ్యం బెన్నఁగాఁ జెల్లదే. ౨౮౯

క॥ ఆశ్రమవాసంబున కె, శ్లేశమ మొనగూర్చునదియొ ♦ యేమో యని త
ద్విశ్రాంతి నెఱపి సద్గురు, మిశ్రు న్నినుఁ జేరినాడ ♦ మిహిరస్ఫురణా. ౨౯౦

ఆ॥ అనిన నట్టులనకు♦మాదఱఁ గొని తేరఁ, బనుపు మనుచు మౌని ♦ పలుకు కెఱఁగి
వాఁడు గూర్చునట్టి ♦ వలయున నయ్యాజ్ఞ, శ్రీసమృద్ధి వఱలఁ ♦ జేయుటయును.

క॥ స్థలజలతరుకుంజములకు, బలవత్సంకటము గూర్పఁ ♦ బడకుండఁగ మే
ల్వల నొప్ప నలబల మ్మాల, బలముడిగి కడంగి యచటు ♦ వలగొని మెఱసెన్.

—♦ భరద్వాజమహర్షి ససైన్యుం డగు భరతునకు విందొనరించుట ♦—

ఆ॥ అగ్నిహోత్రశాల ♦ యందుఁ బ్రవేశించి, యమ్మహాతపోధ ♦ నాగ్రగణ్యుఁ
డాచమన మొనర్చి ♦ యటు పరిమార్జన, మాచరించి యిట్టు ♦ లనియె నపుడు.

తే॥ ఏను రాజర్షిచంద్రుఁ డీ ♦ యిత్థచరితుఁ, డీరవికులీనుఁ డీధన్యుఁ ♦ డిచ్చ మెచ్చ
సకలపరివారములు నెల్ల♦సైన్యములును, సంతసింపంగ నొకవిందు♦జరుపువాఁడ.

సీ॥ కల్పింపవలె దేవ ♦ శిల్పి యిచ్చట మేలి, వైభవంబులకుఁ గా ♦ వలయు సిరులు
గాన్పింపవలె నిచ్చ ♦ గని మెచ్చుసమకూర్పఁ, గల్పద్రుమంబులు ♦ కామగవియు
హర్షింపవలెఁ గాంచి♦యనువెంచి మువ్వురు, ప్రభువు లింద్రాదిది♦క్పాలకులును
నర్తింపవలె సుగా ♦ నప్రసక్తి తనర్ప, దేవగంధర్వులు ♦ దివ్యసతులు

సోముఁ డన్నంబు దివ్యంబు ♦ సురుచిరములు
భక్ష్యభోజ్యాదులు నొనర్ప ♦ వలయు నొలసి
యెల్లనదు లైక్షవాదు ల ♦ ట్లించు రసము
లుద్భవిల్లంగఁ దగురీతి ♦ నొందవలయు ౨౯౫

క॥ పేయంబులు మాంసాదులు, పేయంబులు గాఁగఁ బెరసి ♦ ప్రీతిఁగొలుప నొ
సాయ మొనగూర్పవలె వ్యవ, సాయ మొనర భూతతతి వి♦శాంపతి మెచ్చన్.

క॥ విశ్వావసుప్రముఖు లటు, విశ్వాచి ఘృతాచి మున్ను ♦ వెలయు వెలఁదులున్
శశ్వత్సిద్ధులతో భూ, మీశ్వరుఁ డెదఁ బొంగఁ దలఁపుఁ ♦ డేతేరంగన్. ౨౯౭

క॥ ఏమోహ లింద్రుఁ గొల్తురొ, యేమోహిన్మణులు బ్రహ్మ ♦ నెలయింతురొ వా
రాయుత్తమ లెల్లరు నేఁ, డాయత్తత మెఱయ నిచటి♦కరుదెందు ధృతిన్. ౨౯౮

ఆ॥ తుంబురు... ...గారధమంబు మున్నగు కలా, నిధులు విధులు నెఱయ♦నిధుల యట్టు
లఖిలసంపదలకు♦నాలవాలములకా, నిందుఁజొచ్చి మెలఁగుఁ♦డించు వేడ్క. ౨౫౯

క॥ గుణవద్దివ్యనివసనభూ, షణఫలసుమపత్త్రరాజ ♦ సంపద లొలయన్
బ్రిణుతులకుఁ దానకములై, క్షణమున సకలసురవనులుఁ ♦ జనుదేరఁజనున్.

తే॥ చిత్రమాల్యానులేపన ♦ శ్రీవిధాన, వస్త్రభూషణపర్యాప్తి ♦ వఱలవలయుఁ
జైత్రరథ... వనాది ర ♦ త్నప్రసక్తు, లెనసి నాథు మనస్కార ♦ మనుసరించి.

క॥ ఇనుఁ డెల్లకొలఁత లెడలఁగ, ననుపమ తేజమున వెలయ ♦ నగు రాజకులం
బునకు నెఱివొసఁగ సుహృదా, ననకమలము ఉల్లసిల్ల ♦ ననుచుజతనతోన్.

ఆ॥ అనుచు నవ్విధమున ♦ నఖిలలోకవిధాన, నిపుణుఁ డల్లధాత ♦ నెగడఁజేయు
మేటితబిసి యెడఁద ♦ నూటి గూర్చినకూర్పు, విబుధకోటిపైని ♦ విసరుటయును.

చ॥ తపమునఁగన్న తేజ మవ ♦ ధానముపొందిక భవ్యశిక్ష వి
న్నపమునతీరు ప్రాఙ్ముఖత ♦ నంద్య స్వరౌచితియున్ బొసంగ న
య్యుపనిషదర్థవేది ముని ♦ యూహఁ బెనంగుచుఁ బల్కె నెట్టు ల
ట్లపరిమితార్థజాతకలి ♦ తామరలోకవిలోక మేర్పడన్. ౨౬౪

సీ॥ మలయదర్దురముల ♦ మలసి నిర్మలవృత్తి, గని చేరె దక్షిణ ♦ గంధవహుఁడు
నందనోద్యానంబు♦నందలి విరులెల్లఁ, గురియించెఁ బతివేడ్క♦గొఱల ఘనుఁడు
దిక్కులన్నియు మేలి♦తెలివిఁ గైకొన మ్రోసె, దివ్యదుందుభు లాస్థ♦దిటవుపడఁగ
నాటపాటల యంద ♦ మందిచ్చి రొక్కట, దైవతాంగనలు గం ♦ ధర్వవరులు

రోదసీ... మున ని ♦ రూఢ మగుచు, మధురమధురంబు తచ్ఛబ్ద ♦ మంజిమంబు
సకలజీ... ...వులకు♦సంతరించె, మొదలి సంతర్పణము జగ♦న్మోహనముగ. ౨౬౫

క॥ సమలయగుణాన్వితంబుగ, సుమనస్కత నేర్చి యెదిరి ♦ సొగియించెఁ గడున్
సుమనస్తతి గూర్చిన య, వ్విమలము వీణారవంబు ♦ విభవోజ్జ్వలమై. ౨౬౬

ఉ॥ ఆదట విశ్వకర్మకృతి ♦ యందలి యందములెల్ల మేకొనం
గాఁ దిరమయ్యెఁ గన్నులకుఁ ♦ గన్పడుచొప్పున పుణ్యరాశియై
యాదరమొప్పఁ గన్గొనియె ♦ నాభరతాధిపు సైన్య మంచితా
మోదము వెల్లిగ్రమ్మి తల ♦ మున్కలు నేసి మలంచు సంచునన్. ౨౬౭

సీ॥ నీలపుంబచ్చల ♦ నెలవులతోడివై, శాద్వలస్థలములు ♦ సంఘటిల్లె
నలవిమానములతో♦ననఁగి పెనంగుచుఁ, బ్రాసాదములు మిన్ను♦వాఁక కెగచెఁ

గల్పవృక్షములలోఁ ♦ గలిసి వర్తిలె నదు, త్తమమేల్మికై యిడ్డ ♦ తటరుహాంబు
లుత్తరకురువుల ♦ యొఱ పెల్లరూపించెఁ, బౌరపౌష్ఛ్చ మనిలేక ♦ భూతవితతి
పంచయోజనవిస్తీర్ణ ♦ భాసమాన, హాటకోత్తమమణివర ♦ కాంతరాఢ్య
తోరణద్వారకక్ష్యాప్ర ♦ తోళికాది, వివిధరచనాస్పదప్రతి ♦ వేశనమున. ౨౬౮

క॥ దివ్యవనవదనదులు చి, ద్భావ్యము లటు భవ్యకలనఁ ♦ దనరారుచు రా
నవ్యంబిది యని రన్యులు, శ్రీవ్యాపకుఁ డమ్మునీందు ♦ చెయిది కొదుగుచుఁన్.

తే॥ బిల్వవనసకపిత్థామ్ర ♦ బీజపూర, కామలక్యాదిఫలభూష ♦ నాగమముల
యాగమం బబ్బురం బన♦నయ్యె నొడ్ల, కయ్యె నిగమాగమాఢ్యున♦కది సుగమము

శా॥ లీలామందిరము ల్కళాగృహము లా ♦ లీముఖ్యగోష్ఠు ల్బతు
శ్శాలాస్థానులు హస్తివాజివృషగో ♦ సద్మంబులుం బ్రాంచి త
శ్రీలాలిత్యవిశేషలాలితసుధా ♦ సిద్ధ్వచ్ఛధామచ్ఛవిఁ
వాలాయం బిరవొందె నందు సురభూ ♦ వ్యాపార మేపారఁగాఁ. ౨౭౧

ఉ॥ చందురుకప్పు గప్పనగు ♦ చందముఁ గైకొను మేలిచాందినీ
లందము గొంద మిందిరపురి ♦ హర్మ్యము లాఁగి యటంచు సాగి సం
స్పందితతా పతాకికలు ♦ చక్కనిచిక్కని పూలపందిళుల్
ముందుగఁ దోఁచె నన్నెలవు ♦ మోహకలాపరిణిధానమై తగన్. ౨౭౨

ఆ॥ మానివరు నియుక్తి♦మంగళాయతనమై, యదియ చాల భరతు♦నలరఁ జేయ
నం దొకొండు వొల్చె♦ననుభావసంపన్న, మగుచు రాజయోగ్య♦మనఁగ నగజ.

ఉ॥ తెల్లనిచాయతోఁ దనరు ♦ తీన్పులతో సువితానవల్లికా
వేల్లితతోరణోపహిత ♦ వీధికతో ధ్వజరాజరాజితో
ఫుల్లసుగంధిపుష్పచయ ♦ పూజలతో నవధూపదీపసం
పల్లవసంగృహీతసుర ♦ భాగ్రిమతోఁ దనయొప్పు లొప్పఁగన్. ౨౭౪

ఆ॥ ఒఱపు లొలపు లీన ♦ నొరపిడి యనువార్త, లేక నాలు గంచు ♦ లేకకలన
నమర నమరభోగ ♦ మందిచ్చు నద్దానిఁ, దా నినాన్వయుం డ ♦ నూనుఁ డరసి.

ఉ॥ పొందగు సద్రసాన్నములు ♦ పోఁడుములున్ శయనాసనోచితా
స్పందకలావిలాసములు ♦ భాగ్యము భోగ్య మొనర్చి కూర్చి మే
ల్పొం దని సన్నసేయు నెటి ♦ విస్మయ మంచు నె రాముతమ్ముఁ డ
మ్మందిరరాజముం జెరసె ♦ మానివరేణ్యుని యానచొప్పునన్. ౨౭౬

క॥ శ్రీమంతుఁ డయ్యో నాఁడా, ధీమంతుఁడు తపసికరుణ ♦ దేవుఁడె వాఁ డా
సామంతతతిం దగఁడే, యామంతున కొదిఁగెఁగాక ♦ యగరాజసుతా. ౨౭౭

మ॥ మణిరత్నోజ్జ్వల మమ్మహాస్పదము న ♦ మ్మాడ్కిం బ్రవేశించు నా
గుణిరత్నంబునచాయ నెక్కొనిరి సా ♦ గుణ్యంబునన్ స్వీయు లౌ
ప్రణిధు ల్మౌలిపురోహితు ల్హితులు సా ♦ భాగ్యంబు చెన్నొంద నం
గణము న్యోధగణంబు ద్రొక్కి యితరా ♦ క్రాంతిం దలంగింపఁగన్. ౨౭౮

తే॥ అందు రాజాసనము దివ్య ♦ తాంచితంబు, ఛత్రచామరకలితంబు ♦ సత్పతాక
మతఁడు గనుఁగొని శ్రీరాము♦నందుఁ జేర్చె, భావనాబలభవికస♦ద్భావుఁ డగుచు.

క॥ ఆతలఁపు ముదమొసఁగ సీ, తాతన్విదయితుఁ గోర్కి ♦ దనరారఁగ ని
ష్ఠితటి నెనయింతునో యని, పూతచరిత్రుం డెడందఁ ♦ బొదలుచు నుండెన్.

తే॥ మంత్రిలునుఁ దాను నద్దాని ♦ మలసి చుట్టు
దిరిగి క్రమమొప్పఁ బూజించి ♦ దేవనిభుఁడు
వ్యజనముం గొని వీచు న ♦ వ్వలనునందు
మెలఁగె సచివోచితాసన ♦ మొలసి గిరిజ. ౨౮౧

ఉ॥ ఎంతటివాఁడో యాకలుము ♦ లెల్ల నిజంబులై యైన జానకీ
కాంతునివంచు నెంచు శశి ♦ కాంతుఁ దలంచు నమస్కరించు నే
వింతలఁబోసి చిత్త మభి ♦ విత్తముగాఁ బొనరించు దాస్యమున్
వంతలఁ బాసి వాఁ డఖిల ♦ వంద్యుఁడు నా నెగడొందఁడే సఖీ. ౨౮౨

క॥ అంగనరో తగువారల, నం గలవారెల్ల నచటు ♦ నం దనవెంటన్
సంగతిమెయిఁ దనరిరి హృద, యంగమవిహితాసనముల ♦ నాసమయమునన్.

ఆ॥ మౌనివరుఁడు వొంగె ♦ మాన్యుఁ డీతండ హో, యెంత కేనిఁ జెట్ట ♦ యెనయనీయఁ
డెడఁద రామమయ మ ♦ నీదృశంబు భవాబ్ధి, దాఁటినా డటంచుఁ♦ దరలనయన.

క॥ ఆమంత్రిపురోహితముఖు, లామంత్రిత మెంచి లోక ♦ మం దిటు గలదే
నేమముగల తపసి కృతి, న్నేమమునుం డిదియు ననుచు ♦ నెఱిసిరి ప్రీతిన్. ౨౮౫

ఉ॥ పాయసకర్దమం బొలయు ♦ పాలును మీగడ శర్కరాదులుం
బాయని వేడ్క బ్రహ్మముని ♦ పట్టిన పట్టున నేర్లనంగ నా
చాయఁ బ్రవర్తిలెం దరుల ♦ సృష్టప్రసాదముకల్మిఁ గల్గె ర
మ్యాయతనంబు లొక్కట మ ♦ హాద్భుతశిల్పములం దనర్చుచున్. ౨౮౬

ఆ॥ ఆముహూర్తమున నె♦యఖిలాభరణభూషి, తాంగు లగుచు దివ్య♦ లైన యువతు
లెలమి నరుగుదెంచి ♦ రిరువదివేలు ప్ర, హృష్టు ప్రాజ్ఞు లప్ర ♦ మంది పొగడ.

క॥ మణిమౌక్తికహారోచిత, లణుమధ్యలు ధనుదుఁ డనుప ♦ నమ్ముని వని ప్రాం
గణ మపు డలంకరించిరి, గణికలు వింశతిసహస్ర ♦ గణనాంచితలై. ౨౮౮

ఉ॥ చొచ్చినయంతలో నరులఁ ♦ జొక్కన ముంప మెలంప నేర్చు పా
టచ్చరవృత్తి కే మని త్రొ ♦ డంగుబెడంగులవా రుదార ల
య్యచ్చర లేగుదెంచిరి ర ♦ సాద్భుత లిందిరవస్థ లందఱ
ప్డచ్చటు నచ్చుగూర్చునెఱి ♦ న ట్లొనరించుతలంపు పెంపునన్. ౨౮౯

క॥ అవ్వారి యాగమంబున, నవ్వారిగ ననిచె నా ప్ర ♦ యాగవనమునన్
మవ్వానఁ బొదువఁ గనులకు, దవ్వా నలు వనఁగనొ మ ♦ దనమర్యాదల్.

తే॥ నారదుఁడు తుంబరుఁడు గోప♦నాథుఁడు నను, తరణితేజస్కులైన గం♦ధర్వవరులు
పాడి రాడి రలంబుసా♦ప్రముఖ లించు, చాన లాచదురున మౌని♦శాసనమున.

ఆ॥ అమరలోకమునను ♦ యమరారు నవియును, జైత్రరథమునం ప్ర ♦ సక్తిఁగనిన
యవియు నా ప్రయాగ♦మం దొంటఁ జూపట్టెఁ, బుణ్యగంధమాల్య♦భూషణములు.

ఉ॥ ఎంతకు లేఁడు మౌనివరుఁ ♦ డింత లొనర్చి పొనర్చె నొడ్లకున్
సంతస మొప్ప నెల్లెడల ♦ సర్వము తౌర్యకలావిధాన మా
వంతున బిల్వవృక్షములె ♦ వచ్చె మృదంగము లూని యక్షము
ల్చెంతవహించెఁ దాలగతిఁ ♦ జెల్వుగనాడెఁ జలచ్ఛదాగముల్. ౨౯౩

తే॥ కుబ్జవామనమూర్తులై ♦ కూర్చుకృతుల
మలసె సరలతిలకనక్త ♦ మాలతాల
ముఖ్యములు వృక్షములు నిజా ♦ మోద మొలయ
నంచితామోద మన్నెఱి ♦ నచ్చుపడఁగ. ౨౯౪

క॥ ఉత్తమలతికాతతు ల, త్యుత్తమనారీజనముల ♦ యోజఁ దనరి గీ
త్యుత్తమనృత్తవిశేషము, లత్తఱిఁ బురికొన నొనర్చె ♦ నను వొనరారన్. ౨౯౫

క॥ లాస్యమున గొలసెఁ గొన్ని స, హాస్యస్థితి మలసెఁ గొన్ని ♦ హాస్యవిలాసో
ల్లాస్యాభియుక్తిఁ గొన్ని యు, దాస్యాస్థం గొన్నియుం బ ♦ దరె నుత్సుకతన్.

తే॥ శింశుపామలకీముఖ్య ♦ సిద్ధలతలు మాలతీనవమాలికా ♦ మల్లికలును
సుందరీమణులై పొడ ♦ చూపి రవ్వ, డందఱకు మేలి సత్కృతు ♦ లనువుపఱుప.

చ॥ పలికిరి కోర్కిఁ గడిఁది సురఁ ♦ బానము సేయుఁడు పాయసంబు పు
ష్కలము బుభుక్ష వాసిచనఁ ♦ గైకొని భక్షణముం బొనర్పుఁ డీ
వలనిసు మేధ్యమాంసముల ♦ వాంఛ లెలర్ప భుజింపుఁ డింక మీ
యలయిక లార్తులుం దలఁగు ♦ నందము చందము తీర్పు లేర్పడున్. ౨౯౮

మ॥ అని యొక్కొక్కని కార్గు రేడుగురు గా ♦ నై సారసాత్తు ల్వరాం
గన లమ్మైఁ బొదలించుచు న్గదిసి కాం ♦ క్ష ల్వ్యాంగ నభ్యంగనం
బను వొందంగఁ బొనర్చి యార్చి రుచులా ♦ య్యం బెరొక్కనం బేర్చి పే
యనికాయంబులఁ బాయసాన్నములఁ దృ ♦ ప్తిం గూర్చి రత్యాదృతిన్. ౨౯౯

తే॥ నేర్చి చందనాగురుసార♦చర్చ లొనరఁ, జేర్చి సింగార మొనగూర్చి♦ శ్రీ లెలర్పఁ
బాదసంవాహనంబు ల♦ప్పడఁతు లెలమి, మించి యన్నెఱినొదవించి♦మెప్పుగొనిరి.

క॥ ఒప్పులు మెప్పులుఁ గా కే, తప్పులు ముప్పులును లేక ♦ తరతమభావం
బప్పాటఁ దోఁపనీయని, యప్పావనమైన వింద ♦ యందఱఁ దివిచెన్. ౩౦౧

ఆ॥ హయగజోష్ట్రఖరము ♦ ఖాఖిలవర్గంబు, లాజపిష్టముఖ్య ♦ భోజనంబు
లంది చెఱకురసము♦లాని పుష్టివ హించె, నొడలి యొఱుక మఱచు♦నోజఁ దనరి.

క॥ అంకెలువైచెను వృషభము, లంకము లొప్పార ననుచు ♦ నవిమై యవియుం
బొంకములఁ దనరె నా లట, సంకట మొకయింతలేని ♦ సమ్మదమొదవన్. ౩౦౩

క॥ తమతమగజహయములఁ బశు, సముదాయమ్ములను మత్త ♦ సముదితులై యా
సమయమునకలిమి సేనా, సమవేతులు మఱచిరొండు ♦ జాడలు గలవే. ౩౦౪

క॥ పూయుట తొడుగుట కట్టుట, చాయలువెనుచుటయుఁ దక్క ♦ సమ్మదము మద
మ్మాయుక్తిఁ దమ్ముఁ బొదువుట, నేయుద్యమ మొదవ దప్పు ♦ డేణాంకముఖి.

తే॥ భరతునకు సేమ మాఁగాత♦భాగ్యవంతుఁ, డౌను గావుత రాముండు♦పూని యేమ
యోధ్యవంకకుఁ బో మను♦యుక్తితోడ, స్వర్గమిదె యను వాచాప్ర♦సంగమొదవె.

సీ॥ మునిమహత్త్వమ్మున ♦ మొనసెఁగా కీకల్మి, యధ్వరాశుల కున్నె ♦ యనెడువారు
లతికాలతాంగుల ♦ లాలనంబులకు లోఁ, బడి మేలిపలుకులు ♦ వలుకువారు
రామాభిసేవాప ♦ రతఁగల్గె నిది యంచు, వల నెంచి గంతులు ♦ వైచువారు
పొసఁగువేసంబుల ♦ పోఁడుము ల్మెచ్చుచు, సాగి బరాబరు ♦ ల్సలుపువారు

విడెముగొని సెజ్జపై నొడ ♦ లిడెడువారు, పుణ్యగీతిప్రసక్తికిఁ ♦ బొదలువారు
హాస్యరసయుక్తికలనల ♦ కలరువారు, నైరి సేనానివేశంబు ♦ నందు నరులు.

మ॥ సరసాన్నోత్కరము ల్సుభక్ష్యగిరులున్ ♦ సన్మాంసపుం దిన్నెలున్
వరసారాంచితపాయసాసవనదీ ♦ వర్గంబులున్ శర్కరా
జ్యరసాలేక్షుమధూపదంశపిశర ♦ స్థానప్రధానంబులున్
నరసామాన్యవిశేషదృష్టి కిడె నా ♦ నందం బమందంబుగన్. ౩౦౮

తే॥ పృథులయావన ముదితక ♦ పిత్థసంజ్ఞ
మతిలలితయోగజము రసా ♦ లాఖ్యము నగు
తక్రములఁ బూరితములు ప్రా ♦ దములు దధిసు
ధాసరస్సులుఁ గూర్చె సం ♦ తర్పణంబు. ౩౦౯

క॥ మైరేయపూరితమ్ములు, క్షీరౌదనకర్దమోప ♦ చితములు సన్మాం
సారూఢంబులును నకూ, పారనిభము లచటి కూప ♦ వర్గము లొప్పెన్. ౩౧౦

క॥ వాపిక లోపి కనుంగొన, శ్రీపద్యలు ఫలరసప్ర ♦ సిద్ధలు మధుపూ
రాపూర్ణలు నయనోత్సవ, మాపాదించెను మహాత్ముఁ ♦ డమ్మునిశక్తిన్. ౩౧౧

ఆ॥ కామదుఘులు కల్ప ♦ కద్రుమంబులు గాఁగ, నయ్యె నచటితోఁటు ♦ లచటితరువు
లెవరి నెటులు దనుప ♦ వేసృష్టికిం జొర, వెరవులేని మునిమ ♦ హేచ్ఛఁ బెరసి.

తే॥ తృప్తిగాంచి మఱియుఁబఱ ♦ తెంతురు నవ, నవరసాలసవృత్తులై ♦ నాయకులునుఁ
జేటకాదులవిధి వేఱ ♦ చెప్పనేల, ననిచి పొగడొందు నావిందు ♦ నం బసందు.

మ॥ ఫలనిర్వ్యూహములు న్రసాయనములు ♦ న్భక్ష్యోపభక్ష్యంబులున్
గలమాన్నంబులుఁ గండచక్కెఱలు మే ♦ ల్కజ్జంబులు న్పానకం
బులు గోక్షీరసిరాదులు న్సరలు సం ♦ పూర్ణంబులై యక్షయం
బులుగా నుండెను భుక్తశేషదశకుం ♦ బోల్పంగరా కయ్యెడన్. ౩౧౪

సీ॥ లేఁడుగా సంతృప్తి♦లే దొంట నసుదంట, మానసంబున కొంగ♦మనుచువాఁడు
కాఁడుగా మాలిన్య ♦ కలన కే నని జాలి, మాలి పైకొను నీసు ♦ పాలివాఁడు
పోఁడుగా యొండొక్క♦పొలితి కయ్యెవింత, వగ లబ్బినను భక్తి♦వఱలువాఁడు
రాఁడుగా రాముని ♦ రాగంబుపై నింత, నేరమెన్న తలంపు ♦ నెఱయువాఁడు

నాఁడు గానామృతంబున ♦ నవకమునకుఁ, దోడుగా మునిగూర్చిన ♦ చేడెగూడె
మాఁడు గారాము నుడిచంద♦మంద మొంద, వీడు గాంక్షింపనీని యా♦విందునందు.

క॥ భృంగారికలుం గలశము, లుం గరికలు భాజనములు ♦ లొజ్జగుకూజా
లుం గిండ్లుఁ బళ్లెరములును, బంగరుపోఁతపనిముల్లె ♦ పరఁగె నచటునన్. ౩౧౫

సీ॥ తెలికూర్చికలసమి ♦ త్తుల మించి దులకించు, దంతధావనపదా ♦ ర్థప్రతతులు
కల్కచూర్ణకషాయ ♦ కమ్రసుగంధిల, తైలాదికస్నాన ♦ జాలకములు
యుగ్మభూతిసుపాదు ♦ కోపనహంబులు, హాటకస్ఫురితాంశు ♦ కాంశుకములు
మణిరత్నమండన ♦ మండలంబులు మాల్య, చందనాగురుధూప ♦ సారములును

విమలదర్పణములు కంక♦తములు భాన్రు, కాంజనకరండములు మహి♦తాసనములు
సంవిధానోపహితసుఖ♦శయనములును, నంగళులు దీర్చినట్టులై♦యమరె నచట.

క॥ చిత్రములు ధనుశ్శస్త్రత, సుత్రాణమ్ములు శరధులు ♦ నూత్నవిహితవ
ర్మత్రాణమ్ములు నయ్యెడ, నత్రాణగుణాప్తిఁ దనరె ♦ నతిమాత్రములై. ౩౧౮

మ॥ ప్రతిపానప్రహ్లాదము ల్లక్షరోష్ట్రగజగో ♦ శ్యపీత్రికిం గూర్చె ని
ష్పత్రిమాబ్జోత్పలము ల్సతీర్థములునై ♦ ర్మాల్యార్ఘ్యచంద్రాశ్మవ
ర్ణితతోయంబులు పుష్కరాచ్ఛములు హా ♦ రిశ్రీహారిద్ఘ్రాసనం
స్థితకూలంబులునై యమేయవిభవ ♦ స్థేమాభిరామాకృతిన్. ౩౧౯

క॥ ఆవింతచంద మెదలో, నావంతయుఁ బోల్పరాని ♦ దై తార్కొన వి
ద్యావంతులె విభ్రాంతత, మావంతని తొడరి రిట్లు ♦ మాటాడంగన్. ౩౨౦

చ॥ మునిజపయుక్తియో భువన ♦ మోహినిశక్తియొ స్వప్నరక్తియో
ఘనవిహితైంద్రజాలికవి ♦ కాసవిభక్తియొ యెన్నఁబోల ది
వ్యానువునఁ గంళ్లఁగట్టి నటు ♦ లై కనుపట్టెడుఁ జోద్య మెట్టు లా
ననితరవేద్య మియ్యది య ♦ నంతవిలాస మనంగఁ జెల్లదే. ౩౨౧

ఆ॥ రాముపలని కూర్మి♦రాణించు మేటి యి,మ్మౌని తలఁచినది య♦మాన్య మగునె
యింద్రభోగకళల ♦ నీసడింపఁగఁజాలు, వైభవోద్భవంబు ♦ వలనఃపఱచె. ౩౨౨

క॥ ఒకొక్కకట నొకొక్కఁడు నుతి, కెక్కినసిరి నెరసెనేమొ ♦ యెనసి సకల మీ
చక్కఁ గనుగంట నెకొక్కనె, దక్కొ లనరాదె యెదియుఁ♦దాపసు నెఱికిన్.

క॥ సిగ్గుపడవలె ననంజను, నిగ్గారవయోగ మరసి ♦ హీనపుసిరులం
దిగ్గనద్రోచి నతికిఁ దల, యొగ్గరె నరు లిదియు నొక్క ♦ యోజన గాదే. ౩౨౪

ఆ॥ అవుర భరతుజన్మ ♦ మందె సాఫల్యంబు, రాముఁడే ఘనుండు ♦ రాచవారి
కొలువు గూర్చె మనకుఁ ♦ గోటిలాభంబులు, భూమికన్న మేలి ♦ పొలముగలదె.

క॥ అని సానందులగుచు నం, దనవనమునఁ దనరుమేలు ♦ దలఁపని మది క్రొం
దనమునఁ బొనరుచు నాయా, మిని యామినిఁ గడపఁగాంచి ♦ మేల్కని రంతన్.

క॥ స్వర్గాద్యాహూతము లతి, సర్గవినోదంబు నెఱపి ♦ సంయమియాజ్ఞా
నర్గళగతి నంతర్థిని, సర్గప్రతిభ వెలయింపఁ ♦ జాలె క్షణమునన్. ౩౨౭

తే॥ ఎల్లెడల బూరటిలఁ జేయ♦నెంచె నపుడు;మలయపవమానుఁ డమ్మేలి♦మంతనంబు
సురభిలాగరుచందన ♦ సుమసుమాల్య, రసరసాలసురామోద♦రసికుఁ డగుచు.

మ॥ మదిరాగంధము పోదు తత్కృతరసా ♦ స్వాదంబు పోనైనఁ ద
త్పద మొందెం ద్రిదివార్థజాత మెదలం ♦ దార్కొన్న వ్యాసంగమా
వదలన్నేరదు తుష్టిపుష్టు లనుభా ♦ వప్రేక్షణోల్లాసముల్
చదలం బ్రాఁకుచునుండె నెల్లరకు నా ♦ సంభ్రాంతవృత్తిస్థితిన్. ౩౨౯

ఆ॥ అట్లుదివ్యపరిమ ♦ ళాంచితులై వారు, పెండ్లికొడుకు లనఁగఁ ♦ బెనుపు మీఱి
నిలిచి రపుడు భరతుఁ ♦ డలరుచుఁ దనతోడి, వారిఁ గూడి మౌని ♦ వరునిఁ జేరి.

—♦ భరతుఁడు భరద్వాజ మునిని స్తుతించుట ♦—

ఉ॥ ఫాలతలంబున న్నెఱయఁ ♦ బట్టిన యంజలి పట్టినట్టులే
క్రాల నుతించు నామహితుఁ ♦ గాంచి తపస్వి హుతాగ్నిహోత్రుఁడై
యాలలిఁ జేరనై యనియె ♦ నన్న మదీయము సత్క్రియాక్రమం
బోలి ఘటించెనే ధృతి సు ♦ ఖోచితవృత్తి మెలంగఁ గంటిరే. ౩౩౧

ఆ॥ రాత్రి మేల్మిగనె సు ♦ రాజంభవం బయ్యె, దేశ మిదియు సుదుప ♦ దేశకలన
నీవు గొంటి వెల్ల ♦ నిర్మలంబయ్యె నా, తిథ్యమున తెఱంగె ♦ తెలుపు మయ్య.

క॥ అని యనువున నొడివెడు న, మ్మునియాదర మెంచి రాజ♦ముని యిట్లనె నో
మునిచంద్రా నీసృష్టిం, గని యిదమిత్థ మన నొద్దు ♦ గలరే జగతిన్. ౩౩౩

క॥ సృజియింపనేర్తు వెన్నియు. వృజినముల నడంపనేర్తు ♦ వేదములెల్లన్
నిజశక్తి భువికిఁ దెచ్చితి, వజరామరుఁడ వనికాక ♦ యననొకఁడున్నే. ౩౩౪

ఆ॥ అరిది యాస మేర♦కబ్బుటే యిది యను, ప్రాస మయ్యె నొంటఁ♦ బట్టి కాంచి
తెలుపువాఁడె నరుఁడు ♦ దేవునకును నీకు, నరసిచూడ భేద ♦ మనుచుఁ గలదె.

క॥ బలవాహములు దనిసె ద, ర్బలులుం బలమొనసి రేనుఁ ♦ బ్రణిధు లమాత్యుల్
గలయంతవట్టువారును, గలిమికి మించిన సుఖంబు ♦ గంటిమి మౌనీ. ౩౩౬

శా॥ తృప్తిం గాంచితి మయ్య యెల్లవిధుల ♦ న్దేవేజ్యసంకాశ సం
ప్రాప్తంబయ్యెను భాగ్యయోగ మిదె సం ♦ ప్రార్థింతు రవ్వేల్పులున్
సప్తద్వీపములేలు నాతనికి నీ ♦ సౌభాగ్యసంపత్తి యీ
దీప్తిస్ఫూర్తియుఁ గైవసంబగునె కీ ♦ ర్తిం గంటి వేతోవలన్. ౩౩౭

క॥ నా కాక సఫలమయ్యె న, ధీరత్వముఁ దొలఁచి చక్క ♦ దేర్చితి జేజే
లారాధింపంగల పద, మారాదుపగత మొనర్చు ♦ ననుభావమునన్. ౩౩౮

ఆ॥ అన్నఁగొలుచు పనికి ♦ నరుదెంచినాడ నీ, యాదరంబు ముట్టె ♦ నంబగాంత
మనల ముదము కాక ♦ యన్యంబు గలదె యీ, సూచనంబె పరమ ♦ శోభనంబు.

క॥ ఆమంత్రిణ మొనరించెద, నీమెయి నెనరుంచు మెల్ల ♦ యెడల గుణశ్రీ
ధాము రఘురాముఁ గనుఁగొనఁ, గా మది యుత్సుకతఁ బెరసి♦కలఁచెడు నింకన్.

ఆ॥ తెరువు సూపు మయ్య♦దీను న న్నామహా, భాగుఁ జేర్చి పుణ్య♦ ఫలము గాంచు
మయ్య నీవు భగవ♦దవతార మనికాక,యొండు దలఁవ నిది త్రి ♦ యుక్తమయ్య.

క॥ నాపాలిభాగ్య మాఘనుఁ, డేపట్టున యాశ్రమంబు ♦ నెనసినవాఁడో
దాపయిన దారి యెద్దియొ, ప్రాపయి యెఱిఁగించి నన్నుఁ ♦ బనుపు మునీంద్రా.

—♦ భరద్వాజుండు భరతుని బహూకరించి తల్లులం గూర్చి ముచ్చటించుట ♦—

చ॥ అనిత్వరమాణచిత్తుఁ డయి ♦ యమ్మెయి వేఁడెడువాని భ్రాతృద
ర్శనకృతిలాలసత్వమును ♦ సద్ధృదయోచితవృత్తియుం దపో
ధనవరుఁ డెల్లనారసి ము ♦ దంబున నిట్లనె భానువంశమం
డనమణి చిత్రకూటనిక ♦ టంబున దివ్యసరిత్తటంబునన్. ౩౪౩

ఆ॥ ఉన్నవాఁడు రాముఁ♦డుద్దాముఁ డాశ్రమ, మొనరఁ గూర్చి మూడు♦యోజనంబు
లిచటికది సరిద్గి ♦ రీంద్రాంతరాధ్యసు, రమ్యకాననాభి ♦ రామ మనఘ. ౩౪౪

సీ॥ నిచ్చలు బుష్పించు♦నియతిమై ఫలియించు, నెఱిఁ బాయఁబోవవ♦ నీరుహాములు
వనపాదపంబుల ♦ మొనసి జొంపమ్ములై, తనరుఁ బూగుత్తులు ♦ దాల్చి లతలు
దీఁగలు తముఁ బ్రోచు♦ తెఱఁగున కనువుగా, నాటపాటలు సూపు♦నళివితతులు
భృంగపాళులవృత్తి ♦ కంగమ్ములై తగు, శుకశారికాదుల ♦ సూనృతములు
గంగ పావని యొక్కెడఁ♦గనకశిఖరిఁ,బోల్పనగు గిరి యొక్కెడఁ♦ బొనరుపడఁగఁ
బున్నెములదీవి యాశ్రమ♦పుం బొలమున, రాముఁడేలుచునున్నాడ♦రణ్యపదము.

తే॥ భాగ్యవంతుండ వీవు సౌ ♦ భాగ్య మొదవఁ
గాంచెదవు రాముఁ గల్యాణ ♦ కలితనాము
దక్షిణాపథమున సవ్య ♦ దక్షిణములు
గాఁగ నడిపింపు మీసేనఁ ♦ గ్రమ మెఱింగి. ౩౪౫

క॥ అని త్రోవసూపి పయనం, బనువుపఱప వృద్ధనృపతి ♦ యంగనలెల్లన్
మునిఁ జుట్టిమొనసి రయ్యెడ, ఘనయానార్హాలు వినీత ♦ గతిఁ గాల్నడతోన్.

ఆ॥ అందు వేపమాన ♦ యతిదీన కృశ కోస, లేంద్రసుత సుమిత్ర ♦ యొనసి చేర్పఁ
నాపె దానుఁ దపసి ♦ యంఘ్రియుగ్మంబున, కెఱఁగి యోరనిలిచి ♦ శేర్పడంగ.

క॥ తనకామం బసమృద్ధం, బననై జన గర్హణముల ♦ నందినదై సి
గ్గున మునిఁగి తేలు కైకయు, ముని వలగొని నిలిచె దైన్య♦మున సుతుఁబ్రోలన్.

చ॥ భరతునిఁ గాంచి సద్వ్రతుఁడు ♦ ప్రాజ్ఞుఁడు మౌనివరుండు కూర్మిమై
నరయఁదలంచితేని రఘువ ♦ రాన్వయభూషణ; తావకాంబికాం
తరవివరంబు నావుడు సు ♦ ధార్మికుఁ డంజలి సేర్చి పల్కె నే
ర్పరి యితఁడే యనంగ ననె ♦ భావము నిర్మలమై తనర్పఁగన్. ౩౫౦

ఆ॥ బ్రహ్మమూర్తి శోక ♦ పరవశ నిరశన, కర్శితాంగి దీనఁ ♦ గాంచె దీవు
దేవతాత్మబుద్ధి ♦ దేవి యీయమ తండ్రి, కగ్రమహిషి కోస♦లాత్మజాత. ౩౫౧

తే॥ సింహవిక్రాంతగామి నృ ♦ సింహమూర్తి
హరి నదితియట్లు రాము ని ♦ య్యనఘ కనియెఁ
దాను నోమిన నోములు ♦ తరముమీఱి
ఫలము సూపంగఁ దొడరు నా ♦ ప్రాభవమున. ౩౫౨

క॥ కాలముఁ గర్మముఁ గూడ సు, శీలమహిత యంత లింత♦సెడి హృదయమ్మున్
బోలని శాపము పొదువఁగఁ, దూలినయది తూల మట్టు♦దుస్థిత యగుచున్.

ఆ॥ కర్ణికారశాఖ ♦ కలపూవు లెడలంగ, నెట్టులుండు నడపి ♦ నట్టు లగుచు
నీమె వామభుజము ♦ నెనసి చూపట్టెడు, మౌనివర్య యీమె ♦ మగధతనయ.

క॥ తనదు సుమిత్రాహ్వయమున, కనువగు గోనమున మెలంగు ♦ నతిదుర్మనయై
కనుపడ దిపుడు వినీతకి, నెనరునకు న్నెలవు ధర్మ ♦ నిష్ఠాపరయున్. ౩౫౫

క॥ వీరలు సత్యపరాక్రమ, సారులు లక్ష్మణపదోప ♦ శత్రుఘ్నపదో
దారులు దా రిద్దేవికు, మారులు సుకుమారు లుచిత ♦ మార్గవిచారుల్. ౩౫౬

ఆ॥ చేటు గాంచె రాజ ♦ సింహంబు దశరథుం, డడవి సొచ్చె రాముఁ ♦ డబలతోడ
దేనికతనఁ గొలము ♦ ధృతి మాసిపో నయ్యె, నట్టి యీపె కేక ♦ యాత్మజాత.

మ॥ అకృతప్రజ్ఞ సుదృప్త క్రోధన యహీ ♦ నైశ్వర్యకామాంధ యా
ర్యకలారూపసురూపమానిని యనా ♦ ర్యత్వోపసంఖ్యాన ఘా
తుకపాపోత్కటవృత్తినిష్ఠ స్వకమా ♦ దోషమ్మున న్నన్నుఁ గూ
ల్పక గూల్పం గని పెంచె మజ్జనని స్వ ♦ ల్పంబైన భాగ్యంబునన్. ౩౫౮

క॥ అని కన్నులనీ రొలుకఁగ, ననితరగుణుఁ డెలుఁగు సడల ♦ నడలెఁ గుపితమై
యనువు పెడి రోజు నాఁగ, మ్మునుఁ బోలఁగఁ గావిరంగు ♦ మోమై యుండన్.

ఆ॥ అట్లు గంది తెరలు ♦ ననవద్యు భరతు శు, భరతుఁ గాంచి ♦ తెలివి పట్టుకొమ్మ
దబిసిచందురుండు ♦ తా నిట్టులనె వాని, నూరడిల్లఁ జేసి ♦ యుచిత మరసి.

క॥ ఏ నీదు మనోదార్ఢ్యం, బా నెఱిఁ బరికింప నట్టు ♦ లాడితి నెది యె
తైనఁ ద్వదీయజననియు, న్మానార్హ యకా నెఱింగి ♦ మన్నింపఁజనున్. 3౧౭

తే॥ దోష మిడకుము తల్లిపై ♦ దూష్యురాలు, గాదు కైకేయి యిది దైవ ♦ కల్పితంబు
దేవదానవనరముఖు ♦ ల్దద్రుష్టసుఖులు, గాఁగలరు రాము ప్రవ్రాజ ♦ నాగమమున.

క॥ ఋషివరులు భావితాత్ములు, తుషితులు గాఁగలరు రామ ♦ ధూర్జటి యిట్లీ
మిష దుష్టులఁ బోకార్పఁగ, సుషమాంచిత యగుచు జగతి ♦ సొబ గొందుఁజుమీ.

క॥ సర్వహిత మిదియు నొరులకు, దుర్వార మటంచు నెంచి ♦ తొడిబడ కీ వా
సర్వజనీనుని శాసితి, నిర్వాహణము గూర్చి మిగుల ♦ నెగడెదవు బలే. 3౧౮

క॥ లోకములు వొగడ మహితా, లోకుఁడు రఘువరుఁడు సుకృత ♦ లోలుఁ డహితమున్
బోకడఁచి హితము నెలకొన, నీకడ కరుదేర నెంచు ♦ నిజ మిది వత్సా. 3౧౯

—♦ భరతుఁడు భరద్వాజ మునీంద్రుని సెలవుగొని చిత్రకూటంబున కరుగుట ♦—

ఆ॥ అనినయంతఁ దేఱి ♦ యామంత్రణ మొనర్చి, యమ్మహాత్ము నంఘ్రి ♦ లాన శిరము
మోపి మ్రొక్కి సైన్య ♦ మునుఁ దరలింపంగ, నాన సేసె భరతుఁ ♦ డధికృతులకు.

క॥ వాజుల నరదంబులతో, యోజన సేసి రవి హాట ♦ కోజ్జ్వలకాంతిం
బూజితము లగుచుఁ బొనర మ, హాజను లమరిరి రఘూద్వ ♦ హాయితమత్తులై.

ఆ॥ కరివరంబు లటులె ♦ కరణీగణంబులు, హేమకక్ష్య లొప్ప ♦ నించురుచుల
తోఁ బతాకలు దివిఁ ♦ ద్రోవ నెక్కొనఁ గారు, మొగిలుగముల సరణి ♦ మొనసి నెరసె.

ఆ॥ పెద్దలయ్యు లఘుతఁ ♦ బెరసి మహార్హాత, రమణఁ దనరు చిత్ర ♦ రథవరములు
పూజ్యు లధివసింపఁ ♦ బొలుపొంది పయనమ్ము, సేయఁ దొడరెఁ గడఁగి ♦ శిఖరితనయ.

క॥ పదసాధనులై నడిచిరి, పదాతిజను లదియె తమకు ♦ భాగ్యోదయమై
పదభక్తావనచతురుని, నదనునఁ గదియింపఁ జాలు ♦ నది గానుంటన్. 3౨౦

తే॥ ముదితలై కోసలాత్మజ ♦ మున్నుగాఁగ, రాజపత్నులు పుత్రద ♦ ర్శనకుతూహ
లాత్తచిత్తలగుచు మేలి ♦ యానములఁ బ్రయాణ మొనరించిరంచిత్తో ♦ ద్యానరసిక.

క॥ మునిసేవనమునఫల మటు, మునుకొని యాగము లడంప ♦ మొగకొనుటయకాన్
జనితప్రమోదులై చా, ప్పెనసిరి వారెల్ల రాత్త ♦ హితకామనులై. 3౨౧

తే॥ తరుణచంద్రార్కభాయుక్తిఁ దనరు నొక్క, శుభిక శిబిక నధిష్ఠించి సూనృతుండు
తరలె భరతుండు సపరిచ్ఛదత్వ మమర, శ్రీమహితుఁ గాంచఁజిత్తమ్ము చెంగలింప.

క॥ గజవాజిరథాళులయుం, గజిబిజి లేకుండ నడిచె ఘనసేన నిన
ర్గజ మగు ఋజుభావంబున, కజరార్చితుఁ గొల్వఁ జను నయము దోడ్పడుటన్.

క॥ అది దక్షిణాశఁ గ్రమ్మగ, నుదితోత్థితమేఘమాల యో యనసైన స
మ్మదనినద మొప్పఁ బనివినె, సదమలభూషాతటిచ్ఛ్రీ చారము పొసఁగన్. 32౭

చ॥ భరతునిసేన గంగ పర భాగమునం గనుపట్టె సర్ఝరీ
గిరివరకాననావళులఁ గేళిమెయిన్ గిఱికొంచుఁ గాంచుచున్
విరతి యనంగ రాని గతి విశ్రుతయోగవిభాగ మొప్పఁగన్
సరభసవృత్తి రామవిభు చందము నందము నంది పొందఁగన్. 32౮

తే॥ అమ్మహావాహినిప్రవాహ మట్లునాద, విదితమై యాక్రమింపంగ వెరవుఁ బాసి
గాసి వనవాసియూధముల్ గలఁగి పాఱె, ఋక్షపృషతాదికములు ప్రత్యక్ష మెడల.

క॥ అత్తఱి స్వయూథ్యములతో, మత్తములగు యూథపములు మలసిచని మహీ
భృత్తటినీతటవన్యా, యత్తత నందందుఁ గాన నగుచుఁ జరించెన్. 32౯

క॥ ప్రీతుం డతఁ డాధర్మస, మేతుఁడు దశరథసుతుండు మితిమీఱి సుసం
ఘాత యగు సేన నెందే, యాతంకముఁ బెరయకుండ నటు లెనయించెన్. 32౯

తే॥ ప్రావృడంబుద మెట్టు లం బరముఁ గప్పు, నప్పగిది భూతలంబెల్ల నాక్రమించె
రామచంద్రానుసరణాను రక్తి వెలయ, సాగరౌఘనిభంబు త త్సైన్య మపుడు.

క॥ వారణతురంగమాద్యప, వారణ మొకయింత లేని వర సైన్యమునం
దారంభము భూవివరం, బారయరా దనఁగ నమ్యో నక్కాలమునన్. 33౧

తే॥ దూరపథ మట్లు గడచియా దూరదర్శి, శ్రాంతవాహనుఁడును ముది తాంతరంగుఁ
డును నగుచు నిట్టులని పల్కె మనుకులీన, మంత్రిమంత్రవిదగ్రణి మానితోడ. 33౨

క॥ ముని మునుకొని యాతంక, మ్ము నితాంతప్రాప్తి మాన్పి మొనయించిన యి
మ్ము నయమ్ము వానిహృదయ, మ్మున రామునిఁ గొలువుకూట మున నిలిపెఁజెలీ.

తే॥ కంటి మయ్య యాదేశంబు కలిమి కగ్గ
మగు ప్రదేశంబు దేని నె య్యమునఁ దెలిపె
నలభరద్వాజమునివర్యుఁ డరసి కాంచి
శ్రుతిమతిహితంబు దృగ్యుగా శ్రుతివహింప. 33౪

క॥ అదె చిత్రకూట గిరి యి, య్యదె మందాకిని తదేత ♦ దంతరమున ను
న్నది నీలమేఘసదృశము, సదమల మొకయాశ్రమము ప్ర♦సంగోచితమై. ౩౮౫

చ॥ గిరిచటియ ల్గానన్గిరుల ♦ గేరు మదీయ కరీంద్రము ల్మహీ
ధరమహిజాతము ల్సలిల ♦ ధారల వారిధరంబు లట్లుచె
చ్చెర సుమధారల న్గురియు ♦ చెల్వు బయల్పడె నిందు నందు సుం
దరతరమూర్తి నామహితుఁ ♦ దద్దయుఁ గన్గొను భాగ్య మబ్బెడిన్. ౩౮౬

తే॥ కంటె శత్రుఘ్న; కిన్నరా♦కలనఁ దనరు, నిమ్మహాద్రి సమున్నతి♦యొసక మెసఁగ
మెకము లామకరాదుల♦మెయి మెలంగ, సాగరముఁబోల్పనగునొక♦చందమునను.

క॥ వాయుప్రవిద్ధశారద, తోయదతతి యెట్టు లటు వి ♦ ధూతత నెఱసెన్
వ్యాయతసైన్యప్రేరిత, యీయారణ్యకమృగాళి ♦ యిర వెడలంగన్. ౩౮౮

తే॥ దాక్షిణాత్యులు ఫలకము ♦ ల్దార్చి కుసుమ, శేఖరమ్ముల శిరములఁ ♦ జేర్చువార
లట్లు మనసైనికులు నట్టి♦వైన చెట్లఁ, దఱిసి ధరియించుచున్నారు♦దామకముల.

క॥ ఘోరప్రదర్శనంబై, యారాన్నిష్కూజ మగుచు ♦ నడరునడవి యి
ప్డీరాజసేన పెరయం, జేర నయోధ్యగతి వింత ♦ సిరిఁ గాంచెఁజుమీ. ౩౯౦

క॥ తురగఖురోద్దీరిత మగు, పరాగ మాకసము గ్రమ్మి ♦ ప్రభవించిననే
ర్పరి నాకుఁ బ్రియ మొనర్పఁగ, హరిదంతమ్ముల కనిచెడు ♦ ననిలుం డనుజా.

క॥ సూతవరాధిష్ఠితములు, శ్రీతజవోపేతసితహ ♦ రీందోర్ఘధములై
యీ తేరు లడవిఁ గాంచి ని, రాతంకత నెగసిదుముకు ♦ టరసితె నృవరా.

క॥ ప్రియదర్శనములు చంద్రకు, లయారె విత్రాసితంబు ♦ లై చెదరి శిలో
చ్చయ మధివాసము సొచ్చెడు, రయమునఁ జిత్రగతి వెలయ♦రమణీయముగన్.

తే॥ పృషతమృగములు తమమృగు ♦ ల్పుషమ నెఱయ
నెనసి మెలఁగంగఁ బూవుల ♦ ట్లనువు సూపు
చుక్క లొప్పారఁ గంటికిఁ ♦ జోద్యముగ మ
నోజ్ఞగతి విహరించెడుఁ ♦ బ్రాజ్ఞ కంటె. ౩౯౪

ఆ॥ ఇది యభీష్టఫలద ♦ మిది యభిరామ మి, య్యదియె పూజ్యతాప ♦ సాధివాస
మనఁగ నెగడుచున్న♦యది స్వర్గపథ మింత, కెక్కుడగుచు నెడఁద ♦ కెక్కఁగలదె.

క॥ సైన్యముల నిలుపుఁ డివ్వన, మన్యముగా దరసికాంచుఁ ♦ డధినాథుని న
న్మాన్యచరిత్రుని జాడ న, నన్యాదృశుఁ డిచటనుండు♦ ననుజుఁడు గొలువన్. ౩౯౬

ఆ॥ అన నొడళ్లు వొంగ ♦ నారాజపురుషుల, వ్వనముసొచ్చి మేలి ♦ వలను లరసి
మరలివచ్చి భరతు ♦ మహిజాధిపపదాబ్జ, నిరతుఁ గాంచి పలికి ♦ రరున మెసఁగ.

శా॥ ఇందే యుండు మహీజ లక్ష్మణుఁడుఁ ద ♦ న్నేవేళ సేవింప రా
మేందుం డింతయు నిక్క మగ్నికలనం ♦ బిచ్చోటఁ గన్పట్టె నిం
పొందింపంగల ధూమరాజివలనం ♦ బొప్పారుట న్నాథ; యా
నందం బందెదుఁ జిత్తము ల్లగ నమం ♦ దప్రజ్ఞ నూహింపవే. ౩౯౮

క॥ రామపరిభృతులె యిచ్చట, నేమంబున నుండి రట్టి ♦ నెఱి గాకున్నన్
రామోపమానులగు మును, లో మానుగ వెలయుచున్న ♦ యోజ ఘటిల్లున్.

క॥ అన్నియు శుభసూచనములె, యన్న తదీయార్యసమ్మ ♦ తాభాషణముల్
పన్నుగ విని భరతుం డా, యన్న మదిం దలఁచి మ్రొక్కి ♦ యనె వారలతోన్.

మ॥ గురుఁ డేను న్గుహుఁడున్ సుమంత్రుఁడును సం ♦ గుణ్యాన్యశఃకాము రా
మరమానాథుఁ దపోవనస్థుఁ గని సం ♦ భావ్యంబు భావించి మె
ల్లర రావించెద మంతవట్టును నన ♦ ల్ప స్నేన నిచ్చోట ని
ల్పి రహింగాంచుచునుండుఁడా వలదు సం ♦ భేదంబు గల్పింపఁగన్. ౪౦౧

క॥ అనిన నగునని రి వా ర, య్యనఘుని యానతిన నిలిచె ♦ నంతయు సైన్యం
బనువుపడెం బాగ యెచ్చట, ననీదృశుఁడు నిగుడఁజేసె ♦ నచటికి దృష్టిన్. ౪౦౨

ఉ॥ ధూమముఁ గాంచి పొంగి త్వర ♦ తో, గవియం దమకించు సేన యా
రామ మదూర మం చరసి ♦ రామునిఁ గన్గొనకే వ్యవస్థితిన్
నేమమున న్గణింప నగు ♦ నిర్ణయ మెంచియు హృష్టయయ్యెఁ ద
ద్ధామనిషక్తిచేఁ దదను ♦ దర్శనయుక్తి నెదఁ దలంచుచున్. ౪౦౩

క॥ అని విభుఁ డెఱిఁగించిన య, య్యనువున నానందసాంద్ర ♦ మై యచలజ చ
య్యన నవ్వలివృత్తాంతం, బనూనకృప వెలయఁ దెలుపు ♦ మని యడుగుటయున్.

—♦ ఆశ్వాసాంత పద్యములు ♦—

మ॥ దయమానాక్షియుగాంతరంగమహితా ♦ త్మా; లోకసంరక్షణా
ప్రియనిర్వాపణదీక్షితాంఘ్రియుగళా ♦ శ్రీయోజనాస్థాయుతా
వ్యయనామా; రచితాంతరాధ్వరగుణ ♦ వ్యాసంగదూరైకవి
న్నయనాయత్తసుధామ; ధామనిధిసం ♦ ధాతృపరిభావోదయా. ౪౦౫

క॥ వ్యక్తకలనాత్మభూతా, వ్యక్తపరిభుతాభిపన్న ♦ యాగికమాయా
సక్తత్వాసక్తత్వవి, రక్తోదాసీనభావ ♦ రమణవిలాసా. ౪౦౬

భుజంగ॥ పరంధామనిత్యప్ర ♦ భావప్రకారా
నిరాకారసన్మౌని ♦ నిర్ణీతసారా
సురమ్యాధ్వపూర్వోక్తి ♦ సూక్తపరిచారా
విరామాభిరామాత్మ ♦ విద్వజ్జనదూరా. ౪౦౭

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబున సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

---:o:---

### అష్టమాశ్వాసము.

---o---



క్షాంతిశాంతిముఖకల
నాక్షాళితపంకిలాంత ♦ రంగగురుదయా
దీక్షావహానోచితజన
రక్షాచణసన్మనోభి ♦ రామవికాసా. ౧

తే॥ అవధరింపుము నిత్యక ♦ ల్యాణమూర్తి
సర్వమంగళ యటువేఁడ ♦ శర్వుఁ డెలమి
దొనఁక నిట్లనెఁ దనమేలి ♦ మినుకు లించు
చిలుకుచినుకులగుటె మించు ♦ చెలువమొలయ. ౨

చ॥ భరతుఁడు తన్నుఁ గొల్వ నభి ♦ పన్నత నెక్కొనునట్టివేళ ము
ద్భరితహృదంతరుండు ముని ♦ పాలనరక్తుఁడు రాముఁ డోజమైఁ
దరుణినిఁ గొంచు గాంగతట ♦ తద్గిరిసంగతరమ్యకాననాం
తరసుఖభూవిహారముల ♦ తార్పన నేర్పన నుండె నిండుగన్. ౩

తే॥ ఇన్నినాళ్లును మహిజతో ♦ నెఁమిమీఱఁ, జిత్రమగు చిత్రకూటాద్రిఁ ♦ జేరియుండు
నుపవనస్థలి మెలఁగుచు ♦ నున్నవాఁడె, యాపులోమజతో నింద్రు ♦ నట్టిఁ డగుచు.

—♦ కాకాసుర వృత్తాంతము ♦—

మ॥ ఒకనాఁ డమ్మహిజాని జానకియుఁ దా ♦ నుల్లాస మొప్పార న
య్యకలంకోపవనంబునం దిరిగి వ్యా ♦ ద్యంబైన తత్సానుమ
న్నికటప్రాంచితజాహ్నవీతటకుటీ ♦ న్నిద్రప్రదేశంబు ని
దప్రకు వశ్యాత్ము నొనర్ప భూమితనయా ♦ త్సంగ ప్రసంగమ్మునన్. ౫

క॥ శిర మునిచి మేను దర్భా, స్తరణమ్మునఁ జేర్చి యొలసి ♦ శయనింపఁగ న
వ్వరవర్ణిని విభుపైఁ దన, కరము కటాక్షమును దనరఁ ♦ గాఁ బొనరు నెడన్. ౬

క॥ కాకం బొక్కఁడు కర్మవి, పాకము తనుఁ బొదువ వేడ్కఁ ♦ బఱతెంచి వెసన్
శ్రీకాంతుకాంత మేనునఁ, దాఁకించెం ద్రోటి రక్త ♦ ధార లొలుకఁగన్. ౭

సీ॥ ఆలోన మేల్కాంచి♦యధిపుఁ డాయమ పడ్డ, బన్న మాదుష్టుని♦సన్నయుఁ గని
వీఁ డైంద్రి యిటు కాకి ♦ వేసంబున నలంప, వచ్చిననా డని ♦ వానిపైని
నొకయిషీకము మంత్ర♦యుక్తంబుగ నొనర్చి, వైవ ధ్వాంక్షము పాఱి♦వహ్నిశిఖల
నలముచుఁ దో నేగె♦నస్త్ర మాతెఁడు వెఱ, చఱచి యింద్రాదుల♦శరణ మనినఁ

గూళ; యీ వెత దీర్పంగఁ ♦ గూడ దొరుల
కచ్చటున కేగు మనిరి వాఁ ♦ డలసిసొలసి
చేరఁజని ప్రాణదానంబు ♦ సేయు మయ్య
యనుచు మొఱయిడ శ్రీరాముఁ ♦ డభయ మొసఁగి. ౮

క॥ నీక న్నొసంగు మిది య, ప్రాకృతశర మనిన నట్లు ♦ పరఁగించి సుఖా
స్తోకత మించి నుతుల సు, శ్లోకుల్ శ్లోకించి వాఁడు ♦ చొప్పనసి చనెన్. ౯

క॥ ఆదట భూమానందుఁడు, సాదరుడై భూమిజాత ♦ ననునయ మొప్పన్
మోద మొనగూర్చి చేర్చెను, శ్రీదయితానన్యుఁ డాత్మ ♦ సిద్ధాశ్రమమునన్. ౧౦

—♦ శ్రీరాముఁడు సీతతో చిత్రకూట వనస్థలంబున విహరించుట ♦—

ఆ॥ నాఁడు యువతిచిత్త ♦ నాలీకవికసనం, బరసి రసికుఁ డాత్మ ♦ హర్షభృతియు
నట్టి దగుచునుండ ♦ నాయాస్థలంబుల, కలన లెల్లఁ దెలుపఁ ♦ గడఁగె నగజ.

క॥ వినుము జనకాత్మజా యి, వ్వనమున నీతోడఁ గూడి ♦ వర్తిల్లెడు ని
య్యనువున స్వర్గము మోక్షము, ననునవి యెవియో యెడంద ♦ కందవు సుమ్మీ.

క॥ రాకాశశిముఖి; రాజ్యని, రాకృతి సుహృదాప్తివిరతి ♦ రమణీయగుణ
శ్రీకామ్య మీనగోత్తమ, మాఁకపడెం దనదు మేల ♦ యగు మే లనుచున్. ౧౩

మ॥ కనుఁగొంటే ననబోఁడి యాకసము ద ♦ క్కంగొంచుఁ బైయిక్కఁ గాం
చు నెఱి న్నెక్కొను ధాతురాగపటలీ ♦ స్యూతాంగముల్ శృంగముల్
తనలా వెన్నఁగ నిన్నగం బెసఁగు ము ♦ క్తావిద్రుమేందోపలా
దినవద్యోతములై స్ఫురించు వివిధో ♦ ద్దేశంబు లొప్పారఁగన్. ౧౪

తే॥ రజతనిభములు క్షతజవి ♦ రాజితములు, పీతమాంజిష్ఠమణివర ♦ స్ఫీతరుచులు
నట్లు జ్యోతీరసాఢ్యపు ♦ ష్యారకేత, కాభములు నగధాతురా ♦ గాస్పదములు.

క॥ నానామృగగణగుణగణ, నానూనద్విజసమంజ ♦ సాలాపకలా
శ్రీనందితమై యిగ్గిరి, సానుమదగ్ర్య మనఁ దనరె ♦ సఖి; కనుఁగొంటే. ౧౫

ఉ॥ చాయలు పూలుఁ బండ్లునుఁ బ్రి ♦ సక్తిమెయిం దనరంగ నంగనా
పాయల తాకుడుంగముల ♦ పొత్తున హత్తుకొనంగ నైనవీ
చాయఁ దరూత్తమంబులు వి ♦ శాలసుశాలత మేలిపున్నెము
ల్సేయు గృహస్థులుం బలె బ ♦ లే యిది యెన్నఁగరాదె మున్నుగన్. ౧౬

సీ॥ మాకంద మిడనేర్చు ♦ మాకందములఁ గూర్చు, చెలువున మాధవీ ♦ చేష్టితములు
పున్నాగముల గేరు ♦ పున్నాగములఁ జేరు, గణికాళికల్పోప ♦ కల్పనములు
ఫలపూరవృక్షరస ♦ ఫలపూరసమరసా, భ్యాహితదాక్షోప ♦ గూహనములు
శ్రీఫలాశ్రయకలా ♦ శ్రీఫలావాప్తికై, కేలూనుపు మాలతీ ♦ ఖేలనములు
పనసఖర్జూరరంభాది ♦ పరిభవములుఁ, దనదు బలఁగంబులోనివై ♦ దనరుచుండఁ
బూనరుపడిన దివ్వనితోడ ♦ భూధరంబు, నామనం బాఁకపడి శ్రీస ♦ నాథమగుచు.

పృథ్వీ॥ మృగీమృగచయంబు ల ♦ మ్మెయిని దుష్టభావంబు సు
న్నగా నగవనంబుల ♦ న్ననుచు సామరస్యంబునన్
సుగేయ మిది గాదె వి ♦ స్ఫురితరాగరామక్రియా
గ్రిగామిత బయల్పడన్ ♦ బ్రితిసమృద్ధయా పృథ్విలోన్. ౧౮

తే॥ జతలుజతలుగ దీనిప్ర ♦ స్థములయందుఁ, గిన్నరులు దార్కొని సుఖించు ♦ చున్నవారు
కంటె కనుఁగొన్న మాత్రనె ♦ కామజనిత, రోమహర్షణ మొప్పారు ♦ యూథ మగుచు.

ఉ॥ కొమ్మల వ్రేలుచున్నయవి ♦ కోమలి; చూచితె కోమలాంగు లా
కొమ్మల మేలివస్త్రములు ♦ కోటికిరాఁదగు సొమ్ములొప్పు ఖ
డ్గమ్ములు నివ్వనేందిరకుఁ ♦ గాన్కలు వెట్టిన యట్లు విద్దెదా
ర్లిమ్ముల జోడుగూడి రమి ♦ యించు నెఱానెలు లందఁజేయుచున్. ౨౦

తే॥ ఎలయు సెలయేటి బాయల ♦ యించు బుగ్గ
లెక్కటివినోదము ల్గూర్ప ♦ నెంచు వాఁక
లెనయఁ బొడకట్టుచున్నది ♦ యిన్నగము స్రి
వన్మదము ద్విప మనెడు భా ♦ వంబు నెఱయ. ౨౨

క॥ కంటే గుహాసమీరణు, తుంటెనకాని నెఱిఁ దిరుగు ♦ గుఱిఁ గొంటెపనుల్
గెంటినఁ బోఁ జెలదీఁగెల, నంటినసుమసౌరభంబు ♦ లన్యుల కిడుచున్. ౨౩

క॥ ఈతనిచెయిదం బేనరు, సీతటి నుద్రిక్తుఁ జేసి ♦ మెలయింపదు నా
నాతరువరలతికాతుసు, మాతతపరిమళము లేర్చి ♦ యందిచ్చుధృతిన్. ౨౪

తే॥ అళులు పొదలుచు విరితేనె♦లానుచుండు, ఫలరసంబులు గొన శుక♦పఙ్క్తి వేచు
మేలి యిగురులఁ గోయిల♦ల్మెక్కఁగాంచు, నింటిదొంగలఁ బట్టంగ♦నెవ్వఁ డోపు.

సీ॥ అవె చిల్కకదుపుల ♦ ట్లల్లత్తి కనెడుఁ బో, యించుపల్కుబడి కా ♦ సించెనేమొ
యవె తేంట్లు మొరయుచు♦నాటాడఁదొడరెఁబో, యిదిప యోజినియంచు♦నెంచెనేమొ
యవె కోయిలలగుంపు♦లఱవంగఁ జొచ్చెఁ బో, కంఠస్వరము విని♦కలఁగె నేమొ
యవె నెమ్మిగములు శా ♦ ఖాగ్రంబు లెనసెఁ బో, కబరీభరశ్రీలు ♦ గవిసెనేమొ
యవె మరాలంబు లటునిటు♦నరుగుచున్న, వందియల మేలినులివుల♦కదరెనేమొ
యిన్నియును నీదుబలఁగంబు♦లే తలంప, నెఱుక లేకుంట యొక్కటి♦యే కొఱంత.

ఉ॥ ముద్దులు మూటగట్టఁ జను ♦ ముచ్చటలాడు ద్విజవ్రజంబులున్
హద్దులనిల్పు పూపొదరు ♦ లాటలు పాటలుఁ గూర్చు తీఁగెలున్
బద్దులుసూపు మన్మథుని ♦ పాటును నీటును గోటమీట నై
ముద్దియ నిన్నుఁ గూడి ముద ♦ ముంగను భాగ్యము నా కొసంగెడున్. ౨౭

క॥ పంచేంద్రియసంతృప్తి ప్రి, పంచంబిటు సులభమగుచుఁ ♦ బరఁగునె యొంటన్
బంచాననమధ్యా ; నీ, పంచ న్నన్నఱుమఁ దరమె ♦ పంచాస్త్రినకున్. ౨౮

ఆ॥ సుఖరతుండ నైతి♦శుభగాత్రి ; యీయెడఁ, గలుము లెల్లఁ బెరయ♦గాంచినాడ
స్వర్గసౌఖ్య మన వి ♦ సర్గరమ్యసుదృక్స్రి, వణవనాప్తికలన ♦ వలనఁ గాదె. ౨౯

చ॥ ఇహముఁ బరమ్ముఁ గూడినవి ♦ యింతిరొ ; ని న్గొని యిన్నగాటవిన్
బహుఫలపుష్పతోయము ల ♦ పారములై సమకూర సమ్మదా
వహములు కూటము ల్పొసఁగ ♦ నయ్య వచించిన వాక్కు సెల్లఁగా
సహకృత మైన ధర్మమున ♦ జాడన యీ డనరాని సంపదన్. 30

క॥ భరతుఁ డొకయింతకాలము, భరతత్వము సార్థకముగఁ ♦ బరఁగించు సిరిన్
సురల పచామరికలు భా, సురలుగ నీతోడ నిందుఁ ♦ జొప్పడుతు నెలన్. 3౧

మ॥ అనిశంబు న్నినుఁ జేరి సౌఖ్యముల నో ♦ య్యం గాంచెదం దమ్ముఁ డి
ట్లనుపక్తుండయి కొల్వ గూర్చెదు నయో ♦ ధ్యం గాదు నాకమ్ము నే
ని నపథ్యంబుగఁ జూతు నాదటన యే ♦ నిం బెక్కుతానేండ్లు ని
ట్లనుభావింతు మెలంగ నీహృదయమి ♦ య్యౌచిత్యము న్మెచ్చినన్. 3౨

శా॥ వైదేహీ ; వినుతింతె న న్గలిసి యీ ♦ వన్యస్థలిం జిత్రకూ
టౌదార్యంబును మెచ్చితే హృదయవా ♦ గంగప్రసంగమ్ము న
మ్మోదం బందెన భావము ల్వివిధము ♦ ల్మక్కారుగా వే తలం
పేదీ తెల్పుము వింద మొక్కపరి నీ ♦ హేలాప్రహేలాస్థితిన్. 33

ఉ॥ అందఱ కాశ్రయం బిదియ ♦ యందఁపుఁబొమ్మరో ; ముందువారలున్
గ్రిందటివారు నెన్నుదురు ♦ కీర్తిత మివ్వనవాససౌఖ్య మె
ల్లెందును సాటి లేని జగ ♦ తీంద్రులు మాయినవంశరత్నముల్
చెందిరి పుణ్యలోకగతి ♦ శ్రేయ మమేయముఁ గాంచి రమ్మయిన్. 3౪

తే॥ నీలపీతసితారుణ ♦ నిర్మలాంత, రంగ లగు శిల లీశైల ♦ మందు నెఱసి
నిన్నుఁబోంట్లకు సుఖవృత్తి♦సన్నసూపుచున్నయవి చూచెదే మేలి♦చిన్నెలోలయ.

క॥ అగ్గిసిక లట్లు మెఱసెడు, నిగ్గిరి నోషధులు రాత్రి ♦ నెనసి వెలుఁగులం
దగ్గక వేలకొలఁదులై, డగ్గరువారికి విశంక ♦ టత్రి లిడుచున్. 3౬

మ॥ పనికట్టు ల్గల యిండ్లఁ బోల్పనగు మే ♦ ల్ప ట్టిందులోఁ గొన్ని మిం
చినయుద్యానములన్ హసించు తెలివిం ♦ జెల్వొందుచుం గొన్ని తీ
ర్చినయ ట్లేకశిలాతలత్వమున భా ♦ సిల్లంగనై కొన్నియున్
దనసౌభాగ్యముఁ దెల్ప నిన్నగము శ్రీ ♦ దర్శిఁ దగుం గాంచితే. 3౭

*క॥ యంత్రిణ వల దీఁక నెద్దియు, సంత్రాసము పొసఁగబోదు ♦ చానరో నే నీ
సంత్రాణ మెనయ సుఖవర, తంత్రి వగుచు మెలఁగు మిచ్చఁ♦దవిలిన కృతులన్.

ఆ॥ చిత్రకూట మిదియుఁ ♦ జిత్రకూటంబుల, కూటముల సుఖాను ♦ కూల మగుట
వసుధ వ్రిక్కలించి ♦ వచ్చినయది యన, వచ్చు దీని వికచ ♦ వారిజాక్షి. 3౯

క॥ శోభన మియ్యది నలినద, ళాభాక్షిరో ; యన్నిటన్ మ ♦ హార్హాస్తరసం
శోభిప్రస్తరశుభసు, శ్రీభావితభావకలనఁ ♦ జెలువారు నెలన్. ౪౦

తే॥ పుత్త్రికా పుంనాగ ♦ భూర్జపత్త్రి, నవనళదళా స్తరణలుగా ♦ ననుచుచున్న
నయ్య లియ్యవి కాముక♦చర్యలాయ్యె,నోయ్యెఁదలఁపింపఁజాలుఁ బ♦ద్మోజవదన.

క॥ మృదితము లపవిద్ధములుగ, మదవతి ; కనుపట్టు మాల్య ♦ మండనఫలసం
పదితార్థము లన్నియుఁ ద, ద్విదితముఁ గూర్పవె స్మరోప ♦ వేదనయజ్ఞా. ౪౩

తే॥ ననుచు వస్వోకసారమా ♦ నసనరోవ, రంబు నుత్తరకురువుల ♦ డంబుతోడఁ
దెగడుచున్నది యిగ్గిరి ♦ దేశ మబల, యించు మూలఫలాదిస ♦ మృద్ధి నెగడి.

ఉ॥ నీవును లక్ష్మణుండు నిటు ♦ నెమ్మిమెయిం గొలువంగ సర్వసా
ఖ్యావహావృత్తి మేకొనిన ♦ హాయనము ల్గడవంగ నావలన్
శ్రీవెలయంగ రాజపుర ♦ సీమకుఁ జేరి స్వధర్మనిష్ఠకున్
దావలమై మెలంగుదు సు ♦ ధాభుజు లిమ్మనుజు ల్నుతింపఁగన్. ౪౪

తే॥ ఇచ్చటఁ గొఱంత లేదు మ ♦ హీతనూజ!
చెంగటఁ జెలంగు నీదు ప్ర ♦ సంగమునను
సకలసామ్రాజ్యలక్ష్మి ప్ర ♦ సాద మొదవె
భాగ్యవంతున కెందేనిఁ ♦ బరఁగు సుఖము. ౪౫

క॥ నీతోడి రాజ్యవిభవము, నీతోడి వనాధివాస ♦ నిర్మలవిధియున్
జేతోమోదం బిడు నెడఁ, జేతోగతి యుభయభేద ♦ సిద్ధిం గొనునే. ౪౬

క॥ అని శైలము డిగ్గి మహా, జనవంద్యుఁడు రామవిభుఁడు ♦ జానకి కెలమిన్
వినుతసలిలాఢ్య మందా, కిని రసవేణి వివరించు ♦ కృతి కనువుపడెన్. ౪౭

క॥ రాజీవలోచనుఁడు బుధ, రాజీవర్ణితవిభవుఁడు ♦ రాఘవుఁ డటు లా
రాజనిభాననఁ గొని సుర, రాజనివిష్టపదవీవి ♦ రక్తిం గొనఁడే. ౪౮

తే॥ చక్కఁ గనుఁగొను మోచారు ♦ చంద్రవదన
యూహసేయుము మతి వరా ♦ రోహ సుమతి
వీవు దార వుదారవు ♦ గా వెలయదె
నిచ్చలును సకలోత్సవ ♦ నిర్ణయంబు. ౪౯

ఉ॥ నిన్నొకసారి గన్గొని ధు ♦ నీమణి నెన్నఁగడంగు మన్నిటం
దిన్ననిదే స్ఫురత్పులిన ♦ దేశ సురమ్య విచిత్రహంసయో
గోన్నత చక్రలక్షిత ప ♦ యోరుహశోభిత శోభనాంగసం
పన్న రసాఢ్య యోమదన ♦ వాగురికా ; గుఱి కాదె లక్ష్మికిన్. ౫౦

ఆ॥ రాజరాజనళిని ♦ నాఁ జని రాజిల్లు, చున్నయది గుణాఢ్య ♦ తోల్లసత్ప్ర
తీరరుహలతాద్రు ♦ సారపుష్పఫలాది, కముల గములు నెఱయఁ ♦ గమలనయన.

క॥ మృగయూథనిపీతము ల, ట్లగణితగుణభాసితంబు ♦ లగు తీర్థము లో
వగలాఁడి నామదికి రతి, సుగమ నొనర్చెడుఁ ద్వదిచ్ఛఁ ♦ జొచ్చినయవియే. ౫౨

శా॥ నారీ కాంచితె నారచీరలు జడ ♦ ల్నానాప్రకారంబులై
సారోదారత మేకొనంగ నిదె యీ ♦ సారాపగం దోఁగ నై
నా, కీసంయము లిందుఁ గొంద ఱకె స ♦ న్నద్ధోర్ధ్వబాహుస్థితిన్
సారోపాస్తి నొనర్చువారు నియమా ♦ స్థ స్నప్రయోగంబుగన్. ౫౩

మ॥ లలితాంగీ; యదె చూడు మీశిఖరి లీ ♦ లాఖేలనావేలమై
లలి లోలానిలలోలితాగ్రధృతిసం ♦ లక్ష్యంబులౌ పాదపం
బులు పుష్పావళులం బ్రవాళతతులం ♦ బోల న్నదిం జల్ల ని
ర్మలవృత్తి న్రసభావము ల్నెఱపుఁ దో ♦ రం బంగహారంబుగాన్. ౫౪

తే॥ ననిచె నీధుని ముక్తాక ♦ నజ్జలాఢ్య, సిద్ధజనసంతతాకీర్ణ ♦ శ్లిష్టపులిన
మందమందాకినియుఁ గాఁగ♦మంజులాంగి;, నలినవనికాంచనలికల♦నలు వొసంగ.

క॥ లలి మణినిభజలమై యొక, వలనునఁ బులినతలవల్గు ♦ వల్గనమై య
వ్వలికెలనున నొండగు దెస; సులభలసత్సిద్ధ యగుచు ♦ శోభిలెఁ గంటే. ౫౬

తే॥ వాయుధుతతతసుమసంచ ♦ యాయుతే యయి
మలసె నొక్కెడఁ బోపుల్లాయ ♦ మానసూన
విలసితరసాంతరయు నయి ♦ వెలసె నొకట
వనిత; నేత్రోత్సవము గూర్చు ♦ వలని కగుచు. ౫౭

ఆ॥ విరుల తెప్ప లవియె♦విరిసెజ్జ లగుచుండఁ, జక్రవాకతతులు ♦ సమరసాత్త
కూజనము లెసంగఁ ♦ గొనకొని యధిరోహ, ణం బొనర్చు వేడ ♦ బం బరసితె.

క॥ కల్యాణి యీద్విజాతులు, కల్యోచితశుభవచఃప్ర ♦ కారము లొప్పన్
బాల్యమున మొనయు సిరి సా, కల్యము నీయెడఁద మెచ్చు ♦ గై కొనకున్నే. ౫౯

ఆ॥ నిన్నుఁ జూచుకొనుచు♦నిన్నది నెన్నుచుఁ, జిత్రకూటశిఖరిఁ ♦ జేరఁ గనుచు
నున్నఁ జాలదే య♦యోధ్యమాట యటుండ, సారపురకథాప్ర♦సంగ మున్నె.

సీ॥ మధురాధరా; నీదు ♦ మంజుభాషణరుచు, ల్బుణుక నేర్చిన రసం ♦ బుల దనర్చి
స్మేరాననా; నీదు ♦ సితశారవీక్షణా, వళి వియ్యమునకు శ ♦ ఫసులఁ గూర్చి

కమలపాణీ; నీదు ♦ కంకణక్వాణనము, ల్పొగడఁ బద్మవనీక ♦ వుల నమర్చి
సుందరాంగీ; నీదు ♦ సురుచిరహావభా, వావలంబమున క ♦ య్యలలఁ దార్చి
సుస్తనీ; నీయొయ్యారమ్ము♦సొమ్ము రెమ్మ, గమకమున కల చక్రవా♦కములఁ జేర్చి
హంసగామిని; పులినత♦లాశ్రయమున, హంసగమ యీస్రవంతి ని♦న్ననుకరించె.

మ॥ తపసు ల్సిద్ధులు శుద్ధమానసులు వి ♦ ద్యాపూర్ణు లస్తాఘు లా
త్మపరు ల్దారు శమాదిసంపదలకై ♦ తార్కొందు రిన్నిటఁ గు
కి వరాభిఖ్యము తత్త్వము న్నియతిమైఁ ♦ గీర్తింతు రిచ్చోట ని
ష్కపటస్వాంతవు నన్ను గూడి ధృతి సు ♦ స్నాతత్వ మర్థింపవే. ౧౨

క॥ భూమిజ; ప్రేముడిసకి వలె, నీమందాకిని జలంబు ♦ లెనయుము నాతో
నేమమున వికచపుష్కర, సీమ లారసికొనుచు మేలి ♦ చిత్కల లొలయన్. ౧౩

తే॥ సాధ్వి; పౌరులబలె వన ♦ చరులఁ దలఁపు
మీవనస్థలి నగరిగా ♦ నెంచికొనుము
ముదముమెయి సరయూనది ♦ యిదియ యనుము
నన్నుఁ గొని శ్రీసనాథవై ♦ ననిచిమనుము. ౧౪

క॥ ధర్మాత్ముఁడు లక్ష్మణుఁడు సు, కర్ముఁడు నాకొలువుసేతఁ ♦ గాంక్షించినవా
డర్మిలి నీవు మెలంగెదు, శర్మ మభిప్రాప్తి మిదియ ♦ చాలదె నాకున్. ౧౫

క॥ మధురస దీనం దోఁగుచు, మధుమూలఫలాశి నగుచు ♦ మధురోష్ఠి ని
న్విధవినుతఁ గూడి యొండొక, విధ మరయక యుందు నిందు ♦ వేయేండ్లైనన్.

ఉ॥ లేఁ డగతక్లముం డిచట ♦ లేమరో; సౌఖ్యములేనివాఁడుఁ గాఁ
బోఁ డహితాత్మవర్తనుఁడుఁ ♦ బో గజసింహముఖారియుగ్మముల్
సూ డెడలంగ నిన్నెలవు ♦ సొచ్చి మెలంగును సత్తపోధనుల్
వీడరు దీనిఁ బుష్పఫల ♦ విశ్రుత మియ్యది మేల్మి గాంచదే. ౧౭

ఆ॥ అని ప్రియాసహాయుఁ♦డై రాముఁ డమ్మొలి, యలరుబోఁడి పలుకు♦లడిగికొనుచు
నాస వొడమునట్టు♦లాడుచు విహరించెఁ, జిత్రకూటగతి వి♦చిత్రరతిని. ౧౮

క॥ సరి గంగాస్నానంబులఁ, దరుణియుఁ దానునుఁ బొనర్చి ♦ తగినవసనముల్
ధరియించి యించు వేడ్కన్, సురుచిరవేషు లయి మించు♦చొ ప్పెనసి రుమా.

ఆ॥ అట్లు సిరి దనర్చి ♦ యగ్గిరి కరుదెంచి, యింద్రనీలఫలక ♦ మెనయఁ గాంచి
తప్పశీకరణవి ♦ ధం బెంచి యిట్లనె, నింతితోడ నప్పు ♦ డినకులుండు. ౨౦

క॥ అలసితివె యలసగమనా ;, విలసద్గ్రిస మిది సుమేధ్య ♦ విశ్రాంతము హితా
నలతప్త మామిషము గొను, మలజడి హాయి సుఖ మొదవు ♦ ననితర మగుచున్.

—♦ రాముఁడు సేనాకలకలమువిని లక్ష్మణునితో ముచ్చటించుట ♦—

ఆ॥ అనుచుఁ బత్నిఁ గూడి ♦ యాంతరంగికవృత్తి, నెఱయ నెగడు గాంచు ♦ నెడఁ దనర్చెఁ
గదియవచ్చు సేన ♦ కలకలధ్వని పరా, గములు మిన్ను ముట్టి ♦ కడలుకొనుచు. ౨౨

క॥ ఆశబ్దము విని యాశా, పాశమ్ములు ద్రెంచికొనుచుఁ ♦ బ్రీతి వేశయుతో
ద్దేశము వెడలి పఱచెఁ జతు, రాశలకున్ యూథ్యయూథ ♦ పాళు లడరునన్. ౨౩

క॥ అది విని నిది గని రాఘవుఁ, డదనునఁ బొడసూపి నట్టి ♦ యనుజుని సామి
త్రినిఁ దేజోనిధిఁ గాంచెం, గని నిట్లనె సమయయోగ్య ♦ కలనుం డగుచున్. ౨౪

క॥ వింటె సుమిత్రానందన ;, గొం తుద్దియు నెఱుకపడదు ♦ కోలాహల మీ
వెంటం బొడమె నొకము లద, రంటం దెసలంటఁ బఱచు ♦ నవి కనుఁగొంటే.

ఆ॥ రాజమాత్రుఁడేని ♦ రాజేని మృగయార్థ, మివ్వనంబు సొచ్చె ♦ నేమొ కడఁక
నన్య మైన శ్వాప ♦ దాగ్రేసరం బిట్టు, లరుమ ననువుపడెనొ ♦ యరసి కనుము.

క॥ మదిమది, బెరపులుఁగులకును, సుదుశ్చరం బిమ్మహాద్రి ♦ నూవె తలఁప ని
ట్లొదవ నెది కారణంబో, విదితం బొనగూర్చు మెఱిఁగి ♦ వేగమ యనినన్. ౨౭

—♦ లక్ష్మణుం డరసి రామునకుఁ దెలుపుట ♦—

మ॥ త్వరితుండై చని యెక్క నొక్క బహుపు ♦ ష్పంబైన సాలంబు వాఁ
డరసె న్దిక్కుల నెల్లఁ బూర్వదిశకై ♦ యత్తెత్తి చూచెన్ గిరియా
భర మొప్పార నుదఙ్ముఖుం డగుచు సం ♦ ప్రాప్తంబు సైన్యంబు గాం
చె రథాశ్వేభభటోద్భటంబు శరధి ♦ స్థిత్యుత్కటంబై తగన్. ౨౮

క॥ కేతనబిరుదాకృతి సం, కేతము లూహించి తెలిసి ♦ కేవల మిది సా
కేతనగరి సైన్యం బని, యాతంకము తోడి నుడిగ ♦ నని రామునితోన్. ౨౯

ఉ॥ అగ్గి శమింపు మార్య జన ♦ కాత్మజఁ జేర్పు గుహాంతరంబునన్
దిగ్గన మేలుకాంచి శర ♦ ధిన్ శరచాపములన్ ధరింపు మా
పగ్గె మెయిన్ జిరా దొడిగి ♦ పాల్పడి యుండుము మేటి సంగరం
బిగ్గిరిపొంతఁ దారసిలె ♦ నింకఁ గడంకఁ దొలంకఁ జెల్లదే. ౩౦

ఆ॥ అనుడు రాముఁ డనియె ♦ నన్న లక్ష్మణ యేమి, వచ్చిపడియె నెట్టి ♦ వలను గలది
యేరిసైన్య మదియు ♦ నెఱిఁగి వచింపుము, సంభ్రమింప ననికిఁ ♦ జాలమొక్క.

క॥ తొలుదొల్త నింత తీవ్రత, నొలయం బనియేమి దాని ♦ యొరవిడి స్థితియున్
తెలిసి కనికాక యూరక, కలిసి యఱుమఁబోవ మేలు ♦ గలదే తలఁపన్. ౮౩

ఆ॥ అనిన నాకళంబు♦నప్పుడే దహియించు,వలను మిగుల నెగడు♦వహ్ని యగుచు
వాఁడు నొడివె రోష ♦ వశగుఁడై కన్నుల, నిప్పుకండ్లు సెదరి ♦ నిగుడుచుండ.

—♦ లక్ష్మణుండు భరతు సైన్యంబు బరిమార్ప రాము ననుజ్ఞ వేఁడుట ♦—

శా॥ సంపన్నం బగు రాజ్య మిచ్చనిడి యీ ♦ సంప్రాప్తము న్మెచ్చకే
గుంపుం గూర్చి కడంగినాఁడు మనపైఁ ♦ గొట్లాట లాడంగఁ బా
టింపం బోలదె కైక కాత్మజుఁడుఁ గాఁ ♦ డే వాఁ డుపేక్షించినన్
జంపుం న్నిన్నును నన్ను నిష్టయిన నీ ♦ జంపు న్విచారింపుమా. ౮౪

ఆ॥ కొఱలుచున్నవాఁడు ♦ కోవిదారధ్వజుఁ, డతఁడె సేనమొగము ♦ నందు నిలిచి
యిభరథాశ్వవరము♦లెక్కి దోఁతెంచెడు, వారు యోధు లెగయు♦వల్గనముల.

చ॥ మనకు నవశ్యవశ్యుఁ డగు ♦ మార్గాని నిల్చెనయేనిఁ జాపముం
గొని పొనరింపు సజ్యముగఁ ♦ గొంకక యిచ్చట నిల్తుమో గిరిం
గొనకొని తీర్పు మేకొనఁగఁ ♦ గూడఁగ వత్తుమొ నిశ్చయింపు మె
త్తును సడలంగనీకు మిఁక ♦ దోసము లే దెటు లాచరించినన్. ౮౬

చ॥ వ్యసనము లెన్ని గూర్చె మన ♦ వాఁ డనికా కది కైకకాన్పునన్
దొసఁ గనఁబోలదో బలము ♦ తో నిటఁ జేరఁగ వచ్చుచున్నవాఁ
డసము దొలంగునే యఘము ♦ నావహిలం గలదే స్వధర్మమాఁ
గస చెడలుం గులోచితము ♦ గ్రిమ్మఱ రాజ్యసుఖమ్ముఁ జేకురున్. ౮౭

ఆ॥ ఇతనిఁ గెడపి పుడమి ♦ యేలుము పూర్వాప, కారిఁ ద్యక్తధర్ముఁ ♦ గడవ నేమి
గలుగుఁ గైక రాజ్య♦కాముక యిభభగ్న,మగము నట్లు దనయు♦నరయఁగలదు.

క॥ అంతకు నేనే చాలుదు, నంతకుఁ డనఁ దనరి యుంటె ♦ నానతికై యి
ట్లింతలు నొడువుచు వెన నా, జంత నగడుపాలు సేయు♦జతనము నెఱియున్. ౮౯

ఉ॥ మేదిని పీడఁ గాంతురొ స ♦ మేళముగా నశియింతొగ్రి యింతె యి
ట్లీదెస న న్నెదిర్చి మన ♦ నెంతురె మున్నడిగొన్న యావినం
వాద మమోద మగ్గలిక ♦ వారని యయ్యవమానముం దెగన్
నాదగు బీరము న్బరవ ♦ నమ్ముదవాగ్ని నొనర్చి మించెదన్. ౯౦

తే॥ చిత్రకూటకానన మెల్లఁ ♦ జిక్కుపఱచి, చేరు పగతుల మేనులు ♦ చించివైచి
కుంజరతురంగమంబులఁ♦గూలఁ ద్రోచి, నెత్తురేటులు వఱపెద♦నిమిషమునను.

క॥ కక్షము వహ్ని యనంగ వి, పక్షబలము నేర్చునెడఁ బ్ర ♦ భంజనకృతిఁ ద్వ
ద్వీక్షణ మొనర్చుఁగావుత, మీక్షణము సఖిత్వయోగ ♦ మిం పెసలారన్. ౯౫
తే॥ నీప్రసాదంబు కలిమి న ♦ న్నిచకర్మ, సైన్య మాత్రనితోఁ గూడఁ ♦ జక్కడంచి
శ్వాపదంబులకును భూత♦సంతతులకు, నెఱపు విందున జగతిలో♦నెగడువాఁడ.
క॥ నేర్చిన ధనుఃకలక్కి, నర్చిష్మంతుఁ డన నెగడి ♦ నందుల కితఁ డీ
కూర్చిన ముఱిపోఁ వేచ్చ స, మర్చిత మాన్యుణ్య మంద ♦ నైని న్గొలుతున్.

—♦ శ్రీరాముఁడు లక్ష్మణుని సంరంభంబు తగనిదనుచు నాతనిం దేర్చుట ♦—

చ॥ అని తనమేనుఁ దాఁ గనని ♦ యంతకు నంతకుఁడో యనంగ నె
ట్టన దమకించు లక్ష్మణు వి ♦ డంబనముల్ గృధపొంగు స్వీయభ
క్తిని హితవృత్తియుం గని య ♦ కేవలమర్త్యుఁడు రాముఁ డించు సాం
త్వనమున వానిఁ దేర్చె నెఱ ♦ దారిఁ దనర్చె సురార్చితార్చితా. ౯౬
తే॥ ధనువుతోఁ గార్య మేమి వ♦త్సా; సచర్మ,మసియు నెందులకీపెద్ద ♦యలుకయేల
యామహేష్వాసుఁ డాప్రాజ్ఞుఁ♦డాభరతుఁడు,తనకుఁ దా సిద్ధిఁజేరె నెఱఁ♦దారసిల్ల.
మ॥ పితృసత్యంబు ప్రతిశ్రుతం బనుచు సం ♦ ప్రీతి న్వనావాసముల్
మతికిం జేర్చి ముదమ్మున న్మెలఁగుచు ♦ న్మాతాడి యీపాడిదా
కృతికిం బాల్పడి రాజ్యముం గొనియు దు ♦ ష్కర్తం బ్రవర్తించి దు
ర్గతికిం బోయెడువాఁడనే తలఁపు మీ ♦ కాదర్థ్యముల్ లక్ష్మణా. ౯౭
క॥ ఎది హితులకు బంధుల కా, పద లొదవించు నది యిష్ట ♦ పదమేనియు నా
మదికి విషభక్ష్యతుల్యమ, కుదురుగ నీవిషయ మరసి ♦ కొను మనవద్యా. ౯౮
శా॥ ధర్మం బర్థము కామ మీక్షితి తెనూ ♦ ధారిత్వముల్ గొంటి నే
మర్మం బేనియు లేదు మీకయి యిటే ♦ మాటం బ్రమాణింతు నే
నిర్మాత్సర్యమునం జరింతు నెపుడు ♦ న్నేనుంబునన్ సోదరుల్
శర్మం బందని కల్మి కాసపడ నీ ♦ సద్వృత్తి భావింపుమా. ౯౯
తే॥ రాజ్య మొక్కఁడు గాదు స్వా♦రాజ్యమైన, నరయ ధర్మేతరపథమ్మ♦నందునేని
నే నిడ నెడంద యం దది♦నిక్క మింత, వట్టు శరములు చేపట్టి♦యొట్టు పెడుదు.
క॥ ప్రభుభావనమెయి నిలు దు, ర్లభ దీనిన్ సాగరాంబ ♦ రన్ భోగార్థం
బభము శుభ మనక గొని మీ, కు భయము సమకూర్చునట్టి♦కుమతి నగుదునే.
తే॥ అన్న భరతునకును నీకుఁ ♦ బిన్నతమ్మ, నకునుఁ గాని శుభంబు మ♦నంబునందుఁ
జేర్చితిన యేని దాని మ♦దర్చితుండు, వహ్ని దహియించుఁగావుత♦వల నెఱింగి.

చ॥ భరతుఁడు భ్రాతృవత్సలుఁడు ♦ ప్రాణముప్రాణము వాఁడు నాకు ధ
ర్మరతుఁ డయోధ్యఁ దాఁ బెరసి ♦ మాన్యుల వర్తన మెంచి యిట్టి దు
ష్కరవనవాసము న్బడయఁ ♦ గాంచిన న న్నెద నుంచి స్నేహపుం
జెరువున కగ్గమై తనరు ♦ తేఁకువమై నరయంగ వచ్చెడిన్. ౧౦౩

తే॥ అన్యథాగతి గా దసా♦మాన్యుఁ డాతఁ, డింతకును శోక వేగాకు♦లేంద్రియుఁ డయి
తల్లిఁ దిట్టి గురునిఁ జేరి♦తద్ద వేడి, వఱలుసిరి నప్పన మొనర్ప♦వచ్చినాడు. ౧౦౪

క॥ ఇదె ప్రాప్తకాల మగు నని, యదనునఁ దముఁ దేర్పఁ బూనె ♦ నంతియ కాకా
సదమలమతి మనదెస కా, పద లొనగూర్పంగ నంత ♦ పాపాత్ముఁడే. ౧౦౫

క॥ జడ లల్లి పరివ్రాజన, మడరఁ బుడమికన్నె తోడ ♦ నదనున నే ని
య్యడవిఁ దిరుగరా నీ వి, య్యెడగున గొగ్గ నలజడి స ♦ హించెడువాఁడే. ౧౦౬

ఆ॥ ఎన్నఁడేని నీ క ♦ హిత మొనరించెనే, వాఁడు భానువంశ ♦ వర్ధనుండు
పాడమెనేల యి ట్లు ♦ పూర్వ సాధ్వసవృత్తి, యెంత విప్రియమ్ము ♦ నెంచి తనఘ.

చ॥ భరతునిఁ గాంచి యొక్కఁడు నె ♦ పంబున నైనఁ దొరంగనైన నే
పరుస మనంగ నౌ పలుకుఁ ♦ బల్కకుమయ్య యసంబు పెంపు న
ప్పురుసునఁ బోవ దర్వ్యథయుఁ ♦ బొల్కనఁ జూచెదనయ్య యట్టి ము
ష్కరకృతి నాకొనర్చు నప ♦ కారమె యానుగదయ్య తమ్ముఁడా. ౧౦౮

క॥ ఆతంక మొదవెఁ దమ కను, నాతురతం దండ్రిఁ జంప ♦ నౌదురె తనుజుల్
భ్రాతలు భ్రాతను జీవిత, భూతుని వధియించు పనికిఁ ♦ బూనుదురె క్షితిన్.

శా॥ సౌమిత్రీ; నిజమైత్రి వాసిచన రా ♦ జ్యం బెంచి భాషించెదే
నేమం బెన్నఁగ నీని యాస కడఁక ♦ న్నిజ్జ స్టెనే గట్టిగా
నామార్గం బెఱఁగింపుమయ్య భరతు ♦ న్యాచించి నీ కిత్తు నే
నామాత్రిం బనినంత బాధ మని వాఁ ♦ డానందముం బొందెడిన్. ౧౧౦

క॥ అనఘుఁడ విప్రియమున నీ, వనియెద వని యెదఁ దలంప ♦ నకటకటా ; కా
లనియతి యిమ్మెయి మార్పడె, ననవలసెన కాక యొక్కఁ ♦ డన నేమియగున్.

క॥ అని సాధీయోమార్గం, బున నెరిదీర్చు తలఁ పెడఁదఁ ♦ బొనరుపడంగన్
దన తెలివి దనర రాఘవుఁ,డనుజుని బోధితు నొనర్చు♦ననువున వెలయన్. ౧౧౨

—♦ లక్ష్మణుండు సిగ్గువడ రాముఁ డతనిఁ జక్కపఱచుట. ♦—

తే॥ ధర్మశీలుఁడు భ్రాత వా ♦ గ్దండితునిఁగఁ, దన్నొనర్పంగఁ దద్ధిత ♦ తత్పరుండు
లక్ష్మణుఁడు సిగ్గువడి తన♦లావు సెడఁగ,నవయవంబులఁ జొచ్చిన♦ట్లయ్యె నపుడు.

క॥ విన్నదన మొదవ ననె నా, సన్న నరయ నైతిఁ దండ్రి ♦ జనవిభుఁడే యి
ప్డిన్నయమున ని న్నెనయఁగ, నున్నతినై నరుగుదెంచె♦నో యగు నెంచన్. ౧౧౪

క॥ అని ప్రీడితుఁడై నొడివెడు, ననుజుని గని యనియె రాముఁ ♦ డగునయ్యా య
మ్మనుకులతిలకుం డిందఱఁ, గొని చనఁ జను జేర నోపుఁ♦గూడెడు నదియున్. ౧౧౫

తే॥ చూడఁగానేని మరలించు ♦ జాడనేని, వచ్చినా డింతవట్టు భూ ♦ వల్లభుండు
పుత్రవాత్సల్యమున,వీరు♦పుడమిఁ బాసి,యడవి గొడవలు గుడుచువా♦రని తలంచి.

క॥ సుకుమారి సుఖోచిత యి, య్యకలంకచరిత్ర సీత ♦ యడవి బడల నా
వికలత్వ మేల యని యా,సుకృతి పురిం జేర్చు వలను ♦ చూచెనొ యొకఁటన్.

తే॥ వీర; యవె కానఁబడెడు మ ♦ నోరమములు
వాయుజవములు ప్రథితాన్వ ♦ వాయుజములు
తండ్రి మెచ్చినయవి రెండు ♦ తత్పరముల
నుత్తమద్యోతములు తురం ♦ గోత్తమములు. ౧౧౮

మ॥ అదె చర్లాడెడు వాహినీముఖమునం ♦ దన్నా; ప్రవృద్ధంబు ను
న్నది తద్బోధనుఁ డయ్యా పెంప మహింతో ♦ న్నాదంబు శత్రుంజయో
ద్గదితాఖ్యంబు విచిత్రమండనము ప్ర ♦ ఖ్యాతంబు సామ్రాజ్యస
మ్పదుపాఖ్యానకలాసమాఖ్య మగు న ♦ మ్మత్తేభముం గాంచితే. ౧౧౯

తే॥ ఛత్ర మతిపాండురము లోక♦సత్కృతంబు, తండ్రి దది దివ్య మిట్లేల♦తారసిలదొ
డెందమున సందియంబొక్కఁ♦డంద రాక,తిరుగుచున్నదియది యేమి♦తెఱఁ గరసెనొ.

క॥ మఱియును వింజామర లే, మఱియున్న విధంబ తోఁ చె ♦ మతకరితన మ
క్కఱ సూపుచున్నయది యే, క్కైఱ నెఱపంబొల్ల దొండు ♦ తెఱ వేర్పడమిన్.

తే॥ చెట్టు దిగి వేగమే నన్ను ♦ జేరుమయ్య, నావచించిన యన్నెఱి ♦ నడుపు మయ్య
ధర్మహితబుద్ధి నెవ్వేళఁ ♦ దనరుమయ్య, నిన్ను నన్నుఁ బ్రతిష్ఠతో♦ నిలుపుమయ్య.

క॥ అనునంత మ్రాను డిగి నె, మ్మనమున దృఢభక్తి నెగడ ♦ మాన్యుఁడు శ్రీరా
మునిఁ జేరవచ్చి పార్శ్వ, మ్మునఁ గేల్గవ మోడ్చి కొలువు ♦ మొనసి తనర్చెన్.

—♦ భరతుండు సైన్యంబు గొంతదరి విడియించి రామసన్నిధి కరుగుట. ♦—

శా॥ సమ్మర్దం బుచితంబు గా దనుచు ము ♦ న్సాభ్రాత్రవంతుండు దా
నెమ్మాడ్కి న్వచియించె నాభరతుఁ డ ♦ య్యిచ్ఛావిధిం గొంచు సై
న్య మ్మోజస్వి యుపత్యకాస్థలి నిల ♦ న్దా యోజనాంతమ్ము వా
స మ్మాకల్పితముం బొనర్చి యునిచెన్ ♦ సౌజన్య మొప్పారఁగన్. ౧౨౪

క॥ దర్పమెడలి రామున కా, త్మార్పణ మొనరించి తత్కృ ♦ పార్థితధర్మం
బేర్పడ నీతికి నిలిచెం బ్ర, సర్పదుదధినాఁ దనర్చు ♦ సైన్య మచటునన్. ౧౨౫

క॥ గురుముఖ్యులు గుహుఁడుం ద, త్పరులు సుమంత్రాదు లెన సి ♦ తనతో రా సో
దరయుతుఁడై చనె భరతుఁడు, గురువాఙ్నిరతుఁ భజింపఁ♦ గొనకొను వేడ్కన్.

ఉ॥ సైన్యము నిల్పి కాల్నడ న ♦ సంభ్రముఁడై చనువాఁడు తమ్మునిన్
మాన్యునిఁ గాంచి యిట్లనెఁ గు ♦ మార ; విదూరతలంబునం దనా
మాన్య లలుబ్ధులం గొని సు ♦ మంత్రిఁడు బంధులతో గుహుండు ని
ర్మన్యు లెఱింగి తెల్పఁ గుల ♦ మండనుఁ డున్నయెడ న్గణింపుమా. ౧౨౭

క॥ జ్ఞాతిసహాస్రిమ్ములతోఁ, బూతచరిత్రుండు గుహుఁ డ ♦ భూతము సాహా
ద్దాతిశయము నెఱయఁగ న, స్నీతఁ గాన్పించుఁగాత ♦ మినవంశ్యునకున్. ౧౨౮

క॥ శరచాపాసిధరుండై, సరభసముగ నన్నయున్న ♦ జాడఁగని నను
న్వరణీయు నతనిఁ జేర్చి సు, పరమకృపార్ద్రిత్వ మొప్పఁ ♦ బరఁగెడు నింకన్.

క॥ ఏను గురు లీద్విజాతులుఁ, దో నడువ న్వాలను గనుచుఁ ♦ దోఁతెంచెద ని
శ్కానన మెల్లం దిరిగెదఁ, గానక యీనాఁడు రిత్త ♦ గడవం గలనే. ౧౩౦

క॥ నానోములు స్ఫృతిఁ గూర్పఁగ, నీనెఱిఁ బదచారమునన ♦ యేగి యరసి య
మ్మానధను సానుజున్ సహ, జాని న్గని కాని శాంతి ♦ జతగొన నఘా. ౧౩౧

సీ॥ వెన్నెల వ్వాలయించు♦వెలలేని యెలమోము, నెల యెప్డు దిలకించు♦వల నోలయునొ
లలితము ల్నలినద ♦ లమ్ము దలమ్ములు, కళ లెంచు కను లెప్డు ♦ గాంచ నగునొ
సిరి లాలనమ్ముల ♦ చిన్నెల కెలలు ప, దము లెప్డు తలయొగ్గఁ ♦ దలఁచుతర మొ
కొలముచా లేల నే♦కొల లేని యియ్యేల, కలిమిమై కొను టెప్డు♦కలిమి గనునొ

యన్న ; యభిషేకజలపరి♦క్లిన్న మైన, కోమలాంగుని యమ్మోని♦కొమరు సూపు
ముత్తెపుం డెలిగొడు గెప్డు♦మురిపమున ధ, రింతునో యంతలో నాకు♦శాంతి గలదె.

క॥ పితృపైతామహరాజ్యం, బతులితతేజుండు బుధజ ♦ నార్చితుఁ డెనయం
బ్రితి లేని భాగ్య మని త, న్మతి మెలఁగక యున్న శాంతి ♦ మలయం గలనే.

ఆ॥ వ్యంజనాన్వితంబు ♦ లన్న పాదాబ్జముల్, శిరము మోపి కొలుచు ♦ సిరి దనర్చ
వెలయువాఁడ నొక్కొ♦వేయుఁ బున్నెంబులు, ఫలముసిద్ధిఁ గూర్పఁ♦బరఁగునొక్కొ.

తే॥ ఎంతధన్యుఁడు రామహి ♦ తేచ్ఛుఁ డుచిత
లక్షణుఁడు గాంచుచున్నాడు ♦ లక్ష్మణుండు

సాంద్రచంద్రోపమము సుప్ర ♦ సన్న మ్మ
రమ్యనయనాభిరామము ♦ రాము మోము. ౧౩౫

క॥ కృతకృత్యు కాదె జనకుని, సుత, సుతనువరేణ్య నిత్య ♦ శుద్ధచరిత శ్రీ
మతి సతి వైదేహి జగ, త్పతి యనుకృతి వడసెఁ దనదు ♦ భాగ్యము కతనన్.

చ॥ సుభగము చిత్రకూటగిరి ♦ చూచితె పూచి ఫలించి పున్నె మీ
శుభ మొనయింప రామపద ♦ శోభనచిహ్నయుతప్రదేశపుం
బ్రభుతఁ గనెం గుబేరుఁ డొక ♦ పట్టున మెట్టిన నందనంబు స
త్ప్రభఁ గాని శ్రీనివాస మిదె ♦ బాగుర యంచు నుత ల్నుతింపఁగన్. ౧౩౭

క॥ గిరిరాజసదృశ మియ్యది, పరఁగె మహారాజయోగ ♦ పద్ధతిఁ గననై
యరరే; రామధర మనం, బరమాఖ్యానంబుఁ దనకుఁ ♦ బాల్పడకున్నే. ౧౩౮

తే॥ న్యాయసేవ్యము దుర్గ మి♦వ్వన మహాక్ష, తార్థ మయ్యెను సన్మని♦ప్రార్థితుండు
శ్రుత్రభృద్వ్యూహుఁ డీరామ♦చంద్రుఁ డెలమి, మించి వసియించు కతమున♦మేల్మిఁ గాంచి.

క॥ అని పలుకుచుఁ బురుషర్షభుఁ, డనితరచరితుండు భరతుఁ ♦ డన్న పదంబుల్
మనమున నిడి పదములనడ, ఘనము వనము సొచ్చె సత్త్వ ♦ కలనాంచితుఁడై.

క॥ గిరిసానుజపుష్పితతరు, వరముల నడిచక్కి నడిచె ♦ వదతాంవరుఁ డ
న్నరవరుఁడు సానుజుండై, వరదుఁడు తన యన్న యున్న ♦ వల నారయుచున్.

తే॥ ఘనుఁడు మునిశిష్యు లల్లంత ♦ మొనయ నెచట
రామమహిజాని యాశ్రమా ♦ రామభూమి
యని యడిగి వార లదె గిరి ♦ కవల గాంగ
ముత్తమతటంబునం దన ♦ నొదిఁగి కనుచు. ౧౪౨

క॥ దారితల మొనయు నొక సుర, దారుద్రుమ మెక్కి రమ్య ♦ తరుసుందర మా
నారామ ముచితలక్షణ, మారామసహోదరుఁడు ర ♦ యంబునఁ గనియెన్.

ఆ॥ అగ్నిధ్వజముఁ గాంచె ♦ నచటునయుం దముం, దానుభావ మమ్మ ♦ హానుభావుఁ
డదియు నుచ్ఛ్రితంబ♦మై యాహితాగ్నుల, కుశలవార్త గూర్చు♦గుఱియ కాదె.

తే॥ చూచినంతనె నెమ్మని ♦ చొక్కఁ బెనుచు
పారవశ్యంబు వెలయ న ♦ పారగుణుఁడు
రాముఁ డున్నాఁ డచట నంచు ♦ రాణ నెఱయఁ
బఱచె భరతుఁ డఘాంబుధి ♦ పార మొనసి. ౧౪౫

ఉ॥ వెండియు వచ్చువారల వి ♦ వేకఘనుం డటు నిల్వఁ బంచి నీ
యండనె తోడితె మ్మిపుడె ♦ యంబల నంచు గురు న్గణించి త
మ్ముండు గుహుండు వేడ్క తల ♦ మున్కలు నాకను నాసుమంత్రుఁడున్
దండనె రాఁగ రాట్సుతుఁడు ♦ తత్పరుఁడై చనెఁ దత్పథంబునన్. ౧౪౬

క॥ అందఱ కగ్రగతుండై, యందలి యందములఁ దెలుపు ♦ నను వెనయఁగ నై
సుందరుఁ డాగురువత్సలుఁ, డెందును దనసాటి కొంకళు ♦ లేఁ; యన నెయిదెన్.

మ॥ సుతనూ; వా డటు లేగుచుం గనియె సం ♦ స్తుత్యాభియోగంబు సం
యతచిత్తోనిషేవితంబు రఘురా ♦ మాధీశు పర్ణాలయం
బు తరూదంచితవల్కలాజినముగాఁ ♦ బొల్పారు నద్దాని స
ద్గతి కుప్పాంగి చెలంగు మైమఱపువాఁ ♦ డం దోఁగుచు న్దూఁగుచున్. ౧౪౮

క॥ అన్నయుఁ దమ్ముఁడు నడిచిన, చిన్నెలు గల భూమిభాగ్య♦చిహ్నము లరయన్
గన్న సుకృతంబు కలిమికిఁ, గన్నుల మేలిమి నుతించు♦కలనఁ దనరుచున్. ౧౪౯

క॥ ఒక్కొకఁ డరయుచుధృతి పెం,పెక్కఁగ నగుతెఱఁగు గాంచి♦యెలయుచుఁజనిరా
చక్కటి రామాశ్రమ మిదె;నిక్క మనుచుఁ దెలుపు నియతి ♦ నిర్ణయముక్తిన్.

—♦ భరతుఁడు రామాశ్రమముం గాంచి తన కృతకృత్యతను వెల్లడించుట ♦—

శా॥ ఆవజ్రాంకుశవారిజధ్వజరథాం ♦ గాద్యంక రాజాంకిత
శ్రీవిస్తారపదారవిందయుగల ♦ క్షిత్యాప్తరేణూత్కరం
బావిద్వన్నుతుఁ డందె సానుజుఁడుగా ♦ నందిచ్చె నట్లంశభా
క్త్వావిర్భూతపురాకృతాకృతికుఁడై ♦ యన్వాప్త లౌవారికిన్. ౧౫౧

ఉ॥ ధన్యుఁడ నైతిఁ గాదె శుభ ♦ దంబులు రామపదంబు లిం దసా
మాన్యత నెక్కొనం దనరు ♦ మాన్యపదం బిది దీనిఁ గంటి సా
జన్యమునన్ జెలంగు విర ♦ జస్కలు గోరుదు రీరజమ్ము నా
కన్యముగా దనంగ నయి ♦ యబ్బెను నబ్బలు బాము లూడఁగన్. ౧౫౨

క॥ అని ప్రేమరసాప్లుతుఁడై, యనితరభావమునఁ బొనరి ♦ హర్షాశ్రుతత
స్తనమధ్యభాగుఁడై చనె, మనుకులదీపమ్ము వెలయు ♦ మండప మెనయన్.

మ॥ కనెఁ గల్యాణసుకోటి పర్ణకుటి శ్రీ ♦ కామ్యంబు సుస్థోటజం
బును వాచంయమవస్త్రమండలసము ♦ ద్భూతంబులై యుండఁ గో
సినపూలుం గుశ లింధనంబులును స ♦ చ్ఛీలోచితాగాజితా
జినవల్కంబులుఁ దత్పరిదర్శకము లౌ ♦ చిహ్నంబులై నెక్కొనన్. ౧౫౪

తే॥ శీతవారణకారణ ♦ స్థితికిఁ గూర్చు
మృగపశుకరీషముల నిడ్డ ♦ మేలిప్రోవు
లతఁ డచటఁ గాంచె నావల ♦ ననుజుతోడ
నిట్లనుచుఁ బల్కెఁ దొడరె మ ♦ హీధ్రతనయ. ౧౫౫

మ॥ ముని కారుణ్యమున న్వచించినటులే ♦ మున్నాడి కన్నాడ ని
య్యనుగాంగంబు ధరాధరోపధము నా ♦ నాదేశ మాదేశ మ
ట్లనువొందం దరువల్కలంబు లవె పా ♦ ర్శ్వాయాతవన్యోద్భవ
ర్తనవస్త్రం బిదె తమ్ముఁ డాకృతులకై ♦ తా నేగు మార్గం బిదే. ౧౫౬

ఆ॥ అదిగొ గార్హపత్య♦మగ్నిధూమము సుసం, కులము తెలిపె నదియె♦కోటిసేయు
వేయు నేల నిచట♦విదితాగ్రగణ్యుండు, రాముఁ డున్నవాఁడు♦రాణ నెఱయ.

క॥ వనవాసమునకు నుచితము, లనఁ దగు లక్షణము లెల్ల ♦ నగపడె నీక నా
ఘనమోహ మెడల సంవి, ద్ఘను రాము మహర్షి నట్లు ♦ గనియెద నిచటన్.

ఆ॥ సంతసమునఁ గాంతు ♦ సంస్కారకారి మ, దార్యగుహుఁ దపోధ ♦ నాభిగమ్యుఁ
బురుషసింహు రాముఁ♦బున్నె మిన్నెఱిని ఫ, లించి నెలవు సేర్చె♦శీల నెఱయ.

క॥ గురుఁడు గురుధర్మనిరతుం, డక్షీణతేజుఁడు మహాత్ముఁ ♦ డర్థిజనహితుం
డరిదారణుఁడు కృపాళుఁడు, హరిసదృశుఁడు నన్ను మనుప ♦ నరమఱ గొనునే.

ఆ॥ అనుచు సురసరస్త♦టాద్రిప్రదేశంబు, లారసికొనుచుఁ జనె ము♦హూర్తమాత్రి
నవలఁ గాంచి పలికె♦నాశ్రంబు పెనుపొంద, వాఁడు కైక యిడ్డ♦వాదు దలఁచి.

ఉ॥ నిర్జరతుల్యు లౌ నృపులు ♦ నేటుకొనం గమకించి కొల్వ సం
మార్జితదోషులౌ ప్రజలు ♦ మాలిమిఁ గోరఁ జెలంగు భర్తయే
నిర్జనవన్యభూమి నిటు ♦ నేఁడు వసింపఁగ నయ్యె నింక నా
దుర్జనిభావ మెట్లడఁగుఁ ♦ దోఁపదపో పరికించి చూచినన్. ౧౬౨

ఆ॥ పరఁగుచుంటి లోక ♦ పట్టభద్రుండు నీ, రాసనాప్తి నడవి ♦ గాసిలంగ
నరసి యెందు నిండ♦లందఁగాంచిన దొక్కఁ, బ్రదుకె తోఁన యెడయు♦బాటువలదె.

ఆ॥ నన్నుఁగూర్చి లోక ♦ నాథుండు సన్మహో, ద్యుతి నిరస్తసకల ♦ దురితుఁ డిట్లు
ముక్తసర్వకామ ♦ మోదుఁడై వని వ్యస, నముల పాలుగాఁ గ ♦ నంగనయ్యె.

ఉ॥ లోకులు తిట్టఁ బుణ్యగతి ♦ లోపము నెన్నుచు నిట్టు లున్న నే
నాకమలాక్షు రామవిభు ♦ నంఘ్రులపైఁ బడి వేఁడుకొందు భ

వ్యాకృతి తత్ప్రసాదరమ ♦ యానన నౌ ధృతిఁ గాంతు దేవి సు
శ్లోక నుతింతు మ్రొక్కులిడి ♦ సూక్తుల లక్ష్మణుఁ దేర్తు నెంతయున్. ౧౬౫

—♦ భరతుఁడు రాము నివాసంబు చేరంజనుట ♦—

చ॥ అనుచు గణించుచుం గదిసె ♦ నాప్రథితేచ్ఛుఁడు పర్ణశాల నం
దనసమశీల సాలసుఖ ♦ తాలలితాకృతితాలవాల చం
దనతరుజాలకప్రకృత ♦ తాలదలచ్ఛదయుక్త సత్కలా
యనభృతిమూల శోభనగు ♦ ణాద్భుతలీల విశాల నయ్యెడన్. ౧౬౬

తే॥ మృదుకుశాస్తీర్ణ యధ్వర♦విదిత వేది, నాఁ దనర్చుచు నింద్రాయు♦ధాదృతములు
రుక్మపృష్ఠమహాసార ♦ రూఢ బార, కలితసాధనములు కార్ము ♦ కములు వెలయ.

క॥ తూణీరములు గుణాశ్రీ, పాణింధమవర్తనములు ♦ పరమార్థకలా
రీణజయదానచణములు, మాణిక్యోచితవిధాన ♦ మయములు మెఱయన్. ౧౬౮

తే॥ భానురశ్మిప్రకాశవి ♦ భాసురములు, శత్రుబాధకములు తూణ ♦ సంశ్రయములు
సాధురక్షాచణాస్త్రాహి♦చయము లిత్థ, వదనములుగా నెగడ భోగ♦వతినిఁ బోలి.

తే॥ కనకకోశము లసులు కాం ♦ చనవిచిత్ర, బిందుసందోహవహనశో ♦ భితసుచర్మ
ములు సగోధాంగుళిత్రము♦ల్గానయద్వీపద,ధృష్య సింహగుహాయొనాగ♦ దేజరిల్లి.

క॥ మునితాశ్రయాశ్రమం బ, య్యనను ననుపమరాజ్యవిభవ ♦ యుక్తం బగుచున్
ఘన తేజస్స్ఫురణలఁ జి, ఘ్ననలక్ష్మ్యస్థితిఁ దనర్చు ♦ కలన లోలయుచున్. ౧౭౧

తే॥ ప్రాగుదక్ప్రవణ విశాల ♦ స్వాగమోక్త, దీప్తపావక వేదిక ♦ తెఱఁగు సూప
సర్వశుభగమ్యయగు నుహి♦జామనోభి, రాము వసతినిఁగాంచె నా♦రాజసుతుఁడు.

—♦ భరతుఁడు శ్రీరామునిం గాంచుట ♦—

పంచచా॥ నిరీక్షణం బొనర్చె నప్డు ♦ నిర్మలస్వభావుఁ డా
ర్తరక్షణక్షముం గనంగఁ ♦ దద్దయు న్మహార్తమున్
విరామ మయ్యె నంచుఁ గాంచె ♦ వేగఁజొచ్చి సద్గుణా
భిరాము రాము నుత్కటాభి ♦ వృద్ధి పేర్మిరణంబునన్. ౧౭౩

సీ॥ మణికిరీటోచిత ♦ మహితమస్తకమునఁ, జిక్కువాఱిన జడ ♦ లేర్చి చుట్టి
చాయబంగరు కట్టు దోయి మించుల మేన, వల్కలాజినములు ♦ వలనుపఱచి
మున్నీరుమొలనూలు ♦ ముగుద మెచ్చిన తేజు, దర్భాస్తరణలపై ♦ దావుకొలిపి
మునుపటి నెఱవెల్గు♦ముచ్చట ల్వీడని, మొగముచందురు మేలి♦మురిప మోర్చి

శాశ్వతబ్రహ్మతత్త్వమ్ము ♦ సరణి నెఱియ
సీతతో లక్ష్మణునితోడఁ ♦ జిన్నె గాలయు
నమరు లక్షించు కోర్కుల ♦ యదను పొంచి
యుటజమున నున్న రామున ♦ యొయ్యఁ జరసె. ౧౨౪

క॥ రూపింపరాని రూపున, కోపి సముజ్జ్వలమహాగ్ని ♦ యోజ నెగడఁగన్
బ్రా పెల్లసిరుల కిదె యని, దాపై భాగ్యమ్ము దెలుపఁ ♦ దత్ప్రియణుంస్తై. ౧౨౫

ఆ॥ వాలి దుఃఖశోక ♦ వర్ధనిమై దృష్టి, పెరయు నసహ్యవృష్టిఁ ♦ బిహిత యగుడు
ధర్మ మొకఁడె తనకు ♦ దారి సూపెడు తోడు, గాఁగఁ గైకసుతుఁడు ♦ గవిసె నపుడు.

క॥ చేరి విలపించెఁ గడఁగి వి, చారము తన్నొదువ బాష్ప ♦ సందిగ్ధపదో
చ్చారణ పనుపడ ధైర్యము, ధారణతోఁ గూర్పరాని ♦ దశకై పలికెన్. ౧౨౭

క॥ మన్నీలు వేడ బుధులు గు, ణోన్నతుఁ డని పొగడఁ జమరు ♦ నొలసి నెగడు నా
యన్న యిదె కారడవిలో, నున్నాడు మెకాలరకము ♦ లోలిఁ గొలువఁగన్.

సీ॥ వెలలేని జిలుగుదు ♦ వ్వలువ దాల్చెడు వాఁడు, కటికువల్కలములు ♦ గట్టినాడు
మెఱుఁగుతో విరిసరు ♦ ల్నెఱయు మే ల్లురులవాఁ, డురుజటాలికిఁ దల ♦ యొగ్గినాడు
చందనఘనసార ♦ చర్చ గూర్చొనువాఁడు, కొండఱాపాడి కిచ్చ ♦ గొలిపినాడు
నునుపట్టు వింతపా ♦ న్పు పని మెచ్చనివాఁడు, దర్భాస్తరణలకే ♦ తనిసినాడు
సాధ్వితో ధర్మసంగ్రహా ♦ స్థన్మెలంగ, నైనవాఁ డిట్లు వనవృత్తి ♦ నందినాడు
నాకతనఁ గాదె యురక మ ♦ న్నాథుఁడైన నె, మలఁక లిన్నియు నింక నే ♦ మనినఁ గలదె.

క॥ జన్మము లొసఁగ్చి పుత్రుల, మన్నీలం గని ప్రజాళి ♦ మనుచు నెఱికి వా
రి న్నెలకొలిపిన తఱిఁ గా, కిన్నెల వెనయు నిపు డేయ ♦ హితమేర్పడెనో. ౧౩౦

క॥ లోకవిగర్హితుఁడ జిఘాం, సాకలితుఁడఁ గాక యింక ♦ సజ్జనుఁడనె నే
నీకర్మమునకుఁ బొడమితిఁ, గైకొంటిన్ బ్రాతఫలము ♦ గడవం దరమే. ౧౩౧

క॥ అని నొడువుచు నొగులుచు నె, మ్మన మాత్రం జెనసి పొగయ ♦ మ్రాన్పడి చెయువుల్
పొనుపడఁ దన కొండొకగతి, తనరమి కారాటపడుచు ♦ దరిఁజేరె వెసన్. ౧౩౨

ఆ॥ మొగముదమ్మి మున్న ♦ సగముగా వడలిన, దగడుపడియె నప్పు ♦ డావహిల్లు
స్వేదబాష్పములు వి ♦ శేషించి పొదువంగ, దాని కెపుడు మంచి ♦ తారసిలునొ.

క॥ పాదము లందక మునుపే, యాదీనుఁడు వ్రాలెఁ బుడమి ♦ యం దెద గుందన్
బాదుకొను గద్గదికతో, నేదియు ననఁ డార్య ; యనుట ♦ యొక్కటి దక్కన్.

ఆ॥ పిన్నతమ్ముఁ డటులె ♦ పెనుపు దక్కి ధరిత్రి, యందు వ్రాలె నన్న ♦ యంఘ్రు లంటి
వారిఁ బొదివి యెట్టి ♦ వరుసనె యశ్రుమో, చన మొనర్చె రామ ♦ చంద్రుఁ డెడలి.

ఆ॥ అట సుమంత్రగుహులు ♦ నారాజపుత్రుల, నర్కశశుల నట్టు ♦ లంద గాంచి
కొమరు గనిరి వారు ♦ గురుశుక్రు లనఁ దగి, యడవియాకసంబుఁ ♦ దొడరుచుండ.

క॥ వారణయూథపులుంబలె, నారాజకుమారవర్యు ♦ లందఱు నొకటన్
జేరి పొగుల నొగులున వన, చారులుఁ గన్నీరు నింప ♦ సాగిరి పెలుచన్. ౧౮౭

ఆ॥ తన్నుఁ బోల జడలు ♦ దాల్చి వల్కలములుఁ, గట్టి నట్టివానిఁ ♦ గానవయ్యుఁ
గానఁబడనివాని ♦ గతవర్ణుఁ గృశు క్షయ, భానుఁ బోలెఁ బుడమిఁ ♦ బడినవాని.

తే॥ తెలిసికొని యెట్టకేలకుఁ ♦ దివిచి యెత్తి
యంకమున నుంచి యెదకు నె ♦ య్యమునఁ దార్చి
శిరము మూర్కొని కౌఁగిటఁ ♦ జిక్కఁ బొదివి
యిట్టు లనె రాముఁ డాతని ♦ హితము గోరి. ౧౮౯

—♦ శ్రీరాముఁడు భరతుని కుశలప్రశ్న పూర్వకముగ రాజనీతిప్రకారం బుపన్యసించుట ♦—

సీ॥ ఎన్నఁడో చూచిన ♦ ట్లున్నది నిను జూడ, నింత కృశించితి ♦ వేల వత్స
యెప్పు డేతెంచితి ♦ వింటి కి ట్లింతలోఁ, దండ్రి వీడ్కొన మదిఁ ♦ దలఁచి తెట్లు
పరలోక మతఁడు చే ♦ ర్పడి చేరఁబోఁడుగా, నవయదుగా బాల ♦ నాథ లక్ష్మి శ్రీ
రాజ్య మేలుచు నిట ♦ రా గతం బెయ్యది, యీవిరాగమునకు ♦ హేతు వెద్ది

రాజసూయాశ్వమేధాధ్వ ♦ రప్రయోక్త
సత్యసంధుఁడు ధర్మని ♦ శ్చయుఁడు రాజు
కుశలియె తదీయహృదయాను ♦ కూలముగను
సేవ లొనరింతె యింతకుఁ ♦ జెప్పు మయ్య. ౧౯౦

ఆ॥ బ్రాహ్మణుండు ధర్మ ♦ పరుఁడు విద్వాంసుండు, భూరిధామనిధి త ♦ పోధనుండు
భానువంశజుల కు ♦ పాధ్యాయుఁ డమ్మేటిఁ, బూజసేయుదయ్య ♦ పొలుచుభక్తి.

క॥ కోసలు తనయ సుఖినియే, యాసతి సుప్రజ సుమిత్ర ♦ హర్షవతియెఁ జి
ద్భాసురు నినుఁ గన్న జనని, భాసిల్లునె యార్య కైక ♦ పరమప్రీతిన్. ౧౯౧

క॥ సహవినయు వంశరత్నము, బహుశ్రుతి న్విదితవిధి ను ♦ వద్రష్ట మహా
మహునననసూయుఁ బురోహితు, సుహితున్ సత్కృతులఁ దనుపఁ ♦ జూచెదె యెపుడున్.

ఆ॥ అతఁడు బుద్ధిమంతుఁ ♦ డార్జవమ్మున కిమ్మ, హుతము హోష్యమాణ ♦ ముక్తవేళ
నరయుచున్నవాఁడె ♦ యగ్నికార్యంబుల, సరణి తప్పకుండ ♦ సమ్మదమున.

క॥ పితృసత్కృత లేయిందఱు, సుతులనఁగా నెంతు రెపుడు ♦ శుద్ధాత్మిక ల
మ్మతియుతలు రామమాత్యసుత, నుతి గన్నా రట్టివారి ♦ నోనాడవుగా. ౧౯౫

క॥ దేవపితృమాతృగురుత, ద్వాభ్యుల వృద్ధులను వైద్య ♦ ధర్మపరుల భూ
దేవుల బహూకరింతువె, యావలనునఁ గాదె కలుగు ♦ నఖిలశుభమ్ముల్. ౧౯౬

క॥ శస్త్రాస్త్రసుసంపన్నుఁడు, శాస్త్రార్థవిశారదుఁడు ప్ర ♦ చారితనయుఁ డా
శాస్త్రశ్చితుఁడు సుధన్యుఁడు, నిస్త్రింసుఁడు మానితుండె ♦ సేనే నెపుడున్. ౧౯౭

ఆ॥ శూరు లాత్మసములు ♦ ప్రాభవంతులు సునిర్జి, తేంద్రియులు కులీను ♦ లింగితజ్ఞు
లనఁగఁ దనరుమంత్రు ♦ లనఁ గూర్తె యవ్వారి, వలనఁగాదె నృపులు ♦ వఱలుటెందు.

క॥ మంత్రమె మూలము రాజ్యము, తంత్రమ్మున కెల్ల మంత్ర ♦ ధరులు నయజ్ఞుల్
మంత్రులు సుసంవృతముగా, మంత్రించిన యదియె జయర ♦ మాయోగ మిడున్.

ఆ॥ నిదుర కగ్గమగుచు ♦ నెఱిదప్పి చనవుగా, కాలమున నె మేలు ♦ కాంతువుగద
యపరరాత్రములను ♦ యర్థనైపుణముల, జింత సేయు బుద్ధిఁ ♦ జేరి మనెదె.

క॥ ఎక్కటి మంత్రింపవు గద, పెక్కండ్రం జేర్చి వివిధ ♦ భాషణములఁ గై
పెక్కి చెఱుపఁజూడవు గద, యెక్కార్యము రాష్ట్రి మోనసి ♦ మెఱుఁగఁబడదుగా.

తే॥ అరసి లఘుమూలము మహోద ♦ యంబు నైన
యర్థము సునిశ్చిత మొనర్చి ♦ యపుడ చేయ
నెంతుగద దీర్ఘసూత్రత ♦ నిట్టు లల్లు
గాఁ బొనర్పవుగా మేలి ♦ కలన సెడఁగ. ౨౦౨

క॥ చేయంబడినవి సుకృత, ప్రాయంబులు నైనయవియుఁ ♦ బరు లెఱుఁగుదురే
యేయెడనేనియుఁ గర్త, వ్యాయితమై యొక్కపనియు ♦ నడఁగి చనదుగా.

క॥ సుకృతములకుఁ గృతరూపము, లకుఁ దృప్తి వహింతు రెపుడి ♦ లానాథులు చే
రక కర్తవ్యము లననై, వికృతము లగు కృత్యములకు ♦ వేడ్కపడ రెటుల్.

తే॥ ఈవు నీమంత్రులును నిర్ణ ♦ యించు కృతుల, యుక్తితర్కములనునేని ♦ నొంటనేని
నొడ్లుగ్రహియింపఁ బోరుగా ♦ యుల్లసమున, బోదుగా యెదియేనియుఁ ♦ బూరికగుచు.

క॥ వేవుర మూర్ఖులఁ జేర్పక, భావంబునఁ గూర్తె యొక్క ♦ పండితు మేల్మిన్
శ్రీవిదితుఁ డతఁడు కృచ్ఛ్రము, లావిధిఁ బోకార్చి కూర్చు ♦ నఖిలార్థములున్.

క॥ తీ రెఱుఁగలేని మూర్ఖుల, పారముగా నుండియైనఁ ♦ బార్థివునకుఁ బెం
పార ననుచు కర్జములం, గారు సహాయులు ఘటింతురి ♦ కలిమి సెడు కృతుల్.

తే॥ మేధ గలవాఁడు దక్షుండు♦మేటి శూరుఁ, డన్నిట విచక్షణుఁడునైన♦యట్టిమంత్రి
యొక్కఁడేచాలు సామాన్యు♦నుర్వరేంద్రు, నఖిలసామ్రాజ్యసంపత్తి♦నలరఁజేయ.

తే॥ ముఖ్యులను ముఖ్యముల మధ్య ♦ ములను మధ్య
మముల నల్పుల నల్పక ♦ ర్మములఁ గూర్తె
శుద్ధు లుపధాతిగులు పూర్వ ♦ విద్ధులు నగు
మేలి సచివులఁ గూర్చెదే ♦ మేలికృతుల. ౨౦౯

క॥ నీయుగ్రదండమున జను, లేయోజం బ్రదుకనేర్తు ♦ మే మనునెడ ని
న్నాయుక్తి కిడరుగదకై, కేయీసుత కా దనక సు ♦ కీర్త్యు లమాత్యుల్.

తే॥ ఉగ్రదండధనార్థివై ♦ యున్న నిన్నుఁ, బరిభవింపరుగా యెల్ల ♦ ప్రజలు పతితు
యాజకులుఁ గామయాను వ♦రాంగనలును, నెట్టు లట్టులు లాఘవం♦బేర్పడంగ.

తే॥ ప్రబలసామాద్యుపాయని♦ర్భరుఁడు కుటిల, దుష్టనీతిజ్ఞుఁడును భృత్య♦దూషకుండు
శూరుఁడైశ్వర్యకాముఁ డ♦శ్లోకుఁడు నగు,పురుషుఁజంప నుపేక్షింపఁ♦బోకమనెదె.

క॥ ప్రతిభటత నేయెడన్ దు, ర్మతముల బోధించి జనుల ♦ మలఁగించెడు న
మ్మతకరిఁ గెడపం దొడరని, మతిహీనుఁడు వానివలన ♦ మడియుఁ గుమారా.

తే॥ ధార్ష్ట్యయుక్తుండు హృష్టుండు♦ధైర్యశౌర్య,మతిసమేతుండు సత్కుల♦మండనుండు
శుద్ధు డనురాగి దక్షుండు ♦ సూనృతుండు, నైన సేనాపతింగూర్చి ♦ యాదరింతె.

మ॥ బలవంతు ల్ప్రముఖు ల్విశారదులు సం ♦ ప్రాప్తాపదాను ల్సుధ
న్వులు విక్రాంతులు నైన సద్భటుల సం ♦ పూజ్యత్వ మూహింతె వా
రల భోజ్యంబులు వేతనంబులు నవా ♦ ర్యప్రీతిదానంబుల్
దలఁగంజూడక యుక్తకాల ముచిత ♦ త్వం బెంచి యోజించెదే. ౨౧౪

క॥ జీతము బత్తెము నిడుపని, కే తటివోఁ జూచు తేని ♦ యెడఁ గోపమునన్
రీతిసెడి భటులు దోషో, పేతు లవుదు రదె యనర్థ ♦ పృథుహేతువగున్. ౨౧౫

తే॥ అంద అనురక్తులే స్వకీ ♦ యాన్వవాయ
జాతులు ప్రధాను లగువారు ♦ సర్వకృతిస
మాహితత్వంబు తనర నీ ♦ యర్థములకుఁ
బ్రాణముల నర్పణ మొనర్పఁ ♦ బరఁగువారె. ౨౧౬

క॥ తనజనపదమునఁ బొడమిన, మనుజు వివేకాఢ్యు దక్షు ♦ మహితప్రతిభా
ను నయజ్ఞు యథోచితవా, దినిఁ బండితు దూతవిధిక్రి ♦ తి న్ఘటియింతే. ౨౧౭

ఆ॥ ముఁగురుముగురుగాఁగ ♦ మొనసి యవిజ్ఞాతు, లైన చరుల కతన ♦ నరసి కనెఁ
తనదు పదియు నై ది♦తరుల పదియు నెన్ని, దియు ననంగఁ బరఁగు♦తీర్థములను

క॥ తొలితాఁకున నలజడిఁ బడి, బలమఱి చని రిపులు మరలఁ ♦ బఱతెంచిన దు
ర్బలు లంచు నీసడింపక, మెలఁగెదె తగుకృతుల వెంట♦మృదితసపత్నా. ౨౨

క॥ లోకాయతికులు బ్రాహ్మణ, సాకారు లనర్థకుశలు ♦ లతిబాలిశు లు
ద్రేకులు పండితమాను ల, నేకులు గల రట్టివారి ♦ నెఱయించెదవే. ౨౨

తే॥ ముఖ్యము ల్ధర్మశాస్త్రము ♦ ల్మానసి యుండఁ
దర్కబుద్ధినిఁ దవిలి దు ♦ స్తంత్రు లగుచు
నెప్పుడు నిరర్థవాదంబు ♦ లే మెలంత్రు
దుర్బుధులు వారితోఁ బొత్తు ♦ దూషితంబు. ౨౨

సీ॥ మనపూర్వులగు మేటి ♦ మన్నీలు చేపట్టి, లాలింప వింతయా ♦ లీలఁ గ్రాలి
తనపేరు నిక్కమై ♦ తనర దృఢద్వార, హాస్త్యశ్వముఖలక్ష్మ ♦ యై పొసంగి
పొలుచు ప్రాసాదపుం ♦ బుత్తడిబొమ్మల, వలగొను దివ్యుల ♦ కలన లరసి
సంతతసంతోషి ♦ తాంతర దీని తీ, రెది గాంచు నను వార్త ♦ నెనసి మించి

కలకొలమ్ములవా రాత్మ ♦ కర్మనిరతు
లూర్జితోత్సాహులు జితేంద్రి ♦ యులు సహస్ర
సంఖ్యలు సుపూజ్యులునుఁగాఁ బ్రి ♦ శస్తిఁ గనున
యోధ్య పరిరక్షణ మొనర్చు ♦ యోజ గంటె. ౨౨

క॥ కలుములపుట్టి ల్లది శుభ, కలనలఘుం దానకము స ♦ కలపూజ్యరమా
కలితప్రాకామ్యమహో, బలు లేలిరి దాని మేలి ♦ పద్ధతి దనరన్. ౨౨

క॥ అట్టి సుగుణ దానిం జే, పట్టితివే రాజధానిఁ ♦ బ్రణయిని నటు లే
పట్టుననేనియు మేల్కని, గుట్టెఱఁగి మెలంగు మేలి ♦ కొమ రెనసితివే. ౨౨

సీ॥ నిత్యోత్సవకలాను ♦ నిష్ఠితసంహృష్ట, నాకినరోల్లాస ♦ నంద్యగుణము
యజనశాలాద్దైవ ♦ తాలయావ్యాజస, ద్విజసమాజనయోక్తి ♦ వివరణంబు
కమలాకరప్రపా ♦ కరణీయయాతాభి, యాతాధిజనతాఽని ♦ యంత్రితంబు
మంగళాశంసార ♦ మాప్రమాసంలక్ష్య, మహితవాద్యధ్వని ♦ మంజిమంబు

ధృతియుత మకృష్టపచ్య మ♦దేవమాతృ, కం బపశ్వాపదం బన♦ఘం బభయము
పశుఖనిసమృద్ధ మాస్మాక♦వశగము నగు, జనపదంబు యథాస్థితి♦సంగతంబె.

ఉ॥ పాపులు లేరు ధర్మ మెడఁ ♦ బాపఁగలేరొ కరుణ్ దురాత్ములం
బాఁ పెనయంగనీరు ధృతిఁ ♦ బాల్కొని కాని చరింపఁబో రహిం
సాపరు లాత్మవేత్తలు ల ♦ సన్నయు లాత్తసమృద్ధు లౌ ప్రజల్
పోఁపున తీపున న్మరఁగి ♦ పోఁడిమి మైకొనుచున్నవారలే. ౨౨౬

క॥ నీ కభిమతు లగువారలె, యాకృషిగోరక్షజీవు ♦ లగు జీవులు వా
ర్తాకలితులైన లోకులె, లోకమున సుఖాత్ము లౌగి వి ♦ లోకింపంగన్. ౨౨౭

క॥ వారల కిష్టానిష్టా, హారపరీహారము లన ♦ యం బొనగూర్పన్
నేరిచి వర్తించెదె తన, వారే కద దొరకు విషయ ♦ వాసిజనంబుల్. ౨౨౮

క॥ మర్మము లేక నిజం బ్రజ, ధర్మ మరసి మనుచు టేఁడు ♦ తార్కాణముగా
నిర్మలుఁడై యిహపరముల, శర్మము తనదే యనంగఁ ♦ జనుఁ బొగడొందన్.

చ॥ పొలఁతుల నూఱడించితె పరి ♦ పోషణముం బొనరించితె వింతవా
క్కలనలు నమ్మఁబోవు గద ♦ కల్గు రహస్యము లక్లై వారికిన్
దెలుపఁ దొడంగ కుండుదువె ♦ తిట్టఁగ నెట్టన వీడఁ జూడఁగాఁ
దలఁపవుగా యథార్థగతిఁ ♦ దమ్ముఁడ నా కెఱుఁగంగఁ జెప్పుమా. ౨౩౦

తే॥ నాగవనమును గాపాడు ♦ నయము గలదె
యున్నవే ధేనుకలు పెక్కు ♦ లుత్తమాశ్వ
కుంజరీకుంజరమ్ముల ♦ కొటులదెసఁ
దృప్తి యని లేక యార్జించు ♦ తెఱఁగు గానెదె. ౨౩౧

క॥ మేల్కాంచి ప్రొద్దుప్రొద్దునఁ, గల్కం బొకయింత లేక ♦ కాన్పించెదె తీ
రొల్క ప్రసాధనరమ మే ♦ లుక్కులుకలు తనరార నీదు ♦ కొలు వొప్పారన్.

తే॥ మర్మ మొక్కింత లే కీవు ♦ మలయుచుండఁ
గర్మకరు లెల్ల నిర్విశం ♦ కతఁ బెరయుట
వేఁడినను దర్శనం బీక ♦ విసువు వొడమఁ
జేయుటయుఁ గాని మధ్యమ ♦ స్థితి నెఱపెదె. ౨౩౪

వ॥ సర్వదుర్గంబులును ధనధాన్యాయుధోదకయంత్రశిల్పిధనుర్ధరులచేఁ బరిపూర్ణంబులై యున్నయవియే, యాయం బధికంబును వ్యయంబు పరిమితంబునుగాఁ బరఁగుచున్నవియే, యపాత్రులం గూర్చి కోశనాశం బొనరింపవుగద, దేవతాపితృబ్రాహ్మణాభ్యాగతయాచనికులయందును యోధమిత్రవర్గంబులయందును నేమఱక యర్థవ్యయంబు గావించుచున్నవాఁడవే, యార్యుండు విశుద్ధాత్ముండు నైయుండియుఁ

గర్వవశంబునం జౌర్యంబుచే దూషితుండై నాతని శాస్త్రకుశలు లగువారు విమర్శించి నిర్ణయింపకయమున్న కేవలలోభంబున దండింపం దలంపవుగద, గృహీతుండై విచారింపఁబడి దృష్టకారణుండు దుష్టుండు నగు చోరుని ధనలోల్యంబున విడిచిపుచ్చవుగద, ధనికదరిద్రులకు వివాదంబొదవిన నయ్యర్థంబు నీయమాత్యులు విరాగులై సమదృష్టిచే నరయుచున్నవారే, న్యాయాన్యాయవిచారణకుం దక్కి వర్తింప రాజుచే, మోమోటకై నేరంబు మోపంబడిన ప్రజల కన్నులం గారు కన్నీరు స్వాత్మభోగార్థి యగు నాతని పశుపుత్రకళత్రాదుల ప్రణాశంబు బొనగూర్చుం జుమీ, వృద్ధబాలవైద్యప్రముఖుల ననుమతవస్తుప్రదానంబులచేతను మన సిచ్చి మాటాడుటచేతను వశపఱచుకొనుచున్నాడవే, గురువృద్ధతాపసదేవతాతిథిచైత్యవృక్షంబులకు సిద్ధార్థులగు బ్రాహ్మణులకును నిచ్చలు నిచ్చమెయి నమస్కరించుచున్నవాఁడవే, అర్థాసక్తిచే ధర్మంబును ధర్మంబు నిమిత్తంబుగా నర్థంబును సుఖేచ్ఛం జేసి కామంబునుం గాని తదుభయంబునుఁ జెఱుపం జూడక ధర్మార్థకామంబులం గాలవిభాగంబునం గూర్చి జితేంద్రియుండు కాలజ్ఞుండు వరప్రదుండు నవం బ్రశంసం గొన్నవాఁడవే, సర్వశాస్త్రార్థకోవిదులగు బ్రాహ్మణోత్తములు పౌరజానపదులతోడం గూడ మహాప్రాజ్ఞుం డితం డని నీదు మేలిమి మెచ్చుచున్నవారే, నాస్తిక్యంబును ననృతంబునుఁ గ్రోధంబును బ్రమాదంబును దీర్ఘసూత్రితయు సజ్జనాదర్శనంబును మదాలసత్వంబును నింద్రియపరవశత్వంబును నెక్కటి కార్యపర్యాలోచనంబును ననర్థులతోడి మంత్రణంబును నిశ్చితానారంభంబును మంత్రగుప్త్యభావంబును మంగళాచరణలోపంబును సర్వతఃప్రత్యుత్థానంబును నను పదునాలుగు రాజదోషంబులం దవులుకొనక నేర్పున మెలంగుచున్నవాఁడవే, దశపంచచతుర్వర్గంబులను సప్తవర్గాష్టవర్గంబులను ద్రివర్గంబును విద్యాత్రయంబును నింద్రియజయంబును షాడ్గుణ్యంబును దైవమానుషవ్యసనపంచకయుగ్మంబును వింశతివర్గంబును బ్రకృతిమండలంబును యాత్రాదండవిధానాదులును దత్కారణంబులైన సంధివిగ్రహంబులును సక్రమంబుగా నెఱింగి హేయంబుల విడిచి యుపాదేయంబులం గ్రహించుచు సర్వజనశ్లాఘాపాత్రుండవై ప్రవర్తిల్లుచున్నాఁడవే, నలువురు మువ్వురు మంత్రులఁ జేర్చికాని వేర్వేఱుగాఁ గాని యేకాంతం బొలసి మంత్రవిధానంబు నడుపుచుండుదువే, నీదు వేదంబు లగ్నిహోత్రాద్యనుష్ఠానంబులచేతను నీద్రవ్యంబులు దానభోగంబులచేతను నీదారవర్గంబు రతిపుత్రులచేతను, నీశ్రుతంబు శీలవృత్తంబులచేతను సఫలత్వముం గాంచుచున్నవియే, స్వాదుభోజ్యం బొక్కఁడవే భుజింప నొల్లవుగదా, ఆనపడు మిత్రులకుం జక్కగా నర్థజాతంబుల సమకూర్తు కాదే, నాచే నీ కెఱింగింపంబడిన యాయుష్యయు యశస్యయు ధర్మకామార్థసంహితయు నగు నీబుద్ధి నాయం బెట్టు లట్లు

నీయందును నేటుకొని యున్నదియే, తండ్రి దేని మేకొని నెలకొనుచున్నవాఁడో, తాతముత్తాత లేదాని నంగీకరించి సుశ్లోకులైనారో యేయది సన్మార్గానుసారిణి యనిందితయునై చెల్లుచున్నదియో యట్టివృత్తినిఁ దలంగక కొని చెలంగుచున్న వాఁడవ యనంగ నైతివే, తమ్ముకుఱ్ఱా? మహామతియు, దండధరుండును, ప్రజాపాలనతత్పరుండు నగు రాజు ధర్మచ్యుతుండు గాక యేకాలంబు నెల్ల నేల నేలం జాలి సర్వశుభంబులుం బెరసి, యాత్మతత్త్వం బరసి చిట్టచివరకు శాశ్వతపుణ్యలోకసామ్రాజ్యం బందంజాలువాఁ డని యిట్టు లవ్యాజకరుణారసభరితుండగు శ్రీరామచంద్రుండు కుశలప్రశ్నవ్యాజంబున భరతున కశేషరాజనీతివిశేషంబులుం బ్రతిబోధించి ప్రసాదించిన. ౨౩౫

—♦ భరతుఁడు రామునకుఁ దనరాక యెఱింగించుట ♦—

క॥ విని తోనె యాతఁ డిట్లనె, ననఘా; ధర్మచ్యుతుండ ♦ నై చేడ్పడు నా
కను వగునె రాజధర్మం, బని నెట్టన దెలుపఁ బిదప ♦ నౌనది గలదే. ౨౩౬

ఆ॥ అధిప నిలిచి యున్న♦యది ధర్మ మది మన, యందు సముచితము ని♦రంతరమ్ము
నగుచు జ్యేష్ఠుఁ డుండ♦నవరజుం డవ్వానిఁ, గొలిచియుంట యొండు♦గోరకుంట.

క॥ ఆశాశ్వతమగు ధర్మం, బాశాస్యము ద్రోచి పుచ్చ ♦ నగడుపడదె లో
కేశాన ; లోక మెల్లం, బాశాకృష్ట మగు పశువు ♦ పద్ధతి కగుచున్. ౨౩౮

క॥ లోకావననిపుణుఁడ వీ, వీకరణి విరక్తభావ ♦ మెనసి చరింపన్
శ్రీకామ్యము శ్లోకమువోఁ, బ్రాకట మిక్ష్వాకుకులము ♦ పససెడకున్నే. ౨౩౯

తే॥ రమ్ము నాతోడ సుసమృద్ధ♦రాజధాని,యాయయోధ్యకు మనకొలం♦బఖిలశుభము
లంద నభిషిక్తుఁడవు గమ్ము♦హర్ష మొసఁగుఁ,మందఱకు నబ్ధిమేఖల♦నరసి కొనుము.

క॥ మానుషుఁ డందురు కొందఱు, మానుషు రాజన్యు నది ప్ర ♦ మాణం బగునే
మానుగ నెప్పుడు ధర్మా, ర్థానూనము వృత్త మతని ♦ దై యుండంగన్. ౨౪౧

ఉ॥ కేకయు నింట నేనుఁ బరి ♦ కింపక యుండఁగ నీవు వన్యవృ
త్త్యాకలితుండవై విధిని ♦ యంత్రణ నెల్ల వనాధివాసముం
గైకొనిరా దివం బొలసెఁ ♦ గ్రమ్మఱి రా నని రాజు సన్మతుం
డాకృతి యాయజూకుఁ డతఁ ♦ డన్నిటి రోసి నివాసితార్తియై. ౨౪౨

క॥ నీ విల్లు వెడలినంతనె, దేవియు లక్ష్మణుఁడు నిన్నుఁ ♦ దేఁకువ వెలయన్
సేవింపరాఁగ నంతయు, భావించి మహాత్ముఁ డెనసెఁ ♦ బరలోకగతిన్. ౨౪౩

మ॥ పురుషవ్యాఘ్రము లెమ్ము శీఘ్రమె గురుం ♦ బుణ్యాత్మునిం గూర్చి త
త్పరలోకక్రియ లాచరింపు మవి సం ♦ ప్రాప్తంబులోఁ దోన పె
ల్లురుసంబందెడు నీకుఁ గూర్చు నతఁడే ♦ మర్చించినా మన్నై త్వ
ద్వరకల్యాణకటాక్షవీక్షణభృతి ♦ వ్యాసంగ మక్షింపుచున్. ౨౪౪

ఆ॥ వచ్చినార మిపుడు ♦ వరగుణా; సత్పుత్ర, దత్త మరయుచుంద్రు ♦ తల్లిదండ్రు
లదియు నక్షయంబ♦వై చెల్లుఁ బితృలోక,మున నటందు రెల్ల♦మునులు ఘనులు.

ఉ॥ నీవనవాసవుం జెరువు ♦ నిర్ణయ మెంచి కృశించుచున్ విషా
దావిలమానసుం డగుచు ♦ నర్థము లెల్లఁ ద్యజించి నీదెసన్
దీవెలువెట్టు బుద్ధి నటు ♦ ద్రిప్పఁగ నేరక యూర కార్తుఁడై
దేవుఁడు దేవభావమున ♦ దివ్యులు మెచ్చఁ గొనెన్ రఘూద్వహా. ౨౪౬

—♦ శ్రీరాముఁడు తండ్రి మృతింగూర్చి విలపించుట ♦—

చ॥ అను ననుజన్ము పల్కు కరు ♦ ణాస్పదమై పితృమృత్యుశంసియై
తనయెద వజ్ర మట్లైనయఁ ♦ దాఁక బడల్పడి నష్టచేతనుం
డననయి చేతు లెత్తి విక ♦ చాగ్రము నిర్హతమూల మైన కా
ననమున వృక్షముం బలె స ♦ నాథుఁడు రాముఁడు నేల వ్రాలినన్. ౨౪౭

తే॥ కూలఘాతపరిశ్రాంతి ♦ గూరఁ దెరలు, కుంజరం బట్టిఁడా శోక ♦ ఘూర్ణమాను
నతని నొగులుచుఁ జేరి ర♦య్యనుజు లార్త,సీత తోడుగ హిమవారి♦జిలికి రపుడు.

ఉ॥ తిన్నఁగ మేలుకాంచి తన ♦ తేఁకువ యిట్టట్లైన మట్టునన్
గన్నుల బాష్పపూరములు ♦ గ్రమ్మఁ గకుత్థ్సకులుండు దీనుఁడై
క్రన్నన పన్నెఁ బెక్కు లనఁ ♦ గా నగు భాషణము ల్సధర్మతా
భ్యున్నతుఁ డౌటఁ దండ్రి గతి ♦ నోటమి కొగ్గెడు చిత్తవృత్తితోన్. ౨౪౯

క॥ స్వర్గతుఁడు ఱేఁడుగాఁ బుర, నిర్గతుఁడై తన్నుఁ గొలువ ♦ నెఱసిన సుజనాం
తర్గతు భరతుఁ గని సం, సర్గాహితుఁ డనియె ధర్మ ♦ సంహితమతియై. ౨౫౦

క॥ ఎఱుకగలఁడు శర్మేతర, మఱిముఱి మాయింప భవము ♦ నందినవాఁ డ
క్కఱకు వని సేరఁ గని నా, డఱిమెడు కర్మగతి కడరు ♦ నా; ధర్మమతీ. ౨౫౧

తే॥ ధర్మపథరత భరత తా ♦ త్పర్య మరయు
మయ్య; యింకేమి గల దయో ♦ ధ్యాపురమునఁ
దాతపాదుండు దిష్టాంత ♦ దశకుఁ గాఁగ
దానిఁ బాలింప నగు వారు ♦ దలఁపఁ గలరె. ౨౫౨

క॥ నను లాలించు నెవం డిఁక, ననయముఁ బాలించు నెవ్వఁ ♦ డార్తులఁ బ్రజలం
దనప్రజల నెట్టు లట్టులె, యను వెడలెం గాక యొక్కఁ ♦ డర్థము గలదే. ౨౫౩
తే॥ ఏను దుర్జాతుఁడ జనించి ♦ యేమిసేసి, నాడ నాశోకమున నేగె ♦ నాకమునకు
నమ్మహాత్ముఁ డతనిఁ జేత♦నంటి చరమ,సంస్కృతియు యేని సమకూర్పఁ♦జాలనైతి.
క॥ తమ్ముఁడ నీవె కృతార్థ, త్వమ్మనయుంగంటి పిన్న ♦ తమ్ముఁడు జతగా
నిమ్మరయఁ గాంచి పితృకృ, త్యమ్ముల నెరవేర్చు నెటికిఁ ♦ దానక మగుటన్.
తే॥ విప్రప్రధాన యనేకాగ్ర♦నిర్ణరేంద్ర,యూయయోధ్య తెలిం గిఁకే♦మని స్మరింతుఁ
గాననావాసదీక్షావ♦సాన మెనయఁ,గా నయిన నటఁజేరఁగాఁ♦గాంక్ష సౌరదు.

ఉ॥ ఆనతి సెల్లఁగాఁ గొనిన ♦ యాశ్రమవాసము నిస్తరించియే
యానతవైరిఁ బూజ్యపదు ♦ నారయఁ గాంచెద నంచునున్న న
న్నానయ మొప్పఁ జేరఁ గని ♦ యానునవా రెవరింక మేలుకీం
ద్లా నెఱు లెన్నువా రెవ ర ♦ యం బపయాత మనంగఁ జెల్లదే. ౨౫౭

ఆ॥ నన్నుఁ బంపునాఁడు♦నాతండ్రి తివిచి సు, వృత్తుఁ డితఁడ యంచు♦వెరవు దోఁప
నేమి సాంత్వనంబు ♦ లెనయించె నెట్టెట్టు, లట్టి శ్రుతిసుఖంబు ♦ లరయఁ గలవె.
క॥ అని పూర్ణచంద్రనిభముఖి, జనకదుహిత సీతఁ దనదు ♦ సాధ్విం గని యి
ట్లనె భావిని నీశ్వశురుఁడు, పనివినెఁ బరలోకమునకుఁ ♦ బాప మరసితే. ౨౫౯
ఆ॥ తండ్రిఁ బాసి నొగిలు ♦ దశ తారసిల్లె సౌ, మిత్రి నీకుఁ బొసఁగు ♦ మేల్మి తలఁగె
భరతుఁ డిట్టికీడు ♦ వలికె నెట్టన నోట, ననఁగరాని కష్ట ♦ మని తలంచి. ౨౬౦
చ॥ అని పలవించు రాముఁ గని ♦ యందఱు తమ్ములు నట్టె యశ్రువుల్
గనుఁగవలం గడల్కొనఁగఁ ♦ గాటియ వెట్టు పరీతశోకవే
దనబడిఁబాటి క్రమ్మితి వి ♦ ధాతవు నీ విటులైన మాకు ది
క్కని యొకఁ డున్నె నేతకు జ ♦ లాంజలి యీఁ దటిగాదె నావుడున్. ౨౬౧

ఉ॥ ఆదట స్వర్గలోకగతుఁ ♦ డైన మహాత్ముని మామ నెంచి పూ
జ్యాదృత సీత బాష్పనివ ♦ హాదృతవీక్షణయై క్షణం బఱిన్
వేదన నొందుచుంటఁ గని ♦ విశ్వజనీనుఁడు రాముఁ డూఱటన్
బా దెనయించి లక్ష్మణునిఁ ♦ బార్శ్వగు దుఃఖితుఁ గాంచి యిట్లనున్. ౨౬౨

—♦ శ్రీరాముఁడు దండ్రికిఁ బైతృకక్రియ లాచరించుట ♦—

శా॥ లె మ్మోయీ గతకర్మ మెంచుచునె జా ♦ లిం బొంద నేమయ్యెడిన్
దెమ్మా యింగుదిపిష్టమున్ వసనమున్ ♦ దీర్ఘంబుఁ బ్రాపించి యా

సమ్మాన్యుండు సుఖింపఁ గూర్పవలయుఁ ♦ సత్కారము ల్పుత్రిభా
వ మ్మిమ్మాడ్కిన కాదె చెల్లనగు భ ♦ వ్యం బొందు సంభావ్య మే. ౨౬౩

ఉ॥ సీతఁ బురస్కరించుకొని ♦ చేరుము నీదు పిరుంద నేనుగా
నాతల మందఁ గాంతు మిదె ♦ యా నుచితస్థితి యిట్టి దారుణం
బౌ తఱి నంచుఁ బల్క నతఁ ♦ డట్లు గడంగు నెడ న్విపన్నతా
న్వీతులు వారిచొప్పరసి ♦ యొక్కటి చొక్కద నాక్రమింపఁగన్. ౨౬౪

చ॥ అనుగతుఁ డెప్డు వారికి మ ♦ హామతివేత్త మృదూక్తి దాంతిశాం
తినయసమేతుఁ డారఘుప ♦ తిన్ దృఢభక్తి వహించి కొల్చువాఁ
డనుయుతుఁడై తఱిం బలుక ♦ నౌనటు వల్కుచు గాంగతీర మ
మ్మనుకులుఁ జేర్పనా నెఱి సు ♦ మంత్రుఁడు గైకొనె శైలరాట్సుతా. ౨౬౫

సీ॥ తన సుతీర్థపుగతిఁ ♦ దార్కొని డిగ మీఁది, కెక్కింతు నను బిరు ♦ దెనయుదానిఁ
దనదు స్రోతోవేగ ♦ మున కొగ్గ భవపార, మునఁ గూర్తు నను వార్తఁ ♦ బెనఁచుదానిఁ
దనపుష్పితవనాళిఁ ♦ దనరారు నొడ్డొడ్డి, తాపత్రయముఁ దోలఁ ♦ దలఁచుదానిఁ
దనవిపంకామృత ♦ మ్మున మేల్కృతు ల్సాపి, యొడ్లపంకము లూడ్చ ♦ నొరయుదానిఁ
నమ్మహానది సీతతో ♦ ననుజుతోడ
నల్లనల్లనఁ జని కని ♦ యగడుపడుచు
నవతరించి రాముఁడు స్నాతుఁ ♦ డై యొసంగె
జలము లివె నీ కనుచుఁ దండ్రి ♦ సంస్మరించి. ౨౬౬

మ॥ జలపూర్ణాంజలిఁ గూర్చి యామ్యదిశకై ♦ సారించి సుశ్లోకుఁడా
కులుఁడై యిట్లనె రాజపంచముఖ ; య ♦ క్షోభ్యప్రభావా ; సుని
ర్మల మీతోయ మొసంగెదన్ బితృగతి ♦ న్స్నానించు నీ కక్షయం
బలఘుత్వాఢ్యముఁ గాఁగ నియ్యది ముదం ♦ బత్యంతముం దార్చుతన్. ౨౬౭

మ॥ అని యర్పించి తటాంతరం బెనసి భ్రా ♦ తృన్వీతుఁడై చేసెఁ దో
డనె యబ్బాదరమిశ్రమైంగుదము పి ♦ ష్టం బాదిగాఁ బిండము
ల్పొనరం గూర్చి కుశాస్తరంబున పయిం ♦ బూరించి శ్రాద్ధంబు రో
దన మక్కాలమున న్ఘటిల్ల ననియెం ♦ దత్ప్రాభవం బెంచుచున్. ౨౬౮

తే॥ ఓమహారాజ నీ కిది ♦ యొసఁగినార
మాదృతిం గొను మే మేత ♦ దశనులమ య
దన్నుఁ డగుఁ బురుషుండు త ♦ దర్చ్యమాను
లట్టులె తదన్ను లను నుడి ♦ యమరుఁ గాదె. ౨౬౯

క॥ అనుచు నివాపము లొసఁగి సు, మనస్కుఁ డవ్యాజభక్తి ♦ మానితయుక్తిన్
బొనరించెఁ బితృశ్రాద్ధం, బనుత్తమము విబుధలోక ♦ మానావనగన్. ౨౨౦

క॥ పరమపురుషుఁ డమ్మెయి భూ, వరునకుఁ బరలోకవిధులు ♦ పరఁగించిన న
వ్వరుసనె యాతని కొదవెను, చిరంతనస్వర్గలోక ♦ సిద్ధిసమృద్ధుల్. ౨౨౧

తే॥ అటు పితృక్రియ లొనరించి ♦ యచటు వాసి
రమ్యసానువు ధరణీధ ♦ రమ్ము వెరసి
పర్ణకుటి ద్వారమునఁ జేరి ♦ భరతలక్ష్మ
ణులఁ గవుంగిటఁ బొదివి య ♦ య్యలఘుఁ డడలె. ౨౨౨

క॥ సోదరులును వైదేహియు, భూదయితుఁడు రాముఁడునుఁ బ్ర ♦ భూతంబై ని
ర్హ్రాద మెసఁగ నత్తఱి నటు, రోదన మొనరించు నెరి ని ♦ రూఢంబైనన్. ౨౨౩

క॥ గుహలఁ బ్రతిశ్రుతి దోఁపఁగ, గుహాశయములైన హరుల ♦ ఘోషణల న్ని
ర్వహణ మొనరింపనై త, న్మహితుల యుచ్చైస్స్వనములు ♦ మలసెం దెసలన్.

—♦ భరతుని సైన్యమువారు రామునివాసమునకుఁ జేరం బోఉట ♦—

చ॥ భరతుని సేన నెక్కొనిన ♦ పట్టున వారల కట్టి యారవ
స్ఫురణము దోఁప రాముఁ గనెఁ ♦ బుణ్యుఁడు కైకసుతుండు నాథుఁడున్
నరవరువార్తఁ దా నరసి ♦ న్యాయ్యవిధు ల్పొనరించుచున్నవాఁ
డరయఁగ నింక నే మిచట ♦ నై దురపిల్లఁగ నేల యం చొగిన్. ౨౨౫

తే॥ ఆనివాసములను వీడి ♦ యంద ఱొకఁట, శ్రీనివాసునివయిఁ గూర్మి ♦ చేరి నడువ
నాధ్వనిస్థానమునఁ జిత్త♦మనువు పఱచి,పఱచిర య్యెడ సుకృతంబు♦బయలుపడఁగ.

ఉ॥ తమ్ముల నాదరించు గుణ ♦ తత్పరుఁ డారఘునందనుండు తా
నుమ్మలికంబుఁ గైకొనియె ♦ నోటు గురు న్నృపు నెంచి యెమ్మెయిన్
గ్రమ్మెనొ తత్సమాగమము ♦ కల్ప మనల్పము దృగ్యుగమ్మునై
నెమ్మది కిట్టిభేద మగు ♦ నే యిఁక నంచుఁ జలించి రందఱున్. ౨౨౭

క॥ త మ్మూఁగి చనిరి నప్పటి, కమ్మాడ్కిన నిలిచి రెనసి ♦ యైనఁ బరవశ
త్వ మ్మానఁబిలువఁ డనఘుం, డిమ్మాత్రకుఁ జేరఁబోఱ ♦ కెడయుదురె ప్రజల్.

క॥ చిరవిప్రోషితు నట్టు ల, చిరవిప్రోషితుఁడు రాజ ♦ సింహుఁడు రాముం
డురుతరగుణయోగంబునఁ, బరావరప్రజల కేక ♦ పరతం గూర్చెన్. ౨౨౯

ఉ॥ కొందఱు భద్రనాగములఁ ♦ గొందఱు మేలి తురంగమంబులన్
గొందఱు యానరాజములఁ ♦ గోరిక లీరిక లెత్త వారలం

గందు మటంచు నేగి రథి ♦ కారులు పోవులు సోపుమార్గ్యముల్
గొందలపాటు నొక్కగతిఁ ♦ గూడఁగనీయని చాయ కేడ్వగన్. ౨౮౦

క॥ సరభసులై కాల్నడతో, నరిగిరి కొంద ఱటు లుపహి ♦ తాధ్యులు వార
వ్వరగుణుల సమాగమమున, పరభాగం బరయు వేడ్క ♦ పరఁగుచు నుండన్.

క॥ ఆతురులై వా రటుచను, నాతఱి ఖురనేమిపదస ♦ మాహతి క్షితి ను
ద్భూత మగు రవము తుములం, బై తలకొనె దివమున స్థ ♦ నాహతిఁ బోలెన్.

మ॥ కరిబృందంబు కరేణుకాకలితమై ♦ గంధం బనంధప్రథా
కరమై దిక్కులఁ గ్రమ్మ నవ్వనమునం ♦ గాగ్గొన్న సంరావ మా
దరముం బాచి దరంబు నెక్కొలుపఁ ద ♦ ద్ధామంబు వీడ్కొలునన్
బరసీమాశ్రిత మయ్యె వన్యతతి సం ♦ బాధంబు కీడ్వోర్చునే. ౨౮౩

క॥ అత్రమున సకలమృగములు, విత్రస్తము లగుచుఁ బఱచె ♦ వివిధవిహగముల్.
గాత్రములు పొదల నఱచుచు, భూత్రాసం బొదవ నెగసి ♦ పోయెన్ దెసలన్.

ఆ॥ వ్యాఘ్రమహిషసర్ప ♦ వానరగోకర్ణ, గవయవృకవరాహ ♦ గణము లట్లు
సన్న వీడి క్రౌంచ ♦ చక్రచక్రాంగకా, రండవప్లవోత్క ♦ రంబు లెడలె. ౨౮౫

తే॥ ఆకసం బప్పు డప్పతు♦లాక్రమింప, మనుజు లఱుమంగఁ బుడమియు♦ననిచె రెండు
నొక్కఁడుగ మొక్కలం బగు♦నులివృతోడఁ, గలితనానావిధాకృతి♦గతులతోడ.

క॥ అంతటఁ జేరంజని కని, రంతికగతు రాము నుత్క ♦ టారణ్యాపరి
భ్రాంతు లయి చులసి సొలసి కృ, తాంతకృతానుగ్రహాన్వ♦యం బనువుపడన్.

—♦ భరతసైన్యంబుతోడఁ బౌరజానపదులు రాముని సందర్శించుట ♦—

సీ॥ స్థండిలమ్మునఁ దిక్క♦వార్గొన్న డెందమ్ము, నూత్తార్ప నోడ లిడ్డ♦యుక్తి దోఁప
వ్యసనోదయంబుల♦వలనులఁ జిక్కని, యనువు దెల్పెడు స్థైర్య♦మచ్చుపడఁగఁ
జెంగట వడగొన్న♦శృంగారకలతోడఁ, బోల్పనై భూజాత♦పొనయుచుండఁ
దమ్ములు తనుఁ జుట్టి♦తాత్పర్యమున వేడఁ, దఱి వేచుచున్న చం♦దమ్ము నెఱయఁ
గన్నులకుఁ గానసైన యా♦కల్పనార్త, మనుజమూర్తి నరుణబింబ♦మధ్యవర్తిఁ
గాంచి మంధరఁ గై కేయిఁ♦గలిపి పగులఁ, దిట్టుచుం బోయి రవ్వార♦దీనహృదయ.

క॥ కన్నుల నీ రొలుకఁగఁ దనుఁ, గన్న జనులఁ గాంచి నెమ్మిఁ ♦ గైకొనెఁ జిత్రమా
తృన్నతి నెఱయఁగ వెరవరి, కన్నా కఖిలజ్ఞుఁ డతఁడు ♦ కల్యాణనిధీ. ౨౮౯

ఉ॥ కొందఱఁ గ్రుచ్చి యెత్తికొనుఁ ♦ గొందఱు మ్రొక్క శుభోక్తులాడు వేఁ
గొందఱ మేలుగేం డ్లరయుఁ ♦ గొందఱ మచ్చిక లిచ్చగించు సం

క్రిందనవందితుం డతఁడు ♦ కమ్మని పల్కఁబడు క్సైలంగ న
ట్లుందఱ కుత్సవం బొసఁగె ♦ నాక్షణ మాక్షణదాప్తు వైఖరిన్. ౨౯౦

క॥ అందు వయస్యులె కొందఱు, బందుగులుం గొంద ఱట్లు ♦ పరిజలుం బరిజలే
సందానిం... ధృతి శిరిత, చందన మవ్వాఁడు నరుఁడె ♦ చర్చింపంగన్. ౨౯౧

ఉ॥ ఆతటి వ్యగ్రభావముల ♦ నాత్రిములం దలపోఁతలన్ స్తుతి
వ్రాతకథావిధానముల ♦ వారణలం దగుప్రేరణంబులన్
బాతొదవంగనై పరిబలి ♦ పైకొని యాకస మంటి దిక్కులన్
మ్రోఁత లెడల్చి కందరల ♦ మార్మ్రోఁగె నొక్కస్వనం బవార్యమై. ౨౯౨

—♦ వసిష్ఠమౌని రాజదారల శ్రీరాము సన్నిధికిఁ జేర్చుట ♦—

ఉ॥ అంతట నావశిష్ఠముని ♦ యానృపదారల నందఱన్ వ్యథా
క్రాంతలఁ గొంచు రాముఁ గనఁ ♦ గా మదిఁ గౌతుక ముల్లసిల్ల ధీ
మంతుఁడు చేరవచ్చె బుధ ♦ మానిత స్వర్ధుని తీర్థమంటి ని
ష్క్రాంతతఁ గన్న యాపదవిఁ ♦ గైకొని సత్పదవిక్రమంబునన్. ౨౯౩

క॥ మందగమనమున నరుగుచు, మందాకిని ప్రాంతఁ గనిరి ♦ మహిజాదయితా
ర్చం దనరెడు తత్తీర్థము, గొందలపాటునసి రంతఁ ♦ గోసలసుతయున్. ౨౯౪

ఉ॥ కన్నుల నీరు దొట్రిల మొ ♦ గం బరవాడిన తమ్మిపూవుగాఁ
దిన్నని వాక్కు తీ రెడలఁ ♦ దిక్కొనుచూడ్కి సుమిత్రిఁ దోడిరా
యన్నులమిన్నలం గని కృ ♦ శాంగి బడల్పడు చిత్తవృత్తితో
నున్నతిఁబాసి యున్నగతి ♦ నొంట మెలంగుచుఁ బల్కె నుల్కుచున్. ౨౯౫

తే॥ కంటిరే; యమ్మలార ; నా♦కాన్పు కష్టు, మడవిపా లొనరింపంగ♦నైన తెఱఁగు
మంచి కని పోయి యనదలై♦మలఁగినట్టి, వారు మెలగిన యది తీర్థ♦వాస మిదియు.

క॥ నిర్విషయీకృతు లట్టె సు, పర్వాధిపనిభులు సుపరి ♦ భాభాసితు లీ
దుర్వారవ...నంబు ల, ఖర్వగతిం గాంచి రిట్టి ♦ కాననసీమన్. ౨౯౬

ఆ॥ ఓసుమిత్ర నీవు ♦ హర్షోన్నతుఁ డగు పుత్రు, డొదిఁగి యిచటు సేరి ♦ యున్నవాఁడు
నది జలంబు దేర ♦ ననుచు నన్నెరి వాని, వ్రాతఫలము దలఁప ♦ వలసె నిపుడు.

క॥ నాపుత్రుకతన నింతటి, యాపదలు ఘటిల్లెఁ దనకుఁ ♦ నొఁ గా దన క
ష్టోపి నిలఁబడిన నిప్పటి, కేపాటనొ తెరువుబట్టి ♦ యొనసెదున కదే. ౨౯౭

తే॥ నీచకర్మ మొనర్చియు♦నెగడు గాంచుఁ, గాని యివ్వాఁడు నిందపా♦ల్గాడు సుమ్ము
పెద్దయన్న గురుం డని♦పృథుతదర్థ,మరయువాఁ డెందు సత్కృతు♦లంది మనఁడె.

క॥ ఎందులఁ బుట్టినయదియో, యిందఱికి ట్లందవలసె ♦ నేమనఁగల సం
క్రందను నట్టిడ యేనియుఁ, గ్రందునఁ బడకున్న తనదు ♦ కర్మవశమునన్. ౩౦౧

తే॥ తలఁగునేమొ యీశ్వరుదయ ♦ గలుగనేఁడు
నీసుతుఁ డకృచ్ఛ్రవిదుఁడువి ♦ భాసురుండు
తనయునిష్టనికృష్టాఘ ♦ దష్టకృతుల
వలని కష్టంబులను వైభ ♦ వంబు వెలయ. ౩౦౨

క॥ అని పల్కుచు నఘగతి పాల్కొన నుల్కుచుఁ దనయు బారిఁ♦గొనకొనసా వే
దన కల్కుచు దుర్విధి నె, ట్టన గూర్చిన చెట్ట యేర్ప ♦ డం జని యెమరన్.

తే॥ తండ్రికై రాఘవుఁడు ధరా♦తలమునందు, దక్షిణాగ్రదర్భోచితా♦స్తరణ లోదవ
నింగుదీపిష్టపిండంబు♦లెడలు మది నొ,సంగిన ప్రసంగ మలఁతిఁ బొ♦సంగుచుండ.

క॥ కనుఁగొని కోసలునందన, జనవిభు దేవేరి తోడి ♦ సతులం గనుచూ
డ్కని బాష్పము లాఁచికొనన్, ఘనార్తనాదంబు నెఱయఁ ♦ గా నిట్లనియెన్.

సీ॥ పొలుచు వంశమునకుఁ♦బ్రొద్దు మూలం బౌట,ఘనతేజ మెపుడుఁ దా♦ల్తాణ సేయ
నింద్రుని సరిగద్దె ♦ నెనయఁజాలి తదీయ, మత్తారివర్గంబు ♦ మద మడంచి
చతురంతమహి నేలు♦సన్నాహమునకు జేం, ద్లరికాఁపులై కొల్వ♦ననువు మెఱసి
సరిపోల రెవరు నీ ♦ జనపాలునకు భోగ, కలనల ననఁగఁ బ్ర ♦ ఖ్యాతి వడసి

చన్న విభున కియ్యడవిలో♦సన్న సెడఁగ,నింగుదపుఁ బిండి పిండంబు♦లిట్టులిడియెఁ
బేరు పెంపునుఁ గాంచిన♦పెద్దకొడుకు,కంటిరే సాధ్వులార నా♦కాన్పు దొసఁగు.

ఆ॥ ఏలినాడు జగతి ♦ కెల్లఁ దా నొకఁ డన, మలసినాడు సుతుల ♦ మాన్యతముల
మడఁగినాడు కడకు ♦ జడనుపాలై తన, కిట్టి భోజ్య మొదవు ♦ టెఱుకగనఁడు.

క॥ అన్నాదుఁడైన జనుఁడే, యన్నముఁ దినుచుండు నదియె ♦ యాఁ దత్పితృదే
వాన్నం బను శ్రుతియర్థము, గన్నులఁ గట్టినటు నాకుఁ ♦ గానఁగ నయ్యెన్. ౩౦౮

ఉ॥ ఇంతకు మిక్కుటం బయిన ♦ దెన్నఁగ బన్న మొకొండు గల్గునే
సంతతిఁ గాంచి యావలని ♦ సౌఖ్యము వారలు గూర్తు రంచు భా
వింతురు కర్మదోషమున ♦ వేడబమై చను కొన్నఁబోరు శ్రీ
మంతున కిట్టికీ డగుట ♦ మంతనమం దరయంగఁ బోలదే. ౩౦౯

క॥ నూకల కేడ్చి తవుటికిన్, శోకించిన తెఱఁగు దీనఁ ♦ జొప్పడెఁ గా కే
నాకష్టదశలపాలై, యీకర్మనివిష్టగతి కిఁ ♦ కేమనుదానన్. ౩౧౦

ఆ॥ మాన్యుఁ డైన పతికి♦మహి యేలఁజాలిన, కొడుకు నేఁటి కిట్టి♦కూఁడు వైవఁ
గనులఁ గాంచుచుంటిఁ♦గాని నాయెద యేల, పగులదొక్కొ యరసి♦పలుకఁజాల.

క॥ అని యార్తి నొగులు రాముని, జననీరత్నంబు దోడి ♦ సతు లుచితాశ్వా
సన మొనరించుచుఁ గొని చని, రనఘుఁ డతం డున్నస్థాన ♦ మందఁగ నగజా.

—♦ కౌసల్యాదులు శ్రీరాముని గనుంగొనుట ♦—

సీ॥ సర్గవైచిత్రిమై ♦ స్వర్గలోకము వీడి, ధరకు డిగ్గిన దైవ ♦ తం బనంగ
భోగసంత్యాగం బ♦పూర్వంబు గాకుంట, వివరింపఁ దొడరిన♦విష్ణుఁ డనఁగఁ
దనతోడిదగు వృత్తిఁ♦దవులు మాయకు మాయ, నడ్డునేసి తలంగు♦నజుఁ డనంగ
మునిభావనలఁ గొన్న♦మననంబు నిజరూప, మెఱిఁగింప వచ్చిన♦మెఱుక యనఁగ

నొంటిమెయి నిల్చి పలువురి ♦ కంటఁబడి వి
షాద మొక్కండు రూపించు ♦ సరణి దోఁపఁ
బ్రాప్తకామతాప్రఖ్యాతిఁ ♦ బరఁగుచున్న
వాని రామమహీజాని ♦ వారు గాంచి. ౩౦౩

శా॥ శోకం బాకృతులందు చందమయి సు ♦ శ్లోక ల్కృశత్వంబుతో
నాకంఠం బెలుఁ గార్చికొంచు బహులం ♦ బై యార్తి దృక్కోటికిం
బ్రాకం జాలిఁ గరంగు చిత్తములె మా ♦ ప్రాపంచు రూపించి పె
న్వ్రాక ల్వెట్టుచు నశ్రుధార లెడల ♦ న్వ్యాపన్నలై రెల్లరున్. ౩౦౪

ఆ॥ అట్టు లడలు తల్లు♦లందఱం గని రాముఁ, డడరు దోఁప సత్య♦మదె యనంగ
నెగచి యెగచి వ్రాలె♦నేనంచు నవ్వారి, యఘహారంబు లైన♦యంఘ్రులందు.

క॥ అత్తఱి మెత్తని వ్రేళుల, పొత్తు సుఖస్పర్శయుక్తిఁ ♦ బొనరింపఁగఁ జే
యెత్తి తుడిచినైచిరి వా, రొత్తున వెన్నంటి యున్న ♦ యుడుకురజమ్మున్. ౩౦౫

ఆ॥ కడిగి రట్లు బాష్ప♦కణముల గణముల, రాము మేను మేల్మి♦రామయముగ
నతని ధృతికిఁ గూర్ప♦నాయతలోచన, లాదరంబు తోద♦మపనయింప. ౩౦౬

క॥ ఆమెయి సౌమిత్రి మహితుఁ, డామాతలఁ గొలిచి వినతుఁ ♦ డర్థిం గూర్చెన్
రామున కనంతరుఁడ కా, నేమంబున తెఱఁగు దుఃఖ ♦ నిర్గతియు వెలయన్.

క॥ అందఱు రాముని యందే, చందమ్మున వత్సలత ప్ర ♦ సంగము వెరయన్
గ్రిందుకొని కూర్చి రాతని, యం దాచితి మెఱయ నెఱపి ♦ ర ట్లాదరమున్.

క॥ శుభలక్షణుఁ డీలక్ష్మణుఁ, డభ మెఱుఁగని వాఁ డటంచు ♦ నందఱు రామ
ప్రభుఁ గూర్చి పలుకుపలుకుల, విభక్తిమై మేలిపలుకు ♦ వెలయించి రమా.

క॥ చరణము లంటుచు సుకృతా, చరణాఢ్య మహీజ వ్యాధాను ♦ సరణమున నమ
స్కరణము లిడి సద్భక్తి, స్ఫురణం బొప్పార బ్రోలఁ ♦ బొక్కుచు నిలిచెన్.

చ॥ వనరుచు నున్నదాని వన ♦ వాసకృశాంగి విదేహరాజనం
దనఁ దనపుత్త్రిఁ బత్త్రి వలెఁ ♦ దద్దయుఁ గాఁకలఁ దాల్చి కన్నులన్
గొనకొను నశ్రువుల్ దుడిచి ♦ కొండల మించుచుఁ బల్కెఁ గోసలేం
ద్రుని సుత దీనయై పలుకు ♦ ద్రొట్రిల నోరటు వట్టిపోవఁగన్. ౩౨౨

క॥ జనకాత్మజాత దశరథ, జనపాలుని స్నుష నరేంద్ర ♦ సన్నుతుఁ డగు రా
ముని ధర్మపత్ని నిర్జన, వనమునఁ బహుపాట్లు గాన ♦ వచ్చెం గదరే. ౩౨౩

తే॥ అమ్మ నీమోము గ్రీష్మత ♦ ప్తాబ్జ మట్టు, లుష్ణభానుపరిక్లిష్ట ♦ ముత్పలమ్ము
వోలె ధూళిధూసరితమా♦పుత్త్రడి యన, నామరూపంబులకుఁ గాక♦నవయనయ్యె.

ఆ॥ తల్లి; యంబుదములు♦దాఁకఁగాన నడిచక్కఁ, జిక్కు చంద్రు గతికిఁ♦జేరనైన
దీనిఁ గాంచుచున్న ♦ దీన నా నయఁ గాల్పఁ, గడఁగె శోక మగ్ని ♦ కట్టె నట్లు.

క॥ వ్యసనారణిభవ మది మా, నస మేర్చెడుఁ గాని యుడక ♦ నశియించునె వె
క్కసపడినఁ దలఁగునే విధి, కసిమసఁగి పొనర్పఁ దొడఁగు ♦ కల్పన లెందున్.

ఆ॥ అనుచు దీన యగుచు ♦ నడలున వాపోవు, చున్న తన సవిత్రి ♦ నోజఁ గాంచి
పదములందు వ్రాలి♦భరతాగ్రజుఁడు మ్రొక్కి, వేఁడుకొనియె మేలి♦వెరవు నెఱయ.

క॥ తగుపలుకుల నాయమ హె, చ్చగ యింత దొలంచి మంచి ♦ వల నిది యని చ
క్కఁగ తత్త్వబోధకలనం, దగ వారం గూర్చి ప్రోడ ♦ తన మొప్పారన్. ౩౨౮

చ॥ ఘనుఁడు పురోహితుం డసల ♦ కల్పుఁడు సర్వసమృద్ధతేజుఁ డ
ట్లనఘుఁడు నా వసిష్ఠగురు ♦ నంఘ్రులకు న్నతు లాచరించి చి
ద్ఘనుఁడు సురేంద్రు లక్ష్మికి ని ♦ దానము రామనరేంద్రుఁ డమ్మహా
త్మునిఁ బెరయంగనై మెలువు ♦ తో నుపవేశము గూర్చె నర్తితోన్. ౩౨౯

శా॥ అంత న్మంత్రులు పౌరు లాప్తులు సుసై ♦ న్యాగ్రేసరు ల్మించు సా
మంతు ల్సద్ద్విజులు న్స్వధర్మనిరతు ♦ ల్మాన్యు ల్సహర్షోక్తి శ్రీ
మంతు న్వేఁడఁ దలిర్చు చిత్తములతో ♦ మర్యాద లొప్పార స్వ
ప్రాంతస్థానము లందఁగా భరతుఁడా ♦ పట్టెంది మేల్పట్టఁగన్. ౩౩౦

ఉ॥ సన్నిధిఁ జేరి తత్పదమె ♦ సన్నిధి యంచుఁ దలంచి సేవలం
బన్నుచు ధార్మికుం డతఁడు ♦ భద్రము గూర్చెడుఁ గాత మంచుఁ దా
నన్న నుతించుచు న్మలసె ♦ నయ్యనుజుం డుపవిష్టుఁడై ప్రజం
గన్నదొర న్మహేంద్రుఁ డనఁ ♦ గానయి ప్రాంజలియై ధరాత్మజా. ౩౩౧

తే॥ తపసివేసంబుతో నట్లు♦దారసిల్లి,తనదు కాలు పొంద మేకొన్న♦తమ్ముఁ గాంచు
నపుడు వెలుఁగొక్కఁ డుజ్జ్వలం♦బై తనర్చె,రామునం దనపాయిని♦రమయనంగ.

ఉ॥ ఏమెయిఁ బల్కునో భరతుఁ ♦ డేమని వేఁడునో యెట్టిసత్కృతుల్
దా మొనయించునో నతులుఁ ♦ దద్దయు నెట్లెటు గూర్చునో యటం
చామహితు ల్సభాప్రహితు ♦ లందఱుఁ జిత్తసముత్కటాధృతి
స్థేమత మోము లుల్లసిలు ♦ చెల్వునఁ గాంచిరి తత్పరత్వముల్. ౩౩౩

ఉ॥ రాముఁడు రాము తమ్ములును ♦ రాణఁ దనర్చెడు ధర్మవృత్తితో
శ్రీమహితాగ్నులై మెఱయఁ ♦ జిత్కళ లొప్పఁగఁ గూర్చువారలున్
నేమముల న్సదస్యు లయి ♦ నెక్కొని నిల్వఁగ నాసభాధ్వరం
బోమహిలాశిరోమణిరో; ♦ యోజమెయి న్నెగ డొందె నత్తఱిన్. ౩౩౪

క॥ ఆనందం బొప్పారెఁ జి, దానందమయుండు రాముఁ ♦ డటు మేకొన సం
జ్ఞానద్ధ మగుచు నిర్జరు, లానయవిధి వేచియుండి ♦ రాగాములరున్. ౩౩౫

క॥ అని శివుఁ డెఱిఁగించిన శివ, యనుమోదం బెసఁగఁ దెలుపు ♦ మవ్వలికథ యం
చు నవోల్లాసోదయమునఁ, దనరారుచుఁ దన్ను వేఁడఁ ♦ దాత్పర్యమునన్. ౩౩౬

—♦ ఆశ్వాసాంతపద్యములు ♦—

శా॥ ఇష్టానిష్టవిచారదూర స్వజనా ♦ భీష్టప్రదాతృప్రథా
శ్లిష్టా సృష్టజగత్త్రయీశ విభుతా ♦ శ్రీజుష్ట సర్వాంతరా
స్పష్టాస్పష్టకృతిప్రచార విపరి ♦ శ్రాంతా యనంతా సుఖా
విష్టా దృష్టఫలాత్మసంస్మరణ ని ♦ క్ష్వేలప్రభావోదయా. ౩౩౭

క॥ సనకసనందనముఖముని, మనోభినందన పరాత్మ ♦ మహితవికాసా
సనియంతృజగచ్ఛాసన, సునియతతేజోవిశేష ♦ సుగమవిలాసా. ౩౩౮

తోటక॥ సకలేశ్వరతాశ్రయ ♦ శ్రౌతపథ, ప్రకటోచ్ఛ్రయసన్మని ♦ భావమయా
వికృతిప్రకృతిప్రభ ♦ విష్ణుదయా, త్మకలాలనఖేలన ♦ తత్త్వనయా. ౩౩౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబునం దష్టమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## అయోధ్యాకాండము.

—————:O:—————

## నవమాశ్వాసము.

———o———





పాదుకావహనదీ
క్షాపారమ్యాంచితాత్మ ♦ జనరక్షాత
త్సాపాపనోదలక్ష్య
వ్యాపారకృపాకటాక్ష ♦ యఖిలాధ్యక్షా. ౧

తే॥ అవధరింపుము సతిఁ గాంచి ♦ యాదరించి, పలికె నిట్లని పార్వతీ ♦ పరివృఢుండు
వింటివా కమలేక్షణ♦విశ్వమూర్తి, రాముఁ డమ్మెయి కొలువున♦రాణఁ దనరి. ౨

—♦ శ్రీరాముఁడు భరతుని యాగమనముం గూర్చి ముచ్చటించుట ♦—

ఉ॥ తమ్మునిఁ జూచి లక్ష్మణుఁడు ♦ తత్పరతం దను సంశ్రయింప స
త్త్వమ్మున కిమ్ము వాని గురు ♦ వత్సలతం దలపోసికొంచు భా
వమ్ము దయార్ద్రమై తనర ♦ వ మ్మెడఁబాపఁగఁ సత్యమున్ హితా
ర్థమ్మును నైన పల్కుబడి ♦ తద్దయు ముద్దొనరింప నిట్లనున్. 3

సీ॥ అన్న; నీపలుకుచే ♦ నర్థం బరయనెంచి, యూహించి యడుగుచు ♦ నున్నవాఁడ
నిది యేమిరా; జడ ♦ లిమ్మెయిఁ జుట్టితి, చీరలుం గట్టితి ♦ చెలువు దలఁగ
నడవికి వచ్చి తే ♦ మయ్య; ప్రజాపాల, నంబు మార్గంబు తి ♦ రంబుపడదె
యడరు తోఁచెన తండ్రి ♦ యారాజ్యభారంబు, నీ కలంతియ కాదె ♦ నేర్చికొనిన

నేల శోకించె దిమ్మెయి ♦ నేల విడిచి, సాము పొనరింపఁ జెల్లునే ♦ సంభ్రమంబు
వలనుపడదు సుమీ క్షత్ర♦వంశజునకు, మదిఁ దలంపుము నావంక♦మలసి కనుము.

ఆ॥ వత్స; యున్నవార్త♦వారక యెఱిఁగింపు, మిది తెఱంగటంచు♦నెదకుఁ దోఁప
దోడ్తు దెలిపినారొ♦యూహించితో యింత, కింత సేయవలెనె♦యెఱుక మఱచి.

క॥ ఏ నెందఱిగిన నీదెస, నేనెఱి యేమఱని చూడ్కి ♦ నింతకు మెలఁగం
గా నౌదుఁ దలఁకె దేమిర, నీనాసందునను భేద ♦ నిర్ణయ మున్నే. ౬

క॥ సందియము దెలిపి నన్నదు, గం దలఁచిన దడిగి యవలి ♦ కర్జమ్ము తెఱం
గంది చనుము గురువాక్యము, పొం దెడలఁగనీని మెల్పు ♦ పొసఁగఁ గుమారా.

క॥ అనుచు మహాత్ముఁడు దశరథ, జనపాలుని వరసుతుండు ♦ సబలగ్రహ మొ
య్యనమెఱయ వృత్తవర్తన, మనుబంధము పొనరఁదెలుపు♦మని నొడువుటయున్.

—♦ భరతుఁడు రామునితో సంభాషించుట ♦—

ఉ॥ చేతులు మోడ్చి తన్మయతఁ ♦ జిత్తమున న్గదియించి సద్గుణ
శ్రీ తనువొందె నిట్లనఁగఁ ♦ జెల్వమెయిం దనరారి భూతసం
భూతనుతు న్సెలంగఁ బరి ♦ భూతతమం దెరు పేక కైక సం
పాత మెడల్చు నందనుఁడు ♦ పల్కెనుఁ బల్కమృతంబుఁ జిల్కఁగన్. ౯

సీ॥ అన్న; యేమందు ని♦న్నార్యుఁ గానకుఁ బంచి,పోయినా డయ్య వే♦ల్పులపురమున
కింత దుష్కరకర్మ ♦ మెఱిఁగియుఁ బొనరించి, పుత్రశోకావాప్తిఁ ♦ బొడ వడంగె
స్త్రీనియుక్తుడ కాక ♦ చేయునే యిట్టి యీ, కృత్యంబు కామికిఁ ♦ గీర్తి కలదె
తన యపదానంబు ♦ తద్దయు నశియించెఁ, బాపంబు పైకొనెఁ ♦ బ్రల్లదమున

నాపె నాతల్లి వైధవ్య ♦ మందఁ గాంచి
శోకకర్శితయై పూర్వ ♦ శుద్ధచరిత
మెడలఁ బడయంగఁ దొడరెడు ♦ నినతనూజుఁ
డడరి యిడు ఘోరనిరయము ♦ హార్ణవంబు. ౧౦

క॥ తనజతన సెడఁగ లోకులు, దను బ్రువ్వందిట్టఁ బతియు ♦ ధ్వంసం బెనయన్
నిను సర్వవంద్యు నిటు వని, కనిచెనకా కేమిసేసె ♦ ననద యదనునన్. ౧౧

క॥ నినుఁజేరి లక్ష్మణుఁడు కృతి, యనఁ బరఁగెను బిన్నతమ్ముఁ ♦ డనుయాత్రికుఁడై
ననుఁబోల నగడుపాల్గొనె, జననింద్యం డిహపరముల ♦ సంగతిఁ గనునే. ౧౨

ఆ॥ అట్టిదాని సుతుఁడ ♦ నందితి నపవాద, మింతవట్టు చాలు ♦ నిత్థచరిత;
చాలి దాసునెడఁ బ్ర♦సాదమ్ము వెలయించి, యేలుకొనుము పాప♦మెల్లఁ దొలఁచి.

మ॥ అభిషేకం బొనరించుకొమ్మిపుడె యి ♦ య్యక్షమ్ము గైకొమ్ము స్వ
ర్విభుఁ డెట్టట్టులె లోకుల న్మనుపు మీ ♦ విశ్వమ్ము నీసొమ్ము శో
కభయమ్ము ల్దలఁగించి పాలనగు కైం ♦ కర్యమ్ము నాకిమ్ము త్వ
త్ప్రభుతం జూపు మొకొండు భావ మెద సం ♦ భావింప కిప్పట్టునన్. ౧౪

ఆ॥ నన్ను మనుచు నింక ♦ నాయన్న యేతప్పు, లెన్న కనుచు నమ్మి ♦ యింతలేసి
వారిఁ గొనుచు మాతృ ♦ వర్గంబుతోఁ గొల్వ, వచ్చినాఁడ నిదియె ♦ వాంఛితంబు.

క॥ అన్నియు నెఱిఁగిన నీవెన, సన్నసెడన యెపుడు నిట్టి ♦ జడనున జనవల్
గన్నరయక యున్నను నీ, మన్ననకై వీరిఁ గొంచు ♦ మలసితి దేవా. ౧౬

క॥ వీరలె నీసత్ప్రకృతులు, వారలె పౌరజను లల్ల ♦ వారలె గురువుల్
నేరము లెన్నక ప్రోచెదు, భారము నీయదియ యార్త ♦ పాలననిపుణా. ౧౭

ఆ॥ అనుపూర్వి యుక్త ♦ మైనది నీయండె, యుక్తభావ మెనసి ♦ యున్న యదియు
నైన రాజ్య మేలు ♦ మధిధర్మపథ మంది, యాప్తు లాప్తకాము ♦ లగుచునుండ. ౧౮

క॥ అవిధవ యవుఁగావుత మి, య్యవని సమగ్రపతి వీవ ♦ యై తనరారన్
బ్రవిమలుఁ డగు చంద్రుఁడు తనుఁ, గవియఁగ శరదాగమమున ♦ క్షణద యనంగన్.

చ॥ సచివులతోడఁ ద్వచ్చరణ ♦ సన్నిధి నిట్లు శిరంబు మోపి నా
కుచితమ యంచు వేఁడుకొను ♦ చుంటినిఁ దమ్ముఁడ శిష్యుఁడన్ దయా
పరిచితుఁడ దాసుఁడన్ గొనుము ♦ ప్రాపనఁ జెల్లు ప్రసాద వైభవం
బచిరమ నాపయి న్గొలువు ♦ మందుము కీర్తిఁ బ్రపన్నవత్సలా. ౨౦

ఆ॥ నన్నుఁ జూచి యైన ♦ నాసామి యిందఱి, నెన్ని యైనఁ గూర్మి ♦ నేలికొనుము
మహిత పిత్ర్య ప్రకృతి ♦ మండలి యిద్దానిఁ, ద్రోవఁ దలఁచుటయును ♦ ద్రోవ గాదు.

ఆ॥ అనుచుఁ గైకసుకృత ♦ మాత్మజుండు మహాభు, జుండు కనులనీటి ♦ సోనతోన
యన్న పాదయుగళి ♦ కభిషేకవిధి గూర్చు, నెఱిని శిరసు మోపి ♦ నెఱయుటయును.

క॥ నిట్టూర్పు నిగుడఁ బదములఁ, బట్టిన పట్టెడలనీక ♦ పడి మదకరినా
నెట్టన మొఱవెట్టెడు తోఁ, బుట్టు నతఁడు తివిచి పొదివి ♦ పొదలుచుఁ బలికెన్.

క॥ మేలగు కొలమునఁ దేజున, మేలిమి గన్నట్టి ఘనుఁడ ♦ మితసత్త్వుఁడు స
చ్ఛీలుఁడు నీబోఁటిజనుఁడు, బాలుగతి దురాశఁ బాప ♦ పద్ధతిఁ గొనునే. ౨౪

సీ॥ అన్న ; నీదెస దోస ♦ మణుమాత్ర మేనియుఁ, గల్పించు నెరినైనఁ ♦ గానరాదు
కన్నతల్లినిఁ దిట్టఁ ♦ గాఁ దలపోయకు, మనఘ ; యెన్నకు మయ్య ♦ నాడికొనఁగ

నతనికి దారవు ♦ త్రాఁదులయం దెప్డుఁ, గామకారం బధి ♦ కార ముందు
నవ్వారు నవ్వాని ♦ యానతిమెయి నిచ్చ, చరియించునది సాధు ♦ సమ్మతంబు
తెలిసికొనుము నీవు ♦ తేటతెల్లంబుగా, న న్నరణ్యమునను ♦ నారగట్టి
నిలువు మనఁగ జగతి ♦ నెట్టన నెలకొల్ప, జాలువాఁడు తేఁడె ♦ సర్వగతుల.

ఉ॥ ధర్మభృదగ్రగణ్యుఁడవు ♦ తత్పరతం దలపోయు మట్టివాఁ
డర్మిలిఁ బ్రోచినా డొకట ♦ నందఱు బిడ్డల లోకసత్కృతుల్
ధర్మపథంబునం గొనియెఁ ♦ దద్వచనాదరగౌరవంబులన్
మర్మ మొకండె యవ్విధిని ♦ మాతయు నేతకుఁ దీసిపోవునే. ౨౮

ఆ॥ అట్టి తల్లిదండ్రు ♦ లనువెంచి ననుఁ గాన, నిలువుమని యనుజ్ఞ ♦ నెఱపినారు
నేను నటు ప్రతిజ్ఞ ♦ నియతిమై వాక్రుచ్చి, వచ్చినాడ నొండు ♦ వలను చనునె. ౨౯

క॥ ప్రతిన చఱచి దానికిఁ బ్రతి, హతిఁ గూర్చెనయేని వాని ♦ యఖిలసుకృతముల్
క్షతములగుఁ గీర్తిసెడు స, మ్మతి నెఱపరు పెద్ద లది య ♦ మాన్యం బగుటన్.

ఆ॥ నీ వయోధ్యయందు ♦ నిలిచి సత్కృతమగు, రాజ్య మేలవలయు ♦ రాణ వెలయ
వల్కలములు గట్టి ♦ వనమునం దే నుండ, వలయుఁ బదియు నాల్గు ♦ వత్సరములు.

క॥ అని సవిభాగముగ మహా, జనసన్నిధి నానసేసి ♦ చనె దివమున కా
జననాథుఁడు ధర్మాత్ముఁడు, మన కిరువుర కదియుచూ ప్ర ♦ మాణము తలఁపన్.

ఉ॥ లోకగురుం డతం డటు ల ♦ లోలతమై నిడినట్టి భాగమే
నీ కుపభోగ్య మయ్యెయిన ♦ నేను చరించెద దండకాటవిన్
నా కగుభాగ మియ్యదియ ♦ న్యాయము దప్పకు మింద్రతుల్యుఁ డా
ప్రాకటకీర్తి యన్న నుడి ♦ ప్రానుడిగాఁ బొనరించు నేర్పునన్. ౩౦

క॥ సకలేశ్వరభావంబును, వికలం బని యెంతు లోక ♦ విశ్రుతుఁ డతఁ డ
య్యకలంకచంద్రుఁ డనినటు, స్వకీయహిత మెంచి నడుతు ♦ సమ్మత మలరన్.

క॥ నీనామేలున కియ్యది, గానోపుం గాన దీనిఁ ♦ గడపెద నెట్లున్
మానద ; గురువాక్కరణం, బౌ ననుకొని నెఱపు మెల్ల ♦ యనువుపడంగన్. ౩౩

వ॥ అని రఘురాముఁ డందఱకు ♦ నర్థము దోఁప నుపన్యసింప న
య్యనుజుఁడు యుక్త ముక్తముగ ♦ నమ్మెయి ప ల్కాగెఁ బల్కుచుండ న
మ్మనుకులసింహము ల్ప్రజలు ♦ మాన్యులు నుమ్మలికంబుతోడివా
రన నయి యుండఁగా రజని ♦ యట్టె ప్రభాతవిభాతమై తగెన్. ౩౪

ఆ॥ దేవకార్య మొకటఁ ♦ దీర్పరానిది తన, కేవకార్య మట్టి ♦ గోడవ గలది
దారసిల్లె నెట్లు♦దరియింతు నెఱయింతు, ననుచు నినుఁడు దోఁచె♦వ్యగ్రుడగుచు.

మ॥ తనకన్నుం దన కుంటిసారథియు ని ♦ ద్రాసంగడం బొప్ప జ
య్యన దోలెన్ రథము న్మనోరథముతో ♦ నైక్యంబునం బూన్చి నె
ట్టన ద్రోవం జన రెట్టివారలును వే ♦ డ్కన్ల్మెఱఁ దార్కొందు రే
మన నొండొర్ల వివాద ముప్పతిల నౌ ♦ నౌ నంచు భావించుచున్. ౩౬

క॥ ద్విజరాజితోడిపై యూ, ద్విజరాజియుఁ దోడుతోడఁ ♦ ద్రిమ్మరె నిజమా
నజరామరత్వ మెన్నను, నజరామ రహిల్లఁ జేయు ♦ నాయాకృతులన్. ౩౭

క॥ అరవిద్దురకంటనె వా, రరరే వేఁబోక రాక ♦ యలవడె ననుచున్
సరగున మెలఁగిరి తమతమ, తరమున కగు పనుల వెంటఁ ♦ దత్సమయమునన్.

—♦ మఱునాఁటి సభలో భరతుండు రాముని బ్రార్థించుట ♦—

శా॥ ప్రాతఃకృత్యముల న్సురాపగదరిన్ ♦ భ్రాతల్సమర్థించి వి
ఖ్యాతు ల్గృహ్యహుతంబులు న్నెఱపి వే ♦ గంబే సమాసీనులై
రేతావత్సుహృదాళితోడ మహిజా ♦ ధీశుం బొరిం జుట్టి వి
జ్ఞాతాత్పర్యము తక్కఁ దక్కినది యొ ♦ క్కండేని లేకుండఁగన్. ౩౯

క॥ అత్తఱి భరతుండు తనదు, చిత్తము రామపదవృత్తిఁ ♦ జెన్నార సమా
సత్తి తనరార నిట్లనె, నొత్తి విభుని వేఁడికొనెడు ♦ నోజ పనుపడన్. ౪౦

ఆ॥ నాదు తల్లి సాంత్వ ♦ నం బొనరింపఁగాఁ, బడియెఁ దన కటంచుఁ ♦ బడసె రాజ్య
మది మదీయ మైన ♦ నగుఁగాక నీ కే స, మర్పణం బొనర్తు ♦ నందికొనుము.

క॥ నీ వనుభవింపు మియ్యది, శ్రీవెలయం జేర్చికొని వి ♦ శీర్ణం బౌజు
మ్మా వేఁటకఁ దూనఁ బ్రవా, హావిద్ధంబైన సేతు♦వట్టులుగాఁగన్. ౪౧

తే॥ అశ్వగతి ఖర మందునే ♦ యన్యపక్షి, తార్క్ష్య జవయుక్తి కోపునే ♦ తద్విధంబ
కాదె నీభరియింపనౌ ♦ క్ష్మాభరంబు, నేను పూనెద ననుమాట ♦ విక్లవముగ.

క॥ ఇది శుష్కం బార్ద్రిమఁ గా, కొదవె న్నిష్కంటకముగ ♦ నొలయము వలనౌ
నదనున నన్యులపాలై, పదను సెడఁగ నేల పాప ♦ పద్ధతి మేలౌ. ౪౪

ఆ॥ తన్ను మనిచి మేలి♦దశకుఁ దెచ్చిన వారి, నొలసి యెపుడు మనుట♦యొప్పుఁ గాని
యొడ్ల నెఱికి దోసి♦లొగ్గి యేమెడఁ గొను, బ్రదుకు బ్రదుకె కీర్తి♦పాడు వడదె.

సీ॥ మొలిపించె విత్తుంచి♦మొక నొక్కఁడు పొట్టి, నీరుపా లిడి పెంచె♦నేటుకొనఁగ
నందె ఘనస్కంధ ♦ మై మహాద్రుమసంజ్ఞ, నందరానిది వాని ♦ కయ్యెఁ బిదప

నిట్టట్టు పెర్లాడి ♦ యొక్కనేరకపోయెఁ, బుష్పితంబైన య ♦ ప్పొలుపుఁ గాంచి
కనఁబోఁడు కొనఁబోఁడు♦గద ఫలానుభవంబు, ప్రీతిమై కొనఁ గాఁడు♦పేదవాఁడు
తెలియు దియ్యుపమార్థంబు ♦ తేటపడఁగ, నట్లుగావున నాదు మొ ♦ ఱాలకించి
మమ్ముభృత్యులఁబ్రోవఁగా♦మహి భరింప,మాఱువలుకక చనుదేర♦మదిఁదలఁపుము.

క॥ కర్తవు నీ వఖిలమునకు, భర్తవు ఋషభుఁడవు మమ్ముఁ ♦ బాలింపంగా
నేస్తు వటుగాక తక్కిన, నార్తికిఁ బాల్పడమె నీదు ♦ యశ మెసఁపోదే. ౪౭

క॥ నిన్నుఁ బ్రతాపాదిత్యుఁగ, సన్నుతు నెన్నుదురుగాత ♦ జను లాగి శ్రేణు
ల్పన్ని కనులకఱ వెడల స, మ్మున్నతు రాజ్యస్థుఁ గని స ♦ ముత్సుకు లగుచున్.

తే॥ అందుదురుగాత మానంద♦మాప్తు లెల్ల, నంతిపురిజన మాఁగాత♦మరుస మెనయఁ
గూర్చుఁగాత ఘనార్భటు♦ల్కుంజరమ్ము, లఖిలనంద్య త్వదీయాను♦యానమునను.

క॥ నను మన్నింపవె యిందఱు, ఘను మే ల్గూర్పవె విశిష్ట ♦ కోవిదలక్ష్మిన్
దనరింపవె దాసుని త, ప్పును దండమ్మునఁ బొకార్చి ♦ పురుషోత్తంసా. ౫౦

ఆ॥ అనుచు రాముఁజేరి♦యనుయాచన మొనర్చ్చి,భరతు నుడులఁగూర్చి♦బాగు బాగ
టంచు నెల్లవార ♦ లను మోదితాత్ములై, పొగడి రతని ధరవి ♦ భుప్రసూత. ౫౧

—♦ రాముఁడు భరతుని నుడులకు సమాధానంబులు వలుకుచు నతని నూఱడించుట ♦—

క॥ అటు పలపించెడు తమ్ముని, బటిష్ఠుఁ గృతబుద్ధిఁ గీర్తి ♦ పరుఁ గని గుణాలం
పటుఁడు రఘురాముఁ డిట్లనె, నుటజనివాసు లధిధర్మ ♦ యోజన మెచ్చన్. ౫౨

ఆ॥ తనకుఁ గామకార ♦ దశ లేదు జీవాత్ముఁ, డస్వతంత్రుఁ డెందు ♦ నట్టునిట్టు
లాగుచుండు నెపుడు ♦ లావరి యావిధి, యతని ననుచు బుద్ధి ♦ నరయుమయ్య.

ఆ॥ నిచయములు క్షయాంత♦నిర్ణయములు పత,నాంతములు సముచ్ఛ్ర♦యములుప్రీతి
విహితయోగములును♦విప్రయోగాంతమ్ము, లా వధాంతములు స్వ♦జీవితములు.

క॥ ఫలములు పక్వము లైనన్, బలమటే పడుపాటె కాక ♦ పరఁగునె యొం డి
య్యిలఁ బుట్టుం గనువారికి, విలయం బని కాక వింత ♦ విధ మేర్పడునే. ౫౫

క॥ పతనభయము ఫలమున కటు, మృతిభయ మెపుడు న్నరునకు♦మేకొని యుండన్
జతన నెఱపఁగల రెవ్వా, రతథ్యమై చేఁతయెల్ల ♦ నాఱడి పోవన్. ౫౬

క॥ గట్టిగఁ గట్టిన గృహములుఁ, బట్టెడలి నశించుఁ గొంత ♦ వడి కెన్నైనన్
బుట్టుఁ గనువార లెల్లన్, గిట్టుదురు జరామయాప ♦ కృష్టుల రగుచున్. ౫౭

క॥ పోయిన రాత్రిరి రా దా, చాయం గొండొకఁడు దోఁచు ♦ సంద్రము సొరనా
నాయమునాదినదీజల, మేయనువుననేని మరల ♦ దిరవ్వుఁ బెరయఁగన్. ౫౮

ఆ॥ కడచుచున్నయవియ ♦ కావహోరాత్రముల్, గడుసుతనము మీఱఁ ♦ గాఁగడంగి
మెదిరి జీవితముల ♦ నేర్పడఁ గొనిచను, శుచిజలముల భాను ♦ రుచుల పోలె.

క॥ నినుఁ గూర్చి నీవు శోకం, బెనయకె యొక్లకయి యేడ్వ ♦ నేమగు నిలువం
జన నైనను దనయాయువు, చనుచుంటం గానసీని ♦ జడభావమునన్. ౬౦

ఆ॥ కూడి నడుచుచుండుఁ ♦ గూడియ కూర్చుండు, నెంత దూరదేశ ♦ మెనయనైనఁ
దోడ నేగి మరలఁ ♦ దోడ్కొని చనుదెంచు, మిత్తి యెపుడు నరుని ♦ హత్తి విడదు.

క॥ ఒడళుల వళు లొదవిన మేఁ, ల్నడ సన్నంబైన వెలిద ♦ నము వెంద్రుకలం
గడలుకొనిన జర పాలం, బడితి ననుచు విడఁడు నరుఁడు ♦ ప్రాభవ మెదలోన్.

తే॥ ఉత్సహించెద రాదిత్యుఁ ♦ డుదితుఁడైన, నస్తమితుఁడైన నంతస ♦ మొందుచుందు
రట్లు తమజీవితక్షయ ♦ మగుట గాన, రహహా నరు లెంతటి జడత్వ ♦ మందినారు.

క॥ అనుభూతం బగు ఋతు వె, న్నని వృత్తిన క్రొత్తఋతువు ♦ ననిచె ననుచుఁ జొ
క్కనయుదు రుత్సవములకు, న్మానయుదు రపహాతిఁ దలంచి ♦ నొవ్వ రొకొండ్లన్.

సీ॥ కాష్ఠంబు గాష్ఠంబు ♦ గలసి వర్తించు మ, హార్ణవంబున నొక్క ♦ యదనునందుఁ
దలఁగు కాలము రాగఁ ♦ దరలి యెక్కటిచను, నట్లు భార్యలు పుత్రు ♦ లన్యబాంధ
వులు ధనంబులు నొంట ♦ మలసియుండంగనౌ, నెన్నియు నొండొండ ♦ నెడయు నవియ
కావునఁ బ్రాణికిఁ ♦ గాదు యథాభావ, సామర్థ్యము క్షముండె ♦ చచ్చువాఁడు
నుండి యేడ్చెడువాఁడు నీ ♦ యుర్విలోన, దారి బడిపోవువానినిఁ ♦ దవిలి నడుచు
వాఁడు నీతోడవత్తున ♦ న్వరుస గాదె, పితృపితామహమార్గల ♦ బ్ధిక్రమంబు. ౬౫

క॥ ఆపన్ను నెదిరిఁ గాంచి న, మాపన్నుఁడ యగుచుఁ బనవ ♦ నౌనది గలదే
ప్రావుం దావుం దనకగు, నాపరమేశ్వరు భరింప ♦ నోఁగా కెదియున్. ౬౬

క॥ ఏటిప్రవాహం బట్టులె, దీటుగ మరలింపరాక ♦ దిటవు సెడెదు న
ప్పాటిదగు వయసు నెఱపెదు, నాటక మూహించి నరుఁడు ♦ నందితబుద్ధిన్. ౬౭

తే॥ శుభపదం బొనగూర్చెడు ♦ శుద్ధధర్మ
మరసి మెలఁగుచు స్వాత్మఁ బ ♦ రాత్మనందుఁ
జేర్చి సంతృప్తి మలసి సం ♦ సిద్ధుఁ డగుచు
నున్నవాఁడపో సుఖవృత్తి ♦ గొన్నవాఁడు. ౬౮

ఉ॥ జన్నము లన్నియు న్నడిపె ♦ శస్తము లుత్తమదక్షిణాసుసం
పన్నములై తగన్ సురల ♦ బన్నము లేఁగె ధరిత్రి యేలె న

ల్లెన్నియొ వేల యేండ్లు బుధు ♦ లెన్న సుకర్మము లాచరించె నేఁ
డున్నతిఁ గాంచె స్వర్గగతి ♦ యొప్పదె యప్పరమార్థశాలికిన్. ౧౯

తే॥ భృత్యపోషణ మర్థిసం ♦ ప్రీణనమ్మొ
నఖిలపరిపాలనమ్మును ♦ నధిపు సొమ్మొ
లతఁడు కలిదోషహారి నా ♦ నసముఁ గాంచె
స్తుతుఁడు దశరథుఁ బోలెడు ♦ దొరయుఁ గలఁడె ౨౦

క॥ సత్యముఁ దప్పి పలుకలే, కత్యయముం గాంచ నయ్యొ ♦ నౌరౌరా; యా
నిత్యవ్రతు మెచ్చుచు నొక, క్షిత్యధిపతి నట్టి లెక్కఁ ♦ జేర్పం గలమే. ౨౧

ఆ॥ ఇంద్రు గద్దె కెక్కె ♦ నిష్టభోగంబులఁ, బొందె నాయు వెనసెఁ ♦ బుష్కలముగ
సజ్జనముల వలని ♦ సత్కృతు ల్వడసె తేఁ, డింత లంత లనుచు ♦ నెన్నఁ దరమె.

క॥ మానుషదేహము జీర్ణం, బానేత పరిత్యజించి ♦ యతిమానుష మా
మే నొడిచికొని విధాతృ, స్థానము సేరంగనైన ♦ తలఁ పొదవంగన్. ౨౩

క॥ అజ్ఞుండపోలె నింతకుఁ, బ్రాజ్ఞుఁడు శోకింపఁ డెందుఁ ♦ బరికింపుము సం
ప్రజ్ఞానఘనుఁడ కాన స, మజ్ఞం గాంక్షించుచుండు ♦ మార్పడఁ డొంటన్. ౨౪

క॥ కావున నాతనికై నీ, వేవిధి వగవంగ వలవ ♦ దెంచితి ని న్నా
ధీవరు నంతటివానిఁగఁ, గావుము తన్మతము నెగడఁ ♦ గాఁ బ్రజల ధృతిన్. ౨౫

తే॥ స్వస్థచిత్తుఁడ వగు మెల్ల ♦ సంశయములు, వీడు మాఘను నన్యుల ♦ నాడికొనకు
మరుగు మప్పురి కాతని ♦ యానతి కృతిఁ, జెలఁగు మేను నవ్మొయిరీతి ♦ మెలఁగువాఁడ.

క॥ తనశాసన మని కా కే, వనవాసమున న్మెలంగ ♦ వచ్చితినే త
న్మన మనఘ మీవు ననఘుఁడ, వనుశాసించెదను ధర్మ ♦ వశ్యై యుంటన్. ౨౭

ఆ॥ మనకుఁ దండ్రి యతఁడు ♦ మాన్యుం డసామాన్యుఁ, డట్టు లౌట నింత ♦ లర్థి వేఁడ
నైన తేని యానఁ ♦ బూనిక మైకొంటి, నీవు నటులె ధర్మ ♦ నిష్ఠఁ గొనుము.

క॥ గురుచిత్తవర్తనంబున, నరలోకం బేలుకొనుము ♦ న్యాయవిధిం ద
త్పరుఁడ వగుచు నద్దానం, బరలోకము లెల్ల గెలుచు ♦ ప్రాభవ మొదవున్. ౨౯

క॥ అనృశంసుండవు ధర్మం, బనువర్తింతువు స్వభావ ♦ మతికోమల మీ
వనుభావింపుము శుభభా, వన నియతిం దండ్రిపలుక ♦ వార్యం బనుచున్. ౩౦

—♦ భరతుఁడు రాముని మఱియు వేఁడుకొనుట ♦—

క॥ అని రాముఁడు విరమింపఁగ, నని వాగ్వైచిత్రి వెలయ ♦ నతిధార్మికుఁ డ
య్యనువున భరతుఁడు ధర్మం, బనితర మని సభ్యు లెలమి ♦ నామోదింపన్.

సీ॥ ఆరయ ని న్నోపలంగ ♦ నా నాథఁ డున్నాఁడె, యీచరాచరమునం ♦ దెవ్వఁడైనఁ
దొడరి పీడింపదే ♦ దుఃఖమేనియుఁ బ్రీతి, సంప్రహృష్టునిఁ జేయఁ ♦ ... దేవుడు
వృద్ధసమ్మతుఁడ వీ ♦ వద్ధార్మికుల సంది, యములఁ దీర్తువు వారి ♦ నసుగ నేర్తు
వట్టి స త్త్వమ్ము నీ ♦ యది చావుఁబ్రదుకులు, గలిమిలేములు సరి ♦ గాఁ దలంతు
వపరితప్తుం డనంగఁ బ♦రావరజ్ఞుఁ, డనఁగ మనుకల్పుఁ డనఁగ మ♦హాత్ముఁ డనగ
సర్వసాక్షి సర్వజ్ఞుండు♦సత్యసంధుఁ, డును ననఁగ నీవ యాదు వో♦యినకులేంద్ర.

క॥ ప్రభవాభవకోవిదుఁడవు, ప్రభుఁడవు నీ వన్నిటికినిఁ ♦ బ్రథితగుణుఁడ వ
ట్లభయుఁడవు నినుఁ జెనయలే, వభము లరిందమ మదీయ ♦ మఘము గడపవే.

ఆ॥ ప్రోషితుండ నైతిఁ♦బున్నె మన్నె మెఱుంగ, నన్నుఁ గూర్చి తల్లి♦నాయ మెడలి
క్షుద్రబుద్ధి నిట్టి♦సాద గూర్చియిడె నియ్యా, నిష్ట మీవ తగుదు♦వెడలఁ జేయు. ౮౪

క॥ అన్న ; ప్రసన్నుఁడ వగుమీ, బన్నముఁ బాపుము స్వధర్మ ♦ బద్ధుఁడనై న
న్నన్నది యని దండార్హ, న్మన్నించితి దాన నేమి ♦ మలయునొ తెలియన్. ౮౫

ఆ॥ శుద్ధవంశజుండు ♦ సూనృతుండౌ దశ, రథుని వలనఁ బొడమి ♦ రాజధర్మ
మెల్ల నీవు దెలుప ♦ నెఱిఁగి యెట్లొనరింతు, నింద్యకర్మ మేను ♦ నిర్మలాత్మ. ౮౬

క॥ నిగదిత మయ్యెన కాదే, విగీత మగు కార్యమునఁ బ్ర♦విష్టుఁడఁ గా కే
నిగమన మొనరించితి నా, యగుణాల మంథరనుఁ గైక ♦ నడఁగించు కృతిన్.

ఆ॥ గురుఁడు కర్మఠుం డ♦కుచ్ఛితుం డతివృద్ధుఁ, డఖిలమండలేంద్రుఁ♦డనఁగఁ దనరెఁ
బోయినాడు దేవ♦పురికి దైవత మట్టి, తండ్రి నెట్లు తిట్టఁ ♦ దలఁచువాఁడ. ౮౮

మ॥ ఎవఁ డి ట్లర్థము ధర్మముం జెఱుపనై ♦ హేయంబయి కిల్బిష
ప్రవణంబై తలకొన్న కర్మమును సం ♦ భావించి స్త్రీచిత్తమున్
నవరింపం బొనరించుఁ గృత్యవిదుఁడే ♦ సభ్యావుఁడే యైన నే
మవుఁ బ్రాజ్ఞు ల్మను మంచివాఁ డని యకా ♦ ర్యంబుం బ్రశంసింతురే. ౮౯

ఆ॥ అంతకాల మొదవ♦నఖిలభూతంబులు, మొనయు మోహమగ్న♦ములుగ ననుచు
ననియె శ్రుతియు నిప్పు♦డయ్యెఁ బ్రత్యక్ష మి, ట్లాఘనుం డొనర్చు♦టరసి చూడ.

క॥ చింతింపక మోహముననొ, పంతముననొ క్రోధముననొ ♦ పతి యిట్టి యతి
క్రాంత మొనరించి చనె సా, మంతుఁడ వీవ సుమి దాని ♦ మరలింపంగన్. ౯౦

ఆ॥ తండ్రి త ప్పతింగి ♦ తా సవరించిన, కొడుకె కొడుకు గాని ♦ కూళ లెంద
ఱున్న నేమి గలుగు ♦ యుక్తుండ వీవట్లు,గాన దానిఁ దలఁగి ♦ కావు మతని. ౯౧

క॥ అంగీకరింపకుము దు, స్సంగజ మన నౌ నసత్ప్ర ♦ సంగము విభు నా
జ్ఞం గొంటి ననకు మతిదు, ష్టాంగం బది ధీరగర్హ్య ♦ మై యుండంగన్. ౯౩

ఆ॥ నన్నుఁ దండ్రిఁ గైక ♦ ననుచు బాంధవసుహృ, త్పౌరజానపదులఁ ♦ బాపవార్ధి
వ్రాలనీక మనుచు ♦ భారమ్ము నీయదె, ధర్మ మెంచు మయ్య ♦ దైవరాయ.

క॥ ఎక్కడ వనాధివాసం, బెక్కడ క్షాత్రంబు జడల ♦ వెక్కడ ప్రజలం
దక్కఁ గొని యేలు టెక్కడ, నెక్కొనియెడె యిట్టిపనికి ♦ నీవు మహాత్మా. ౯౪

క॥ రాజ్యాభిషేక మొక్కఁడె, పూజ్యుండగు క్షత్రియునకుఁ ♦ బోలిన ధర్మం
బీజ్యాతలమున ప్రజల సు, రేజ్యమతీ ; చక్కఁ బ్రోచు ♦ టెఱుఁగునయేనిన్.

క॥ ప్రత్యక్ష మైన ధర్మం, బత్యయరహితము త్యజించి ♦ యాయతిగత మ
ప్రత్యయయుత మగు కర్మం, బత్యూర్జితుఁ డధిపు తనయుఁ ♦ డాదృతిఁ గొనునే.

తే॥ క్లేశజన్యంబు ధర్మంబె ♦ కేవలముగ, నాచరింపంగ వేడ్క నీ ♦ కయ్యెనేని
నాల్గుకొలముల వారిని ♦ ననుచు కూర్మిఁ, గష్టపడి పాలన మొనర్చి ♦ కాంచు మదియు.

క॥ చతురాశ్రమములలో ధీ, చతురా ; గార్హస్థ్యమునకు ♦ సరిరా దొకఁడున్
మతి మంతన మొనరింపుము, మతిమంతులు దెలుప రెన్ని ♦ మార్లిటు లనుచున్.

క॥ ధర్మజ్ఞుఁడ వీ వెఱుఁగని, ధర్మ మొకం డున్నె యిట్టి ♦ తఱి వనవాసం
బర్మిలి గొనుట యధర్మపు, మర్మము కా కిదియు ధర్మ ♦ మార్గం బగునే. ౧౦౦

క॥ శ్రితజన్మస్థానంబుల, శ్రితవత్తమ బాల్యయుతుఁడ ♦ క్షోణీతల మే
గతిఁ బాలింపఁగఁ జాలుదు, నతిక్షముఁడ వీవు గలుగ ♦ నది నాకేలా. ౧౦౧

తే॥ చాలఁ జాలఁ జుమీ నేను ♦ బాలిశుఁడను, బుద్ధిగుణము లంతంతలు ♦ పొలుపు లేదు
నిను వినా నేసి యే నొంటి ♦ నిర్వహింప, నేర్తునే నీదు పను లౌన ♦ గూర్తుఁగాక.

సీ॥ అనుశాసన మొనర్తు ♦ నని ప్రసాదింపుము, వితతరాష్ట్రప్రజా ♦ హితముఁ గోరి
యభిషేక మందు మి ♦ ట్లందఱిచ్చోటనే, యున్నారు తఱివేచు ♦ సన్న లౌలయ
రాజచిహ్నంబుల ♦ రాణమైఁ గైకొమ్ము, రమ పొత్తునకుఁ దీవ ♦ ర మ్మెనయుము
విఘ్నము ల్గలఁగ ము ♦ న్విబుధులతోఁ నింద్రు, నట్లు మాతోఁ బురి ♦ కరుగు దెమ్ము
మూఁడు ఋణములు దీర్పుము ♦ ముక్తుఁడులగు, శత్రువులఁ దోలు మాప్తులు ♦ సంతసిల్లు
నట్లుఁ జేయుము నా మ్రొక్కు ♦ లవధరింపు, మర్థివిన్నప ముం గర ♦ మర్థిఁ గొనుము.

క॥ అందఱుఁ బ్రహర్ష మీాకృతి, నందుదు రగువారు కాని ♦ యవ్వా రెల్లన్
మందులయి పోదు రీక్షణ, మందే మందునకు నైన ♦ నగపడకుండన్. ౧౦౪

క॥ పలువురి నోళ్ళం బడి యిటు, పలవించెదు నన్నుఁ దల్లిఁ ♦ బాలింపుము ని
ర్మలుఁ జేయు మధిపు నమ్మెయిఁ, బ్రలాపకిల్బిషమువలనఁ ♦ బాపి నరేంద్రా.

తే॥ కాళ్ళఁ బడి వేఁడుకొనుచుంటిఁ ♦ గా దనకుము
కరుణ నాపయి నెఱపుము ♦ కలుగు సకల
బాంధవులలోన నివ్విధిఁ ♦ బ్రథితిఁ గనుము
భూతములలో మహేశ్వరు ♦ భూతి వెలయ. ౧౦౮

క॥ ఏ నిట్లు వేఁడఁ గాదని, కాననమున కేగెదేనిఁ ♦ గాని మ్మటనీ
తో నరుగుదెంచువాఁడన, కాని పురికిఁ బోవువాఁడ ♦ గా నఘహరణా. ౧౦౭

క॥ అని సంతప్తుం డగుచుఁ, దను రమ్మను ననుజు నుడికిఁ ♦ దాఁ బొల్పడఁ డ
య్యినకులతిలకుఁడు తండ్రి ప్ర, తిన నెట్టన ద్రోవరాని ♦ తీ ర్పొనరింపన్. ౧౧౦

తే॥ అందఱా స్థైర్యముం గాంచి♦హర్ష మంది, రందరాని ఫలం బని♦యార్తిఁ గుంది
రందుకొని రాము యాచింప♦ననువుపడిరి,ముందె పొగడిరి భరతుని♦ముచ్చటలను.

—♦ శ్రీరాముఁడు భరతునుడుల కప్రాకృతంబులైన సదుత్తరంబు లిడుట ♦—

క॥ బంధువుల నడుమ లోకధు, రంధరుఁ డటు లుండి సత్పు ♦ రస్కృతు లెసఁగన్
బంధము వాపఁ దలఁచి జను, షాంధులకును దివ్యదృష్టి ♦ యగు నటు లనియెన్.

క॥ ఆకైకయందు దశరథ, లోకేశ్వరువలనఁ బొడమి ♦ లోలుఁడ వని కా
కీకరణి నన్ను వేఁడితి, లోకులు మెచ్చంగ యుక్తి ♦ లోపము గలదే. ౧౧౧

ఆ॥ అనుపపన్న మనుచు ♦ ననఁబోల దొకఁడేనిఁ, దమ్ముఁడా!ప్రశస్తిఁ ♦ దనరి తిటులు
నెలవుకొనియె రాజ ♦ నీతి నీయెడఁభ్రాతృ, వత్సలతయుఁ దోడ ♦ వలను సూప.

ఆ॥ మున్ను మనజనకుఁడు♦ముచ్చటమెయి నీదు, జననిఁ బెండ్లియాడు♦సమయమునఁ బ్ర
సక్తితోఁ బ్రతిజ్ఞ♦చఱచె మాతామహుం, డడుగ రాజ్యశుల్క♦మరసి యొరసి.

క॥ అయ్యాది యనుత్తమం బన, నయ్యెన కా కందు దోస ♦ మారయఁ గలదే
నెయ్య మనికాక సంతతి, డయ్యుక యుండంగఁ జేయు ♦ టయు వెర వగుటన్.

క॥ దైవాసురసంగ్రామము, దైవాఱ నుదార నీదు ♦ తల్లి పొనర్చెన్
భూవిభునకు సాయ మతం, డావేళం దార్చె నొక్కఁ ♦ డటు వర మర్థిన్. ౧౧౫

ఆ॥ ఆమె యాయశస్వి ♦ నీమణి యావర, వర్ణినీవతంస ♦ వర్ణనీయ
నీసవిత్రి యడిగి ♦ నేర్పుమైఁ గొనె నట్టి, వరము లధిపు సత్య ♦ వంతుఁ జేయ.

క॥ చిరకాలము సంతతి లే, కరుసము సెడ వరము లొకట ♦ నడఁగియ యుండెన్
బరఁగె నిటు జ్యేష్ఠతయు మ, త్పర యగుటం ద్వాపరమ్ము ♦ ప్రభుచిత్తమునన్.

ఆ॥ ధర్మసంకటమునఁ ♦ దవిలి ప్రజావలి, దొరసి వేఁడ నతివి ♦ ధూతుఁ డగుచు
నీపరోక్షముననె ♦ నేత న ద్ధారఁ జేయ, నెంచినాడు తుది మ ♦ లంచినాడు.

క॥ తగఁ దల్లికిఁ దండ్రికి న, య్యగణిత మర్థంబు నెఱపు ♦ టారయ న్యాయ్యం
బగుఁగాన వారి నన,గా, నెగడునె ధర్మంబు నిష్ఠ ♦ నేర్చి తలఁగెదే. ౧౧౯

క॥ అంతటి వరదానిక మా, క్రాంతం బగు చెటఁగియుంటఁ ♦ గాదె కులగురుం
డింతకుఁ నుపేక్ష సేయుట, చింతామణి యనఁగఁ దాఁ బ్ర ♦ సిద్ధి నెనయఁడే.

తే॥ వత్స రాజ్యంబు నీకుఁ బ్ర ♦ వ్రాజనంబు,
నాకుఁ బోలంగ విభజించి ♦ నాథుఁ డొసఁగె
వరము లవి సెల్లవలెఁ గాన ♦ వలయు మనకుఁ
దదవధిగఁ దత్ప్రకార మ ♦ ర్థము నెఱపుట. ౧౨౧

క॥ మనము నియుక్తుల మమ్మోయి, జనవిభు నానతిఁ బ్రసక్తి ♦ జఱపి కడఁగి నె
ట్టన మొనసి విచారింతము, ఘనమగు కాలంబు నడుపఁ ♦ గా నగు రీతిన్. ౧౨౨

క॥ ఏ నిర్జనవనమున కిపు, డీ నెఱి నరుదెంచినాడ ♦ నింతి సుమిత్రా
సూనుఁడుఁ దోఁ దేరఁగ విభు, నానయమున సత్యసంధుఁ ♦ డనిపింపంగన్.

క॥ కానఁ జతుర్దశవర్షము, లీ నెఱి నెడఁబాయ కుందు ♦ నే వనమందున్
జానగు ధర్మము నెఱపుచుఁ, బూనిక గురు నప్రతిష్ఠఁ ♦ బోకార్చుటకున్. ౧౨౪

ఉ॥ నీవునుఁ దండ్రి సత్యపరు ♦ నిం బొనరింపఁ గడంగి నెమ్మదిన్
దేవకుఁ గొల్పి వైళ మభి ♦ షిక్తుఁడవై ప్రజలం బ్రసక్తిమైఁ
గావుము నావచఃకలనఁ ♦ గైకొను మాఱడిఁ ద్రోచిపుచ్చు మి
క్లొవల నొప్ప నెంచి ఘను ♦ లందఱు మెత్తురు నిన్ను సన్మతీ. ౧౨౫

ఆ॥ తండ్రి ఋణము దీర్పఁ♦దలఁపు మోయీ; కన్న, తల్లి నలరఁ జేసి♦యుల్లసిలుము
మునుపు పితరు లడుగ♦మొనసి శ్రుత్యర్థమ్ము, గయుఁడు విప్పి చెప్పెఁ♦గాదె తెలియ.

క॥ పున్నామనరకమునఁ బడ, నున్న జనకు త్రాణనమున ♦ కొదవెడు గానన్
సన్నుతుఁడు పుత్త్రుఁడయ్యెనుఁ, బన్నుగ నటు పితృగణమ్ము♦భయముఁ దొలఁచుటన్.

మ॥ గుణవంతు ల్బ్రతవంతులౌ తనయులన్ ♦ గోరంగనౌఁ బెక్కురన్
గణయుక్తి న్సమవేతులై తనర నౌ ♦ క్కండేనియున్ వారిలో
క్షణ మొప్పార గయాప్రయాగగతుఁడై ♦ కావించునో శ్రాద్ధముల్
గుణినిన్ బుత్రికఁ గన్నె దాన మిడునో ♦ కొక్క వేలుపు ల్మెచ్చఁగన్. ౧౨౬

తే॥ అశ్వమేధాధ్వర మొనర్ప♦నగునొ భ క్తి, ననుచు నీలవృషోత్సర్జ♦నంబు సేయఁ గడఁగునో యాత్మజుం డనఁ♦గా నతండె, కానివా రెందుఁ దమ కట్లు♦గానివారె.

క॥ పుత్రుఁ డిడు లోకవిజయముఁ, బౌత్రుం డొడఁగూర్చు స్వర్గ ♦ పదవిఁ బ్రపౌత్రుం డాత్ర ముడిపి శాశ్వతవై, థ్యాత్రాస్పద మంద జేయుఁ ♦ దన పెతరులకున్. ౧౩౦

తే॥ జీవితుండుగాఁగ శుశ్రూష ♦ సేయుచు నను
పలుకు చెల్లించు ఘనుఁడుప్ర ♦ వ_త్తిభూరి
భ క్తిఁ బ్రత్యబ్దమునఁ గూర్చు ♦ పుణ్యుఁడు గయ
కరిగి పిండం బిడెడు వాఁడు ♦ నొఁ దనయుఁడు. ౧౩౧

క॥ అన వా రరుసం బెనసిరి, ఘనులగు రాజర్షు లిట్లె ♦ కాదె ప్రథితులై తనరారిరి తనరారుము, తనతండ్రి న్నరకవార్ధి ♦ దాఁటించుకృతిన్. ౧౩౨

క॥ వేవేగం బభిషిక్తుఁడ, వై వెరవునఁ బ్రజలఁ బ్రోవు ♦ మందఱు ప్రణిధుల్ నీవారై కృతులం బెడఁ, బోవక మెలఁగుదురు ఘనులు ♦ పుణ్యులు వారల్.

సీ॥ నీ వయోధ్యకుఁ బొమ్ము ♦ నిష్ఠమై నేనును, దండకారణ్యంబు ♦ దఱియువాఁడ నీకుఁ దోడై యుండు♦నియతి శత్రుఘ్నుండు, లక్ష్మణుం డగు నాకు♦లావుగూర్ప నరుల కెల్లనుఁ గమ్ము ♦ నాథుండ నీ వేను, వనచరౌఘంబుల ♦ వలని కొదు సిరిపొత్తు నీమదిఁ ♦ జేర్చు వేడ్క ఘటించు, హర్ష మమ్మెయిఁ దన ♦ కవనిజాత నీదు శిరమునఁ జల్లని♦నీడఁ గూర్చు, ఛత్రమటుగోన మ్రాఁకులు♦చాయలొసఁగు నెపుడు నిండఱ కిచ్చోట♦నీవిభ క్తిఁ, దెఱఁగు గాంతుము తండ్రి ప్ర♦తిజ్ఞ నెఱపి.

క॥ సంతోషం బెనయు మిఁకే, చింతం జొరనీకు మెడదఁ ♦ జిత్సుఖభూమా క్రాంతమచూ పరతత్త్వము, వంతయపో నరక మనఁగ ♦ వరగుణసదనా. ౧౩౪

—♦ జాబాలి రామునిఁ బుకికి దమ్మనుట ♦—

క॥ అని తమ్ము నూఱడించెడు, ననితరుగుణు రాముఁ గూర్చి ♦ యనుచితముగ ని ట్లనె జాబాలి యనెడు నొక, ఘనుఁ డాతనిఁ బురికిఁ జేర్పఁ♦గా నగు బుద్ధిన్.

తే॥ బాగు బాగు రఘూత్తమ; ♦ ప్రౌఢవృత్తి, యైన నీదగుబుద్ధిని ♦ రక్ష యయ్యె ననిచి తార్యుండితండు మ♦నస్వి యనఁగఁ, బ్రాకృతుఁడ పోలెనీవిట్లు♦వలుకఁగలదె.

క॥ ఒకని కొకఁడు బందుగుఁడే, యొకఁ డెనయునె మేలిగతి మ♦జొక్కని కతనన్ బ్రకృతిమెయిఁ దోఁచు జంతువు, వికలత్వము గాంచుచుండు ♦ వెరవు సెడంగన్.

క॥ కావునఁ దలిదండ్రు లటం, చావలనున సక్తుఁడైన ♦ యతఁ డున్మత్తుం డేవాఁ డేవానికిఁ గాఁ, డావిధ మెంచంగ ననుచు ♦ నరయుట పొనఁగున్. ౧౩౮

క॥ గ్రామాంతరమున కేఁగెదు, నామనుజుం డొంట నిలుచు ♦ నపరాహ్ణమునన్
గామనమ్మైఁ బోఁజూచును, నేమములే కొండుదెసకు ♦ నిజ మింత సుమీ. ౧౮౦

తే॥ తల్లియును దండ్రియును నిండ్లు ♦ ధనము లనఁగఁ
దనరు నావాసమాత్రముల్ ♦ దమకుఁ గాఁగ
సక్తులై చెడ రీసంత ♦ సంబరమున
నెందు సజ్జను లనఁ గీర్తి ♦ నందువారు. ౧౮౧

ఉ॥ పెద్దలనాఁటిరాజ్య మిటు ♦ పెంపు దలంగఁ దొఱంగ నౌట నీ
కుద్దియె యేటిమే ల్దలఁచి ♦ తో రఘువర్య; వనాధివాసముం
బెద్దగ నెంచె దేమి మృగ ♦ విత్తము కాపథ మాత్తకంటకం
బద్దెస కేగనెంతు రెసు ♦ ఖాంచితు లింత యెఱుంగఁ బోలదే. ౧౮౨

తే॥ అనఘ; యొం డెన్నక సమృద్ధ ♦ యా నయోధ్యఁ
జేరి పాలింపు మాత్మాభి ♦ షేచనంబు
నిన్నె కోరుచున్నది ♦ నెలఁత వోలె
నన్నగరి యేకవేణియై ♦ సన్నయగుచు. ౧౮౩

క॥ రాజకులంబునఁ బొడమితి, వా జతన మహార్హ్యతమము ♦ లా భోగము లా
యోజం గొనుము పురిని సుర, రా జమరుల నగరిఁ బోలె ♦ రహిఁ బెరసిన్నపా.

తే॥ నీకు దశరథుఁ డెవ్వాఁడు ♦ నీ వెవఁడవు, వాని కిట్లన కన్యోన్య ♦ వశ్యు లౌట
మేలె నాపలు కాలించి ♦ మెలఁగు మింక, సకలసంపదలకు నీవె ♦ సదనమగుచు.

క॥ ఋతుమతి యగు తల్లి సమభి, రతుఁడై తద్భర్త గవియ ♦ రక్తము వీర్యం
బతులముగఁ గలియు నానం, గతి బీజము తనదు పుట్టు ♦ గావించుటయున్.

క॥ ఇంత యెఱిఁగి తద్బాంధవ, మంతటికిం గూర్చుకొనుచు ♦ నల్లాడెద వీ
మంతన మసదన కేమనఁ, జింతార్ణవ మొనసి పిదపఁ ♦ జేడ్పడెదో కదే. ౧౮౭

క॥ లే డాతం డికాలము, గాఁ డిట్లని తెలుప నొండు ♦ గతి నెన సెను రాఁ
బోఁ డీ వచ్చుటి కేగవు, పోఁడిమి యిదె నరుల కెఱిఁగి ♦ పొరలఁగ నేలా. ౧౮౮

ఆ॥ అర్థధర్మపరుల ♦ యా నందఱం గూర్చి, పొగులుచున్న వాఁడఁ ♦ బొలియుచున్న
వారు వారు దుఃఖ ♦ వర్గ మిచ్చుటఁ గని, మేనిఁ బాసి యొండు ♦ మేలు లేక.

క॥ వ్యర్థముగా నీ వట్లు క, దర్థము పితృవాక్య మెంచి ♦ యతనికి సుకృతం
బర్థిమెయిఁ గూర్తు ననియెద, వర్థించెదె యదియు మృతున ♦ కబ్బునె తలఁపన్.

క॥ పితృదైవత్యము లష్టక, లతిసక్తి నొనర్తు రంత ♦ మందు నరులకున్
గతిఁ గూర్తు మనుచు ద్రవ్య, స్థితి చెడుటయుకాక వారు ♦ తిందురె చెపుమా.

ఆ॥ ఒకఁడు తిన్నతిండి ♦ యొక్కని మేని కౌ, ననఁ బ్రవాస మందు ♦ నతని కెల్ల
శ్రాద్ధవిధిఁ బ్రసక్తి♦జరుపంగఁ బాథేయ,మగు ననంగఁ జెల్లు♦నయ్య యదియు.

క॥ మేధావులు స్వీయమతిన. మాధేయములుగ నొనర్చి ♦ రాయాకృతులన్
బోధమయము లవి కావున, మీ ధారణ సెయును వాని ♦ మేలిమిఁ దలఁపన్.

ఆ॥ అందుఁ గూర్చి రెల్ల♦యజనంబు లొనరింపుఁ, డిందు ధనము లొడ్ల♦కిచ్చుమెయిని
దీక్షలుం దపములుఁ♦దీరుగా నడుపుఁ డ, న్యముల పీడఁ దని స్వ♦కాష్ఠ సెల్ల.

క॥ ఈక్షణ మెది యగు నాప్ర, త్యక్షమె మానంబు పర మ ♦ పాస్తం బిటులో
లక్షణ మరయుము చెడుగు వ, రోక్షము విడనాడు మని ♦ రూఢి నెఱియఁగన్.

ఆ॥ అడ్డు లేదు భరతుఁ♦డడుగుచున్నాఁడు రా, జ్యము భరింపు మనుచు♦విమలమతులు
లోకవిదులు నీదు♦రాకకై వేచి యు, న్నారు ప్రోఁచియిడుము♦తీరు దగునె. ౧౫౬

క॥ ర మ్మాదరింపు మిందఱఁ, గా మ్మైమ్మైశ్వర్యమ్ము సుఖము ♦ గోరుము ప్రజలన్
సమ్మదమునఁ దేర్పుము రా, జ్య మ్మఖిలార్థముల కిమ్ము ♦ క్ష్మాత్మజాధీశా. ౧౫౭

—♦ జాబాలి పలికిన యథస్త్యవచనంబులకు రాముఁడు ప్రత్యుత్తరం బిచ్చుట ♦—

తే॥ అనుచు జాబాలి వలుక స ♦ త్యాత్ముఁడు హరి
రాముఁ డిట్లనె ధర్మంబు ♦ రాణ గూర్చు
తనదు గురుభక్తి బుద్ధిమే ♦ ధాప్రసక్తు
లింత లనరాక తనరార ♦ నంత లగుచు. ౧౫౮

సీ॥ నాకు మేలొనరింప ♦ ననుచు తలంపునఁ, బలికితి విమ్మెయిఁ ♦ బాడి దొఱఁగి
యది యకార్యమపథ్య♦మయ్యుఁ గార్యంబనఁ, బథ్యంబు ననఁ దోఁచు♦ప్రాకృతులకుఁ
దనదు మర్యాదఁ బె ♦ ద్దల నడవడి వీడు, పాపసమాచార ♦ పరుఁడు నరుఁడు
సజ్జనగోష్ఠిప్ర ♦ సంగంబునకుఁ గాఁడు, చేరఁ డేప్రామాణ్య ♦ సిద్ధియందుఁ

గొలము గలుగుట లేకుంటఁ ♦ గూళ యగుట
సుజనుఁ డౌట నశుచియౌటఁ ♦ శుద్ధుఁ డగుట
బీరమున వన్నె కెక్కుటఁ ♦ బిఱికి యౌటఁ
దెలుపుఁ జారిత్రమే తేట ♦ తెల్లముగను. ౧౫౯

ఉ॥ ఆర్యుని యట్లనార్యుఁడు మ ♦ హాశుచి యట్టులు శౌచహీనుఁడున్
శౌర్యఘనుండ పోలె నెఱి ♦ సాలనివాఁడును లక్షణైకని

ర్థార్యుని యట్లలక్షణుఁడుఁ ♦ దద్ద సుశీలుని యట్లశీలుఁడుఀ
గార్యములేమిఁ దోఁచు నది ♦ గల్గఁగ నెప్పటియట్టివాఁ డగుఀ. ౧౬౦

చ॥ అస మెడలఁగ మే ల్సెడఁ గ్రి ♦ యావిధు లూడఁగ ధర్మసంగ్రహం
బస దయి పోవ లోకమున ♦ కంతకు సంకరవృత్తిఁ గూర్పఁగా
వసమతి నీదు పల్కుబడి ♦ వల్గనముం బొనరించె నంచు నే
నసమయవర్తనంబునకు ♦ నొడునె ప్రాజ్ఞులు కాదు కా దనఀ. ౧౬౧

క॥ కార్యాకార్యవిచక్షణుఁ, డార్యుఁడు నగు నెవఁడు చేత ♦ నాంచితుఁడై కా
దర్యమున మునుఁగు నను సు, స్థైర్యం బొనరించు మెచ్చు♦సూనృత మెంచుఀ.

తే॥ వెడఁగునై లోకదూష్యదు ♦ ర్వృత్తిఁ బొరలు
నే నెవనివంక సద్వృత్తిఁ ♦ నెఱపువాఁడ
నప్రతిజ్ఞతమై హైన్య ♦ మందు కృతినిఁ
బుణ్యగతి కెట్లు పోఁగాంచి ♦ పొలుచువాఁడ. ౧౬౩

క॥ నే నియతిఁ బాసి పురికిం, బోనైనఁ దొఱంగనైనఁ ♦ బో ఫల మొకఁడా
నే నెఱి శాసింతుఁ బ్రజల, నీనెపమున వార లిట్టు ♦ లే మెలఁగంగఀ. ౧౬౪

తే॥ కామవృత్తంబ యెల్లలో♦కంబు మొదలు,ధర్మపథ మిట్టులని మదిఁ♦దలఁపఁ బోదు
రాజు వర్తన మెడలిన♦నాజడనున, సుకృతసంగ్రహ మొనరింపఁ♦జూడఁ గలదె.

క॥ యద్వృత్తులు ప్రభు లౌదురొ, తద్వృత్తుల యగుదు రెందుఁ♦దత్పాలితులుం
దద్విధి ననుశాసింపఁగ, మద్విధుఁ డేల తముఁ దారె ♦ మనుపం జనదే. ౧౬౬

క॥ అనృశంసము సత్యమునై, సనాతనము రాజవృత్త ♦ సత్పథ మొప్పుఀ
దనరును సత్యమె రాజ్యం, బనఁగా సత్యంబునంద ♦ యంతయు నిలుచుఀ. ౧౬౭

తే॥ ఋషులు దేవతలును సత్య♦మెల్లధర్మ, ములకుఁ దానక మని నేర్చి♦పలికినారు
సత్యవంతుండెయుత్తమా♦స్పదముఁగాంచుఁ,గానియొండెందులకు నేనిఁ♦గాఁడుసుమ్ము

క॥ ఉద్వేగ మందుదురు స, త్యద్వేష్యు న్విషధరమ్ము ♦ నట్లు గని నరుల్
సద్వర్తను లెందు నతం, డాద్వారంబుననె నరక ♦ మందం గాంచుఀ. ౧౬౯

క॥ సత్యమె పరమా ధర్మము, సత్యమె మూలంబు సర్వ ♦ సంపదలకు నా
సత్యమె సిరి యీశ్వరుఁడును, సత్యమె స్వర్గాపవర్గ ♦ సంధాయకముఀ. ౧౭౦

తే॥ దత్తమిష్టము హుతము త♦ప్తములు తపము,లఖిలవేదంబు లధ్యాత్మ♦మైన తత్త్వ
మిన్ని సత్యప్రతిష్ఠంబు♦లే యనంగ, సత్యపరుఁ డౌటయే సర్వ♦సమ్మతంబు.౧౭౧

క॥ మాతనమునఁ దలఁపరు సా, మంతుల మని యుబ్బుదురు సు ♦ మాళంబున రా
జ్యాంతమున నరకమే ధ్రువ, మింతకు నను న్యాయ మెపుడు ♦ హీనవిచారుల్.

తే॥ కాయ మొనరించు నేపాప♦కర్మమైన,మనసుచే నొందు ధార్యమై♦మలసియుండు
ననృతమాడంగ వెలవది♦య్యనద జిహ్వ,త్రివిధమిటు పాతకమునరు♦దేబెఁజేయు.

తే॥ భూమికీర్తి యసము లక్ష్మిమ్ర♦పురుషవర్యుఁ,గోరుచుందురు త్రికరణా♦శ్శుద్ధుఁడనుచు
స్వర్గమున నున్నవానినే♦సంశ్రయింత్రు, గాన సత్య మెడల మేలు♦గలుగ దెందు.

మ॥ ఇది మే లీక్కృతికిం దొడంగనగు నం ♦ చేమేమొ హేతూక్తుల
న్మది నిర్ధారణ సేసి తెల్పి తభిమా ♦ నంబొప్ప నక్కల్పమా
చదు రెక్కంజనఁ బో దనార్యమ యగుణ్ ♦ సమ్యక్ప్రమాణా ప్తిసం
పద నొప్పారదు దుర్భగు లక్కడఁక సం ♦ భావింపఁగా నర్హమై. ౧౮౬

ఆ॥ గురునివఁని యాజ్ఞఁ♦గొని ప్రతిజ్ఞవహించి, వనముసొచ్చి మెలఁగ♦వచ్చి యిపుడు
భరతుఁ డడిగె నీవు ♦ పలికితి వని యది, యెల్ల వీడి మరలు ♦ టేటి తగవొ.

క॥ నాచేసిన ప్రతిన తిరం, బై చెల్లఁగ వలయునదియ ♦ యలఁతింబో ద
ర్లొచితిమెయి గురుసన్నిధి, మోచినయది తల్లి హర్ష ♦ మునఁ బొదలంగన్. ౧౮౮

మ॥ వనవాసం బొనరింతు నిల్లై శుచినై ♦ వన్యాశినై పుణ్యతీ
ర్థనివేశంబులు చొప్పడన్ సుకృత మ ♦ ర్థం బంచు దేవర్షిపి
త్రనుషక్తార్చనతర్పణంబు లెసఁగన్ ♦ వ్యాసంగము న్వీడి వం
చన లే కింద్రియపంచకంబు వరివ ♦ స్య ల్గూర్ప మేలౌ ధృతిన్. ౧౮౯

క॥ కార్యాకార్యవిచక్షణుఁ, డార్యుఁడు కుహనావిహీనుఁ ♦ డన నెగడి తుదిన్
స్థైర్య మెడలి గురువాక్యా, దార్యము సెడఁజూతునే వృ ♦ థాప్రభవుఁడనై.

ఆ॥ కర్మభూమిఁ బుట్టు ♦ గాంచి యిద్దాననె, మేలికృత్యకలన ♦ మెలఁగవలయుఁ
గర్మఫలమువలనఁ♦గాదొ వాయువు వహ్ని, యట్లు సోముఁడును మ♦హాత్ములగుట.

క॥ క్రతువులు శత మొనరించియె, శతక్రతుం డనఁగ నముచి ♦ శాసనుఁ డొప్పెన్
వితతస్వారాజ్యముఁ గొనె, వితథం బయ్యెనె తదీయ ♦ వృత్తం బెల్లన్. ౧౯౨

క॥ ఉగ్రతపంబుల మునులు స, మగ్రమహిమఁ గాంచరే మ ♦ హర్లోకగతిన్
విగ్రహము పూనిరే స్వో, యాగ్రహమున శ్రితులపై ని ♦ రాధారోక్తిన్.

క॥ అని యుగ్రతేజుఁ డానృప, తనయుఁడు నాస్తికపథాప్తిఁ ♦ దగు తద్ధేతూ
క్తినివహము సహింపకె యి, ట్లనె మఱి గర్హింపఁ దొడరి ♦ యగ్నినిభుండై.

—♦ శ్రీరాముఁడు నాస్తికమతావలంబముం గూర్చి జాబాలిపైఁ గోపించుట ♦—

ఉ॥ సత్యము ధర్మమున్ శ్రుతము ♦ సారపరాక్రమమున్ బ్రశస్తి భూ
తాత్యయవారణాఢ్య దయ ♦ హార్దనయోక్తి ద్విజాతిదేవతా
ప్రీత్యయ మంచితాతిథిస ♦ పర్యలకే నను చిత్తవృత్తియున్
నిత్యము స్వర్గమార్గ మని ♦ నిర్ణయముం బొనరింతు రుత్తముల్. ౧౯౫

ఆ॥ ఇట్టి యర్థ మెఱిఁగి ♦ యేకకంఠోక్తిమై, స్వస్వధర్మముల ప్ర ♦ శంస లోలయ
నెల్లవారి నడుప ♦ నెంతురు నడుతురు, మత్తుఁ గొనక ద్విజులు ♦ మాన్యులెపుడు.

కం॥ శ్రుతిపథమునఁ గా కొండగు, మతమున కెగయునతఁ డర్థ ♦ మార్గంబున సం
పతన మెనసి వెతపడు నవు, డతిపాతోక్తు లధిపదము ♦ నందించునొకో. ౧౯౬

తే॥ అంచితాపూర్వమాజ్ఞాన ♦ మందఁ జేయు, శ్రుతుల నమ్మక పెద్దల ♦ సూక్తు లెలమిఁ
గొనక నీబోంట్లు గైకొనఁ ♦ గోరు నట్టి, దెద్దియో నావివేచన ♦ కెదురుపడదు.

చ॥ వలసెను నిందసేయఁ బితృ ♦ వర్తన మిన్నటి నేల చెప్పఁగా
వలె విషమస్థబుద్ధి నినుఁ ♦ బ్రాజ్ఞుని నట్టులుగాఁగ నట్టిప్రా
కలన మెలంగుచుంటి విటు ♦ గావిఁక ధర్మపథాప్తి కీవు నీ
వలనున నాస్తికత్వము న ♦ వశ్యముఁ గాంచరె మంచివారలున్. ౧౯౯

ఆ॥ దొంగ నట్లు బౌద్ధు ♦ తో నాస్తికునిఁ గూర్చి
తొలఁగఁజేయు టొప్పు ♦ దొరకుఁ బ్రజకు
శంకనీయుఁ డతఁడు ♦ సన్ముఖుం డైనచోఁ
దలఁగువాఁడు బుధుఁడు ♦ తత్త్వ మెఱిఁగి. ౨౦౦

శా॥ నీకన్న న్నిపుణు ల్పురాతనులు స ♦ న్నిష్ఠు ల్సువిజ్ఞానులా
లోకు ల్సత్క్రతువు ల్చరించి ధృతి నీ ♦ లోకంబు నాలోకమున్
జేకొంట న్వెలసిల్లి రమ్మెయిని సం ♦ సిద్ధు ల్ద్విజు ల్నేఁటికిన్
శ్రీకృత్కర్మము లిజ్యలు న్నెరపుచున్ ♦ సిద్ధాంతము ల్సల్పఁగన్. ౨౦౧

తే॥ తపము లిష్టంబు లట్లు పూ ♦ ర్తములు పైతృ
కేష్టు లొనరించి దివ మెంద ♦ ఱెనసినారొ
కాదె ప్రత్యక్ష మది తెల్పఁ ♦ గన భమండ
లములు పుణ్యపురుషమండ ♦ లముల కాఁగ. ౨౦౨

కం॥ శ్రుత్యుక్తమార్గ మంతయుఁ, బ్రత్యక్షమె యగు నపూర్వ ♦ పద్ధతిఁ దోఁచున్
వ్యత్యస్తహేతువాదము, లత్యయముం గాంచు దాని ♦ నందని వగఁటన్. ౨౦౩

క॥ స్వస్తిహుతకృతము లెల్ల యు, శాస్త్రు లహింసాదిధర్మ ♦ వరనిష్ఠలు సం
ప్రస్తుతములు నిగమముల క, పాస్తమయాఁ దదహితప్ర ♦ బంధం బెదియున్.

తే॥ ధర్మరతులు సద్యోగత♦త్పరులు ఘనులు, బ్రహ్మతేజస్వు లతివిత♦రణసహితులు
నిర్మలాత్ము లహింసకు♦ల్నిష్ఠితులును, నౌమునులుపూజ్యులు జగత్త్రి♦యంబునందు.

—♦ జాబాలి రామునకు నిజాభిప్రాయం బెఱింగించుట ♦—

క॥ అని రోషావేశంబున, నను రాము మహాత్ము సద్గు ♦ ణాఢ్యు ససత్త్వున్
గని యాస్తికుఁ డాబ్రాహ్మణుఁ, డనె ననునయ మొప్పఁ దథ్య♦మగు పల్కుబడిన్.

తే॥ ఆస్తికుఁడ నైన నే నిట్లు ♦ నాస్తికుఁ డన
నైతి నుత్తమలోకంబు ♦ లందరాని
వనుచు లే వెందుఁ ద్వదనుగ్ర ♦ హంబుకతన
నాకు నాకేశనుత నామ ♦ నం బరయుము. ౨౦౭

క॥ ఈకాలమునకుఁ దగిన, ట్లీకరణి న్నొడువవలసె ♦ నినుఁ డరిగిన ని
ర్లోక మనఁ దగిన యాపద, సేకూరఁగ నీవు ప్రతిన ♦ నేకొని తలఁగన్. ౨౦౮

తే॥ ప్రజలఁ బాలింప నెవ్వారు ♦ ప్రభులు భరతుఁ
డొదిఁగి యిమ్మెయిఁ బ్రార్థించు ♦ చున్నవాఁడు
ధర్మసంకట మొదవె న ♦ న్దలఁపు దవ్వుల
నిట్టు లంటినకాక యే ♦ నెఱుఁగనయ్య. ౨౦౯

క॥ ధర్మము తలఁగఁగ నౌ తఱి, నిర్మలుఁడై తద్గతాస్థ ♦ నెఱయఁగ నొంటన్
మర్మ మిడియైన వ్రతదు, ష్కర్మము వారించు నతఁడు ♦ గతిసెడఁ డెందున్.

ఆ॥ నిన్నుఁ గొని చనంగ♦నీప్రసాదముఁ గైకొ, నంగ రామ; యిట్రప్ర♦సంగ మొదవెఁ
గాని నాస్తికాను ♦ గతవాదముల శత, ఖండముల నొనర్పఁ ♦ గానె నేను.

క॥ అనువాదమాత్ర మది నీ, యనుమోదము గోరి యిట్టు ♦ లనినందులకున్
నిను వేఁడెద మన్నింపవె, జననస్థితిలయము లెఱుఁగు ♦ జాణవ కావే. ౨౧౨

—♦ వసిష్ఠముని రామునితో సామవచనంబులు వలుకుట ♦—

క॥ అను మునిఁ గని క్రుద్ధుని రా, ముని నారసికొని వశిష్ఠ ♦ ముని యిట్లనెఁ ద
న్మనము ప్రసన్నముగా నెం, దును ననుపమ యనఁగఁ దగిన ♦ ధోరణి వెలయన్.

క॥ ఇతఁడు గతాగతు లెఱిఁగిన, మతిమంతుఁడ కాని రిత్త ♦ మానిసి కాఁ డీ
విత మరసి ప్రజలవెత గని, ధృతిమెయి నిను మలఁచికొన వి♦దితుఁ డిట్లనియెన్.

సీ॥ వినుము లోకోత్పత్తి ♦ విధము నాపలుకుల, లోకనాథా; శ్రుతి ♦ ప్రాకటముగ
నంతయు జలమయం ♦ బై యుండ నద్దాన, నిర్మితమై పృథ్వి ♦ నీట మునుఁగ
హరికోలమై యెత్తె♦నటస్వయంభు వొనర్చెఁ, దోఁచివేలువులఁబు♦త్త్రుల జగముల
బ్రహ్మ యాకాశప్ర ♦ భవుఁడు శాశ్వతుఁ డవ్వ, యాత్ముఁ డాతనివల్ల ♦ నమ్మరీచి

యయ్యె నాఘనువలనఁ గా ♦ శ్యపుఁడు వొడమె
నటు వివస్వంతుఁ డాతని ♦ యం దెలర్చె
నతనిపుత్త్రుండు వైవస్వ ♦ తాఖ్యమనువు
తనరె నిక్ష్వాకుఁ డవ్విభు ♦ తనయుఁ డగుచు. ౨౧౫

ఆ॥ తొలుతఁ గూర్చె భూమి ♦ ధూర్వహుం డిక్ష్వాకు
నకు మనుప్రభుండు ♦ ననుచు కూర్మి
నతఁ డయోధ్య నెనసి ♦ యధిరాజపద మొప్ప
నేలె లోక మెల్ల ♦ నేకకలన. ౨౧౬

ఆ॥ అతని కొడుకు కుక్షి♦యాతనికి వికుక్షి, బాణుఁ డతని సుతుఁడు♦బాణజుఁ డన
రణ్యనృపుఁ డతండు♦ప్రభుఁడుగా దుర్భిక్ష, వగ్రహార్తిజార్తి ♦ వార్త లుడిగె.

క॥ శశినిభుఁడు పృథుఁడు తత్సుతుఁ, డశంకితాత్ముఁడు త్రిశంకుఁ ♦ డతని తనయుఁడా
నశరీరస్వర్గసుఖ, ప్రశంస నవ్వాఁడు గనియెఁ ♦ బ్రాజ్ఞులు వొగడన్. ౨౧౮

ఆ॥ అం దొదవిన వార ♦ లందఱు ఘనులె తా, రిందు నందుఁ బ్రథితి ♦ నందినారు
మఱియు వర్ణ్యు లందు ♦ మాంధాతృసగరది, లీపనృపభగీర ♦ థోపమములు ౨౧౯

క॥ సాక్షాద్విష్ణులె చరితము, లైక్ష్వవములె పుత్త్రపౌత్త్రు ♦ లవల కకుత్స్థుం
డాక్షాలితాఘుఁడు రఘుఁడు, నీక్షన్ జగమెల్ల నేలి ♦ రింద్రప్రస్తుతులై. ౨౨౦

తే॥ పరఁగి రిక్ష్వాకువలన నై ♦ క్ష్వాకు లనఁ గ
కుత్స్థు వలనఁ గాకుత్స్థులై ♦ కొమరు మిగిలి
రారఘునివల్ల రాఘవు ♦ లనఁగ నెగడి
రినుకొలంబున విభులు ది ♦ నేంద్రనిభులు. ౨౨౧

క॥ ఆతామరకొలనున నె య, నేతాదృశు లొదవి రట్టు ♦ లే రాయంచల్
శ్రీ తాలిమిమైఁ గొలిచెను, భూతము లొననెడు భూతి ♦ భూతరుణియుఁ దాన్.

ఆ॥ అలమనుప్రవేశుఁ ♦ డాదిగా దశరథ, ప్రభుని వఱకు నగు వ ♦ రంపరాప్తి
జ్యేష్ఠుఁడేలె నేక ♦ నిష్ఠుండు నేలఁడు, ధర్మమర్మ మిట్లు ♦ దనరుచుండె. ౨౨౩

క॥ పాటిలు మేలగు నాపరి, పాటి న్నీయందు నిలిచెఁ ♦ బ్రిభుధర్మము నీ
వేటికిఁదలఁగంగావలె, మేటివి నీ వన్నిటను స ♦ మృద్ధిం గొనవే. ౨౨౪

ఆ॥ తండ్రి ; నీకాలమునఁ ♦ దవిలి సనాతన, మైన ధర్మ మేల ♦ యగడుపఱవఁ
దండ్రివలెనె రత్న ♦ ధరధరాతలరాజ్య, మేలుమయ్య; యసము ♦ జాలుకొనఁగ.

క॥ ముప్వురు గురువులు పురుషున, కవ్వాయుఁ దండ్రియును విద్ది ♦ య లిడునతఁడు న
ల్లవ్వరుసనె యాచార్యం, డెవ్వగనేనియును మేటి ♦ యే యండ్రు బుధుల్.

తే॥ ప్రాకృతపుమే నొసంగిన♦వారు వార, లిరువు రటు జ్ఞానతను లిడె♦నితఁడు గాన
నెక్కు డన నయ్యె నీతండ్రి ♦ కేనె గురుఁడ, నైతి నైతిని నీకు నో♦ యనఘచరిత.

క॥ నాపలు కీవు గొనిన నే, యాపత్తియు రాదు శ్రేయ ♦ మందఁగ నగు ని
ట్లీపారిషదులు సుహృదులు, నీపౌరులు సంతసింతు ♦ రిది సుకృత మగున్. ౨౨౮

ఆ॥ వృద్ధ ధర్మశీల ♦ విజ్ఞాత్రి నీతల్లి, భావ మెఱిఁగి యామె ♦ పలుకువంక
మెలఁగు టొప్పు నీకు ♦ మేలె యా నద్దాన, నిఖిలలోకములును ♦ నీవు గెలుతు.

తే॥ సత్యధర్మపరాక్రమ ♦ సజ్జనాభి, నంద్య రామ వినుము మంచి♦నయము భరతుఁ
డర్థియై వేఁడుకొనుచున్న♦యర్థమునను, నీ కతిక్రాంతదోషమ్ము♦నెరియు లేదు.

క॥ అని మధురముగా గురువరుఁ, డనునయ మెప్పారఁ దెలుప ♦ నంతయు విని యి
ట్లనె నమ్ముని కెఱఁగి మహా, జనవంద్యుఁడు రాముఁ డుచిత ♦ సంస్తుతమతియై.

—♦ రాముఁడు వశిష్ఠవచనములకు సమాధాన మొసంగుట ♦—

చ॥ తనతలిదండ్రు లాదరము ♦ తద్దయు మీఱ విశేషలబ్ధికై
తనయునిఁ గాంచి పెంచి బెడఁ ♦ ద ల్కడు నోర్చి యెలర్పుప్రీతి స్నా
పనముఖము ల్సుసంస్కృతులు ♦ భావనమైఁ బొనరించినట్టి య
య్యనుకృతి కెంత దీర్పఁగల ♦ డాదట వాఁడు త దర్థభాగియై. ౨౩౨

ఉ॥ అందఱకుం బురస్కృతుఁడు ♦ యంత్రణ దోఁపఁ దలంగలేక యి
ట్లిందుల కొగ్గినాడు తగ ♦ వెంచి తదీయఁ బ్రతిజ్ఞఁ దీర్పఁగా
ముందుగ నే నొడంబడితి ♦ మూర్ఖుఁడనే యిపు డింతసేసి యే
బందె నెపంబొ యడ్డ మిడఁ ♦ బొల్పడి తండ్రి యనర్థ మొన్నఁగన్. ౨౩౩

ఆ॥ అతని పలుకు మిథ్య ♦ యనఁబోల దొడ్లకు, దీనివలన మేలు ♦ దెరలఁ బోవ
దిదియె ధర్మ మైన ♦ నీరేడులగు నేండ్లుఁ, జనినఁ గడఁగి పూని ♦ జరుపఁ జనదె.

క॥ ఈయందఱు సమ్మతిపడి, నాయందలి గారవమున ♦ నాయమ కొని యీ
చాయనె వర్తిలనగువా, రేయుత్తర మిడక యింక ♦ నేకత్వమునన్. ౨౩౫

—♦ భరతుఁడు ప్రాయోపవేశం బొనరింపఁ గడంగుట ♦—

మ॥ అని రామేంద్రుఁడు వల్కుచో భరతుఁ డ ♦ త్యావృత్తుఁడై దుర్మనుం
డసనై సూతునిఁ గాంచి స్థండిలమునం ♦ దండింపుమా దర్భలో
య్యన నే నయ్యెడ నుండెద న్విభు ప్రసా ♦ దావిర్భవం బెంచుచున్
దినఁ జూడన్ ధనహీనుఁ డౌ ద్విజుని యు ♦ ద్దేశంబు దేశంబుగన్. ౨౩౮

క॥ ప్రాయోపవేశమున నే, నీయెడరుం బాపనేర్తు ♦ నిదె తెలియఁ గన వాఁ
డాయధిపుఁ గాంచి మఱలఁ, జాయకు మతి వగచి తాన ♦ చని సత్వరుఁడై.

ఆ॥ కుశలుఁ దెచ్చి భూమిఁ ♦ గూర్పఁ జాలక మేలి, కుశలు దెచ్చి భూమిఁ ♦ గూర్పఁ జాలి
యయ్యుదారుఁ డచటు ♦ నధిశయించె సుబుద్ధి, యయ్యుఁ దారుజాప్త ♦ నట్టులాడెఁగి.

ఉ॥ ఆతని గాంచి యిట్లనియె ♦ నారఘువంశవతంస మయ్య; నీ
వీతఱి నింత కీడుపని ♦ నెంచఁగ నే నొనరించి నట్టిదా
పాతక మేమిరా కలదొ ♦ పార్థివపుత్రున కిద్ది యొంటనా
నాతురుఁడైన బ్రాహ్మణున ♦ కాఱడి మేలె గురూక్త మల్పమే. ౨౩౯

తే॥ లెమ్ము నాతండ్రి పురి కవ ♦ లేప మెడలఁ, బొమ్ము పాలింపు మిమ్మెయి ♦ ప్రొద్దునందుఁ
గూడ దీదారుణస్థితి ♦ వేడబంబు, నన్ను మనిచి మనుము సర్వ ♦ నందితముగ. ౨౪౦

మ॥ అనిన న్వాఁడును బౌరజానపదుల ♦ న్వ్యాసక్తులం గాంచి మీ
రనుమోదింతురె స్వామికిం దెలుప నా ♦ నర్థంబు యోజింప కి
ట్లనువృత్తిం బచరింతురే తలఁపరే ♦ వ్యత్యాస మంచుం గడున్
వనటం బొందఁగఁ దత్ప్రితిప్రసవులై ♦ వారు న్విచారించుచున్ ౨౪౧

ఆ॥ ఇట్టు లనిరి రాముఁ ♦ డెఱిఁగి వచించినఁ, బలుకు నాతఁ డీవ్ర ♦ పంచముననుఁ
గలఁడె తండ్రియాన ♦ కడముట్టఁ గాని రాఁ, బోఁడు మనకు నిదియె ♦ బుద్ధి సుమ్ము.

క॥ ఈమహితు నివర్తింపఁగ, నామఘవుండేనిఁ జాలఁ ♦ డన మనవశమే
నేమము దీర్చి యతఁడు రా, నోములు ఫలియించు నింక ♦ నొవ్వఁగ నేలా.

ఆ॥ అనిన నన్న వీర ♦ లందఱు మే లగు, పలుకు వినుము నాదు ♦ పలుకుబడియుఁ
గొనుము చెడ్డతలఁపుఁ ♦ గూర్చినందుల కిటఁ, జేరి జలము నను స్పృ ♦ శింపుమిపుడు.

ఆ॥ తన్నుఁ గూర్చి యభిమ ♦ తముగాని యధికార, మూనువాఁడు విధని ♦ మానువాఁడుఁ
బఱితు లౌదు రట్టి ♦ పాతకిత్వంబున, కగుదె గురుమతంబు ♦ నలఁతిసేసి. ౨౪౫

క॥ అను నెడ రాముని సన్నం, గొని తత్పరతత్త్వ మెల్ల ♦ గురుఁడనుపమునై
తనరారఁ దెలిపి రమ్మన, ననఘుఁడు భరతుండు సంభ్ర ♦ మాంచితుఁ డగుచున్.

—♦ భరతుఁడు ప్రాయోపవేశంబువదలి రాముచరణంబులపైఁబడి వేఁడుకొనుట ♦—

క॥ సలిలము స్పృశించి విభుపద,సలిలజములఁ గేల నిమిరి ♦ సలలిత మగు సం
వలనము వెలయఁగ సభవా, రలు సంబోధించు నెఱిని ♦ రంజిలఁ బలికెన్.

ఆ॥ వినుఁడు మంత్రులార ♦ విజ్ఞానఘనులార;, పౌరులార; ప్రాణ ♦ బంధులార
తండ్రి నడుగఁ దల్లిఁ ♦ దలఁపింప ననఘుఁ డీ, భ్రాత నెఱపి నట్టి♦ ప్రతిన నెఱుఁగ.

క॥ ఆర్యగురుని శాసన మవ, ధార్యం బని పరమధర్మ ♦ తత్త్వజ్ఞుఁడు స
ద్వార్యుఁడు భ్రాత దెలుప నని, వార్యం బిటు లయ్యె నంచు ♦ వలనెంచుమతిన్.

ఆ॥ తలఁచినాఁడ నిట్లు ♦ తాత్పర్యమునఁ దన, కేనుఁ బ్రతినిధిత్వ ♦ మెనసి యడవి
నెలమి మెయిన నిలుతు♦నీరేడువత్సరం, బులును నిట్లుఁ దగదె♦పూన్కి నెఱప.

క॥ ఈనెఱి నంగీకారముఁ దా నెట్టన గూర్చి నన్ను ♦ దాసు మనుపరా
దో; నియతి కలిమి సెడునో, యేనిర్ణయమునకునే న ♦ ధీశుఁడకాఁడో. ౨౫౧

క॥ అని యాదలఁ దత్పాదన, లినయుగళి న్మోపి మనము ♦ లెంకగ నిడి వీ
డని యనుజుఁ దథ్యవచనుం, గని విస్మితుఁ డతఁడు వలికెఁ ♦ గలవారలతోన్.

సీ॥ తండ్రి తా నగుచు న ♦ ర్థం బిచ్చికొనిన ట్లు, యోధ్యకై వనవాస♦మొప్పగించె
నది భిన్న మొనరింప ♦ నర్హుండఁ గా నేను, భరతున కేనియుఁ ♦ బాడిగాదు
కైక కోరినయది ♦ కానేర దన్యాయ్య, మధిపుఁ డౌచిత్య మ ♦ ట్లరసి నెరపె
గురువత్సలుఁడు క్షాంతి♦ పరుఁ డనఘుఁడు నంచు,నీతని తెఱఁగెల్ల♦నే నెఱుఁగుదు
నఖిలకల్యాణములు నిమ్మ ♦ హాత్మునందు, సత్యసంధునియం దెప్డు ♦ సంభవించు
ధర్మశీలుఁడు వీని నే♦ స్తమునఁ దవిలి, మహిఁ కిఁ బతినౌదు వనినుండి♦మఱలివచ్చి.

క॥ ఏయుసధయు లే దిద్దెసఁ, బాయదు నిర్ణయము నాదు ♦ పలుకుబడి యెటుల్
జేయుదు ననునంతలు దీ, ర్ఘాయువు వీఁ డమితకామి ♦ తార్థము లెనయున్.

క॥ అని భరతునిపైఁ జేయిడి, వనజదళాక్షుండు భక్త ♦ వత్సలుఁ డగు రా
మనరేంద్రుఁడు చన విడి యి, ట్లనె నాతని చిత్తవృత్తి ♦ యానందింపన్. ౨౫౫

ఆ॥ వత్స; తల్లి యడిగె ♦ వారక ప్రాగ్దత్త, మయ్యు నడిపె నింత ♦ లంత లనుచుఁ
దలఁప నేల యిపుడు♦తద్వచోయాథార్థ్య, మీవు వెలయఁ జేయు♦మీకతమున.

క॥ ననుఁ గూర్చి తండ్రి నస్మృత, మ్మునినుండి తలంగఁ జూడ ♦ మొనయుము నీ వి
ద్యానఘకృతికలనఁ గాంచెద, వనుత్తమము శ్లోక ముత్త ♦ మాశ్రమపదమున్.

—♦ రాముని ప్రతిజ్ఞార్థపాలనముం గూర్చి సురలు మునులు సంతసించుట ♦—

చ॥ అనునెడ రోమహర్షణము ♦ నందఁగఁ జేయఁగఁ జాలు రాజనం
దనుల సమాగమంబు ప్రథి ♦ తంబు తదీయవిభావిశేషముల్
గనుఁగొన వచ్చి యున్న్యులకుఁ ♦ గన్పడఁ బోలక యున్న వేల్పులున్
మునులును సిద్ధులు న్పొగడ ♦ మున్కొని రప్డు గిరీంద్రనందనా. ౨౫౪

ఆ॥ ధర్మవిక్రములు స ♦ ధర్మ లీతనయులఁ, గన్నవాఁడె జగతిఁ ♦ గన్నవాఁడు
ధన్యుఁ డతఁత కాఁడు♦ధన్యుల మైతిమిం, దఱుము దరము మీఱు ♦ తత్ప్రసక్తి.

ఉ॥ ముద్దుల మూట లీఘనుల ♦ ముచ్చటమాటలు ధర్మపద్ధతిన్
బద్దులు దిద్దు బాటలు సె ♦ బా సనిపించు గొనాల పేఁటలా
నద్దిర; యుద్ది యూనె యొకఁ ♦ డొదల యెత్తఁగఁ గా దనంగ నే
మెద్దెసఁ గాన మింతవఱ ♦ కింకిటఁ గానఁగఁ బోము భూములన్. ౨౬౦

క॥ బాలు రనికాక త్రిజగ, త్పాలుర పోఁడుములవంకఁ ♦ బన్నెద రగుఁబో
యాలంకాడుచు వంకల, నీలాలిత్యంబు దెలుప ♦ నేలా యింకన్. ౨౬౧

క॥ వీరల సంభాషణముల, ధీరుల మైతిమి ప్రపత్తి ♦ తెలివియుఁ దనరం
గా రాత్రించరకృత్యము, లారా యింతకును గురువు ♦ లన నయ్యెఁగదా. ౨౬౨

తే॥ అని దశగ్రీవవధకాంక్షు ♦ లైన వార, లంద ఱొక్కటఁ బలికి రిం ♦ పారుపలుకు
బడి భరతు రాజశార్దూలుఁ ♦ బ్రస్తుతించి, ప్రస్తుతస్థితి కనురూప ♦ భావ మమర.

చ॥ కొలమునఁ బుట్టినాఁడ వను ♦ కూలుఁడ వన్నిటఁ గోవిదుండ'వి
ద్యాలఘిమవృత్తితోడి దయి ♦ యబ్బె నసం బసమానమే యనన్
వలనగు రామవాక్యవిధి ♦ వర్తిలు మయ్య; నరేంద్రు పల్కుఁ బ్రాఁ
బలుకు నొనర్చుమయ్య; గురు ♦ భక్తి ప్రశస్త గదయ్య; యెయ్యెడన్. ౨౬౪

తే॥ తండ్రిఋణ మీఁగె బలె యగ్రి ♦ తనయుఁ డితఁడు
కైక ఋణమునఁ బోక భూ ♦ కాంతుఁ డరిగె
సురపురంబు సర్వస్వంబు ♦ జూఱకొనఁగ
నుండుమయ్య; యప్పద్ధతు ♦ లొరసి కనుచు. ౨౬౫

క॥ పొచ్చె మొకయింత దొరయని, యచ్చపు నడవడిని మెలఁగి ♦ తలజడిబడి తీ
సచ్చరితము సురలు మునులు, మెచ్చిరి గనఁ గాంచె దింక ♦ మేలిశుభములన్.

తే॥ ఇంతవట్టు వచించి మ ♦ హేచ్ఛు లల్ల, వార లెల్లరుఁ బనివిను ♦ వార లైన
నప్పలుకు చక్కి చక్కటి♦కలరి రాముఁ, డెలయు మోమున నభిపూజ♦నేష్టి నెఱపె.

చ॥ భరతుఁడు ప్రశస్తగాత్రుఁ డయి ♦ పల్కనరింపఁగఁబోవ నుల్కుచున్
గురునకు ద్రోసి లొగ్గి యను ♦ కూలకులోచితధర్మసంగ్రహం
బరయుము నీకుఁ దెల్ప నగు ♦ నంతకు శక్తుఁడనయ్య ; నేను నా
తరమున నైన ప్రార్థితముఁ ♦ దత్పరతం గొనుమంచు వేఁడెదన్. ౨౧౮

ఆ॥ నిన్ను వీడి యొంట ♦ నిగ్రహింపఁగ నేర, నేర మెన్న కెలమి ♦ నెరయఁబ్రోవ
నీవ నేర్తు దేవ♦నీవాఁడ నెమ్మెయి, మేలు గూర్తొ యట్లు♦మెలఁగువాఁడ. ౨౧౯

క॥ తనత ప్పారసి తల్లియుఁ, దనుకుచు యాచింప వచ్చె ♦ దైవత మీవే
నెనరుంచి కావఁగల వని, యనుమతి రూపింపవే కృ ♦ తార్థుఁడ నౌదున్. ౨౨౦

ఆ॥ మనకుఁ గలుగు ప్రకృతి ♦ మండలి పౌరులు, జ్ఞాతు లెల్లప్రజలు ♦ నీతి మెయిన
నిన్ను గోరువారు ♦ నియతిఁగర్షకులు ప, ర్జన్యుఁ బోలె నొందు ♦ జాడఁ గొనక.

క॥ రక్తుల రంజిలఁజేయు వి, రక్తుల విరహితులఁ జేయ ♦ రాణ గలవు నీ
సక్తికి ముజ్జగములునుఁ బ్రి, సక్తిం బరవసముఁ గాంచు ♦ సకలాధీశా. ౨౨౨

క॥ ఇమ్మహనీయము రాజ్యం, బిమ్మున స్థాపింపు మెనసి ♦ యెట్లరసిన నీ
సొమ్మె పరిపాలనం బే, నెమ్మి ఘటింపంగ నైన ♦ నీ కగు నధిపా. ౨౨౩

క॥ అని పాదములం బడి వాఁ, డనునయ మెక్కుడయి తన్నరి ♦ యాశాస్యప్రా
ర్థనమునకు వన్నె వెట్టఁగఁ, బొనరారుటఁ గాంచి రామ ♦ భూవరుఁ డంతన్.

తే॥ తివిచి తొడమీఁద నిడుకొని♦ తీ రెఱింగి
శ్యాము జలజాతపత్రవి ♦ శాలనేత్రు
మత్తహంసస్వరాఢ్యు నా ♦ మహితుఁ గాంచి
యెలమిఁ జెక్కులు పుణుకుచు ♦ నిట్టు లనియె. ౨౨౫

తే॥ సహజవినయాఢ్యయనన్నై ప్ర ♦ శస్తమైన
బుద్ధి నినుఁ బొందె నెందునుఁ ♦ బొరపులేక
దీన నే నెంతుఁ దీర్తుఁ బ్రి ♦ తిజ్ఞఁ బృథివి
నీవు రక్షణ మొనరించు ♦ నెఱిన యనుచు. ౨౨౬

క॥ వత్సా; తావకశక్తి స, ముత్సాహినిఁ జేయ కేల ♦ మురు వడఁచెద వా
దిత్సంగొని వెలయుము ప్రిజ, గత్సంపదఁ గేలఁ దాల్పఁ ♦ గాఁ బోలవొకో.

ఉ॥ మండల మొక్కఁ డిద్దె యను ♦ మాటకె కాదు సమస్తమండలా
ఖండలపూజ్యరాజ్యసమ ♦ ఖండమహోన్నతి కెక్కఁజాలు నీ

నిండుమనంబున స్నిగడు ♦ నిష్ఠితభావకలావిలాసముల్
దండితనంబు పీనిదని ♦ తద్దయుఁ జాలెడు నోయితమ్ముఁడా. ౨౬౮

క॥ ఏలం జాలెద వంతయు, నేల స్మే లనుచుఁ బ్రజలు ♦ నిచ్చలు వొగడన్
నీలావరితనమున నగు, నీలాలిత్యంబు తెలుఁగు ♦ నే నెంతుఁ జుమీ. ౨౬౯

తే॥ నీయమాత్యులు సుహృదులు ♦ నీతిమంతు
లైన మంత్రులు నినుఁ జేరి ♦ యలరుమతుల
నంటి కొలు వొప్పఁ గొలువంగ ♦ నొంటి యునఁగ
నేల పెనుకర్జములు గూర్తు ♦ వెంచికొనుము. ౨౭౦

క॥ చేయింపు మెల్లకృతుల, న్నీయింపును సొంపు నెఱియు ♦ నిర్జరభేరుల్
మ్రోయింప నెగడుగాంచుము, మాయింపుము శోకమోహ ♦ మలమార్గములన్.

తే॥ చంద్రుఁ డెడయఁడు సిరి హిమా ♦ చలము విడువ
దటు హిమాని వేలను దాఁట ♦ దబ్ధి తండ్రి
ప్రతిన నే నుజ్జగింప నీ ♦ ప్రతిభ నింత
యెఱిఁగి వర్తింపుమయ్య నీ ♦ విమ్మ సేరి. ౨౭౧

ఆ॥ ఇచ్చమెయినొ లోభ♦మెనసియో నీకయి, కైక యిటు ఘటించెఁ♦గా దటంచు
మదిఁ దలంప కామె♦మన్నించి నన్నెంచి, మాతృవర్తనమున♦మనిచి మనుము.

క॥ అను కోసలు కన్నియనం, దనుఁ దేజున రవి యనంగఁ ♦ దనరియుఁ జంద్రుం
డనఁగఁ బ్రసాద మొసఁగు వా, నినిఁ గని భరతుండు నీతి ♦ నిరతిం బలికెన్.

—♦ భరతుఁడు శ్రీరామునిఁ బాదుక లొసంగు మని ప్రార్థించుట ♦—

తే॥ ఆర్య; యధిరోహణ మొనర్పు ♦ మమలహేమ
భూషితములు సకలలోక ♦ పూజితములు
నైన పదములఁ బాదుక ♦ లట్టి వగుచు
వెలయ విశ్వజనీన మి ♦ వ్వొర వెఱింగి. ౨౭౩

క॥ యోగవిధి సర్వజగతికి, యోగక్షేమంబు ♦ గూర్చు నోజకు నివియే
యాఁగావుత మివ్వాని ని, యోగము మద్యోగకలన ♦ నొలయుత మింకన్.

ఆ॥ నాతలంపు లెన్ని ♦ ననిచిన జగదేక, నాయకుఁడవు నీదు ♦ నాయఁకరము
నెల్లవలదె యెటులు ♦ నేయింప నెంచితి, వటులె మెలఁగువాఁడ ♦ ననవరతము.

క॥ ఆగోరహితు నొనర్పవె, యోగోత్సర్గాపహరణ; ♦ యుంచుము నెనరం
చాగుణసేవధి వేఁడిన, నాగౌరవ మెంచి రాముఁ ♦ డానందమునన్. ౨౭౭

క॥ ఇమ్మున నెలకొను బలునే, స్తమ్మున బాష్పములు గనుల ◆ జాలుకొనఁగ నే
మమ్మున వానిఁ బొదివి మూ, ర్ధ మ్మాఘ్రాణించి తనదు◆ప్రభుత వెలయఁగన్.

—◆ శ్రీరాముఁడు భరతునకుఁ బాదుక లొసంగుట ◆—

తే॥ పాదుకలయందుఁ దనపాద ◆ పద్మయుగళి
పాదుకొనఁ జేర్చి యమ్మహా ◆ ప్రతిభుఁ డెత్తి
తమ్మున కొసంగెఁ గొని వాఁడు ◆ తనరు భక్తి
నర్చలు ప్రణామములుఁ గూర్చి ◆ యన్నఁ గాంచి. ౨౯౦

క॥ ఈరే డేండ్లు నిటు జటా, చీరధరుఁడనై ప్రపత్తి ◆ సిద్ధాంతమునన్
గూరలు గాయలుఁ దినుచున్, నే రఘువీరా ; వహింతు ◆ నిష్ఠాపరతన్. ౨౯౧

క॥ నీయాగమనముఁ గోరుచు, నీయానతిఁ బూని యొండు ◆ నెలవున రాజ్య
శ్రీ యీపాదుకలందె య, మేయతమై వెలయుచుండ ◆ మెలఁగెద నధిపా.

క॥ పురి నీతోఁ జొర నెంచితి, నిరువు పొరువునం బొనర్చి ◆ యే నుండెదఁ ద్వ
చ్చరణాబ్జము లెంచుచు ని, వ్వరపాదుక లెపుడుఁ గొల్చు ◆ వర్తన మొప్పన్.

క॥ అరిహా ; చతుర్దశాబ్దము, పరిపూర్ణం బైన నాఁటి ◆ పట్టున నీయా
చరణములఁ గానఁ డేనిన్, భరతుం డగ్నిఁ బడుఁ గాని ◆ బ్రదుకఁడు సుమ్మా.

ఆ॥ అనిన నతని మెచ్చి ◆ యట్టులే ఘటియింతు, నయ్య యని ప్రతిజ్ఞ ◆ యాచరించి
యమిత మైన దయ స◆మాలింగితు నొనర్చి, కుఱ్ఱతమ్ముఁ గూడ◆గ్రుచ్చియెత్తి.

క॥ భరతునిఁ గని నీజననిన్, బరిభవయుతఁ జేయ కరసి ◆ పాలింపు మిదే
వర మనుకొని నాపై నా, వరవర్ణినిపైని నొట్టు ◆ వైచితిఁ జుమ్మా. ౨౯౬

క॥ అని గట్టిసేసి రాముఁడు, తనకన్నుల నశ్రువితతి ◆ తొర్కొని మొలయన్
గనలేక కని యనుజుఁ బొ, మ్మనలే క నెఁ బొమ్మటంచు ◆ ననుస్మృతి వెలయన్.

—◆ భరతుఁడు శ్రీరాము ననుజ్ఞఁ గొని పాదుకల వహించి పురి కరుగుట ◆—

ఆ॥ ఆపరితాపవంతుఁ ◆ డాభరతుఁడు రామ, పాదుకల వహించెఁ ◆ బరమధర్మ
మెఱిఁగి పూజసేసె ◆ నెలమి నలంకృతు, ల్దార్చె నతనిఁ జుట్టి ◆ కూర్చె నతులు.

క॥ శత్రుంజయనాగముపై, శత్రుంజయుఁ డిడె మహాప్ర ◆ సాదం బని లో
కత్రాణుఁ డొసఁగినట్టి ప, దత్రాణములనుఁ బ్రసత్తి ◆ తనరారంగన్. ౨౯౯

క॥ అయ్యవసర మెల్లరకు, న్నెయ్యము తియ్యమ్ము గూర్చ ◆ నెలవై నెఱయన్
డయ్యని కోర్కులఁ దొడిఁబడి, రొయ్యారి ; యాపరిసంగ ◆ మొప్పారుఁ గదే.

ఉ॥ రాఘవవంశవర్ధనుఁడు ♦ రామమహీమహిలావిభుం డటుల్
మోఘము గాకయుండఁ దన ♦ ముచ్చట సెల్లఁ బితృప్రియుక్తప
ద్యాఘనసత్యవాక్యులన ♦ నందిన కైకవర మ్మయమ్మునన్
లాఘవముం దొలంచి జన ♦ లాలనము ల్పొనరించుచుండఁగన్. 30౧

తే॥ ఆనుపూర్వ్యంబు వెలయ వి ♦ ద్యాప్రభవుల
గురుల మంత్రిప్రవరుల సా ♦ దరులఁ బ్రజల
నరసి యభినందన మొనర్చి ♦ యరుగఁ జనిచెఁ
గలితధర్ముఁడు ధృతి హిమా ♦ చలముఁ బెరసి. 30౨

ఉ॥ తల్లులు దన్నుఁ బాసిచనఁ ♦ దద్దయు బాష్పగృహీతకంఠులై
చిల్లు లొనర్చు నెవ్వగలఁ ♦ జేడ్పడి యున్న తెఱంగు లెంచి తా
నల్లనఁ జేరి యాయమల ♦ నందఱ నెట్టన పేఁకొల్పె నా
నల్లలితుండు బోధితల ♦ సన్మతులం బొనరించు నేర్పునన్. 303

క॥ వందనము లొనర్చెను శ్రిత, మందారుఁడు వారి కమర ♦ మాన్యుండుఁ దదా
క్రందన మెగువం దాను న, మందార్తిన తిగువ నగుచు ♦ మలసెఁ గుటిలతటిన్.

—♦ కైక రాము నభినందించి పేర్కొనుట ♦—

క॥ అందఱ నామంత్రింపఁగ, నం దద నరసి కని కైక ♦ యటఁ గౌసల్యా
నందనుఁ జేరం జని త, న్నొందిన యావేశ మెడల ♦ నొగి నిట్లనియెన్. 30౫

ఉ॥ తోఁచినయ ట్లొనర్చితిని ♦ దోసము మోసముఁ గల్గునంచు నా
లోచన సేయకే నలిన ♦ లోచన; నీదగు రాజ్యలక్ష్మి నే
నాఁచికొనంగ నౌదు నని ♦ యాఱడి పాలయి చేటుపాటు సం
కోచము నందితిన్ శరణు ♦ గోరితిఁ ద్వత్పదపద్మయుగ్మమున్. 30౬

క॥ క్షమియింపుము నాతప్పిద, మమలమనీషా; మహాత్ము ♦ లగు సాధుజనుల్
క్షమచే గెలుతురు జగముల, క్షముఁడవు నీవుండఁ బెరప్ర♦శంస లిఁకేలా. 30౭

సీ॥ తొలుత నీతత్త్వంబు ♦ వల నెఱుంగమి నింత, సేసితి దౌరాత్మ్య ♦ చేష్టితంబు
నారాయణుఁడవు స ♦ నాతనుండ వటంచుఁ, బదఁపడి తెలియంగఁ♦బడితి విష్ణు
భవదీయమాయచే ♦ బ్రహ్మాదులును బద్ధు, లౌదు రనంగ న ♦ న్ననఁగ నేల
యస్వతంత్రంబ యి ♦ య్యఖిలప్రపంచంబు, నీకుఁ గైవస మయి ♦ నెగడుకతన
బొమ్మలాడించువాని నే ♦ ర్పునన కాదె, యాడు నవి యవియెల్ల నే ♦ నట్టులైతి
దేవకార్యార్థ మీ వరు♦ వెంచి యొందుఁ, ద్రోవ తలఁద్రిప్పి యాడింపఁ♦దొడరినంత.

క॥ ఓపిన నీమాయయె బహు, రూపిణి నర్తకియ కాఁగ ♦ రూఢి తనర న
న్నాపమనస్కుం జేసి న, మూపన్న నొనర్చె నిట్టి ♦ యాచరణమునన్. ౩౦౯
తే॥ దేవతలకేని నొక్కటఁ ♦ దెలియఁగుపడని, నీప్రసాదంబు నాకబ్బె ♦ నటియు పొసఁగె
నయ్యె నీ కిదె వందనం ♦ బాచరింతు, నన్ను బ్రోవుము లక్ష్మీస ♦ నాథ; సదయ.
క॥ భవదేకజ్ఞానాసిఁ బ్ర, నవభూవిత్తాదిపాశ ♦ సంయమము ససం
భవముగ నెడలింపుమయా, శివంకరాత్మీయనామ ♦ శ్రీరఘురామా. ౩౧౧
క॥ రక్షింపుము రక్షింపుము, రక్షాచణచరణ శరణు ♦ రాజీవాక్షా
యక్షాధివాహసఖ నా, పక్షము నీవ యగు మెల్ల ♦ పాపములెడలన్. ౩౧౨
క॥ మును నీజనని ననునొక, మనమున మానింతు వనుచు ♦ మనన మొనర్తున్
దనుఁ గ్రమ్మె నింత కీతమ, మనువెనయన యింక నెట్టు ♦ లన నేమి యగున్.
ఆ॥ నీదు మేలు విన్న ♦ నెఱిన యుప్పొంగితి, నన్న చెడితి నవల ♦ ననువుగాని
తలఁపు వొడమనేమి ♦ తాఱుమాఱుగ నొంటి, దెలుపనేమి నడత ♦ కలిమి సడల.
క॥ ఆడుతనమె చెడుతలఁపుల, యాడంబరములకు మూల ♦ మఱి యాసాసల్
పాడించు పాటలకుఁ జొరఁ, బాడి యెడలకున్నె యవలఁ ♦ బరవస మొదవన్.
ఆ॥ ఇంత లెన్నఁ బోకు ♦ మేను నీ వనఁబోకు, మన్ని యెఱుఁగువాఁడ ♦ వన్నమాత్రఁ
గన్నతండ్రి; నీదు ♦ కాలఁ జుట్టిన పాము, నైతి నింక నెట్టు ♦ లాదరింతొ. ౩౧౬
క॥ ఆయెం బోయె న్న న్నిఁక, నేయిరవున మను మటంచు ♦ నెఱిఁగించెదవో
నీయానతిమై మెలఁగెద, నాయఘ మడఁపఁగదె బరువు ♦ నాయదె యనుచున్.

—♦ శ్రీరాముఁడు కైక నూఱడించి వీడ్కొలుపుట ♦—

క॥ అని వేఁడు కైకఁ జిఱున, వ్వొనయఁ గనుంగొని నిజంబె ♦ యెఱిఁగి పలికితే
ననిపించితి నీవాణిన్, ఘనమై నెలకొన్న దేవ ♦ కార్యము నడుపన్. ౩౧౮
ఆ॥ నీ కఘంబు లేదు ♦ నిర్మలాత్మిక వీవు, తల్లి; పురికిఁ బొమ్ము ♦ తలఁపు మెపుడు
నన్ను విగతబంధ ♦ నాడీకవై మోక్ష, మందఁ గలవు భక్తి ♦ ననుసరించి. ౩౧౯
మ॥ సమవృత్తిం గొనియుందు నెందుఁ దనకే ♦ సౌహార్దముల్ విద్వేష
త్త్వము నొప్పారదు సారభూజము క్రియం ♦ దార్కొంచుఁ బేర్కొన్న ని
ర్మముల న్భక్తులఁ బ్రోతు, న న్ననెద ర ♦ మ్మా; ప్రాకృతు ల్సంసృతి
భ్రమణం బీతని కొల్ల కల్లె యనుచున్ ♦ భ్రాంతత్వసంక్రాంతులై. ౩౨౦
క॥ ప్రంబును మోహం బెడఁప న, ఘంబుల కది మూల మగుటఁ ♦ గడకొని యవి యా
డంబరము నూప నరులా, లంబ మెడలువారు వాఁక ♦ లం బడు పురుపుల్.

కం॥ నీ వట్టితరము దానవు, గా వెన్నఁగఁ గాంచఁ గంటి ♦ కారణభవమున్
నీవలన ముజ్జగంబులు, నావగలం దొఱఁగి పడయు ♦ నఖిలార్థములున్. ౩౨౨

చ॥ సురలు జగమ్ముల న్మనుచు ♦ చొప్పున నెవ్వరి దేనివెంట నే
వరుస మెలంగఁ జేయుదురొ ♦ వారక వారి కశేషసంపదల్
పరఁగ ఘటింతు రాపయినిఁ ♦ బాప మడంతురుఁ గాక చిత్తవో
వరు నిజ మింతవట్టు మదిఁ ♦ బాదుకొనం బొనరింపు మెప్పుడున్. ౩౨౩

కం॥ తా నొనరించిన తప్పిద, మానయమున నరసి కాంచి ♦ యలజడిఁ బడి యి
ట్లేనాఁడుఁ జేయ ననువాఁ, డేనఃపుంజమ్ము వంక ♦ కెనయఁడు మీఁదన్. ౩౨౪

ఆ॥ మేలు గంటి జనని ♦ మేకొంటి మద్గోచ, రంబు జ్ఞాన మిటు ది ♦ రంబుగాఁగ
నిదె స్మరింపుచుండు ♦ మింట ని న్నెట్టిక, ర్మములుఁ జుట్ట విఁకఁ బ్ర ♦ మాద మెడయు.

ఆ॥ అనఁ బ్రబుద్ధ యగుచు ♦ నమ్మాత వలగొని, వచ్చి నతు లొనర్చి ♦ వనరుహాక్షు
వలను గనుచు నరిగె ♦ వాలాయ మీతని, కరుణఁ బడయఁ గొఱఁతె ♦ గలదె యనుచు.

కం॥ రఘునాథుని పాదుకల న, లఘుండు భరతుం డిదే క ♦ లాసర్వస్వం
బఘహార మని కొని శిరమున, మఘవద్వినుతుండు దాల్చె ♦ మహిలామణిరో.

కం॥ నాగముపై నునిచియుఁ బు, న్నాగము వాఁ డవలఁ దివిచి ♦ నయమున సిరికిం
బ్రాగవలంబం బని కొను, నాగౌరవ మొప్పె మిగుల ♦ నగరాజసుతా. ౩౨౮

ఆ॥ కుశల మరయు తమ్ము ♦ కుత్తితో వ్యాప్తుఁడై, రథముఁ బుష్యరథము ♦ రాజు నట్టు
లెక్క పాదుకలకు ♦ నెన్నియో రాజోప, చారము ల్ప్రసక్తి ♦ జరిపె నపుడు.

చ॥ గురుఁ డటు వామదేవుఁడును ♦ గూర్చి ద్విజోత్తములున్ సుమంత్రులున్
బురు డనరాని మంత్రమునఁ ♦ బూజితులై తనకన్నమున్న స
త్వరముగఁ బో ననీకినియుఁ ♦ దద్దయుఁ బ్రీతి ననుక్రమింప నా
భరతవిభుం డటం దరలెఁ ♦ బ్రాఙ్ముఖుఁడై చరితార్థతాధృతిన్. ౩౩౦

ఆ॥ అల్ల చిత్రకూట ♦ మభిరామవాసమ్ము, రామనృహరి కనుచు ♦ రహిఁ బ్రదక్షి
ణం బొనర్చుచునె న ♦ యంబునఁ దత్కూట, వివిధరమ్యవస్తు ♦ వితతిఁ గనుచు.

ఉ॥ ధాతుసహస్రము ల్బహువి ♦ ధంబులు పుణ్యపదంబు లాత్తసీ
తాతరుణీకరామపద ♦ దర్శనలాభకరాస్పదంబు లు
ర్వీతలభూషణాయితని ♦ విష్టవిశిష్టలతాతరూత్కర
స్ఫీతరమావిహారసర ♦ సీవరశీకరము ల్గణించుచున్. ౩౩౧

క॥ అనుగతతత్పార్శ్వంబున, ననుమందాకినిగ రమ్య ♦ మగు మార్గమునన్
జనెను భరద్వాజాశ్రమ,మును గనుఁగొనెఁ జేరి మ్రొక్కె ♦ మునియంఘ్రులకున్.

—♦ భరతుఁడు భరద్వాజునకు రామదర్శనవృత్తాంతం బెఱింగించుట ♦—

ఆ॥ ప్రథితహర్షుఁడై భ ♦ రద్వాజముని వానిఁ, గాంచి యిట్టు లనియెఁ ♦ గన్నతండ్రి;
కలిగె నయ్య రాముఁ ♦ గల్యాణధాముఁ బ్ర, పత్తిమీఱఁ గొలుచు ♦ భాగ్యగరిమ.

క॥ కృతకృత్యుఁడ వైతే న, త్కృతు లందెనె యశము గంటె ♦ కేవలమే నీ
మతిమత్ప్రయత్న మయ్యది, వితాకుగాదుగద దెలుప ♦ వే నా కనుడున్. ౩౩౭

క॥ విని భ్రాతృవత్సలుం డ, మ్ముని వాత్సల్యంపు పెంపు ♦ మురు వారసి నె
మ్మన మానందామృతఝర, మున మునుఁగం దేలియాడ ♦ మునుకొను వేడ్కన్.

ఆ॥ వాఁడు నొడివె మౌని ♦ వర్య; నేను గురుండు, ననుచు వారుఁ బ్రార్థ ♦ నం బొనర్చి
యడిగినార మయ్య; ♦ యారాఘవేంద్రుని, నెంతయునుఁ బ్రసక్తి ♦ యెసక మెసఁగ.

సీ॥ ఆసత్యసంకల్పుఁ ♦ డందఱ నూఱార్చి, యానందమున మించి ♦ యాదరించి
కొలుచు నాపైఁ గేలు ♦ వెలయించి గురువశిష్ఠునితోడ ననె నైజ ♦ సూక్తి నెగడఁ
దండ్రిప్రతిజ్ఞ య ♦ ద్దాని నేపాలింతుఁ, దత్త్వం బదియ కాఁగఁ ♦ దనరవలయు
నాపదునాలుగేం ♦ డ్లోపి చరించి యా, వల వత్తు మీపల్కు ♦ వలను గూర్ప
నింత నిజమటంచు ♦ నెన్నియేనియు మార్లు, బలుకఁ బలుకనేర్చు ♦ వలఁతి తపిసి
వాక్యకుశలుఁ గూర్చి ♦ వ్రాయుచ్చియును గానఁ, డన్య మర్థ మొక్కఁ ♦ డధిగమింప.

క॥ అన్న పదములం బడి నా, కన్నయ్యవు నీవె కావఁ ♦ గదె యపరాధం
బెన్నకె కొనవే యంటిని, సన్నుతు లొనరించితినిఁ బ్ర ♦ సన్నతఁ బడయన్. ౩౩౮

తే॥ పలుకుపలుకునఁ దేనియ ♦ లొలుకఁ జేయు
రాము నాలుక దొలిబల్కు ♦ రాణ నెగడు
గాని యొండొక్కఁడైన య ♦ క్కలన కెగువ
దేమనఁగవచ్చు నయ్య య ♦ య్యాశ్వరేచ్ఛ. ౩౪౦

ఉ॥ ఆదట నే గురూత్తముని ♦ యానతి సేకొని వేఁడుకొంటి నీ
పాదుక లీగదయ్య; పరి ♦ పాలనముం బొనరింప మాకు వి
ద్యోదయమున్ ఘటింప నెటి ♦ యోగము క్షేమము నెల్లవేళ నా
మోదముఁ గూర్చు నవ్విధులు ♦ మున్కొను నయ్యవె యంచు నర్థినై. ౩౪౧

క॥ దంట పదత్రాణము లా, వెంటనె పదములకుఁ దొడిగి ♦ విడిచి యొసంగెన్
గొం కెందు లేని చూడ్కులు, తంటా లెల్లం దొలంపఁ ♦ దనపైఁ దొరలన్.

తే॥ అంతట ననుజ్ఞఁ గొని సైన్య♦మనుగమింపఁ, దరలివచ్చితి గురులతోఁ♦బురికిఁ జేర
మంగళాలయాంచిత మిదె♦మహితు పాద, పాదుకాయుగ మధిరా♦భరితమనిన.

క॥ భరతు శుభోదితముఁ దపో, నిరతుఁడు మునివరుఁడు విని వి ♦ నేయుఁ దతనితో
సరసశుభతరకలాపి, స్ఫురితంబుగ నిట్టులనెఁ బ్ర♦ఫుల్లాబ్జముఖి. ౩౮౪

—♦ భరద్వాజముని భరతుం బ్రశంసించుట ♦—

మ॥ అరయం బ్రాంచితశీలవృత్తినియమా ♦ వ్యాపన్న మార్గాప్త యో
నరశార్దూల ; త్వదీయ మన్వయము ని ♦ మ్నవ్యాప్త మౌ నీర మ
ట్లిర వొందె న్సగుణోచ్చ మివ్విధము నీ ♦ యిచ్చ న్సృభు ల్మెచ్చ న
బ్బుర మేదీ ; మది సంతసించితిని నీ ♦ పుణ్యం బగణ్యంబుగాన్. ౩౮౫

ఆ॥ కొలము సిరికిఁ దగిన ♦ కూటమే చెప్పఁడే, నందు నీవు మేటి వనఁగఁ ♦ దనరి
తెవఁడు తెలియఁగు గాంచు ♦ నీవిషమపరీక్ష, మూడుదార్ల నెడరు ♦ ముట్టికొనఁగ.

తే॥ అమృతుఁడై యున్నవాఁడు మ ♦ హా భుజుండు
ధర్మతత్పరుఁ డైన య ♦ ద్దశరథవిభుఁ
డేయనన్యాదృశున కైత ♦ నీదృశుఁడవు
పుత్రుఁడవు ధర్మవేత్తవు ♦ పూజితుఁడవు. ౩౮౬

క॥ బాధించితి వగుదోసఁగుల, సాధించితి సాధువృత్తి ♦ సకలజగముల్
నీధర్మము వెలసెను దం, డ్రి ; ధన్యుఁడ వుక్తసూక్త ♦ రీతి నెఱపుమా. ౩౮౭

—♦ భరతుఁడు భరద్వాజమునీంద్రుని యనుజ్ఞం గొని యయోధ్యకుఁ జేరుట ♦—

చ॥ అనెడు మహాత్ముఁ డమ్మునికి ♦ నంజలి గూర్చి ప్రదక్షిణక్రమం
బునుఁ బొనరించి మ్రొక్కి తన ♦ పుణ్యఫలమ్ము గణించి సత్తపో
ధనవర యాన తీవె త్వరి ♦ తంబె చనన్వలెఁ బాదుకాభిషే
చన మొనరింపఁగావలె వి ♦ చక్షుణులం గొని నేఁటిపాద్రినన్. ౩౮౮

సీ॥ అని యంఘ్రియుగ మంటి♦యాడిన యన్మడి,కలరియమ్మునిచంద్రుఁ♦డాజ్ఞ సేయఁ
దనమహాసేనతోఁ♦దరలి మేలి విమాన,ములునాగములు హయ♦ములునుఁబొనర
గురువశిష్ఠాదులుఁ♦గూర్చు మంత్రులుఁ బుర,స్కృతు లౌచు రాఁబుణ్య♦కీర్తి వెలయ
యమున దాఁటి శుభోద♦యను గంగ సేవించి, శృంగిబేరపురమ్ము♦సేరి చెలఁగి

యచటు వీడ్కొని చని యయో♦ధ్య న్నిరస్త,విభఁ బిత్రృభ్రాతృవర్జిత♦వినిహతశుభఁ
గాంచి కన్నీరునించి యా♦ఘనుఁడు తనదు, యంతఁ గనుఁగొని యిట్లనె♦నబ్జవదన.

శా॥ కంటే సారథి సారథీ; పురి నిరా ♦ కార న్నిరానంద నే
వెంటం దీనత దోఁప హీనరవమై ♦ విధ్వస్తసౌభాగ్యమై
యింటింటన్ శుభలక్షణంబు లెడలన్ ♦ హేరాళమౌ దుఃఖమున్
గొంటుం జూపెడు నింక నన్యఫలము ♦ ల్గోరంగ శక్యంబులే. ౩౫౧

వ॥ అని యిట్లు నొడువుచు నప్పురుషవరేణ్యుండు స్నిగ్ధగంభీరనినాదంబగు స్యందనంబున మహాయశోనిదానంబులగు ప్రసాదదానంబులం దనరారుచు సత్వరంబుగాఁ బురోపకంఠంబుం గ్రమించి పురిం బ్రవేశించి యులూకబిడాలాది ప్రచారంబు పెనుపార సమాలీనవరవారణమై యప్రకాశ యగుచుఁ దిమిరాభ్యాహతయగు కృష్ణపక్షనిశీథినిం బోలి శ్రీప్రజ్వలితప్రభ యయ్యు నభ్యర్థితగ్రహపీడితమై యొక్కటి చొక్కు మ్మొడలి యున్న రాహుశత్రుప్రియపత్ని యగు రోహిణియుని యెన్నందగి కొంచెమై వేఁడిమి గొని కలఁక పాటి యొప్పుసెడిన నీటితో వేసవి దాడిం బడి బడలి వెడలనేరక సారంగంబులందూఱు విహంగంబులతో నడఁగి మడఁగి యడుగువట్టిన జలజంతువులతో నుపలక్షిత యగు గిరినిర్ఝరిణి ననుకరించి పొగలేక పసిండివెలుంగుతో వెలువడి దధ్యాదిప్రకృతహవిరభ్యుక్షితమై కడంగి బెడంగువాసిన యధ్వరప్రవర్గ్యాగ్నిజ్వాల లీలం గనుపట్టినదై బలుకయ్యంబున జోడు రెడల నేనుంగులు గుఱ్ఱంబులు దేరులు సిడంబులుం దెరల హతప్రవీరమై సమాపన్నయగు సేన దీనభావంబును స్వానుభావంబున ననుసంధానించి నుఱుంగు మెఱుంగులతో నెలుంగు తెఱంగులతో నింగిపుణుకు నెఱిం గదలి యెదురుదాఁక వీఁక యుడివోవ నిరస్తరవమై పొనుపడిన మహాసాగరజలోర్మికర్మిలిచుట్టంబై సుత్యాసమయంబు వినిర్వృత్తంబుగా నభిరూపులైన యాజకులరుగ యజ్ఞాయుధంబు లవజ్ఞానోపథంబులు గాఁగ విగతనాద యగు వేదిక మీఁది కథకుం బాత్రీభూతమై గోవృషపరిత్యక్తమై వివిక్తంబగు గోష్ఠమధ్యంబున నుండి యార్తి మునింగి నవనవం బగు తృణంబునేనియుఁ జర్వణం బొనరింపక యౌత్సుక్యంబునకుం బ్రాపై చూపట్టు గోపత్ని యుపపత్తిత్రోఁడి ప్రత్యాసత్తిం గని సుస్నిగ్ధంబులు నుజ్జ్వలంబులు నుత్తమంబులు జాత్యంబులు నైన పద్మరాగాది ప్రసిద్ధరత్నమణులచే వియుక్త యగు నవముక్తావళి యంకపాళి నవలీలంగొని పుణ్యక్షయంబున స్వస్థానంబున నుండి కదలి చ్యుతమై క్షితితలంబునం బడి యుపసంహృతద్యుతివిస్తార యగు తారయు నాయంతలే కాక వేఱగునా యని మోర ద్రిప్పి గ్రీష్మాగమంబునం బుష్పనద్ధయు మత్తభ్రమరనాదితయు నై కడంగి తీవ్రదావాగ్ని బారి కింతలంతలై క్లాంతమైన కాంతారప్రాంతరలత భాతి నలఁతం జెంది నివృత్తజనసంచారమార్గయు సంకుచిత విపణాపణయునై జలధర

వ్యాప్తయుఁ బ్రచ్ఛన్నశశినక్షత్రయు నగు ద్యోస్థలి దుస్థత్వంబునకుం జాలుపడి పానోత్తమవిహీనమై శరావశకలంబు లందంద గాన్పింప నిరావరణయు నసం స్కృతయు నపహాతమత్తజనయు నగుచుం బాడుకట్టు పానభూమి భూమికి నేమంబు నామున నాముకొని నెఱియలు వాఱి క్రుంగి కంగారుపడిన బెట్టనేల నెట్టన నెరసిన మట్టికుండల పెంకుల యుంకువలు దోఁప నుపయుక్తపూర్వో దకమై యనుపయుక్త యగుట సకలయు వికలయు కానైన ప్రపాశాలిక పోలిక కేలికమై పెద్దయుం బాడవై లావైన యావైఖరిం బురికొని గిఱికొను శరస్ఫూ లగు నరుల యరికోలలం జెగి సింగాణిం దొఱంగి జ్యాతలంబున వ్రాలిన జ్యా వల్లిక యట్లల్లిక సెడి ఫోరికలని వలనెఱింగిన సాని యామోదిమై యేదియో త్రోవ నడిపింప సాం పెడలి మోపు గింపి తెంపునేసి వీడఁబడి దుర్బలత్వంబు సారఁబాఱం బాఱు కిశోరిబారి కగ్గమై మేలు పెనుమీలు మేటి తామేటులు నండగొని యుండ నిండియున్న నీ రెండిపోవఁ గట్టలుం గట్టెడలి కూలఁ దోవ దమ్మివిరుల సిరు లురల నోపిక వాసి యున్న వాపికకుం బ్రాపుదాపు గానంగ నేనే యనంగనై మేలు గడవ పొడ వడఁగి సడలి సంతసం బెడలి కడువగ నొగిలి పొగులు మగని మగసిరి వగసెడం జెడి యిమ్ములు సొమ్ములు వ్రాఁతలు పూఁతలు లేని మానిసిమానిని మేని సింగారమ్ము వమ్మై పోకడ నాకడ నీకడనే కదా యనుచు జాలిపడం జాలినదై దట్టంబైన నట్టనడిమి వానకారున మొగి ళ్ళలో దూఱునెడం బయిపయి నీలజీమూతంబులుం గప్ప నప్పట్టున మూఁతవడి యుదిలంబున నొదుఁగు బాస్కరుని యభాస్వర యగు ప్రభకుం బాసటమై వేసటపాటున నున్నతి దఱఁగి తఱవడుచున్న యన్నగరిం జేరిపై నిలిచి తేఱి చూచుచుం జనుచుండి శ్రీమంతుండగు భరతుండు సామంతుండగు నిజసారథితో మరల నిట్లనియె. 352

—♦ భరతుఁ డయోధ్యం గూర్చి వ్యసనపడుట ♦—

సీ॥ సంగీతవాద్యని ♦ స్వనములు వినరావు, లే దెందు మదగంధ ♦ లేశమేని
ధూపవాసన లంచుఁ♦దోఁపవు సుమమాల్య, సౌరభం బెచ్చోట ♦ జాలుకొనదు
గజబృంహితంబుల ♦ కలనలు పొడకట్ట, వశ్వసన్నాహంబు ♦ లరయఁబడవు
సలలితయానప్ర ♦ చారము ల్గనుపట్ట, వటు విలాసగమంబు ♦ లను వెనయవు

నవనవాలంకృతుల చొప్పు ♦ ననుచు మెప్పు
లాదరము లుత్సవములు సౌ ♦ హార్దరమలు
సాధుసత్కారములు మేలి ♦ సరసవచన
రచనలును గొట్టువడెఁబో పు ♦ రంబునందు. 353

క॥ గంధిల యీస్థలి యిటు ని, ర్గంధయకా గంధసార ♦ కర్పూరరమా
బంధురతఁ బాసి గతపు, ష్పంధయ ప్లుష్ట వని వోలెఁ ♦ బాడ్పడె నకటా. ౩౫౪

ఉ॥ సుందరు లెందు మందిరము ♦ చోటుల గోటు లెలర్పఁ దీర్పలం
బొందిక లొప్ప నేర్పడమి ♦ భూపుల తీపులు సూపు చారముల్
మందము లౌట మందురల ♦ మావులు మ్రాన్పడుటన్ బురంబు సా
క్రందన మైన చందమునఁ ♦ గన్పడుచున్నది విన్నవోవుచున్. ౩౫౫

క॥ అరదముల రాకపోకలు, కరదనృప శ్రీవిశేష ♦ కలనలుఁ బురి సుం
దరతరుణభోగభాగ్య, స్ఫురణలుఁ బోఁ బోయె దీని ♦ పోలు పలుపంబై. ౩౫౬

క॥ ఆత్రమున నుడుకుచు బహి, ర్యాత్రలకుం బోరు భోగు ♦ లనువు సెడి పురిన్
సత్రాస లుపవనశ్రీ, లత్రాంతరమున నె ధ్వస్త ♦ లై పోడ వెడలెన్. ౩౫౭

క॥ స్నాతానులిప్తు లంచితు, లాతతసుమమాల్యభూష ♦ ణాంబరవరణుల్
పూతచరిత్రులు పౌరు ల, నేతాదృశు లిపుడు దోఁప ♦ రిటు నటుఁ బురిలోన్.

ఆ॥ రాజవీధు లెల్ల ♦ రాజిల్ల వోచెల్ల, యీ యయోధ్య యోధ్య ♦ యే యనంగ
నయ్యో నయ్యో వోవ ♦ నన్న ప్రవాసంబు, పేరు పెట్టె దీని ♦ పెనువు దోలఁప.

తే॥ నాథుఁ డడవికిఁ జనిన యీ ♦ నాఁటఁ గోలె
రామ యను నోటి కెందు వి ♦ రామ మంచు
లేదు కనుఁగవ వికసించు ♦ లీల లెంచఁ
గాదు మతి వగ నుడిగించు ♦ గతికిఁ బోదు. ౩౬౦

క॥ ఇటు లైన నగరి కింకిటఁ, బటిమతయుఁ గలదె యుదిల ♦ పా టొకఁ డని కా
కటవికిఁ జివికిన దీనికిఁ, గటా విభేదంబు దలఁపఁ ♦ గాఁ గన్పడునే. ౩౬౧

తే॥ అహహ నాయన్నతోడనే♦యడవిఁ బెరసె, దీని సౌభాగ్యమన వింత♦తీరు గలదె
సన్న సాసార శుక్లప♦క్షక్షప యన, నిది యసార యగుచు ద్యుతి♦కెడముపడఁగ.

ఆ॥ ఎపుడు పురికిఁ జేరు♦నేమో మహోత్సవం, బో యనంగ నాస♦హోదరుండు
హృష్ట యౌనొ యెన్నఁ♦డిది మండువేసవి, నంబుదంబుఁ గనిన♦యవని యగుచు.

క॥ తరుణులు నరు లిందఱు సుం, దర వేషులు గాఁగ దరము ♦ తరము సెడఁగ నం
తర మెడల రాముఁ గనఁ బో, సరభసు లగు టెపుడొ యే మొ♦జతపడ దెడఁదన్.

తే॥ అనుచు వగచుచు రాజవీ♦థ్యంతరంబు,సొచ్చి నిర్వేదపడుచు న♦చ్చోటు గాంచి
ననుచు వేస మొయారంపు♦నడకసన్న,గలుగు జన మెన్నఁదోఁప ది♦క్కాలమనుచు.

క॥ నైక తనుఁ గనుట యింతటి, కౌశల మన నయ్యెఁ గాక ♦ యటు గాని యెడన్
శ్రీకల్యాణపరంపర, లేకాకృతి దీనిఁ జెరసి ♦ యెలయవె యనుచున్. 318

—♦ భరతుఁడు పితృగృహంబు సేరంజనుట ♦—

ఆ॥ పోయెఁ బోయె నాదు ♦ పుట్టున నిద్దాని, తీ రటంచుఁ దన్ను ♦ దిట్టికొనుచు
సింహహీనమగుచు ♦ జెడిన కందర మట్లు, దండ్రి మందిరంబు ♦ దఱియఁ జెరసె.

ఉ॥ కన్నుల నీరు నించె మునుఁ ♦ గానమె యంతిపురి న్నిరస్తమై
యున్నది వేల్పు లెల్లఁ జన ♦ నుష్ణకరుం డటు గాఢధాటి నే
ల న్నెఱియంగ నత్రి తన ♦ లావెనయింపని యంతలోన పే
రెన్నఁగ రాని యద్దివస ♦ మెంచుచు నిప్పు డటంచు దీనుఁడై. 319

ఆ॥ అందుఁ జొచ్చి తల్లు ♦ లందఱ నచ్చోట, నునిచి శోకమునకు ♦ నుమగర యని
లే దటంచు నొక్క ♦ లీల నెక్కొని దృఢ, వ్రతుఁడు గురులఁ గాంచి ♦ వాఁడు పలికె.

క॥ ఇం దుండ కిపుడ పోయెద, నందిగ్రామమున కచటు ♦ నన్ గురువిరహా
ప్తిం దిర మగు వగ నీఁగెద, నందఱకుం దెలుపుచుంటి ♦ ననుమతి నిఁడుఁడా. 320

క॥ ఈదుఃఖ మిచట నున్నం, బోదు దరిద్రాణుఁ డితని ♦ పోరువు విడిచి త
న్నాదమఱచి యున్న జనము, నేదారిన యేనిఁ బూని ♦ యెఱయింపనిదే. 321

ఆ॥ తండ్రి దివికిఁ జనియెఁ ♦ దద్దయు గురుఁ డినుఁ, డన్న రాముఁ డడవి ♦ నధివసించె
నతఁడు వచ్చునంత ♦ కచ్చోట నుండి వ్ర, తీక్షణం బొనర్చి ♦ యెలయువాఁడ.

క॥ రాముఁడె రాజ్యార్హుం డవు, నామహిపుఁడె పూజ్యుఁ డటు మ ♦ హాయశుఁడునుఁ ద
న్నామస్మరణ మొనర్చుచు, నేమమ్మున నిలిచి కాంతు ♦ నెఱిఁ గుశలమ్మున్.

క॥ ఆమయములఁ దొలఁపఁగ రఘు, రామపదస్మృతి వసుంధ ♦ రాతలమునఁ జే
రామికె మెయిఁ గయికొన్నది, నా మే లరయకె తెరల్చు ♦ నా; న న్ననుచున్.

ఆ॥ తన్మయత్వ మొప్పఁ ♦ దత్పరుం డాతండు, రాముఁ దవులు మదిని ♦ రామయతఁ బొ
సంగె నితఁడపో య ♦ సంగప్రసంగను, సంగరుం డటంచు ♦ జనులు వొగడ.

క॥ అమలుఁడు భరతుని శుభవా, క్యము శ్లాఘ్యము విని మహాత్ము ♦ లా సద్ద్విజులున్
సుమహితులు మంత్రులును నను, పముఁ డగు గురువరుఁడు నిట్లు ♦ పలికిరి గాక్రి.

ఉ॥ మిక్కిలి మేలివృత్త మిదె ♦ మేకొనవా పలు కియ్యదే సుమీ
చక్కనిమార్గ మెంచితివి ♦ చాలితి వన్నిట భ్రాతృభక్తి నీ
వెక్కటి గాంటి శ్రేయ మిటు ♦ లింతయు నీకె తగున్ జగత్త్రయిన్
దక్కగొనంగ నేర్చితివి ♦ తద్దయుఁ బున్నెము పండి పాల్పడన్. 322

క॥ బంధుప్రీతివిధానధు, రంధరతన్ భ్రాతృచరణ ♦ రాజీవకలా
బంధురపుష్పంధయత సు, ధాంధులు మే లనఁగ నెగడి ♦ తయ్యా జగములన్.

క॥ ఆర్యవరుఁడవై యిమ్మెయి, కార్యం బూహించి తెలుపఁ ♦ గా దిటు లని యౌ
దార్యం బెన్నకె పలుకు క, దర్యం డోకఁ డున్నె వాని ♦ దశ మే లగునే. ౩౬౯

క॥ అని ప్రియముగ నభిలషితం, బనువొందఁగ వారు వలుక ♦ నటు సారథిఁ గ
న్గొని నాదు రథము సజ్జం, బొనర్చికొని తెమ్ము తడయ ♦ కోయి యనుటయున్.

—♦ భరతుఁడు ప్రకృతులతో నందిగ్రామమున కరుగుట ♦—

తే॥ వాఁడు నాక్షణమునఁ గొని♦వచ్చి నిలుప, నంతరంగంబు హృష్టమై♦యతిశయిల్ల
నందఱకు మ్రొక్కి తల్లుల♦ననుమతింపఁ, జేసి పూజించి వీడ్కొని♦చెలఁగు ధృతిని.

క॥ తే రెక్కెను శత్రుఘ్నుఁడు, నారూఢిం దన రె నట్టు ♦ లందరు మంత్రుల్
ధీరులు పురోహితులు సము, దారులు ద్విజవరులుఁ దోన ♦ తరలిరి ప్రీతిన్.

క॥ గురులు వసిష్ఠముఖులు త, త్పరులై కొని రగ్ని గతినిఁ ♦ బ్రాఙ్ముఖు లగుచున్
సరభసులై యెల్లరు నరి, గిరి నందిగ్రామమునకుఁ ♦ గీర్తితు లగుచున్. ౩౭౩

తే॥ మఱి యనాహూత మగుచునే ♦ మమునఁ గదిసె
బలము చతురంగ మతఁ డున్న ♦ పట్టె మాఱు
ననుచుఁ బౌరవరేణ్యులు ♦ ననుచు ప్రీతి
చెలఁగఁ జనఁ గాంచి యచ్చోటు ♦ సేరఁ గనిరి. ౩౭౪

మ॥ భరతుం డయ్యరదంబున న్నిలిచె సా ♦ భ్రాతృంబునం బాదుకల్
శిరమం దొప్పఁగ మోచికొంచుఁ జనె నా ♦ సిద్ధార్థుఁ డప్పేటికిన్
ద్వరమాణుం డయి డిగ్గె డగ్గరియె వి ♦ ద్యాశాలి సచ్ఛీలురన్
గురుల న్గాంచి వచించె ని ట్లనుచు ది ♦ క్కూలంకషాంచద్యశా. ౩౭౫

తే॥ ప్రాజ్య మీరాజ్యమును నాదు ♦ భ్రాత తనదు
సిరి వెలయ నుంచె మేలి ని ♦ క్షేపముగను
బాలన మొనర్చుచుండంగఁ ♦ బనిచె నన్ను
నేనును దదాజ్ఞ సెల్లించి ♦ నెగడువాఁడ. ౩౭౬

ఆ॥ మంగళాస్పదమ్ము♦మహనీయ మీపద, త్రాణయుగ మొసంగె♦దయితుఁ డెలమి
దొలఁక నాదు గొడవ♦దలఁచి తలఁకుఁ బాచి, యాచనకత సుఫల♦మందఁ జేయ.

క॥ యోగక్షేమకరము లివి, శ్రీగణ్యము లెల్లఁ దామె ♦ చేయం జాలున్
గాగలుగు పనులు నెఱపుచు, నాగౌరవమున మెలంగ ♦ నగుదుం జుండీ. ౩౭౮

క॥ అని చరణత్రాణములం, దన యూదల నవరణంబు ♦ తగ మన్నన ల
ర్చనలును సమకూర్చుచు ని, ట్లనె వెండియు ముఖ్యప్రముఖ ♦ పై ప్రకృతులతోన్.
తే॥ ఆతపత్రంబుఁ బట్టుఁ డో ♦ యయ్యలార;
యార్య పాదంబు లివె యని ♦ యరయు మతిని
వీవనలు వైవ నెంచుఁడు ♦ విశ్వపాల
నంబు విధి నిల్చె నేఁ డీద్వ ♦ యంబునందు. ౩౮౦
క॥ ఇదె నిర్మల మవు ధర్మం, బిదె శర్మదమౌ సుకర్మ ♦ మిదె పావన మి
య్యదె సుండు మోక్షమార్గము. పదరక గై కొండు దీని ♦ భద్రాత్ములరై.
క॥ నానాథుఁడు నాయెడఁ గల, శ్రీనందిత మైన పెరిమఁ ♦ జేర్చిన కాకే
నా నెఱికిఁ జాల నై నం, దాన నమ్ముఁగాత నాదు ♦ తలఁ పెనసి ధృతిన్. ౩౮౨
క॥ ఈపున్నెంబుల ప్రోవులు, ప్రాపై నాపాపచయముఁ ♦ బాపఁ దదేక
త్వాపాదితాత్మవృత్తిన్, మాపును రేపును భజింతు ♦ మంజులకలనన్. ౩౮౩
మ॥ సుకృతంబుల్ఫలియింప సద్గురువచ ♦ స్సూక్తుల్ప్రసాదింప వా
రక వేల్పుల్కరుణింప విఘ్నవితతుల్ ♦ రారావు సాలింప మా
మకభాగ్యోదయ మార్తరక్షకుఁడు రా ♦ మశ్రీరమారాముఁ డా
మికమై నామెత వెట్టఁడే తరలి నా ♦ మేల్గాంచు కీ లెంచుచున్. ౩౮౪
సీ॥ పాలనం బొనరింతుఁ ♦ బ్రభురాకకై ప్రతి, పాలనం బరఁగు దృ ♦ క్ప్రతిభ దనర
మేలుగాఁ గూర్తు సా ♦ మి పదంబులకు జగ, మేలుఁగా కని వీని ♦ వీ లెఱింగి
ప్రాలి మ్రొక్కెదసిరి♦ప్రోలు నీయవిగొమ్ము,ప్రాలి మ్రొక్కెడమన్న♦వాఁడ;యనుచు
లీలమైఁ దగువృత్తి ♦ లెంకనై కొందు న, లీలమై తద్దృష్టి ♦ జాల మొలయ
నమ్మహానుభావుఁ ♦ డభిషిక్తుఁ డయ్యె నం, చలరు జనత నెంచి ♦ యతనిఁ గాంచి
మించి సంతసించి ♦ మేకొందు రాజ్యంబు, కంటె నాల్గురెట్లు ♦ గలుగు ఫలము.
క॥ పాపము లెల్లఁ దలంగఁగ, నాపున్నెము లటు ఫలించి ♦ ననుచు తఱి నిదే
ప్రాపని చేరి కొలుతు విభు, నాపాదాంబుజయుగమ్ము ♦ నంచితభక్తిన్. ౩౮౬
క॥ అని నొడువుచుఁ గడుదీనత, తనుఁ బొదువఁగ గీర్తిశాలి ♦ దాశరథి మహా
జను లెల్లఁ బొగడ మంత్రులఁ, గొని ప్రజల భరింప నియ్య ♦ కొనె శుభశీలా.
ఆ॥ వల్కలాజినములు ♦ వట్టి జడలు దాల్చి, మునులు మెచ్చు శీల ♦ మునఁ దనర్చి
బలము బలసి కొలువఁ♦బరఁగె నందిగ్రామ, మునను రాజ్యతంత్ర♦మును వహించి.
ఉ॥ రాముని రాక వేచి యభి ♦ రామము చిత్తము రామదత్తమై
నేమమున న్మెలంగ వ్రత ♦ నిష్ఠతఁ దద్వచనానుకారియై
యామహితాత్ముఁ డుండెఁ గల ♦ యన్ని ప్రతిజ్ఞలఁ దీర్ప వీఁడె పో
యీమహిఁ బుట్టెనంచు జను ♦ లెల్ల సుర ల్మునులు న్నుతింపఁగన్. ౩౮౮

—♦ పాదుకాపట్టాభిషేకము ♦—

ఆ॥ మంగళాచరణము ♦ మహితమంగళవాద్య
కలన లొలయఁ గెలనఁ ♦ గలయఁ బెరసి
మునులు స్వస్తి యనుచు ♦ మొనయింపఁ దనయింప
తనివుఁ బెనుపఁ దనరెఁ ♦ దరణికులుఁడు. ౮౦౦

క॥ శుభసంవిధాన మొప్పఁగ, విభునామస్మరణకృతి యు ♦ వేలగుణోల్లా
సభవనమై నెగడొందఁగ, నభియుక్తుఁడు నెఱపె నమ్మహాభ్యుదయమ్ముల్. ౮౦౧

ఆ॥ మంత్రపూతములుగ ♦ మహనీయజలములు, సేర్చి యర్చనము లొ♦నర్చి కడఁగి
సవిధిమంత్రకల్ప ♦ సంకల్పకల్పన, ల్పొనర ద్విజవిశిష్ట ♦ పూజ లొనర. ౮౦౨

ఆ॥ పాదుకల కొనర్చెఁ ♦ బట్టాభిషేకంబు, తా నిమిత్తమాత్ర ♦ తను వహించి
జయము జయమటంచు♦జయఘోషణలు భూమి, సారవాద్యతతుల♦చక్కి నిగుడ.

సీ॥ అభిషేక మొనరించె ♦ నాపాదుకల రాజ్య, సింహాసనంబునఁ ♦ జేర్చి ప్రీతిఁ
బువ్వులఁ బూజించె ♦ భూషణమ్ములు పెట్టి, లాలితాకృతిగ న ♦ లంకరించి
యాలవట్టంబుల ♦ ననువొందఁ గూర్చెఁ జే, చేత వీవన వైచు ♦ సిరిఁ దనర్చి
యెల్లవారల సేవ ♦ లెనయించె నాప్రొద్దు, విజ్ఞాపనము లందె ♦ వెలయఁ జేసి
యేయుపాయనములు వచ్చు♦నేమి రాజ్య,తంత్రమున మంత్రయోగము♦ల్దారసిల్లు
నవి నివేదించు రామున♦కల్లె కట్టు,మెయిఁ బదత్రాణములకున♦మ్మిహిరకులుఁడు.

ఉ॥ పుణ్యచరిత్ర లౌ సతులు ♦ పొలఁగ సేసలు చల్ల సన్మునుల్
గుణ్య మగణ్య మీవిభుని ♦ కూరిమి నేరిమి యంచు మెచ్చ షా
డ్గుణ్యవిధాన మందు మయి ♦ కోలు వధానము తీర్పొనర్ప సా
ద్గుణ్యముఁ గాంచెఁ వాఁ డటు పొ ♦ సంగెఁ బ్రసంగము ముజ్జగంబులన్. ౮౦౫

క॥ సర్వముఁ దదధీనం బని, గర్వం బింతయును లేక ♦ ఘనరాజ్యధురా
నిర్వహణంబునఁ దనరె న, నర్వాచీనుఁ డితఁ డంచు♦నందఱుఁ బొగడన్. ౮౦౬

ఉ॥ రామపరాయణత్వమున ♦ రంజిలుచున్ మఱచెం దదన్య ము
ద్దాముఁడు వాఁడు కృత్యములు ♦ దద్దయు దీర్చును వార్చు సంధ్యలన్
నేమము మీఱ రాజ్యహిత ♦ నిష్ఠ మెలంగును బెద్దలన్ యశ
శ్శ్రీమతమై భజించును వి ♦ చిత్రచరిత్రుఁడు నాఁ జెలంగుచున్. ౮౦౭

సీ॥ కదిసె రాముండు శృం♦గారధాముఁ డటంచుఁ,జెలఁగి యొక్కతఱి మే♦ల్సిరిఁదలిర్చు
నవె జానకీజాని ♦ యడుగుగెందామర, లనుచు నొకప్పు డా♦ టాడఁ జొచ్చుఁ
గలిగె నాథుని కటా♦క్షము లంచు నొకవేళ,నుబ్బి తబ్బిబ్బు చె♦య్యులనొనర్చుఁ
బొనరెఁ దన్ముఖశశి♦స్ఫురణ లం చొకమాఱు,దృక్చకోరికల సం♦తృప్తిఁగూర్చుఁ

చొక్కు నొక్కెడ నొకపరి సోలు మేలి, పాట పాడు నొక్కొకసారి భజననృత్త
గీతవాదిత్రముఖ్యము ల్గెలుకొలుపుఁ, బరవసము దన్నుఁ బొదువ నా భరతవిభుఁడు.

ఆ॥ క్షోణిపాలనమునఁ గొఱఁత యొక్కించుకయు, లేమి కలుగ దటు ప్రమాద మెందుఁ
దానఁ బ్రజలు రామదర్శనౌత్సుక్యంబు, దలఁకు మిగుల నుండ్రు తత్పరతను.

క॥ లెక్కించును వనవాసపుఁ, దక్కిన దినములను ధృతికిఁ దార్కొనఁ గలఁగున్
మిక్కుట మీగడు వని మదిఁ, జొక్కుఁ దదాగమపథమునఁ జూడ్కులు నిగుడన్.

ఆ॥ తనదు పారవశ్య దశ యొక్కఁడే తక్క, నన్య మెద్ది నాయ మాచరించు
సంగరంబు పేరిసాగరంబు గ్రమింపఁ, జేయు రాముఁ గాంచుసిరి ఘటింప.

క॥ దాఁటెను భవాబ్ధిఁ గోట, న్మీఁటెనుఁ గలుషోత్కరమ్ము మించెను జగతిన్
సాటికి రాఁ డొక్కఁడు ని, మ్మేటికి నన వాఁ డసమ్ము మిన్నులు ముట్టన్.

ఆ॥ పడఁతి యిదియ సుమ్ము పాదుకాపట్టాభి, షేక మనఁగ దీనిఁ జేర్చి మదిని
మనుజు లెలమి మించి మననం బొనర్చిన, నభ్యుదయసమృద్ధి నందఁగలరు.

క॥ అని గిరిశుం డెఱిఁగించిన, వనజాయతనేత్రి గిరిజ వరుగాథాలిం
గనతుష్టుఁ జేసి వెసఁ ద, క్కిన కథ వినిపింపుఁ మనుచుఁ గీర్తించుటయున్.

మ॥ సకలేశత్వనివిష్టపాదుక మహాసామ్రాజ్యసంపన్న ని
ర్వికలత్వాఢ్య మునీంద్రనందితగుణ శ్రీనిత్య సత్యాత్మ స
ర్వకలాశోభన సంప్రసాదనచణా ప్రావీణ్యపారీణదు
ష్టకదర్థీకరణస్వతంత్రభరణ స్ఫాయత్కటాక్షేక్షణా. ౪౧౫

క॥ మహితారణ్యనివాస, ప్రహితానల్పప్రచార బహుగుణమునిహృ
ద్విహితాత్మతత్త్వకలనా, నిహితానామయవిచార నిర్ణయసారా. ౪౧౬

మాలిని॥ వికృతిరహితచిత్తా విశ్వసంవేశవేత్తా
ప్రకృతిమహితసూక్తా పావితాత్మీయభక్తా
నికృతదితిజశస్త్రా నిర్వృతిశ్వాసశాస్త్రా
సుకృతవరదహస్తా శుద్ధయోగప్రశస్తా. ౪౧౭

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబున నవమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము.

## అయోధ్యాకాండము.

:o:

## దశమాశ్వాసము.

o



చిత్రకూటగమవిగ
మాచిత్రితభావిభావ ♦ నాంచితహృదయా
సాచివ్యకలితమున్యఘ
మోచనలీలావిధాఽవి ♦ ముక్తారిజయా. ౧

ఆ॥ అవధరింపు మభవ్రు ♦ డబలతో నిట్లనె, ననుజు నట్లు దేర్చి ♦ యనిచి రాముఁ
డచటి మునుల సభయ♦మాత్మనైక్య మూహించె,దనమనమ్ము వింత♦దారి సూప.

క॥ శ్రీనాథజమహాసీంద్రుని, యానతి చొప్పున వసించె ♦ నమరాద్రికి జో
డౌ నిదియనఁ దనరారెడు, నానగమున నంతవఱకు ♦ నవహితుఁ డగుచున్. 3

క॥ అయ్యాశ్రమస్థలంబున, వెయ్యాఱులు సుగుణములు వి ♦ వేచించి మదిన్
డయ్యఁగనీ కనుజునితోఁ, దొయ్యలితో నుండె నవవి ♦ ధుండితఁడనఁగన్. ౪

ఆ మునులు గోష్ఠి మొనసి♦ముచ్చట లొనరింప, నెందుఁ గొఱఁత లేక♦యినకులుండు
నిలిచె నంతవట్టు ♦ నిర్మలాత్ముల కిట్టి, చోటు గూర్చు నఖిల ♦ శుభములనుచు.

క॥ వింతలు లే వేనాఁడును, సంతస మధికము తపస్వి ♦ సాన్నిధ్యము వే
వంతు లిడు గుణోత్కర్షము, మంతన మే నెతెని నిర్మ ♦ మత్వమె చూపున్. ౬

ఆ॥ అట్టు లుండి యుండి♦యమ్మహాభాగుండు, నాఁటి క్రొత్త లరసి♦నాయ మొరసి
వెలయు తనదు మదిని♦ వేడబంబెద్దియో, డటమె ననెడు వృత్తి ♦ పొటమరింప.

క॥ ఆగిరివనమున మును దన, తో గతి యనుకొనెడు మునుల♦తోడి బాటు మెయిన్
సాగి కనుతీరు నెలవున, వేగిరపడు తెఱఁగు నెఱుఁగు ♦ విధము నరయుచున్.

మ॥ కనుబొమ్మ ల్ముడివెట్టి ఱెప్ప లెగువం ♦ గా శంకమై దిక్కులన్
గనుచున్ వ్రేలిడి తన్నుఁ జూపుచుఁ బొరిన్ ♦ గాథావిరాధప్రతుల్
గనుపట్టం బచరించు పల్కుబడు లే ♦ కాంతంబు లక్షించి రా
మనరేంద్రుం డిది యేమి వచ్చిపడెనో ♦ మా కంచు నైకాస్థితిన్.

క॥ ఒకయమికులపతి సన్నిధి, నకలంకుం డాతఁ డెనయ ♦ నంజ లిడుచుఁ బో
యి కృతాంజలియై యడుగూ, నక యిట్లని పలుకఁ గొడరె ♦ నాకీమణికో.

—♦ శ్రీరాముఁడు మునులతోఁ బలికి ముచ్చటించుట ♦—

సీ॥ భగవంతులరు మీరు ♦ ప్రాజ్ఞులు దపసు లం, చున్నార మిట్టెడ ♦ నుచితవృత్తి
నండదండలకు నై♦యాస గొంటిమ కాని, యన్నెమ్ముఁ బున్నెమ్ము♦నరయబోము
తాపసాశ్రమ మెల్లఁ ♦ దల్లడిల్లంగ నో, నీవికారమునకు ♦ హేతు వెదియొ
నాపూర్వవృత్తంబు ♦ నయహీన మయ్యెనో, యేప్రమాదంబున ♦ నేని నిపుడు
మదనుజుండు లోక ♦ మాన్యుఁడే యనఁగ నే, మయ్యె నెట్టి నేర ♦ మాచరించి
నాడొ యననురీతిఁ ♦ గీడు సూపఁగ రాజె, యొంటి కొంటికర్జ ♦ మూర్జితమ్ము.

క॥ నాయెడఁ దగుశుశ్రూషల, నేయెడ నెడమీక నెఱప ♦ నెంచుచు నొంటం
బాయక భవదీయార్చల, నాయున్నతిఁ గూర్చుచుండు ♦ నవనీసుతయున్. ౧౨

ఆ॥ ఆపెవలన నెట్టి ♦ దయ్యె నో దోసంబు, మోస మెదియు మదికి♦మొనయఁగాల
దయ్యె ; తియ్యదనము♦నందిన నీనుడి, నందఁజేయు మదియు♦నదియు నరసి. ౧౩

—♦ ఒకవృద్ధముని రామునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

చ॥ అనినఁ దపస్సమాధి జర ♦ నందిన వృద్ధుఁ డొకండు వేపమా
నుని తెఱఁగెల్ల నుల్లసిల ♦ నూతనశక్తినిఁ జక్కటి న్వచిం
చెను మునిపాలు ని న్నిఖిల ♦ చేతనజాలదయావిశాలునిన్
ఘనతరశత్రువర్గలయ ♦ కాలునిఁ గన్గొని భావ మొప్పఁగన్. ౧౪

క॥ లోకావననిపుణా ; నీ, ప్రాకటయశ మిటు ధరిత్రిఁ ♦ బ్రాకెడుచుండన్
తేకెత్తిచనక దోషము, లాకరణిఁ బ్రమాదములు న ♦ హంయుతఁ గానునే. ౧౫

ఆ॥ నీవు సత్యమతివి ♦ నిర్మలాత్ముఁడవు ని, న్బోలువాఁడె పుణ్య♦పురుషుఁ డనుచుఁ
డతిపవిత్రచరితుఁ ♦ డనఘాత్మిక త్వదీయ, ధర్మపత్ని ధర్మ ♦ మర్మవేత్త్రి. ౧౬

శా॥ కల్యాణాంచితమూర్తి లోకహితకృ ♦ త్కల్యాణసౌశీల్యసా
కల్యోల్లాసిని సద్గుణాకరల స ♦ త్కల్యోచితశ్రీక సా
ఫల్యోద్యద్దయ భూజ జానకి మహా ♦ ప్రావీణ్యనిర్ధోషితా
హల్యా ; నీసతి వీరిపట్ల నన నే ♦ లా ; యొడ్లకీ డెంచునే. ౧౭

తే॥ చలన మింతయుఁ గాన మా ♦ సాధ్వియందుఁ
బోల వేపాపములును మీ ♦ పొంతఁ జేరఁ
గాని యొక్కండు పొడమె ని ♦ క్కాలమునను
నిన్ను గూర్చినదే యది ♦ నిక్కవముగ. ౧౮

క॥ అన్నా ; యేమని చెప్పుదు, నన్నాళీకభవు కల్ప ♦ నాధికకల్పం
బిన్నాఁటికి నీపొత్తున, మన్నారము మనఁగ నీదు ♦ మ మ్మిటు లింకన్. ౧౯

క॥ ఆయె నెది యాయుదంత మ, జేయా ; తెలిపెదను వినుము ♦ సిద్ధాశ్రమసం
స్త్యాయమున నీ వాకండ్లకుఁ, జేయీక పొనర్చి నట్టి ♦ చెయిది మొదలుగన్.

ఉ॥ నీ విటఁ జేరినాడ వని ♦ నిక్కుచు రక్కసు లుక్కు మీఱి దు
ర్భావత మౌనివర్యుల కు ♦ పద్రవము ల్సమకూర్చుచున్నవా
రావిధమెల్ల నొండొరుల ♦ కయ్యలు దెల్పికొనంగఁ జేరి నేఁ
డావిలభావ ముట్టిపడ ♦ నాడెడు పాడెడు గోడు లిన్నియున్. ౨౧

సీ॥ పరఁగు రావణుని సో♦దరుఁ డొండు ఖరుఁ డంచు, వానిఁబోల్పఁగనైన♦వారుఁగొంద
అలజనస్థానంబు ♦ నందుఁ జేరిరి దానఁ, గలవారి నొండొండఁ ♦ గసిమసంగి
ధార్ష్ట్యంబు జితకాశి♦తయుఁ దమసొమ్ము లం, చఱచుచుందురు నిచ్చ♦లడిచిపడుచు
నెఱవ లెవ్వారికేని ♦ వింతగా దఘ మనఁ, గూళ లాపురుషాద ♦ కులకు నెందు

పాపములు క్రూరములును భీ♦భత్సములును, భీషణములును నైకవి♦భిన్నములును
నైన రూపులు దాల్చి మా♦కందఱకును, భయముఁ బుట్టించుచున్నారు♦పార్థివేంద్ర.

క॥ అందు ఖరుఁడు కడు దుష్టుఁ డ, మందాహవముల సురాసు♦రావళి నైనన్
గ్రిందుకొని మడఁప నోపును, గ్రిందుపడఁ డొకడ్డయేని♦గెఱికొను బలిమిన్. ౨౩

క॥ తమ్ములు తోడై మొనయఁగ, మ మ్మలమట పెట్టుటకును ♦ మర్దించుటకున్
గ్రమ్మి విహరించుచుండుఁ ద, ల మ్మిది తమయది యటంచు♦లావు మెఱయఁగన్.

క॥ వీరన వారన నేరము, నేరము వివరింప వారి ♦ నిర్గమ మెందున్
దారే యనన్నై తోఁచెద, గారేయుఁబవలునా క ♦ హాంకృతి వెలయన్. ౨౫

ఆ॥ ఎదురుపడిరయేని ♦ నెడయఁబో రప్రశ, స్తము లమేధ్యములునుఁ ♦ దార్చి క్రియలు
పాడు సేసి కాని ♦ పాల్పడు తపసులఁ, జంపి కాని సంప్రి ♦ సాదమహిత. ౨౬

క॥ నిన్నెని లెక్కసేయరు, కన్నయ్యా ; వారి కతలు ♦ గల వెన్నియు యే
మన్న నొగిలింతు రెల్లును, మన్నన సెడు టొకఁడ కాక ♦ మతి లే దెదియున్.

మ॥ అవలీనత్వము నొంది యుందు రెపుడున్ ♦ వ్యాసక్తులై కానలం
దవలీలం దలమెత్తువారిఁ గొని పా ♦ య ల్సేసి భక్షింతు ర
య్యవలేపంబున నుబ్బి యాడుదు రపా ♦ యం బెందు నేనాఁడు నొం
డవలేశంబునుఁ గల్గఁ బోవ దను ధై ♦ ర్యం బొంటుఁ బ్రేరేపఁగన్. ౨౮

క॥ పున్నెపుఁగర్మము లనఁగా, నన్నన్నా ; వారి కాట ♦ లగు నవి యెల్లన్
మున్నె చొరఁబాఱి మెదుపుదు, రన్నష్టాశులు సనిష్ఠు ♦ లసురుసురుపడన్. ౨౯

ఉ॥ వ్రిక్కలుసేసి నైచెదరు ♦ వారక స్రుక్కులు మున్నుగాఁగ నా
చక్కటిసాధనంబు లవి ♦ శంకతమై హవిరాజ్యముఖ్యముల్
మెక్కెద రగ్ను లార్చెదరు ♦ మెట్టి విదిర్చెద రెల్లపాత్రిలం
దక్కినవారి వేఁపెదరు ♦ తద్దయు నధ్వర మన్న దానవుల్. 30

క॥ శాలల గాల్పఁగఁ గీర్తివి, శాలల నాద్గుణ్యారూప ♦ సంపత్కలనా
శీలల బాలలఁ గొనిచన, వాలాయము వెఱపు లేదు ♦ వారల కధిపా. 3౧

తే॥ దుష్టబుద్ధులు దనుజులు ♦ దూషణమ్ము, లెన్నియుఁ బొనర్తు రింక నిం ♦ దున్న ననుచు
నన్ను దొలఁచుచు నున్నారు ♦ ననుచు వారు, నేర్చి యొందేనిఁ జని మన ♦ నిశ్చయించి.

క॥ ఈమెయిఁ దపస్విజనహిం, సామయము లుపద్రవములు ♦ సాగుచునుండం
గా మానుఁ డనెడు నుడికి, న్నామొగ మోటపడెనయ్య; ♦ నందితచరితా. 33

చ॥ సహగుణయోగ మెంచికొని ♦ సద్గతి మించెద మంచు నీదరిన్
సుహితులమై మెలంగితిమి ♦ చొప్పడ దింకిటఁ దొంటివైన యా
బహుఫలమూల మాశ్రమముఁ ♦ బాల్కొనఁగాఁ జన నెంచినార మీ
యహమున నీకుఁ దెల్పు నెరి ♦ కల్కొద రిందఱు నాన పైకొనన్. 3౪

క॥ అతిదూర మిచటి కది సం, గతమై యుండు నది యొంటఁ ♦ గలుగ దపాయం
బతులితగుణరూపకలా, యుతు నిను వీడంగ నగుట ♦ యొక కొఱ దక్కన్. 3౫

క॥ వత్సలుఁడ వీవు నీదరి, సత్సంగతి మనెద మనెడు ♦ జాడ దొరసి సం
పత్సామగ్రిం బెరసి వి, పత్సాపేక్షయది గాఁగఁ ♦ బాయన వలసెన్. ౩౮

తే॥ సావలేపులయ్యసురులు♦సావధాను,లర యగుచునుంట లెస్స మీ♦లావునెఱయ
నిచ్చ గలదేని మాతోడ ♦ నేగుఁ డేర, మీరలును సమకట్టుఁ డి ♦ మ్మేళమెంచి.

క॥ పరు లట్టు లుండఁగా ము, ష్కరుఁ డా ఖరు డొండె కీడు ♦ గావించెడు వాఁ
డరయఁగ సుకళత్రున కి, య్యిరవునఁ జరియింపఁబోల ♦ దినకులతిలకా. ౩౯

ఆ॥ కష్టమయ్య; యిట్టి ♦ కానలో వసియించు, టతిసమగ్రమగుఁడ ♦ వైన నాడు
గాక యెందుఁ బోవఁ♦గా నెంచవో ప్రమా, దంబు దేహి కొంటఁ♦దారసిలదొ.

క॥ మచ్చులు మాయలు నెపుడ, మ్ముచ్చులపాలిటివ యెట్లొ♦మోస మొదవుఁగా
కచ్చెనఁటుల చెంగట నిల, వచ్చునె నినుబోంట్ల కార్య ♦ వర్ణితచరితా. ౪౦

శా॥ ఆలోచింపుము లోకలోచనకులి ♦ నా; యర్థ మెబ్బంగిగాన్
మేలో; మేలగు కీర్తి కేది నెలవో ♦ మేకొంటగా దొంటఁ దా
వేల న్మీఱునె సాగరంబు రవి యే ♦ వేళం బ్రవర్తింపఁడే
వాలాయం బటు నీచరిత్ర మెపుడు ♦ న్వర్ణింపఁగాఁ బోలదే. ౪౧

—♦ ఆశ్రమమును లన్యదేశంబున కేగ రాముఁ డచ్చోట నిల్చి యాలోచించుట ♦—

క॥ అని నొడివెడు మునిఁ గని య, మ్మనువంశవిభూషణుండు ♦ మలఁచెడు గతికిన్
దనుకం డుత్తరవాక్యము, లని నిర్బంధించి కానఁ ♦ డభిమతసృతికిన్. ౪౨

క॥ ఆ రాముని గాంభీర్యం, బారాదుపహితమె యొడ్ల ♦ కని కులపతి వి
స్ఫారాంచితనేత్రాంచలుఁ, డై రాజిలు నితఁడ యనుచు ♦ నబ్బురపడుచున్. ౪౩

క॥ అభినందించి విభుని ముని, విభుఁ డొప్పించి చనె నెలవు ♦ విడిచి క్రొలముతో
నభము శుభము నరయకె త, ద్విభక్తమై నెమ్మనంబు ♦ వేగిరపడఁగన్. ౪౪

శా॥ ఆదేశంబున నున్న మౌనులు స్వకీ ♦ యాదేశ మర్థించి యొం
డౌ దేశంబున కేగుచుండఁ గడు నె ♦ య్యం బొప్ప నవ్వారి కా
మోదం బుప్పతిలంగ మే ల్నుడులు కే ♦ ల్మోడ్పు లక్కృతిం గూర్చి నిః
ఖేదుం డర్థ మెఱింగి చేరె నెల వు ♦ తృష్టాత్మధర్మార్థియై. ౪౫

తే॥ ఋషులు లేకున్న యచ్చో టిఁ♦కేటి కనక,నిలిచె నమ్మేటి తొల్లింటి♦నేమ మొప్ప
నాఁటి కవ్వారు తనపొత్తు♦న న్మెలంగి,గౌనము లెనయించిపడయున♦క్షూర్తు లెంచి.

ఉ॥ ఆదట రాముఁ డెంచె నిటు ♦ లంచితు లమ్మును లేగ నెమ్మదిన్
మోదము పుట్ట దిచ్చోటున ♦ మున్నటు లుండఁగ నింతెకాక నా

సోదరుఁ డాగుణాద్భుతుఁడు ♦ క్షోభితుఁడై పనిపూని వచ్చి సం
వాద మొనర్చు నత్త్రెఱఁగు ♦ పొల్పుడుఁ గన్గొలఁ గట్టినట్లుగన్. ౪౭

క॥ గురు లంబలు మంత్రులు నా, గరులుం దో డగుచు నుండఁ ♦ గల్యాణగుణుం
డరలేక చుట్టి నను౯ ద, త్పరతం బ్రార్థించు రీతి ♦ పాయుద మెడఁదన్. ౪౮

మ॥ అనుశోకింపుచు నుండఁజాల నిచటన్ ♦ వ్యాసద్ధసైన్యోపమ
ర్దనహాస్త్యశ్వకరీషదోషముల ♦ సంపంగాంచుటం దొంటిచా
ట్లను మోదంబు ఘొసంగ దింకిటఁ బరం ♦ బౌ కానసం బెంచి పా
వనవృత్తిం జరియింతు మేలరయు న ♦ వ్యాసక్తిఁ బాటింపుచున్. ౪౯

క॥ అనిశము జనసంబాధము, పెనుపొందిన దిచటినాముఁ ♦ జేస్త్రం బాసిల్
జనపదవాసులు నను౯ గను, మనమునఁ జనుదెంచి యొంటు ♦ మలఁగకయుంటన్.

తే॥ దండకారణ్యవాసంబె♦తద్దయుఁ దగి,యుండు నం దొందు కర్జ మ♦ట్లూహ నెనసి
యుంట మేకొంటమేలింక♦నోజఁ దొల్త,నత్రిమునిఁగాంచి యవ్వల♦నరయువాఁడ.

—♦ శ్రీరాముఁ డత్రిముని యాశ్రమంబున కరుగుట ♦—

క॥ అని నిశ్చయించి రాముఁడు, జనకజతో ననుజుతోడ ♦ సంగతుఁడై యొ
య్యనఁ జని కనె నత్రిమహా, మునియాశ్రమపదము భువన ♦ మోహనమూర్తి.

ఉ॥ సందడి లేక సర్వబుతు ♦ సంగతి జోకకు మోక వుట్టఁగా
నెందును దీనిఁ బోలునది ♦ యేదియుఁ గా దను లీలఁ గాలనై
నందనముంచి చైత్రరథ ♦ నాలిక నేలిక నెంచి మించి శ్రీ
మందిర మో యనన్ ధరణి ♦ మండన మో యన మెప్పు లొప్పఁగన్. ౫౩

క॥ ఒప్పులకుప్ప యనం దగు, నప్పరమతపస్వివాస ♦ మందంగని శ్రీ
లొప్పరికింపక సిగుడఁ గ, కుప్పతిసంప్రాప్త్యఁ డానఁ ♦ గొని చొచ్చె ధృతిన్. ౫౪

ఆ॥ శాఖితతుల మేలి ♦ సంబరంబుల డంబు, పరిమళంబుతోడి ♦ పరిమళంబు
పంబు ద్విజవితతుల ♦ పదసూక్తికలనాక్ర, మంబు నంబుజజు ప ♦ దం బిది యన.

క॥ ఆలించుచు నన్నెలవున, మే లెంచుచు మిహిరకులుఁడు ♦ మిహిరాంశుముఖిన్
దేలించు సూక్తివైఖరి, లాలించుచుఁ దమ్మునితో వ ♦ లను గాంచు నెడన్. ౫౬

ఆ॥ తఱిసి నిలిచి తబిసి ♦ దరిసెనం బర్థించి, తెలుపఁ దెలుపువారి ♦ తేట లెంచి
మించి వారి నుడులు ♦ మేకొని తమ్మాద, రించి పిలువ నంత ♦ సించు చరిగి.

సీ॥ తపము బీరము క్షాంతిఁ ♦ దక్కొన్న శాంతితో, నెరసి పారమ్యంబు ♦ నిర్ణయింపఁ
జందురుఁ గన్న యా ♦ చక్కని కనుదోయి, కూర్మిమై నెనరులఁ ♦ గుమ్మరింపఁ

నగుమోము చెలు వొప్ప ♦ ననుచు సౌజన్యంబు, పాల్పోసి సత్క్రాంతిఁ ♦ బ్రబలఁజేయ
జరఁ దోలి నిజసేవ ♦ సలిపెడు వృద్ధత్వ, మఖిలపూజ్యత్వమ్ము ♦ ననుగణింప
యమనియమముఖ్యములు మూర్తు ♦ లందఁ గాంచి
శిష్యు లట్టులు వరివస్య ♦ సేయుచుండఁ
దనరు నా బ్రహ్మతేజంబు ♦ తపసిఁ జేరి
పే రిరవుఁ జెప్పి రాముండు ♦ ప్రీతి నెఱిఁగె. ౫౮

క॥ ఆయుభయం బగు తేజం, బాయున్నతితోడ నొకట ♦ నై పరఁగిన దీ
ర్ఘాయువులు గాంచి పొంగిరి, స్వీయము భాగ్య మితరులకుఁ ♦ జేకుర దనుచున్.

ఆ॥ అధిపు నాన దండ ♦ కారణ్యమున నుండఁ, దలఁచినాఁడ నీదు ♦ దర్శనమున
నట్టె ధన్యతముఁడ ♦ నైతి నన్ రాపట్టి, పలుకు లెంచి నృహరి ♦ భావ ముంచి.

క॥ భగవంతుం డమ్ముని యు, వ్వగఁ గొమతో ననుజుతోడ ♦ వందన మిడు నా
భగవంతుని రామునిఁ బు, త్రుగతిం జేకొనియె నిత్య ♦ తోషా యోషా. ౬౧

ఆ॥ అత్రిధాత్రి మేద్యుఁ ♦ డఖిలలోకాధారుఁ, డట్లు మున్ను పుత్రుఁ ♦ డయ్యెఁ గడఁగి
యేలువాఁడ యగుచు ♦ నేతెంచె ని ట్లని, మంతనంబు మెచ్చ ♦ మమత హెచ్చ.

— అత్రిమహాముని శ్రీరామప్రభృతులం బూజించుట —

ఉ॥ పున్నెము లెన్నుచు న్నిఖిల ♦ భూతహితాభిరతుండు నిత్యసం
పన్నుని రామునిం దనదు ♦ పాడికి నీడుగ సత్కరించి పూ
జ న్నెఱపెన్ స్వయంకృతియె ♦ జా నగు నం చభిమాన మొప్ప నా
యన్నలమిన్న సీత నటు ♦ లాదట లక్ష్మణు నాదరించుచున్. ౬౩

తే॥ మునులపాలిఁటి భాగ్యమే ♦ మొనసె నిట్టు
లాత్మమూర్తి సోదరుఁ గొని ♦ యసముఁ బెనుప
నింతెకాక యిమ్మాతయు ♦ నేగుదెంచె
బాపురే యను ముని పల్కు ♦ బడుల నెంచి. ౬౪

క॥ పండెను బుణ్య మనుచుఁ దన, నిండారెడు మదిఁ దపస్వి ♦ నీమానిత లో
నుండి మమత్వం బొరయన్, దండితనము మెఱయ మేలి ♦ తగ నటు నెఱయన్.

ఉ॥ ముప్పురు మూర్తులం గనిన ♦ ముచ్చట హెచ్చిన సచ్చరిత్ర దా
దవ్వులనుండి చేరఁజనెఁ ♦ దత్పరత న్మునిపత్ని మాని యా
యవ్వఁ బురస్కరించుచు మ ♦ హామతి సీతనుఁ జేతఁ జూపుచున్
మవ్వము మీఱ నిట్లనె సు ♦ మాళమునం దులకించు సంచునన్. ౬౬

తే॥ ఓమహాభాగ; యన ♦ సూయ; యోతపస్వి, నీవశంసము; సద్ధర్మ ♦ నిరత; నిరతి
మీవు పోనరించుతపములే♦యిన్ని సూపె,గంటిచే భాగధేయన్ము♦కలన లిపియు.

క॥ ఈయమఁ బ్రతిగ్రహించి మ, హాయనుచియమూర్తిసార ♦ మర్పింపుము భ
ద్రాయిత తపస్విజనతా, శ్రేయః కల్పలతనుమల్లి ♦ సిద్ధము సుమ్మీ. ౬౮

ఆ॥ అనుచు ముచ్చటించి ♦ యనఘుఁ డశేషధ, ర్మజ్ఞుఁ డఖిలయోగ ♦ మర్మవిదుఁడు
పలికె జనకజాతఁ ♦ బావనాత్మక సీతఁ, గాంచి భావిభావ ♦ మెంచి మించి. ౬౯

క॥ వత్సా; ప్రతిబోధించెద, వాత్సల్యము పొదవఁ బార ♦ వశ్యముకలిమిన్
దిత్స యొదవ నిదికి నిచ్చి, కిత్సవలనె ప్రీతిలబ్ధి ♦ కృతిత గాదే. ౭౦

మ॥ అదె కైకొ మ్మరవిందనేత్ర; సుముఖ ♦ మహా భాగ్య మాధన్మనం
పద యత్తాపసభవ్యమూర్తి యెదుటం ♦ బాటిల్లె నాటికనం
బొదవ న్మేలగుఁ బొమ్ము భర్తృపిజయ ♦ మ్మోహించు నాయిమ్మునన్
బదిలంబై హృదయంబు మేకొనఁగ నీ ♦ ప్రావీణ్య మొప్పారఁగన్. ౭౧

—♦ అత్రిముని యనసూయ మహిమం బభివర్ణించుట. ♦—

క॥ అని రాముని గనితన నె, మ్మన ముప్పొంగంగ గంగ ♦ మహితతరంగం
దనరంగఁ జేయు వాగ్ఝరి, యనువొందఁగ నిట్టులనె సు ♦ రార్చితచరణా. ౭౨

ఆ॥ వింటె రామచంద్ర; ♦ విధిముఖార్చిత యీపె, ధర్మచారిణీవ ♦ తంస మనఁగఁ
దనరె ముజ్జగములు ♦ దన్నుఁ బూజింపఁ బ్ర, సాదసుముఖి గూర్చె ♦ సద్వరములు.

సీ॥ ఆమున్ను వరునుఁ బాప ♦ లై రాఁ బడసి యుంటఁ, దొల్లె గట్టిన విని ♦ హృతపాప
ఫలమూలములు గంగ ♦ భావించి నెలకొల్పి, వ్రగ్రహం బాగిన ♦ వర్ణ్యచరిత
కడునియమముల నె ♦ క్కటి పదివే లేండ్లు, దపము సల్పిన మహా ♦ ధన్యమూర్తి
దేవకార్యార్థమై ♦ తివిరి యాదశరాత్ర, మొకరాత్రి సేసిన ♦ ప్రకటకీర్తి
యీసతియ యెల్ల దెలియు మ ♦ నీర్ష్యహృదయ
కాన ననసూయ నాఁగఁ బ్ర ♦ ఖ్యాతిఁ గాంచె
సకలజగదేకవంద్య ప్ర ♦ సాద మొనయ
నీకు నభివంద్య చూ మాతృ ♦ నిరతి రామ. ౭౪

క॥ లోకము దగ్ధం బగు నెడ, నాఁకపడి యదల్చి కావ ♦ సంచితకరుణా
లోకన కీకోమ కయ్యెన, కా కన్యలు సాహసింపఁ ♦ గాఁ దలకొనిరే. ౭౫

ఆ॥ ఉగ్రతప మొనర్చి ♦ యోగోపసర్గంబు, లాఁగె గెలుపుగొనియె ♦ నంచెఁ గీర్తి
నార్తి వాపె సిద్ధు ♦ లౌనన సిద్ధసం, కల్ప నిర్దళితపి ♦ కల్ప యగుచు. ౭౬

క॥ పెక్కు లొనర్చెను వ్రతతతు, లక్కజముగ స్నాత యయ్యె ♦ ననసూయయ పో
నిక్కపుఁ బతిదేవత యని, దిక్కులు మొరయంగఁ దొలఁచె ♦ దివిజౌఘములన్.

క॥ ఈయార్యామణికి నియతు, లాయె నలంకారములుగ ♦ నలఘుగుణమణుల్
మాయని యిమ్ములు సొమ్ములుఁ, దోయజనయనలకు నెందు♦ధుతపాపౌఘా. ౭౮

తే॥ అట్టిగావున వైదేహి♦యర్హ్యురాలు, కలిసి యొకగడె యాపె చెం♦గట మెలంగఁ
దాపసీమణి తనప్రసా♦దమున సాధ్వి, మంగళాలయ నొనరించు♦మమత నించు. ౭౯

ఆ॥ అనుచు నివ్విధమున♦నను మునీశ్వరు నుడు, లాధ్యుఁ డాదరించి♦యటు లొనర్తు
ననుచు ధర్మనిష్ఠ ♦ ననుచు సద్దేవితో, నిట్టు లనియెఁ గూర్మి ♦ యెసక మెసఁగ.

ఉ॥ వింటివె రాజపుత్రి యమి ♦ విశ్వజనీనుఁడు పల్కు పల్కు లీ
వెంట శుభోన్నతస్థితి న ♦ వేలగుణాబ్ధివి గాంతు వీవు ని
ష్కంటకవృత్తి సెల్లు సిరి ♦ గల్గెడు శ్రేయముపొంటెఁ గొల్వఁగాఁ
బంటవలంతి నట్లు ముని ♦ భావిని భావనసేయు మేర్పడన్. ౮౧

ఆ॥ సర్వభూతములకు ♦ సాధ్వి నమస్కార్య, యార్య భూషణంబ ♦ వగుదు వీవు
కార్య మెఱిఁగి యామెఁ♦గదిసి సేవింపంగ, సకలసిద్ధులునుఁబొ♦సంగు నిజము.

—♦ సీత యనసూయను సేవించికొనుట ♦—

క॥ అని విభుఁ డెఱిఁగించిన న,మ్మనస్వినీమణి హితైషి ♦ మత మారసి చ
య్యన నత్రిపత్నిఁ గొలువం, జనె స్వాభిజనంబు వెలయ ♦ జననంద్యనయా. ౮౩

ఆ॥ విశ్వమూర్తి రామ♦విభు పురంధ్రి త్రిధాత్మ,మూర్తిఁగాంచి పెంచి♦మురియఁగనిన
యాపురంధ్రిఁ దఱియ♦నరిగె నాసుచరిత్ర, కదియు గురునమస్య♦యగున కాదె.

సీ॥ ముదిమిమై నరిసిన ♦ మూర్ధజమ్ముల యొప్పు, శుద్ధజీవనవృత్తి ♦ చొప్పు చెప్ప
శిథిలితావయవసం ♦ శ్లేషం బశేషంబు, పరిణామమునఁ గాంచు ♦ పాటు దెల్ప
వలనెంచి యెల్లెడ ♦ వలగొన్న వళికలు, కలితతపస్తరం ♦ గముల నొడువఁ
గలుగు ప్రవాతపుం ♦ గదలిక కదలిక, పాపభీతత్వసం ♦ పద వచింప
నెగడు నిరసూయ నిష్ఠిత ♦ నిర్మలాత్మ, భర్తృదేవత నమ్మహా ♦ భాగఁ గాంచి
సీత సువినీత సన్నిధిఁ♦జేరి మ్రొక్కెఁ, దనమహితనామధేయ ము♦దాహరించి.

తే॥ వందనము లొనరించి య ♦ నిందితాత్మ, సర్వతోవృద్ధ నాయమ ♦ సంస్తుతించి
చరణయుగళి కంజలిపుటి♦సంతరించి, తుష్టి సేమమ్ములడిగెఁ బ్ర♦హృష్టయగుచు.

క॥ తరియించె నఘాబ్ధిని సం, తరించె సామ్రాజ్యపదవిఁ ♦ దరుణీమణి దా
సిరి యైన నేమి నెట్టన, సిరులకు సిరు లామె పాద ♦ సేవల కావే. ౮౭

—♦ అనసూయ సీతకుఁ బాతివ్రత్యప్రభావం బెఱింగించుట ♦—

ఉ॥ ఒద్దిక మీఱ ధర్మమయ ♦ తోచితవృత్తి సతుల్యటించుచుఁ
దద్దయుఁ గొల్వఁ గోరి నెఱి ♦ దాఁకొనఁ జేరఁకొని నిల్చియున్న య
మ్ముద్దియ ముద్దులాడి ధృతి ♦ మూలవుటిం గనుఁగొంచి పున్నెపుం
బద్దుల నెన్నుచుం బలికె ♦ భవ్య తపస్విని హర్షమూర్తియై. ౮౮

తే॥ ధర్మ మార్జించెదే తల్లి ♦ త్యక్తసకల, బంధుసంబంధవై కల్మిఁ ♦ బాసి వచ్చి
యేయహంకృతి లేమిగా ♦ మెఱుకఁగొంటె, రాముసవరుద్ధుఁగొలువభా ♦ గ్యముపడఁగ.

ఆ॥ ప్రాప్తరాజ్య మట్లు ♦ పరులపా లొనరించి, సవతితల్లి వర మ ♦ సహ్య మనక
యనుమతించి తండ్రి ♦ యానఁ గానల నుండ, వచ్చు మగని మెచ్చు ♦ వనిత గలదె.

క॥ అంతలు కూర్చున పతి నీ, యంతటి పతివత్ని యెదవ ♦ నలరదె ధర యే
కాంతమునఁ దయితు మదిఁ గల, చింతలఁ దలఁగింపఁ జాలు ♦ సిరి దులకింతే.

తే॥ కుశలమా యమ్మ; సౌఖ్యము ♦ లొకఅంత పడక
యమరునే కదె తల్లి; య ♦ నామయంబె
దేవి నీయవె సిరు తెల్లఁ ♦ దీపులాఁడి
వేఱె యడుగంగ వలెనె నీ ♦ వెర వెఱింగి. ౯౨

ఆ॥ పట్టమహిషి నైతి ♦ పతి ధర్మపాలన, రాజ్య మేలఁ బోడర ♦ రతి ననంగు
రాణివాస మను వి ♦ రతి గేరడం బాడ, జాలియుంటె వింకఁ ♦ జాల వెండు. ౯౩

తే॥ ఏల మెచ్చెదు పెరరాజ్య ♦ మింత లంత, లనక జనయిత్రి; జనకుని ♦ యనుఁగుబిడ్డ
వాత్మపతిదేవతావ్రతా ♦ భ్యస్తయోగ, సారసామ్రాజ్యదీక్షాప్ర ♦ సక్త వగుచు. ౯౪

క॥ సంతస మొనగూర్చితి కదె, సంతానమ; నిన్నుఁ గన్న ♦ జానకి విదేహుం
డంతటి భాగ్య మెనసెనటె, యెంతెలు పూజించితే మ ♦ హేచ్ఛాతిఁ బడయన్.

సీ॥ నగరమం దున్నవ ♦ నస్థుఁడే యైనను, భ్రష్టపుణ్యుండైనఁ ♦ బాపుఁడైనఁ
గలితవర్తనుఁడైనఁ ♦ గామవృత్తుఁడ యైన, ధనవంతుఁడైన ని ♦ ర్ధనుఁడయైన
సచ్ఛీలుఁడైన న ♦ సచ్ఛీలుఁ డననైనఁ, బండితుండైన మూ ♦ ఢుండె యైన
రోగహీనుండైన ♦ రోగపీడితుఁడైన, సొగసుకాఁడైన దు ♦ ర్భగుడెయైనఁ
బతియచూ తనపాలిదై ♦ వత మటంచు, భావమున నెంచి సేవించు ♦ భావినులకుఁ
గైకొనఁగరాని పుణ్యలో ♦ కములు లేవు, సిరి మహోదయములు వారిఁ ♦ జేరి విడవు.

క॥ మున్ను భుజింపవుగద పతి, కన్నను మునుమున్న నిదురఁ ♦ గాంచవు గద మే
ల్కొన్నపిదపఁ గాకుండఁగ, నెన్నఁడు మేల్కాంతు గద మ ♦ హీయఃప్రతిభన్.

క॥ పూఁచిన తంగెడు నాఁ దగి, యేచెట్టయు లేక భర్త ♦ నెనయంగ వలెఁ ద
త్సాచివ్యంబునఁ గా కెపు, డేచెలువ మొనర్పఁ గూడ ♦ దేనాఖ్యులకున్. ౯౮

ఆ॥ పలుకరాదు లాఁతి ♦ వార లున్నెడఁ బతి, పలుకుబడికి వేఱు ♦ భంగి నెపుడు
యుక్తి నెమకి పలుకు ♦ టొప్పదు పతిదేవ, తావతంసములకుఁ ♦ దరుణి ; వింటె.

క॥ భాషింప రెదుర నిలఁబడి, భూషింపరు మేని భర్త ♦ ప్రోషితుఁ డైనన్
శోషింత్రు తదార్తికి సం, తోషింతు రతండు తుష్టి ♦ దొరయు నెడ సతుల్.

క॥ వరుఁ డొసఁగిన నించుకయును, బదము ప్రసాదం బటంచు ♦ భావింపఁ జనున్
బొరి హెచ్చుదగ్గు లెంచుట, సరిగాదు తదీయదైన్య ♦ సందర్భమునన్. ౧౦౧

ఆ॥ భర్త మేలు గోరు ♦ పడఁతుక లెవ్వేళఁ, గూర్చు కొంద్రు పసుపు ♦ కుంకుమంబు
కజ్జలంబు నైక ♦ కబరికాసుమగంధ, మాల్యముఖము లైన ♦ మండనములు.

క॥ కాలము గడచె ననుచుఁ బతి, నాలముసేసి తలయెత్తి ♦ యడరుచు సిగ్గుం
జాలించి పెర్లెఁ జొచ్చెద, రోలీలావతిరొ ; సుగతి ♦ నొల్లని వారల్. ౧౦౩

తే॥ గరిత నాగరికత వాక్ప్రి♦గల్భతయును, దన దెస స్ఫురింపనీకుండఁ♦దనరుటొప్పు
వెకలితన మందు రయ్యది ♦ విభుని మ్రోలఁ, బోలు సంభోగలీలాను ♦ భూతికళల.

తే॥ మగఁడు పిల్చిన తోడనే♦మలసి కర్జ, మడిగి యది నేర్చితీర్చి యెం♦డరయువలయు
నెట్టి చుట్టమునకు నేని ♦ నేపదార్థ, మతని యాన లేకీఁగి యు ♦ నర్థకంబు. ౧౦౫

క॥ పతిభుక్తశేష మమృతము, సతి కెప్పుడ యేని నది య ♦ సహ్యా మనుచు స
మ్మతి గొనక డించు నాదు, ర్మతి నారకగతి నొనర్చు ♦ మలభక్షణమున్. ౧౦౬

క॥ విభు సుఖసుఖ నసుఖా, నభంగమునఁ గాక చనదు ♦ నాతి కెపుడు నే
పరిభవమున మేలుకొలుపఁగ, శుభాంగి ధర్మమ్ము లెందు ♦ సూక్ష్మతరమ్ముల్.

ఉ॥ ఎంతటి ప్రాణసంకట మ ♦ యేర్పడెనేనియు మైత్రినేయు ట
త్యంతము దూషితంబు రజ ♦ కాంగనతో నవితో ననాథతో
రంతులమారితో మగని ♦ రాయిడి వెట్టెడు దానితోడ మ
ట్టాంతరవృత్తితోడ శ్రిమ ♦ ణాదివిరాగులతోడ సాధ్వికిన్. ౧౦౮

క॥ ఒంటి జనం జన దెన్నఁడుఁ, గంటొదవ న్మాటలాడఁ ♦ గాదు తడుపు లే
కుంట దొసఁగు నీళ్లాడఁగఁ, దంటా లొనగూర్చు చేత ♦ దగదు గరితకున్.

తే॥ కడప తిరుగలి మఱి సన్నె♦కల్లు రోలు, గూడనివ మెప్డుఁ గూర్చుండఁ♦గోమలులకుఁ
బూజ సేయంగ వలె మేలి♦పూలు దెచ్చి, గేహళుల నిచ్చలవియు ల♦క్ష్మీపదములు.

వ॥ చెఱంగుమాసిన యత్తఱి మూన్నాళ్లును సిగ్గుతో నొక్కపట్టున నొదిఁగి పతివి లోకనమార్గం బత్యంతంబునుఁ బరిహరించి వ్రతాచరణం బవలంబించి యద్దోషంబు గెడపుకొనవలయు. నయ్యహంబులం బొట్టిచెంబుతో నీరు ద్రావిన నతిహ్రస్వుండును, బర్ణంబుల దొప్పలఁ గొఱికిన పున్మాదకుండును గోళ్లం ద్రెంచి వైచినఁ గునఖియు నంగోద్వర్తనం బొనరించిన దుశ్చర్మ్ముండును గజ్జలంబుం బెట్టిన గ్రుడ్డివాఁడును, దాంబూలచర్వణంబు సేసిన లంబోష్ఠకుష్ఠియు గేశకృంతనంబు గావించిన బట్టతలవాఁడును నగు కొడుకు పుద్భవించు నాల్గవనాఁ డుదయంబునవేళ జలాశయంబున కరిగి యడ్డుకట్టవైచి యంగక్షాళనజలంబు లందుఁ గలియకుండునట్లు లుద్ధృతజలంబుల స్నాన మాచరించి చలువ వలువ ధరియించి నేలవంకన చూచుచు నింటి కరుదెంచి భర్తం గాంచి కాని యొంటిఁ గనుంగొనం బోలదు నాథున కెట్టికష్టంబులు దొరకొనినను నప్పాటులం దొడ్పాటునం బాటుపడి యాతని నుద్ధరింపవలయు లేమి పాల్పడిన నాతని నుడికింపం జనదు. నశ్లీలంబులాడుట దుశ్శీలత్వంబు. ౧౧౧

క॥ పానము దుర్జనసంస, ర్గానయనము భర్తఁ బాయు ♦ టన్యస్థలికిన్
బోనెంచుట వెడనిద్దుర, పూనికి పరగృహవసతియుఁ ♦ బోలవు సతికిన్. ౧౧౨

తే॥ అల్ప మొసఁగునుఁ దండ్రి య ♦ త్యల్ప మిచ్చు
నన్న యల్పాల్ప మిడఁజూచు ♦ నాత్మజుఁడును
బ్రార్థితాధిక మొసఁగూర్చుఁ ♦ బతి సుదతికి
ధవుని మించిన మేలి బాం ♦ ధవులు గలరె. ౧౧౩

వ॥ పతి మొఱఁగి యితరుని మరగిన జరభి గూబయై జన్మించు నింతవానిం గటాక్షంబుల నిరీక్షించిన దేబె గిల్లకన్నుగలయది యగు విభునిపైనలిగి నలిరేఁగి మొత్తిన మాఱ్మొత్తు బిత్తరి యెత్తఱి నడికోనలోఁ బులిజాతి నుత్పత్తిల్లుఁ దనవారికిం బెట్టక యొంటిమైఁ జిఱుతిం డ్లాహారించు విహారశీల యూరఁబందియై పుట్టు. గొట్టుగొని మగని హుంకారంబున నదల్చు ఱాఁగ మూఁగ యగు సరిదాని సౌభాగ్యశ్రీఁ గాంచి చూపోపమి నసూయపడు పడఁతి దుర్భగయై యుద్భవించు నిట్లనేకంబులు స్త్రీకర్మవిపాకంబులు శ్రుతిస్మృతుల వివరింపం బడుచుండు. ౧౧౪

ఆ॥ దూర మరిగి యొండఁ ♦ దోడిఁబడి వచ్చిన, జీవితేశుఁ జెంతఁ ♦ జేర్చి జలక
మార్చి పొసఁగు భక్తి ♦ గూర్చి విడెంబిడి, యుపచరించు సాధ్వి ♦ యొప్పు మించు.

వ॥ అక్కులికియ యెల్లలోకంబులుం దక్కఁగొనంజాలి యుండు నెన్ని యుపవాసంబు లొనరించిన నేమి యెంతయుం బ్రపత్తిమై నిచ్చలుం దేవతార్చనంబు లాచరించిన

నేమి యొక్కటి యాస దివ్యదేశంబు లెల్లం ద్రొక్కిచూడ నేమి నానాపుణ్య తీర్థంబులం దీర్థమాడ నేమి యనేకపుణ్యవ్రతంబుల నతంద్రయై జరుపనేమి పతివ్రత యగు పుణ్యాంగనకుఁ దా నెట్టిది యైనను విశ్వస్తాంగన సాటి రానేరదు. రేపాడి పాడిమెయి వేఁడివెలుంగు నీక్షింపక యమున్న తల్లి వదినె యక్క యత్తగారు వీరిం దక్కఁ బెరవిధవల వీక్షింపం జనదు. పెరిమ యెంత లున్నను నవ్వారి యాశీర్వాదంబులుం గైకొనరాదు. జీవముతోఁ బాసి యశుచి యైన మేను పరిశుద్ధతో యసహస్రఘటాభిషేకంబు లొనరించినం బవిత్రం బగునెట్టు లట్టులగుట నరసచ్చిన దానిఁగా విధవరాలి నెన్నం జను. ౧౧౬

తే॥ పతిది సామేను సామేను • సతిది గాఁగ, నొప్ప నదియె సహత్వ మ • య్యోజ నెడఁగ
విడివడిన దాని బ్రదు కెట్లు • వేడబంబ, విధిశతంబుల యేని ని • ర్విధమ నోడువు.

తే॥ నిండుచందురుఁ జంద్రిక • నియతిని దోలు
కారు మొగిలు విద్యుల్లేఖ • గతిని యువతి
పతి ననుగమించి సుకృతము • ల్పడయ నేర్చు
నతఁ డకృతియైన నిజలోక • మందఁ దార్చు. ౧౧౮

క॥ కొల నాడ నరుగు గతి నే, కొల మతి లేక పతిమేనిఁ • గూర్చు ననల మం
దలఁతిఁ దనమే నిడిన సతి, యెలరుచు హయమేధసుకృత • మొనయం గాంచున్.

క॥ పూవులు ఫలములు సొమ్ములుఁ, దో వెలఁదుల కిడుచుఁ బతికిఁ • దోడ్పడి చను నా
భావిని పదమునఁ బదమునఁ, గావించు నతనికిఁ దనకుఁ • గ్రతుశతఫలమున్. ౧౨౦

క॥ సిద్ధౌషధమంత్రములఁ బ్ర, బుద్ధుఁడు జాంగలికుఁ డెట్లు • పుట్టవలనిపా
ముద్ధతి వెడలించు నటుల, ఘోద్ధృతుఁ జేయుఁ బతి నగ్ని • నుఱికిన సతియున్. ౧౨౧

ఆ॥ అంతనంతఁ బోదు • రత్యంతభీతాత్ము, లగుచు శమను దూత • లగ్గిఁ జొచ్చి
వచ్చు కాంత కాంతు • బద్ధుఁ గిల్బిషనద్ధు, విడిచిపుచ్చి యాపె • నెరవు మెచ్చి.

క॥ ఘర్షింపలేఁ డొకొం డెటు, ధర్షించును గంధవహుఁడె • తత్కుచచేలా
కర్షాపరాధభీతిఁ బ్ర, కర్ష ముడిగి మెల్లమెల్ల • గా వీచు ననన్. ౧౨౩

క॥ బడబాగ్నిదవాగ్నులకుం, బిడుగునకు న్మిగులు గరిత • బిఱుసుఁదనమునన్
దోడరెడు దుష్టాత్మునిఁ గా, ల్చెదునెడ సుజనునెడఁ జంద్రు • సిరిఁ దులకించున్.

ఆ॥ పిఱికికండ లేక • బెరుకులు వెట్టక, యజమి తటమి వహ్ని • నుఱుకు సాధ్వి
మొనయు రోమకూప • ముల లెక్క దివ్యవ, ర్షములు భర్తతోడ • స్వర్గసుఖము.

క॥ ఏడేడుతరములకుఁ దన, పాడి మెయిన్ స్వర్గ మొసఁగుఁ ♦ బతిదేవత ము
న్నాడి పితృమాతృధవవం, శోడితజన్ములగు జనుల ♦ కెలమి వెలయఁగన్. ౧౨౬
తే॥ ధవుని మించిన బాంధవుల్ ♦ తద్ద లేరు, తనదు పున్నెంపుఁ బ్రోవు నం ♦ దనవుఁబూవు
సతికిఁ బతియేయని విమర్శ ♦ సలిపి యుంటి, నిన్నుఁగని నేఁడు సంతుష్టి ♦ నిరతిఁగొంటి.
తే॥ స్త్రైణచూడామణీ; సత్ప్రసంగమునను, ముచ్చటాడెడు నెఱిఁగూర ♦ ముఱి పెమూర
నుగ్గడించితి సాధ్వి సా ♦ ధూక్తధర్మ, మార్గ మిట్లని నీమీఁది ♦ మమతనూఁది.
క॥ నీబోఁటిక యవుఁగా కిల, నేబోటిక యేని నిట్టి ♦ యెలఁబ్రాయమునన్
గాఁబో దూరువిడిచి పెడ, గాఁ బోయి కృశింప నైన ♦ కాఁపురము సతీ. ౧౨౯
ఉ॥ కామవశంవదత్వమునఁ ♦ గన్నును మిన్నునుఁ గానలేక యే
కామిను లిష్టనాథు లయి ♦ కల్మషవృత్తిఁ జరింతు రట్టివా
రేమి గడింతు రేసుగతి ♦ నెంతురు హేయము కుచ్ఛితంబు నా
నీమెయి పుట్టు వందురె య ♦ నిష్టము గాఁగఁ గురంగలోచనా. ౧౩౦
క॥ పాపముపాలై యగతికిఁ, బ్రాపై దాపైన కీర్తి ♦ పాడ్వడఁ గడ క
వ్వేవు సెడఁగఁ గాటికిఁ గాల్సాఁపెద రాపైఁ గృశింత్రు ♦ శమనుఁడు వేఁపన్.
క॥ కార్యాకార్యము లరయక, నార్యులె యై ధర్మహాని ♦ కలుక కవశతన్
బర్యటనం బొనరించు క, దర్యల ననవలెనె తద్వి ♦ దశ యటులుండన్. ౧౩౨
ఆ॥ వారి నెన్న నేల ♦ వరవర్ణినీమణి, వీవు నిన్నుఁ బోలు ♦ పూవుబోండ్లు
దయితుఁ గొలిచి పరమ ♦ ధార్మికు లట్టులే, యఖిలసౌఖ్యపదవి ♦ నందఁగలరు.
క॥ లోకపరావరతత్త్వా, లోకాంచిత నైతివమ్మ; ♦ లోలత కాశా
మోకం బొనగూర్చితి స, శ్రీకాభ్యుదయరమఁ బతికిఁ ♦ జేర్చెదు వత్సా. ౧౩౪
క॥ ప్రొద్దుంబ్రొద్దున మేల్కని, యద్దుకొనుము జీవితేశు ♦ నంఘ్రులు గనులన్
దిద్దుకొను మవల గృహవిధు, లద్దిర; యనఁ జేరి ప్రీతి ♦ నందింపు మటన్. ౧౩౫
చ॥ ఎడనెడఁ దత్పరిశ్రమము ♦ నెంచి సమంచితవృత్తి నేర్మి చొ
ప్పడఁ బరిచర్యలం బొనఁగు ♦ బాటొనగూర్పు మనువ్రతంబు వెం
బడి సమయోచితస్థితినిఁ ♦ బన్నదు భవ్యసహాత్మసంపదన్
బడయుదు ధర్మమున్ యశముఁ ♦ బొల్పదు నాదట శ్రేయ మన్నిటన్. ౧౩౬
క॥ అని ధర్మచారిణీమణి, యనసూయ యసూయ లేని ♦ యవనిజ కుచితం
బనువర్తన మెఱిఁగింపఁ ద, దనుమోదన మొప్పహృష్ట ♦ యై యిట్లనియెన్. ౧౩౭

—♦ సీత హర్షోత్కర్షముతో నిజప్రవర్తనం బనసూయకు దెలియించుట ♦—

తే॥ ఇదియు నబ్బురమే యార్య ♦ వెల్ల యెఱిఁగి
నాకు సద్వృత్తి నొడఁగూర్ప ♦ ననుచు కూర్మి
ధర్మ విట్లని తెలుపుట ♦ ధాత్రి నెందుఁ
బావనులు వత్సలత్వత ♦ త్పరుల కారె. ౧౩౮

క॥ ఏనును బతి దైవతముగ, ధ్యానించెద నెల్లవేళఁ ♦ దద్గతమతినై
నీనిర్మలోపదేశం, బానెఱికి న్వన్నె పెట్ట ♦ నయ్యె సవిత్రీ. ౧౩౯

క॥ పతి తల్లి దండ్రి గురుఁడును, బతియే తనపాలి పూర్వ ♦ భవకృతసుకృతం
బతఁడె సకలార్థదాతయు, నతఁడే పరదైవతంబు ♦ నై యొప్పారున్. ౧౪౦

ఆ॥ నాదు భర్త వృత్త♦నయవర్జితుఁడె యైన, నలఁతిఁ బోవువాఁడె♦యనఁగ నైన
దైన్యథ మెన్న కెపుడుఁ♦దత్సేవల మెలంగు, టొప్పు నొండు దలఁప♦ముప్పు గాదె.

ఉ॥ ఏమనవచ్చు నావిభుని ♦ యేకపరత్వము శ్లాఘ్యవృత్తి వి
ద్యామహితత్వ మింద్రియజ ♦ యంబు సుశీలత ధర్మసక్తియున్
నేమము కూర్మి వత్సలత ♦ నిర్మలభావము మున్నుగాఁగ నా
నామహనీయసత్కలన ♦ లన్నియుఁ బ్రోవిడి నట్టు లొప్పఁగన్. ౧౪౨

ఆ॥ మఱవవలసెఁ దండ్రి ♦ మాత నీఘనుఁడు సం, ప్రీతి మనుపఁ జాలు ♦ రీతి నెఱప
నితని మేలిగొనము ♦ లీరేడులోకంబు, లందు నొడ్ల కుండు ♦ ననఁగ రాదు.

తే॥ తల్లి కౌసల్యయం బెట్లు♦ధారుణీంద్రు, సతులయం దట్లు మాతృపూ♦జలు ఘటించు
సకృదధిపదృష్ట మైన యా♦స్త్రైణ మెల్లఁ, దన్ను గన్నదె కా నెడఁ♦దం దలంచు.

ఉ॥ ముద్దులు మూటగట్ట నగు ♦ ముచ్చటతోఁ జిఱునవ్వుతో నసం
బెద్దెస నేనియు న్నెఱపు ♦ ఱే నిజకృత్య మటంచు నెంచు నే
పద్దులుఁ బన్నఁ బోఁడు స్మృతి ♦ పద్ధతికి న్వలిగాఁడు నిచ్చలుం
బెద్దలఁ గొల్చు మేల్నెనరుఁ ♦ బేర్మియు వీడఁడు రాముఁ డెన్నఁడున్. ౧౪౫

ఆ॥ భువనమోహనుండు ♦ భూరిప్రదాత ప్ర, తాపమూర్తి చంద్ర ♦ దర్శనుండుఁ
దా ననంగ నంగ ♦ నానికరంబు క, రంబుఁ బ్రీతిమెయిఁ గ ♦ రంగ కున్నె. ౧౪౬

క॥ కావున నే నీతని దెస, భావాప్తి న్మనుట వింత ♦ పద్ధతి గా దీ
దైవతము పూజ లేక్షణ, మేవలనున నేని వదల ♦ కేపారింతున్. ౧౪౭

ఆ॥ అడరు నెడరుఁ జూపు♦నజనమా వనమున, కేనుఁ గూడి వచ్చు♦టెఱిఁగి మరగి
మనఁగ నగు తెఱంగు♦మాయత్తగా రిట్లు, తెలిపె నది మనమున♦దిటవుపడియె.

ఆ॥ నన్నొసంగువేళ♦నాతల్లి యిట్టులే, యగ్నిసన్నిధాన♦మందుఁ దెలిపె
మఱిపురా దొకష్ట♦మహిత మయ్యనుశాస, నంబు తిరముపడె మ♦నంబునందు.
క॥ కవగూడి నీదు వాక్యము, లవికృతం బనఁగ నగుచు ♦ నదియెల్ల మదిన్
సువిదిత మొనగూర్చెను దన, ధవు సేవను మించ లేమ ♦ తప మొం డనుచున్.
క॥ ఇదె ధర్మం బీయదె తప, మిదియే సకలార్థలాభ ♦ హేతువు భాగ్యం
బిదె స్వర్గం బిదె మోక్షము, సుదతికిఁ బతిఁ గొల్చు చొప్పు ♦ చొప్పదె నేనిన్.
క॥ పతిశుశ్రూషణమునఁ గొనె, సతి సావిత్రి మితి లేని ♦ సౌఖ్య మతనితో
నతులిత యశయ యగు స్వ, ర్గతిఁ గనె నుభయకులముల య♦ఘంబులఁ దొలఁచెన్.
ఆ॥ స్త్రీలలో వరిష్ఠ ♦ శ్రీకళాలలిత రో, హిణి సుధాంశు నండ ♦ నెడసి యుండ
దెపుడు దివిని భర్తృ♦హితకారిణియ కాఁగ, దైవతత్వమహిమ♦ తనకుఁ గలుగ.
ఆ॥ ప్రవర లైన స్త్రీలు ♦ భర్తృదృఢవ్రత, లే యనంగ నిట్టు ♦ లెంచ బొంద
ఱందఁబోరు ; పరమ♦మగు లోక ముత్తమ, శ్లోక లటు శుభావ♦లోక లగుచు.
క॥ అందఱమాట లటుండ న, మందప్రీతిభాసమాన ♦ మహిమోన్నతి నీ
యం దిట్లు చూడ నొప్పెఁ బ, తిం దైవత మనుచుఁ గొలుచు♦ తీర్పు ఫలంబై. ౧౫౬
క॥ అని విన్నవించు సీతా, వనజేక్షణ నుడులు విని ప్రి ♦ వర మునిసతి య
య్యనవద్యఁ బొదివి శీర్షం, బున మూర్కొని సంప్రహర్ష ♦ పూరణపరయై.

—♦ అనసూయ సీతకు దివ్యంబు లగు మంగళద్రవ్యంబు లొసంగుట ♦—

ఆ॥ వివిధనియమవిధుల ♦ వెలయించినది లబ్ధ, సమయ యగు తపఃప్ర ♦ సక్తి గలదు
తద్బలంబునను సు ♦ ధాస్మిత ; సీత ; ని, న్ననుపుదాన మేలు ♦ దలఁచి కూర్చి.
క॥ అనఘము లుపపన్నంబులు, మనోజ్ఞములు నైన నీదు ♦ మాటలవరుసన్
మన మలరె మైథిలీ నీ, కొనరింపం దగిన దెద్ది ♦ యో నొడువు మికన్. ౧౫౮
తే॥ అనుచు నస్మయకలన ని♦ట్లను తపస్వి, నీమణి యుదారవాగ్వృత్తి♦నెఱిఁ దలంచి
విస్మయంబునఁ దోఁగి శు♦చిస్మిత యయి, పలికె ధరణిజ మధురసం♦భాషణముల.
శా॥ శ్రీకల్యాణగుణావహోజ్జ్వలలస♦చ్చింతామణిస్ఫూర్తి లో
కైకత్రాణసమర్థ మాశ్రితసమ ♦ స్తార్థప్రదానక్షమం
బేకాంతప్రీతిభావప్రభావవిభవా ♦ ప్తిద్యుప్రసాదంబు నా
బ్రాకట్యంబు వహింపదే సుజనసే ♦ వాపారతంత్ర్యం బిలన్. ౧౬౦
క॥ లోకముల మనుచు పనికని, కాక భవద్విధల నియతి ♦ కడమ కొదవునే
యీకొలఁది యనఁగ నలవియె, ప్రాకటకరుణావలోక ♦ భవ్యశ్లోకా. ౧౬౧

ఆ॥ భద్రవృష్టి సృష్టిఁ ♦ బరఁగించు భవదీయ, శ్రీకటాక్షదృష్టిఁ ♦ జెనయఁ గంటి
నాదు నోము లెల్ల♦నయ మొప్ప ఫలియించె, నింకఁ గొఱఁతలుండు♦నే; సవిత్రి.

క॥ ఇంతలగు నీదు నెనరిఁక, నెంతలు మే లొసఁగ దెట్టు ♦ తెలయింపదు శ్రీ
మంత మది తన్నుఁ బరమై, కాంతికఁ బొనరించె నిదియ ♦ కాదే; పొగడన్. ౧౬౩

క॥ దీన ననరా దొకంటను, దీనన నెగడొందుదాన ♦ దృష్టఫలము బ్ర
హ్మానందావధికంబది, యేనయమున నేని నాయ ♦ దే; యనఁ జెల్లున్. ౧౬౪

క॥ ఆదృతవు జగతి కెల్లఁ ద్వ, దాదృతియే యఖిల మొసఁగ ♦ నోఁ గావుత మిం
కేదారు లేల యాశీ, ర్వాదము సమకూర్పు మదె య ♦ పారసుఖ మిడున్.

ఆ॥ చాలునమ్మ తల్లి ♦ సంభ్రమపడ నేల, యనుచు నోడువు నాథ ♦ రాత్మజాత
నుడికిఁ బొంగి మరుద ♦ నోకహం బాయమ, యమలవృత్తి నిట్టు ♦ లనియె నపుడు.

క॥ సీతా నాదుప్రమోదం, బీతఱి సఫలం బొనర్తు ♦ నెప్పటి మే ల
ప్డే తనరనవుంగావుత, మేతావన్మాత్ర మనెడు ♦ నెల్లయుఁ గలదే. ౧౬౭

క॥ ఇదె దివ్యము వరమాల్యం, బిదె వస్త్రం బాభరణము ♦ లివె యనులేపం
బిదె యంగరాగ మిదె యివి, సుదతీ; నీయంగకముల ♦ శోభిలఁ జేయున్.

క॥ నీ కొసఁగితి నిది యెల్లం, బ్రాకటమహిమంబు దీని ♦ ప్రాభవ మన్యుల్
సేకొన నేరరు నిత్యం, బేకకలనఁ బొనరఁ జేయు ♦ నిష్టావాప్తిన్. ౧౬౯

క॥ అనురూప మసంక్లిష్టము, తనచెలు వెక్కుడుగ దీనఁ ♦ దనరారెడు నె
ట్టనఁ జాలెదు హరిసిరి య, ట్లనవరతము నవరతాప్త ♦ నధిపు నొనర్పన్. ౧౭౦

క॥ నీపాతివ్రత్యంబున, కేపాటునుఁ బాటిలంగ ♦ నీయకె పతికిన్
బ్రాపింపఁజేయు విజయము, నీపా లొనరించు భద్ర ♦ నిరతిఁ గుమారీ. ౧౭౧

చ॥ అజనున కైన సోయగము ♦ నందఁగఁ జేయు నొయారముం గళల్
సదమలవృత్తి నెయ్యమునుఁ ♦ జక్కఁ బొనర్చుచునుండుఁ జెట్టలం
బదరఁగనీదు నీదు ధృతి ♦ బ్రహ్మకునేనిఁ దెరల్పరాదు సం
పదలకుఁ దానకం బనఁగ ♦ మానగు సొమ్మిది సుమ్ము మానినీ. ౧౭౨

తే॥ కుశలినై రాముఁ డలరంగఁ ♦ గూర్చుభక్తి
మేలి వరివస్య లొనరించి ♦ మేల్మిఁ గాంచి
యి మ్మెనసి పదునొకఁడువే ♦ లేండ్లు రాజ్య
మతఁడు పాలింప సౌభాగ్య ♦ మందె దబల. ౧౭౩

క॥ అనియొసఁగిన నది యంతయు, ననుత్తమము ప్రీతిదాన ♦ మని కొని భక్తిన్
దనరుచు శ్లిష్టాంజలియై, వినమ్రయై తన్నుఁ గొలుచు ♦ వెరవున నుండన్.

ఆ॥ పుడమికన్నెఁ గని త ♦ పోధనార్చిత యన, సూయ సద్వ్రతాఢ్య ♦ శుద్ధచరిత
యడుగఁ దొడరె నిట్టు♦లానందసాంద్రయై, యలముకొనెడు కుతుక♦మనుసరించి.

ఉ॥ నీవు స్వయంవరంబున సు ♦ నిష్ఠితుఁడౌ రఘురాముచే ధృతి
శ్రీవిధి లబ్ధవైతి వను ♦ చెల్వు శ్రుతిం బడయంగఁ గంటి నేఁ
డావిధ మెల్లఁ దేటపడ ♦ నాడుము నీనుడిదారి నోచిరం
జీవిని మన్మనఃపదముఁ ♦ జేరి ముదం బొదవించు నట్లుగన్. ౧౭౬

క॥ నీయనుభవ మెట్లటు లో, నాయిక; నాయకము గాఁగ ♦ నా కెఱిగింపన్
నీయౌన్నత్యం బెన్నుచు, శ్రీయుత మది యెల్లఁ బ్రీతిఁ జేర్చెద నెదలోన్. ౧౭౭

క॥ అని వేడుకమెయిఁ ద న్నడి, గిన మానికుటుంబినికి సు ♦ కీర్తిత ధరణీ
తనుజాత సీత యిట్లనె, మనము తదీప్సితముపొంచె ♦ మలయ సదుక్తిన్. ౧౭౮

సీ॥ వినవమ్మ నీకోర్కి ♦ వెలయంగఁ దెలిపెద, నాచరిత్రంబు వి ♦ న్నాణముగను
నిమివంశవర్ధనుం ♦ డమలుండు మిథిలాధి, పతి జనకాహ్వయుం ♦ డతిరథుండు
జగదేకవీరుండు ♦ శ్రౌతాభిరతుఁడు నా, నాధర్మవేత్త య ♦ న్ఖ్యాతి వడసెఁ
బొరి నగ్నిఁ జందనం ♦ బునయందు నడుగుల, నునిచి మేకొనుకీర్తి ♦ నుర్వి యేలు
నాతఁ డొకనాఁడు వేల్పుల ♦ యంతరంగ
ముల నలరఁ జేయుపనికిఁ దా ♦ ముదలగాఁగ
నొక్కక్రతు వాచరింపనౌ ♦ నూహ మదికి
రా సముల్లాసి యగుచుఁ దీ ♦ ర్ఘమ్ము మొనసి. ౧౭౯

ఆ॥ క్షేత్రమండలమ్ము ♦ సిరి మీఱ లాంగల, హస్తుఁ డగుచు దున్ను ♦ నవసరమున
నతని కూర్మిబిడ్డ ♦ నై నేనుఁ బుడమిచా, లందు బొడమి ప్రథితి ♦ నందితి నొగి.

క॥ ఎత్తినపిడికిలి యోరన, నొత్తిగిలఁగ నోషధిప్ర ♦ యోగంబున కా
యత్తపడిన మది నేమి ని, మిత్తం బిది యనుచుఁ దలఁచి♦మెయికొను వేడ్కన్.

తే॥ ధూళిధూసరితాంగి న♦న్దొడ నిడుకొని, మెఱుఁగు వెట్టెడు నెఱికి నె♦మ్మోనునిమిరి
యమ్మ; నన్భ్రివఁ బొడమితే♦యనుచు మేలి, సంతసంబింత లంతలై♦జాలుకొనఁగ.

తే॥ అంత కనపత్యుఁడై యున్న♦యాకతన ని, రంతరం బయి స్నేహ మ♦ట్లలముకొనఁగ
శ్రీసమయ నాతనయ యిది♦చిట్టిపొట్టి, ముద్దులమ్మ యటంచుఁ దా♦మురియుచుండె.

ఆ॥ నన్నుఁ గూర్చి మింట ♦ ననిచె నమానుషి, యొక్కవాక్కు తండ్రి ♦ యుక్త మదియె
ధర్మమునను నీకుఁ ♦ దనయయే యిద్దేవి, యనుచు నాతృణంబె ♦ యాతఁ డలర.

ఉ॥ ఆమధురోక్తిఁ దా వినిన ♦ యంతఁ బ్రహర్ష మునందుఁ దోఁగి వి
ద్యామహితుండు మజ్జనకుఁ ♦ డంచితవృత్తిఁ ద్రిలోకికాజయ
శ్రీమహనీయసంపదలు ♦ సేకురె నా కనుచున్ సమృద్ధుఁడై
నేమముల న్మెలంగుచు వి ♦ నిర్మలయా తనపత్ని కిచ్చినన్. ౧౮౭

తే॥ ఆగుణాంబుధి యాపుణ్య ♦ యామనస్వి, సీవతంసంబు మహములు ♦ నెఱపెఁ బెక్కు
లసదుగా తుల్లసిల్లు సౌ ♦ హార్ద మొప్పఁ, బెనిచెఁ బెరిగితి నాయమ్మ ♦ ప్రీతితోడ.

క॥ అన్నివిధంబుల జ్యేష్ఠ్యమ, హోన్నతిఁ గని కన్నతల్లి ♦ యా నాసతి యా
ము న్నెఱుఁగని ముద్దులు నా, పున్నెములే యనుచుఁ బొంగి ♦ పొరలుచు నుండెన్.

తే॥ కడఁగి సంతానకలనయుఁ ♦ గలిగె నయిన
దంతయు సమృద్ధి యీయమ్మ ♦ దనిరి వారు
కొంతకాలంబునకుఁ బతిఁ ♦ గూర్మిఁ గూర్ప
నా వయసుమేర పొడసూప ♦ ననువు దనర. ౧౮౮

క॥ ధననాశంబున నధనుం, డెనయుంగలఁ డెంత చింత ♦ నెక్కాలము నా
జనకునకు నట్టిఁడే నె, మ్మనమునఁ గనుపట్టెఁ బెండ్లిమాటం గొనుచున్. ౧౮౯

తే॥ ఆతఁడు మహీంద్రుఁ డౌఁ గాక ♦ యజుఁడ యేని
శక్రుఁడేనియు నౌఁ గాక ♦ జగతిలోన
గన్నెఁ గన్నయ్య గర్హణ ♦ ల్గనకపోఁడు
సదృశుఁ డపకృష్టుఁడును నైన ♦ జనునివలన. ౧౯౦

క॥ అన్నెఱధర్షణ యెమురై, యున్నది తన కనుచు యోగ ♦ యుక్తుఁ డతఁడు ము
న్మన్నె కనెఁ గానఁ డప్లవు, తెన్నునఁ జింతాబ్ధి యవలి ♦ తీరం బెనయన్. ౧౯౧

తే॥ నేలపు ట్టటు గన్న నా ♦ నియతిఁ దలఁచి, మానసవాకృతి నున్న యి ♦ మ్మగువ నెఱికి
సదృశుఁడనురూపుఁడును నైన ♦ జనుఁ డెవండు, భర్తకాఁగలఁడేను మే ♦ ల్వడయు టెట్లో.

క॥ కన్నెం గన్నయపుడు గల, యున్నత మనుమోద మవల ♦ నుండదు విభుఁ డా
యన్నులమిన్నకు సరిపో, ల న్నెలకొనకున్న నాత ♦ లం పేమగునో. ౧౯౩

క॥ దైవత మెటు లెంచెడినో, దైవం బెటు లున్నయదియొ ♦ తారసిలెను మే
లావల నే మనుకొనినం, గావంగలవాఁడు లేఁడు ♦ గతి సెడె నేనిన్. ౧౯౪

మ॥ అనుచు న్మంతనమందు సంతత మొకం ♦ డై చింత విభ్రాంతుఁడై
మనుజాధీశున కొప్పె ధీమహితుఁడై ♦ మానొందువాఁ డౌట ని
వ్వనజాతేక్షణ కెట్టులేనియు స్వయం ♦ వర్యాత్వమే కూర్చు ల
గ్గను మే ల్బుద్ధి తనంతఁ దాన యగుచు ♦ న్వ్యాసంగసత్సంగతిన్. ౧౯౫

సీ॥ మును మహాయజ్ఞంబు ♦ నను శివదత్తమై, తనరారుచున్న యా ♦ ధనువుఁ జేర్చి
మాతాతయగు దేవ♦రాతున కొసఁగెను, వరుణుండదియు నాఁటి♦వరుసఁ దప్ప
కీయింటఁ బూజితం ♦ బై యొప్పుచున్నది, నేనును దత్ప్రీతి♦ నెఱపువాఁడ
నటుగాన నక్షయ్య♦మై యసంచాల్యమై, యుండు మర్త్యులకు నీ♦యుర్వియందు

నెక్కు వెట్ట నేర ♦ రెవ్వ రేనియు దీని, గౌరవమున వెలయు ♦ కతన జతన
మైన స్వప్న మెనయ ♦ నైన నింత యెఱింగి, నీతిమెయిఁ బ్రతిజ్ఞ ♦ నే నొనర్తు.

క॥ అని మజ్జనకుఁడు జనకుం, డనూనమతి నేలఱేండ్ల ♦ నను వొందెడువా
రిని రావించి సమక్షము, నను వి ల్లటు సూపి నేర్పు ♦ నను దాఁ బలికెన్. ౧౯౭

ఉ॥ ఈధను వెత్తి సజ్యముగ ♦ నెవ్వఁ డొనర్చెడువాఁడొ యాప్రజా
నాథకుమారుఁ డౌఁ బతి సు ♦ నంద్యచరిత్రుఁడు మత్కుమారికిన్
బోధితు లైతి రింకఁ బరి ♦ పూర్ణతఁ గూర్పఁ దలంపుఁ డంచు ని
ర్బాధితసత్యుఁ డాతఁ డని ♦ ప్రాంజలినై నిలిచె న్సభాస్థలిన్. ౧౯౮

క॥ వేడుకపడువా రై రొన, గూడికి పొనరించి రేమొ ♦ గుసగుస లమ్మై
నాడిరి బీరమ్ముల విడ, నాడి చనంగూడ దని ర ♦ హంమతి నృపతుల్. ౧౯౯

ఉ॥ కొండనుఁ బోలి గౌరవము ♦ గూరఁగ సాధ్యముగాని మేటి కో
దండము తోలనంబునకుఁ ♦ దార్కొని వీడ్కొనరాని వేడ్కమై
నుండిర కాని యొక్కఁడును ♦ యోజన సేయఁగ నేరఁ డట్టిఁడై
దండిమగండె లేఁ డను వి ♦ ధంబుఁ దిరం బొనరించి రన్నరిన్. ౨౦౦

క॥ మోహమున మొనసి కొందఱు, సాహసముం జూపి తలఁగి ♦ సంభ్రమపడ సం
దేహపడి కొంద ఱెనయఁగ, నూహం దలపెట్టరైర ♦ యుర్వీశసుతుల్. ౨౦౧

ఆ॥ చిట్టచివర కెరఁగి ♦ చిడిముడిపడుచు మా, యట్టివారి కగునె ♦ యనుచు ముట్ట
నాడి వీడి పోయి ♦ రంద ఱాసింగాణి, వ్రేలు సూప రాని ♦ విధికిఁ దోఁప. ౨౦౨

ఆ॥ తడవు గడచెఁ దఱియు♦దరి గానరాదు నా, తలఁపుసంద్రమునకు♦దారి యెదియొ
దఱియరాఁ డొకొండుఁ♦దద్దయు నని దీర్ఘ, సత్ర మొకఁడు నడిపె♦జనపభుండు.

తే॥ క్రతువుఁ గనవచ్చి వి ల్లొంట♦మతికిఁ దార్చి, ప్రీతిమెయిఁ జేరి విఫలప♦రిశ్రములయి
సిగ్గువడి చనువా రైరి ♦ క్షితిని నెట్టి, పేరుపెంపును గైకొన్న ♦ బిరుదులైన.

క॥ శశ్వత్సిద్ధుఁడు జనకుఁడు, శాశ్వతకీర్తి తరియించు ♦ సమయ మరయుచుఁ దా
నిశ్వాసము లెడలించుచు, నీశ్వరసంకల్పమునకు ♦ నెదురై యుండెన్. ౨౦౫

శా॥ ఆమంత్రించెను బ్రహ్మభావమునె యే ♦ యర్థార్థి యమ్మౌని వి
శ్వామిత్రుండు నిరంతరాయముగ భ ♦ వ్యంబైన జన్మంబు ని
ష్కామాన్యం బొనరించి తాతకృతమా ♦ సత్రిం బపత్రిసముల్
శ్రీమంతంబునుఁ జేయ నెంచి మొనసెన్ ♦ సిద్ధుండు శుద్ధాత్ముఁడై. ౨౦౬

సీ॥ కాంతు లాశాంతఁపుం♦గవిసెన లెడలించి, మేల్కాల్వ నెఱిఁ గాంచు♦మేనితోడఁ
బ్రొద్దె జోడనఁ జాలి♦పోలుచు చందురు లీల, తోడిదా లక్ష్మణు ♦ జాడతోడఁ
గవ్వడాసిరులు మా ♦ కన్నవే నిశ్చవ్రి, చం బను కాకప ♦ క్షములతోడ
బీరంబు మాదెస ♦ బిరుదులై కనఁగాంచుఁ, డనెడు విల్లమ్ముల ♦ యనువుతోడ

యజ్ఞపురుషుండు యజమాను ♦ నర్థ మొసఁగ
రూపుఁ గొనివచ్చె ననిపించు ♦ రూఢితోడ
రాముఁ డరుదెంచె మన్మనో ♦ రాముఁ డలమి
తపసి గెలిపింతు ననెడు ని ♦ ద్దంపు బెలమి. ౨౦౮

ఆ॥ మౌని తోడుతోడ ♦ మారాకృతుల కాఁగ, మలసినారు రాకొ ♦ మారు లంచు;
నెంచి పూజ సేసె ♦ నింతటి భాగ్యమ్ము, తనకుఁ గలదొ యనుచు ♦ ధరణివిభుఁడు.

క॥ జన్మముఁ గన వచ్చిరె యీ, మన్నీ లెన్నఁ జను మదికి ♦ మాటాకిడువా
రిన్నెలవున కని వినుతులు, మున్నుగ ఘటియించి తేఁడు ♦ మునిఁ గని వేడ్కన్.

తే॥ అడుగ నక్కఱ లేదు వీ ♦ ర్యము కొలంబు
నడుగ నక్కఱ గలిగె నీ ♦ యండఁ గొనుట
సేవలనివారొ యెఱిఁగింపు ♦ మిత్రచరిత
ద్వార మిదె నాదు భాగ్య ము ♦ ద్దామ మెనయ. ౨౧౦

క॥ అని ధర్మాత్ముని ముని న, య్యనువునఁ బురికొలుప నాతఁ ♦ డనె ననుపము లీ
యనఘులు పావనచరితులు, తనయులచూ దశరథాఖ్య ♦ ధరణీంద్రునకున్.

తే॥ రామలక్ష్మణు లనువారు♦రాణ నెరయ, వచ్చినారు త్వదీయ మ♦ధ్వరముఁ గాంచఁ
గాంక్షయుం గల దింక నా♦క్రతువిఘాతి, చేతఁ బట్టిన విల్లు ముం♦జేతఁ గొనఁగ.

క॥ రాముఁ డభిరాముఁ డంచిత, ధాముఁడు గుణధాముఁ డఖిల ♦ తత్వకళాశ్రీ
భూముఁడు శుభనాముఁ డరివి, రాముఁ డలఁతిఁ బోఁడు సుమ్ము ♦ రాజవరేణ్యా.

క॥ ఈరాజసుతుఁడు గన్నఁగొన, నారాజవతంసు చాప ♦ మాదృతి మీఱం
గా రాజసభ కిప్పుడె కొని, తేరంగాఁ బనుపు నీదు ♦ తేకువ వెలయన్. ౨౧౪

క॥ దైవిక మయ్యది తలఁపఁగ, దేవనిభుం డితఁడు గాంచు ♦ తీరునఁ గాంచన్
దైవబలంబే బల మను, నీవరభాగ్యంబుఁ బొగడ ♦ నేర్తురె యితరుల్. ౨౧౫

చ॥ అనుచు సమేల మొప్ప ముని ♦ యాడెడు పల్కుల కుల్లసిల్లి మ
జ్జనకుఁడు మేలు మే లని ప్ర ♦ శస్తబలాఢ్యులఁ బంచె వారలున్
మొనసి ప్రయత్నపూర్వముగ ♦ మోచి గుణోచితవృత్తిఁ గార్ముకం
బనితర మప్పఁజెప్పిరి మ ♦ హాద్భుత మంచు నరేంద్రు లెంచఁగన్. ౨౧౬

తే॥ వీర్యవంతుఁడు రాముండు ♦ వెరపు మెఱయ
నందికొనె దానిఁ దా ♦ నిమేషాంతరమున
వంచెఁ గోటికి నెక్కించె ♦ వరగుణుండు
వరగుణంబు నయం బసం ♦ వరముగాఁగ. ౨౧౭

క॥ ఈనారికి నానారికిఁ, దానే నాయకుఁడు చూవె ♦ ధరణీంద్రసుతుం
డౌ నౌ నను వాక్పూరము, [illegible] నయ్యది మొరసె దెసలఁ ♦ దోరం బగుచున్.

క॥ శ్రవణానందం బయ్యెను, బ్రవరుం డయ్యులివు గూర్చు ♦ పట్టున దివికిన్
భువికిఁ దదాకర్షణరవ, మవల నశనిఘోష మట్టిదై ♦ వినఁబడియెన్. ౨౧౯

క॥ ఆవిశ్వేశుని చాపం, బావిగ్నం బగుచు భగ్న ♦ మయ్యె నడిమికిన్
భూవరు నావేగ మెడలె, శ్రీ విలసిలె నంతిపురి పు ♦ రియు నుత్సుకతన్. ౨౨౦

ఉ॥ పూవులదండ నై చితిని ♦ పూర్ణమనోరథ నైతి నంచు స
ద్భావుఁడు రామచంద్రు మెడ ♦ భద్రికళ న్వెనుపొంద నప్డు సం
భావన లొప్పె నార ముని ♦ పత్యనుభావము రాట్సుతాగ్ర్యపుం
భావము మైథిలీసుకృత ♦ భావుకభావము నంచు నెల్లెడన్. ౨౨౧

క॥ మును ఘోషించిన ప్రతినకు, ననురూపముగా వివాహ ♦ దన్వయుఁ డీరా
మునకు సుత నిత్తు నిపుడే, యని జలభాజనము జనకుఁ ♦ డాదృతిఁ గొనియెన్.

క॥ ఆసత్యసంధు వచనము, నాసత్యనిభుండు రామ ♦ నాథుఁడు విని మే
లౌ సవితృసన్నిభుఁడు గురుఁ, డాసేమముఁ గూర్ప నప్పుఁ ♦ డనినొడువుటయున్.

ఆ॥ తగినవారిఁ బంచి ♦ దశరథాధీశ్వరు, శ్వశురు వృద్ధుఁ బిలువ ♦ సపరికరుఁడు
గా ఘనుం డతండు ♦ కరముఁ బ్రీతి దలిర్ప, నరుగుదెంచె మిథిల ♦ కాదరమున.

క॥ ఆన్నృపు నానతి జనకుఁడు, శ్రీనంద్యుం డొసఁగె నన్ను ♦ శ్రీరామునకున్
మౌనివరుల సేసలు సుర, సూనఁపు సోనలును వింత ♦ సొబఁగు ఘటింపన్. ౨౨౫

తే॥ నాయనుజ సాధ్వి నూర్మిల ♦ నయవిదుండు
లక్ష్మణున కిచ్చెఁ దండ్రి స ♦ లక్షణముగ
నట్టు లనుజన్ము తనయల ♦ నతులుఁ డొసఁగె
నిరువురకుఁ దమ్ములైన య ♦ య్యిరువురకును. ౨౨౬

క॥ అందఱు సంతస మందిర, యందము చందమును నొక్కఁ ♦ డై పొసఁగిన దిం
పొందిన సంబంధం బని, ముందుగ మామామ మేలి ♦ ముచ్చట లలరెన్. ౨౨౭

క॥ జగములు మెచ్చఁగ మహ మట్టు, జగజెట్టి పొనర్చికొని ని ♦ సర్గధృతి న్మా
ర్గగతి భృగురాము బీరఁపుఁ, బొగడ్తతో నన్నుఁ గొంచుఁ ♦ బురి కేతెంచెన్.

ఉ॥ నాదు స్వయంవరంబు ముని ♦ నాథపురంధ్రి! పొసంగె నిట్టు లా
మోదము మీఱఁ గొల్తు రఘు ♦ ముఖ్యు గుణాఢ్యు నిజేశు ధర్మ్యయా
శ్రీ దయివాఱ నిచ్చలునుఁ ♦ జిత్కళ లూరఁగ వీర్యవద్వరుం
డౌ దయితుండుఁ దన్నటులె ♦ యాదర మొప్ప బహూకరింపఁగన్. ౨౨౯

క॥ ఉన్నారము పెద్దల దయ, మన్నారము నేఁటివఱకు ♦ మానితలక్ష్మిం
గొన్నారము భవదంఘ్రులఁ, గన్నారం గాంచు కలిమిఁ ♦ గానఁగ సీమన్. ౨30

ఆ॥ పూస గ్రుచ్చి నట్లు ♦ పొలివోవనీ కట్టు, లాకథాంశ మెల్ల ♦ నవనిజాత
తెలుప విస్మయంబు ♦ పొలుపొంద ధర్మజ్ఞ, యాలకించి మైత్రి ♦ నవధరించి

మ॥ పొదివెం గౌఁగిట బాహువు ల్సొనిచి య ♦ ప్పూబోఁడి నప్పుణ్యమూ
ర్తి దరస్మేరసమాదరంబు లొలయం ♦ దీపారు వ్యాపార మి
య్యది నా నొదల ముద్దువెట్టుకొనె నా ♦ నౌ స్త్రీగుణాంభోధి గ
ట్టిదె వో యీసతి పంచఁజేరి మనరే ♦ యెవ్వారు నంచున్ ధృతిన్. ౨3౨

ఉ॥ నీయభిజాతమే నెగడు ♦ నీదు సువృత్తమె చెల్లు నీగుణ
శ్రీ యుచితత్వముం గనియెఁ ♦ జిత్రపదాక్షరగుంభనంబులున్
నీయవె నాఁగ నొప్పె బలె ♦ నేర్చితి వొప్పులకుప్ప వీవె కా
కేయదియేనిఁ గల్గెనఁటె ♦ యిట్టి వధూకులభూషణం బిలన్. ౨33

తే॥ మధురభాషిణి! నీనుడి♦మధుర మయ్యె, నాస్వయంవరవృత్త మ♦నర్ఘ్య మయ్యె
విన్న యీశ్రుతియుగము ప్ర♦వీణమయ్యె, పలుపలుకు లేల తపముసా♦ఫల్యమయ్యె

క॥ ఆనందించితినమ్మా, శ్రీనందిత మైన త్వద్వి ♦ శిష్టకథాసం
ధానమున నిదియ చాలును, సూనృతవాఙ్మయి! య శేష♦శుభ ములుఁ గూర్పన్.

క॥ ఇందుముఖి ! మీరు వచ్చితి, రిందఱకు న్నేలుఁ గూర్ప ♦ నేమెయి తపముల్
ముం దొనరించి యునిచిరో, యిందలి తపసులు విచిత్ర ♦ మిది యన నేలా.

తే॥ రజని వ్యవిముక్తరాష్ట్రమ్ము ♦ రాణఁ గూర్పఁ
బనిచి తాఁ బోయె నరవింద ♦ బాంధవుండు
పరఁగు పరదేశమున కెందుఁ ♦ బ్రాభవంబు
దివస మెనసినచోఁ గాదె ♦ దీప్తిఖనికి. ౨౩౮

క॥ పగ లెల్లెడ నాహారము, లు గడింపఁగఁ జనిన పులుఁగు ♦ లు దినాంతమునన్
సాగియుచు నీడనిలీనము, లగుతఱిఁ బొనరించు రుతము ♦ లవె వినవయ్యా.

తే॥ సాంధ్యరాగమ్మునకుఁ దోడు ♦ సామరస్య
మున మొనయు దంపతుల చిత్త ♦ ములను రాగ
మతిశయిల్లుచుఁ బొడకట్టు ♦ నమ్మా! యొందు
పనులవలని నిరాసవి ♦ భ్రమము లమర. ౨౩౯

తే॥ ఘనులు స్నానార్ద్రు లయి కుండి ♦ కలు ధరించి
యొండొరులఁ గూడి పెరయుచు ♦ నున్నవారు
వల్కలము లాప్లుతము లటు ♦ వచ్చి పవనుఁ
డరసి తమరాక యిక్కల ♦ కందఁజేయ. ౨౪౦

తే॥ మునులు విధిపూర్వకముగ ని ♦ మ్ముల హుతాగ్ని
హోత్రు లగుచుండఁ బొగ యదె ♦ యొప్పె మిగుల
నల కపోతాంగమున రంగు ♦ నందఁ గాంచి
గంధవాహోద్ధతం బయి ♦ కదలుకొనుచు. ౨౪౧

తే॥ అల్పవర్ణములై దూర ♦ మందు నున్న,తరువులును సాంద్రతరములై ♦ తరము మీఱె
నలముకొను చీఁకటుల దెస ♦ లందరాని,చందమున కాస్పదంబు లౌ ♦ జాడ నెరయ.

క॥ రజనీచరసత్వంబులు, నిజసంచారమున వెరవు ♦ నెరపెడు నెందుం
గుజనవితతి దర్పోద్ధతి, విజనోద్దేశంబు చక్క ♦ వెలయించుఁగదా. ౨౪౩

తే॥ వేదితీర్థంబులందు సం ♦ వేశపరత, వఱలుచున్నవి యవె తపో ♦ వనమృగములు
శాంతివిషయంబునం గాని ♦ సాధువులకు, సౌఖ్యమబ్బదు సుమ్మెందుఁ ♦ జంద్రవదన.

ఆ॥ ఎనసెఁ గడు సమృద్ధి ♦ నేణాంకముఖి నిశ, కప్పు వీడి వెల్లి ♦ కట్టు గట్టి
చెలువు రాక వినిన ♦ సీమంతినియ పోలెఁ, జదలు పూలపాన్పుఁ ♦ జక్క పఱచి.

క॥ సొమ్ములు వెట్టెనుఁ గడు నొడి, కమ్ముగఁ జుక్క లవెపో ప్ర ♦ కాశిల్లెడు రా
గ మ్మొలసి ప్రాంగణమునకుఁ, గమ్మవిలుతుమామ రాఁగఁ ♦ గలనల కెదురై.

తే॥ జ్యోత్స్న ప్రావరణంబుగా♦నొప్పినాడు, వాఁడె రేత్రేఁ డఖిలబంధు♦వర్గమునకు
ప్రీతిఁగూర్చుచు రాత్రిరేఁ♦బెరసి తనదు, మిన్నను గృహాజిరమ్మున♦మెలఁగువాఁడు.

చ॥ కలువల నిద్ర లేపి శశి ♦ కాంతములన్ హిమవారి పూరముల్
వెలయఁగఁజేసి జక్కవల ♦ వీడుమర ల్నెలకొల్పి యచ్చకో
రుల నెఱిఁకోర్కు లుల్లసిలు ♦ రూఢిన చెల్వొలతోడఁ గూర్చి వె
న్నెల లోలయించి మించి నెల ♦ నేర్పె స్వరాజ్యము తీర్పు లొడ్లకున్. ౨౮౭

తే॥ తారకాలింగమూర్తి సు ♦ ధారసాంచి, తాభిషేకుని జేసి బ్ర ♦ హ్మర్షు లెల్ల
నర్చన లొనర్చుచున్నవా♦రభిమతంబు, లెపుడు సమకూర్చు దైవతం♦బితఁడటంచు.

క॥ ఇమ్మేలిసమయమున మా, యమ్మరో ! రామానుచరివ ♦ వై యుండుము పా
మ్మిమ్మెఱిఁగి నాథుఁ గొలుచుచు, సమ్మదమునఁ బొదలువారె♦సాధ్వులుజగతిన్.

క॥ నేమముఁ దెలిపెడునవి యగు, నీమధురోక్తులనె తుష్టి ♦ నేఁ గంటిని మ
ద్ధామము వెలసె నతని గుణ, ధాముని నీ వెనయఁ గొంతు ♦ ధన్యత్వ మిఁకన్.

ఆ॥ నేను జూచుచుండ ♦ నీరజేక్షణ ! యవి, యన్నియును ధరింప ♦ ననువుపడుము
నీదు భవ్యకాంతి ♦ నిక్కంబ కనుపట్ట, గనుల కలిమి ఫలముఁ ♦ గని సుఖింతు.

క॥ దివ్యాలంకారాంచిత, వవ్యయశోభాఢ్య వగుచు ♦ నరుగు మవల సం
భావ్యుఁ బతిఁ బ్రీతుఁ జేయుము, సువ్యక్తం బగును నాదు ♦ సుకృతం బెల్లన్.

క॥ అనిన న్వల్లె యనుచు న, మ్మనుజేంద్రుని రాణి లోక ♦ మాత ధరించెన్
గొనబైన మేని కెక్కుడు, గొన మిడ మునిపత్ని యిడ్డ ♦ క్రొన్నగ లెలమిన్.

సీ॥ నెలపూచిగొంచు వె♦న్నెలమించు నెఱిఁగాంచె, మొగముపై నెలకొంచు♦మొలకనవ్వు
రాగంబుపై నను ♦ రాగంబుఁ దలఁపించె, నంగరాగము మీఁది ♦ యావకంబు
పసపురాతనమ య♦ప్పసమీపెసిరియంచు, పసుపు కుంకుమములు♦పలుకఁదొడఁ రెఁ
దోఁబుట్టువుల మిందు ♦ తోఁబుట్టువున కని, తెలిమానిపుట్టువు ♦ దెలిపె నలరు
లెన్నఁబడినవి వింతలై ♦ యిపుడు మున్ను
సహజములె యన్నియు నటంచుఁ ♦ జాటె వస్త్ర
భూషణమ్ములు మునిసతి ♦ తోషణమున
కిడినయవి దాల్పఁ గాంత పా ♦ ల్పడినయంత. ౨౯౪

క॥ రాముని యారవములికి ను, కా మునిసతి త న్నొనర్చు ♦ గతి కుబ్బుచు శ్రీ
రాముని జగదేకహృదభి, రాముని మదిఁ జేర్చి యాపు ♦ రంధ్రికి మ్రొక్కెన్.

ఆ॥ మాన్యమూర్తి గాంచి ♦ మమత రెట్టించి సు, ఖప్రసక్తి మించి ♦ కౌఁగిలించి
కమ్మ నీవు నిత్య ♦ కల్యాణి వనుచు దీ, వించి పంచె నాపె ♦ మించుఁబోఁడి

తే॥ ఆసుధాసాగరంబున ♦ నవతరించి, సరసు హరిఁ గొల్వవచ్చిన ♦ సిరి యనంగ
జేరె రాముని సన్నిధిఁ ♦ జిత్కలాభి, రామ యాకామ లావణ్య♦సీమ యగుచు.

చ॥ తళుకులు దిక్కుల న్నెరయఁ ♦ దాపసి నేస్తము విన్నవించు న
ప్పలుకులు గొంచు ము న్నడరి ♦ పాల్పడు లేజిలునవ్వు మవ్వఁపుం
గులుకులు విభ్రమంబు లను ♦ కూలకలావిభవంబులు న్మదిన్
గొలుకులు దాటి చేరఁగ ర ♦ ఘుప్రవరుండు రసైకమూర్తియై. ౩౫౯

తే॥ ఆయలంకారసామగ్రి ♦ యాజెడంగు, లారసోచితవృత్తులు ♦ వరసి రసికుఁ
డందరాని సుఖార్ణవ♦ముందుఁ దేలు, చుండె నొక్కింతసే పొండొ♦కొండు గొనక.

క॥ కలతావులెల్ల నల్లనఁ; గలయం గని కలిమి కొండు ♦ కలిమి ఘటింపన్
గల కలనలఁ గనుఁగొని మది, నలరుచు నిట్లనియె రాముఁ ♦ డాదృతి నెరయన్.

క॥ కంటే కలిమివెలయ నఘ, లుంటాకఁ దపస్విపత్ని ♦ లోలనయనరో;
తంటాలెల్లఁ దలంగఁగఁ, మంటే కయికొంటె భువన ♦ మాన్యత్వంబున్. ౩౬౧

క॥ మానవదుర్లభ మియ్యది, మానవతీతిలక ; నీకు ♦ మలయఁగనయ్యెం
బో నెఱిఁగంటివి దీనం, గానిజనుల తలఁపు లెడలు ♦ కలిమి ఘటిల్లున్. ౩౬౩

క॥ ఏమేమి యడిగె నాయమ, యేమేమి వచించి తీవు ♦ హిత మాచితియున్
నేమమును నెరయ నీదగు, సామమ్మున కలరె నెట్లు ♦ జలజాతాక్షీ. ౩౬౪

ఆ॥ ఎట్టు లెట్టు లదియు ♦ నెఱిఁగింపు మొక్కండు, బీసువోవకుండఁ ♦ బేర్మి వెలయ
ననుచు నాథుఁ డడుగ♦నంతయు నానంద, సాంద్ర యగుచు మహిజ♦సంస్తుతించె.

శా॥ ఆమోదాశ్రుపరీతనేత్రుఁ డగుచున్ ♦ హాయిం గనంగాంచి శ్రీ
రామాధీశుఁడు మేలు మే లని వర ♦ ప్రాముఖ్య మెన్నంగ న
ట్లే మానించుచు లక్ష్మణుండు మునిసా ♦ హిత్యంబుల బ్రంబులే
శ్రీమన్మూర్తివి దేవ నీ వనెను ల ♦ క్ష్మీమయోగలక్ష్యాకృతీ. ౩౬౬

క॥ ఆరీతిఁ బ్రీతిదానము, శ్రీరమ్యము సాధుయోగ ♦ సిద్ధము మదికిన్
రా రాకొమరు లచటునం, దారాత్రిరి నిలిచి రంచి ♦ తాశాస్యగుణా. ౩౬౭

తే॥ భవ్యములు వన్యములు మూల ♦ ఫలము లేర్చి
కూర్చి యాశ్రమవాసులఁ ♦ గూర్చువారిఁ
జేర్చి యాతిథ్య మొసఁగి పూ ♦ జించె వారి
నాతపోధనవర్యుఁ డ ♦ త్యాదరమున. ౩౬౮

తే॥ శశినిభాననుండు ♦ జలజాతనేత్రుండు, రాముఁ డట్టిపుణ్య ♦ రాత్రి మాని
మహితగోష్ఠి నుండె ♦ మహిమండలాఖండ, లుం డితండె యన న ♦ ఖండధృతిని.

ఉ॥ రాముని జానకీహృదభి ♦ రాముని విశ్వజనీనచిత్కలో
ద్ద్రాముని సద్గుణప్రసవ ♦ దాముని గీర్తికీర్తిచంద్రికా
ధామునిఁ దైజసోల్లసిత ♦ ధామునిఁ దారకమంత్ర యోగవ
న్నామునిఁ జేరి యుత్తమము ♦ నా మునివర్గము వొల్చె నత్తఱిన్. ౨౭౦

తే॥ చూడ్కులు మరల్పనేరరు♦సుందరాంగుఁ, జూచి తత్కలనల నెంచి♦చొక్కి పలుక
నెంచరు ఘటించె నెఱిఁగి వా♦ణీశ్వరుండు, వారి కాభాగ్య మేనాఁటి♦వలనిదొక్కొ.

క॥ కొంతదనుక నట్లుండిరి, మంతన ముప్పొంగ నొందు ♦ మార్గ మరయ కే
వింతలఁజే యాశ్రితజన, సంతానం బతఁడు గూర్చు ♦ సౌఖ్యోదయముల్. ౨౭౧

ఉ॥ ఆదట నత్రిమౌని మహి ♦ తాదర మూరఁగ రాముతత్వమున్
శ్రీదయితత్వము న్మదినిఁ ♦ జేర్చి తనర్చెడువాఁడ యాట సం
వేదితృభావ మొప్పఁగ ని ♦ వేదితవేదవినోదవాదసం
పాదనముం బొనర్చె గుణ ♦ భవ్యవచఃకలనం బెలర్పఁగన్. ౨౭౨

క॥ ఆనిగమము లెల్లప్పుడు, నీనియమము లెన్నుచుండ ♦ నెగడొందఁగ నై
మానయనము లలరారఁగ, మానాయక; కాన్పుఁ గూర్చి ♦ మన్నించితివే.

తే॥ తవిలి భువనము లొనరించె♦దవు తలంచి, వాని రక్షింతు వెవ్వేళ♦వలను గాంచి
యన్నిటికి సురనరతిర్య♦గాద్యనేక, మూర్తులు ధరించెదవు నీదు♦మురిపె మసదె.

క॥ ముప్పోకఁ బోవనేర్తువు, తప్పొకయింతేని నెందుఁ ♦ దవులఁగనీ కే
ముప్పునఁ బెరయక నెరయుదు, వొప్పది నీయదికదోయి ♦ యొప్పులకుప్పా.

క॥ జగముల ముంచెదు దేల్చెదు, జగజ్జెట్టియ వైన మాయ ♦ సాత్త్వికు ని న్నే
తగవునను మిగులనేరదు, వగలకు వగలన్ ఘటించు వగకాఁడవురా. ౨౭౪

క॥ వడఁకెదు నాపెయె నినుఁ గని, తొడిబడ వాఁప్రొద్దుఁ దాని ♦ తోడివ యగు సం
గడముల నుండియు నెట్టులు, గడించితో యిట్టితెలివిఁ ♦ గల్యాణగుణా. ౨౭౫

తే॥ ఎన్నఁడేని నెందేనియు ♦ నెట్టులేని, యును మెలంగెద వెమ్మొయి ♦ నుండియైనఁ
దద్గుణవిలిప్తుఁడవు గావు♦ధర్మపథముఁ, దప్పి నడువవు ని న్నెంచఁ♦దరమె రామ!

క॥ ఎందఱ ధన్యులఁ జేయఁగ, నిం దదుఁ గిడినావొ నీమ♦హేచ్ఛత్వ మనా
స్కందమ కద ; యీయెత్తున, ముం దెదురై నార మేము ♦ ముని పూజ్యపదా

తే॥ ఒత్తు లెడలింపఁ గాదె యీ ♦ యుద్యమంబుఁ
దవిలి తలపెట్టినావు మా ♦ తబిసిపాలము
శేల త్రొక్కెడ వట్లుగా ♦ దేనిఁ గొన్ని
యరసినవి కొన్ని యరయని ♦ యవియుఁ గలవె. ౨౭౬

*క॥ ధర్మమయహర్మ్యభూమిక, లర్మిలిఁ బ్రియురాలి చెలిమి ♦ నలరించెదు నీ
శర్మదపదయుగ మస్మ, త్కర్మములు ఫలించువనికిఁ ♦ గానన మెనసెన్. ౨౮౨
క॥ నేరవొ పిత్రకృతసా(మ్రా, జ్యారూఢి మెయి న్మెలంగి ♦ యధిరాజకిరీ
టారత్రీనీరాజన, లారమ్యపదాబ్జపీఠి ♦ నందుకొనంగన్. ౨౮౩
ఆ॥ సాగి వచ్చినారు ♦ జడదారు లిందఱు, ధర్మచాప లీవు ♦ తారసిల్ల
మొఱ్ఱ వెట్టుకొనఁగ ♦ మోమోట పైకొనఁ, దలఁకుచున్నవారు ♦ దయిత! వింటె.
క॥ వారి యభిప్రాయం బీ, తీరున నెఱిఁగించుచుంటిఁ ♦ దెలియఁగో కాదో
నేరమినేరము లున్న ను, దారతమైఁ జక్కఁపఱుచు ♦ తగవరి వనుచున్. ౨౮౫
క॥ వనసంచారం బిచ్చటి, మునులకుఁ గడపుట్టినది స ♦ మూలంబుగఁ గా
వున ఫలమూలాదికసా, ధనముల కెడ రొదవె నేమి ♦ దలఁచెదవొకదే. ౨౮౬
తే॥ నైకరూపులు పురుషాదు ♦ లసురు లిప్పు, డిమ్మహారణ్యమున చక్కి ♦ నెనసినారు
వ్యాళు లట్టు గుధరాళను ♦ ల్వారు మరలఁ, బోరు పోరిం దొనర్చెదు ♦ వారు లేరు.
తే॥ మలసి యుచ్ఛిష్టుఁడైనఁ బ్ర ♦ మత్తుఁడైన, ధర్మపరునేనియుఁ దపస్విఁ ♦ దద్ద నోటఁ
బెట్టుకొందురు వారి కే ♦ గుట్టు లేదు, కన్నవారికిఁ గా దెట్టు ♦ కడుపుకుట్టు.
క॥ వారింపుము తండ్రీ య, వ్వారి న్నీవారు వీరి ♦ వల నారసి యీ
తీరున నన నో రాడదు, నీరీతికిఁ దగినయట్లు ♦ నెరపుము కృపతోన్. ౨౮౯
క॥ అదనున నిదె మార్గం బని, పొదలుచు నీ వరుగుదేర ♦ బుద్ధి నరసియున్
విదిత మొనరింప నైతిమి, కదర్య లొనరించు వెతలు ♦ కలఁచెనుకతనన్. ౨౯౦
తే॥ ఫలములనుఁ దెచ్చికొన ముని ♦ పతులు వోవు
తెరు విడియ యెల్లి మీ రేగు ♦ తెఱఁగునకునుఁ
దగినయది సుమ్ము కా కొంటఁ ♦ దవులఁ జనదు
కష్టములె కోనఁ జొచ్చు మా ♦ ర్గంబు లెల్ల. ౨౯౧
తే॥ నిన్ను జయలక్ష్మి వరియించి ♦ నెగడుఁగాత
నీయసము ముజ్జగమ్ముల ♦ నెరయుఁగాత
నీతలఁపు లెల్ల ఫలియించు ♦ నెఱిన బీద
సాదలకుఁ గల్గు కష్టము ♦ ల్సమయుఁగాత. ౨౯౨
క॥ అని యత్రిమాని యెఱిఁగిం, చినఁ జేతులు మోడ్చి కడచు ♦ చీరవసనలున్
వినిపింప రాముఁ డూకొని, తనమదిఁ గైకొనియెఁ దద్వి ♦ ధానక్రమమున్.
వ॥ అభ్రమండలంబు సొచ్చి శరధారలం గురియ నుంకించు నాదిత్యునకుం బాస
టయై యదభ్రమదావిష్టులఁ బదభ్రష్టులం గావింప నమ్మహారణ్యంబునం బ్రవే
శింప హృద్దేశంబు నిశ్చయావేశనన్నివేశంబుం బొనరించె నట్లు. ౨౯౪

క॥ వెన్నెలబయలున నాగో, ష్ఠిం న్నెలకొని రఘువరుండు ♦ సిరిఁ దనరారం
గన్నారం గన్నా రా, మన్నిఁ(పుఁజడదారు లేప్ర ♦ మాణమువారో. ౬

క॥ ఆనందనవని యట్టులె, యానందనపదవి యయ్యె ♦ నాస్థలి సీతా
జానియు నాయనసూయా, జానియు ముచ్చటల నిండ్ర ♦ సారగురులుగాఁ.

క॥ లక్ష్మీవిలాసిఁ గొలుచుచు, లక్ష్మణుఁడునుఁ దనరెఁ దత్క ♦ లావిభవము స
త్పక్ష్మము లక్షులకు ధృతి, లక్ష్మం బొనగూర్పఁగల త ♦ లంపునఁ గుదురై.

తే॥ వింటె గిరిరాజపుత్రి! శ్రీ ♦ విభుచరిత్ర, మతిపవిత్రము నీ వప్పు ♦ డడిగినట్టి
యర్థమునకు సదుత్తరం♦బగున కాదె, మెచ్చుచుంటివె నానుడి♦మేల్మిఁ దలఁచి

క॥ అని విభుఁడు మహోల్లాస, మ్మొనరింపఁగ సంతసించి ♦ యుమ త్రిజగత్పా
వని పావన మీచరితం, బనంతరం బెట్లు సెల్లె ♦ నని యడుగుటయుఁ. ౨౯

శా॥ అత్రీక్షోదితమండలోచితకలా ♦ వ్యాసంగవశ్యాత్మ సా
విత్రోపాహితతైజసప్రచయసం ♦ వేశా మహేశాన భ
క్తత్రాసాపహభవ్యయోగమహితో ♦ ద్యత్త్పాభవా స్వానుభా
వత్రేధాప్రవిభక్తసత్వపరత ♦ త్వా సర్వభావోజ్జ్వలా. ౩౦౦

క॥ అనసూయానయసూక్తా, యనప్రవణజనమనోభి ♦ హర్షణసమయా
వినికృతదనుసూనుస్మయ, సనాతనాత్మీయధర్మ ♦ సంశ్రితహృదయా. ౩౦౧

మత్త॥ మానిమండలమానితా సుస ♦ మాహితా యవిమోహితా
స్వానుభూత్యవినాకృతా గుణ ♦ హానివృద్ధివినాకృతా
శ్రీనిరాసనివేదితాధిప ♦ శిత్వసంపదుపాశ్రితా
భూనభోంతరపూరితాగ్ర్యవి ♦ భుత్వకీర్తిసమున్నతా. ౩౦౨

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దయోధ్యాకాండంబున దశమాశ్వాసము.
అయోధ్యాకాండంబు పరిసమాప్తము.




శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ